బిస్మిల్లాహి ర్రహ్మాని ర్రహీమ్

# తిబ్బెఅక్బరెషాహి

అను

## యూనాని వైద్య గ్రంథ రాజము


రాజమండ్రి వాస్తవ్యులగు వైద్యభూషణ -

హకీం డి. రహీంతుల్లాబేగ్ సాహెబ్ గారిచే,


రచియింపఁబడినది.





మొదటి కూర్పు 1000 ప్రతులు.

గ్రంథకర్తవలన:

రాజమండ్రి శ్రీరామాప్రెస్‌వారిచే ముద్రింపించి,

ప్రచురింపఁబడియె.

కాపీరైటు రిజిష్టరుబడ] 1931 [వెల 6—0—0

ఆయుర్వేద భూషణ,
యేలూరి వేంకటాచార్యులు,
పెదవాకపల్లి,
పశ్చిమ గోదావరి.



గ్రంథకర్త

వైద్యభూషణ:—హకీం డి. రహం తుల్లాబేగ్ సాహేబ్.




# దైవప్రార్థన

చ. జగము సృజింపఁ బెంపగను జాలినవాఁ డని సృష్టి నంతయున్
నొగులఁగ జేయఁజాలుటకు నోపినవాఁ డని, సత్యధర్మముల్
దగులగఁ జేసి పామరుల ధన్యులఁ జేయుచుఁ బ్రోచువాఁ డటం
చుఁ గవులు జేరి మెచ్చికొనుచుండు కరీము నాత్మ నెంచెదన్.

ఉ. పాపప్రవృత్తిమై జనులు బాధలు జెందెడువేళ ధర్మముల్
ప్రాపుగ నుండఁజేయ గడుబాధలు జెంది దయాంతరంగుఁడై
దాపునఁ జేర్చి సర్వజనతాపముఁ దీర్చి జనంబు లొక్కచో
రూపున నుండుసమ్మతము రూఢిగ నిల్పె మహాత్ము డట్టియు
ద్దీపితశక్తిమై మనిసధీయుని నాత్మఁ దలంతు నెప్పుడున్.

సీ. మూలికాగుణరాజి మూలము ల్బెఱిగిన
లుక్మాను జికిత్సయాలయము మొక్కి
ఓషధీగుణముల దోషస్వరూపంబు
లరయజాలీనూసు నభినుతించి
రుజల నిర్మూలించి ప్రజల గాపాడఁ గా
బూనిన యులియబున్సేను నెన్ని
యూనాని వైద్యంబు యుగయుగంబులు
నిల్పఁ గాఁ దీర్చు నజుమలుఖాను పొగడి

చరకవాగ్భట సుశ్రుతాచార్యవరుల
సంతరించెద నాయుర్వేద సంహితాళి
వానిసార మెఱింగి యవ్వారి కెఱిగి
వ్రాయఁ బూనితి నీగ్రంధరాజమిపుడు.

సీ. చిన్నారి పొన్నారి చిఱుతప్రాయమునాడె
తెనుఁగుభాషను వ్రాయనేర్పె గురుఁడు
చిఱుతప్రాయముదాటి చెలఁగువయసునందు
మతధర్మములనెల్ల మప్పె తండ్రి
యౌవనాగమమున యందు నద్వైతంబు
నలవడఁ జేసె దర్యావాలునేను
జన్మకారణరహస్యావళులెల్లను
బోధించె నాకు సబ్దుల్ అజీజు

సంస్కృతాంధ్ర వైద్యగ్రంథసార మెల్ల
నేర్చి యిద్దాని నెట్టిటో గూర్చుచుంటి
వారి మదిలోన నిల్పి నే వందనంబుఁ
జేయుచున్నాఁడ సద్భక్తి చెంగలింప.

# గ్రంథకర్త వంశవర్ణనము



సీ. పరమదయాళుఁడై పాలించి మించిన
        మొగలాయి ప్రభువుల వంశమందు
అర్బతాగ్ వాజిమొహమ్మదు పుట్టి
        మక్కానుండి వచ్చినఘనుఁడు భక్తి
పరుఁడు లోకజ్ఞుఁడు పరమశాంతుం
        డుపకారుండు తనవంశకర్త గాఁగ
నామహాత్ముని వంశ మతిపవిత్రంబని
        గొనియాడి హాజీలు గొలుచుచుండు
రట్టిఘనునకుఁ బుత్రకుం డవతరించె
శాంతమూర్తియు మిగులవేదాంతమూర్తి
పీరుబేగుసాహే బను పేరుతోడ
మనియె పెద్దలు గొనియాడ మహితయశుఁడు.

గీ. వాని కేడ్వురుపుత్రులు వరుసతోడ
జనన మందిరి ఘనయశశ్చంద్రు లగుచు
నైదుగురుపుత్రికలు గల్గి రందులోన
మొహదీనుబేగు వర్ధిల్లె నహరహంబు.

సీ. తనయశశ్చంద్రిక దశదిశల్ వెలుఁగంగ
        దానకర్ణుం డయి తనరె నెవఁడు
తనసత్యసంపద ఘనులు కీర్తింపఁగా
        నలహరిశ్చంద్రుఁడై నలరె నెవఁడు
తనదానధారాంబుదశ్రేణి వర్షించి
        పతితులు హర్షింపఁ బ్రబలె నెవఁడు

తనయాపుసంపద గనిన శాంతుఁ డెడ
నీతివర్తనుఁ డయి నెగడె నెపుడు
వాని కీర్తింపఁగా నేరివశము దలఁప
నట్టి యిమాంబేగునకు నతఁడు గనియె
మొహదీన్ బేగ్ లలరఁగఁ బుణ్యశీలుఁ డను
పుత్రుఁ డెంతయుఁ గీర్తితోఁ బుట్టెఁ గాన.

సీ. ఆటపాటలయందు నైన బొంకనివాఁడు
కరుణతో దీనులఁ గాచువాఁడు
సకలశాస్త్రజ్ఞానసంపత్తి గలవాఁడు
విబుధులు గొనియాడ వెలయువాఁడు
శాంతాదిగుణములు సంతరించినవాఁడు
పటుబలాఢ్యుం డయి వఱలువాఁడు
దుష్టాత్ము లగువారి తొలఁగఁ ద్రోసెడివాఁడు
సజ్జనావళిఁబూజ సలుపువాఁడు
ప్రతిదినంబును బెద్దల నాదరమునఁ
బూజ సేయుచు మది నెంతొ పొంగువాఁడు
తలఁచిచూడ యిమాంబేగు ధన్యతముఁడు
నీతివంతుఁడు నా నెంతొ నెగడినాఁడు.

గీ. ఆయిమాంబేగునకు గల్గి రమలసుతులు
మూవురుపురుషులై రెంతయు ముదముతోడ
వంశసంభవుఁ డగుపుత్రవరుఁ డొకండు
గలిగి వర్ధిల్లె నాతనికాంత దీర.

సీ. జాన్‌బీబి తనతోడ జన్మించె నని చాల
మది నుబ్బుచుండెను మాన్యయశుఁడు
ఆషాబిబీ తన్న పతిభక్తిఁ గరియించి
పతిభక్తి బరవంగ బ్రబలువాఁడు
తనకన్న పుత్రులు ఘనయశస్సంపత్తి
నొలపంగ నెంతయు నెగడువాఁడు
జనని ఖాదరుబీబి తనసంతతిఁ జూచి
మది నుబ్బ కీర్తితో మనెడువాఁడు

నాదు జనకుండు ధీశాలి సదయగుణుండు
పేదజనములఁ గరుణతోఁ బ్రేమతోడ
ననవరతమును గాపాడునట్టివాఁడు
వాని నుతియింపఁ దరమె యెవ్వారికైన.

సీ. చిరుతప్రాయమునాఁడె జెప్పె
సద్బుద్ధుల సకలశాస్త్రంబుల సారమతిని
నూనూగుమీసాల నూత్నయౌవనమున
గడిపించె నేర్పుతో కళలనెల్ల
ధర్మసత్యవ్రతా మర్మంబులెల్లను
నేర్పించె దిననాఁడె నేతినియతి
పటువైద్యశాస్త్రసంపద గల్గుమార్గంబు
బరపించె దా నుగ్గుపాలతోడ

చెప్ప నేటికి నాతండ్రి చేష్టితములు
సకలధర్మంబు లాఁగిన సారమతులు
ననవరతము గొనియాడ నలరువాఁడు
పావనుండైన నాతండ్రి పాచ్ఛబేగు.

సీ. నవమాసములు మోసి జవసత్వమును
రోసి కడుపార గా నన్ను గన్నతల్లి
పొత్తిళ్ళ వచరించి యుత్తమిల్లఁ జేసి
కడుపార పాలిచ్చు గన్నతల్లి
కెవ్వుకెవ్వున నేడ్వ చివ్వున బఱతెంచి
జోలపాటల దేల్పజాలుతల్లి
తోడిబాలురతోడ నాడుకొనెడు వేళ
కరుణతో నను జూచుకన్నతల్లి

చిఱుతప్రాయంబునాడె నాచేష్టితములు
గాంచి మోదమందుభాగ్యంబు గాంచకుండ
నమరపురి కేగ పెద్దమేనత్తగారు
పెంచి పెద్దగ జేసెను ప్రేమతోడ.

సీ. తల్లి బాసినదాది తనవజ్జ జేరిచి
కన్నపుత్రునిరీతి గాంచె నెవతె
తోడిబాలురతోడ నాడుకొనుచుబోవ
చిత్తమందున వంత జెందు నెవతె
తన కెవ్వ రేదేని దినుమని బెట్టిన
పిలిచి నా కొసఁగెను ప్రేమ నెవతె
ఆటలలో బాలు రదలింపఁ జూచిన
కంటిని రెప్పగా గాచు నెవతె

సకలసద్గుణములు గల్గి సకలధర్మ
మార్గములు నేర్చి బోధించి మనియె నెవతె
అట్టిమేనత్త జాన్బీబి ననవరతము
భక్తితోడుత గొనియాడి ప్రస్తుతింతు.

గీ. చిన్నతనమునుండియుఁ జెన్నమీఱి
పెంచిపెద్దఁ జేసినపెద్దయత్త
జానుబీబిని మరపొంద జాల నెపుడు
మదిని సద్భక్తి నిల్పి నమస్కరింతు.

సీ. పదియునేడేడుల వరిపాటి గలకాల
మెలమివైద్యముజేసి వెలయుకతన
సంస్కృతాంధ్రంబుల సకలవైద్యగ్రంథ
సారామృతము గ్రోలజాలుకతన
యూనానిభాషలో నున్నగ్రంథంబుల
మర్మంబునెల్లను మరుగుకతన
తిబ్బెయక్బర్షాహి తెనుఁగు గావించితి
తెనుగువా రెఱుఁగక తిరుగు కతన

తప్పులుండిన విభుధులు దయదలిర్ప
నున్నవము నేయ గోరెద మది దలిర్ప
తెనుగు కొంఁదిగ నేర్చితి తెనుగువాఁడ
గాను గావున తప్పులు గలుగు టరుదే.

గీ. పదియువత్సరములనుండి బహువిధంబు
లైన వైద్యసద్గ్రంథంబులరసినాట
గోలెనీగ్రంధమును తెనుంగుగనొనర్చ
బూనినేటికి సంపూర్తిగా నొనర్చి
దేశియమైన వైద్యంబు తేజరిల్ల
ఆంధ్రదేశాభిమానులు నాంధ్రజనులు
నాదుశ్రమమైన నిద్దాని నాదరింత్రు
గాకయనిగోరి మ్రొక్కెదకరము మోడ్చి.

ఆయాలయములలో నుంచుచుండువారు. దీనినిబట్టి ఆ దేవాలయముల యొక్క అర్చకుఁడు గ్రహించి వైద్యముచేయ నారంభించెను. ఇటుల క్రమక్రమముగా వైద్యవిద్య వికసించ నారంభించినది. మరియు యూనాన్ దేశములో ప్రసిద్ధిజెందిన వైద్యవేత్త అరస్తాలీన్ అను నతఁడుగలఁడు గాని ఈయనవలన నీవిద్య అభివృద్ధి నొందజాలదయ్యె. బుఖరాత్ అను వైద్యునివలన యీవిద్య అభివృద్ధినొందెను. అటుపిమ్మట అరస్తాలిస్ అనువారు జన్మించి భేషజవిద్యను మిక్కిలివృద్ధి నొందించెను. అటుపిమ్మట జాలీనూస్‌గారు శికందియాకంటె మరికొంతసహాయ మొనరించిరి. హాకీంసాహెబువరతస్ యూనానీ హాకీము వైస్‌ఖురీదస్తనువారి చికిత్సగ్రంథములను మిక్కిలి వుత్తమరీతితో వ్రాసిరి. కాబట్టి ఈయనను చికిత్స కల్పనాకారుఁ డని చెప్పువారు.

రూందేశస్తులుకూడా ముందు భూత ప్రేత చికిత్సలు చేయుచుండువారు. ఈదేశస్తులు క్రమేణా విద్య అభివృద్ధి నొందించుటకై యూనాన్ దేశమునకు వెళ్ళి అచ్చట వైద్యులవద్ద యూనానీవైద్యము నేర్చుకొనిరి. హాకీముజాలీనూస్ యూనానీదేశమునం దుద్భవించి శికందరి దేశమునందు విద్యఅభ్యసించెను. ఈయన క్రీస్తుశకము 95 సంవత్సరము బర్‌గమూన్‌యందు జన్మించెను. ఈయన రోగవిధానమును సంపూర్ణముగా కనిపెట్టెను. అరస్తుఅను వైద్యవేత్త వ్రాసినపొరపాట్లు సవరించి ఒకగ్రంథము వ్రాసెను. అందు మూలికలు, ఖనిజములు, జంతుజములు, ఉద్భిజ్జములు, మొదలగువాని గుణములు వ్రాసెను. మరియు ఔషధములు చేయుక్రమమునందు జాలీనూస్ చికిత్స కల్పనాకారుఁ డనిపించెను. మరియు మబూనత్ అను వైద్యగ్రంథమును వ్రాసెను. ఆ గ్రంథముయొక్క ౪౪ వ పేజీలో బ్రిటీషుఫార్మకోపియా అఫిషల్ ఔషధములు యావత్తు జాలీనూస్ ఔషధములనిపించుచున్నవి.

రూం దేశమునందు క్రీస్తుశకము 100 శతాబ్దములో అతినూస్ అను వైద్యుడుండువాఁడు. అతనిఅభిప్రాయము శరీరసంబంధమగు యావత్తు వ్యాధులు ప్రాణవాయువుయొక్క యాటంకమువలన కలుగుచున్నవని ఆలోచించువాఁడు ఈతడు స్వబుద్ధిచే బుఖరాత్ వ్రాసిన గ్రంథములను మార్చ ప్రయత్నము చేసెను. గాని రూందేశములందుగల విద్వాంసులు అందుండి ముఖ్యాంశములను తీసికొనిరి. ఇంతలో రూఫస్ అఫ్ఖజీనస్ అను ప్రసిద్ధినొందిన వైద్యులుండువారని జూఫల్ అను రూమీదేశఁవి వ్రాసియున్నాఁడు. గాని వైద్యగ్రంథములలో ఫలాయనిఅనువాఁడు వైద్యుడుకాడు గాని వైద్యవిద్యాభిలాషి యని నేచరల్ హంటరిల్ అనుగ్రంథమునందు వ్రాయబడియున్నది. ఈగ్రంథము యూరోప్ దేశములలో అన్ని భాషలలో తర్జుమా చేయబడియున్నది. ఇది 23 సంవత్సరము మొదలు 79 సం॥రములో వ్రాయబడి ప్రసిద్ధినొందినటుల వ్రాసియున్నది.

ముసల్మానుల పరిపాలనయందు వైద్యకళాశాలలు స్థాపించి అభివృద్ధినొందించ నారంభించి యహూదీ(జ్యూస్) ఈసాయి (క్రైస్తవులు) పండితుల సహాయమువలన యూనానివైద్యము అభివృద్ధినొంద నారంభమైనది బుఖరాత్ దేశపరిపాలన చేయునట్టి ఖలీఫాహారూనురషీద్ ప్రభుత్వమునందు పండితసభ తేర్పర్చి సంస్కృత యూనాని మొదలగు సమస్తగ్రంథములు తర్జుమా చేయించెను అప్పుడు కొన్నియూనానిగ్రంథములు కొన్ని హిందీగ్రంథములు అరబ్బీభాషలో తర్జుమా చేయబడెను. మరియు యాహియాకుమారుఁడు మాసూయా అను వారు క్రీస్తుశకము 857 సం॥రములో చికిత్సలయందు ప్రసిద్ధిజెందెను. హనీఫకుమారుఁడు ఇసహాఖ్ హకీముల్వైస్ ఖురీమూస్ అనువారు చికిత్సను అరబ్బీభాషలో విరళముగా వ్రాసిరి. ఈయన బుఖరాత్ జాలీనూస్ వ్రాసిన గొప్పగ్రంథములసారము యావత్తు విమర్శించిరి. వీరు ఆ

కాలమునందు ప్రసిద్ధిజెందినవారు వీరు వ్రాసినగ్రంథములు పసతి ఖర ఫ్రాన్ దేశములందు ల్యాటిన్‌భాషలో తర్జుమా చేయబడినవి.

పారస్యా దేశస్థులుకూడా వైద్యవిద్యయందు ప్రవీణత జెంది యుండువారు. క్రీస్తుశకం 1000 సంవత్సరము మొదలు 1300 సంవత్సర మధ్యకాలమునందు యూనాని వైద్యాభివృద్ధి నొందెను. ఈవిద్య అబూబకర్‌కుమారుఁడు మొహంమద్‌కుమారుఁడు జకరియా రాజీగార్లు బుగ్దాద్‌యందు విద్య అభ్యసించెను. అబ్దుల్‌హసన్‌కుమారుఁడు తిబి అనువారు పిల్‌దోసుల్‌హిక్మా అనుగ్రంథమును వ్రాసెను. రాజీగారు వ్రాసినగ్రంథములు 100 కంటె విశేషముగా నున్నవి. గాని అందుకబీర్ అనుగ్రంథము యిప్పటివరకు ప్రసిద్ధినొందియున్నది. హారూన్ అను వైద్యుఁడు అందరికంటె ముందుగా స్ఫోటకమును కనిపెట్టెను. రాజీగారు స్ఫోటకము పిస్ఫోటకమును విమర్శించెను. ముందు యూనానివైద్యము గూఢముగ నుండెను. దీనిని బుఖరాత్ గారు స్థాపించిరి. ఇది శవాకృతి గలిగి నిర్జీవముగా నుండెను. జాలీనూస్‌గారు పునర్జీవనము నొందించెను హకీంరాజీగారు దీనిని సముకూర్చెను. ఇది దుర్బలము నొందియుండెను షేక్‌రయీస్ బలము కలిగించెను. మరియు రాజీతరువాత షేకల్‌రయీస్ అబుఅలీహుసేన్ అలీసినాకుమారుఁడు అను వీరు 1580 సం॥లో బొఖరాత్ అనుగ్రామములో జననమైరి. వీరు అనేకవైద్యగ్రంథములను రచించిరి. గాని అందు ఖానూన్ అను గ్రంథము ప్రసిద్ధమైనది. దీనితోసమానగ్రంథము వేరొకటిలేదు. ఇది ముందు రూం దేశమునందు 1593సం॥రములో వ్రాయబడి 1595సం॥లో ల్యాటిన్‌భాషలో తర్జుమా చేయబడినది తిరిగి ఫ్రాన్సు ఇంగ్లీషుభాషలలో తర్జుమా చేయబడినది.

క్రీస్తుశకం 1000 సంవత్సరమునందు క్రైస్తవ మోసియా అను గొప్పవైద్యవరుఁడుగలడు. ఇతను ఇల్‌మ్మల్ అద్వియా అనుగ్రంథము

ను వ్రాసెను. ఇది మెటీరియామెడికా అను పేరుతో కొన్నివందలసంవత్స
రములవరకు ప్రసిద్ధినొంది 1500సం॥ మొదలు1600 సంవత్సరమువరకు 26
పర్యాయములు ముద్రింపబడెను. ఇందు ఫార్మకోపియా ఖరాబాదీన్
లండన్ ప్రభుత్వమువారివలన పండితులసహాయముచేత ముద్రింపబడెను.
ఇది నిజములో ఈయన వ్రాసినగ్రంథమే.

మరియు హిస్పానియాదేశమునందుగల ముసల్మానులు భేష
జవిద్యయందు ప్రవీణత నొందిరి. ఇందు అబ్ఖాసింజహెరా విజహె
రావి అనువారు హిస్పానియా దేశస్థుడు నగసాల్ నసహూఫ్ అనుపేరు
గల గ్రంథమును వ్రాసెను. ఈగ్రంథము 1200 వందల సంవత్సరములో
ల్యాటిన్ భాషలో తర్జుమా చేయబడినది. ఈగ్రంథమునందు శస్త్రచికిత్స
ముఖ్యముగా వ్రాయబడియున్నది. దీనినిబట్టి యూరోపుదేశస్థులు చా
లాకాలమువరకు అభివృద్ధికొరకు పాటుపడుచుండువారు.

యూరోపుదేశమునందు క్రీస్తుశకము 500సం॥ మొదలు1000సం॥
వరకు వైద్యవిద్య ఆదేశమునందుండు పూజార్లుతప్ప యితరులకు తెలి
యదు. ఇట్టి అజ్ఞానాంధాకారముగానుండుసమయమునందే యూరోపుదే
శములో కూడా భూతవిద్య విశేషముగా పెంపొందినది. క్రీస్తుశకము
600 సంవత్సరములో బడకత్ ఆలయముయొక్క పూజార్లు వైద్యగ్రం
థములను చూడ నపేక్షించి వారిఅధికారిశిఫారసువలన బుకరాత్ జాలీ
నూస్‌గార్లు వ్రాసినగ్రంథములను చదువ నారంభించిరి. మరియుమోంట
కసినూ్యస్ ఆక గ్రామమునందు అందరికి పైగానుండువాడు వైద్య
విద్యఅభివృద్ధికొండవలెననే ప్రయత్నముచేయనారంభించెను. ఎందుకనగా
శిల్లర్‌న్యూ అను కాలేజితో సంబంధము కలిగి అనేకవందల సంవత్సర
ములవరకు ప్రసిద్ధిగాంచెను. 900 సంవత్సరములో శిల్లర్‌న్యూకాలేజి
యొక్క ప్రఖ్యాతి అనేకదేశములు వ్యాపించెను. 1800 సం॥లో మిక్కి
లి వైద్యశస్థితి కలిగి యుండెనుగాని అరేబియాదేశములో వైద్యవిద్య

మిక్కిలి ప్రకాశముగా నుండుటచే వారివలన నష్టము ప్రాప్తించినది. 1817 సం॥లో యూరోపు దేశములో వైద్యవృద్ధివాశనము సమాప్తి నొందెను. అప్పట్లో చికిత్సలనిమిత్తము ప్రత్యేకముగా ఒకగ్రంథమున్ను రోగనిధానము మూత్రపరీక్షగలగ్రంథమునొకటి ఇట్లురెండుగ్రంథములు ల్యాటిన్ భాషలో వ్రాయబడినవి. మఱియు క్రీస్తుశకము 1100 సం॥లో అరబ్బీభాషలోనుండిన అనేకగ్రంథములు ల్యాటిన్ భాషలో తర్జుమా చేయబడెను. కాబట్టి అరబ్బీభాషలోనుండు యీవైద్యగ్రంథములు యూరోపుదేశమునకు ప్రవేశించి అభివృద్ధిగొంది భేరీపలె ప్రయోగనారంభించెను. అయినను 1300 సంవత్సరాంతమునందు శిల్లన్యాకాలేజివిద్య నశించుకాలమునందు యూరోపుయొక్క ముఖ్యపట్టణములగు ఇటలి పెరాన్ వాయినా మొదలగు గ్రామములందు వైద్యవిద్య అభివృద్ధి నొందించుటకు కళాశాలలు స్థాపించబడినవి. ఇబ్ నెరషీను ప్రభుత్వము అంతమైనపిమ్మట వైద్యవిద్య ఇటలి ఫ్రాన్సు కళాశాలలయందు మిక్కిలి అభివృద్ధినొందెను. ఇట్టిస్థితియందు అనేకవైద్యగ్రంథములు తర్జుమా అయినవి ఆగ్రంథములు బుఖరాత్ జాలీనూస్ షేకల్‌రయీాన్ మొదలగువారు నిర్ణయించినవి. అప్పట్లో ఇంగ్లీషువైద్యులుకూడా అనేకగ్రంథములు వ్రాసిరి. ఈగ్రంథములు స్పాన్ని ఇబ్రాని భాషలలో తర్జుమా చేయబడినవి. తిరిగి ఇటలి ఫ్రాన్సుదేశములలో శస్త్రవిద్య విశేషముగా వృద్ధినొందెను. క్రీస్తుశకము 1500 సంవత్సరములో యూనాని వైద్యముయొక్క అపేక్ష యూరోపుదేశస్థులకు అధికమై యూనానిభాషయందుండు బుఖరాత్ జాలీనూస్‌గార్లవలన నిర్మించబడిన వైద్యగ్రంథములు కలూన్ దేశమునందు ల్యాటిన్ భాషలో వివరీతార్థములు చేయబడెను. దీనివలన నిశ్చయపరచువారికి స్థిరత్వము కలుగనారంభించినది. ఇట్టిస్థితియందు అన్యభాషయందుగల అన్యాయభావముచే నిజమును కనిపెట్టుటకు ప్రేరేపించ దొడగిరి. ఇటుల కొద్దికొద్దిగా హెచ్చి ప్రస్తుతస్థితివరకు ప్రవేశించినది.

జాలీనూస్‌గారి గ్రంథములు చూచుటవలన గతించినకాలము నందు మూలికలవలన కలుగు ప్రయోజనములు ముఖ్యముగా చెప్పబడి యున్నవి. వైద్యవిద్యవలన ఓషధుల రూపము లక్షణములు గుణములు లాభము గ్రహించుటకు కారణమైనది దీనిని బట్టి అమెరికాదేశస్థులు కూడ వైద్యవిద్య అభ్యసించిరి. మరియు, మూలికలు లోహాదులు మొదలగునవి చేయునట్టి విధానము ఇంగ్లీషురాష్ట్రములో ప్రవేశించెను కాబట్టి లోహాదులు కూర్చుటయందున్ను ఔషధము చేయుటయందున్ను గొప్పప్రవీణులై కెమిస్ట్రి అభివృద్ధినిబట్టి ఔషధములు చేయుటలో శాస్త్రోక్తవిధులు ఏర్పడినవి. ఇందువిషయమై ఆశ్చర్యమొందగలుగుటకు కారణము కలుగుచున్నది. మరియు, యూరోపు అమెరికా దేశస్థులు యావత్తువైద్యవిద్యను ఆశ్చర్యమొందునటుల అభివృద్ధి నొందర్చియున్నారు 1900 సంవత్సరములో వైద్యవిద్య ఏవిధముగా వృద్ధినొందించిరో వ్రాయుటకు అనేక గ్రంథములు కాగలవు. మిడికల్ ఆఫ్ హిస్టెరిచదివినచో తారీఖుల్ అతిబ్బా చదివినవారున్ను ప్రతివత్సరము వృద్ధినొందిన పుస్తకములు చూచువారున్ను దీని అభివృద్ధి గురించి గ్రహించగలరు. విద్య ఒకరిసొమ్ముగాదు విద్య అభివృద్ధి అయినకొలది వృద్ధినొందుటకు కారణమగును.

హిందుస్థానము (హిందుదేశము) లో కూడ అన్నివిద్యలతో సమానముగా వైద్యవిద్యకూడా వృద్ధినొందుచు వచ్చెను గాని ఇచ్చటి ప్రజలయొక్క ఐకమత్యత అనురాగము సంగీభావము మొదలగునవి నాశన మొందుటవలన ఇచ్చటివారు కాలానుసారే నటించనికారణము వలన ప్రస్తుతము ఈవిద్య అభివృద్ధి నొందించుటకు ప్రభువులసహాయము

లేని కారణమువలన నశించుటకు కారణమైనది. కాలశ్యకుటిలాగతి అను శ్రుతివాక్యమురీతిగా హిందూదేశము దరిద్రదశకులోనై అనుభవించ వలసివచ్చినది.

ఇట్లు,

తారీఖుల్ అతిబ్బా అను వైద్యచరిత్ర యందు వ్రాయబడియున్నది.

గ్రంథకర్త:

వైద్యభూషణ:—హకీం డి. రహంతుల్లాబేగ్ సాహెబ్.



# పీఠిక.

మహాశయులారా! మనహిందూదేశమునకు ప్రభుత్వమునాడు యూనాని వైద్యము అరబ్ దేశమునుండి ప్రవేశించినది. ఈవిద్యలు అన్ని విద్యలతోపాటు వృద్ధినొందుచునే వచ్చెను. మొహమ్మదీయులు ప్రభుత్వమున అక్బరుప్రభువు కాలములో అరబ్బిభాషయందుండు నీగ్రంథములు పార్షీభాషలో తర్జుమాయైనవి. దర్మిలా వుర్దూభాషలో కొన్ని గ్రంథములు మాత్రము తర్జుమా అయినవి కాని ఆంధ్రభాషలోనికి మార్పుటకు హిందూసోదరులకు అరబ్బి, పార్షి, ఉర్దూ భాషాజ్ఞానము లేకుండుటయు మహమ్మదీయసోదరులకు ఆంధ్రభాషాప్రవీణత లేకపోవుటయు ఒకవ్వుడు భాషాజ్ఞానమున్నను వైద్యానుభవము లేకుండుటయు ఒకవ్వుడు కలిగియున్నను సాహసించకపోవుటయు మొదలగు కారణములనుబట్టి యీవిద్య నుసిగప్పిననిప్పువలె నున్నది. కాన నాకుగల యల్పజ్ఞానముతో ననేకగ్రంథములను సమకూర్చి పండితపామరులకు కూడ అర్థమగునటుల ఆంధ్రభాషలో గ్రామ్యపదములతో ఆంధ్రీకరించితిని. ఈగ్రంథము ఆయుర్వేదపద్ధతి ననుసరించి యూనానిమతానుసారముగా వ్రాయబడి యున్నది. ఈగ్రంథమునందు శరీరావయవములను వర్ణించుచు నాయాయంగములయందు జనించునట్టి రోగములను వాత, పిత్త, శ్లేష్మ, రక్త, దోషానుగుణ్యముగా వర్ణించుచు ప్రత్యేక ప్రత్యేకముగా వాటిలక్షణములు చికిత్సలు అనగా ప్రత్యేకవిధానము తదుపరి శస్త్రకర్మ, విరోచనకర్మ, వస్తికర్మ, వమనకర్మ, నశ్యకర్మ, ధూప, లేపన, పథ్య, స్వేత, ఔషధ అగ్నికర్మలవలన ఆయారోగములు శాంతించు నుపాయములు, అపథ్యములు విపులముగా చెప్పియున్నవి. ఇందలి ఔషధములు మూలికాదులతో చూర్ణములు క్వాథములు, మాత్రలు, లేహ్యములు

అవలేహ్యాములు, ఘృతములు, తైలములు మొదలగునవి స్వల్పముగా తయారుచేసికొను పద్ధతులుగలవు. కాని రసవిద లోహాదులతో చేయు విధానము మాత్రము చెప్పబడి యుండలేదు.

మఱియు ప్రత్యేకరోగములలో లక్షణములు నాడి, స్పర్శ, రూపము, మూత్రము, దృష్టి మొదలగు చిహ్నములు వర్ణించి యున్నవి. ఈగ్రంథమునందు గలనిదానము శారీరము చికిత్సలు మరియే యితర గ్రంథమునందు చెప్పియుండలేదు. కాబట్టి యీగ్రంథము వైద్యులకే గాక వైద్యేతరులకుకూడ అత్యంతోపయుక్తముగా నుండును. ఈగ్రంథమునందు శస్త్రకర్మకూడా విపులముగా చెప్పబడియున్నది. పూర్వము మన హిందూదేశమును పరిపాలించిన బౌద్ధరాజు కాలములో శస్త్రవిద్య అంతరించెను. అప్పట్లో శరీరమునకు తగు ఔషధములుదక్క శస్త్రఅగ్ని కర్మలు చేయకూడదని ఆరాజుయొక్క మతము.

మొహమ్మదీయులు కాలములో ఇట్లు జరుగక యావత్తుకర్మలు జరుగుచునే యుండెను. ఆప్రభువులు ఇట్టిఅడ్డంకులు జరిగించనట్లు నీగ్రంథమునందు గల చికిత్సమార్గములబట్టి గ్రహించవచ్చును. ఈగ్రంథమునందు గలచికిత్సపద్ధతి ఎట్లున్నదనిన శిరము మొదలుకొని పాదముల వఱకు ప్రతిఅంగములను వర్ణించి ఆయాఅంగములయందు వాత, పిత్త, శ్లేష్మ, రక్త దోషములవలన జనించు వ్యాధులవిధానము చికిత్సలు చెప్పబడి యున్నవి.

అనగా దోషములనిరూపణ దోషములకు ప్రాణవాయువునకు గలభేదములు దోషములను స్వస్థత నొందించుమార్గములు మొదలగునవి మొదటి యధ్యాయమునందున్ను, శిరస్సుయొక్క ఆకృతి శిరస్సంబంధమగువ్యాధులు, చికిత్సలు రెండవయధ్యాయమునందున్ను, నేత్రనిరూపణ నేత్రవ్యాధులు చికిత్సలు మూడవయధ్యాయమునందున్ను, కర్ణములనిరూపణ కర్ణవ్యాధులు చికిత్సలు నాలుగవయధ్యాయమునం

దున్న, నాసావివరము నాసావ్యాధులు చికిత్సలు ఐదవయధ్యాయ మునందున్న, పెదవుల లక్షణములు అందు జనించు రోగములు చికిత్సలు ఆరవయధ్యాయమునందున్న, ముఖరోగములు ముఖవర్ణనము చికిత్సలు ఏడవయధ్యాయమునందున్న, దంతనిరూపణ దంతరోగములు చికిత్సలు ఎనిమిదవయధ్యాయమునందున్న, కంఠనిరూపణ కంఠరోగములు చికిత్సలు తొమ్మిదవయధ్యాయమునందున్న, పుప్పుసములనిరూపణము అందుజనించువ్యాధులు చికిత్సలు పదినొకటవ అధ్యాయమునందున్న, ఇందు శ్వాసశ్వాసప్రుచ్ఛనము కూడ యెంతయో బాగుగ వర్ణింపబడును. మఱియు హృదయము యొక్క నిరూపణ హృద్రోగములు చికిత్సలు పదిరెండవ యధ్యాయమునందున్న, పక్కరోగములు చికిత్సలు పదమూడవ యధ్యాయమునందున్న, స్తనముల నిరూపణము స్తనములరోగములు చికిత్స పదునాలుగవయధ్యాయమునందున్న, వ్రాయబడి చిత్రపటములతో నిర్ధారణపరచి యున్నాను.

ఆమాశయములక్షణములు అందు జనించురోగములు చికిత్సలు 15 వ యధ్యాయమునందున్న, యకృత్ (లివర్) వర్ణనము అందు జనించు రోగములు, పిత్తాశయముయొక్క వర్ణనము అందుగలుగు రోగములు చికిత్సలు 16 వ యధ్యాయమునందున్న ప్లీహాము (స్ప్లీన్) నిరూపణ అందు జనించురోగములు చికిత్సలు 17 వ అధ్యాయమునందున్న గర్భమునందుండు ఝిల్లియందు జనించురోగ నిరూపణ చికిత్సలు 18 వ అధ్యాయమునందున్న ప్రేగులనిరూపణ ప్రేగులరోగములు చికిత్సలు 19 వ అధ్యాయమునందున్న, గుదరోగములు చికిత్సలు 20 వ అధ్యాయమునందున్న, మూత్రపిండములు, (కిడ్నిస్) నిరూపణము అందు జనించువ్యాధులు చికిత్సలు 21 వ అధ్యాయమునందున్న పురుషలక్షణములు పురుషసంబంధరోగములు చికిత్సలు 22 వ అధ్యాయమునందున్న అండకోశముల నిరూపణము అందుజనించువ్యాధులు

చికిత్సలు 23 వ అధ్యాయమునందున్న స్త్రీగర్భనిరోధనములందు జనించు రోగములు చికిత్సలు 26 అధ్యాయమునందున్న వీపు, కాళ్ళు, చేతులు, మొదలగు అంగముల రోగములు (శల్యభంగరోగములు) 25 వ అధ్యాయమునందున్న జ్వరములలక్షణములు చికిత్సలు 25 వ అధ్యాయమునందున్న శోఫ (వాపు) రోగములు వ్రణములు చికిత్సలు 27 వ అధ్యాయమునందున్న కుష్ఠురోగములు, గజ్జి, దురద, అంగములు కుళ్లిపోవువ్యాధులు చికిత్సలు 28 వ అధ్యాయమునందున్న కేశరోగములు చికిత్సలు 29 వ అధ్యాయమునందున్న నఖరోగములు చికిత్సలు 30 వ అధ్యాయమునందున్న క్రిమిరోగములు (ప్రకీర్ణ) శ్వేద (చెమట) రోగములు చికిత్సలు 31 అధ్యాయమునందున్న రోగసంధులు చికిత్సలు 32 వ అధ్యాయమునందున్న విషరోగలక్షణములు చికిత్సలు 33 వ అధ్యాయమునందున్న వ్రాయబడియున్నవి. ప్రతిఅధ్యాయములో ప్రత్యేకఅంగముల చికిత్సావరములు ముద్రించియున్నవి.

ఈగ్రంథము మూడువాల్యుములుగా విభజించి యున్నాను. మిగిలిన రెండువాల్యుములు అచ్చులోనున్నవి. కొలంది కాలములో అందగలవు. ఈగ్రంథమునందు పద్యములు శ్లోకములు లేవనిన్ని కర్త, కర్మ, క్రియలు, సరిగా లేవనిన్ని సంధులు, అల్లులు, అచ్చులు, సరిగా చేర్చలేదనే ఆక్షేపణలు, తరుచుగాయుండవచ్చును. కాబట్టి యీగ్రంథము యితరభాషనుండి ఆంధ్రీకరించుటవలన నేను అన్యమతస్థుడ నగుటవలన అట్టిలోపములున్నను మన్నించి యిందుగల అంశములను తెలిసికొనుచు సన్మానందింపఁజేయ గోరుచున్నాను.

ఇట్లు,

గ్రంథకర్త:

వైద్యభూషణ:—హకీం డి. రహమంతుల్లాబేగ్ సాహెబు.

ఈగ్రంథమునందు ఈక్రింద వివరించిన ప్రాచీన యూనాని వైద్యుల మతిభేదములు యీక్రిందవ్రాయబడిన ప్రాచీన యూనాని గ్రంథములందుగల విషయములు వ్రాయబడియున్నవి.

1 హకీం జాలీనూస్‌గారు
2 హకీం తిబ్రిగారు
3 హకీం శేక్ అలీఅబుసేనాగారు
4 హకీం ఇమాం మెబుఖరాత్‌గారు
5 హకీం షయూల్బ్యాన్ హాఫిల్
6 హకీం మూసేబూఅలిగారు
7 హకీం ఇమాం మెరాజిగారు
8 హకీం షరీఫుల్లాగారు
9 హకీం రాజిగారు
10 హకీం అమీర్ దౌలాతల్ మిరాజ్‌గారు
11 హకీం కిల్సిగారు
12 హకీం జబూసాదఖ్‌గారు
13 హకీం అబ్దుల్ ఫరహాగారు
14 హకీం తబిఖీగారు
15 హకీం జహోలాజబిన్ వుంద లూసీగారు
16 హకీం షికందర్‌గారు
17 హకీం యూనాన్‌గారు
18 హకీం షేకల్ రయీాన్‌గారు
19 హకీం వుస్తాద్ మొహంమ్మద్ ఫరహాగారు
20 హకీం కరేసిషేక్‌గారు
21 హకీం సమరకందిగారు
22 హకీం ఇబ్నిశలబిన్‌గారు

గ్రంథములు.

1 ఖరాబాదీనెఖాదరీఅను గ్రంథము
2 బిలాసతుత్తిజార్ ,,
3 దిల్‌బుబాహార్ ,,
4 ఖరాబాదీనేకబీర్ ,,
5 తమీాల్ ,,
6 సతదీ ,,
7 కోషా ,,
8 శరాహాఅజ్‌బాబ్ ,,
9 తశరీహాకబీర్ ,,
10 కామిలుసనాహా ,,
11 నఫాయి ,,
12 దస్తూరవుల్ ఇలాజ్ ,,
13 యాత్‌సాల్ ,,
14 హాకర ,,
15 అజాయెబుల్ ఇంతిఖాబ్ ,,
16 యాతశేర్ ,,
18 ముత్తవిఫిలాత్ ,,
19 ఖరాబాదిజాకాయి ,,

## *** ఈగ్రంథమునందుగల మానప్రమాణములు. ***

8 బియ్యపుగింజలు—1 రతి

1 గురివెంద యెత్తు—1 సుర్ఖ్.

8 రతులు— 1 మాషము.

మాషమనగా రు 0—1—4 యెత్తు.

3½ మాషముల యెత్తు—1 దిరమ.

మాషమునకు 12 గురివెందలయెత్తు అని కొందరిమతము.

మరికొందరు 8 గురివెందలయెత్తు 1 మాషమనుచున్నారు.

12 మాషములు 1 తులము.

5 తులములు 1 చటాకు.

40 తులములు 1 రతల్ (పౌను)

80 తులములు 1 శేరు.

40 శేర్లు 1 మణుగు.

# హెచ్చరిక.

మావద్ద ఆయుర్వేద యూనాని మూలికలు, ఆకులు, పువ్వులు, కిరాణాసామానులు, అవుషధములు, లేహ్యములు, చూర్ణములు, భస్మములు, షర్బతులు అరఖులు, కస్తూరి, గోరోజనం, జున్ను, కుంకుమపువ్వు, బంగారు వెండిరేకులు, మాచేకనిపెట్టబడిన పేటెంటుఔషధములు మొదలగునవి సరసమైనధరలకు దొరకును.

వలయువారు యీక్రింది చిరునామాకు వ్రాయుడు:—

## హబీబుల్ యూనానీ ఆయుర్వేద వైద్యశాల,

రాజమండ్రి.





ఈగ్రంథమునందుగల చిత్రపటములు రాజమండ్రి
వాస్తవ్యులు ఎంగ్రేవరు, మ॥ రా॥ శ్రీ
పెండ్యాల కామేశ్వరావు
పంతులుగారిచే చేయించబడినవి.





# విషయసూచిక

### సన్యాసము.



### సర్వాంగసన్నా, పక్షఘాతము.



### తసన్నుజ్ (అవయవములు బిగించు రోగము)

## మూడవ అధ్యాయము

## నేత్రరోగములు.



## నేత్రసంబంధమగునీరు రోగములు

కర్ణరోగములు.

## పదియవ అధ్యాయము

## శ్వాస రోగములు.

## పదునొకండవ అధ్యాయము.

## కాసరోగములు.

## పదమూడవ అధ్యాయము

## హృదయ రోగములు.

పదునాలుగవ అధ్యాయము




శరీరములోనుండు ముఖ్యఅంగములను చూపు చిత్రపరము. నెం 1.

# చిత్రపటము నెం 1.

1. వాయునాళము.

2 ఫుప్ఫుసములు (ఊపిరితిత్తులు)

3 ఆమాశయమునకు ఊపిరితిత్తులకు మధ్యనుండు మంధపుపొర.

4 యకృత్ (లివరు)

× యకృత్ వెనకవైపునుండు పిత్తాశయము.

5. పేగులపైనుండు ఝిల్లిపొర. ఇందు చిన్ననరములు అనేకములు గలవు. ఈనరములు పేగులలోనుండి కైలూస్ (అన్ననరము) నీడ్చికొని యకృత్ నందు ప్రవేశపెట్టునరమునకు అందజేయును.

6 చిన్నపేగు.

7. పెద్దప్రేగు.

8 పెద్దప్రేగు మొదటిభాగము.

9. పెద్దప్రేగులో కొంతభాగము

10. గుదస్థానము. (ఆసనము)

11. ఆమాశయము (అన్నకోశము)

12. ప్లీహము. ఈప్లీహక్రిందివైపు రుకవ్రక (మధుకోశము) ముండును




శరీరములోనుండు జీవఅంగములను చూపు చిత్రపరము. నెం 2.

# చిత్రపటము నెం 2.

14. ప్రక్కటెముకలు

15 ప్రక్కటెముకల మధ్యభాగము.

16 హృదయము.

17. చెడురక్తము ప్రవేశించునట్టి స్థానము. అనగా ఊపిరితిత్తుల వెనుక భాగము.

18. హృదయమునకు ఎడమభాగమందుండు పెద్ద రక్తధమని (శుద్ధ రక్తనాళము)

19 ఊర్ధ్వ చెడురక్తనాళము. అధో చెడురక్తనాళము (శిర) యొక్క సంఘము.

20 చెడురక్తనాళము (శిర) యొక్క శాఖ.

21 అధోభాగమునకు ప్రవహించు రక్తధమని అనగా హృదయము నుండి అధోశరీరమునకు రక్తమును ప్రవేశింపచేయు శుద్ధరక్తనాళము.

22. మూత్రపిండములు (వులవకాయలు)

23. రెండుకాళ్లలోనుండి చెడురక్తమును ఊర్ధ్వముగా ప్రవేశింప జేయు చెడురక్తనాళముల శాఖలు (శిరలు)

24 వీపుపై అనగా మూత్రపిండములకు క్రిందిభాగమందుండు పొర (ఝిల్లి)

\+ మూత్రపిండములనుండి మూత్రాశయమునకు మూత్రమును ప్రవేశపెట్టు నాళము.

26. గుదస్థానమునకు, మూత్రాశయమునకు మధ్యనుండు పొర.

27. వస్తి (పొత్తికడుపు) లో మూత్రాశయముపైనుండు పొర.

28. గర్భాశయము.

29. అండాశయము.

యాకరీముల్ మారూఫ్.

బిస్మిల్లా ఇర్రహిమానిర్రహీం.

# తిబ్బె అక్బర్ షాహి.



సమస్త రుగ్మతలకు కారణములగు జలుబు, చెమ్మ, ఉష్ణము, శుష్కత్వము, ప్రాణవాయువుల విషయమై నిదానము, చికిత్స లక్షణములు ముందుగా వర్ణించుచున్నాను.

## ఉష్ణముయొక్క నిదానము.

ఉష్ణాధిక్యముగా నుండునప్పుడు దాహము, మంట, శరీరము పచ్చగానుండుట, చలిగానుండుట, తలబరువు, ఒల్లువిరుపు, ఆవలింతలు, నిదురవిశేషము, నీర్సము, నోరుతియ్యగానుండుట, దేహము, నాలుక, ఎర్రగానుండుట, కురుపులు, గుల్లలు విశేషముగాలేచుట, దంతమూలములనుండి, రక్తము వెడలుట, ముక్కునుండి రక్తము స్రవించుట, కాళ్లు, చేతులు, పడిపోవుట, శరీరమునొప్పి, ఈ మొదలగు లక్షణములు రుధిర సంబంధమగు ఉష్ణాంశములని తెలియవలెను.

మరియు పిత్తఉష్ణమువలన కలుగు లక్షణములు:—దేహము, జిహ్వా, నేత్రములు పచ్చగానుండుట, నోరుచేదుగానుండుట, నాలుక ఎండుట, ములుబారుట, నాసికమునందు శుష్కత్వము, మిక్కిలి దాహము, విశేషమంధాగ్ని, కడుపులో తెమలుట, రోమకూపములు, కఠినత్వమొందుట, ఈ మొదలగు లక్షణములు ఉష్ణపిత్తమువలన కలుగునని గ్రహించవలెను.

## జలుబు లక్షణములు.

శరీరము నల్లగాగాని, తెల్లగాగాని, యుండుట, దాహము, మంట లేకుండుట, మొదలగు లక్షణము ప్రత్యేకజలుబువలన కలుగుచున్నవి.

ఈ జలుబు శ్లేష్మముతో కలిసినచో శరీరము, తెల్లగానుండుట, నీర్సము, హీనత్వముగానుండుట, శరీరము తెల్లగానుండుట, అజీర్ణము, పులితేన్పులొచ్చుట, నిదురాదిక్యము, ఇంద్రియములు స్థిలమొం దుట, ఉమ్మివలచగా వెడలుట, మంటలేకుండుట, నాసికమువెంట నీరు స్రవించుట, మొదలగునవి శ్లేష్మసంబంధమగు జలుబువలన కలుగుచు న్నవని గ్రహించవలెను.

మరియు ఈజలుబు వాతముతో సంబంధముకలిగి యుండినచో శరీరమునల్లగానుండుట, శిరావేదనముచేసినయెడల, చిక్కగను నల్లని రక్తము వెడలుట, శరీరముచిక్కిపోవుట, వృధాఆలోచనలు కలుగుట రొమ్ము బోరకిందిభాగము అనగినటులుండుట, అల్ప ఆకలి కలుగుట, మొదలగునవి వాతసంబంధమగు జలుబు లక్షణములని గ్రహించవలెను.

## చెమ్మయొక్క లక్షణములు.

శరీరము మృధువుగను, నీర్సముగానుండుట, మతిమరుపు, మిక్కి లి నిదుర, మొదలగునవి ప్రత్యేకచెమ్మలక్షణములని గ్రహించవలెను.

ఈ చెమ్మ ఉష్ణము తో కూడిన యెడల కలుగు లక్షణములు పైనవర్ణించియున్నవి.

## శుష్కత్వలక్షణములు.

శరీరము కఠినముగానుండుట, కురూపియగుట, చిక్కిపోవుట, మొదలగునవి ప్రత్యేకలక్షణములు.

మరియు ఉష్ణము, పిత్తము, వాతముతో శుష్కత్వముచేరిన యెడల కలుగు లక్షణములు పైనవర్ణించియున్నవి గాన చదువరులు గ్రహించగలరు.

మరియు రుధిరము, కఫము వాతము, పిత్తములతో మానవ

శరీరము స్థిరముగానున్నదని గ్రహించవలెను. ఈ నాలుగు దోషములు హెచ్చినను తగ్గినను రోగోత్పత్తికి కారణమగుచున్నదని వచించియున్నారు.

రుధిరమనగా వుష్ణము, శుష్కత్వస్వాభావికము గలదనియు. కఫము జలుబు, చెమ్మగలదనియు. వాతము, జలుబు, శుష్కత్వముగలదనియు, ఈ నాలుగు దోషముల సంయోగమువలన, ఒక చల్లని పొగ వెడలుచున్నదనియు, ఇందు వుష్ణముండనేరదనియు, నిది మానవశరీరమునందు స్థిరముగా నుండనేరదనియు, నిర్ధారణమగుచున్నది. దీనిని వాత మనుచున్నారు. మరియు నిది కఫము, వాతమువలన ఉత్పన్నమగుచున్నది. ఈ నాలుగు దోషములతో ఉత్పన్నమగునట్టి ధూమమువలన శరీరస్థిరత్వము, ప్రాణము, దీనినుండి కలుగుచున్నదనియు నిదియె ప్రాణమనియు, జీవమనియు కొందరిమతము.

### భోజనఔషధ పానాదులవిషయమై.

ఔషదముల విషయమై వచించబడుచున్నది. ఈ నాలుగుదోషములు చెడిపోవుటకు బాగుచేయుచున్నవి.

మరియు రుధిరము నాలుగుకారణములవలన చెడిపోవుచున్నది. (1) రక్తమధికమగుటవలన, (2) రక్తముపలచనగుటవలన, (౩) రక్తము చిక్కనగుటవలన (4) కుళ్ళుట మొదలగు కారణమువలన రక్తముచెడిపోవుచున్నది. కాబట్టి కాశిని, కాహు, ధనియాలు, గులాబిపూలు, నిమ్మకాయరసము. సికింజబీన్, ఉన్నాబ్ షర్బతు, మంచిగంధపుషర్బతు, మొగలిషర్బతు, మొదలగునవి రక్తముయొక్క తీవ్రతను. శాంతినొందించును. ఇవిగాక ఈ ఔషధములకు సమానగుణముగల చల్లనివస్తువులు ఉపయోగించవచ్చును.

### శికింజబీన్ చేయుక్రమము

పుల్లనిబేదానాకాయలు పచ్చివి రసముతీసి ఒకశేరు రసములో పావుశేరు శిరకాకల్పి కాచి, ఒకశేరు శర్కరచేర్చి తేనె పాకముగా

కాచి దించుకోవలెను. శిరకాబమున్ను నిమ్మకాయపులుసు చేర్చుట ఉత్తమము.

### ఉన్నాబ్ షర్బతు చేయుక్రమము

ఉన్నాబ్ ఒకభాగము, నాలుగుభాగముల నీళ్లలోవేసి చతురాంశముగా కషాయముకాచి ఆకషాయమునకు రెట్టింపు శర్కరచేర్చి కాచి తేనెవలెనైనవెనుక దించుకోవలెను. మరియు మొగలిషర్బతుచేయు విధానముకూడా ఇదియే యని భావించవలెను.

### మంచిగంధపుషర్బతువిధి.

శ్రీగంధపుపొట్టు 90 మాషములు 450 మాషముల పన్నీరులో వేసి రెండు అహోరాత్రులు నానవేసి పన్నీరు వేరుపరచి మిగిలిన గంధపుపొట్టులో కొద్దిగా నీళ్ళుచేర్చి కషాయముకాచి ఆకషాయము పైపన్నీరులోచేర్చి 510 మాషములు శర్కరందుచేర్చి షర్బతుపాకము గాకాచి దించుకొని అవశ్యానుకూలముగా ఉపయోగించవలెను.

### చిక్కని రుధిరమును శుద్ధిపొందించు ఔషధములు.

ఆలుబకరాకాయలరసము, సోపురసము, చాతరాసిఆకురసము, తేనెకురెట్టింపు నీళ్ళుచేర్చి కాచినతేనె, శికింజబీన్ మొదలగునవి చిక్కని రక్తమును శుద్ధిచేయునని గ్రహించవలెను.

### వాతమును వెడలించు ఔషధములు.

చిక్కని రక్తమును శుద్ధిచేయునట్టి వస్తువులు వాతమును శుద్ధపరుచగలవు. ఎటులననగా, వాతము, రక్తమునందు ప్రవేశించుటవలన రక్తము చిక్కబడును. చిక్కని శ్లేష్మము అనగా కఫముచేరుటవలన కూడా రుధిరము చిక్కబడును. ఇట్టితరి కఫమును వెడలించునట్టి విరోచనఔషధములు మరియు పుల్లని ఔషధములువయోగించవలెను. కఫము, వాతము, పలచబడిన తరువాత మూత్రము వెడలించునట్టిఔషధములను ఉపయోగించవలెను. రుధిరమునందు కఫము మిళితమైయున్నచో రక్తమోక్షణమునందు వెడలినరక్తము తెల్లగానుండును. మరియు

రక్తమునందు వాతముచేరి యుండినచో నల్లగా వెడలనారంభించును. కాబట్టి యీమొదలగు నదుపాయములు వలచని రక్తమును స్థిరపరచును అట్టి స్థితియందు రుధిరము కఫముచేయుటవలన వలచబడినచో బాదగంజబోయా, తులసిగింజలు, రాజహంస, మొదలగు ఉష్ణము శుష్కత్వము గల ఓషధులు, కఫమును వెడలించునట్టి పెద్దకరక్కాయలు మొదలగు వస్తువులు కఫమును వెడలించుటయందు అతివృత్తములు మరియు రక్తకాంతి తెల్లగానుండినచో రుధిరమునందు కఫము మిశ్రమైయున్నదని గ్రహించవలెను.

మరియు శరీరము మర్ధించుట వ్యాయామముచేయుట కష్టపడి పనులు చేయుట మొదలగు విహారములు కఫమునుశాంతినొందించును.

## రక్తపిత్తము విషయమై.

రుధిరము పిత్తముతో కలిసిన మొదల రక్తమోక్షణమునందు రక్తకాంతి పచ్చని కఫమువలె నుండును. దీనిని శాంతినొందించునట్టి ఉపాయములు పిత్తమును వెడలించుటయే యనిభావము.

మరియు దేశవాళీకరక్కాయలు, ఇందువిషయమై గొప్ప సహాయకారియని గ్రహించవలెను. మరియు చిరిశెనగకట్టు, ఉన్నాబ్ పక్వతు కాసినిరసము, మొదలగునవి రక్తపిత్తామును శాంతినొందించునట్టి ఔషధములుకూడా ఇందు లాభదాయకములగునని గ్రహించవలెను.

## రక్తఉష్ణము విషయమై.

రుధిరమునందు ఉష్ణము ప్రవేశించుటవలన నాలుగుదోషములు కూడా కుళ్ళిపోవును గాన ఇందు ముఖ్యముగా జ్వరము కలుగుచున్నది. మరియు ఉష్ణము ప్రవేశించని దేదోషములు కుళ్ళనేరవు. కాబట్టిజలుబు శుష్కత్వము, కలిగించునట్టి ఔషధప్రయోగముచేయుట ఉచితము. కాబట్టి ఈఔషధములు రక్తపిత్తావము [తీవ్రిత] నందు వ్రాయబడి యున్నవి. రుధిరము ఉష్ణత్వమొందుటకు రక్తపిత్తావమనుచున్నారు.

## పిత్తము చెడుటకు కారణములు.

శరీరసంబంధమగు పిత్తము అయిదు కారణములవలన చెడిపోవును. (1) వలచని కఫము పిత్తమునందు చేరుటవలన (2) పిత్తమునందు చిక్కని కఫము చేరుటవలన (3) స్వల్పవాతము పిత్తమునందు చేరుటవలన (4) వలచని కఫము స్వల్పవాతము, పిత్తమునందు మిశ్రమగుటవలన (5) వలచని కఫము, వాతము, మిక్కిలి దగ్ధమై పిత్తమునందు మిశ్రమగుటవలన పిత్తము చెడిపోవును. 4, 5 భేదములందు స్వల్పకారణము గలదు. (4)వ భేదమందు ఉష్ణము తగ్గిపోవును. 5వ భేదమునందు మిక్కిలి ఉష్ణముండని యెడల ఈ రెండు కారణములు సమానముగానె యుండునని భావము.

## పిత్తము చెడిపోవుటకు చికిత్స.

ఉష్ణాధిక్యమునందు చెప్పిన ఓషధులు ఒకదినమునకు రెండు మూడు పర్యాయములు ఉపయోగించినయెడల పిత్తదోషములయందు కూడా గుణదాయకమగును.

మరియు ఉష్ణము తక్కువగానుండినచో స్వల్పముగా చలువ చేయునట్టి ఓషధు లుపయోగించవలెను. అనగా ఇసప్గోలుగింజలు బేదానాలు, పెద్దపాయలగింజలు, కాసిని, పందిరిదోసవిత్తులు, ఎండిన ధనియాలు, చందనము, కాహువిత్తులు, కర్పూరము మొదలగు వస్తువులు ఇసప్గోలు గుజ్జునందు చేర్చి పానముచేయవలెను. మరియు ఇసప్గోలు ప్రత్యేకముగా నూరకూడదు. ఈగింజలు నూరినచో విషతుల్యమగును. బేదానాకాయగింజ కూడా నూరకూడదని గ్రహించవలెను. దగ్గునందు పుల్లని బేదానాకాయగింజలు యియ్యవలెను. మరియు పెద్దపాయలగింజలు, కాస్నివిత్తులురసముతీసి పానంగించవలెను. పాయలాకు, కాస్ని ఆకులను కడుగకూడదు. ఎందుకనగా కడుగుటవలన బలహీనమగును. కాస్ని ఆకురసము విరిచి ప్రత్యేకముగాని లేక మధురము, ఆమ్లముకల్పిగాని పానముచేయుటవలన రుధిరము శుభ్రిమొందును, రుధిరమును స్వ్రథ

తనొందించువిషయమై దీనికి సమానఔషధము మరియొకటిలేదని తెలి యవలెను. మరియు పెద్దపాయలఆరు నూరింసముతీసి వడియబోయుట మంచివనికాదు.

మరియు పంగిరిదోసకిత్తులు, దోస త్తులు, ధనియాలు నూరి రసముతీయవలెను. లేనీళ్ళ నానవేసి నూరి పానముచేయవలెను ఇట్టు లనానవేసి తీసినరసము మిక్కిలి ఉత్తమము

మరియు శ్రీగంధము నీళ్లతో అరుగదీసి పానము చేయుటవలన అత్యుష్ణమును శాంతినొందించుచు, రక్తచందనముకంటె తెల్లచందనము మంచిదని గ్రహించవలెను.

కర్పూరము. శరీరఉష్ణమును దూరపరచును. ఎందుకనగా, కర్పూ రము కేవలము శీతవీర్యముగలది గాన, యవనవయస్సునందు ఉష్ణప్ర కృతిగలవారు తప్ప ఇతరులు కర్పూరమును భక్షించకూడదు.

మరియు చల్లనిఫలజాతులు అనగా వుచ్చకాయ మొదలగునవి యు సమస్త ఆమ్లపదార్థములు, పిత్తమునకు లాభదాయకమగును. మరి యు స్త్రీలు, బాలురు, నపుంసకులు, మొదలగు వీరికి మిక్కిలి శీత ద్రవ్యములువయోగించకూడదు.

## పిత్తశాంతి ఔషధములు.

(1) కుర్సలెవాసీర్ ములియాన్, (2) కుర్సతవాసిర్కాబిజ్, (3) కుర్సా పూర్, (4) చందనవుమర్బతు, (5) ఆలుబకరామర్బతు, (6) బనప్షామర్బతు, (7) కలువపూలమర్బతు మొదలగునవి వుపయో గించవలెను. శీతద్రవ్యములు అగ్రాణించుట లేపనము చేయుటవలన పిత్తముశాంతించును. ఉష్ణము నమసిపోవును.

## కుర్సతబాసీర్ములియూకా చేయుక్రమము

నిశస్తా, తుమ్మజిగురు, తెల్లగసగసాలు, కతిరాగోందు, ఇవిప్రత్యే కము 3½మాషములు. వందిరిదోసగింజలు, సొరకాయగింజలుప్రత్యేకము 9 మాషములు, తురంజబీన్ 1½మాషములు. తవాష్కిరి 1½మాషములు,

ఈవస్తువులు యావత్తుచూర్ణించి, ఇసప్గోలుగింజలగుజ్జులోకల్పి బిల్లలు చేయువలెను. ఈ యౌషధము 4½ మాషములు ఉపయోగించవగును.

### కుర్స్ తబాసీర్ కాబిజ్ చేయువిధానము.

తవాషీరి 14 మాషములు వేయించిన పెద్దపాయలవిత్తులు 7 మాషములు, గులాబిపూలు 24½ మాషములు, శ్రీగంధము, తుమ్మజిగురు. కతిరా, నిశస్తా, శియాభల్లూత్, చుక్కకూరగింజలు వేయించినవి. యష్టిమధుకము పాలు, జరీవ్క్, ఇవిప్రత్యేకము 7 మాషములు గొడ్డుదానిమ్మపూలు, అకాకియా, ఇవిప్రత్యేకము 3½ మాషములు ఈ వస్తువులను చూర్ణించి, వస్త్రగాలితమొనర్చి. శేవురసముతోగాని జరిష్క్రసముతోగాని కలిపి బిల్లలుచేయువలెను ఈ మాత్రి ప్రమాణము 4½ మాషములు.

### కుర్సకపూర్ మాత్రిలు చేయుక్రమము.

కర్పూరము 2 మాషములు, గులాబిపూలు, తురంజ్బీన్ ప్రత్యేకము 35 మాషములు. పందిరిదోసగింజలపప్పు, దోసగింజలపప్పు, తవాషీరి, యష్టిమధుకము, ప్రత్యేకం 17 మాషములు. కాసాలువిత్తులు 24 మాషములు. పెద్దపాయలగింజలు, 21 మాషములు. కాస్నివిత్తులు 7 మాషములు. సొరకాయవిత్తులు 14 మాషములు. యష్టిమధుకం పాలు 11 మాషములు. ఈయావత్తు వస్తువులను చూర్ణించి వస్త్రగాలితమొనర్చి. ఇసప్గోలుగింజల గుజ్జులోకలిప మాత్రలుచేయువలెను. ఈ యౌషధము 7 మాషముల ప్రమాణము పుపయోగించవలెను.

### కలువపూల షర్బతువిధి.

పచ్చికలువపూలు, 20మాషములు. ఒకశేరునీళ్ళలో ఒకరాత్రినానవేసి, పొయిమీదనునిచి, మూడవభాగము మిగులునటులకషాయముకాచిదించి, చేతితోమర్దించి వడియబోసి, 203 మాషములు కలకండచేర్చి, షర్బతువిధిపూర్వకముగా కాచి దించుకొనవలెను. ఇటులనె బనఫ్షాషర్బతు కూడా చేయువలెనని గ్రహించవలెను.

## కఫము చెడుటకు కారణములు.

కఫము చెడుటకు అయిదు కారణములు గలవు. (1) కొంత రుధిరము కఫమందు చేరి పిత్తబలమును మార్చివేయును. దీనిని మధురకఫమందురు. (2) దగ్ధపిత్తము కఫమునందు ప్రవేసించును. దీనిని లవణకఫమందురు దీనిస్వభావికము పిత్తములో సమానముగును. (3) కఫము ఉష్ణత్వమొందిన యెడల దీనిని అమ్లకఫమందురు. (4) కొంత వాతము కఫమునందు చేరిన యెడల దానిని కషాయ (వగరు) ముగల కఫ మనుచున్నారు (5) కఫముపలచబడిన యెడల దానిని చప్పగానుండు కఫమనుచున్నారు. ఈకఫము మిగిలిన నాలుగు జాతులకంటె మిక్కిలిశీతలమైనది. ఇటుల ఆయాకఫముల రుచులనుబట్టి దోషములను తెలిసికొనవలెను..

## కఫమును శుద్ధినొందించు ఔషధములు

సోపు, చిన్నసోపు, యష్టిమధుకము, జీలకర్ర, దాల్చినిచెక్కపలకులు, జరామాంసి, ద్రాక్షవంతు, బుంజాసప్, మొదలగు ఈవస్తువులను ఉపయోగించుటకు వైద్యుని అభిప్రాయమునందు భారమైయున్నది. మరియు కఫవ్యాధియందు కషాయముకాచి ఇచ్చుట ఉత్తమము. మరియు, కఫముకుళ్లినయెడలఉప్పగానుండు కఫమునందు ఉష్ణకర ఔషధములు మాత్రము ఉపయోగించకూడదు. ఎందుకనగా ఇందు జ్వరమధికముగానుండును మరియు నరములలో భాగమునందు కఫము కుళ్లినఎడల కసూంగింజలు ఉపయోగించుట ఉత్తమము, కఫముకుళ్లిన ఎడల పిత్తమునందు చెప్పబడిన ఔషధములు కలిపి యివ్వవలెను.

## కఫమును నసింపజేయు ఔషధములు

మాజూకాఫీలానసా, శొంఠిమాజూకా, మాజూకాసీరి, జవారీష్ జాలినూస్, మొదలగు ఔషధములను కఫముకళ్లక, జ్వరములేకుండిన ఉపయోగించవలెను.

మరియు కుగ్సగుల్, కుర్సగాపిన్, జంజబిన్‌భిజూరి సమసితోష్ణము

గలది. ఉష్ణమగు బిజూరి, షర్బతుబిజూరి, సమశీతోష్ణముగలది. మరియు ఉష్ణమైనదిన్ని, గుల్ ఖందు ఉపయోగించవలెను.

### మాజూన్ ఫిలాసఫా విధానము

మిరియాలు, పిప్పళ్ళు, శొంఠి, దాల్చినిచెక్క, ఉసిరిగెకాయలు తాడికాయలు, చిత్రిమూలము, కచూరములు, చల్ గోజాపప్పు, బాబూనావేరు, సముద్రకొబ్బరి, ప్రత్యేకము $8\frac{1}{2}$ మాషములు బాబూనాగింజలు $17\frac{1}{4}$ మాషములు, ద్రాక్షపండ్లు 105 మాషములు. ఈవస్తువులుచూర్ణించి, ఈచూర్ణమునకు రెట్టింపుతేనెగోకల్పి మాజూన్ చేయవలెను ఈమాజూను ఒకదినము తరువాత ఉపయోగించవలెను.

### శొంఠిమాజూన్ చేయుక్రియము

శొంఠి 70 మాషములు తుమ్మజిగురు, ఏలకులు 7 మాషములు, లవంగములు, దాల్చినిచెక్క ప్రత్యేకము $17\frac{1}{2}$ మాషములు. జాజికాయలు, కుంకుమపువ్వు, ప్రత్యేకము $8\frac{1}{2}$ మాషములు. జాపత్రి $14\frac{1}{2}$ మాషములు. యీవస్తువులు యావత్తుచూర్ణించి, కలకండపాకములో కలిపి మాజూను చేయవలెను.

### జవారిష్ జాలినూస్ విధానము

జరామాంశి, లవంగములు, ఏలకులు, ముద్దలవంగపట్ట, దాల్చినిచెక్క, శొంఠి, సల్లజిలకర్ర, కుంకుమపువ్వు, తెల్లమిరియాలు, పిప్పళ్ళు చంగల్ వకోష్టు, తుంగముస్తలు, వూదెబల్ సాను, వేపివిత్తులు, గ్రంధితగరము, నేలవేము, ఈవస్తువులు, ప్రత్యేకము తులమున్నకి 5 తులములు యీచూర్ణములకు సమానభాగము శక్కరచేర్చి, పైవస్తువులను చూర్ణముచేసి మొత్తమునకు రెట్టింపు తేనెగోకల్పి మాజూనుచేసి 7 దినములతరువరి 7 మాషములు పుచ్చుకోవలెను.

### కుర్సగుల్ చేయువిధానము.

తవాషీరి, పాచితీగె, జరామాంసి, ప్రత్యేకము 7 మాషములు. తురంజ్ బీన్ $10\frac{3}{4}$ మాషములు. గులాబిపూలు, యష్టిమధుకము, ప్రత్యే

కము 10 మాషములు. యీవస్తువులను చూర్ణించి వస్త్రగాలిత మొనర్చి వన్నీరుతో మాత్రలు చేయవలెను. ఈ మాత్రప్రమాణము 3 మాషములుగాని, మూడుమాషములకంటె అధికముగా గాని పుచ్చుకొనవలెను.

## వాతము చెడుటకు కారణములు.

వాతము అయిదు కారణములవలన చెడిపోవుచున్నదని ప్రాచీనవైద్యులు వచించియున్నారు. (1) వాతాధిక్యమువలన, (2) వాతము దగ్ధమొందుటవలన, (3) రక్తమొంది వాతముగా మారుటవలన, (4) పిత్తముదగ్ధమొంది వాతముగా మారుట, (5) కఫముదగ్ధమై వాతముగామారుట మొదలగు ఈ అయిదు కారణములవలన వాతముచెడిపోవునని గ్రహించవలెను.

మరియు ఏదైన ఒకదోషము దగ్ధమొందిన ఎడల చెడువాతముగా మారునని తెలిసికొనవలెను. అనగా దగ్ధమగుటవలన చెమ్మ దాని పూర్ణమువలన లేచిపోయి చిక్కబడును. మరియు దానిసారముండనేరదు. అనగా దగ్ధమై భస్మమైన మరికొన్ని దోషములు జలుబువలన చిక్కనై పేరుకొని యుండును ఇది వాతమనిపించనేరదు.

## వాతమును నశింపజేయు ఔషధములు.

విహిసాడ, గౌజుబాన్, ఖరబూజావిత్తులు, యష్టిమధుకము, దూసగొండివిత్తులు, ఇస్తిరు, దాక్షపండ్లు, మొదలగునవి.

మరియు ఉష్ణము, చెమ్మకలిగించునట్టి వస్తువులను ఉపయోగించవలెను మరియు వాతము, ఉష్ణమువలన కలిగిన ఎడల శీతలము, చెమ్మగల అవుషధమును ఉపయోగించవలెను. అనగా పెద్దపాయలు, బెదానా, పందిరిదోసవిత్తులు మొదలగునవి.

మరియు వాతము, ఉష్ణసంబంధముగానిచో ఉష్ణము, చెమ్మగల వస్తువులు అనగా సమత్వమొందించునట్టి వస్తువుల నుపయోగించవలెను

## వాతము విషయమై చెప్పబడిన ఔషధములు.

శికింజబీన్ అప్తీమూని, నౌసాదారు, మాజూనెబుకరాత్,

యాఖూతిబూఅలి, ముక్రహ్ దిల్ ఖుస్, గాజుబాన్ షర్బత్, బాదరంజబోయాషర్బతు, మొదలగునవి ఉపయోగించవలెను. మరియు ప్రతివిషయములో ఉష్ణము, జలుబు, కలిగించవలెను.

మరియు ఈవాతము కుల్ని, జ్వరముకలిగినచో ఈక్రిందివస్తువుల కషాయము ఉపయోగించవలెను. కాసినివిత్తులు, కషూంవిత్తులు, ప్రత్యేకము మూడుదిరములు (దిరం అనగా 3½ మాషములు.) యష్టిమధుకము, జంష్ము, ప్రతివస్తువు రెండేసిదిరములు, గాజుబాన్ 5 దిరములు, ఈవస్తువులకషాయముకాచి, కలకండచేర్చిగాని, శికంజబీన్ చేర్చిగాని పానముచేయవలెను. ఈకషాయమునకు పూర్వము మునజిజ్ (దోషపక్వకార్యదము) ముపయోగించి విరోచనము చేయించిన ఎడల వెంటనే గుణము కలిగించును. వాతరోగమునందు విశేషకాలమువరకు ఔషధప్రయోగము చేయుచుండవలెను. అనగా వాతము నెమ్మదిగా ఔషధగుణమును గ్రహించును.

మరియు కుల్నినవాతము యొక్క ఔషధములు, ఉపాయములు, జ్వరరోగములందు చెప్పబడును.

### శికంజబిన్ అప్తిమూన్ విధానము.

ఉస్తెఖుద్దూస్, శొంఠి, చాతరాసి, ప్రత్యేకము 7న్నర మాషములు, పాచితీగె బిస్పాయజన్, సునామ ఖికకు, కాబోలికరక్కాయలు, ప్రత్యేకము 3న్నర మాషములు ఈవస్తువులు యావత్తు 135 మాషములు శెనగవులుసులో వేసికాచి వడియబోసి అర్ధసేరు శర్కరచేర్చి తీసిపాకముగాకాచి యుంచవలెను.

### నౌసదారు అను ఔషధవిధానము.

గులాబిపూలు 21 మాషములు, సాదకూపి 17న్నర మాషములు, లవంగములు, మస్తకి, గంధితగరము, జటామాంసి, ప్రత్యేకము 10న్నర మాషములు, జాపత్రి, చిన్నఏలకులు, పెద్దఏలకులు, జాజికాయలు, ముద్దలవంగపట్ట, కుంకుమపువ్వు, ప్రత్యేకము 7 మాష

ములు, ఈవస్తువులు చూర్ణించి యుంచవలెను. పచ్చిఉసిరిగెకాయలు, మూడు అహోరాత్రులుపాలలో నానవేసి ప్రతిదినము పాలుమార్చుచు మూడవదినము నీళ్ళతో కడిగి పరిశుభ్రమగు ఉదకములో వేసి మెత్తగా వండి బట్టలో వేసి నీళ్ళుయావత్తు పిండివేసి, తరువాత, ఆకాయలునూరి అందుండి ఒకశేరు తీసికొని, తేనెలోగాని, పటికిబెల్లముపాకముచేసిగాని, వేసివండి పైచూర్ణమును అందుచేర్చి గాజుపాత్రయందు నలుబది దినములవరకుయుంచి, తదుపరి 3న్నర మాషములు మొదలు 10న్నర మాషములవరకుపయోగించవలెను ఈయౌషధబలము రెండుసంవత్సరములవరకు స్థిరముగానుండును.

### పర్బత్ గౌజుబాన్ విధానము.

పచ్చిగౌజుబాన్‌రసముతీసి, తెల్లశర్కర సమానముగాతీసికొని కలిపికాచి పైపొంగుతీసివేసి 40 మాషములు పన్నీరుచేర్చి పాకవిధిగా తయారుచేసి యుంచవలెను. బాదరంజబోయాపర్బతుచేయు విధానము కూడా యిటులనే చేయవలెనని గ్రహించవలెను.

### ముఫర్రిహాదిల్‌ఖుస్ విధానము.

పగడమూరు, కహరోబా, సల్‌కిమూర్, కమూరము, ప్రత్యేకము 3న్నర మాషములు 7న్నర మాషములు పచ్చిసాంబ్రాణి, కాబోలుకరక్కాయలు, పిస్తా, మాదీఫలపుకాయపై బెరడు, కత్తిరించిన పచ్చిపట్టు, ముత్యములు, ప్రత్యేకము 7 మాషములు, ధనియాలు, తవాషీరి ప్రత్యేకము 10న్నర మాషములు, బహామనెసుపెద్, బహామనెసురకు, ప్రత్యేకము 7న్నర మాషములు, గౌజుబాన్, చాతరాసి, బాలంగు, యీవస్తువులు చూర్ణించి వస్త్రగాలితమొనరించి దానిమ్మకాయరసము చుక్కకూరరసము, జరిష్కురసము, ప్రత్యేకము 35 మాషములు తీసికొని తెల్లశర్కర, బనప్‌షాషర్బత్తు ప్రత్యేకము 405 మాషములు చేర్చి పాకంబట్టి దించుకొని పైచూర్ణములనుచేర్చుకొని మాజూన్ చేయవలెను.

## దోషపక్వ ఔషధములు.

దోషపక్వఔషధములను సేవించుటవలన అపక్వమేము పక్వ మొందును. మలముపక్వ మొందించుటవలన ప్రయోజనమేమనగా చిక్కగానుండు మలము పలచగామారును. పలచగానుండు మలము చిక్కబడును. రుధిరసంబంధమగు రోగము లందు దోషపక్వఔషధములు ఉపయోగించకూడదు. గాని రక్తము నందు మలదోషముచేరి యుండినచో ఈఔషధములు లాభదాయకమగును ఈఔషధములను మంచిసాయని వుపయోగించుచున్నారు.

## పిత్తముకు పక్వ మొందించు ఔషధములు.

ఉన్నబ్ 7కాయలు, బనప్షాపూలు, కలువపూలు, శాతరాసి, గులాబిపూలు, ప్రత్యేకము 2 దిరములు, కాసినిపిత్తుము, 3 దిరములు నీళ్ళలోగాని అర్కములోగాని, నాలుగుఝామములుగాని. లేక ఎనిమిది ఝాములుగాని నానవేసి వడియబోసి శికింజబిన్ గాని, తురంజ్‌బిన్ కలిపిగాని లేక మరియేమైనగ్బతుగాని చేర్చిపానముచేయవలెను. ఈ వౌషధము పిత్తమును పక్వపరచును. ఈవస్తువులు నీళ్ళలోవేసి కషాయముకాచుట వలన, కషాయమనబడును. కాచునట్టి కషాయమునందు ఉష్ణము ప్రవేశించును. మరియు ఉష్ణాధిక్యముగానుండురోగికి కాచిన కషాయ ముపయోగించకూడదు. శీతకషాయమనగా వస్తువులను నలియగొట్టి రాత్రి నీళ్ళలోవేసి ప్రాతఃకాలమునందు వడయబోసి పానముచేయవలెను.

మరియు చల్లనిగింజలు ప్రత్యేకముగా రసముతీసి ఉపయోగించవలెను. పైనచెప్పబడినగింజలు, తైలములు, మొదలగునవి యౌవన వయస్సుగలవాని విషయమైచెప్పబడినవి. కాబట్టి రోగి బాలుడైనచో వస్తువులను తగ్గించవలెను. మరియు పిత్తము మూడుదినములలో పక్వ మొందును. ఈపిత్తమునందు ఇతరదోషములు చేరకుండా యుండవలెను. ఇతరదోషములుచేరియుండినచో అయిదులేక అధికదినములకుగాని పక్వ మొందదని గ్రహించవలెను.

### కఫదోషపక్వౌషధములు

ద్రాక్షపండ్లు, 5 కాయలు, నలియగొట్టినసోంపు, రెండుదిరములు సోంపుకుబనులు, చిన్నసోంపు చేర్చుట ఉచితము. అతిమధురము, మూడు దిరములు, నలియగొట్టిన ముబకాయలు 2 దిరములు, రాజహంస, 5 దిరములు, పచ్చని అంజూరపండ్లు, 5 కాయలు, గులాబిపూలు, 3 దిరములు, ఈవస్తువులు యావత్తు నీళ్లలోవేసి కషాయముగాచి 7 దిరములు తేనెతోచేసిన గుల్ఖందుచేర్చి వడియబోసి పానముచేయవలెను. ఇందురెండు తులములు శికంజబీన్ కలుపుటమంచిది. ఈరోగికి దగ్గుయుండినయెడల శికంజబీన్ కలుపకూడదు. ఉప్పనిశ్లేష్మమందు పిత్తము, కఫము, పక్వమొందించునట్టి ఔషధము లుపయోగించవలెను.

### దోషసంయోగ పక్వౌషధములు

వాతము మొదలగు దోషములు కలిసియుండునట్టి శ్లేష్మమునందు జ్ఞాపకముంచవలసిన అంశములు.

శెనగకట్టు, కఫ వాతములను పక్వపరచుట యందు ఉత్తమమైనదిగాని జ్వరసమయమునందు మాత్రము ఉపయోగించకూడదు. జ్వరము పురాణగతమైనచో లాభదాయకమగును. మరియు కఫము చిక్కగానుండిన 9 దినములలో పక్వమొందును. మరియు కఫము చిక్కగాగాని పలచగాగానియుండినచో 6 దినములలోగాని లేక 9 దినములకంటె అధికదినములలో పక్వమొందును.

### వాతజదోషపక్వౌషధములు

విహీసోడా, (శ్లేష్మాంతకము) కాయలు 20, ఉన్నాబ్ 10 కాయలు, గావుజబాన్, బాదరంజబోయా, ఉస్తెఖుద్దూస్, రాజహంస, సోంపు, శాతరాసి, ఈవస్తువులను ప్రత్యేకము రెండేసి దిరములు, నీళ్లలోవేసి కషాయముగాచి శర్కరగాని, లేక తురంజబీన్గాని, గుల్ఖందుగాని పానముచేసిన ఎడల కేవలము వాతములను పక్వమొందును.

మరియు వాతము ఇతరదోషములు దగ్ధమొందుటవలన ఉత్ప

న్నమైనచో ఆదోషములను పక్వమొందునట్టి ఔషధములు కొద్ది కొద్దిగాచేర్చి ఉపయోగించవలెను. కేవలము వాతము 15 దినములలో ఒకటి రెండుదినములు ముందు వెనుక పక్వమొందును. పక్వమొందుటకు తాత్పర్యమేమనగా మలము, విరోచనబలమువలన వెడలిపోవును. మరియు, పక్వకౌషధములయొక్క సారము మలమునందు ఆవశ్యముగా ప్రవేశించును. ఇటువంటి రోగములయందు మలము చిక్కగాయుండును. గాన పక్వౌషధములు, పలుమారుపయోగించుచు విరోచనము చేయించవలెను. మరియు, పక్వౌషధములవలన ప్రయోజనము కలుగకుండిన విరోచనఔషధము లుపయోగించకూడదు. ఒక్కొకప్పుడు పక్వౌషధములు ప్రయోగించనిదే మలము పక్వమొందు, చికిత్స చేయకనే రోగముశాంతించును. కాబట్టి ఉపాయమువలన రోగిహృదయమునకు సహాయము కలిగించుచున్నవని గ్రహించబడుచున్నది.

## విరోచనము ముల్యాన్ విషయము.

విరోచనమనగా, నరములనుండి మలమును దూరమునుండి ఈడ్చి ఆమలమును ఒకేస్థలమందుంచి మలమూత్రముల ద్వారాగాని, చెమటద్వారాగాని వెడలించుటకు విరోచనమనుచున్నారు. ములియాన్ అనగా కేవలము మలము ప్రేగులనుండియు, కడుపునుండి వెడలించును. విరోచనమునకు ముందు దోషపక్వకషాయాదు లుపయోగించుట అవశ్యకము.

ములియాన్ యందు. మలపక్వౌషధము లుపయోగించనవసరముండదు. అయినను, ములియాన్ కంటెముందు మలపక్వౌషధము లుపయోగించుటమంచిది.

—ములెయన్ మ. బారిక—

ఇదిబాహ్యాంతర వ్యాధులనేకములకు లాభదాయకము. ఇది గర్భిణీస్త్రీలు, బాలురు, వృద్ధులు, కూడా పానముచేయదగును గాని

జ్వరరోగులకు మాత్రముపయోగించకూడదు. లోఅంగములవాపునందు కూడా బాధకరము. మరియు, సమస్త విధముల మలము హరించుటయం దుపయోగించును.

రేలకాయగుజ్జు, పన్నీరులోగాని, ఉష్ణోదకములోగాని, కలిపి వడియబోసి పానముచేయవలెను. ఉష్ణముఅధికముగా నుండిన కాసినిరస ముగాని లేక చల్లని స్వభావికముగల గింజల రసముగాని అందుచేర్చి పానముచేయవలెను.

మరియు, కడుపులోభాగమునందు వాపు కలిగియుండినచో కామంచాకు రసముచేర్చి పానముచేయవలెను. సోపుగింజలరసము గుల్కందుకల్పి పానమొనరించిన వాతగుల్మము హరించును. రేల కాయదుర్వాసనహరించుటకు పన్నీరుగాని, సోపుగాని, చేర్చుటమంచిది. మరియు, ఈరేలకాయను మిక్కిలి ఉత్కృష్టముగా చేయదలచినచో అసలిసీరఖిస్తమాదిఫలరసాయనము చేర్చవలెను.

ఉన్నాబ్, శ్లేష్మాంతకము, బనప్షాపూలు, ద్రాక్షపండ్లు, గౌజుబాన మొదలగు వస్తువులను కషాయముకాచి దించి అందు రేల కాయగుజ్జు కలిపి పానముచేయుట మంచిది.

మరియు, ప్రేగులందు బలముతక్కువగానుండి, నులినొప్పి కలి గిన ఎడల బాదంనూనె చేర్చవలెనుగాని, ప్రత్యేకము రేలజిగురు యివ్వకూడదు. బాదంనూనెచేర్చి గర్భిణిలకు, వృద్ధులకుకూడా ఉప యోగించదగును. క్షీరపానులగు బాలురకు బాదంనూనె చేర్చ నగత్య ముండదు. ఎందుకనగా పాలు త్రాగుటవలన ప్రేగులు స్నిగ్ధముగా నుండును. గాన రేలకాయగుజ్జు ప్రేగులకు అంటుకొనజాలదు. మరియు, యుక్తయౌవనవయస్సుగల వారికి 16 దినములు రేలగుజ్జు ఉపయోగించ వచ్చును. దిరమనగా 3½ మాషములు. యింతకంటె అధికము ఉపయో గించుట హానికరమగును.

## విరోచనవర్ణనము.

గొప్ప అవసరముకలిగి విరోచనము చేయింపవలసిన యెడల మందుగా పక్వౌషధములను ఉపయోగించదగదు. అనగా కూలంజ్ నొప్పి యందు రాత్రిభాగము మేఘము క్రమ్మినప్పుడు వర్షమునందున్న మిక్కిలిగాలి యుండునప్పుడు కూడాగమనించక ఈ విరోచన ఔషధమును కాచిగాని, నానవేసిగాని పానము చేయవలెను. తదుపరి ఉష్ణోదకమును పానముచేయకూడదు. ఇటుల చేయుటవలన ఔషధగుణము తగ్గిపోవును. మరియు, ఈవిరోచన ఔషధము కడుపునొప్పి కలిగించిన ఎడల ఉష్ణోదకము పానముచేయవచ్చును.

మరియు, విరోచన ఔషధము మాత్రగాని, చూర్ణముగాని అయినచో ఉష్ణోదకపానమువలన విరోచనములగును. విరోచనఔషధము సేవించిన పిమ్మట దాహమైనచో శీతజలపానముచేయుకూడదు. గాన ఉష్ణోదకము కొద్దిగా పానముచేయుట మంచిది. ఉష్ణప్రకృతి గలవారు శీతజలపానము చేయవలెను. దీనివలన హాని కలుగనేరదు. ఉష్ణోదకపానమువలన ఔషధబలము తగ్గిపోవును.

మరియు, సక్బతుజరిష్క్ మొదలగు విరోచన ఔషధములందు సేపాళములుగాని, తెగడగాని, ఉప్పు మొదలగునవి చేర్చిన ఔషధములు శీతజలమువలన బలముతగ్గు ఔషధములని భావము. మరియు, ఏమనుజునికి ఔషధము చక్కగానిచేయదో అట్టివాని భుజములు రెండును బిగించికట్టవలెను. ముక్కుపట్టుకొని ఔషధపానముచేయవలెను. తదుపరి పుక్కిలించవలెను. ఔషధపానముచేసిన తరువాత పొదినాఆకు వాసనచూచుట నమలుట, తమలపాకులు, ఏలకులు నమలుట మంచిది. ఇట్లుచేయుటవలనకూడా వాంతిభయమున్న యెడల విరోచనమునకు ముందు వాంతిచేయించి, పిమ్మట విరోచనఔషధ మివ్వవలెను. మరియు, విరోచనఔషధము సేవించి నిద్రించకూడదు. గుదప్రక్షాళన

మునక్కై రేశాఖరమి వేసి కాచిన గోరువెచ్చని కషాయము ఉపయోగించవలెను.

మరియు, విరేచనము కానుండిన ఆదినమే ఇతర విరేచన ఔషధము లివ్వకూడదు. మరియు, వసియబోసిన ఆల్ బకరారసముగాని, చింతపండురసము (చారు) గుల్ ఖందు, మాదిఫలరసాయనము కొద్ది కొద్దిగా విరేచనఔషధము పుచ్చుకున్న పిమ్మట పానము చేయవలెను. ఇంకను రేలకాయజిగురుకూడా చేర్చుటమంచిది. ఇటులనె మస్తకిచూర్ణము $1\frac{1}{2}$ దిరము శర్కరగాని, కలకండగాని కలిపి, ఉష్ణోదకముతో పుచ్చుకొనట ఉత్తమము.

మరియు, విరేచన విశేషత్వమువలన మూర్ఛ కలిగినచో వెంటనే వమనము చేయించవలెను. వమనమువలన లాభము కలుగకుండిన ఇతర అసందర్భములేమియు లేకుండిన తక్షణమే బాసలికుఅనుశిర, అంహాల్ అనుసిరలను భేదించి రక్తమోక్షణము చేయించవలెను.

మరియు, కడుపునందు, ప్రేగులందు ఉష్ణము అధికముగా నుండినచో బేదానా, ఇసప్ గోల్ గింజల గుజ్జు (జిగురు) పానముచేయించవలెను, మరియు, రోగిప్రకృతి సమానముగా నుండిన సోపు, షర్బతు పన్నీరులోచేర్చి పుచ్చుకోవలెను. ఒకఘడియ తరువాత ఉష్ణభోజనములు భుజించవలెను. చెడువిరేచనము శిరావేదనవలన గొప్పహాని ప్రాప్తించును. కాబట్టి రోగిబలానుసారముగా రెండవ విరేచనఔషధ మివ్వవలెను. దీనివలన వెడలవలసిన మలము వెడలిపోవును. రోగిదుర్బలముగా నుండిన కొద్ది కొద్దిగా విరేచనఔషధము పానముజేయవలెను. అనగా లఘువిరేచనము చేయించవలెను. ఇటుల మూడు దినముల కొకపర్యాయము విరేచనము చేయించవలెను.

మరియు, విరేచనఔషధము వలన విశేషవిరేచనములయినచో కట్టించవలెను. జ్వరములేకుండిన మజ్జిగ, వరిఅన్నము భుజించవలెను. జ్వరముండినచో వేయించినసోపు, వేయించినపెద్దపాయలవిత్తులు చూర్ణించి, బార్

లింగ్, రసముతో పానము చేయించవలెను. విరోచనప్రకరణమునందు చెప్పబోవు నుపాయములను చేయువలెను.

### పిత్తజవిరోచన ఔషధములు.

కరక్కాయబెరడు, చింతపండు, మాదీఫలము. బనఫ్షాపూలు, అఫ్సంతీన్, సకమోనియా, వేయించిన ఇసకపేచావిత్తులు, ఆలుబకరా, చాతరాసిఆకు, మసాంబరము. గులాబిపూలు, శీరఖిస్త, ఈచెప్పినవస్తువులలోనుండి బలిష్టమగు వస్తువునుగాని దుర్బలవస్తువును ప్రత్యేకము ఉపయోగించవలెనో గమనించి, ప్రత్యేకముగా గాని రెండేసి వస్తువులుచేర్చిగాని యుపయోగించవలెను ఈవస్తువులలో సకమోనియా మాత్రము వేయించి ఉపయోగించవలెను.

### పిత్తమును వెడలించు ఔషధములు

కరక్కాయబెరడు 6 దిరములు, నల్లఅలూబకరా 25 కాయలు, విహాసొడా (శ్లేష్మాంతకము) 20 కాయలు సునాముఖిఆకులు, శాతరాసి ఆకు ప్రత్యేకము 3 దిరములు, ఉన్నాబ్ 8 కాయలు, కాస్నివిత్తులు 2 దిరములు, కుసుంబావిత్తులు 1½ దిరములు, శీరకిస్తగాని, తురంజబిన్‌గాని, 1 దిరముమొదలు 15 దిరములు ఈవస్తువులను కషాయము కాచిగాని నీళ్ళలోనానవేసిగాని పానముచేయించవలెను. దీనివలన విరోచనములు పక్వముగాకుండిన ఈకషాయమునందు రేలకాయగుజ్జు చేర్చవలెను. రేజిగురు చేర్చినపుడు బాదంనూనె బనఫ్షాతైలము ఒకదిరముచేర్చవలెను. మరియు ఔషధము హెచ్చించుట తగ్గించుట వైద్యుని అభిప్రాయముపై భారమైయున్నది.

మరియు విరోచన ఔషధములకే జాతిమలమును వెడలించునట్టివి కావు. అయినను యేమలమును విశేషముగా వెడలించునో ఆపేరుతో ప్రసిద్ధమైనది. జ్వరమునందు కషాయముకంటె పూర్వము కరక్కాయ చూర్ణముపయోగించకూడదు. ఎందుకనగా అప్పటిస్థితియందు వాతము గామారును. అనగాయకృత్ సంబంధమగు అతిసారముకలుగలదు, ఒక

వ్వుడు కరక్కాయచూర్ణముపయోగించవలసిన అవశ్యముకలిగినచో బాదంనూనెతో స్నిగ్ధపరచి, బేదానాగుజ్జుతోగాని, ఇసప్ గోలుగింజల గుజ్జుతోగాని, కలిపి పానముచేయుటవలన హాని సంభవించనేరదు.

### కఫజవిరోచన విధానము

మహానిభ్మకాయ బెరడు. కంకురియూక్, గారిఖూక్, మాహిహాజజ్, తెగడ నీలివిత్తులు, నల్లజీలకర్ర, శుకాయి, కాటుకవిత్తులు, మొదలగునవి.

### కఫజవిరోచన ఔషధములు

అయారజ్ పైకరా, తెల్లతెగడ, నీలివిత్తులు, ప్రత్యేకము ఒక్కొకదిరము, గారిఖూన్, చిన్నసోపు 2 దిరములు, ఉప్పు, మహానింబ్బకాయలబెరడు ప్రత్యేకము $1\frac{1}{2}$ దాగ్ ఈవస్తువులు యావత్తు చూర్ణించి సోపురసముతోనూరి ఒకమాత్ర చేయవలెను. ఇదిఒకమోతాదు. ఈమాత్ర యుక్తయవన పురుషుల నిమిత్తము చెప్పబడినది.

గారిఖూక్ నూరకూడదు ఇందులో ఒకవస్తువు గోరువలె నుండును. దానిని నూరుటవలన విషతుల్యమగును. కాబట్టి దానిని నూరి, వెంట్రికల జల్లెడతో జల్లించవలెను. దీనివలన మెత్తనిపీసు వెడలిపోవును.

(2) ఉన్నాబ్, విహాసోపా 20 కాయలు, ఎంముజూహా, కలువపూలు, బనప్ షాపూలు, రాజహంస, సోపు, యీవస్తువులు ప్రత్యేకము 3 దిరములు దాక్షపండ్లు, 15 కాయలు, అజూరపండ్లు 7 కాయలు, చివ్వినయష్టిమధుకము 4 దిరములు ఇందులో చితకగొట్టవలసినవస్తువులు చితకగొట్టి మూడురతులు నీళ్లలోవేసి ఒకరతిశేషించువరకు కషాయముకాచి దించుకొనివడియబోసి రేలకాయగుజ్జు, మాదిఫలరసము, గుల్ ఖందు 10 దిరములుకలిపి చేతితోమర్దించి వడియబోసి అందుఒక దిరం బాదంనూనెకలిపి పాకముచేయవలెను.

### కఫవిరోచనచూర్ణము.

మూడుదిరములు తెల్లతెగడచూర్ణము బాదంనూనెతో సిద్ధపరచి

1 దిరము శొంఠిచూర్ణము, తెల్లవుప్పు, అర్ధదిరము సీకోదకముతో ఉప
యోగించవలెను. ఉప్పుశబములు యావత్తుచూర్ణమునకు సమానభాగ
ము శర్కరచేర్చుటవుంచిది, మస్తకి జేర్చుటకూడా వుత్తమము.

### సకమోనియా శుద్ధిక్రమము.

సేపుకాయగాని, బేదానాకాయగాని, దొలిసి అందులో సక
మోనియాయుంచి దీనికి కిందపైన మస్తకిచూర్ణమువేసి కాయబందిం
చి వస్త్రముచుట్టి మన్నులేపనముచేసి ఒకమట్టిపాత్రయందుంచి పుట
ముగాని పొయ్యిమీదనుంచిగాని ఆకాయ కాలి కాలకుండతీసి చల్లారిన
వెనుక సకమోనియాతీసి ఉపయోగించవలెను.

### వాతమును వెడలించు ఔషధములు.

కాబోలుకరక్కాయలు, నల్లకరక్కాయలు, సునాముఖి, బొడర ౙ
బోయ, పాచితీగె, ఉస్తెఖద్దూస్, శుద్ధిజేసిన రాజావర్తము. (నీలిరంగు
గలరాయి) హాజరుఅర్మని, (శీమకావిరాయి) ఉసిరిగెకాయలు.

### వాతవిరోచనఔషధములు.

యాజ్ఫైకరా 5 దిరములు, పాచితీగె 10 దిరములు, శుద్ధిజేసి
న రాజావర్తము 7 దిరములు, శీమకావిరాయి 9 దిరములు, వేయించిన
సకమోనియా, మహానింబ్బకాయలబెరడు, కాలిఖర్ బల్ రెండేసిదిరము
లు సంబుల్ తీబ్, చిన్నసోపు, ప్రత్యేకము ఒక్కొకదిరములు ఈవస్తువు
లు యావత్తుచూర్ణించి వస్త్రగాలితమొనర్చి అజామోదంరసముతోనూరి
మాత్రలుజేయవలెను. ఈఔషధము 2న్నర దిరమువరకు ఉపయోగించ
వలెను.

### రాజావర్తము శుద్ధిక్రమము.

రాజావర్తము మెత్తగానూరి నీళ్ళలోవేసి వుడికించి అందు జై
తూన్ తైలము కొద్దిగాజేర్చి వంచివేసి తదుపరి విశేషజలముపోసి మరి
యొకపాత్రలో వంచుకొనవలెను. యిటులరంగునీళ్ళుయావత్తు వంచు
కొని మూతమూసియుంచవలెను. ఆపాత్రయందు నీరుతేరిరాజవర్తము

అనుగునందు పేరుకొనియుండును. ఆసీళ్లుమెల్లగా వడ చివేసి ఎండించి ఔషధ ములం దుపయోగించవలెను. ఇటులనే అన్ని విధముల జేగురురాళ్లను శుద్ధిచేయువలెను.

(2) పిండికరక్కాయలు 2 తులములు 1 మాషము. బిస్పాయు జ్ 1 తులము న్నర మాషములు. పాచితీగె 2 తులముల 7 మాష ములు. సురాముఖి 2 తులముల 4 రతులు ఉస్తెఖద్దూన్ 2 తులముల 4 రతులు గులాబిపూలు 1 తులము 2 మాషములు. గౌజబాన్ 10½ మాషములు. బాదరంజబోయా 10న్నర మాషములు. చిన్నసోపు 7 మాషములు పెద్దసోపు 7 మాషములు నల్లకటుకరోహిణి 2 దాగులు తెల్లతెగడ 3న్నర మాషములు, శొంఠి 1 4/3 మాషములు. ఈవస్తువులు యానత్తు కషాయముకాచి అందువస్త్రగాలితమొనర్చిన గారిఖూకొచూ ర్ణము శీమకావిరాయి నమల్నిఫతి కషాయముకాచునప్పుడు వస్త్రేక 2 దాగులు కలిపివడియబోసి పానముజేయువలెను.

మరియు, విశేషబలము కలిగించవలెననినచో మహానింబ్బ శాయబెరడు సకమోనియా అధికముగా చేర్చవలెను. ఈకషాయమువాత సంబంధముగు వ్యాధులందు ఉపయోగముగానుండును. ఈ కషాయము లో ఆకాశవల్లి చేర్చే యెడల బట్టలోమూటకట్టి కషాయము దించు కొనుటకు ముందు వేయువలెను. వెంటనేదించి వడియబోసి పానము చేయువలెను.

# వమనకల్పము

## వమనముచేయు వస్తువులు.

ముందుగా వానిప్రయోగములను వర్ణించబడుచున్నవి. వమనమునకు ముందుగా అత్యావశ్యకమని గ్రహించవలెను. వమనము చేయించవలసిన అగత్యము కలిగినయెడల ఒకదినము ముందుగా మృదు భోజనములు భుజించి ఉష్ణము మొదలగు ద్రవపదార్థములు లేకుండిన సుగంధతైలములను శరీరమునకు మర్దించి వమనము చేయించుటకు ముందు వరిబియ్యము, పెసరకట్టు భుజించి కొంతసేపటివరకు సావధానముగాయుండి తదుపరి వమనముచేయునట్టి వస్తువులను పానముచేసి వమనము చేయవలెను. మరియు, శరీరమునందు చెమ్మగలవారికి పెసరపప్పు, బియ్యముతో జేసినగంజి యివ్వవలెను. మరియు, కఠినముగా వమనముగువానిని మూడేసిదినములు ఉష్ణప్రదేశమునందుంచి దేహముపై తైలము మర్దించి మారు మారుభోజనముచేయించి వమనముచేయించవలెను. వమనము చేయునప్పుడు సమత్వముగా కూర్చుండవలెను. కడుపు నడుము అణుచుకొనవలెను. అనేకులు నిలుచుండియే వమనము చేయుదురు. ఇట్లు చేయుటవలన కడుపు అధోభాగమునందు మలముకూడా వెడలుచున్నది. మరియు, వమనము రెండుపర్యాయములు ఆలస్యముగా యివ్వవలెను. ఇట్లువమనము చేయుటవలన గర్భము మిక్కిలి దుర్బలమొందును. తదుపరి, ఉష్ణమునందు ఉష్ణప్రకృతిగలవారు శీతజలముతో కాళ్ళు చేతులు ప్రక్షాళనము చేయవలెను. ఉష్ణోదకమునందు శికేంజ్ బీగాని, తరువాణిగాని కలిపి పుక్కిలించవలెను. దీనివలన నోటియందుండు మలము వెడలిపోవును

మరియు, శీతాకాలములో చల్లనిప్రకృతిగలవారికి కాళ్ళు, చేతులు, ముఖము ఉష్ణోదకముతో ప్రక్షాళనము చేయవలెను. తేనె, శికింజ్‌బీన్ కలిపి పుక్కిలించవలెను. పిమ్మట మస్తకి 3½ మాషములునూరి శర్కరచేర్చి పుచ్చుకొనవలెను. శర్కర, శేవు, అరఖులో పానము చేయించవలెను. మరియు, మస్తకి బదులు గుల్‌ఖందు, ఇత్రిఫల్ సగీర్ ప్రయోగించవచ్చును.

మరియు, ఔషధముల తీక్ష్ణత్వము వలన యెక్కుళ్ళు వెడలనారంభించినచో, ఉష్ణోదకమును కొద్దికొద్దిగా పానముచేయవలెను. తుమ్ముకలిగించు వుపాయములను చేయవలెను. మరియు, వమన అంతమునందు రొమ్ము ప్రక్కలయందు పీడకలిగి కడుపుబ్బు తటస్థించిన యెడల గుల్‌రోగన్‌గాని, బాబూనాతైలముగాని మర్ధించి ఉష్ణోదకమును ధారగాపోయవలయును. మరియు, వమనముచేయించుట అత్యావశ్యకమైనచో, ఇందుదహరించిన అంశములను స్వీకరించక తక్షణమే వాంతి చేయించవలయును. విషభక్షణమునందు వాంతిచేయించ వలసినచో విషము గర్భమునుండి సాంతముగ వెడలిపోవునటుల వెంట వెంట వమనము చేయించవలసినదేగాని సందర్భములను గమనించకూడదు.

—పిత్తమునువమనముద్వారా వెడలించు ఔషధములు.—

సికింజ్‌బీన్ ఖుద్ది, 20 మిస్కాలు, పాలక్ అరకు 40మిస్కాలు, యవకషాయమునందుగాని, ఖుబ్బాజీకషాయమునందుగాని కలిపివెచ్చచేసి, పానముచేయవలెను.

—కఫమును వమనముద్వారావెడలించు ఔషధములు.—

ముల్లంగివిత్తులు 7 మాషములు, సోయివిత్తులు 7న్నర మాషములు, సముద్రలవణము 2½ మాషము యీవస్తువులను చూర్ణించి వస్త్రగాలితముచేసి, తేనెలోకలిపి పుచ్చుకొనవలెను. దీనివలన వమనము తనంతటవెడలనారంభించును. అట్లువెడలకుండిన, ఉష్ణోదకము పానము చేయవలెను.

మిస్కాల్ అనగా 1½ మాషములని కొందరి మతము. మరికొందరు 4½ మాషమనికూడా వచించుచున్నారు.

—వాతమును వమనముద్వారా వెడలించు ఔషధములు.—

ముల్లంగిదుంప వొల్చి, అందుకటుకరోహిణిచూర్ణముంచి, ఒక అహోరాత్రి సికింజబీన్ లో నానవేశి, ప్రాతఃకాలమునందుతీసి బక్షించవలెను. పిమ్మట, సికింజబీన్ అలసందకట్టులో కలిపిపానము చేయవలెను.

—కఫపిత్తములను వమనము ద్వారా వెడలించు ఔషధములు—

యష్టిమధురము 5మిస్కాలు, సోయివిత్తులు 5మిస్కాలు, ఖర్బూజవిత్తులు, యవలు, యీవస్తువులుప్రత్యేకం 5మిస్కాలు, యీవత్తువస్తువు ఒకకవ్వనీళ్ళలో వేసి అర్థాంశముగాకషాయముకాచి దించుకొని, ఆ కాశవల్లిషర్బత్తు 10మిస్కాలుకలిపి, పానముచేయవలెను. లేద్రాదాక్షసిర్కాకలిపి గోరువెచ్చగానుంచునవ్వుడు పానముచేసి వమనముచేయవలెను.

వమనముచేయుటకు అత్యంతఅవసరము కలిగితేనేతప్ప, నల్లకటుకరోహిణిప్రయోగించకూడదు. ఎందుకనగా, నల్లకటుకరోహిణి, విషసంబంధమైనది. కాబట్టిదీనివలన, ఋకనాసిరోగమునుంభవించును. దీనివలనకూడా వమనము కాకుండిన అట్టివానికి అవసరములేనిదే వమనముచేయించకూడదు.

ఇది శ్రీమదిమాంబేగ్ సాహేబ్, పౌత్రిపాచ్చాబేగుసాహేబ్
పుత్రిభేషజవిద్వత్ ద్వితీయ, రహంతుల్లాబేగ్
నామధేయ, ప్రణీతంబయిన తిబ్బెఅక్బర్ షాహి
గ్రంథమునందు, దోష, విరోచన, వమన
ప్రథమ అధ్యాయము
సంపూర్ణము.



యాకరీముల్ మారూఫ్.

బిస్మిల్లా ఇర్రహమానిర్రహీం.

# తిబ్బె అక్బర్షాహీ.

రెండవ అధ్యాయము.

సర్వశరీరమునకు శిరస్సు ప్రధానమగుటవలన ముందుగా శిరస్సుయొక్క వివరము శిరస్సంబంధమగు వ్యాధులను చెప్పుచున్నాను.

## శిరస్సుయొక్క లక్షణములు.



చర్మము, మాంసము, నరములు, ఝిల్లి, మెదడు, రక్తనాళములు మొదలగునవి బుద్ధియొక్క ప్రధానద్రవ్యములు. అనగా, రత్నములని భావము. మెదడుచుట్టు నాక్రమించియుండు నరముల చిక్కు అల్లుకొని యుండు రక్తనాళములు, వాతనాళములు, కండరములు, జీవనరములు, అనగా ప్రాణవాయువు సంచారముచేయు నరములచేత రుధిరమును, ప్ర

చరింపచేయుచున్నవి. జీవనరములద్వారా ప్రాణవాయువు మెదడునం దుచేరి సహస్రచక్రమధ్యమునందు పరబ్రహ్మస్వరూపమును కలియు చుండును. అనగా అభిషేకమును చేయుచుండునని భావము. మరియు కండరములు శిరస్సుయొక్క పొరలను బంధించి కదలకుండునట్టుల చేయు చున్నవి. ఇవి అన్నికలిసి శిరస్సుయను నామముకలిగినవి.

శిరస్సుయొక్క వెంట్రుకలు, చర్మముయొక్కభాగమునుండి సర్వశిరమును రక్షించుచున్నవి కాని ఇవి శిరమునకు సంభంధములేవు. శిరమునందుండు యెనిమిది ఎముకలు ఏవన. అందులో నాలుగు ఒకటి కొకటిగోడవలె నిలువబడియుండును తక్కినవి పరుపువలె పరుచబడి యుండును. దీనిని అరబ్బీభాషయందు ఖాయమేదిమాగ్ (మస్తిష్క) ఆధారమని అందురు అనగా మెదడుయొక్క ఆధారమనిభావము మరి యు రెండుగోడగులవలెకలిసి యున్నవానినే అరబ్బీభాషలో కహిఫ్ అని అందురు దీనినే తలపుర్రె అనిభావము. మెదడునకు (మస్తిష్క) అరబ్బీలో దిమాగ్ అనిఅందురు. (ఇంగ్లీషులో బ్రైన్) అందురు. మరియునిది మృదువుగను పసుపురంగుగను తెల్లగనుండును. అందుండి నరములు ప్రాణవాయువు (రూహెనఫ్సాని) అనగా జీవుడు మెదడు నందుండును. ఇచ్చట ఒకవిధమగు మహాశక్తిగలదు. దీనివలననే బుద్ధి సంబంధమగు సర్వశరీరముయొక్క కార్యములు నెరవేరుచున్నవి. ఊహా లు కలుగుచున్నవి. ఇందుచేత శరీరమునకు ప్రధానఅంగము, శిరస్సని చెప్పబడుచున్నది. మరియు మెదడునకున్ను హృదయమునకు సంబంధ ముగల నరములుకత్తినాళములు జీవనరములు మెదడునుండియు మెదడు పై భాగమునందుండు పొరలనుండియు సర్వశరీరమును వ్యాపించి వృ క్షముయొక్క శాఖలవలెకూడుకొనియున్నవి. జీవనరములు మెదడునుం డి పుట్టినవిగాని, ఇవి మస్తిష్కముయొక్క ప్రధానఅవయవములుకావు.

## మెదడుయొక్క ఆకారము.

మెదడుయొక్క ఆకృతి త్రికోణాకారముగనుండును. ఇదిమూడు భాగములుగానుండును. యిందులోమధ్యభాగము ప్రధానమయినది. వెనుకమెడచప్పనగుంటవరకు నాశ్రయించియుండు మెదడునకు చిన్నభాగ

మందురు. మెదడుయొక్క పెద్దభాగము మిక్కిలి మృదువుగనుండును. దీనినుండి ఖర్మేంద్రియములయొక్క జీవనరములు బయలు వెడలినవి. మస్తిష్కముయొక్క వెనుకభాగము ముందుభాగముకంటె కఠినముగా నుండును గాన వెనుకమెదడువలన నడచుటకున్నూ తిరుగుటకున్నూ సహాయముచేయునట్టి జీవనరములు దీనియందు పుట్టుచున్నవి. (మస్తిష్కము) తలముందుభాగమునుండి వెనుకభాగమువరకు వెడల్పునందు మూడుభాగములుగా భాగించబడినది. ఇందుండి ప్రత్యేకభాగము నకునివాసి మెదడు. మెదడుయొక్క పొర అందురు ఈమూడు పొరలలో నుండిముందుపొర వెడల్పుగను మధ్యభాగముయొక్క పొర క్రిందిభాగము కొంత ఖాలీవుండును. దీనిని ఝురనా, అని అరబ్బీలో వాడుదురు. మెదడుయొక్క మలము అస్తానమునందుచేరి మూడునందు ప్రవహించుచుండును. మెదడుయొక్క సంపూర్ణమలము యావత్తు ఖనీభవించిమూడునందు చేరుచున్నది, మరియు సంపూర్ణ పొడవులోనుండి తల మెదడుయొక్క పొరలనుండి రెండుభాగములుగా భాగింపబడినది.

శిరస్సుయొక్క ఆకృతి చిన్నభాగము.

వెనుకభాగము.




మెదడుయొక్క ముందుభాగము. ఆధారభాగము.

శిరస్సుయొక్క ఆకృతియు మెదడుయొక్క మూడుభాగములను గ్రహించు విధములను చెప్పుచున్నాను సక్తా, (సన్నాశము) వ్యాధి యందు వర్ణించబడును; చెడుమెదడు శరీరముయొక్క అంగములలో నొక అంగమని గ్రహించవలెను. ఇది మెదడుయొక్క ఆకృతినిబోలి దీని వెనుకభాగమునందు బూజువలె అంటుకొని ఉండును. ఇది మెడ నుండి వెన్నెముకవరకు హాస్థిశంఖము లోభాగమువరకు, సంచారము చేయుచుండును. మంచి మెదడువలెనే చెడుమెదడుకూడ పొడవునందు రెండుభాగములుండునుగాని రెండుభాగములుండునటుల దీని విభాగము తెలిసికొనుట కష్టముగానుండును. అయినను గమనించి కనిపెట్టవచ్చును. చెడుమెదడుయొక్క ఝిల్లి (పొర) మూడుపొరలుగా నుండును. మరియు పరమాత్ముడు చెడుమెదడుయొక్క కుడిఎడమ భాగములనుండి, కాళ్లు చేతులు, ప్రక్క ఎముకలు, మొదలగునవి నిర్మించెను. మోకాళ్లనుండి యొక్కొక జీవనరము బయలువెడలి శరీరమునందంతర్భాగములో నిమిడియున్నది. మోకాళ్లయొక్క వెనుక భాగమునుండి ఒక జీవనరము ప్రత్యేకించి బయలువెడలి చెడుమెదడువరకు వ్రేళ్లవలె పాకియుండును.

జీవనరములు (పటుడా) రెండువిధములుగానుండును 1మెదడునుండిపుట్టి శరీరముయావత్తు ప్రవహించునది. ఇవి ఏడుజతలు. అనగా 14 లోపలి భాగమునందుండునవి. తక్కినవి బాహ్యేంద్రియములు యావత్తుపై అంగములు మెడ, తల, మొదలగునవి వంచుట, కదలించుట, తిరుగుట మొదలగునవి ఈనరములచేతనే కలుగుచుండును. మరియు, ముఖచర్మము నాశ్రయించి యుండునరములు చెడుమెదడునుండి పుట్టి వానివాని పనులను నెరవేర్చుచున్నవి. జీవనరములు చెడుమెదడునుండి ఉత్పన్నమగుచున్నవి. ఇవి64అని అర్థము. ఈ నరములవలన నడుచుటకు చాచుటకు, మూయుటకు, శక్తికలిగించుచుండును. ప్రతిఅంగమును తిరుగునటుల, నడుచునటుల, కదలునటుల చేయుశక్తికి మూలాధా

తము మెడ అనియు మెడనుండిపుట్టుచున్నవనియు తెలియవలెను. గట్టి నరములు వెనుమెనడునుండి పుట్టుచున్నవి. ఝిల్లి అనగా పొరలోనుండు సూక్ష్మతంతువులనుండి వెడలుచుండును. వ్రితి అంగములను రక్షణచేయుచుండును. అంగములను దృఢపరచుచుండును. అంగములొకటికొకటిగాచేర్చుచుండును. ఏఅంగములయందు స్వాభావికమగు జ్ఞానముండదో అట్టివానియందు జ్ఞానము పుట్టునటుల జేయుచుండును. అనగా ఒక ఝిల్లి యకృత్ నుండి ప్లీహాములందు ప్రవేశించియుండును. తలయందు అయిదు ఝిల్లి పొరలుండును. 1 తలపుర్రియొక్క పైభాగమునందును 2 లోభాగమునందుండి పైభాగమునందు పొరతో చేరియుండును. ఈ ఝిల్లి మూడవదానికంటె కఠినముగానుండును. ఇది మెదడు నాశ్రయించి రెండవదానితోచేరి మిక్కిలి మృదువుగా నుండును. దీనియొక్క శాఖలు మెదడు యావత్తు వేర్లవలె అల్లుకొని ఉండును. మరియు, రెండవ ఝిల్లీ పొర మెదడు క్రిందభాగమునందు పరచబడి మృదువుగా నుండును. అందులో రెండవది మెదడుతో కలిసియుండును, రెండవది కఠినముగానుండును. ఇది ఎముక నాశ్రయించి యుండును. దీనిని ఆధార మని చెప్పుదురు.

మరియు, హృదయసంబంధమగు నరముల వర్ణనము హృదయ స్థానమందు చెప్పబడును. కలీజా (యకృత్) నరముల వర్ణనము కలీజా అధ్యాయమునందును మెదడునందుగల జీవవర్ణనము జ్వరములయందు చెప్పబడును. ఆజా అనగా అవయవము శరీరముయొక్క చిక్కని కఠిన భాగములను ఆజా అందురు.

ఇది వాతము, పిత్తము, కఫము, రుధిరముల యొక్క సంయోగమువలన వృద్ధియగుచుండును. ఇది రెండు భేదములుగానుండును 1 అయోగిక రెండవది యోగిక.

అయోగిక అనగా అంగము. దీనిభాగమునుండి కొద్దిభాగము చిన్నదైనయెడల అనగా మరియొక అంగముతో జేరినయెడల సంపూర్ణ

అంగమునకు భంగముకలుగును. అంగముయొక్క ప్రత్యేకభాగమునకు శల్యమనిపేరు. ప్రత్యేకవెముకకు అంగము లోభాగమని చెప్పుదురు. మరియు అయోగిక అంగముయొక్క 10 భేదములుగలవు. వీనిపేర్లను ప్రత్యేకప్రత్యేకముగా వివరించబడును. అజ్మ, (వెముక) 2 గజరూఫా (కఠినశల్యము) 3 అశ్బ్ (జీవనరము) 4 అజల (బద్ధనరములు) 5 వాత (బద్ధనరముయొక్క రెండవభాగము) 6 రివాత్ (వెముకలోపలి పదార్థము అనగా మూలుగ) ఇది వెముకను జంటపరుచుచున్నది నిది ప్రతికీలులోనుండి కీళ్ళవెముకలు తిరుగునటుల చేయుపదార్థము 7 శిరియాన్ ముడుచుటకున్నూ చాచుటకున్నూ వీలగునటుల చేయునరము. 8 బరీదు (రక్తనాళము) అనగా రక్తమును ప్రవహింపచేయునట్టిగొట్టములవంటి నరములు. 9 గిశా అనగా ఝిల్లి అయోగిక అను యీఅంగములు 9న్నీ వీర్యమునుండి పుట్టుచున్నవి. అనగా పితృసంబంధమైనవని గ్రహించవలెను. 10 లహం (మాంసము) క్రొవ్వు (సహం) సమీన్ (మాంసమునందుగల తంతువులతో పుట్టునట్టి వచ్చుని (క్రొవ్వు) దీనిని హిందూస్తానమునందుగల ఖసాయివారు రివాజ్ అని వాడుచున్నారు యీ రెండున్నూ మాంసభేదములు, మాంసము, క్రొవ్వు ఈరెండున్నూ రక్తమువలన వుత్పన్నమగుచుండును. అనగా మాతృసంబంధమువలన పుట్టినవని గ్రహించవలెను. మరియు వెంట్రుకలు, గోళ్లు, రక్తము, మొదలగునవి హీనమలమువలన వుత్పన్నమగుచున్నవని పండితోత్తములు మొదలగు వైద్యవరులు పరీక్షించియున్నారు. ఝిల్లి మాంసము మొదలగునవి నరములవలన సంయుక్తకండరముల శాఖలవలన వానివాని తంతువులతో బంధించబడి లోభాగమునందుజేరి ప్రాణవాయువుతో సంబంధముకలిగియున్నవి.

కండరములకు వైద్యవరులు యోగిక అంగములయందు చేర్చుచున్నారు. యోగిక అయోగికకు భేదముండునుగాని యోగిక అంగము కాదు గాని ఒకటికొకటి ఆధారము సంబంధించియుండవు. ఈయంగము

యొక్క ఏభాగమునందు ఉపమానము పేరు కారాదు. అనగా కాళ్ళు, చేతులు, చెవులు, మొదలగువానివలె పేర్లుపెట్టుటకు వీలుకాదు. మరియు చేతియొక్క చర్మము అందుండు శల్యము తీసివేసినయెడల చెయ్యివలెనుండజాలదు. అది చెయ్యి అనిగాని చెయ్యివలె వుపయోగించుననే ఉపమానముకలుగజాలదు. రోగిక అంగమునకు పార్శ్వభాషయందు ఆర్గానె ఆలియా అనికూడ చెప్పుదురు. వీనిని దైవకృపకలిగినయెడల వానివానిస్థానములలో రోగిక అరోగిక లక్షణములను వర్ణించబడును.

(సూచనీయము) యీపుస్తక అంతమునందు కఠిన శబ్దముల యందు ఆయాప్రసిద్ధరోగములను ఆయాస్థానములయందు వర్ణించబడినవి. అనగా మాజూన్లు, మాత్రలు, మొదలగునవి అనేకవిషయములను గురించి వలుమారు చెప్పబడినవి. మరియు అమూల్యమగు చికిత్సలను అమూల్యమగు వ్యాధులయందు వర్ణించబడియున్నవి.

{ శిరోరోగభేదములు
తలనొప్పివివరం }

తలనొప్పికి సుదఅ అనివచించుదురు తలనొప్పి ప్రసిద్ధినొందిన వ్యాధి. ప్రతివారునీని అవస్థను దెలిసికొని యుండుటచేత రోగవివరమును వ్రాయనవసరములేదు. తలనొప్పియొక్క కారణములు దుష్ట ప్రకృతి యొక్క భిన్నాభిన్నతవిరుద్ధత అనియు తలయొక్క జ్ఞానయుక్తభాగములందు కలుగుచున్నది. మెదడున్ను పైపెంకుగారక లెక్కన నాపూర్ణభాగము జ్ఞానసంపన్నమని తెలుసుకొనవలెను. యీశిరోరోగము వుత్పత్తియగుటకు భిన్నాభిన్నకారణములనుబట్టి ఈవ్యాధిని కనుపెట్టువిధములు అనేకములుగలవు 1 సాజిజ్ (సాధారణ శిరోరోగము) దోషరహితశిరోరోగము 2 మాది. (మలకారణములవలన కలుగుశిరోరోగము) 3 యితర అంగము యొక్క సంయోగమువలనకలుగు శిరోరోగమునకు (ముస్సారక్ అందురు) 4 మెదడు దుర్బలమగుకారణమువలన కలుగు శిరో

అంగమునకు భంగముకలుగును. అంగముయొక్క ప్రత్యేకభాగమునకు శల్యమని పేరు. ప్రత్యేక యెముకకు అంగము లోభాగమని చెప్పుదురు. మరియు అయోగిక అంగముయొక్క 10 భేదములుగలవు. వీని పేర్లను ప్రత్యేకప్రత్యేకముగా వివరించబడును. అజ్మ్, (యెముక) 2 గజరూఫా (కఠినశల్యము) 3 అశ్బ్ (జీవనరము) 4 అజల (బద్ధనరములు) 5 వాత (బద్ధనరముయొక్క రెండవభాగము) 6 రివాత్ (యెముకలోపలి పదార్థము అనగా మూలుగ) ఇది యెముకను జంటపరుచుచున్నది నిది ప్రతికీలులోనుండి కీళ్ళ యెముకలు తిరుగునటుల చేయుపదార్థము 7 శిరియాన్ ముడుచుటకున్నూ చాచుటకున్నూ వీలగునటుల చేయునరము. 8 బరీదు (రక్తనాళము) అనగా రక్తమును ప్రవహింపచేయునట్టిగొట్టములవంటి నరములు. 9 గిశా అనగా ఝిల్లి అయోగిక అను యీఅంగములు 9న్నీ వీర్యమునుండి పుట్టుచున్నవి. అనగా పితృసంబంధమైనవని గ్రహించవలెను. 10 లహం (మాంసము) క్రొవ్వు (సహం) సమీనా (మాంసమునందుగల తంతువులలో పుట్టునట్టి పచ్చని క్రొవ్వు) దీనిని హిందూస్థానమునందుగల ఖసాయివారు రివాజ్ అని వాడుచున్నారు. యీ రెండున్నూ మాంసభేదములు, మాంసము, క్రొవ్వు ఈరెండున్నూ రక్తమువలన పుత్పన్నమగుచుండును. అనగా మాతృసంబంధమువలన పుట్టినవని గ్రహించవలెను. మరియు వెంట్రుకలు, గోళ్లు, రక్తము, మొదలగునవి హీనమూలమువలన పుత్పన్నమగుచున్నవని పండితోత్తములు మొదలగు వైద్యవరులు పరీక్షించియున్నారు. ఝిల్లి మాంసము మొదలగునవి నరములవలన సంయుక్తకండరముల శాఖలవలన వానివాని తంతువులతో బంధించబడి లోభాగమునందుజేరి ప్రాణవాయువుతో సంబంధముకలిగియున్నవి.

కండరములను వైద్యవరులు యోగిక అంగములయందు చేర్చుచున్నారు. యోగిక అయోగికకు భేదముండునుగాని యోగిక అంగము కాదు గాని ఒకటికొకటి ఆధారము సంబంధించియుండవు. ఈయంగము

యొక్క ఏభాగమునందు ఉపమానముపేరు కాజాలదు. అనగా కాళ్ళు, చేతులు, చెవులు, మొదలగువానివలె పేర్లుపెట్టుటకు వీలుకాదు. మరి యుచేతియొక్కచర్మము అందుండు శల్యము తీసివేసినయెడల చెయ్యి వలెనుండజాలదు. అదిచెయ్యి అనిగాని చెయ్యివలె వుపయోగించుననే ఉపమానముకలుగజాలదు. యోగిక అంగమునకు పార్శ్వభాషయందు ఆజామె ఆలియా అనికూడ చెప్పుదురు. వీనిని దైవకృపకలిగినయెడల వానివానిస్థానములలో యోగిక అయోగిక లక్షణములను వర్ణించ బడును.

(సూచనీయము) యీపుస్తక అంతమునందు కఠిన శబ్దముల యందు ఆయాప్రసిద్ధరోగములను ఆయాస్థానములయందు వర్ణించబడినవి. అనగా మాజూనాలు, మాత్రలు, మొదలగునవి అనేకవిషయ ములను గురించి వలుమారుచెప్పబడినవి. మరియు అమూల్యమగు చికి త్సలను అమూల్యమగు వ్యాధులయందు వర్ణించబడియున్నవి.

{ శిరోరోగభేదములు
తలనొప్పివివరం }

తలనొప్పికి సుదఅ అనిపిలుచుదురు తలనొప్పి ప్రసిద్ధినొందిన వ్యాధి. ప్రతివారువీని అవస్థలు దెలిసికొనియుండుటచేత రోగవివరమును వ్రాయనవసరములేదు. తలనొప్పియొక్క కారణములు దుష్ట ప్రకృతి యొక్క భిన్నాభిన్నతవిరుద్ధత అనియు తలయొక్క జ్ఞానయుక్తభాగము లందు కలుగుచున్నది. మెదడున్నూ పైపెంకుగాక తక్కిన సంపూర్ణభా గము జ్ఞానసంపన్నమని తెలుసుకొనవలెను. యీశిరోరోగము వుత్పత్తి యగుటకు భిన్నాభిన్నకారణములనుబట్టి ఈవ్యాధికి కనుపెట్టువిధములు అనేకములుగలవు 1 సాజిజ్ (సాధారణ శిరోరోగము) దోషరహితశిరో రోగము 2 మాది. (మలకారణములవలన కలుగుశిరోరోగము; 3 యిత ర అంగము యొక్క సంయోగమువలనకలుగు శిరోరోగమునకు (ము స్సార్ అందురు) 4 మెదడు దుర్బలమగుకారణమువలన కలుగు శిరో

రోగమునకు [జైఫెనిమాగి] అందురు. 5 మెదడునందుగల జ్ఞానశక్తి యొక్క బలము విశేషముగు ప్రభావమువలన కలుగు తలనొప్పికి (కువ్వతెహిశ్సైదిమాగి) అందురు. 6 రెండవ వ్యాధిచేత పీడింపబడునట్టి కారణమువలన కలుగు తలనొప్పికి (ఆగ్జి) అందురు. 7 మెదడునందు శుష్కత్వమువలనకలుగు శిరోరోగమునకు (యుబ్శి) అందురు. 8 తలయందు వాపు కలుగుటవలన కలుగుతలనొప్పిని [వర్మ్] అందురు. 9 స్త్రీసంభోగ విశేషత్వమువలన కలుగు తలనొప్పిని [జిమాయి] అందురు. 10 విశేషముగా స్నానముచేయుటవలన నీళ్ళయందు మిక్కిలి తలతడుపుట చేతను కలుగు తలనొప్పిని [హమామి] అందురు. 11 కల్లు, సారాయి, మొదలగు మత్తుపదార్థములను విశేషముగా సేవించుటవలన కలుగు తలనొప్పిని [మధ్యపాన] అందురు. 12 అభిఘాతము అనగా యెత్తు ప్రదేశమునుండి క్రిందపడుటచేత కలుగు తలనొప్పిని [సక్తె] అందురు. 13 తలకు దెబ్బతగులుటవలన కలుగు తలనొప్పిని (జర్బ) అందురు. 14 తలనొప్పియందు బట్టచేత బంధించుకొనుటలుంచునొప్పిని [బౌజి]అందురు. 15 రోగప్రకృతిచేత అనగా జ్వరము మొదలగు కారణములవలన కలుగు రోగసంధివలన కలుగు తలనొప్పిని (బహురాన) అందురు. 16 సుగంధ, దుర్గంధ, పదార్థములను వాసనచూచుటవలన కలుగు తలనొప్పిని (శిమ్మా) అందురు. 17 మెదడుయొక్క నరములయందుగల ఛిద్రములు మూయబడుటవలన, నరములు మూతబడుటచేత, కలుగుతలనొప్పిని [సుదీ] అందురు. 18 మెదడునందు పురుగులు, మొదలగునవి కలుగుటవలన గాని లేక పురుగులు ప్రవేశించుటవలనగానికలుగుతలనొప్పిని [దూది] అందురు. 19 విశేషముగా నడచుటవలన పరుగెత్తుట వలన విశేషముగా వ్యాయామాలాగుటవలన కలుగు తలనొప్పిని (సజాజైర్) అందురు. 20 నిదురనుండి లేచినవెంటనే కలుగు తలనొప్పిని [ఆదషెనౌమీ] అందురు. 21 విశేషముగా మాట్లాడుటచేసినన్నూ, అరచుటచేతనున్ను, కలుగుతలనొప్పికి (కిరీహి) అందురు. కిరీహి అను

నొప్పి మరియొకటికలదుగాని యిది (మాదిరిఅహతలనొప్పిలో నొకభేధ ము, అనగా దోషములయందు మలము చెప్పబడుచున్నదో అటులనే వాతముకూడా మాదిరిహా (అని చెప్పబడుచున్నది. ఇటుల పార్శిభాష యందు శిరోరోగములు 21 విధమని చెప్పబడియున్నది.

[సూతికీయము] సూయెమిజాజెముక్తలిబ్, మరియు సూయెమి జాజెముస్సికా అర్థము వాటిబేధములు వేరువిధముగా వర్ణములందు చెప్పబడినది. ఈవాపుదోష ప్రకృతియొక్క బేధము అనగా ఈకారణము వలన మాదుదియొక్క దుష్టప్రకృతివాపునందు కొంతిబేధముకలదు. అనగా వాపునందు తఫరూ(క్రింతిసాల్ కలుగుచున్నది. అనగా వాపుసం బంధమగు మలము అంగములమధ్యభాగమునందు అల్లుకొని నిలిచిపోవు చున్నదని భావము మరియు, అంగముల భాగములను వేరువేరుగా అణ చివేయును. ఇది మలమునయొక్క దుష్టప్రకృతికి విరుద్ధముగానుండును. ఎందుకనగా అందు ఒఫ(రూకైఇతిసాల్ కలుగనేరదు. అనగా అంగము ల లోభాగమునందు ప్రవేశింపనేరదు. కేవలము, అంగములోభాగము నందుగాని బాహ్యమందుగాని వ్యాపించి కష్టము కలిగించుచున్నదిగాన వాపు సంబంధమగు తలనొప్పిని వేరుగా చెప్పబడియె.

## సాధారణ శిరోరోగ లక్షణములు.

ఏదోషములేనిదే శిరోరోగము కలుగనేరదు. స్వభావికప్రకృతి యందు కొంతదోషప్రకృతిచేరి శిరోరోగము కలిగించుచున్నది. యిది 2 విధములు, అతిఉష్ణమువల్ల కలుగుచుండును. వేడితలయందు అంతర్ బాహ్య కారణములవలన ప్రవేశించి నొప్పి కలిగించుచుండును. అనగా ఎండయందు విశేషముగా తిరుగుట ఎండలోనుండుట నిప్పుసెగయందుం డుట, శరీరము విశేషముగా కాచుకొనుట, మొదలగు కారణములవలన తలనొప్పి కలుగుచున్నది. దీనిలక్షణములు రోగిఎండలో నివశించుట చేత కలిగినదా లేక నిప్పువేడి యందుండుటచేత కలిగినదాయని రోగిని విచారించితెలిసికొనవలయును.

(2) రోగియొక్క తల పట్టుకొనిచూచినయెడల వేడి తెలియగలదు. 3 మలమూత్రములు పరీక్షించి తెలిసికొనదగును. 4 ముక్కునందు చెమ్మ లేకుండుట. 5 అతిదాహము 6 కర్ణములయందుపోటుకలుగుట. 7 తల యందు భారము తెలియకుండుట, 8 శీతవస్తువులయం దపేక్షకలుగుట శీతప్రయోగములవలన నొప్పి శమించినట్లుండుట మొదలగు లక్షణము లు ఉష్ణమువలన కలిగిన తలనొప్పియందు కలుగుచున్నవి.

సాధారణ శిరోరోగచికిత్స స్థలములు.

రోగిని శీతగాలివీచు చోట్లయందు నివాసముచేయించుట చల్లని పదార్థముల చేత స్వేదనముచేయుట చల్లనిగాలి వీచునట్టి ఇండ్లయందు వుద్యానవనములయందు రోగినుంచుట, మరియు చందనము, బనప్షా పన్నీరు, కర్పూరము, మొదలగు సుగంధద్రవ్యములను రోగి నివసించు స్థానము నందుంచుట మరియు 1 గులేరోగన (గులాబిపువ్వుతో తయా రుచేయు నూనెను) చల్లని నీళ్ళయందు కలిపిగాని, లేక బనప్షాతో తయారుచేసిన నూనెగాని, లేక నల్లకలువపువ్వులతో తయారుచేయు నూనెగాని, ఆనబకాయ [సొరకాయ] తో తయారుచేసిన నూనెగాని, కొద్దికొద్దిగా చల్లని అనగా మంచుగడ్డ [ఐస్] నీళ్ళలోకలిపి రోగితల పై అప్పుడప్పుడు వేయుచుండవలెను. మరియు ప్రత్యేకఅంగముపై యెత్తునుండి ధారగా విడుచుచుండవలెను. ఔషధముయొక్క ధారసరి గాపడనిచో వ్యాధి నివారణ కాజాలదు. ధారసరిగాపోయుటకు నతూర్ అథవా, తరేడా, అని పార్శీలో వదించుచున్నారు.

ధారసరిగా పడక నిలిచి నిలిచి పడినయెడల దానినికసూబ్ అందురు. ఒకప్పుడు తలనొప్పిహేతువు బలముగలదైనచో శిర్కా (పులుసుపదా ర్థము) పన్నీరు, గులేరోగన, (గులాబిపువ్వులనూనె) చందినీ, మొద లగునవి మాడుపైగాని, శిరస్సునందు నొప్పిగల భాగములయందుగాని వేయవలెను. దీనివర్ణనము ముందు వ్రాయబడుచున్నది. తలకు లేపన చేయునట్టి ఔషధములను మిక్కిలి చల్లని ఔషధములను లేపనము

చేయవలెను. ఇట్లుచేయుటవలన ఆవిరియొక్క పరమాణువులు తగ్గిపోవును. మరియు, వేడియొక్క ఆవిరివలన పరమాణువులు శిరస్సునందు ప్రవేశించిన యెడల మిక్కిలి చల్లని చికిత్స మత్తుపదార్థములను ఎంత మాత్రము ఉపయోగించకూడదు. గాని పైనచెప్పిన తరేడా దారగా పోయునట్టి ఔషధములు కలిసిన నీళ్లలో బాబూనానూనె మూడవవంతు చేర్చుకొనవలెను. బాబూనానూనె చేరినయెడల తలయందుండు పరమాణువులు తగ్గిపోవును. తిరిగి పై కెక్కనేరవు. పై విధముగా స్త్రీలకు బాలురకు నపుంసకుల విషయమై చల్లనిపదార్థములను వినియోగించుట వర్జనీయము. మిక్కిలి అవసరములేనిచో, శిర్కాకూడ చేర్చకూడదు. తలయొక్క వెనుకభాగమునందు చల్లని చికిత్స చేయకూడదు. శిర్కా చేర్చిన ఔషధములను లేపనముచేయు కూడదు. ఎందుకనగా, హకీమ్‌జాలీనూస్‌గారు తల వెనుకభాగమునందుండి ప్రతినరములు, కండరములు, రక్తనాళములు, జీవనాళములు, వీర్యనాళములు, మొదలగునవి బయలుదేరి శరీరముయొక్క ప్రతిఅవయవములను నాశ్రయించి యున్నవి. తల వెనుక భాగమునందు చల్లని చికిత్స చేసినయెడల ఆచల్లదనము ప్రతిఅంగమునందు కష్టమునుకలుగజేయునని వచించిరి.

శరీరఅంగములను నీర్సము, బద్ధకము కలిగించునట్టి వస్తువులు, అనగా నల్లమందు, ఓమము, వుమ్మెత్త మొదలగునవి తిమ్మిరి నీర్సము కలిగించు ఓషధులు.

### శిరోవస్థిచేయు క్రమము.

### తలలేపనముచేయు క్రమము.

శిరోరోగముగల రోగియొక్క మాడుపై వెంట్రుకలు తీయించి తలచుట్టు కనుబొమలవరకు చర్మముచేతగాని, పిండిచేతగాని, కుండలాకారముగాచుట్టి ఆమధ్యమందు చల్లని ఔషధములను పోయవలెను.

కొంతవరకు దోషానుగుణ్యముగానుంచి, తరువాత తీసివేయవలెను. ఇట్లు ప్రయోగించుటకు అరబ్బీబాషలో తగరీల్‌సర్ అందురు.

ఈరీతిగా ఔషధముల నుపయోగించుటకు యుక్తికూడ ఉపయోగించుట అత్యావశ్యకము. తల కుపయోగించునట్టి ఔషధములు సమశీతోష్ణముగలవిగా నుండవలెను. వైద్యులు, బుద్ధిని ప్రత్యేకముగా ఉపయోగించవలెను.

తల కుపయోగించునట్టి శిర్కా, మిక్కిలి పాతదిగా చేర్పకూడదు. ఇతరవేడిగల ఔషధములను ఉపయోగించకూడదు. ఎండయందుంచి తీసిన గులాబీనూనె ఉపయోగించవలెను. గాని అగ్నియందు తయారు చేసిననూనె ఉపయోగించకూడదు. ఈతైలము ఒకసంవత్సరముక్రింద చేయబడినదిగను మంచిసువాసనగలదిగా నుండవలెను. నూనెకంటె శిర్కా అధికభాగము చేర్పవలెను.

[సూచనీయము] తలయందు వేడిగల ఔషధములు, శీతలముగల ఔషధము లుపయోగించుటవలన తలయందుగల దోషములను తీసివేయుటకు శక్తిగలవగును. కారణమేమనగా, తలపెంకు మెత్తగను పలచగా నుండుటవలన తలవుర్రెలు రెండు అతుకుగల స్థానముగుటవలన తలపెంకునూసికె, రంపముపండ్లవలె, ఒకటికొకటిచేరి ఉండుటవలన యీకారణములనుబట్టి తలకు ఉపయోగించుఔషధములు వెంటనే తల లోభాగమునకు ప్రవేశపెట్టుటకు స్వల్పమార్గమై యున్నది. కాబట్టి తైలములు స్వేచదనము, వస్తి, మొదలగునవి చెప్పబడినవి.

## ➳ గుల్రోగన్ [గులాబిపువ్వులనూనె] చేయుక్రమము. ➳

గులాబీపువ్వుల రేకలునుతీసి గాజుపాత్రయందుంచి కడిగిననువ్వులనూనె అందులోబోసి గులాబిపువ్వులవాసన యావత్తు నూనె గ్రహించువరకు ఎండయందుంచి గులాబిపువ్వులవాసన నూనెగ్రహించిన వెనుక తీసియుంచుకోవలెను. మరియు గులాబిపువ్వ రేకులనుపాత్రయందువైచి అందునూనెబోసి ఆపాత్రను నిప్పులపైనుంచి కాచి తయారుచేయుదురు గాని ఎండయందు తయారుచేయువద్ధతి ఉత్తమము. ఇటులనే చంపక

పువ్వు, చంచేలీపువ్వు, బాబూనా మొదలగుపువ్వులు. మూలికలు, ఆకులలోనుండి నూనెలుగాని చేసికొనవలెనా గ్రహించవలెను.

ఈ వ్యాధియందు చల్లని వస్తువులు, చమ్మనుపుట్టించునట్టి వస్తువులూ, లాభదాయకము. అనగా మజబ్సిరారన్, (కట్టు) యవలు, పెసలు, నేతిబీర, సూకనఫలియాలు, పాలగు, మొగ గుడవి బాదంవ వ్వగనముతో తయారుచేయబడినవిగాని వినియోగించవలెను. రెండవ తలనొప్పి లోపలిభాగములయొక్క కారణములవలన తలయందు వేడి విస్తారమై గాని ఖరిము, మోతుంబ, కారము, మొదలగు వేడిపదార్థములు విస్తారముగా సేవించుటవల్లగాని, లేక మద్యపానము, ఖర్జూరపండు, జంతువులయొక్క (తిల్లి అనగా ప్లీహా) అను మాంసఖండము, నీరుల్లి మొదలగునవి మెదడు (మస్తిష్క) నకు హానికలిగించు వస్తుసేవన వలన కలుగుచున్నది

## ఉక్తరోగ లక్షణములు.

వేడివస్తువులను భుజించుటచేతవచ్చు తలనొప్పి లక్షణములు

హానికర పదార్థములు, ఉష్ణపదార్థసేవనవలన కలుగు తలనొప్పి గల మనుష్యునికి బుద్ధి మారిపోవును. అనగా స్థిరముగా ఉండదు అనేకములగు విచారములు మనస్సునందు వచ్చుచుండును. నిద్రస్వల్పముగను, స్థిరముగా లేకుండుట, మరియు, ముక్కుదూలము ఎండుచుండుట మొదలగు లక్షణములు కలిగియుండును.

## ఉక్తరోగ చికిత్స.

నీలోఫర్ (నల్లకలువ పూలు) చందనము, రసాంజనము, మామీరా, గొంచెనుకొర్యాకము ఈవస్తువులను దోసకాయరసమునందు గాని, సొరకాయరసమునందు గాని, లేక కాహూరసమునందుగాని, ధనియాల రసమునందుగాని నూరి, అందులో కొంత వన్నీరు, కొంతగులేరోగన్ అనగా (గులాబినూనె) చేర్చి, తలపై లేపనము చేయవలెను. మరియు, జర్స్ అంజరూద్, లేపనముచేయుట, మెదడునకు చలువకలిగించుట,

అధికగుణకరముగానుంచును. మరియు, బనప్షాషర్బత్తు, ఉన్నాబ్ షర్బత్, గాని, చింతపండు మొదలగు షర్బతులను కురస్ అను మాత్రిలుతో అనుపానముగా ఉపయోగించవలెను.

## కురస్ మాత్రిలుజేయు విధానము.

పందిరిదోసగింజలు, నేతిబీరగింజలు, ఎడినధనియాలు తవాషీరి కాహూవిత్తులు, పెద్దపాయలవిత్తులు, మాదీఫరసముచేత నూరి మాత్రిలుచేసి పైనచెప్పిన షర్బత్తుల అనుపానముతో పుచ్చుకొనవలెను. చల్లని వస్తువులు అనగా కాహూరసము, పెద్దపాయలరసమును, నిత్యము తలపై పోయుచుండవలెను. చల్లని చికిత్సవలన తలనొప్పి, తగ్గనియెడల తలకు మర్దించి వలెను. అరబ్బీభాషయందు తైలమునకు దహాన్‌అనియు తైలముగుద్దుటకు, తదహీఅనివచించుదురు, మజబ్బిరా అనగా మాంసము, చేర్చుక, కేవలము, వనస్పతులతో, చేయునట్టిఔషధములు, రసములకు, ముజబ్బిరాఅందురు.

## శిరోరోగమునందు వర్జనీయచికిత్స

నీర్సముకలిగించునట్టి ఔషధములు అనగా అంగములకునుస్థిరి కలిగించుట, వచ్చు, తిమ్మిరి, కలిగించునట్టి నల్లమందు, లఖుమన, లఘుమని, సేపుచెట్టువేరు, మొదలగువస్తువులతో, జాగ్రత్తగానుండవలెను. అనగా ఉపయోగించకూడదు, ఇట్టిహత్తుకర వస్తువులను శిరోరోగములందుపయోగించుటచేత కండ్లుచీకట్లుకలిగించు రోగమును కలిగించును. మిక్కిలి అవశ్యమని తోచినయెడల సావధానముగా ప్రయోగించవలెను. సావధానముచేక చికిత్సచేయుని యెడల ఇటువంటి చికిత్సవలన రోగికి మరణము సంభవించును. గర్భవతియగు స్త్రీకి తలనొప్పి సంభవించినది. అందుకు చికిత్స నల్లమందు, కర్పూరము, సిర్కా, (పులుసుపదార్థము) నందుకలిపి లేపనముచేయబడినది. కొంతకాలమునకు ఆ స్త్రీ గర్భిణి క్షీణమైనది. తదుపరి సక్తా అనగా (సన్నానము) అను వ్యాధి సంభవించి

యీ సక్తా అవస్థవలన 32 గంటలలో చనిపోవునగని నాకీ.....
అనువారు చెప్పియున్నారు.

ఖుర్షె అంజరూద్ ఔషధవిధి.

అంజరూద్, తుమ్మకాయరసము ఎండించినది, రసాంజనము, గులాబిపువ్వులు, నల్లకలువపూలు, మామీరాసా, కావాలుపిత్తులు, ఇవి యీవత్తు సమముగాతీసుకొని. ఇసప్ గోలు గింజలునానవేసిన నీళ్ళతో నూరి కుప్పెలుకట్టుకొని అవసరమువచ్చిఢనియాలునూరి రసముతీసి ఆరసము నందు యీ కుప్పె అరుగదీసి తలనొప్పులకు లేపనము చేయవలెను.

ఉక్తరోగమునందు పత్స్యాలు.

యవగంజి, పెసరకట్టు, నేతిబీరకాయలు, పాలక్ కూర, దోస కాయలు, పచ్చిఢనియాల కషాయము మొదలగునవి వాడవలెను. దగ్గు మొదలగు ఉపద్రవములు ఏమియు లేనియెడల చింతపండు, పుల్లదా నిమ్మ, ఆల్ బకరా మొదలగు పులుసులందు తయారు చేయబడినచారు ఉపయోగించుట లాభదాయకము.

వ్యాఖ్యానము

సమస్త మస్తకరోగములయందు అనగా వేడిసంబంధమగు వ్యాధు లయందు యవపేయము మిక్కిలి శ్రేష్టము. ఏలననగా నిది సలువచేసి దోషములను ప్రవాహముచేసి తీసివేయు సమర్థతగలది. మరియు, దోషము లను భేధించి ఆమాశయమునందుండు ఆ పదోషమును పక్వముచేయును. శరీరనరములయందు వెంటనే ప్రవహించు సమర్థతగలది. మరియు, నిది స్వాదిష్టముగను సమరస్యకారిగానుండును. దాహమును పోగొట్టుట యందు సమర్థతగలది. గాని వెంటదోషముల నెంతమాత్రము వృద్ధిపొం దనీయదు. మరియు, నిది ఆమాశయమునందు గురుత్వమునుగాని, వాతమునుగాని, పిత్తమునుగాని, చేరనీయదు. యవగంజి తయారు చేయుటలో యవలు బాగుగా ఉడికి ఉబ్బి చితికిపోవలెను. యవల యందు పుచ్చుగాని, దుర్గంధముగాని, ఉండకూడదు యవలతో కాచిన

నీరు ఎఱ్ఱనిరంగుగా మారువరకు యవగింజలు ఉబ్బి చితుకువరకు కాచుటమంచిది.

## యవగంజి కాచువిధము

పుచ్చుమొదలగు దుర్గుణములులేని యవలను బాగాదంచి పొట్టు యావత్తు చెరిగివేసి, పరిశుభ్రమగు నిర్మలమగు మంచినీళ్ళయందు వేసి మందాగ్నిచే పక్వముచేయవలెను. మరియు పక్వమైనకొలది పొంగుతగ్గును నీటిభాగము తగ్గి, ప్రమాణము నిలిచినవెనుక, వడకట్టి, ఉపయోగించుకొనవలెను. మరియు యవలను నీళ్లలోవేసి ఉడకబెట్టి ఒకపొంగు రాగానే, ఆనీళ్లను వంచివేసి, తిరిగి తాజానీళ్లుబోసి బాగుగా పక్వము చేయవలెనని కొందరిమతము. యవలకంటె పదిరెట్లు నీళ్లుపోసి కాయవలెనని మరికొందరు, యవలకంటె ఇరువైనాలుగురెట్లు నీళ్లు పోసి, కాచవలెననియు, వచించుచున్నారు. హకీమ్‌షేక్‌జాఅలీసేనా గారు, వచించినదేమనగా, యవగంజియందు 20 శిక్రిజ్‌నీళ్లనుచేర్చి ఒక శిక్రిజ్ యవలను చేర్చవలెననియు, శిక్రిజ్ అనగా (ఒకతులము) శిక్రిజ్ రెండువిధములు. ఒకటిచిన్నది రెండవది పెద్దది, చిన్నది 3 అవుకియల ప్రమాణము. పెద్దది. 8 అవుకియలప్రమాణము. అవుకీయము ఒకటికి 7న్నర మిస్కాల్‌మెత్తు. మిస్కాల్ ఒకటికి 4న్నర మాషముల ప్రమాణము. ఈలెక్కప్రకారము చిన్నశిక్రిజ్ రమారమి 5న్నర తులములు ఉండును. పెద్దశిక్రిజా 25 తులముల 4 మాషములుండును. అబుఅలీసేనామతానుసారముగా నీళ్ళు 20 భాగములుచేర్చుట ఉత్తమముకాని వైద్యవరులనేకులు 14 భాగములు చేర్చుటమంచిదని మతభేదములు చూపియున్నారు.

## సాధారణశీతమువలన కలుగు తలనొప్పి లక్షణములు.

సాధారణ శీతప్రకోపమువలన కలుగు తలనొప్పిని పార్శీభాషలో దర్దెసర్ సాజిజ్‌బారిద్, అందురు. ఈవ్యాధి సామాన్యముగా జలుబు

వలనపుట్టుచున్నది ఇవి రెండువిధములు అనగా అంతర్శీతము బహిర్శీతము.

బహిర్శీతమనగా తలకు శీతగాలి విశేషముగా తగులుట, మంచు పడునప్పుడు తలకు గుడ్డలేకుండా బైటసంచారముచేయుట, చల్లని నీళ్ళయందు మునుగుట, ఈదుట, మొదలగు కారణములచేతనున్ను కొండవాగుయొక్క వేడినీళ్ళయందు స్నానముచేయుటవలనకూడా ఈవ్యాధి కలుగుచున్నది. కొండవాగుమయొక్క నీళ్ళను త్రాగుట, గంధకము, సజ్జాక్షారము, ఉప్పు, మొదలగునవి భూమిలోభాగము నందుండునట్టి బావులనీళ్లను త్రాగుటవలన ఈనీళ్ళయందు స్నానముచేయుటవలన, కూడా తలనొప్పి ఉత్పన్నమగుచున్నది, అనగా, ఈనీళ్ళుసాధారణముగా ఉష్ణప్రకృతికలిగియుండుటవలన శరీరముయొక్క రోమకూపములనువిశాలపరచి లోభాగమునందుండు ఉష్ణమును బయటికి తీసివేయుటవలన శరీరవేడి నష్టమై శరీరమునందు శీతము కలుగును. సర్వశరీరమునందుగల ఉష్ణభాగము తగ్గుటచేత మెదడుకూడా శీతముగలదై ఉండును. మరియు ఆమాశయమునకున్ను మెదడునకున్ను కేవలము సంబంధముండుట చేత ఈ రెండుఅంగములకు నష్టము పుట్టించుచుండును. ఇట్టినష్టము దుఃఖమునకే తలనొప్పియని భావించవలెను.

## శీతజశిరోరోగలక్షణములు.

తలనొప్పియొక్క ఆరంభదశ తలవెనుకభాగమునందు పుట్టుట వెచ్చనిగాలితగులుటవలన హితవుగానుండుట అనగా ఎండయందుగాలి, నిప్పుసెగవలన గలుగు వెచ్చనిగాలి తలకు సోకుటవలన, నొప్పిశాంతి నొందుట, జ్ఞాపకశక్తి లేకపోవుట, పిచ్చివానివలెనుండుట, జ్ఞానేంద్రియములకు నష్టముకలుగుట, ఈమొదలగు చిన్నెములు, శీతజశిరోరోగ లక్షణములని గ్రహించవలెను. ఈకారణములవలననే ఈతలనొప్పికి ఉన్మాదజ శిరోరోగమనికూడా చెప్పబడుచుండును.

## శీతజ శిరోరోగ చికిత్స

శీతజ శిరోరోగియొక్క తలయందు శీతముగ్గి ఉష్ణము ప్రవేశించుటకై, తకమీద్ (వేడిపొట్లములతో కాచుట) ఇనికిబాప్ (ఉష్ణమును ప్రవేశింపునట్లుచేయుట) ఆవిరిపట్టించుట, వేడినీటియందు కొంత సేపుంచుట, సాధారణరీతిగా స్నానము చేయించుట, మరియు ఉష్ణప్రభావముగల తైలములు అనగా సోసన్ తైలముగాని, చమేలీనూనెగాని, దవనము, మరువముయొక్క నూనెగాని, తలయందు మర్దించవలెను. అబ్రేష్మ్‌ఖామ్ (స్పంజి) ను పైనవివరించిన నూనెయందు ముంచి వేడిగానుండునప్పుడు తలపైనుంచుట ఉత్తమము. మరియు బనప్షా లిహాశోడా, (శ్లేష్మాంతకం) ఖిత్మీగింజలు, అవిశవిత్తులు, అంజూరపండ్లు ఈ మొదలగు కషాయమునందు శికంజబీన్ చేర్చి ఇచ్చినయెడల మలమును మెత్తపరచి విభంధములను వదలించును. తదుపరి వకటిరెండు విరోచనములు చేయించవలెను. అటుపిమ్మట లఘు ఆహారములను ఈక్రింద చెప్పినరీతిగా ఇప్పించవలెను. శనగరొట్టె, కోడిపిట్ట, పూరేడుపిట్ట, మాంసరసములయందు జీలకర్ర, దాల్చినచెక్క చేర్చి ఇప్పించవలెను.

## తకమీద్ (కావడము) చేయుక్రమము.

శరీరమునందు ఉష్ణము ప్రవేశింపచేయుటకు తకమీద్ అందురు. ఇది రెండువిధములు (1) తడివస్తువులను వేయించి కాచుట, (2) పొడి వస్తువులచేత కాచుట, తడివస్తువులచేత కాచుటకు తకమీద్‌తర్ అందురు. అనగా ఎద్దు, దున్నపోతు మొదలగుజంతువుల మూత్రకోశమును తెచ్చి పరిశుభ్రము చేసి యుంచుకొని సమయమునందు రోగానుగుణ్యముగా వేడినీళ్ళుగాని లేక ఆయా వ్యాధికి తగునటుల కషాయములనుగాని ఆనంచియందుబోసి నొప్పిగల స్థలములందుంచుచూ, చల్లారిన వెంటనే తీసి తిరిగి వేడివస్తువు వేయుచు కాచుచుండుట లేక బట్టనుగాని స్పంజిగాని

వేడినీళ్లలోగాని కషాయముగాని ముంచి, నొప్పి అంగములయందు కాచుట. ఇటుల కాచుటవలన మిక్కిలి లాభదాయకమగును.

పొడివస్తువుల వలన కాచుట అనగా బట్టను పొట్లముకట్టి కాచుట, రాయిగాని, ఇటుకగాని, కాల్చి బట్టలోవేసి కాచుట, అథవా, పొడివస్తువులు వేయించి బట్టలోవేసి పొట్లముకట్టి కాచుట, శీతజ శిరోరోగమునందు ఉపయోగించునట్టి 2 వస్తువులను కాచుట. అనగా ఉప్పు, గోధుమపొట్టు, సజ్జలు, (గంటెలు) ఇసుక, మొదలగు వానిని ఏకముగా కలిపిగాని, వేరు వేరుగా గాని ఉపయోగించవలెను. వేడినీళ్ళలో ఆవిరిపట్టించుట కషాయములు మొదలగు వానితో కాచుట, ధాన్యాదులపొట్టు వేయించి కాచుట, రాయి ఇసుక మొదలగు వానిచేత కాచుట లేక కాల్చిన రాతిపై కషాయములనుగాని, నీళ్ళుగాని పోసి ఆవిరి పట్టించుట, మొదలగునవి చేయుటవలన తలయందు వేడి ప్రవేశించును.

తలయందు జలుబు ప్రవేశమగుటకు లోపలికారణము అనగా మిక్కిలి చల్లని జలపానము, ముంచుకడ్డనీరు త్రాగుట, లేక చల్లని ఔషధములు, చల్లనిభోజనపదార్థములు భుజించుట లేక శీతముకలిగించునట్టి వస్తుభక్షణము మొదలగు కారణములవలన లోభాగమునందు శీతము ప్రవేశించి తలనొప్పి కలిగించును.

దీనిలక్షణము అనగా పూర్వోక్తయావత్తు కారణములు, అనగా రోగి ఇటువంటిశీతభోజనపదార్థములను ముందు భుజించియుండుట, తలస్పర్శించుటవలన చల్లగా యుండుట, తలకు వేడితగులుటవలన నొప్పి శాంతించుట, మొదలగు లక్షణములు అంతర్ శీత కారణ శిరోరోగ లక్షణములని గ్రహించవలెను.

## శీతజ శిరోరోగ చికిత్స.

బాబూనా, నఖంచిప్పలు, మరువము, పొదీనాఆకు, చేదరాశి ఆకు, శీరెఖిష్మని, మొదలగువాని కషాయములను వేడివేడిగా తలపై

పోయవలెను. రోగి మెంతవరకు సహించకలుగునో అంతవేడిగా పోయవలెను. ఈకషాయములలో ఆవిరిపట్టుట యైదివి చామంతిపూవులు, సౌసన్, కస్తూరి, అంబరు, అగరు, నర్గిస్‌పూవులు, చంబేలిపూవులు, నారింజపూవులు, తులసిపూవులు, సువాసనగలపూవులు, సుగంధద్రవ్యములు, అనగా ఉష్ణవీర్యముగల పరిమళద్రవ్యములను, సువాసనచూడవలెను. జున్ను, హాబ్బుల్ ఘార్, చంగల్వకోష్టు, చలవమిరియాలు, ఇవి సమానభాగములు దంచి, చూర్ణముచేసి వస్త్రగాలితమొనర్చి, తులసిరసమునందుగాని, పన్నీరుతోగాని, మెత్తగానూరి, తలపై లేపనము చేయవలెను మరియు రంగుబట్ట అభిరిపట్టునపుడు, తలకు కట్టుకట్టవలెను. దీనిచేతవ్యాధి తగ్గిపోవును. మరియు వ్యాధిఉష్ణమువలకలిగినదా లేక శీతమువలన కలిగినదా, అను విమర్శవైద్యుడు కనుపెట్టవలసినది. ఎటులననగా, ఉష్ణముచేత కలిగినవ్యాధి. ఈచికిత్సవలన తగ్గనేరదు.

## దోషయుక శిరోరోగలక్షణములు

దోషమనగా, చమ్మనుకలిగించునట్టి వస్తువు, నిది పథ్యభోజనపక్వమువలన కలుగుచున్నది. పథ్యభోజనము అనగా శరీరభాగములు వృద్ధిపొందుటకుశక్తిగల పదార్థములను పథ్యభోజనమందురు. అనగా భోజనము పక్వమై, దీనివలన మాంసము, త్వక్కు, ఏర్పడుచున్నది. పథ్యభోజనముయొక్క పూర్ణభాగము, శరీరమునందు ప్రవహించునపుడు అనేకరూపములుగా మారుచున్నది.

శరీరమునందు దోషములను పుట్టించునట్టి వస్తువులను భుజించుటవలన వాతము, పిత్తము, శ్లేష్మము అను దోషములను పుట్టించి ఆమకోశమును దెరచి హృదయమునందుము రక్తనాళములద్వారా శరీరముయావత్తుసర్బలము నొందించి పరిదానమగు శిరస్సునందుచేరి నొప్పిని కలిగించును.



పథ్యాహారము, శరీరమునందుగల సప్తధాతువులకు బలము కలిగించి బలము, ఆరోగ్యమును కలిగించును గాన కాలమును, ఋతువు, దేశము, మొదలగునవి ఆలోచించి పథ్యాహారములనే చేయుచుండు పురుషుడు శతాయుష్మంతుండగును.

మనము భుజించిన ఆహారము నోటియందు నమలబడి ఆమాశయమునందు చేరి ఆమాశయమునందుగల వేడివలన అందుగలశక్తివలన పలచగా ద్రవపదార్థమై రసమగుచున్నది. ఆరసము యవగంజివంటి రంగుకలిగియుండును. తక్కిన మలినభాగము అనగా తాలుభాగము ప్రేగులయందు చేరి గుదద్వారమునుండి బైటికి త్రోయబడుచున్నది. మనము త్రాగిననీళ్ళు అన్నమువెంట ఆమాశయమునందు చేరి, అన్నరసముతో కొంతకలిసి, తక్కినది మూత్రకోశమునందు ప్రవేశించి బైటికి విడువబడుచున్నది. ఆమాశయమునందు చేరిన యావత్తుపదార్థము రూపముమారినను రుచిమారనేరదు. దీనికి దృష్టాంతరము వమనమైనపుడు మనము యేవస్తువులు యేరుచిగలవి యేవాసన గలవి భుజించుదుమో అదే రుచివాసనయుండును గాని మారనేరదు. ఇదియే దృష్టాంతరము.

స్వచ్ఛమైన రసభాగము ఆమాశయముయొక్క నుండి కొంచెము చిక్కగానుండి సూక్ష్మములగు నరములద్వారా ప్రవహించి నరములయందుండు వేడిచేత క్రమముగా పలచనరసమై తదుపరి కలిజా (యకృత్) యందు చేరి, అచ్చట వేడిచేత పక్వమై హృదయము (హార్టు) యొక్క

నరములయందు ప్రవహించి అచ్చటివేడిచేత పక్వమై హృదయము నందు ప్రవహించి తనస్వరూపమునుమారి రక్తము, వాతము, పిత్తము, శ్లేష్మము అను స్వరూపములను గ్రహించుచుండును. అనగా రసము దోషములుగా మారుచున్నదనుట.

మరియు ఈరసము హృదయమునందుచే దోషములను బేధించ బడినదై, నరములద్వారా ఆయాఅంగములయందు ప్రవహించబడి, ఆయాఅంగములకు, బలముకలిగించుచుండును. నరములనుండి ఆరక్తము యొక్క ప్రకృతిచేత ఆఅంగములయొక్క స్వభావికమును గ్రహించు చుండును ఈకారణమువలన ఆఅంగములు వాటివాటిపనులను నెరవేర్చు కొనుటకు సామర్థ్యముగలవై యుండును

* ఒకవస్తువుయొక్క స్వరూపమును, మారినదానిని ఇస్తహాలా, అందురు అనగా భుజించిన వస్తువులు పక్వమై మాంసము మొదలగు సప్తధాతువులకు బలముకలిగించు రసమువిభాగము.

మరియు నిష్ఫలమగు దానిని దూరముచేయుచు ఆభాగమును తనరూపముగా చేయుచుండును. అన్నరసము శరీరముయొక్క భాగము లందు 1½ విధములుగా పక్వమగును. గాని ఈపైనవ్రాసిన మూడువిధ ములగు పక్వములకు సురయాని భాషయందు కౌసూర్ అందురు. మొద టిపక్వమునకు కసూస్, అందురు. ఈపుస్తకమునందు ఇంతవరకు వ్రా యుట వుచితముని గ్రంధకర్త విరమించుచున్నాడు.

### దోషముల వివరము.

దోషములు నాలుగు విధములు 1 రుధిరదోషము, గర్మతర్, (వేడిచెమ్మగలది.) 2 పిత్తదోషము, గర్మకుష్క, (వేడిగలది, ఆర్ద్ర

* ఆమాశయమునందు పక్వమగుపక్వమునకు సురయాని భాషయందు కైలూస్ మాద్దా అనగా మలమునకు పేరు. తనయందు దశవదలి రెండవదశను అవలంబించునట్టి దానిని ఇస్తహాల అందురు దీనివలన చతుర్దోషములు కలుగుచుండును. రెండవ, పక్వముహృదయమునందు కలుగుచున్నది దీనిని సురయాని భాషయందు కైమూస్ అని చెప్పుదురు.

కినది.) 3 కఫకోపము సర్ద్కర్ (జలుబు చర్మగలది) 4 సర్ద్ సుర్ (శీతము శుష్కత్వముగలది) పిత్తము వాతము ఈరెంటియొ - ద్వంద్వమునకు శుష్కత్వము, జ ు బు అందురు. ఈరెండుదోష ులవలన కలిగిన తలనొప్పిని, రీహాఅందురు. రీహాఅనగా వాతపైత్య ్కృతి. ఇది 5 విధములు.

## రుధిరదోష శిరోరోగ లక్షణములు.

రుధిరదోషమువలన కలిగిన తలనొప్పికి వైద్యపుంగవులు సర్ధ బయి అనగా చలువవలన కలిగినదని భావింతురు. దీనిలక్షణములు, ోగియొక్క నేత్రములు ముఖము ఎఱ్ఱగానుండుట, ముఖము కనురెప్ప ు వాచుట, నాడి, నిరోగమనుష్యుని నాడికంటె పుష్టి, దురుసు, స్థూ త్వము, విశాలత్వము, కలిగియుండుట, మూత్రము చిక్కగానుం ుట, తలయందు అదురు, బరువు, నొప్పివిశేషముగా నుండుట, ధికముగా ఆదుర్దా, తంద్ర, ఉత్పన్నమగుట, ఈలక్షణములు కలిగి యుండును.

## రుధిరదోషశిరోరోగ చికిత్స

ఈవ్యాధియందు శిరావేధనము చేయుట, పిక్కలయందు శస్త్ర ుతోగంట్లుచేసి రక్తముతీయుట, మరియు, ఉన్నాబ్, (రేగుకాయ లు) ఆలుబకారా, సపిస్తాఁ, (శేష్మాంతకము) చింతపండు, బనప్షా, పిత్తపాపడ, యీమొదలగువాని కషాయమునందు మాదీఫలరసాయన మునుచేర్చియివ్వవలెను. దీనివలన కోష్టము మృదువరచి సుఖముగా విరోచనమగును. తరువాత రుధిరమునందుగల ఉష్ణవికారము శాంతి నొందించునట్టి ఉన్నాబ్షర్బతు, ఆలుబకరాషర్బతు, కలువపూవులషర్బ తు, మొదలగునవి పానముచేయించవలెను. తదువరి మలముగు వెడలిం చవలెను. ుటుసిమ్మట యవపిండి, కాయి, ఈరెండునూన్ని వేడుఆకు రసముతో కలిపి, అందులో శిర్కాచేర్చి, తలకులేపనముచేయవలెను,

మరియు సారపిత్తులు, కాహువిత్తులు, పెద్దసాయులరసములో గుల్‌రోగన్, చనపాలు, కలిపి నశ్యముచేయవలెను. ఈనశ్యము ప్రధానమైనది.

మరియు కాహుపత్తులు, పెద్దసాయువిత్తులు, సారకాయరసము, పచ్చిధనియాలరసము, మొదలగువానియందు గుల్‌రోగన్, శిర్కా కొద్దిగాకలిపి, మూతలేని సీసాలోవేసి కొలువుగా ముక్కుదగ్గరనుంచి వాసన చూపించవలెను.

### ఇందుకు పథ్యములు.

పులుసుగలపదార్థములు, అనగా ఆలుబకారా, పచ్చని ఆలుబకారా. చింతపండు, నారింజకాయపులుసు, అంగూర్ (పచ్చిద్రాక్ష) పులుసు, పుల్లదానిమ్మపులుసు, చేర్చిన భోజనపదార్థములందు శర్కర కొంతచేర్చి ఇవ్వవలెను.

పాలక్‌కూర, చిరిశెనగపప్పు. పై పులుసుపదార్థములనుచేర్చి, పథ్యమొసంగవలయును. పులుసుపదార్థసేవనమునదగ్గు కలిగినయెడల పులుసుపదార్థములు, ఎంతమాత్రము ఉపయోగించకూడదు. కేవలము పులుసులేని పదార్థములు, యవనూకగంజి ఇవ్వవలెను.

### పైత్యదోషమువలన కలుగు శిరోరోగలక్షణము.

రెండవ శిరోరోగము పిత్తమువలన ఉత్పన్నమగును. దీనిలక్షణములు, తలనరములయందున్నూ పైభాగమునందున్నూ, ఉష్ణముగానుండుట, ముక్కుఅదురుట, నోరుచేదుగానుండుట, నిద్రలేమి విశేష దాహము కలుగుట, నాడితీక్ష్ణముగా నడుచుట, మూత్రము పసుపుపచ్చగానుండుట ముఖము పచ్చగానుండుట, మొదలగు లక్షణములు కలిగియుండును. ఇదిపైత్యాధిక్యమువలన కలిగిన తలనొప్పి అని భావించవలెను.

### పిత్తజశిరోరోగచికిత్స.

ఈరోగియొక్క పిత్తదోషము నాశముచేయగలందులకై ఈక్రిందవ్రాయబడిన విరోచనఔషధముచే విరోచనము చేయించవలెను.

అనగా పిసోహారీణి (పచ్చని రక్తాయము) తెలుపు రక్తాయము, ఆలుబకరా, దాక్షపండ్లు, బేదానా, ఉన్నాబ్, యష్టిమధుకము, చింతపండు బనఫ్షా, సపిస్తాఁ ఈ వస్తువులు సమభాగములు గూర్చి కషాయము గాచి వడియగోసి ఇందులో మహాదిఫలకషాయమును, రేలకాయగుజ్జు కలిపి పానముచేయించవలెను. మహాదిఫలకషాయముకంటె శిరాఖస్త గుణాధిక్యముగాన మహాదిఫలకషాయమునకు బదులుగా శిరేఖస్త చేర్చవలెను. మరియు, విరోచనానంతరము దోషములన్నియు పరిగ్రహించి ప్రకృతిని సామాన్యావస్థయందు మార్చునట్టి తైలమర్దనములు, తైలములు, గండూషములు, మొదలగు శీతజచికిత్సలు చేయవలెను.

అనగా రుధిరజశిరోరోగమునందు వ్రాయబడినవస్తువులనే ఉపయోగించవలెను. మరియు, గోధుమపొట్టు, ఖతమీ, బనఫ్షా, ఈ మూడువస్తువులు నీళ్ళలో వేసి కాచి గోరువెచ్చగానుండు కషాయముతో శ్వేతతకర్మ చేయవలెను.

### తరేడా (శ్వేతకర్మ) విధానము.

రోగి రెండుకాళ్లు ఎత్తుప్రదేశమునందుంచి వెనుక తలగడనుంచి కూర్చుండబెట్టి పాదములక్రింద కషాయముంచి క్రింద పడకుండునటుల యేదైన యొకపళ్ళెముసుంచవలెను. మరియు, రోగిముఖమునకు ఆవిరితగలకుండునటుల రోగిముఖముపై దృఢముగా నొకబట్టను తెరగానుంచవలెను. ఎందుకనగా కషాయముయొక్క ఆవిరి రోగిముఖమునకు తగిలినయెడల రోగికి పిచ్చి ఆరంభమగును. దీనివలన మెదడు చెడిపోవును. తదుపరి ఇద్దరు మనుష్యులు ఆకషాయమును ముంతలతోనెత్తి రోగియొక్క మోకాళ్లమీద పాదములమీద ధార ఆపకుండా ఎత్తునుండి పోయుచుండవలెను. మరి యిద్దరు ఆరోగి తొడలనుండి పాదములవరకు మర్దించుచుండవలెను. తరువాత ఆకషాయముతో రుద్ది రుద్ది కడిగి రోగిపాదములు, కాళ్లు శుభ్రముగా తడిలేకుండా పొడిబట్టతో తుడిచి ఆరబెట్టవలెను. తదుపరి నవాను మొదలగు వానిచేత తొడలవరకు బంధిం

చవలెను. ఇటుల బాధించుటవలన ఆచిరి పరమాణువులు తలనుండి క్రిందికిదిగినవి తిరిగి పైకెక్క చాలవు తరువాత రోగియొక్క రెండుపాదములు తల బట్టలేకుండా పరుండబెట్టి తక్షణ యావత్తుశరీరము ధృఢముగను బట్టతో కప్పవలెను. ఇటుల కప్పుటవలన రోగిశరీరమునుండి చెమటవచ్చిన మొదల శరీరముపైనుండు బట్ట తీసివేయవలెను. అయినను వకేసరి కూడాను తీయకూడదు ఇట్లుశరీరముపైనుండు బట్టఒకేసరి యూయము తీయుటవలన శరీరమునకు గాలి, శీతము, వేడి, మొదలగునవి ప్రవేశించి శీత ఉష్ణకారణములవలన శరీరము యావత్తునొప్పి ఆరంభమగును. మరియు, ముందుకాళ్ళకు చుట్టిన బ్యాండీను మొదలగునవి విప్పనారంభించిన మొదల క్రిందినుండి విప్పివేయవలెను. ఈరోగికి రుధిరదోషముగల శిరోరోగమునందు చెప్పిన విధానముగా పథ్యమిడవలెను.

## సూచనీయము.

పిత్తప్రకృతియొక్క శిరోరోగమునందు చలువచేయునట్టి ఔషధములను ఉపయోగించుటవలన పిత్తతాపము శాంతినొందించి రోగికి హితవుకలిగించును. మరియు రుధిరదోష శిరోరోగమునందు దోషమును హరించునట్టి విశేషప్రయత్నములను ఆలోచించవలెను.

## కఫజశిరోరోగలక్షణములు.

మూడవదియగు శిరోరోగము కఫజదోషమువలన పుట్టుచున్నది దీనిలక్షణములు:— అనగా తలబరువుగానుండి పోటులతోచుట, నీరసము నిద్రాధికముగానుండుట, తలస్పృశించినమొదల చల్లగానుండుట, ముక్కు నోరు జిడ్డుగానుండుట, నాడి మందముగానుండుట, మూత్రము తెల్లగను చిక్కగానుండుట, అనగా మూత్రము తెల్లగానుండుటకు రెండు కారణములుగలవు. (1) దోషము మిక్కిలి అధికమగుటవలన తనంతట తాను వెడలనారంభించును. (2) దోషములము స్వల్పముగా నుండినను ప్రకృతి తనబలమువలన ఆదోషమును మూత్రముద్వారా వెడలింపచేయును.

మొదటిగారణముయొక్క చిన్నఃములు అనగా మూత్రము పీర్యము వలెనుండి వెంటవెంట వెడలనారంభించును. ఏదోక విధమగు రంగుకలిగినటులుండును. దీనిని ప్రకృతి తనబలమువలన వెడలించుచున్నది. మరియు దీనియందు మిక్కిలి ధవళవర్ణము, బహురోగ (రోగ సంధి) దినములలో కలుగును. తదుపరి శ్వేతమెక్కువగానుండును. అనగా నిజదశయందుండునటులుండును.

### కఫజశిరోరోగచికిత్స.

ఈరోగమునందు మేము వక్కాణచుచున్నట్టి ఓషధులకషాయములు, ఔషధములు ఉపయోగించవలెను. అనగా సోపు, యష్టిమధుకము, గుల్ ఖందు, మొదలగునవి ఉపయోగించవలెను మలముపక్వమగు చిన్నఃముం కనుపించినయెడల అయూరజ్ ఫైకరా, బేహానాకాయలు, సకమోనియా, చేదుపుచ్చకాయగుజ్జు, యీవస్తువులను నూరి యివ్వవలెను. దీనివలన సర్వశరీరగతమగు యావత్తుకఫదోషము, వెడలిపోవును. శరీరము స్వస్థతనొందినపిమ్మట శిరోవిరోచనమునకు ఉపయోగించునట్టి సమస్తయారజాతులను, నిచ్చుట మిక్కిలి ఉత్తమము.

### శిరోవిరోచనవటి

ముసాంబరము, తెల్లతెగడ, చిన్నసోపు, రూమిమస్తకి, సముద్రలవణము ఈవస్తువులు యావత్తు సమయానుకూలముగాచేర్చి దంచి చూర్ణముచేసి వస్త్రగాలితమొనరించి తేనెచేర్చినూరి శనగగింజ ప్రమాణముగా మాత్రలుజేసి ఇవ్వవలెను.

### సబియార్ మాత్రలు చేయువిధము.

ముసాంబరము, రూమిమస్తకి, తెగడ, గారీఖూన్, సముద్రలవణము ఇవి యావత్తు ఆవశ్యకతానుకూలముగా కల్వమునందుచేర్చి నూరి చూర్ణించి తేనెలోకలిపి శెనగగింజ ప్రమాణముగా మాత్రలు జేసి రాత్రికాలమునందు ఒక్కొకమాత్రచొప్పున పుచ్చుకొనవలెను.

### సమస్తమగు యారజ్ మాత్రలు చేయుక్రమము

అనగా మాసాంబరము, రూమిమస్తకి, తెగడ, గారిఖూన్, సముద్రలవణము ఈవస్తువులను అవశ్యకతానుకూలముగా చేర్చుకొని తేనెతోగాని, నిమ్మకాయరసముతోగాని, నీళ్ళతోగానినూరి మాత్రలు చేయవలెను.

ఈ ఔషధము రాత్రికాలమునందు మాత్రమే ఉపయోగించుటకు యోగ్యమైనది. గనుకదీనిపేరు హబ్బెసబిఖూర్ అని చెప్పబడినది. సబ్ అనగా రాత్రిభాగమునకు పేరు.

శిరస్సు స్వస్థతనొందుటకై యారజ్, శికింజబీన్‌గాని, ఆవాలు, అక్కలకర్ర, దవనము, మరువము, చామరాసిఆకు ఈవస్తువులను తేనెతోగాని, తరువాణితోగాని కలిపి గండూషము చేయవలెను. ఇటుల చేయుటవలన శిరోదోషము తగ్గిపోవును. ప్రకృతి నిజ అవస్థయందు రాగలందులకై లేపనములు, కావడములు, మొదలగునవి చేయవలెను. ఈవస్తువులను పైనవ్రాయబడిన శీతజశిరోరోగమునందు చెప్పబడినవి.

బాబూనా, సోపు, నఖుంచివ్వలు ఈవస్తువులను కషాయముకాచి ఉష్ణముగానుండు కషాయముతో తలను కడగవలెను. మరియు, అడవిసదాపా, బాబూనా, దవనము, మరువము, పోదీనాఆకు ఈవస్తువులను కషాయముకాచి ఉష్ణవీర్యముగల తైలములను చేర్చి ముక్కు కర్ణరంధ్రములయందు పోయవలెను. రోగి తుమ్ముటకు ఉపాయములను ఆలోచించవలెను. ఈరోగమునందు తుమ్మురాగలందులకై చేయు ఉపాయములు 2 విధములు జున్న, ఫర్ఫీయూను లేక చుకందర్, దవనము, మరువము యొక్కరసమునందునూరి నశ్యము చేయవలెను. 2 విధి, నకచికిని, (ముక్కుతుమ్ముడాకు) జున్న, తెగడ, వీటినిమెత్తగా చూర్ణించి వస్త్రగాలిత మొనరించి యుంచుకొని రోగికి తుమ్మించవలసిన అవసరమున్న యెడల యీచూర్ణమును పొట్లముకట్టి వాసనచూపించిన యెడల తుమ్ములువచ్చును. ఈరోగమునందు శీతజశిరోరోగమునందు

ప్పబడిన పథ్యములు చనకొట్టు మొదలగునవి ఉత్తమములని గ్రహిం
పవలెను.

### వాతజశిరోరోగ విధానము.

నాల్గవది వాతదోషములవలన కలుగు శిరోరోగముయొక్క లక్షణములను యీ క్రిందవివరించుచున్నాను.

తలబరువుగాతోచుట, ముఖమునందు నల్లనిరంగుకనుపించుట, నరపట్టుకొనుటలు, నాడి, భిన్నాభిన్నములుగా మందగతికలిగి భిన్నము నడచుట, మూత్రము తెల్లగను పంచగనుండుట, మరియు దోషపక్వమెంతవరకుండునో అంతవరకు మూత్రస్థితి మారకుండుట, దోషపక్వమగునపుడు మూత్రము నల్లనిరంగుకలిగి చిక్కబడుట, శరీరమునవత్తు వాతదోషప్రకృతి ప్రవేశించినయెడల శరీరముయావత్తును నొచ్చుట, ఈవిధముగు లక్షణములు వాతజశిరోరోగమునందు కలుగు గుణములని గ్రహించవలెను.

మరియు కఫజశిరోరోగము వాతజశిరోరోగమును బోలియుండు కఫదోషశిరోరోగముకంటె వాతదోషశిరోరోగమునందు తలబరువు ఎక్కువగా నుండును.

### వాతజశిరోరోగచికిత్స.

మలము పక్వపరుచుటకై బిస్ఫాయిజ్, ఉస్తెఖద్దూస్, బేహానా, ద్రాక్షపండ్లు, గౌజుబాగ్, బాదరంజబోయా, ఆలుబకరా, పాచితీగె, ఈ వస్తువులను ఒకటిగాచేర్చి కషాయముకాచి, ఆకషాయమునందు మాదీఫలరసముచేర్చి పానముచేయవలెను. వాతదోషము మిక్కిలి ఆలశ్యము మీదగాని, పక్వముకానేరదయు, పైత్యదోషము మూడుదినములలో కఫదోషము పదిదినములలో వాతదోషము పదిహేనుదినములలో పక్వమగునని వైద్యవరులు నియమించియున్నారు.

మరియు పరిత్యేకదశయందు, మలము పక్వమై నల్లగా విడువబడిన యెడల విరోచనమునకు ఇప్పించవలెను. వాతజదోషముతీసివే

యగలందులకు యీ మాత్రలు ఆకాశవల్లి కషాయమునందుచేర్చి ఉపయోగించవలెను. లేదా పాతీగ మాత్రలు, అయినను ఇవ్వవచ్చు నని వ్రాయబడియున్నది.

### వాతజదోషహారవటి.

ఆకాశవల్లి, బిస్పాయజ్, గారీఖూన్, ఉస్తెఖుద్దూస్, అయారజ్ ఫైఖరా, తెగడ, ఇవియావత్తు సమభాగములుగాచేర్చి దంచి చూర్ణము చేసి వస్త్రగాలితమొనరించి, సోపురసముతో నూరి, శనగగింజప్రమాణముగా మాత్రలుచేసి, యుంచుకొని, అవశ్యకతానుసారముగా రోగికొసంగవలెను ఈమాత్రలవలన పూర్ణముగా రోగిశరీరము, శిరస్సు స్వస్థతనొందును. తదుపరి ప్రకృతి పూర్వరూపముగా మారగలందులకై బాబూనా, నఖము, దవనము, మరువము రసముతో నూరి గులేరోగన్ గాని చంబేలీనూనెగాని, కలిపి తలపై లేపనముచేయవలెను.

మరియు, బాబూనా, నఖము, చాదరాసీ, సీరేఇర్మని, గావుజబాన్, చుకందరాకులు, గోధుమపొట్టు, ఇవి యావత్తు వకటిగాచేర్చి నీళ్ళయందు వైచి కషాయముకాచి తలపై ధారగాపోసి కడుగవలెను. నరుగిస్ పూలు, కస్తూరి, అంబరు మొదలగు సువాసన ద్రవ్యములను వాసన చూపించవలెను. ఉష్ణవీర్యముగల తైలములు అనగా బాబూనా తైలము నరుగిస్ తైలము, దవనము, మరువముతో చేయబడిన తైలము మొదలగు తైలములను చల్లని తైలములలో కలిపి తలకులేపనము చేయవలెను.

చల్లని తైలమనగా బనఫ్షా మొదలగు తైలములుకూడా ఉపయోగించవలెను.

వాతప్రకృతివలన తలనొప్పికలుగునెడల స్వల్పముగు ఉష్ణవీర్యముగల వస్తువులను ఉపయోగించకూడదు. సామాన్యమైనవస్తువులుజలుబును హరించి ప్రకృతిని విజయశయము మారుటకు ఉపయోగించవలెను. వ్యాధ్యు. వాతము దగ్గమొందినదైనచో ఉష్ణవీర్యముగలవస్తువులను సరిదా

ఉపయోగించకూడదు. అనగా జలుబు, చెమ్మ, పుట్టించునట్టి వస్తువులను ప్రకృతిని కాపాడుటకై ఉపయోగించవలెను.

## వాతజ శిరోరోగపథ్యములు.

అర్థాంశముగా వేయించిన కోడిగ్రుడ్లు, కోడిమాంసము, కౌజుపిట్టమాంసము, పూరేడుపిట్టమాంసము, మొదలగువానియందు శనగపప్పును చేర్చి ఉడికించి ఇచ్చుట మిక్కిలి లాభదాయకము. భోజనమునకు ముందు ఒకఘడియలో జీర్ణమగునట్టి జవారిష్ (అవలేహము)ను ఇప్పించవలెను. వేడిగలవిగాని లేక శీతమును శమనము చేయునట్టి జవారిషులను ఇప్పించవలెను.

భుజించినతరువాత వాతప్రకృతి తగ్గగలందులకై ఎడమప్రక్కపు కొంతసేపు పరుండవలెను. ఇటులపరుండుటవలన ఎక్రృత్, ఆమాశయమును ఆరూఢపరచును. భుజించినఆహారము త్వరలో జీర్ణమగుటకు సహాయమగును.

మరియు ఈ వ్యాధిగలరోగి, శరీరపరిశ్రమపనులు మొదలగునవి చేయకూడదు. ఎందుకనగా చికిత్స యెంతజాగ్రత్తగాచేసినను పరిశ్రమ ద్వారా ఔషధబలము తగ్గిపోయి రోగమును యెంతమాత్రము తగ్గించుటకు శక్తి లేనిదై ఉండును వాతము విశేషఅధికముగాఉండునో అంత విశేషము చెమ్మనుకలిగించు ఆహారములను ఇప్పించవలెను. సర్వవాతములయొక్క చేష్టలను బుద్ధిమంతుడగు వైద్యునియొక్క యుక్తిచేత ఆలోచించవలసిఉన్నది. మరియు వ్యాధిబలమునకు తగినటుల పథ్యము ఔషధము వినియోగించవలెను.

## 5 వది వాతజతలనొప్పి లక్షణములు.

ఈతలనొప్పి మిక్కిలి వాతమువలన ఉత్పన్నమగుచున్నది. ఈ నొప్పి తలయొక్క భాగములయందు మారి మారి వచ్చుచుండుట, తలపీకినటులుండుట, తలయందు పురుగులు పాకినటులుండుట, చెవులయందు పోటుకలుగుట, చెవులో నాదము, ఓసగానుండుట మొద

లగు లక్షణములు విశేషవాతమువలన కలుగు తలనొప్పి లక్షణములని గ్రహించవలెను.

### 5 వ వాతజతలనొప్పి చికిత్స

తలయందు వాతదోషము ఘనీభవించుటవలన తలయందుండు స్నాయువులను బంధించి తలయందు వేదన కలిగించుచున్నది. గాన వాతదోషమును తొలగించి స్నాయువులకు బలము కలిగించునట్టి చికిత్సలను చేయవలెను.

శీరెఖిర్మని, బరంజాసఫ్, చామరాసిఆకు, దవనము, మరువము, సోపు, ఈవస్తువులు సమానభాగములుగా తీసికొని నీళ్ళయందు వేసి కషాయముకాచి రోగికిహితవుగానుండునంత వేడిగానుంచి రోగితలపై పోయవలెను.

మరియు, తులసిఆకు, పచ్చిదవనము, పచ్చిమరువము, యెండిన సోపు, ఈవస్తువులను వాసన చూచుచుండవలెను. మరియు, మిరియాలు, జున్ను, ఈవస్తువులను పన్నీరుతో నూరి నశ్యముచేయించి తుమ్మించవలెను.

మరియు, తలయందుగల వాతదోషము హరించి తలనొప్పితగ్గుటకై తుమ్మునుకలిగించునట్టి నశ్యములను చేయించుట మిక్కిలి ఉత్తమము.

ముసాంబరము, నఖదికిని (ముక్కుతుమ్ముడాకు) కుంకుమపువ్వు, తెల్లమిరియాలు, సుక్ (ఇది ఏకవిధమగు సుగంధద్రవ్యము) ఈవస్తువులను దవనము, మరువముయొక్క రసముతోమర్దించి నశ్యముచేయుట వలన దోషము హరించుననియు శ్లేష్మజశిరోరోగమునందు చెప్పబడిన విరోచనఔషధములను చేయ్యవలెననియు ఇమాంబుకరాత్ అను మహానీయులు వచించియున్నారు.

### వాతజశిరోరోగమునందు పత్యములు.

కోడిమాంసమునందు శెనగపప్పు, జీలకర్ర, దాలిచినిచెక్క

చేర్చి వండి భుజించవలెను. మరియు, ఇట్టిస్వభావికమగు ఇతర వస్తువు
లను సేవించవలెను. కాని వాతమును వృద్ధించునట్టి వస్తువులను ఉప
యోగించజనదు.

3 వది అంగ సంయోగదోషము వలనపుట్టినట్టి తలనొప్పి లక్షణము.

ఈక్రిందచెప్పబడు అంగములయొక్క సంయోగమువలన తల
నొప్పి ఉత్పన్నమగుచున్నది. అనగా (1) ఆమాశయము (2) గర్భస్థా
నము (3) గుదస్థానము (4) పిక్కలు (5) పాదములు (6) ప్రక్కలు
(7) యకృత్ (8) అరిచేతులు (9) మడిమలు (10) గుండె (11) ప్లీహ
ము (12) పొట్టపైపొరలు (13) వీపు (14) వీపునందుగల పొరలు
మొదలగు ఈపదునాలుగు అంగములసంయోగమువలన శిరస్సునందు
నొప్పి ఉత్పన్నమగుచున్నది. ఈపైన వివరించిన పదునాలుగు స్థానము
లయొక్క ప్రధానమగు మూలము హృదయము. ఆమాశయమునకు
శిరస్సునకు మధ్యనున్నది.

{ ఆమాశయసాధారణ దుష్టప్రకృతి ఉత్పన్నశిరోరోగ లక్షణములు. }

ఆమాశయమునందు సాధారణదుష్టప్రకృతి ప్రవేశించుటవలన
గాని లేక చెడుదోషములు ఘనీభవించుటవలనగాని తత్సంబంధమగు
కారణము వలన ఆమాశయము శిరస్సునకుగల సంబంధమువలన తలయం
దు నొప్పిపుట్టుచున్నది.

మరియు సాధారణదుష్టప్రకృతి ఆమాశయమునందు ప్రవేశిం
చుటవలన తలనొప్పికలిగినయెడల దీనిలక్షణములు అనగా భోజనాత్ప
రము తలనొప్పి విశేషముగావచ్చుట, భోజనాత్పూర్వము నొప్పికొద్ది
గానుండుట, మరియు సాధారణదుష్టప్రకృతిగల ఆమాశయముయొక్క
లక్షణములు ఈక్రిందవివరింపబడును. అనగా అప్పుడప్పుడు ఆకలిసమయ
మునందుకూడా నొప్పిఅధికముగా నుండును. ఇటుల వృష్ణాధిక్యతవలన
కలుగునని గ్రహించేది. దీనివివరము ముందు ఆమాశయరోగముల
యందు భిన్నభిన్నములుగా వివరింపబడును.

మరియు ఆమాశయమును శుద్ధిచేయునట్టి ఉష్ణజ, శీతజ, మొదలగు వస్తువులను ఆమాశయవ్యాధులయందు వివరించబడును.

ఆమాశయమునందుగల మలము దూషింపబడి దోషప్రకృతిగా మారి తలనొప్పిపుట్టించును. దీనిలక్షణములు. ప్రత్యేకముగా అనగా పిత్తాధిక్యతవలన్, కడుపులో కెళ్లుట, (కేవినటులుండుట) నేత్రములు పచ్చగానుండుట, నోరుచేదుగానుండుట, కడుపునొక్కుట, బిగబట్టుట, దాహము అధికముగా నుండుట, తలనొప్పి మధ్యమధ్య ఆగుచుండుట, వాంతి, పిత్తము వెడలుట, మొదలగు ఈలక్షణములు ఆమాశయమునందు పిత్తాధిక్యము వలన కలుగునని తెలియవలెను.

{ ఆమాశయమునందు పిత్తాధిక్యమువలన కలుగు తలనొప్పి చికిత్స. }

ఈవ్యాధి ప్రారంభదశయందు శికింజబీన్, వేడినీళ్ళలోకలిపి పానముచేయించి వమనము చేయించవలెను. తరువాత ఆమాశయమునందుగల వేడిశమింపజేయుటకై ఉచితమగు నుపాయములను ఆలోచించవలెను.

మరియు శిరస్సు, ఆమాశయమునకు బలముకలిగించునట్టి ఔషధములవలన శక్తికలిగించవలెను. మరియు తలకు బలముకలిగించునట్టి ఉపాయములు పైన పిత్తజశిరోరోగమునందు వ్రాయబడియున్నవి. కావున చదువరులు గ్రహించగలరు.

ఆమాశయమునకు బలము కలిగించు ఔషధములకు రుబ్ అందురు. ఇవిబద్ధకరమైనవి. అనగా బేదానాకాయలరుబ్, ఖర్జూరకాయలరుబ్, మొదలగునవి యని తెలియవలెను. మరియు చలువచేయుట, బద్ధము, (గుహత్వము) కలిగించుటఅవసరమని తోచినయెడల తబాషీరి గులాబిపూలు, వంటజేగురు, ఈవస్తువులను చూర్ణించి పైనవివరించిన ఖర్జూరపు రుబ్‌నందు చేర్చవలెను.

## రుబ్ చేయుక్రియము.

ఏవస్తువుతో రుబ్ చేయవలదిన యెడల ఆవస్తువును నూరి నీళ్లు చేర్చి రసముతీసి వడగట్టి చతురాంశము శేషించి చిక్కబడువరకు కాచి ఆరసమునకు సమానముగా శర్కరకలిపి తిరిగి పొయిమీదనుంచి కాచిన దానిని రుబ్ అనిచెప్పుదురు.

### { ఆమాశయమునందు కఫదోషమువలన కలుగు తలనొప్పి లక్షణములు. }

ఆమాశయమునందు విశేషముగా కఫము చెమ్మవిశేషించిఖనీభవించినయెడల దీనిలక్షణములు అనగా అజీర్ణము, నోరుజిడ్డుగానుండుట నోటివెంట నీరూరుట, పుల్లని త్రేణుపులుకలుగుట మొదలగు లక్షణములు కలిగియుండును. మరియు మధ్య, మధ్య, వమనమువెంట కఫము వెడలుచుండును. తిరిగి శాంతి నొందుచుండును.

### ఆమాశయమునందు కఫముచేరుటవలన కలుగు తలనొప్పి చికిత్స.

సోయివిత్తులు, ముల్లంగివిత్తులు, మెంతులు, ఈవస్తువులు నీళ్ళలోవేసి కాచి అందులో శికంజబీన్ చేర్చి వమనము కాగలందులకు పానము చేయించవలెను తదుపరి శికంజబీన్ యందు తేనె శిర్కా చేర్చి చేయబడిన శికంజబీన్ అయారజ్ మాత్రలు విరోచనార్థము. అనగా గుదస్థానమునుండి కఫము వెడలుటకై ఉపయోగించవలెను. తరువాత ఆమాశయము యొక్క చికిత్సలయందు చెప్పబడిన ఉత్తమములగు జవారిష్ (అవలేహములు) బలముకలుగుటకై ఇవ్వవలెను.

### { ఆమాశయమునందు వాతము చేరుటవలన కలుగు తలనొప్పి లక్షణములు. }

ఆమాశయమునందు వాతప్రకృతి ఖనీభవించుటవలన తలయందునొప్పి ఉత్పన్నమగుచున్నది. దీనిలక్షణములు అనగా ఆమాశయమునందు మంట, ఆకలివిశేషముగానుండుట, వమనమైనయెడల నొప్పి

శాంతినొందుట మొదలగు లక్షణములు ఆమాశయమునందు వాతము ఖనీభవించుటవలన కలుగు లక్షణములని గ్రహించవలెను.

### { ఆమాశయమునందు వాతము ఖనీభవించుటవలన కలుగు తలనొప్పి చికిత్స. }

రోగారంభమునందు వాతదోషమును పక్వపరచి రోగమును శాంతినొందించుట ముఖ్యావశ్యకము. గాన పాచితీగ కషాయము ఇందువిషయమై మిక్కిలి ఉపయుక్తము. పిమ్మట వాతదోషము పక్వమొందిన వెనుక విరోచనము ద్వారా వాతమును వెడలించునట్టి ఔషధములవలన మృదువిరోచనమును చేయించవలెను.

### వాతదోషమును హరించు ఔషధము.

నల్లకరక్కాయలు, బిస్ఫాయజ్, ఉస్తెఖుద్దూస్, పాచితీగె, శుద్ధి చేసిన గారీకూన్, శుద్ధిచేసిన లాజవర్దు ఇవి యావత్తు సమభాగములు చేర్చి చూర్ణించి, వస్త్రగాలితమొనర్చి, సక్మోనియా చూర్ణముచేసి, బాదరంజబోయాకషాయముతో పైచూర్ణములు యావత్తు కల్వమునందు చేర్చి నూరి శనగగింజల ప్రమాణము మాత్రలు చేసికొని రోగ బలానుసారముగా ఇప్పించవలెను.

### సూచనీయము.

సక్మోనియా, అనుదానిని పార్శీభాషయందు మహమూదా అందురు. దీనిని శుద్ధిచేయనిదే ఉపయోగించకూడదు. దీనిశుద్ధి అనేక విధములుగా చెప్పబడియున్నది. అనగా శోధనద్రవ్యములను చేర్చవలసి వచ్చినపుడు దీనిని ముఖ్యావశ్యకముగా చేర్చుకొనవలెను. శోధనీయము లగు ఓషధులుచేర్చనిచో దీనినియెంతమాత్రము చేర్చకూడదు. సక్మోనియా శుద్ధిక్రమము అనేకవిధములుగానున్నను, అందుండి కొన్నిటిని ఈపుస్తకమునందు వ్రాసితిమి, తక్కినవి గ్రంథవిస్తరభీతివలన వదలి వేయబడెను.

## సక్మోనియా శుద్ధిక్రమము.

సేవు శాంకాపిలి [యాపిల్సు] బేదానా కాయ, అమృతఫలము, మొదలగు ఫలములను దొలిచి, అందు సక్మోనియా వన్ను నిబట్టయందు మూటకట్టియుంచి, దొలిచినగుజ్జు అపైనిమూసి ఆకాయపై గోధుమ పిండికవచమిచ్చి ఉండగాచేసి పుటము పెట్టవలెను. పైనపూయబడినపిండి ఎఱుపురంగురాగానేతీసి సాంగశీతలముకాగానే విప్పి అందుండుమూట నుతీసి విప్పి సక్మోనియా తీసికొని ఉపయోగించుకోవలెను.

అమృతఫలము, శేవు, బేదానా కాయలుకూడా తీక్ష్ణవిరోచనము చేయించును. ఉచితమని తోచినచో ఈఫలములనుకూడ ఉపయోగించుకొనవచ్చును.

(2) బేదానా కాయరసములో సక్మోనియా వేసి భావనచేయుట వలనకూడా సక్మోనియాశుద్ధి నొందుచున్నది.

(3) యాజ్ పైకరాతోకూడా సక్మోనియా చేర్చునెడల శుద్ధమై యోగ్యతకలిగియుండును.

(4) సక్మోనియా, బక్సమా, ఈరెండువస్తువులు సమానభాగములుగాచేర్చునెడల సక్మోనియా శుద్ధికొందును.

మరియు సక్మోనియాయొక్క శోధనములు అనేకములున్నను ఈ పుస్తకమునందు 4 విధములు మాత్రము చెప్పబినుపించుచున్నాను.

{ ఆమాశయమునందు మిక్కిలి వాతదోషము
చేరుట వలన కలుగు తలనొప్పి లక్షణములు. }

ఆమాశయమునందు విశేషవాతము, ఖనీభవించుటవలన తలనొప్పి ఉత్పన్నమగును. దీనిలక్షణములు అనగా ముందు ఆమాశయమునందు నొప్పికనుపించి అటుపిమ్మట తలయందు నొప్పికలుగును. ఆమాశయమునందు నొప్పితగ్గినయెడల తలనొప్పికూడ తగ్గిపోవును. ఆమాశయమునందు నొప్పి యెల్లప్పుడుయుండినచో తలనొప్పికూడాయెల్లప్పుడు నిలిచియుండును.

మరియు వాతమును కలిగించునట్టి భోజనపదార్థముల సేవనవలన ఆమాశయమునందు శిరస్సునందు కూడా నొప్పి పుట్టించుచుండును. తలనొప్పి యొకచోటనిలిచియుండక అచ్చటచ్చటకుమారుచుండును. మరియు తలనొప్పి ఆరంభదశయందు తలపై పుర్రెనుండి నొప్పిపుట్టి టుల తోచుచుండును. నొప్పితగ్గినకొలది తలయావత్తు నొప్పియుండి వదలినటులుండును. ఇది ఆమాశయమునష్టప్రకృతివలన కలుగు వాతజశిరోరోగమని భావించవలెను.

ఆమాశయమునందు విశేషవాత తలనొప్పి చికిత్స —

ఈవ్యాధియందు ఆమాశయమునందుగల వాతము హరించునట్టి యుపాయములను చేయవలెను. ఆమాశయమునందుగల కఫమును తొలగించవలెను. కఫమును హరించునట్టి ఔషధములను కఫప్రకృతి వలన కలుగు తలనొప్పియందు వివరించబడియున్నవి. వాతము హరించుటకున్ను ఆమాశయము మెదడునకు బలము కలుగుటకై జవారిష్ కామొని, జీలకర్రజవారిష్, పొదినాజవారిష్ ఉపయోగించవలెను. ఈజవారిషులు ఆమాశయమునందుగల వాతము హరించుటయందు మిక్కిలి ప్రశస్తమైనవి. మలదోషమును హరించుటకు మిక్కిలి ఉపయోగమైనవి. మరియు, ఆమాశయమునందుండు వాతము హరించుటవలన ఆమాశయమునందుగల నొప్పిన్ని తలనొప్పిన్ని శమించును. శిరస్సునకు ఆమాశయమునకు బలముకలిగించును విరోచన ఔషధములు ప్రత్యేకించి యివ్వనవసరముండదు.

మరియు, వాతమును పుట్టించునట్టి ఔషధములు భోజనపదార్థములు సేవించుటవలన ఆమాశయమునందు వాతము ఘనీభవించును. ఇట్టితరి మలమును తొలగించుట మిక్కిలి అత్యావశ్యకము గనుక విరోచన ఔషధములను ఉపయోగించవలెను. కఫమువలన వాతము పుట్టునని తెలిసినది.

ఆమాశయమునందు వాతముకలుగుటకు కారణములు.

ఆమాశయమునందు వాతము ప్రవేశించుటకు కారణమేమనగా వాతముం బుట్టించునట్టి వస్తుసేవనవలనగాని వాతమును పుట్టించు ఔషధ సేవనవలనగాని వాతముపుట్టుచున్నది. కఫమువలన వాతము పుట్టినచో మలమును తీసివేయుట అత్యావశ్యకము అటుల కఫమువలన వాతము చేరిన యెడల మలమును వెడలించినను బలముగలదై గుణమును గ్రహించదగినది కానుండును. మలదోషమును తొలగించిన యెడల వాతమునకు బలముకలిగించును. మరియు, ఆమాశయముయొక్క ముఖము దుర్బలమునొందిన యెడల తలనొప్పి కలుగుటకు కారణమగును. దీనిలక్షణములు నిరన్నాహారముగానుండునపుడు అనగా ప్రాతఃకాలము నిద్రనుండి లేచునపుడుమునందు తలయందు విశేషముగా నొప్పికలుగును.

ఆమాశయ వాతమును హరించు చికిత్స.

ప్రతిదినము ప్రాతఃకాలము నిదురలేచినవెంటనే కొంతగ్రాసమును ఖర్జూరపుకాయరసము రీబాస్ (ఒకవిధమగు ఎర్రనిపూలుపూయునట్టిగడ్డి) రసమునందుగాని, గోల్‌సిమాగ్ (ఒకవిధమగుకాయలు) రసమునందుగాని, పుల్లనిదానిమ్మగింజల రసమునందుగాని, రొట్టెనానవేసి, యివ్వవలెను. మరియు ఈవస్తువులను నీళ్ళలోనానవేసి నీళ్లయందు పులుసు చేరినవెంటనే ఆనీళ్ళవడియబోసి ఆనీళ్ళయందు రొట్టెనానవేసి, రోగికిచ్చుటయుండిది.

మలబద్ధకము కలిగించునట్టి ఔషధములను పైనవ్రాయబడిన వానిని నివ్వవలెను. అనగా ఖర్జూరకాయలు, రిబాస్, గోల్‌సిమాగ్, దానిమ్మగింజలు, ఇత్యాదివస్తువులు యావత్తు ఆమాశయమునకు బలముకలిగించును. ఉష్ణమును శాంతినొందించును. పిత్తమునుహరించును. మరియు ఆమాశయముయొక్క దుర్బలత్వమువలన ఆమాశయమునందుగల ప్రకృతిశాంతినొందినచో, అమ్లరసమందు రొట్టెనానవేసి భుజించినతరువాత చిన్నసోపు, జీలకర్ర, వాము, కుంకుమపువ్వు, అగరు,

ముద్దలవంగపట్ట, ఈవస్తువులను చూర్ణించి ఇవ్వవలెను. ఈచూర్ణము వలన అమాశయమునందు ఉష్ణముకలిగించును. అమ్లవస్తువులను పుచ్చుకొనుటవలన దగ్గుకలిగినచో పులుసు పదార్ధములను మానివేయవలెను. మరియు దగ్గుగలవానికి అన్నము, కొంతరొట్టె, పన్నీరు, శర్కరకలిపి నానవేసి యిచ్చుటవుత్తమము.

## రెండవవిధమగు తలనొప్పి లక్షణములు.

గర్భాశయమునందు మూత్రపిండములయందు పిక్కలయందు చేతులయందు పాదములయందు హృదయము, ప్లీహము, వీనిపొరల యొక్క సంయోగములయందు తల ఆమాశయముయొక్క మధ్యభాగమునందు హృదయమున్నది. మిరాకు (పొట్టపైపొర) ఇదిపొట్టయొక్క అవయవములను చుట్టకొనియున్నది. వీపుయొక్క సంయోగము, మొదలగు అంగములయందు ఏయంగమునందు ప్రకృతిమారినను ఆక్షణము నందే తలనొప్పి వుత్పన్నమగును. ఇటుల నొప్పికలుగుటకు కారణమేమనగా మెదడునకు శరీరముయొక్క ప్రతిభాగమునకు సంబంధముకలిగి యుండును. ఇట్లు సంబంధము కలుగుటవలన ఆవిరి పరమాణువులు, ఆ యాయంగములనుండి తలయందు ప్రవేశించినవెంటనే తలనొప్పి కలుగుచుండును. యావత్తు అంగములయొక్క సంయోగమే శరీరమనిభావించవలెను. ఆఅంగముల గుణములు వేరువేరుగా వర్ణించబడును.

పొట్టసంయోగమువలన తలనొప్పి కలిగినయెడల తలముందు భాగము వెనుకవైపు అనగా మాడునందు నొప్పి నిలిచియుండును.

రెండుమూత్రపిండముల సంయోగమువలన తలనొప్పి కలిగినయెడల తలవెనుకభాగమునందునొప్పి నిలిచియుండును.

ప్లీహముయొక్క సంయోగదోషమువలన తలనొప్పి కలిగినచో తల యెడమభాగమునందు నొప్పి వుద్భవించును.

కలిజా (యకృత్) సంయోగదోషమువలన కలిగిన తలనొప్పి కుడిభాగమునందు పుట్టుచున్నది.

ఆమాశయము హృదయమునకు మధ్యభాగమునందుండు పొరల సంయోగమువలన కలిగిన తలనొప్పి తలముందుభాగమునందు అణచి నట్లుండుట, తలనొప్పికలుగుట, సంభవించును. ఆమాశయముయొక్క హృదయముయొక్క మధ్యనుండు పొరలను పార్సిభాషయందు హిజా బెహాజిజ్ అందురు. వీని వివరము యక్రుత్ రోగములయందు ముందు చెప్పబడును.

మిరాకు (పొట్టపైనుండుపొర) సంయోగమువలన తలముందు భాగమునందు అనగా నొసలునందు నొప్పికలుగును. సిఫాకు అనగా హృదయముపై పొర వీటివర్ణనము ముందు హృద్రోగములయందు చెప్పబడును. వీపు సంయోగమువలన తలనొప్పి కలుగుచున్నది. దీని లక్షణములు కేవలము తల అంతభాగమునందు నొప్పి ఉత్పన్నమగును. మూత్రపిండములు వీపుయొక్క సంయోగదోషమువలన కలుగు తల నొప్పికి స్వల్పభేదముకలిగియుండును. మూత్రపిండములయందు దోషము వలన కలుగునొప్పికంటె వీపుయొక్క దోషమువలన కలుగునొప్పి కేవలము తలఅంతభాగమునందు అనగా ముచ్చనగుంటయందు నొప్పి వుత్పన్నమగునని గ్రహించవలెను.

పిక్కలు, పాదములు, అరిచేతులు, వీటియొక్క సంయోగము వలన కలుగు తలనొప్పిగల రోగికి యేవస్తువు చూచినను కదలునట్లు లుండుట యీఅంగముల యందుండి చీమలు పాకినట్లుండుట మొదలగు లక్షణములు కలిగియుండును.

పిక్కలు, పాదములు, చేతులు మొదలగు వానిసంయోగమువలన కలుగు తలనొప్పి సామాన్యమగుటవలన ముఖ్యఅంగముల సంయోగ తలనొప్పివలె వర్ణించుట అనంభవమని కుప్తపరచడమైనది యేఅంగము యొక్క సంయోగమువలన తలనొప్పి కలిగినదో ముందు ఆయంగముల యందు వ్యాధిప్రవేశించి పీడించుచు తరువాత తలనొప్పి కలిగించును. గాని ముందు తలయందు నొప్పి యెంతమాత్రము కలుగనేరదు.

### పిక్కల సంయోగదోషమువలన గలుగు తలనొప్పి చికిత్స

పాదములు పిక్కలయొక్క పైభాగమునందుగల దోషము వలన తలయందు నొప్పికలిగిన యెడల సాఫీన్ (శీలమండలపై భాగము నందుండునరము) నరము బేధించి రక్తమోక్షణమును చేయించవలెను. మరియు, పిక్కలపై కొమ్ములతో రక్తము తీయించవలెను. మరియు, ఇస్తమఖీఖూన్ మాత్రలు ప్రయోగించి శరీరమునందుగల దుష్టమలమును తొలగించవలెను.

### ఇస్తమఖీఖూన్ మాత్రలు చేయుక్రమము

తెల్లతెగడ, సుహాదింబగింజలు, కుసాంబరము, కాటుకవిత్తులు, గారీఖూన్ ఈవస్తువులు ఒక్కొకభాగము సకమోని సగా, చేదుపుచ్చకాయ గుజ్జు, యీరెండువస్తువులు మూడుభాగములు. ఈవస్తువులు యావత్తు సోపురసముతో నూరి శెనగగింజ ప్రమాణము మాత్రలుచేసి మూడు మాషములు మొదలు 7 మాషములవరకు బలానుకూలముగా ప్రయోగించవలెను. ఇట్లు ఖరాబాదీనెఖాదరి బిలాస్తుత్తిజార్వా అను గ్రంథములలో వ్రాయబడియున్నది.

### సూచనీయము.

తలయందునొప్పి విశేషముగానున్న యెడల తొడలు మొదలు శీలమండలవరకు నవారుతోగాని బ్యాండీజుతోగాని గట్టిగాచుట్టవలెను. పాదములకు నండ్రితైలము మర్దించవలెను. పిత్తరోగమునందు చెప్పబడిన పాసోయా ఆవిరిపట్టించవలెను. ఇట్లుచేయుటవలన వేడియొక్క పరమాణువులు తలనుండి క్రిందికి దిగిపోవును.

చేతులసంయోగమువలన తలనొప్పి ఉత్పన్నమైన యెడల నొప్పి శాంతినొంది దోషమువ్యయమగుటకై ఇస్తమఖీఖూన్ మాత్రలు ఉపయోగించవలెను. మరియు, ఆవిరి పరమాణువులు యెచ్చటనుండి లేచుచున్నవో రోగము ఎచ్చటయున్నదో ఆరోగస్థానమునందు శస్త్రముతో నాట్లువేసి రక్తముతీసివేయవలెను, ఇదివరకు చెప్పియుండు తైలములన్ను

తలపై పూర్దించవలెను. మరియు, దోషపరమాణువులు పైకిలేవకుండు నటుల రెండుచేతులు మోచేతిపైనుండి ననారుతో కట్టవలెను.

ఇతర అంగముల సయోగము వలన తలనొప్పి వుత్పన్నమైన యెడల వానిచికిత్సలను ప్రత్యేక ప్రత్యేకముగా ఆయాయంగములయొక్క వుచితములగు సహాయములతో ఆయాయంగములను శుభ్రపరచవలెను. మరియు ఆయాస్థానములయందుండుమలమును తొలగించి ఆయాయంగములకు బలము కలిగించునట్టి ఔషధములను ఇప్పించవలెను.

### అంగముల స్వచ్ఛతబలము కలిగించు లక్షణములు.

ముందుచెప్పియుండు ఔషధములను గమనించవలెను. దైవకృపవలన సంయోగఅంగములయొక్క తలనొప్పి ముందువ్రాయబోవు అపస్మారమను శిరోరోగమునందు వుత్తమరీతితో వ్రాయబడినవి.

### నాలుగవ శిరోరోగలక్షణములు.

నాలుగవదియగు శిరోరోగము మెదడుయొక్క దుర్బలకారణమువలన కలుగుచున్నది. ఈరోగమునందు జ్ఞానము, సూక్ష్మమగును. విచారము, స్మరణశక్తి, ధ్యానాదికరములగు మస్తిష్కసంబంధమగు కార్యములయందు జోఖ్యములేకయుండుట మరియు నడుచుటకు కష్టముగా నుండుట, మెదడు దుర్బలమువలన తలయందు కొద్దిగా నొప్పి కలుగుట అనగా భుజించిన ఆహారము జీర్ణమగునప్పుడు ఉష్ణ ఆవిరి పరమాణువులు మెదడునందు నడచుటవలన చెడువాక్యములను వినుటవలన సుగంధ దుర్గంధములను, ఆఘ్రాణించుటవలన మరియు సుగంధము మిక్కిలి తీక్ష్ణమగుటవలన తలనొప్పి వుత్పన్నమగును.

### నాలుగవ శిరోరోగచికిత్స.

మెదడునకుబలము కలిగించుటకై కోడి, పూరేడు, కౌజు, మొదలగు పక్షులమాంసముయొక్క రసము, పన్నీరు, శెనగపప్పు, దాల్చినచెక్క, మొదలగువానితో సుగంధము కలిగించిఉడికించి, ఇవ్వవలెను. మరియు

వన్నీరుతో లవంగములునూరి, తలకులేపనము చేయవలెను. గుల్ రోగ న్ తలకులేపనము చేయవలెను. సేవు, అంబరు, పన్నీరు, ఈవస్తువుల నువాసనచూపించవలెను.

ఒకవ్యాధి సాధారణదుష్టప్రకృతి, దుర్బలమగు మెదడుతోచేరి నయెడల పైనవిధించబడిన సాధారణదుష్టప్రకృతియందు చెప్పబడిన చికిత్సలవలన ప్రకృతిమారిపోవుచున్నది. మలము, దుష్టప్రకృతి, మెద డునందుండు దుర్బలముతోచేరి నుండునెడల ముందు దుష్టప్రకృతిని తొలగించి తదుపరి మెదడునకు బలము కలిగించు నుపాయములనుచేయ వలెను. మలమును ముందుగా తొలగించి అటుపిమ్మట మెదడునందు గల దోషములను సహజముగా స్వస్థతనొందించవలెను. మెదడునందు గల దోషములను తొలగించునపుడు మెదడునకుబలము కలిగించునట్టి వస్తువులనుకూడా చేర్చవలెను. అటుచేర్చనియెడల మెదడు అతిదుర్బల మగును.

## అయిదవ శిరోరోగలక్షణములు.

హిస్ (జ్ఞానశక్తి బలముకలుగుట) జ్ఞానశక్తి, తీవ్రతనొందుట వలన తలయందునొప్పి ఉత్పన్నమగుచున్నది. దీనిలక్షణములు కొన్ని స్వల్పకారణములవలన దీనిప్రభావము విశేషమగుచున్నది. మరియు, మస్తిష్కము యొక్క జ్ఞానశక్తి బలముకలుగుటవలన మస్తిష్కము యొక్క పనులయందు విఘ్నము కలిగుటవలన తలయందు నొప్పికలుగు చున్నది. అనగా దీర్ఘాలోచన దీర్ఘవిచారము మొదలగు ప్రధానకార్య ములు మస్తిష్కమువలన పుట్టుచున్నవని గ్రహించవలెను. మస్తిష్క ముయొక్క అసంభవకారణమువలన అంగములు దుర్బలము నొందుట చూపువంకరగుట, ముక్కు మొదలగు వానియందు మలముకలుగుట, ముక్కుఆరినటులుండుట, అంగిలిమెండుట, మొదలగులక్షణములు జ్ఞానశక్తిబలము నొందుటవలన కలుగుచున్నవని గ్రహించవలెను.

## అయిదవ శిరోరోగ చికిత్స.

మస్తిష్కము యొక్క జ్ఞానశక్తి తగ్గించునట్టి వుపాయములను అనగా బిల్లాపాయ, యవగంజితో చేర్చి ఇప్పించవలెను. మరియు పాచన శక్తి దుర్బలముగానున్నయెడల చలువచేయునట్టి కూరగాయలు అనగా కావలు, పెద్దపాయల, కేవలము పచ్చిధనియాలు, మొదలగుకూరలు ఇప్పించవలెను ఇట్టిసనుపాయములవలన జ్ఞానశక్తి భ్రష్టత్వము నొందని యెడల మత్తు, తిమ్మిరి, నొందించునట్టి ఔషధములను తలపై లేపనము చేయవలెను జ్ఞానశక్తిని నీరసపరచి మాంద్యమునొందించునట్టి వస్తువులను తలకులేపనము చేయవలెను. కేవలము జ్ఞానమునూన్యమైనయెడల అట్టి వస్తులేపనము మానివేసి మర్బతుగాని, గసగసాలపాలు లేక తత్సంబంధమగు మత్తువస్తువులు నీరసమునొందించునట్టి వస్తువులను మనస్సుకోరు నెడల లాభదాయకమగును. మరియు ఫలూనియా మిక్కిలి అవశ్యకము

## ఫలూనియాక్రమము.

ఫలూనియా అనునది ఒకమాజూ (అవలేహము) యొక్క పేరు. దీనిని రూందేశస్థుడగు హకీ ఫయిలుల్యాక్ మరియు ఆఫీలను పేరు గలవారు ముందు నొప్పులను తగ్గించుటకై కనిపెట్టిరి. దరిమిలా వైద్యులు యిందులో మూలికలు తగ్గించి హెచ్చించి తయారుచేసి వాడుచున్నారు. ఈఔషధము అనేకవైద్యగ్రంథములందువ్రాసిరి. మరియు అనేకములగు ఔషధములను వ్రాసిరిగాని అందులోనిది మొదటిదగు ఫలూనియా అను పార్సిఔషధము ఇందులో వ్రాయబడుచున్నది తల నొప్పిపోగొట్టుటయందు మిక్కిలి ఉపయుక్తము.

పచ్చకర్పూరము 9 రతులు, నర్కచూరు (పొడవుకచూరము) దరూనంజ్ అకరవి మంచిముత్యములు ఇవి ప్రత్యేకముగా 1న్నర మాషము, జున్ను 1న్నర మాషము, ఫరఫ్యూన్, జటామాంశి, అక్కలకర్ర, ఇవిప్రత్యేకము 7 మాషములు, కుంకుమపువ్వు, 17న్నర మాషములు, నల్లమందు, కాలిరాయి, ఇవి ప్రత్యేకము 35 మాషము

లు కొల్లగిరియాలు, దేశవాళీవాము, ఇవిప్రత్యేకము 70 మాషములు. ఈవస్తువులు యావత్తు జాగ్రత్తగా తూచుకొని మార్దించి వస్త్రగాలిత మొనర్చి చూర్ణమునకు సమానమగు తేనెయందువేసి లేహ్యముగా కలిపి 6 మాషములవరకు పుచ్చవలెను. అటుతరువాత తిన్నర మాష ములు ప్రాతఃకాలమందు సేవించవలెను. ఈ ఔషధమును 7 మాషము లవరకుకూడా ఉపయోగించవలెనని హాకీం హుసేన్ ఖూఅలీగారు వచించియున్నారు.

### అయిదవ శిరోరోగ లేపనఔషధములు

కాహువిత్తులు, పోస్తుకాయలు, నల్లమందు, ఖుర్ఫాసానిఓమము గంజాయాకు, సెప్ (యాపిల్సు) కాయరసమునందునూరి తలకు లేపన ము చేయవలెను. ఇదిమిక్కిలి ఉపయుక్తమైనది.

మరియు, సీర్సము, పిమ్మెరి కలిగించునట్టి ఔషధములను తల యందుపయోగించినను తలనొప్పి తగ్గక అధికమైన యెడల ఈవస్తువుల ను మానివేసి ఇతరవస్తువులను ఉపయోగించవలెను. ఎందుకనగా అంగ ములకు భంగపరచును.

హాకీంతిబి అను వారు ముందుచెప్పిన రీతిగా తలనొప్పి యందు నల్లమందు మొదలగు మత్తుపదార్థములను ఉపయోగించుటవలన నష్ట ముకలిగించును గాన ఆలోచించి చికిత్సచేయవలెను.

ఒకవేళ అంగములకు నిస్సత్తువ, తిమ్మెరి కలిగించునట్టి ఔషధ ములు ప్రయోగించుటవలన తలనొప్పి అధికమై నిస్సత్తువ తిమ్మెరి మొదలగునవి యేర్పడిన యెడల వెంటనే గోరువెచ్చని నీళ్లు తలపై పోసి కడుగవలెను. వేడినీళ్ళతో కలుగుటవలన ఆ ఔషధముయొక్క దోషముహరించును.

### ఆరవశిరోరోగలక్షణము.

శిరవ్యాధి షఫా దోషకారణమువలన తలయందునొప్పి కలుగు చున్నది. ఈతలనొప్పి లఘువుగానుండును. ఈతలనొప్పికి పార్శీభాష యందు ఖాఫ్‌హా, అందురు. ఎందుచేతననగా ఖూఫ్‌హా అనగా లఘు

త్వము కలుగచేయుట అని అర్థము దీనిలక్షణములు శరీరము నందు మ
మలము, విశేషముగా బైటికివెడలుటవలన గాని మిక్కిలి జాగరణము
వలనగాని, మిక్కిలి ఆలోచించుటవలనగాని, తలయందునొప్పి కలుగు
చున్నది. ముఖ్యము కీలము తలయందే వెడలుచున్నది. అనగా నజలా
వ్యాధివలన నాసికయందుండి స్రవించుటవలనగాని తలనొప్పి ఆరంభమగు
చున్నది. మెదడు బిగించినట్లుండుట, మెదడునందు పోటుపొడిచినటు
లుండుట, మొదలగు లక్షణములు కలిగియుండును. సంపూర్ణశరీరముయొ
క్క మలము తగ్గి దేహము ఆరిపోయినదని గ్రహించవలెను.

మరియు వమనము చేయించుట విరోచనము చేయించుటవలన
గాని అతిసంభోగమువలనగాని, శిరోవేదన, పలుమారు చేయుటవలన
గాని, శరీరము మూత్రరక్తదశపొందిగాని, లేక గండూషము, మొద
లగు వానివలన మిక్కిలి మలము విశేషముగా వెడలించుటవలనగాని
మూత్రము విశేషముగా వెడలుటవలనగాని శరీరము ఆరిపోయి ఈవ్యా
ధి సంభవించుచున్నది.

మరియు పైకారణములనుబట్టి దేహము ఆరిపోయి తలనొప్పి
పుట్టుచున్నది. మరియు స్త్రీల ఆర్తవరుధిరము విశేషముగా వెడలుట
గుదస్థానమునుండి రక్తము మూలదోషము వలనగాని లేక గ్రహణీరోగము
వలనగాని విశేషముగా రుధిరము వెడలుట మరియు మిక్కిలి ఆకలిగలిగి
ఆహారము దొరకక పరితపించుచుండినవారికి శరీరముయొక్క ధాతువులు
నష్టమై ధాతువులకు బలముకలిగించునట్టి ఆహారవస్తువు సంప్రాప్తించని
వారికి శరీరము ఆరిపోయి ఈవ్యాధి తటస్థించును. మరియు శరీరమునుం
డి శరీరమునందుండి ముఖ్యము బైటికి వెళ్ళినవానికి తలనొప్పి ఉద్భ
వించును. ఖుష్కీ (శుష్కత్వము) సిఫహా అనగా (లఘువు) అని
అర్థము. మరియు అకీంఇమాంరాజీ అనువారు ఇటువంటి శిరోరోగము
రజోధర్మసంబంధమగు రుధిరముగాని ప్రసూతిసమ్మంధమగు రుధిరముగాని
విశేషముగా వెడలునట్టి స్త్రీలకు కలుగునని వచించిరి.

### ఆరవశిరోరోగచికిత్స

రోగియొక్క శరీరమునందు చమ్మనుపుట్టించునట్టి యుత్తమ భోజనములు ఇప్పించవలెను. అనగా ఈఆహారములవలన రసము, రుధిరము, విశేషముగా పుట్టించునట్టి భోజనపదార్థములు స్నిగ్ధము రక్తయు, పుట్టించునట్టి వస్తువుల అనగా యవనూక, పెద్దకోడిమాంసరసముతో నిశస్త (గోధుమసత్తు) కలిపి యిప్పించవలెను. మరియు మేకపిల్లమాంస రసము, యిప్పించవలెను. లేక శరీరమునకు చెమ్మకలిగించునట్టి భోజనపదార్థములను యిప్పించవలెను.

బాదంనూనె, నువ్వులనూనె, తలకు, శరీరమునకు లేపనముచేయవలెను. బనఫ్షానూనె, సొరకాయగింజలనూనె, కలువపూవులనూనె, నశ్యముచేయించవలెను. మరియు కోడికొవ్వు, కొంజుపిట్టకొవ్వు, భోజన లేపనాదులందు ప్రయోగించవలెను.

### ఏడవ ఆర్జ అను తలనొప్పి లక్షణములు.

ఈతలనొప్పి మరియొకవ్యాధి సహాయమువలన కలుగుచున్నది. అనగా జ్వరము, మొదలగు వ్యాధులు కలుగుటవలన తలనొప్పి కలుగునని భావము. జ్వరవిశేషమ్మువలన నొప్పివిశేషముగానుండి జ్వరము తగ్గినయెడల తలనొప్పికూడా తగ్గిపోవును.

### ఏడవ తలనొప్పి చికిత్స.

ఈరోగమునందు జ్వరమును తగ్గించునట్టి చికిత్సలను చేయుట ఉత్తమము. అథవ, తలనొప్పి, విశేషముగా వున్నయెడల ఆనొప్పిని తగ్గించునట్టి చికిత్సలను చేయవలెను. అట్టిచికిత్సలను వెనుక దోషయుక్త, దోషరహితశిరోరోగమునందు వ్రాయబడియున్నది. మరియు ఏకారణముచేత ఏరోగమువలన తలనొప్పి వుత్పన్నమైనది ఆలోచించి చికిత్స చేయవలెను.

## (8) శిరోరోగము అనగా వాపుసంబంధమగు తలనొప్పి లక్షణములు.

ఈతలనొప్పి, తలయందు వాపుజనించుటవలన కలుగుచున్నది. ఇందు విషయమై ఈవాపు మెదడునందున్నదా తలపుర్రెయందున్నదా లేక మెదడుపై పొరలయందున్నదా యని దీర్ఘాలోచనచేసి చికిత్సచేయవలెను. ఇట్లాలోచించి చికిత్సచేయు వైద్యుడు మిక్కిలి యశస్సుగలవాడగును.

మరియు, యెనిమిదవ తలనొప్పి కేవలము మెదడు వాపువలనగాని మెదడుసంబంధమగు పొరల వాపువలనగాని ఉత్పన్నమగుచున్నది. ఈనొప్పి తలపుర్రెలోభాగమునందుగల పొరవాచుటవలన జనించుచున్నది. మరియు, పుర్రెపైచర్మము ఉబ్బుటవలన కూడా తలనొప్పి పుట్టుచున్నది. లోపటిమెదడు పొరయందుగల వాపువలన పుట్టిన తలనొప్పిని సర్సాం అందురు. దీని వివరము సర్సాం శిరోరోగధ్యాయము నందు దైవానుగ్రహమువలన చెప్పగలను.

రెండవకారణము అనగా తలపెంకు పైపొరయందు వాపుజనించుటవలన కలుగు తలనొప్పి చికిత్స ఈక్రిందవివరించబడును. ఏహేతువువలన ఆస్థానమునందు నొప్పికలిగినదో ఆస్థలమునందు చికిత్సచేయవలెను. ఈచికిత్సావివరము ముందు వర్ణించబడును.

### తొమ్మిదవ శిరోరోగలక్షణములు.

ఈతలనొప్పి మిక్కిలి స్త్రీసంభోగమువలన ఉత్పన్నమగును. ఇది సంభోగ అనంతరము జనించుచుండును. ఈతలనొప్పి మూడువిధములు (1) వీర్యము విశేషముగా వెడలుటవలన మెదడు దుర్బలమగుచున్నది. అందువలన తలనొప్పిపుట్టుచున్నది. యెట్లనగా శరీరమునుండి వీర్యము వెడలుట ఇతరరుతుబహు (నీరు) మలము వెడలుట మిక్కిలి అసాధ్యమైనది మరియు, ఇది అత్యంత తీక్ష్ణత్వము దుర్బలత్వమునకు కారణము.

మూడవది రజస్సు మొదలగు దుష్ట వస్తూతి ఆర్తవ దోషమువలన కలుగు తలనొప్పి. దీనిని ఉష్ణశిరోరోగప్రకారాంతరముగను ఖుఫా అని వచించియున్నారు.

### ఉష్ణశిరోరోగలక్షణములు

చిక్కనశరీరముగల దుర్బలుడు విశేషముగా స్త్రీసంగముచేసినచో అట్టిమనుజుని శరీరకాంతి తగ్గి ముఖము బహుచర్మవికారముగా కలిగియుండును. శరీరబలముగల వానికి ఇట్టిలక్షణములు స్వల్పముగా కనుపించును.

### ఉష్ణశిరోరోగ చికిత్స.

శుష్కదోష శిరోరోగమునందు చేయబడుచికిత్స అనగా శరీరమునందు చెమ్మపుట్టించునట్టి మాంసము మొదలగు స్నిగ్ధపదార్థములు ఇచ్చుట మిక్కిలిలాభదాయకము. మంచినీళ్ళు గోరువెచ్చగా కాచి స్నానము చేయవలెను. మరియు, బస్తిస్థానమును పథ్యము చేయించవలెను. ఆవుపాలు దాహమునకు నిప్పించవలెను, సంభోగసమయమునందు శరీరావస్థచాలా కారణమువలన ఉష్ణపరమాణువులు మెదడునందుజేరి కష్టముకలిగించుటవలన తలనొప్పి కలుగుచున్నది.

### విశేషసంభోగ శిరోరోగలక్షణము.

ఎట్లనగా సంభోగసమయమునందు ఆవిరి పరమాణువులు పైకెక్కుచుండును. ఈకారణమువలననే శరీరము గగుర్పాటు చెందుచుండును. మరియు శరీరము బరువుగానుండుట సంభోగమయినవెనుక కండ్లు చీకట్లుగ్రమ్ముట మొదలైనలక్షణములు విశేషసంభోగమువలన కలుగునని గ్రహించవలెను.

### విశేష సంభోగ శిరోరోగ చికిత్స

ఈవ్యాధియందుపైన వ్రాయబడిన దోషములు కనుపించిన యెడల దోషములను తొలగించునట్టి యుపాయములనాలోచించి అట్టిపిమ్మట తలకు బలమును కలిగించునట్టి వస్తువులవలన తలయందుండు పరమాణువులను క్రిందికి దిగునట్లుగ యుపాయముచేయవలెను. ఇదిగాక స్త్రీ

భోగసంచారకారణమువలన శరీరముయొక్క, జీవనరములకు, కష్టముకలిగిన కారణమువలన తలనొప్పి కలుగుచున్నది. అనగా జీవనరములు, తలనుండిపుట్టి శరీరమునందు వ్యాపించుచున్నవి. ఈకారణమువలన దుర్బలము కలుగజేయుచున్నవి. బలముగలవాడైనచో జీవనరములు, దుర్బలము కానేరవు కాబట్టి తలయందు నొప్పికలుగనేరదు. యిట్టివానియొక్క జీవనరములు దుర్బలముజెందినయెడల సంభోగమైన తదుపరి శరీరము వణుకుట, లేచుటకు, నడచుటకుకూడ దుర్బలముగానుండుట, మెదడునందు నూదులతో గ్రుచ్చినట్టుల బిగించినట్టుండుట, మెదడు ముందుభాగము దుర్బలము నొందినయెడల వెనుకభాగము బిగించినట్టులుండుట, మెదడు వెనుకభాగము దుర్బలముజెందిన ముందుభాగము బిగించినట్టుండుట, ఈమొదలగు లక్షణములు కలిగినయెడల సన్న్యాసము అనువ్యాధి కలిగి మరణముకూడా సంభవించును. యెటులననగా మెదడు శరీరమునకు ప్రధానఅంగమగుటవలన మనుజునియొక్క జీవనమిందుపై నాధారపడియున్నది. మరియు శరీరనాధుండగు పరమాత్మయిందు నివాసియై యున్నాడు. యిందులో మూడుదశలుగలవు. అంత్యదశ దుర్బలత్వమును గలిగించును. అనగా మెదడుయొక్క దుర్బలత్వమువలన కలుగుఫలము సతా [సన్న్యాసము] లాగుట, పొడుచుట, మొదలగు లక్షణములు తటస్థించినయెడల రోగి జీవించుట దుర్లభమని బుద్ధిమంతుండగు వైద్యుండు గ్రహించవలెను.

— విశేషసంభోగ శిరోరోగ (2) చికిత్స. —

స్వశరీరమునకు ఆధారభూతమగు తలయందు నరములుస్నాయువులు, కండరములు, రక్తనాళములు, వాతనాళములు, మొదలగునవి తలయందుండు మెదడునందుపుట్టి స్వశరీరమును వృక్షముయొక్క శాఖలవలె పాకి అల్లిబిల్లిగాఅల్లుకొని శరీరమును రక్షించుచు పెంచుచున్నవి. కాబట్టి ఇట్టి ప్రధానమగు శరీరాతిశయంబగు మెదడునకు బలముకలిగించుటకు తగునుపాయములను చేయవలయును. మరియు చెంగల్వకోష్టు తెల్ల

మునందు జ్యోత్స్న కలిగి తన్పై మర్దనచేయునవలెను. మేకమాం సమునందు సుగంధమగు మసాలాలు చేర్చి యిప్పించవలెను. మరియు ఉత్తమమగు బలకరముగు స్వాతిష్ఠపదార్థములు సుగంధపదార్థములు సమశీతోష్ణముగలపదార్థములు మొదలగునవి భోజనార్థమిప్పించవలెను. మరియు సుగంధద్రవ్యములను ఆఘ్రాణించవలెయువలెను. ఇవ్విధముగా సమస్తవ్యాధులయందు చికిత్సవత్యములు చెప్పబడును.

చికిత్సపొందునట్టిరోగి సంభోగము మొదలగు యావత్తు పనులను మానివేసి తనశరీరరక్షణచేసుకోవలెను. లేనియెడల అర్ధాంగవాతము సర్వాంగములయందు చచ్చుమొదలగు వ్యాధులకులోనై మృత్యువుపాలగునని గ్రహించవలెను.

## 10. మద్యపాన ఉత్పన్న శిరోరోగలక్షణము.

మద్యపానముచేయుటవలన తలనొప్పి పుట్పన్నమగుచున్నది. అనగా మద్యపానమందు మరియొకవస్తువుచేర్చుట, మట్టి, మొదలగునవి కలిసిన మద్యము సేవించుట మొదలగు కారణములవలన తలనొప్పికలుగుచున్నది. మద్యము పచనమగునప్పుడు దానియొక్క మలినము ఆమాశయమునందు కలిసి దానిచేత ఆవిరి పరమాణువులు లేచి మెదడునందు ప్రవేశించి తలయందునొప్పి, భారము కలిగించి జ్ఞానేంద్రియములు మస్తిష్కసంబంధమగు కార్యములు అనగా జ్ఞానము, ధ్యానము, స్మరణశక్తి మొదలగువానియందు ఉపద్రవము కలిగించుచున్నది. మరియు శౌర్యమునుకూడా పుట్టించుచున్నది.

సారాయి అనగా మదిర పానముచేసిన తరువాత తలయందునొప్పి పుట్టుచున్నది. దీని దుష్టమలినము ఆమాశయమునందు చేరినయెడల తలబరువు అధికముగానుండును. అట్టిసమయమునందు తలయొక్క ప్రకృతి జలుబు, చమ్మతోకూడియుండును. సారాయియొక్క దుష్టమలినముతో పిత్తప్రకృతి చేరియుండినచో ఓకరింత ఏమనము కలుగుచున్నది.

### గ్రంథాంతరే.

ఒకమద్యపానరోగి వాంతిచేయుగా రక్తపిత్తముగా నెగలెను. వాంతి వెంటమూత్రము సన్నగనుకూడ కలిగెను. అతనినాలుక, గొంతు, మొండ నారంభించెను. నోటినుండి గింజలు గింజలుగా వెడలసాగెను. అతడు ఆరోజునసే చనిపోయెను ఈలక్షణములు గల రోగిని నేనుచూచి యుంటిని.

రెండవ మద్యపాన సేవ్యుడగు మనుష్యునిచూచితిని. అతనియొక్క నిషా (మత్తు) దశయందు వాంతిఆరంభమైనది. నాలుక నోటి నుండి బయటికి వచ్చినది. నాలుకయందు వాపుకలిగినది, అతనిముక్కుపుటములలోపలి పొరబద్దలైనది అతడు కొద్దికాలములోనే మృతినొందెను.

ఇటువంటి దుష్టపదార్థము సేవించి అవస్థపడి ప్రాణముకోల్పోవుచున్నవారిని మనము చూచుచేయున్నాము. కాని చదువరులు ఇట్టిదురభ్యాసముగల వారిని మందలించి ఈఅభ్యాసముకు మాన్పించగలరని హెచ్చరికచేయుచు సారాయియందుగల దుర్గుణములు చెప్పవలసివచ్చెగాని లేనియెడల దీనివిషయము ఇంత వ్రాయవలసినదిలేదు.

### మద్యపాన ఉత్పన్నశిరోరోగచికిత్స

మద్యపానముచేయువానికి వెంటనే ఆమాశయమునందుచేరి పచనముకాకుండునట్లు వలుమారు సికింజబీన్ సోయిపత్తులు కషాయము నిచ్చి వెంటవెంట వాంతిచేయించవలెను. మరియు, విరోచనార్థము ఔషధము నిప్పించవలెను. పిత్తము శ్లేష్మము మొదలగు దోషములను హరింపచేయవలెను. మరియు, శరీరమునందు ఉష్ణప్రకృతి అధికముగానున్న మొదలు పులుపు తీపి గల దానిమ్మగింజలరసముతీసి అందు కొద్దిగా సక్కెరమూ కేర్చి పానము చేయించవలెను మరియు, శరీరప్రకృతి చల్లగానుండిన యానజ్, ఫైకరా, సకమాని యాచేర్చిప్రయోగించవలెను.

### సూచనలు

వమనవిరోచనములకు ఒకేపర్యాయ మివ్వకూడదు ఎందుకనగా వరస్పరదోషము సంభవించును. ఈకారణమువలన ప్రకృతి మారి ఘోరమగు ఉపద్రవము సంభవించును. కాబట్టి ఒక ఔషధముయొక్క పరిభావము చూచి మరుదినముగాని మరుపూటగాని రెండవ ఔషధము ఇవ్వవలెను వమన విరోచనములవలన ఏమిలాభము కలుగక సారాయి, మాలిన్యము, ఆమాశయమునందె నిలిచియుండి వమన విరోచనముల ద్వారా బైటికి వెడలకుండిన దీనివృష్ణము తగ్గనేరదు. మరియు, కడుపులో కాస్త, వాంతికలిగియుండిన లఘుభోజనమునిచ్చి ఒకఘడియ తరువాత వాంతిచేయించవలెను. ఇట్లుచేయుటవలన సారాయి యొక్క హీన మలినము అన్నముతోనహా బైటికి వమనముద్వారా వెడలిపోవును.

మరియు ఈక్రిందవివరించిన ద్రవ్యములవలన ఆమాశయమునకు శక్తి కలిగించవలెను. ఈద్రవ్యములు ఆమాశయమును పుష్టికలిగించి ఉష్ణమును శాంతినొందించి ఆవిరి పరమాణువులుపై కెక్కకుండునటుల ఆపుటకు మిక్కిలి లాభదాయకములైనవి.

దానిమ్మకాయల షరబతు, సేవుషరబతు, దేదానాషరబతు ఖర్జూరకాయషరబతు మొదలగునవి చల్లనినీళ్ళయందుకలిపి పానము చేయవలెను.

మరియు, భోజనమునకు జరామాంశిచూర్ణముచేర్చిన గంజి పానముచేయించుటకంటె వేరుపదార్థము ఇవ్వకూడదు. మరియు, నిమ్మపులుసు ఖర్జూరరసమునందు కొంచెము ఉప్పుచేర్చి ఇప్పించవలెను. లేదా మత్తులేని సారాయి పానముచేయుట మిక్కిలి ఉత్తమము. ఇందుచెప్పిన వస్తువులు సమయానుకూలముగా వాడవలెను.

మరియు తలయందుబలము కలిగించుటకై రోగారంభమునందు శనగపులును గుల్‌రోగన్, షన్నిగా, ఈ వస్తువులు నేకముగా కలిపి తలకు లేపనముచేయవలెను. మరియు పరమాణువులను నిలుపుటకై రోగఆరంభ

అంతదశల యందు బాబూన, బనఫ్షా, ఉస్ప, ఖూనస్తు పుంఖ నీళ్ళలో వేసి కషాయముకాచి ఆకషాయముతో ఆవిరిపట్టించవలెను. మరియు రెండుకాళ్లు మర్దించుచు రుద్దుచుండవలెను.

హకీమురాజీగారు చెప్పినదేమనగా ఒకతలనొప్పిగలరోగిని ఒక అహోరాత్రి కాళ్ళుమర్దించుటవలన తలనొప్పి తగ్గిపోయి ఆరోగ్యము నొందెనని వచించిరి. కాబట్టి కాళ్ళు మర్దించుట పాదములు రుద్దుట వలన తలనొప్పి హరించును

## (11) అభిఘాతక శిరోరోగలక్షణము.

ఈతలనొప్పి కలుగుటకు కారణము ఈక్రిందవివరించుచున్నాము. తలపుర్రెపై పొరచిట్లుటవలనగాని లేక గాయమువలనగానిలేక దెబ్బతగిలి అదరుటవలనగాని లేక తలకు దెబ్బతగులుటవలన తలనొప్పికలుగుచున్నది.

2. తలకు తగిలిన దెబ్బవలన మెదడునందుగాని మెదడుపై పొరలయందుగాని వాపుజనించుటవలన తలనొప్పి కలుగుచున్నది.

3. తలయొక్క లోభాగమందుండు పొరలు పుర్రెవరకు చుట్టుకొని వుండును. ఆపొరచిట్లుటవలన తలనొప్పి కలుగుచున్నది.

4. తలయొక్క వెనుక ఇరుగుటవలన తలయందుండు పొరలు యావత్తు బిగిసికొని జారి ఉబ్బిపోవుటవలన తలయందు నొప్పికలుగుచున్నది.

5. తలకుదెబ్బతగులుటవలన మెదడు తనస్థానమునుండి కదలిపోవును. ఇట్లు మెదడుకదలిపోవుటవలన బిగించబడి తలనొప్పి కలుగుచున్నది. మెదడు తన స్థానమునుండి కదలినయెడల మరణము సంభవించును కాబట్టి తలకు అనుకూగాని దెబ్బగాని, గాయముగాని, తగిలినదా లేక వెనుక విరిగినదా పొరలు, మూలనము, చిట్లినవా, జీవనరము తెగినదా లేక యేస్థానమునందు వాపు జనించినదని ఆలోచించవలెను.

## అభిఘాత శిరోరోగ చికిత్స

ఇట్టిదశయందు తక్షణమే సలేరు అనునరముగాని, హాత్తైలందా, అనునరముగాని ఛేదించవలెను. వాపు జనించినయెడల నొప్పి శమించుటకున్నూ, అదియుగాక బలము కలుగుటకు మర్దుటహానియూ ఆకు సహితముగాయావకషాయము, శిరసెనగపిండి, వంటశేగురు, జటామాంసి, రసాంజనము, తుమ్మజిగురు, చందనము, ఈమొదలగు వస్తువులను బొర్తంగు రసముతో నూరి అందులో గుల్ రోగన్ కలిపి తలకు లేపనముచేయవలెను. ఇట్టిదశయందు గుల్ రోగన్ మిక్కిలి ప్రయోగముగా ప్రత్యేకము మరియేవస్తువుతో కలిపిగాని తలకులేపనము చేయుట వలన మిక్కిలి వుపయుక్తమగును. అనగా తలకు బలము గలిగించి నొప్పిని శాంతినొందించును. మరియు గుల్ రోగనుతో కొంతశిర్కా చేర్చుట వుత్తమము. శిర్కా ద్రవపదార్థము కాబట్టి తలయొక్క రోమకూపములద్వారా ఔషధమును తనతోకూడ తలలోపునకు తీసుకొని వెళ్ళగలదు. కాబట్టి శిర్కా ప్రయోగించుట మంచిది. నొప్పితక్కువగానుండిన శిర్కా వుపయోగించకూడదు. నొప్పి స్వల్పముగానుండునప్పుడు శిర్కాలేపనము చేసినయెడల సక్తా (సన్యాసము) రోగము పుట్టగలదు.

మరియు ఉన్నాబు, రేలకాయ, ఈరెండువస్తువులకషాయమువలన కోష్టమును, మృదువరచి దీనివలన విరేచనము చేయించవలెను. ఈకషాయము ఆమాశయముయొక్క నీచపరమాణువులు పైకిలేచి మెదడునందు చేరకుండునటుల ఆటంకపరచును.

మరియు నిది సమశీతోష్ణముగనుమృదుఔషధములతో వుపయోగించుటవలన మెదడునందుగల మలినము దిగిపోవును.

మరియు శతలనొప్పియందు జ్వరము, బుద్ధిమారిపోవుట మొదలగు లక్షణములు కలిగినయెడల మెదడునందు వాపుకలిగినదని ఆలోచించవలెను. ఇట్టిసమయమున బద్ధకరములైన వస్తువులు తలకులేపనము చేయుట లాభదాయకము. అనగా ఖురాఫ్ఫు, దాసిమ్మబెరడు, సర్వికా

యులు, సాంబ్రాణి, గులాబిపువ్వులు, ఈవస్తువులు యావత్తుగాని లేక యిందు సుగంధముగు వస్తువులు నూరి, తలకులేపనము చేయవలెను. ఈలేపనమువలన వాపు హెచ్చనేరదు. మరియు సరసాంవ్యాధి చికిత్స చేయవలెను. తలయదురుటవలన పోటుకలిగి తెంపొరలిచినయెడల లేక తలపుర్రిపై దెబ్బతగిలి గాయమైనయెడల గాయమును మాన్పునట్టి పలాస్త్రీలు, మలాములు, లేపనముచేసి గాయమును మాన్పవలెను. మరియు ప్రారంభదశయందు దుష్టప్రకృతి తొలగి నిజదశయందు రా గలందులకై పరిశ్రమచేయవలెను. ఈవస్తువులుపై నవర్ణించియున్నాము. అభిఘాతమువలన కలుగు తలనొప్పి వెనుకవ్రాయబడియున్నది.

ఇక దుష్టప్రకృతి పుష్టములేక శీతము మున్నగుదశలు ఈక్రింద చెప్పబోవుచున్నాను.

## దీనిలక్షణములు.

తలపుర్రెలోభాగమునందుండునట్టిపొర చినిగినయెడల దీనిచికిత్స కష్టసాధ్యము. విశేషముగా లోభాగమునందుండు ఝిల్లియుండిఅనగా లోపలనుండు రెండు ఝిల్లిపొరలలోనుండి కఠినమగు ఝిల్లి చినుగుట వలన అట్టిఛేదింపబడుదానిని అంబ్బీభావయందు మానిఖశ అందురు. దెబ్బవలనగాని అదురుచేత తలయందుండు మెదడు చెదరిపోవుటవలన కలిగిననొప్పి మిక్కిలి అసాధ్యము. ఈవ్యాధియందు గొప్పభయోత్పాత ము సంభవించును. యెటులననగా ప్రధానమగు అంగముయొక్కఅనగా మస్తిష్కమునందుమిక్కిలి కష్టదశవలన యావచ్ఛరీరమునకు కష్టదశ సంభవించును. మరియు తలయొక్కపుర్రె చితుకుటవలన కలుగువ్యాధి విషయమై యీపుస్తక అంతభాగమునందు వర్ణించబడియున్నది.

## 12 తలనొప్పి వర్ణనము

ఈతలనొప్పి మిక్కిలి కష్టముగా నివర్తించును. ఈనొప్పియందు విశేషకష్టము సంభవించుచున్నది. ఈ తలనొప్పి టోపివలె తలయావత్తు ఆక్రమించుచున్నది. అనగా తలకు టోపీ తగిలించినటులుండునని భావిం

చవలెను. ఈ కారణమువలననే ఈతలనొప్పికి సౌదాఖోదా అని వచించి యున్నారు. దీనిభావము టోపి అనబడుచున్నది. ఈ తలనొప్పియొక్క ప్రధానహేతువు కారణము మొదలగు అంశములందు వైద్యుల మతము వేరువేరుగానున్నది. షేఖ్‌బూఅలీసేనాగారి అభిప్రాయము ఈక్రింద వివరించ బడుచున్నది.

దీని ప్రభావము తలయొక్క సమస్త భాగములయందు నొప్పి ఆక్రమించుచున్నది. తలయొక్క సమస్త నెప్పితో సమానముగానుండును గాని తగ్గు హెచ్చు స్వభావికముతోనుండదు. ఈ నొప్పి చాలకాలమువరకు నిలిచి యుండును. ఈవ్యాధి మరియొక కారణమువలన ఘడియ ఘడియకు కష్టము హెచ్చుచు విశేషముగా వేధించును. మరియు, ఇతరులు మాట్లా డుటవలన తనకు కష్టముగానుండును గాన ఈవ్యాధిగలరోగి నిశ్శబ్దము గానుండు చీకటిగదిలో తలపై లాడవేసుకొని పరుండుటకు హితవుగోరు చుండును. మరియు, తనతలపైన ఇతరులు చేతులతో బాధినటుల తల బట్టినిడ్చినటుల నిమిష నిమిషమునకు తోచుచుండును. మరియు, అధిక కష్టమువలన తలబిగిసికొనిపోవుట కట్టించును ఒకవ్వాను తలయందు పటపటయని శబ్దము వినును. ఈ మొదలగు లక్షణములు సౌదాతలనొప్పి వలన కలుగునని గ్రహించవలెను. ఈతలనొప్పి ఆరు కారణములవలన ఉత్పన్నమగుచున్నది.

1. దుర్భరమగు చిక్కని ఆవిరిపరిమాణువులు, ఆమాశయముల వలన లేచి మెదడు సంబంధమగు పొరలక్రింద ఘనీభవించుటవలన, మరియు, తలపెంకు పైభాగమునందు చుట్టబడియుండు ఝిల్లీపొర క్రిందికి ప్రవేశించి నిలిచిపోవుటవలన, తలపుర్రె లోభాగమునందు మెదడు నాశ్రయించియుండు, ఝిల్లీ పొరయందు ఘనీభవించియుండిన పరమాణు వులు లేచి దుష్టములమునందు చేరి నిలిచిపోవును. ఇటుల తలయందుగాని శ్లేష మరియే అంగమునందుగాని పరమాణువులు బంధించుటవలన తల యందునొప్పి సంభవించును.

2. ఇది దుష్టములగు యొక్క, దోషములు, తలభాగములయందు నిలిచి, ఘనీభవించును. దీనివివరము, పైనవ్రాసినతలభాగములయందు అనగా, పొరలు మొదలగువానియందు, స్తంభించుట వలన తలనొప్పి కలుగుచున్నది.

3. రుధిరమునుండి ఉత్పన్నమగు, సరసాంవావు (మెదడునందుపొరవావు) ముఖ్యముగా, మెదడునందు కలుగుటవలన తలనొప్పి వుత్పన్నమగుచున్నది.

4. మెదడునందు పిత్తప్రకోపమువలన వావుసంభవించిన మెడల తలనొప్పి కలుగుచున్నది.

5. జబ్బువలన తల లోభాగమునందు వావు జనించుటవలన తలయందు నొప్పికలుగుచున్నది.

6. వాతదోషము మెదడుసంబంధమగు పొరలయందు ఘనీభవించి అచ్చటనుండు చమ్మును అర్చివేయుటవలన తలనొప్పి వుత్పన్నమగుచున్నది.

ఉక్త శిరోరోగలక్షణములు.

ఈతలనొప్పి చిన్నములు, సామాన్యవిశేషకారణములుఅయిదువిధములుగా జెప్పబడియె.

1 తిరుగుట, పరుగెత్తుట, శరీరపరిశ్రమ చేయుట, మద్యపానము చేయుట, వాతప్రకృతిగలవస్తువులను సేవించుట, వేషపదార్థములు శరీరములో ప్రవేశించుట, కఠినవాక్యములువినుట, మొదలగుకారణముల వలన తలనొప్పివిశేషముగా సంభవించును.

2 ఈవ్యాధిచే పీడితుడగు రోగి అదాటుగా వెలుగునుండి చీకటిలోనుండుట, తలప్రేలాడవేసుకొని యుండుట, మంచిదనిభావించుట, విశేషముగా తలనొప్పి కలిగి మెడల కండ్లు తెరచుటకు వీలులేక మూసికొనియుండుట, మొదలగు లక్షణములు కలిగియుండును.

3. కనుగుడ్లయొక్క నరములందునొప్పి కన్నులలోనికీడ్చునట్లుండుట, మొదలగులక్షణములు కలిగియున్నయెడల తలలోపటి పొరయందునొప్పి ఆరంభమైనదని గ్రహించవలెను.

4. ముఖము యెండినట్లుండుట, ముఖకాంతిమారిపోవుట, రోగి తలపై చెయ్యివుంచినయెడల కష్టముతోచుట, మొదలగు లక్షణములు కలిగినయెడల దోషము ఝిల్లీపొరయందున్నదనియు, తలపై భాగమునందు నొప్పియున్నదనియు, ముఖకాంతి వెలవెలబారినట్లు కనుపించినయెడల నేదైననొకదోషము తలయందున్నదనియు ముఖకాంతినిబట్టి గ్రహించదగును, అనగా ముఖకాంతి యెఱ్ఱగానుండిన రుధిరకారణమువలన నొప్పియనియు, ముఖకాంతిపచ్చగానుండిన పిత్తాధిక్యదోషమువలన కలిగిన తలనొప్పియనియు ముఖకాంతి తెల్లనిరంగుకలిగియుండిన కఫాధిక్యమువలన కలిగిన తలనొప్పియనియు, ముఖకాంతినల్లగానుండిన వాతాధిక్యదోషమువలన కలిగిన తలనొప్పియనియు గ్రహించవలెను,

5. తలయందుండు నరములు అదురునట్లుల తనకు తెలియుచుండిన యెడల తలయందుండునట్టి ఏదోయొక పొరయందు పరమాణువులు నిలిచియుండుటవలన తలనొప్పి ఉత్పన్నమైనదని గ్రహించవలెను.

## 12 వ శిరోరోగచికిత్స.

ఈతలనొప్పియందు ఆలోచించదగిన అంశములను ఈక్రిందచెప్పుచున్నాను. అనగా తలనొప్పియొక్క హేతువు చక్కగావరియాలోచించి దోషాధిక్యమును గ్రహించి ఏదోషమునకు ఏచిన్నములు చెప్పబడియున్నవో ఆలక్షణములు తెలిసికొని దోషమును నిర్ధారణపరచి ఆదోషమును పక్వపరచి తొలగించి శరీరము స్వస్థతనొందునట్లుల నాలోచించి శరీరము, శిరస్సు, స్వస్థతనొందిన వెనుక తలయొక్క అంగములకు బలముకలుగునట్లు చేయుట ముఖ్యావశ్యకము మరియు, ప్రత్యేకదోషముయొక్క చికిత్సచేయవలెను. దోషవర్ణనము వెనుక అనేక స్థలములయందు చెప్పబడియుండుటవలన ఇచ్చట చెప్పక గ్రంథవిస్తారభీతివలన

విరసించితిని. ఈ తలనొప్పివలన నేత్రములలో నీరుదిగగలదని భయము చెందవలెను.

## 13 రోగసంధి (బహారాన్) తలనొప్పిలక్షణము.

ఈతలనొప్పి బహారాన్ దినములయందు ఉత్పన్నమగుచున్నది. గాని యెందుగా కలుగనేరదు లేక ఆర్జి అనుతలనొప్పి కలుగగలదు. ఈబహారాన్ తలనొప్పి ఉష్ణమలము కుళ్ళుటవలన కలుగురోగములలో పుట్టుచున్నది. దీనిలక్షణములు బహారాన్ (రోగసంధి) దినములలో నియమముగా వచ్చితీరును. అనగా అయిదవదినము, ఏడవదినము, పదకొండవదినము ఈదినములలో తలనొప్పి పుట్టుచున్నది. ఒక్కొకప్పుడు బహారాన్ తలనొప్పియందు మూత్రము తెల్లగా పలచగా వెళ్లనారంభించును.

## రోగసంధి (బహారాన్) శిరోరోగచికిత్స.

మలము వెడలించి ప్రకృతిని సహాయపరచునట్టి యుపాయములను పరియాలోచించవలెను. మరియు, మలదోషముయొక్క ప్రకృతి యేవిధముగానున్నది శరీరప్రకృతి యేవిధముగానున్నదని గమనించి చికిత్స చేయవలెను.

ఈతలనొప్పిగలరోగికి కడుపులో దేవినట్లుండి ఊర్ధ్వశ్వాసగానున్న యెడల ప్రకృతియొక్క మలము ఊర్ధ్వముగా వెడలుటకు ప్రయత్నించును. అనగా వమనముచేయించినయెడల దోషము వెడలిపోవునని భావము. వమనము చేయించగలందులకై శికంజబీన్ వేడినీళ్ళలో కలిపి పానముచేయవలెను. అథవా, యష్టిమధుకము, దోనవేరుచుకందర్, యీ వస్తువుల కషాయముకాచి ఆకషాయమునందు శికంజబీన్ కలిపి పానము చేసినయెడల వెంటనే వాంతియగును.

మరియు తల కలిగినప్పుడు కడుపులో గుడగుడయను శబ్దము, వాతము విశేషముగానుండుట, కడుపుపైమంట, తాపము, ఇట్టిస్థితియుండు, దోషప్రకృతిగలమలము అధోముఖముగా వెడలుటకు ప్రయత్న

ముచేయుచున్నదని గ్రహించి విరోచనమున కివ్వవలెను. విరోచనముల కిచ్చునట్టి ఔషధములు మిక్కిలి మృదువుగను కోష్టమును మెత్తపరచునట్టి స్వభావకముగలవిగా నుండవలెను. ఆలుబకరా, ఉన్నాబ్, సీమఅశోగింజలు, ద్రాక్షపండ్లు, చింతపండు, శీరెకిస్త్, యీవస్తువులను ఒకటిగాచేర్చి నీళ్ళయందువైచి కషాయముకాచి పానముచేయించవలెను. మరియు ఆలుబకరాషర్బతునందు రెండుపరియాములు తీసిన పన్నీరు కొంతచేర్చి, నీళ్ళయందుకలిపి యిప్పించవలెను. కోష్టము మృదుత్వము జెందగలందులకై ఉన్నాబ్, సీమఅశోకకాయలు, ఆలుబకరా, చుకందరాకులు, యవగంజి, మొదలగు వానియందు నల్లకలువపూలు, బనఫ్షా, ఆలుబకరాచేర్చి కషాయముకాచి, ఆకషాయములో మాడీఫలరసాయనము, నువ్వులనూనెచేర్చి పానముచేయించవలెను.

## గమనించగల వాంశములు.

విరోచనార్థము ప్రయోగించిన ఔషధములవలన బహుతాన్, కష్టము, వ్యాకులత, కడుపులోకెళ్లుట, మొదలగు లక్షణములు కలిగియుండును. యెందుకనగా విరోచనము చేయించునట్టి ఔషధములు ఆమాశయమునందుజేరి, పక్వమై పక్వాశయము మలాశయమునందుజేరి, అచ్చటిమలమును విభజించి గుదద్వారమునుండి బైటికి వెడలించును. ఇట్టిదశయందు పైనవివరించిన లక్షణములు కలిగియుండును. కేవలము విరోచనములకు యిచ్చుటకు ముందు వస్తికర్మచేయించి, శరీరమునకు స్థిరత్వముకలుగునట్లు చేయించవలెను. మరియు ఈతలనొప్పిదశగల రోగియొక్క నేత్రములకు సూర్యకిరణములు తగులుటవలన నేత్రములయెదుట ఎఱ్ఱనిరంగు, ఆకుపచ్చరంగుగల చిన్నదోమలు, పురుగులు, కనుపించినట్లుండును. అట్లు కనబడినవెంటనే తలయందు నొప్పి ఉత్పన్నమగును. మరియు కారణములేకనే తల, ముక్కు, అదిరినటుల తీవ్రగానుండును. ఇట్టిలక్షణములుగలిగిన యెడల ప్రకృతి నాసికముద్వారా మలము వెడలించు ప్రయత్నములో యున్నదని

## శుష్కత్వమువలన కలుగుతలనొప్పి చికిత్స

ఉష్ణవస్తువులను ఆఘ్రాణించుటవలన కలిగినతలనొప్పి వేడిచేత కలిగినదని గ్రహింపవలెను. పచ్చకర్పూరము చల్లనిపరిమళద్రవ్యములు అనగా బనప్షా, నల్లకలువపూలు వాసన చూపించవలెను. ఉష్ణవస్తువులను వాసనచూపించుటవలన ఉష్ణము శుష్కత్వము (ఎండిపోవుట) వలనకలుగు తలనొప్పి అనబడును. బనప్షానూనె నల్లకలువపూవ్వుల నూనె వాసన చూపించవలెను. యీతైలాదులతో నశ్యము చేయించవలెను. దుర్గంధవస్తువుల నాఘ్రాణించుటవలన కలిగిన తలనొప్పి యందువిరుద్ధమగుసువాసనవస్తువులను వాసనచూపించవలెను. ప్రకృతి సంబంధమగు వస్తువిరుద్ధమువలన దుర్గంధవస్తువులయొక్క దోషము హరించును. అనగా కలువపూలు, బనప్షాపూలు వాసనచూడవలెను. దుర్గంధవస్తువులు చమ్మ అనగా (జలుబు) గలవి పచ్చకర్పూరము, చందనము వాసనచూపించవలెను. ఈవిధముగా ఈవస్తువులతో తయారుచేసిన ఔషధములుగాని లేక ఇటువంటి గుణముగల వస్తువులతో తయారుచేయబడిన ఔషధములను వాసనచూపించవలెను.

ఇవిగాక దీనికిసహాయముగా ఆరేడా, (ఆఎరిపట్టుట) కషాయమును తలపై పోయుట మొదలగునవి ప్రకృత్యానుకూలముగా చేయవలెను. అనుకూలముగా నుండునట్టి వస్తువులతో చికిత్సచేయవలెను. తలకుయోగ్యత గలిగించువస్తువులవలన శిరస్సునకు బలముగలిగించవలెను. ఇట్టివస్తువులు పైనవివరించబడియున్నవి గాన తిరిగి యిచ్చట చెప్పనవసరములేదు.

2. శవగంధము, చర్మము కుళ్ళినవాసన మలమూత్రాదుల వలన కలిగినదుర్గంధము నాఘ్రాణించుటవలన కలిగిన తలనొప్పియొక్క చికిత్స యీక్రిందవివరించుచున్నాను.

రోగికి స్నానముచేయించవలెను. గోరువెచ్చని నీళ్ళు తలపై విశేషముగా పోయవలెను. తరువాత తలతుడిచి వన్నని బట్టవత్తిచేసి శిర్కా

లోనుంచి నోటికి నుంచి తెరు గత ఉష్ణముగల వస్తువులనుగాని లేక సుగంధద్రవ్యములనుగాని రోగపరిశోధకులు నాఘ్రాణింపజేయ వలెను. రోగివృద్ధుడైన యెడల సుగంధవుష్ణవస్తువులను వాసనచూచు టవలన లాభదాయకమగును. యవ్వనునికి అందుకు విరుద్ధముగా అనగా జలుబుగల సుగంధద్రవ్యములు ఆఘ్రాణింపచేయుటవలన మిక్కిలి లాభదాయకమని గ్రహించవలెను.

—విశేషదృష్టవ్య—

ఉష్ణద్రవ్యములను పీల్చుటవలన కలుగు నష్టములు కేవలము జలుబువస్తువులు. ఉష్ణముగల ఔషధములవాసనచూచుటవలన అనగా సుగంధముగల వస్తువులను పీల్చుటవలన కలుగు నష్టములు సువాసన దుర్వాసనలను ఆఘ్రాణించుటవలన మెదడునందు జేరి మెదడుయొక్క పొరలను హానిగలిగించును. ఈవస్తువులయొక్క వాసనవలన ఆవిరి పరమాణువులు రేగుచున్నవి. మరియు తలయందు దుర్మలము ప్రమథత్వము జెంది పరమాణువులు స్థూలముగా బహువుగా పెరుగుటవలన వాసన మెదడునందు జేరి తలయందు బరువు అనుదు పుట్టించును.

మరియు, పైనవివరించిన సుగంధదుర్గంధవస్తువుల యొక్క పరమాణువులు మెదడునందు జేరి మెదడు నణచివేయును. ఇట్టిస్థితియందు మెదడు బిగబట్ట నారంభించును. తలయొక్క పొరకూడా బిగబట్ట ఆరంభించును. ఈపరమాణువులు మెదడుయొత్తు నాక్రమించినచో జీవించుటకు భయముతోచును ఈ మొదలగు కారణములు గలిగి ప్రాణమును హరించునట్టిశక్తి (సుగంధదుర్గంధ వస్తువుల) వాసన పీల్చుటవలన కలుగుననిగ్రహించవలెను.

—15 శిరోరోగము తిమ్మిరితోగూడిన వ్యాధిలక్షణములు—

ఈనొప్పి, తలయొక్క లోభాగమునందు, దోషము గూడుకొని ఖుర్భవించుటవలన తలయందు నొప్పి పుట్టుచున్నది. మరియు మెదడునందు రక్తము ప్రవహించునట్టియు, వాయువు ప్రవ

మగును. మెదడు పురందుభాగస్థ ...డము, అనగా ముక్కు పై భాగమని అర్థము.

మరియు కొందరు వైద్యశాస్త్రజ్ఞులు మెదడుపొర సమీపము నందుకూడా పురుగు లుత్పన్నమగుచున్నవని వచించుచున్నారు. దీని కారణము విశేషతీక్ష్ణమగు దుర్గంధయుక్త పీల్చుటవలన దుర్గంధమలము ముక్కుపై భాగమునందు చేరి క్రిములను యావత్తు గట్టిపడి ఆమలమునుండి పురుగులు వుత్పన్నమగుచున్నవి. దీనిలక్షణములు మెదడునందు మురదకలుగుట ముక్కునుండి దుర్గంధము వెడలుట రోగితల కదలించినప్పుడెల్ల నొప్పియధికమగుట అనగా తలకదలించినప్పుడు అందుండు పురుగులు కదలుచుండును. పురుగు కదలుట వలననొప్పి అధికమగును. ఈ మొదలగు లక్షణములు మెదడునందు పురుగులు వుత్పన్నమగు రోగి లక్షణములని గ్రహించవలెను.

## 16 క్రిమిజ శిరోరోగచికిత్స

మెదడునకు స్వచ్ఛతనొందించుటకై ఔషధములను వుపయోగించవలెను. ఇట్లు మెదడునకు పరిశుద్ధతల నొందించుటవలన ఈవ్యాధికి కారణమగు దుర్గంధమువలన పుట్టినమలమును హరించును. తలయందుండు పురుగులు నశించుటకు యారజ్ పైకర, రెండవఔషధము మిక్కిలి ఉపయుక్తముగలది. అనగా సఫ్తాలుఆకుల కషాయముకాదిశాతూత్ వేరుకషాయము, రామిమూచిపత్రికకషాయము, ఈ మొదలగు కషాయములవలన నశ్యముచేయించవలెను. మరియు యీకషాయము వలన నాశికమునందుగల దుర్గంధము తగ్గనియెడల మెదడువరిశుద్ధము నొందునట్టి వస్తువులను వుపయోగించవలెను. మరియు ముక్కు దుర్గంధమును గురించి నాసారోగప్రకరణమునందు చెప్పబడును.

## 17 వ శిరోరోగలక్షణములు.

ఈతలనొప్పి మెదడు కదిలికే (సంచారము) వలన కలుగుచున్నది, మెదడు కదలుటకు రెండుకారణములుగలవు. (1) కఠినముగా కదే

లుట, మెదడుకష్టముగా కదలుట అనగా విశేషముగా ఆడుట స్త్రీసంగ
ము చేయుట మొదలగు కారణమువలన ఉత్పన్నమగును, యెందుకన
గా విశేషసంతోషమువలన మెదడునకు కదలిక కలుగుచున్నది.

(2) కష్టముగా మెదడు సంచారముచేయుట అనగా తలకు దెబ్బతగలుటవలన తలఅదురు మొదలగు కారణములవలన మెదడు కూడికయందు వకానొకప్పుడు సందిబంధములదశ మారుటవలన మరియు మెదడువకవైపు జేరుటవలన రెండవవైపు కొరంతైన కారణమువలన మెదడువిడుటవలన, కదలుటవలన మెదడుసంబంధమగు పొరలలోనుండి వకపొరచిట్లుటవలన మెదడుసంబంధమగు ఏదో అవయవము చెడుట వలన ఈ మొదలగు కారణములవలన మెదడు కదలిపోవును ఇట్లుమెదడు కదలుటవలన రోగి జీవించుట దుర్లభము.

మరియు (1) ఆడుట, తలపైదెబ్బతగులుట, స్త్రీతో ఆలింగనముచేయుట మొదలగు మెదడుయొక్క విశేషకదలికవలన మెదడునందు గల నరములు, కండరములు, మొదలగునవి బిగించినట్లుండుట నరములు పీకుట కండ్లు చీకట్లుగ్రమ్ముట రోగినిశ్చేష్టితుడై యుండుట, ఒకానొకప్పుడు రోగిస్మరంతిలేక మూర్ఛపోవుట మరియు సుగంధదుర్గంధములు ఘ్రాణేంద్రియములకు తెలియకుండుట మొదలగు లక్షణములు మెదడు కదలికవలన కలుగు తలనొప్పియందు సంభవించునని తెలియవలెను.

## 17 వ. శిరోరోగచికిత్స

తలనుండి మలము వెడలుటకై బాసలిక, సరేరు అను నరములను ఛేదించవలెను. జ్వరసమయమునందు మృదుఔషధములను ప్రయోగించవలెను. మరియు, కోష్టము మృదుత్వము నొందుటకై మృదుఔషధములు ప్రయోగించవలెను. అనగా రేలకాయగుజ్జు, కాసినిగింజల రసము కలిపి ఇవ్వవలెను. వస్తికర్మచేయవలెను.

మరియు, ఇట్టిదశయందు జ్వరములేనియెడల తీక్ష్ణఔషధములు సేవించుట, తీక్ష్ణముగు కషాయములతో వస్తికర్మచేయుట కొకాయమూ

గ్రాలు సేవించుట, మరియు, కోష్ఠమును మృదుపరచుట తదుపరి ప్రకృతి నిజస్థితియందు మారునట్లు చేయుట బలముకలిగించు ఔషధము లిచ్చుట మొదలగు చికిత్సలు ముఖ్యావశ్యకము. మరియు, జ్వరముతో కూడా తలయందు వాపు యున్న యెడల చందనము, పోకచెక్కలు వంటచెఱకు, కచూరాలు, కాషి, యవపిండి, ఈవస్తువులు మహానింబ, గింజలపిండి. కలిపి లేపనము చేయవలెను అనగా వాపుశమింపజేయు వస్తువులు లేపనము చేయవలెను.

మరియు, జ్వరము వాపు లేనియెడల గోస్తనిదానిమ్మపూలు, దానిమ్మబెరడు, గులాబిపూలు, శీమనేలవేము, అస్, పటికి ఈవస్తువులు నూరి లేపనముచేయవలెను. మరియు సుగంధద్రవ్యములను వాసన చూచుచుండవలెను. గులాబిపూలనూనె, బనప్షానూనె చనుపాలలో కలిపి అందు దార్వీరసాంజనముచేర్చి కలిపి నశ్యముచేయించవలెను. దీనిని చెవులలో పోయవలెను. ఈమొదలగు చికిత్సలవలన పైనచెప్పిన తలనొప్పి హరించును.

## 18 తలనొప్పి లక్షణములు.

ఈతలనొప్పి నిద్రనుండి లేచినవెంటనే కలుగుచున్నది. ఈవ్యాధి లక్షణములు యీనత్తు వెనుక చెప్పబడియేయున్నవి. గ్రంథవిస్తరభీతి వలన పృథక్ చెప్పుటకు విరమించితిని.

## 18 తలనొప్పిచికిత్స

ఈతలనొప్పి యేదోషమువలనకలిగినదో గమనించి ఆదోషము ను వెడలించుఉపాయములు చేయవలెను గుల్రోగన్, శిరకాలోకలిపి అందులోకొంతబూడిదెచేర్చి కణతపై మాడుపై లేపనముచేయవలెను. అంజూరచెట్టుబూడిదె శిరకాలోకలిపి ప్రత్యేకముగా లేపనముచేయుట ఉపయోగమని తెలిసికొనవలెను.

## 19 వ అర్ధతలనొప్పి లక్షణములు.

ఈతలనొప్పిని శకాక (అర్ధతల) నొప్పిఅందురు. ఈనొప్పిఅర్ధతల

యందు పుట్టుచున్నది. అనగా తలపొడవునకుగల అర్ధభాగము నొప్పికలిగియుండును. గాన అర్ధతలనొప్పి యని దీనికి నామము కలిగినది ఈనొప్పి రెండు కారణములవలన ఉద్భవించుచున్నది.

1. ఆవిరి పరమాణువులు సర్వశరీరమునుండి గాని ప్రత్యేక అంగము నుండిగాని బయలుదేరి మెదడునందుజేరి తల యొక్క దుర్బలమగు భాగమునందు ఘనీభవించుటవలన తలనొప్పి ఉత్పన్నమగుచున్నది.

2 తలయొక్క దుర్బలభాగమునందు పిత్తదోషముగాని కఫదోషముగాని చేరుటవలన గాని లేక ఆభాగమునందు వాతముచేరుట వలనగాని లేక శీతప్రకృతిగాని లేక ఉష్ణప్రకృతిగాని, చేరి దోషములము మెదడుయొక్క నరములయందు నిలుచుటవలన ఈమొదలగు కారణములవలన తలయందు నొప్పిపుట్టుచున్నది దీనిలక్షణములు తలఅర్ధభాగమునందు నొప్పి యెల్లప్పుడు నిలిచియుండుట మరియు హృదయము యొక్క నరములు, అదురుట ఈతలనొప్పి లక్షణములు. ఈవ్యాధి ముఖ్యమగు లక్షణము హృదయము, (హార్టు) దుడుకు యని గ్రహించవలెను. మరియు హృదయదడ (హార్టుబీటింగు) తగ్గి యెడల తలనొప్పి తగ్గుచున్నది. దడజాస్తిగా నున్నయెడల తలనొప్పి జాస్తిగానుండునని తెలిసికొనవలెను.

## 19 అర్ధతలనొప్పి చికిత్స

సాధారణ తలనొప్పులయందు దోషములను తొలగించి ప్రకృతి తన నిజఅవస్థయందు మార్చునట్టి చికిత్సలను వెనుకచెప్పియున్నాను. వానిని యిందుపయోగించవలెను.

మలము యెచ్చట వుష్ణప్రకృతి తో నుండునో ఆస్థానమందు నల్ల కలువపూలు, బనఫ్షా, ఖతిమిఆకులు, కాహు, గులాబిపుష్పములు,యీ వస్తువులను నీళ్ళయందు సమానభాగము గాజేర్చి కషాయముకాచి నొప్పి

నొప్పిపుట్టించునట్టి నరములు, కణతలయందున్న, ముక్కు వెనుకభాగమునందునవి. ఆనరములు మిక్కిలి దుడుకుగను, మిక్కిలి అదురుచుండును. ఆనరములను శరీరశాస్త్రానుసారముగా, విధిపూర్వకముగా భేదించవలెను. యెందుకనగా ఆవిరి పరమాణువులు పైకెక్కుటకు ఈనరములే మార్గము గనుక ఈనరములను భేదించుటమంచిదని వచించుచున్నాను. భేదించునట్టి శస్త్రము ముందు కాల్చవలెను యెందుకనగా రక్తదోషము మరియొక దోషముతో సంబంధము గలుగగలదు. గాయము త్వరగా మాననేరదు, మరియు, చెవువెనుకనుండు నరములను భేదించుటవలన సంతానము కలుగనేరదు. ఇందువిషయమై వీర్యము ఉత్పన్నమగునట్టి వర్ణమునందు విమర్శింపబడినది.

## మెదడు వాపు లక్షణములు.

సర్సాం అనగా మెదడు లేక తలపుర్రెలోపటి రెండుపొరల యందు వాపు ఉత్పన్నమగుటకు సర్సాం అనుచున్నారు.

మరియు మెదడులోపటి పొరలు రెండింటిలో మొదటిపొర పేరు సలీబ్ అనియు రెండవపొరపేరు లయ్యాన్ అనియు చెప్పుదురు. ఈ రెండుపొరలయందు గాని లేక ప్రత్యేకముగా ఒకదానియందుగాని లేక రెండుపొరలలో అచ్చటచ్చట గాని లేక ప్రత్యేకపొరయందుఅచ్చటచ్చట వాపుజనించుచుండును. బహుశా మెదడుయొక్క ముందుభాగముతో ఈపొర కలిసినస్థలమునందు ఉష్ణమువలనగాని జలుబువలనగాని లేక మరియొక అంగసంయోగదోషమువలనగాని, వాపుసంభవించును. సర్సాం, అనగా మెదడునందు ఉష్ణవాపు, అనికొందరు అభిప్రాయపడుచున్నారు. ఈవాఖ్యమును ఖండించి షేక్అలీఅబూసేనాగారు ఈక్రిందివిధముగా వచించియున్నారు.

అనేకవైద్యశాస్త్రములందున్నూ, నాస్వబుద్ధిస్వానుభవమువలన నున్నూ, కనిపెట్టియున్నాను. సర్ సాం అనగా రోగికఅని పేరు. అనగా రెండుమతభాషలచేర్చి యీసర్సాం అనిపేరుపెట్టబడినది. సర్సాం సర్- అనగా ఫార్సిభాషయందు తలయనియు, సాం. అనగా వాపుఅని యు అర్ధము (తలవాపు) అనిచెప్పబడినది.

రుధిరాది సర్సాం, రక్తమునందుగల దోషములవలన కలుగు చున్నది, దీనిని కరానితూస్, అని చెప్పుదురు. దీనిని యూనానభాషలో సర్సాం, జమఃభా అందురు. తురుష్కుల మతానుసారముగా యీ వ్యాధి రక్తదోషమువలన కలుగుచున్నదనియు చెప్పుచున్నారు. పిత్తము వలనకలిగిన సర్సాం వ్యాధికి ఖరామితుస్ ఖాలిస్ అనియు కఫము వలన కలిగిన సర్సాం వాపునకు విసరగుస్ అందురు. వాతము వలనగలిగిన సర్సాం వ్యాధికి ముఖ్యనామము పెట్ట బడియుండలేదు. ముఖ్యముగా మెదడువాపు కేవలము రక్తదోషము వలన పుత్పన్నమగుచున్నది. దీనిని ఫల్గము యందురు. నిది బహుళ దుర్గంధిత రుధిరమునుండి పుత్పన్నమగుచున్నది. ముఖ్యముగా మెదడు నందు వాపుపుట్టించుటకు పిత్తరుధిరము కారణమైనయెడల వాపును ఆక్రమించునట్టి ప్రయత్నములోనుండును. ఇట్టివాపునకు హామ్మారా యందురు. మరియు మెదడుయొక్క ముఖ్యనరములలోపలిభాగమునందు చిక్కనిరుధిరమువలన యీవాపుపుత్పన్నమగుచున్నది. యిట్లుగలుగు వాపునకు గాన్గజాయా యనియు, శకాకలూస్, యనియుచెప్పుదురు. దోషము లఘువుగను, హీనముగానుండునో, అదిపొరలయందు జేరజా లదు. యెటులనగా చిక్కనిదోషము కఠినమగు చర్మమునందు ప్రవే శించజాలదని భావము. కాబట్టి పిత్తవాతమువలన గలిగిన రుధిరదోష ము , మెదడునందుజేరజాలదని గ్రహించవలెను. అనగా పైత్యవాతము వలన మెదడునందువాపు కలుగనేరదనుట.

మరియు పిత్తశ్లేష్మదోషము వలన పుట్టుచున్నది గాని దీనిప్రకృతికి విరుద్ధముగా [illegible] పుట్టిన [illegible] ప్రకృతి సమానముగాయుండి అందు శ్లేష్మము ఆక్రమించినప్పుడు మెదడు వాపు పుట్టుచున్నది. మృదువుగను స్నిగ్ధముగను, [illegible] దోషము మృదువగు స్నిగ్ధముగానుండు శరీరమునందు ప్రకృతి [illegible] తెలిసికోవలెను.

మెదడు వాపునందు కలుగు [illegible] నాడి విశాలముగను, స్థూలముగను, [illegible] ఎక్కువముగానుండి విపరీతముగలిగియుండును. నేత్రములు లోభాగమున [illegible] కలిగియుండును. ఒకప్పుడు తలయందు మన [illegible] వాపుజనించును యిట్టిదశయందు తలనుండి గలుగు యీ ఆపత్తు కార్యములు భిన్నముగును. రోగిమిక్కిలి హీనుడై జీవించుట దుర్లభమగును. మరియు మెదడు యేభాగమునందు వాపుజనించినను భయరహితము కాజాలదు. యీ ఆపత్తు మెదడువాచుట వలననాలుగురోజులలో రోగిమృతినొందును. దైవకృపవలన నాలుగు రోజులవరకు జీవించియున్న మొదల బ్రతుకుటకు ఆశకలుగుచున్నది.

తలపుర్రె లోభాగమునందు అంటుకొనియుండు ఝిల్లీపొరను పయీబ్ యందురు. యీపొరయందు వాపుజనించిన మొదల కలుగులక్షణముల వదించెద. నాడి కఠినముగను రంపమువలెనుండుట, శ్వాసకలుగుట తలపుర్రెయందు నొప్పికలుగుట మొదలగు లక్షణములు కలిగియుండును. మెదడుపై చుట్టుకొనియుండు ఝిల్లీపొరను లాయాన్ యందురు. యిందువాపుజనించుటవలన కలుగులక్షణములు నాడి కఠినముగను స్నిగ్ధముగానుండును. ఈఝిల్లీవాపునందు నొప్పివిశేషముగానుండును.

మరియు మెదడు ఝిల్లీపొరములందు వాపుజనించిన మొదల రోగి జీవించుట దుర్లభము. ఎటులనగా తలయందుమిక్కిలి కష్టముకలుగును. అందువలన మరణము సంభవించును. మెదడు ముందుభాగమువాచుట వలన కలుగులక్షణములు రోగి కండ్లువిప్పి చూచుచునే కళ్ళుముందు

చెవ్యత్తో నీగలను తోలుకొనినటుల విసురుకొనుచుండుట, ఈగలను పట్టుకొనునటుల చేయుట బట్టలపై గోడలపై చేతులను రుద్దుచుండుట మొదలగు లక్షణములు కలుగుచుండును.

మెదడుయొక్క మధ్యభాగమునందు వాపుకలిగినరోగి లక్షణములు, రోగివదరుచుమాటలాడుట, విశేషముగా ఆడుట, జ్ఞప్తిలేక కొద్దికొద్దిగా మూత్రము విడుచుట, రోగి స్మృతితప్పిపోవుట మొదలగులక్షణములు కలిగియుండును.

తలవెనుకభాగమునందు వాపుకలిగినయెడల కలుగులక్షణములు చెప్పినమాట పలుమారుచెప్పుట మూత్రవిసర్జనమునకు ప్రయత్నముచేసి కూర్చుండి ఆప్రయత్నము మరిచిపోయి మరియొకవిధముగా ఆలోచించుట మొదలగు లక్షణములు కలిగియుండును.

మరియు తలయొక్క యావత్తు మెదడునందు వాపుజనించిన యెడల పైనవివరించిన యావత్తు లక్షణములు సంభవించును.

మరియు దోషముల వుత్పత్తిస్థానమునుబట్టి సర్సాం అనువ్యాధి భిన్నభిన్నములుగా పేర్లుపెట్టబడెను కాబట్టి ప్రత్యేక సర్సాం వర్ణనము భిన్నభిన్నములుగా చెప్పబడెను.

### మెదడువాపు మొదటిభేదలక్షణములు,

దీనిని యూనానిభాషయందు కిరానిస్, (మిక్కిలివదరుట) అందురు. ఈవ్యాధియందు కారణములేకనే మాట్లాడుచుండుట, అతిప్రేలాపనకలిగియుండుట, యిందు వలననే దీనిని కరానితుస్ అని పేరుపెట్టియున్నారు.

### రక్తజ మెదడువాపు లక్షణములు.

ఈవ్యాధియందు జ్వరము ఎల్లప్పుడు నిలిచియుండుట, తలయందు భారము ధన ధన యను శబ్దముగా నుండుట, తల అదురుట, ముఖము కండ్లు ఎర్రగానుండుట, అప్పుడప్పుడు నవ్వుచూ, మాట్లాడుట,మధ్యమధ్య చిరాకుపడుచుండుట, నాలుకగరిగానుండుట, నాడి విశాలముగా

నడుచుట నేత్రములు కళాహీనముగానుండుట, మొదలగు లక్షణములు కలిగి యుండును. యీలక్షణములలో నేత్రములు కళాహీనమై నీరు స్రవించుచుండిన ఈవ్యాధి అసాధ్యమని గ్రహించవలెను. ముఖ్యము గా వకకంటినుంచి నీరు స్రవించినమిక్కిలి అసాధ్యమని తెలిసికోవలెను.

రక్తజమెదడువాపుచికిత్స,

రోగారంభమునందు ఒకటి రెండు మూడు దినములవరకు రోగానుసారముగా మలదోషమును అనగా రక్త, వాత, శ్లేష్మ, పిత్త, దోషములను మార్చునుపాయములను చేయవలెను. రోగిశరీరబలము నాలోచించి రక్తమోక్షణము చేయించవలెను. అనగా శరీరమునుండి రక్తము వెడలింపవలెననిభావము.

మరియు, రోగిపిక్కలపై శస్త్రముతో గంట్లుపెట్టి రక్తము వెడలింపవలెను. రోగిశరీరానుకూలముగా ఫలజాతుల కషాయముల నిప్పించవలెను. ఆలుబకరాషరబతు, చింతపండుషరబతు మొదలగుషరబతులను పానముచేయించి కోష్టమును మృదుత్వము నొందించవలెను. ఈరోగికుపయోగించు ప్రతికషాయము ప్రతిషరబతునందు తురంజబీన (మాధిఫలము) చేర్చుట మిక్కిలి ఉత్తమము విరోచనమై కోష్టము లఘుత్వమునొందుటకై వస్తి (ఎనిమా) నిమిత్తముపయోగించు కషాయములందు రేలకాయగుజ్జు చేర్చుట మిక్కిలి మంచిది.

వైద్య మతానుకూలముగా వస్తికర్మ రెండువిధములని చెప్పియున్నారు. వీటివివరము చికిత్సలయందు చెప్పబడును. లయ్యాన్ (మృదువరచునట్టి) 2 హాద్దా (ఉష్ణతీక్ష్ణముగలది) వేగరముకలిగించునది. ఈరెండువిధముల ఔషధములను గురించి ఇందు చెప్పబడియుండలేదు. ఎందుకనగా ఈరెండువిధముల చికిత్సలు ఖరాబాదిన్ (చికిత్స గ్రంథము) నందు చెప్పియుండుటవలన ఈపుస్తకమునందు చెప్పియుండలేదు. కాబట్టి చికిత్సచేయు వైద్యుడు తాత్కాలిక రోగబలానుసార

ముగా లఘువు, మృధువు, కఠినము, ఉష్ణము, శీతము, సమశీతోష్ణము మొదలగునవి నాలోచించి చేయవలెను.

మరియు, మెదడునందు చలువకలుగుటకై శిరకాగుల్‌రోగన్ పన్నీరుకలిపి తలపై లేపనము చేయవలెను. ఈవస్తువులను లేపనచేయు విధి వెనుక చెప్పబడియున్నది మరియు, బనప్‌షా, కలువపూలు సొర కాయ, దోసకాయ, ధనియాలు, వీటిరసమునందు సిరకా, గుల్‌రోగన్ కలిపి విశాలముగుశీసాలోపోసి రోగి వాసన చూచు చుండవలెను. ఇట్లు వాసనచూచుటకు లఖ్‌లకా అందురు. మరియు, ఆవిరిపట్టవలెను. ఈ రోగికి నిద్రపట్టకుండిన యెడల నిదురపట్టుటకై గసగసాలషరబతు అనగా వటికిబెల్లము పన్నీరులో అర్కయంత్రమునందు తయారు చేయబడిన షరబతు ఉపయోగించుట ఉచితము. శరీరమునకు మృధుత్వము లఘు త్వము కలిగించునట్టి చికిత్సలను అతిజాగరూకతో మిక్కిలి వేగిరముగా చేయవలెను.

మరియు, రుధిరమును విశేషముగా వెడలించకూడదు. ఇట్టిదశ యందు రోగిభుజించుటకు శక్తిహీనుడగును. యెందుకనగా రోగిశరీర మునుండి విశేషరక్తము వెడలించుటవలన బలముతగ్గిపోవును ఈవ్యాధి లంఖనముచేయుటవలనకూడ శమించునని తెలియవలెను.

## రక్త మెదడువాపు పత్యములు.

ఈరోగమునందు కేవలము యవనమాక్, పత్యకారి రోగి బలము గానుండి రోగబలము స్వల్పమునుండి శక్తిదుర్బలముగానుండి రోగమం తయు నశించిన యెడల యవాన్నము, పెసరపప్పు, సొరకాయ, పాలక్ కూర, బాదంమూనిచేర్చి తయారు చేయునట్టి పదార్థములు భోజనార్థ మిప్పించవలెను.

## రెండవ ఖారిస్ కరానితూస్ లక్షణములు.

కరానితూస్, ఖరిస్, దీనికారణము కేవలము పిత్తమువలన కలుగునని తెలిసేది దీనిలక్షణములు జ్వరముకలుగుట పృష్టాధిక్యముగా

నుండుట, తల లఘుత్వమొందుట, నిద్రలేమి, మూల్గుట, ముక్కు, నే త్రములు యెండుట, నాలుకపచ్చగానుండుట, నాడి చంచలముగా నడుచుట, కారణములేనిదే విశేషముగా మాట్లాడుట, అతికోపము, అనయ్యకర్మమైన దుర్భాషలాడుట, బుద్ధిచెడిపోవుట, చాంచల్యత్వముగలుగుట మొదలగు లక్షణము (2) ఖారిన్ రాసితూన్ అను అపస్మారలక్షణములని గ్రహించవలెను.

రెండవ ఖారిన్ కరాసితూన్ చికిత్స

చింతపండు, నీలుబింతపండు, రేగుపండ్లు, పచ్చిఆలుబకరా, సపిస్తాన్, మాదీఫలము నీరేఖిస్త్, ఈవస్తువులను నీతప్ కషాయముచేసి, వడియబోసి పానముచేయించవలెను. ఇటుల పానముచేయుటవలన కోష్టముమెత్తబడి మలము మృదుత్వము పొందించి విసర్జనమగుటకు యోగ్యముగానుండును యీవ్యాధియందు లఘువిరోచనమునకు యిచ్చుటమంచిది. చెమ్మ, జలుబు, పుట్టించునట్టి అనగా పుల్లదానిమ్మకాయరసము, తియ్యదానిమ్మరసము, పన్నీరు, సొరకాయపై బెరడు, దోసగింజలు, కామంచిగింజలు, ఆమ్లగేరసము, మొదలగునవి రోగి శిరస్సునందు శిరోవస్తి చేయించవలెను. అథవా, బనప్షానూనె, సొరకాయరసము, కలువపూలు, యీమొదలగు తైలములను బరప్ (మంచుగడ్డ) యందు చల్లార్చి తలకులేపనము చేయవలెను.

మరియు బనప్షా, సొరకాయ, కలువపూలు, ఖతేమి, యీ వస్తువులు వకటిగాచేర్చి కషాయముకాచి రోగితలపై పోయవలెను. మరియు రోగికి నిదురబొత్తిగపట్టనియెడల కాహూ, పోస్తుకాయలు, నూరి రసముతీసి ఆరసమునందు బాబూనాకషాయముకలిపి తలకుకావడముచేయవలెను. లేక గసగసాలపుష్పమునందు పానముచేయునట్టి కషాయములుకల్పి పానముచేయించవలెను.

మరియు ప్రత్యేకదశయందు జలుబు, చెమ్మ, కలిగించునట్టి వస్తుసముదాయమును వుపయోగించుటకు, గమనించవలెను. మరియు

పత్య, పానాదులయందు విశేషదాహము, దగ్గుయున్నయెడల యిట్టి జలుబుగలవస్తువులను వుపయోగించకూడదు. యీవిషయము ఉదిర సంబంధమగు సరసాంవ్యాధికి విరుద్ధముగానుండును కాబట్టి విశేష జలుబు చెమ్మకలిగించకూడదు.

### సూచనీయాంశము.

కావడమునందు గసగసాలు శుద్ధికొరకై బాబూనా చేర్చి తేనేతప్ప లాభములేదు. ఇట్టికారణములనుబట్టియె బాబూనా తక్కువగా చేర్చబడినది. దీనివలన చెమ్మచేజాలదు గసగసాలను బాబూనా శుద్ధి చేయును, బాబూనా ఉష్ణవీర్యము గలది. కాబట్టి కాపడములయందు చేర్చబడుచున్నది. మరియు, తరేడా విషయమునుగురించి వెనుక వ్రాసి యున్నాను. గాన చదువరులు గ్రహించగలరు. తరేడా అనగా కషాయాదులతో తలకు కావడము చేయుటకు పేరు.

### ఫలములనుండి రసముతీయు విధానము

దానిమ్మగింజలు నలిపి రసముతీయవలెను. దోసకాయదంచి రసము పిండవలెను. పుచ్చకాయకోసి కత్తితోగంట్లుపెట్టి రసముపిండవలెను. సొరకాయను యీక్రిందివిధముగా రసముతీయవలెను. అనగా తియ్యనిలేతసొరకాయతెచ్చి ఆకాయపై యవపిండి లేపనముచేసి పురముగాని పొయ్యిమీదగానియుంచి పురపాకవిధిగావండి ఆకాయపై పూతబూసిన యవపిండి వుడికినవెంటనే తీసికొని పైపిండితీసివేసి రసము పిండవలెను. మరికొందరు పిండికిబదులు మట్టిపూయుదురు, గాని యవపిండి మట్టికంటె మిక్కిలి వుత్తమము ఖిసాందా (శీతకషాయము) అనగా వస్తుసముదాయమునుచేర్చి రాత్రిభాగము నీళ్ళలోవేసి ప్రాతఃకాలమునందు వడకట్టుకొని ఆనీళ్ళను పానముచేయబడును.

### 3 వ. వాతజమెదడువాపు లక్షణములు.

ఈవ్యాధియందు రోగి ఉలిక్కిపడుట, పరుగెత్తుట, భయము నొందుట, ఏడ్చుట, మేలుకొనియుండుట, మెదడు, మాడు, నాలుక,

ఎండుట, బుద్ధి చెడిపోవుట, గొంతు అణగినట్లుల, శ్వాసనష్టముండుట, కండ్లు ఎల్లప్పుడు తెరచి యుండుట, స్వరహీనము, కనురెప్పలు వేయకుండుట, మరియు, చతుర్థాంశజ్వర వేగముగల రోగి అవస్థవలె మారుచుండుట, తలయందు కొంచెము వేదన కలుగుట, జ్వరమునందు తాపము, తలనొప్పియుండుట, నాడిలఘుత్వము నొందుట, కఠినముగా నడచుట, విరుద్ధము నొందుట మొదలగు లక్షణములు వాతజ సర్సాం వ్యాధియందు కలుగునని తెలిసికొనవలెను.

## వాతజ మెదడువాపు చికిత్స.

గౌజబాన్, బిస్ఫాయజ్, బాదరంజబోయ ఆకులు, సపిస్తాన్ ఈవస్తువులు వకటిగాచేర్చి కషాయముకాచి వాధీఫలరసముకలిపి పానముచేయించవలెను. ఈకషాయమువలన మలము పక్వమొందును. తదుపరి ఔషధములు వస్తివలన శరీరము స్వస్థతనొందునట్లు చేయవలెను. శరీరమునందు చెమ్మకలుగుటకై యవగంజి పానముచేయవలెను. దోషము లఘుత్వమునొందించి తీసివేయుటకై మిక్కిలి పులుసు లేనట్టి శికంజబీన్ ఉపయోగించవలెను. జగ్గుతోండు శికంజబీన్ ఎంత మాత్రము ఉపయోగించకూడదు. ముందుచెప్పిన విధానమువలన విరోచనమైన యెడల నేతిబీరగింజలపప్పు, ఖర్బూజాగింజలపప్పు, కలువపూలు, ఈవస్తువులను బనఫ్షాకషాయముతో నూరి ఏకముగాకలిపి చనుబాలతో నూరి తలకులేపనముచేయవలెను. మరియు, బాబూనా, తులసి, పన్నీరు, అకలీలుల్ మలిక్, గసగసాల ఆకులు, చుకందర్ ఆకులు ఈవస్తువులను కషాయముకాచి ఆకషాయము రోగితలపై పోయవలెను. మరియు, సొరకాయ, బనఫ్షా, కలువపూలు, బాబూనా మొదలగు వాని తైలములు తలకు లేపనముచేయవలెను. మరియు, చనుపాలు తలపైపిండుట అనగా ఆడశిశువు తల్లిపాలు తలపైపిండుట మంచిది.

## వాతజ దోషహార గుళికలు.

(1) పాచితీగ, బిస్ఫాయజ్, గారిఖూన్, చేదువుచ్చకాయగు

జ్జు, నఖ్ మోనియూ, రాజావర్తము, మొగలీస్ హులుబ్బెబల్ సాక్, (2) మరియు హులుబ్బెబల్ సాక్ సమభాగములుగా చేర్చుకొనవలెను. ఈవస్తువులు యాపత్తు చూర్ణము జేసి కాసినీరసమునందుగాని కషాయము నందుగాని జేర్చి నూరి మాత్రలుచేయవలెను. రెండవవిధముగు మాత్రలు శర్కరాయము తలనొప్పియందు చెప్పియున్నాను.

## రాజావర్తము శుద్ధిక్రమము.

రాజావర్తపురాళ్లు కల్వమునందువేసి నీళ్ళుపోసి తాటుకవలెనూరి నీళ్ళలోకలిపి వుంచి పైన తేరిన తేటవంచివేసి అడుగునందుండుమడ్డి యెండించి ఔషధములలో చేర్చుకోవలెను. యిదేవిధముగా మూడు పర్యాయములు నీళ్ళుపోసి తేరినట్టి నీళ్ళుపంచుచుండవలెను. మరియు యావత్తు విధముల రాళ్లు అనగా అఖిలియూ, ఖబ్సుల్హదీద్ మొదలగునవికూడా ఇదేవిధముగా శుద్ధి చేయవలెను.

## పృథునస్త్రక్రమము.

పాచితీగె, చిన్నకరక్కాయలు, పెద్దకరక్కాయలు, సనాముకీ చాదరాసియాహ్, బాదరంజబోయూ, గాజుబాన్, ద్రాక్షపండ్లు, బేదానా బిస్పాయజ్, పొట్టుతోనున్న యవలుఇవియావత్తు కషాయముకాచి వడియబోసి అందులో యెర్రశక్కెర రేలగుజ్జు, తియ్యబాదంనూనె, కలిపి హుకనా (గుదద్వారమునందు వస్తి) చేయవలెను. మరియు అనేకులు లయిక్ అయినను హాద్దాఅయినను కరక్కాయలు చేర్చకూడదని వచించిరిగాని, హకీము శేకు అబూ అలిశేనా హకీము షరీఫ్ల్లా మొదలగు మహనీయులు ఇందువిషయమై వచించిరి. దేమనగా మూడు నాలుగు దినములలో కరక్కాయ చేర్చుట గొప్పఅవసరమని తోచినయెడల దీనిని చేర్చుటయెంతమాత్రము హానికలిగించదు. యెందుకనగా నిది పిండునట్టి స్వాభావికముగలది. దీనివలన పలచని మలము వెడలిపోవునుగాని చిక్కనిమలము కఠినత్వము నొందును గాన కరక్కాయ యిందువిషయమై హానిదాయకమని కొందరిమతము.

### 4. వ కఫజ మెదడువాపు లక్షణములు.

ఈసర్సాంవ్యాధిని అరబ్బీభాషయందు వీసూరగుస్, అనుచున్నారు. దీనిహేతువుఁబట్టి పేరుపెట్టబడినది. ఈరోగమునందు రోగి చెప్పినమాట మర్చిపోవుట, రోగదోషము మెదడుమార్గములయందు నిలిచియుండుట యావత్తుదోషములందు ఒక్కొకప్పుడు మెదడునందు చేరియుండునుగాని ఈమలమువొరయందు చేరజాలదు. ఇందువిషయమై వెనుకవ్రాసియున్నాను. దీనిలక్షణములు యెల్లప్పుడు లఘువగు జ్వరము నిలిచియుండుట జ్ఞానేంద్రియములయందు మత్తుకలుగుట నాలుకతెల్లగానుండుట, ఆవలింతలు విశేషముగావచ్చుట బుద్ధి మందగించుట కఠినముగా మాటలాడుట కండ్లుతెరచి మాట్లాడుటకు జాలినొందుట కఠినముగా ప్రత్యుత్తరమిచ్చుట క్షణక్షణమునకు నిద్రించుచు మేలుకొనుచుండుట తొందరపడుట మొదలగులక్షణములు కఫజసర్సాంవ్యాధియందు కలుగునని యెరుంగవలెను.

### కఫజ మెదడువాపు చికిత్స

సోపువేరు, అజామోదం, చిన్నసోపు, ద్రాక్షపండ్లు, బెదానా ముంజగడ్డి, ఉస్తెఖద్దూస్, ఈవస్తువులు యావత్తు కషాయముకాచి ఆకషాయమునందు తేనెతోచేసిన సికింజబిన్, గుల్ఖందు కలిపి ఇప్పించవలెను. కఫము పక్వమైన తరువాత మాత్రలుగాని, హుకానా (వస్తికర్మ) ప్రయోగించి స్వచ్ఛతపరుచవలెను. తదుపరి శిరకా, గులాబిపూలతో చేయబడిన నూనెకలిపి ఆరంభదశయందు రెండు రోజులవరకు తలపై లేపనముచేయవలెను. మూడవదినమునుండి తలకులేపనలుచేయు తైలాదులయందు జున్నుకలిపి లేపనముచేయవలెను. మరియు రోగబలము తగ్గనారంభించగనే ముహల్లిల్ (నష్టమునొందించునట్టి) వస్తువులను చేర్చి లేపనము చేయవలెను. గాని మలమును బంధించునట్టి వస్తువులు మాత్రము లేపనముచేయకూడదు. మరియు జున్ను, అథవా, అక్కలకర్ర, పొదినా, హాసా, బూరెజిర్మని, తులసి, దవనము, మరువము,

రసమునందు నూరి అంను అడవినీరుల్లితో చేయబడిన శిరకా, జైతూన్ నూనెచేర్చి వుపయోగించవలెను.

మరియు రోగముశాంతించి తలయందుండు నజ్జుతగ్గిపోవును. ఇట్టి సమయమునందు తలయందు వుష్ణముకలిగి దోషములుతొలగించుటకై నఖచికని (ముక్కుతుమ్ముడాకు) జున్ను, నూరిపీల్చవలెను. యిందువలన తుమ్ములు కలుగును.

### కఫహరగుళికలు.

ముసాంబరము, తెగడ, చేదుపుచ్చగుజ్జు, సకమోనియా, రూమి మస్తకి, గారిఖూన్, ఇవియావత్తు సమభాగములుచేర్చి సోపురసముతో నూరి శెనగగింజలప్రమాణముగా మాత్రలుచేసి రోగానుగుణ్యముగా అనుపానవిశేషములతో వుపయోగించవలెను.

### కఫము హరించు వస్తి (ఎనిమా)

అజామోదపువేరు, ఝూహువేరు, సోంపువేరు, పొదినాఆకు, కంతురియూన్, ముంజగడ్డి, యీవత్తువస్తువులు, కషాయముకాచి వడియబోసి అందులో దోసవిత్తులపప్పు, యెర్రశర్కర, చేదుపుచ్చగుజ్జు, సకమోనియా, లాహూరివుప్పు, బూరెఇరమని యీవస్తువులు యావత్తు కలిపి గుదద్వారమునందు పిచికారిమూలముగా యెక్కించవలెను.

మరియొకవిధమగు సర్సాం వ్యాధికలదు. దీనిని కాలూన్‌యని చెప్పుదురు. ఈవ్యాధిలక్షణములు గర్భమువాచుట, మరియు నీవ్యాధి చిక్కనిరుధిరదోషమువలన మెదడు నరముల సందులలో ప్రవేశించి యీదోషమువలన పిటికలను పుట్టించును యీవ్యాధి అనేకవిధములగు సర్సాం వ్యాధులకంటె దుస్సాధ్యమైనది. మరియు యీరోగముమూడు దినములలోపుగా రోగిని వైవశపట్టణమునకు పంపగలదు దైవవశాత్తు మూడు దినములు రోగిజీవించియున్నయెడల రోగి బ్రతుకునను ఆశ గలదు. యూనాని భాషయందు సకాలుస్ అనగా శరీరఅవయవములు నీర్సించుటయనిభావము అనగా శరీరశక్తి అన్యదా తగ్గుట అనిగ్రహిం

చవలెను మరియు ఈవ్యాధియొక్క సంపూర్ణలక్షణములు యీపుస్తక అంతమునందు వ్రాయబడును.

మరియు, సర్సాం అనగా ఒకవ్యాధిపేరు. సకాతెన్ వ్యాధి ప్రధమఅవస్థను గాన్గరయా అందురు. ఈవ్యాధి పెరిగినకొలది ఇంద్రియములస్వభావము సర్వదా నశించుచున్నది. ఇట్టిస్థితియందు దీనిని సకాకలూస్ అందురు. హకీంజాలినూస్గారు ఈరెండువ్యాధులు ఒకటియే అనిన్ని వీనిలక్షణములు చికిత్సమాత్రము వేరుగానుండు ననిన్ని ఈవ్యాధులయందు రుధిరదోషసర్సాంవ్యాధియందు చెప్పబడిన చికిత్సలు చేయవలెననిన్ని లక్షణములయందు కేవలము భేదముగాయున్నది. అనగా సకాకలూస్ అను సర్సాంయందు కష్టము మిక్కిలిఅధికముగానుండుననియు ఈవ్యాధిగలరోగి రోగము మూడుదినములలో శాంతించని యెడల మూడుదినములలోపల చికిత్స చేయకూడదనియు సకాకలూస్ ఇతర అవయవములయందు పుట్టుచున్నదనియు దీనిలక్షణములు చికిత్స వాపుగలసర్సాంనందు చెప్పబడుననియు జాలీనూస్గారు వచించిరి.

## జుంరా అను మెదడువాపు లక్షణములు

ఈసర్సాంవ్యాధియందు తలముందుభాగము నిప్పుతో కాల్చినట్లనుండుట, ఏమియూలోచకుండుట, ముఖచర్మము చల్లగానుండుట, ముఖకాంతి పచ్చగానుండుట, ముఖచర్మము చల్లనగుటకు కారణము. దోషమును ప్రకృతి దూరపరచగలందులకు యత్నించి లోభాగమునందు చేర్చుటవలన రుధిరము లోభాగమునందు చేరుటవలన ప్రకృతితో రక్తము సమ్మిళితమై ఉష్ణమును దూరపరచుచున్నది. కాబట్టి ముఖచర్మము చల్లగానుండునని భావించవలెను. మరియు, నొప్పి మెదడునందు చేరి యుండును. ఇట్టిస్థితియందు దీనిలక్షణములు జుంరా వ్యాధిన్నికములవలెనుండును. మరియు, మెదడునందు దురదపుట్టుచుండును

### జంరా అను అవస్మార చికిత్స

నరేరు అనునరము (మాథ్యాంగుళ్యమునుండి మోచేతి పైభాగ మువరకు వెళ్ళినట్టి నరము) నొసలునందు నరము, ముక్కుమధ్యభాగ మునందుండు నరము, నాలుకపై రెండునరములు. నాలుకక్రిందనుండు నరములు రెండు మొదలగునరములను ఈవ్యాధియందుభేదించి శక్తిఅ వశ్యకతానుకూలముగా ఒక్కొక్కటిగాని రెండు రెండు గానిఒకదాని వెంట నొకటిగాని లేక ఒకదానిని భేదించి రెండవది ఆపి ఇట్లు శస్త్రక ర్మవిధిపూర్వకముగా భేదించవలెను ఈశస్త్రకర్మవిషయమై రక్త పిత్త సర్సాంవ్యాధియందు ముందు చెప్పబడియే యున్నది. మరియు, తరే డా (కషాయములతో తలకాచుట) విషయమై సుగంధవస్తువులను ఉప యోగించవలెను. దీనిక్రమము పిత్తజసర్సాంనందు వ్రాయబడినది. విధిప్రకారము వినియోగించవలెను.

మరియు భోజనమునకు యవగంజి యిప్పించవలెను.

### సర్సాంవిశేషదుష్టవ్యాధి

ఈవ్యాధివిశేషముగా కాలునకు ఉత్పన్నమగుచున్నది. దీనిలక్ష ణములు మాంసములోనికి క్రుప్పుట కండ్లుదిన్నవగుట ప్రత్యేకమునందు ఆరినట్లుండుట, ముఖము పండినట్టుండుట, మొదలగు లక్షణములు కలిగియుండును.

### సర్సాం విశేషదుష్టచికిత్స.

కోడిగుడ్లుతెల్లసొన, గుల్రోగన్, యీరెండు చక్కగాకలిపి కొంతసేపుంచి అందుబట్టతడిపి వాపుపై వేయవలెను. ఝాము ఝా మునకు ఆబట్టవేడి యెక్కగనే తీసివేసి తిరిగి బట్టముంచివేయవలెను.

మరియు పెద్దసాయబాకు, పచ్చిధనియాలు, సారకాయ, మొద లగునవి పచ్చిలి వాపుపై లేపనము చేయవలెను.

మరియొక సర్సాంవ్యాధిగలదు యీవ్యాధికి ఫల్గమని అం దురు. యీవాపు రుధిరముచెడుటవలన కలుగుచున్నది. మరియు వాపు

యెక్కువగానుండుటవలన తలనందులువిడిపోవును. అందువలన సర్సాం కలుగుచున్నది. మెదడు ఝిల్లిపొర బిగిసిపోవును. దీనిలక్షణములు:కండ్లు ముఖము, యెర్రగానుండుట, మిక్కిలి నొప్పిగానుండుట తలచీల్చినట్లు లుండుట, ఈరోగమునందు మెదడువెనుకభాగముగాని ముందుభాగము గాని అణగిపోవుట కడుపులోదేవుట, మొదలగులక్షణములుకలిగియుం డును. ఈవ్యాధిచికిత్స జమురావ్యాధిచికిత్స ఒకటెయని భావించవలెను.

మరియు ప్రత్యేకముగా ఫల్గమూని, జుంరా, సకాకలూస్, వీటిలక్షణములు వాపుప్రకరణమునందు వేరువేరుగా చెప్పబడియె వున్న వి. మరియు సర్సాంహాకీకియందు మెదడునందు వాపుకలుగదు గాని వాపుచిన్నములు మాత్రము కలిగియుండును. మరియు సర్సాంవ్యాధి జ్వరములలో కలుగును. లక్షణములు కలుగుచున్నవి గాని రొమ్మువాపు నకు నదరు అందురు గాన సర్సాంవ్యాధిని ప్రక్కరోగములలో చెప్ప బడియె.

## సమరా (పిత్తరుధిరమువలన కలుగువాపు) లక్షణములు.

సమరాయనుశబ్దము సురియాని భాషలోనిది యూనాని భాష యందు ఫలగ్మోనియొక్క భేదమందురు. దీనిలక్షణములు ఈక్రింద వివరించబడియె సర్సాంనందు ఒకానొకప్పుడు తలలోభాగమునందు నొ సలునందు ముక్కు కండ్లయందు వాపుపుత్పన్నమగును. దీనిని మానరా యనికూడా చెప్పుదురు. వాపు అధికమై తలలోభాగమునందు మెదడు తలవురెప్ప వీటియొక్క పొరలయందు జేరుచున్నది. ఒకొక్కప్పుడు రొ మ్ము, భుజములక్రింది భాగములవరకు వాపుదిగుచున్నది. తలలోభాగమునందు వాపుఅల్లుకొనుచుండునపుడు రోగచిన్నములు అధికమగును. తలయందు వాపుఅధికమైనకొలది తలయందులాగుట అధికమగును. తలయందువాపు అధికమైనకొలది తలపైభాగము అచ్చు టచ్చట చిట్లనారంభించును.

దై సదరు అనుపేరుగా మారుచున్నది. ఈవ్యాధి సాధారణముగా వృద్ధులకు కనుపించుచున్నది. మిర్గి అనగా (అపస్మారము) మనిషిని శవమువలె చేయువ్యాధిపేరు. మరియు తలనొప్పి తగ్గినకొలదితలతివ్వ విశేషమగును. ఇది విరుద్ధమగు స్వభావికమని భావించవలెను. ఈవ్యాధిలక్షణములు పూర్వరూపము మొదలైనవి రెండుభాగములుగా విభజించియున్నాము.

ఇందువిషయమై హకీముజాలీనూస్‌గారు దువారా అనువ్యాధికిన్ని సద్రి యనుఈవ్యాధికి యేమిభేదము చెప్పియుండలేదు.

మరియు హకీముజాలీనూస్‌రాజీ అనువారు యీసమయమందు దువారా విశేషమైనయెడల తలతివ్వ విశేషమగును. ఇట్లు తలతిరుగుటవలన రోగి పడిపోవుచుండును. దీనిని సద్రి అని చెప్పుదురని వచించిరి.

## తలతివ్వ 1 (సద్ర) అను రోగలక్షణములు

సదర (తలతివ్వ) ఈవ్యాధిమెదడునందుగల సామాన్యకారణముల వలనగాని లేక సంపూర్ణకారణమువలనగాని మెదడుసంబంధమగు ప్రాణవాయువు లోపలినరములయందు తనసామాన్యదశతో సంచారముచేయక పోవుటవలన మెదడుచల్లగనుమందముగానుండును. మరియు మెదడునందుయుండునట్టి ప్రాణవాయువు తనస్వభావిక సంచారము చేయుచుండును. అట్టిస్థితియందు కండ్లు చీకట్లుగ్రమ్మియుండును ఈవ్యాధి రెండుకారణములవలన కలుగుచున్నది.

(1) చల్లని చిక్కని శీతదోషము విశేషముగా నుండుటవలన మెదడునందు సంచారముచేయునట్టి ప్రాణవాయువుమార్గములయందు ఆటంకము కలుగుట యిట్టిసమయమునందు వృష్ణము విశేషమై యనగా తొండవేడి నిప్పువేడిమిక్కిలివిశేషముగా తలకు తగులుట కావడముచే

యూట తలభాగములందు వేడి ఆవిరికోనిండియుండును ఈకారణమువలన తలయొక్క యావత్తుభాగములయందు నొప్పినిలిచియుండును. ఇట్లు కలుగునట్టివ్యాధులకు సదరెఖదరీయుందురు. ఖదరి అనగా తిమ్మిరి యని అర్థము.

మరియు, మెదడునందు శీతదోషము ఖనీభవించుటవలన కలుగునట్టి వ్యాధిలక్షణములు అనగా తలపై భాగమునందు అన్నివ్యాధుల యందులక్షణములు వ్రాయబడియున్నవి మరియు, ఈవ్యాధి స్వల్ప దోషకారణమువలన గాని కఠినదోషకారణమువలనగాని అంతర్భాగ మునందు దోషముచేయజాలదు. మరియు, కఠినదోషకారణమువలన భారము అధికమగును. స్వల్పదోషము వలన భారముతక్కువగానుండును.

## 1 తలపిప్ప (సద్రి) వ్యాధి చికిత్స

ఈవ్యాధిప్రథమదశయందు ఆగి ఆగి హుకునా (వస్తికర్మ) చేయువలెను. మరియు, తీక్ష్ణవిరోచనము చేయించవలెను. కఫమును హరించునట్టి ఔషధములను ఇవ్వవలెను. ఇట్లు సంపూర్ణశరీరమునుండి మలము వెడలించవలెను. ఈరోగమునకు ఆలశ్యముగా చికిత్సచేయ వలెను. యెందుకనగా రోగిబలహీనుడై మూర్ఛనొందును. కాబట్టి విరోచనము వస్తికర్మ (ఎనిమా) మొదలగు చికిత్సలు నెమ్మదిగాచేయ వలెననిభావము. మరియు, సామాన్యవిధానమువలన సంపూర్ణముగా దేహము శుద్ధినొనరించి శిరోవిరోచనము (మెదడునందుగల దోషముల నుహరించి మెదడు పరిశుభ్రత నొందించుట) నకు ఇవ్వవలెను.

(1) యారజాత్ (విరోచనఔషధములు) గందూషములు, తుమ్ముకలిగించునట్టి ఔషధములను వాసనచూపించవలెను. అనగా నశ్యముచేయువలెను. తరేడా (కాపడము) మొదలగునవి కఫజ సర్సాం వ్యాధియందు చెప్పబడిన చికిత్సలను చేయువలెను.

2. సుద్డా (సదర్) అను వ్యాధిలక్షణములు

ఈవ్యాధి తలకు దెబ్బ తగులుటవలనగాని, ... అదరుటవలనగాని స్వల్పదోషము వలన పుట్టుచున్నది అనగా మెదడునందుగల ప్రాణవాయువు సంచారమునకు స్వల్పఆటంకము కలుగుటవలన ఉత్పన్నమగుచున్నది. ఈవ్యాధి రెండువిధములు (1) మెదడుసంబంధమగు పొరలయందు కష్టముకలిగించును. ఈకారణమున మెదడు అణచబడి ఆరిపోవును. ఇట్టిస్థితియందు మెదడు ... స్వేచ్ఛగా నుండజాలదు. కాబట్టి రోగి నిద్రాసక్తుడై యుండును. రోగదశ యున్నంతవరకు రోగి తిరుగుటకు నడచుటకు శక్తిహీనుడై జ్ఞానశూన్యుడై యుండును. నొప్పిగల స్థలమునందు తిమ్మిరిగానుండి పలతిప్ప తలయందుపోటు కలిగియుండును. తిమ్మిరియుండు కారణమువలన సద్రా అను వ్యాధి రెండు విధములు.

(1) మెదడు కష్టపడినట్టి అనుచు స్థితి. (2) ప్రకృతి శరీరకష్టమును దూరపరచుటకై యత్నించుచుండును. ఇట్టిసమయమందు దోషము శరీరమునందుచేరి శరీరమును పీడించుటచే ఆరూఢమగును. ఇట్టిస్థితియందు ఒకప్పుడు వాపువుండును. ఒకవేళ వాపు కలుగకుండును. ఈ వ్యాధిసారాంశమేమనగా మెదడుసంబంధమగు ప్రాణవాయువు మెదడునుండి రాక పోకలుగల మార్గములయందు ఆటంకము కలుగుటయే ముఖ్యకారణము. ఈకారణమువలననే సద్రా అను వ్యాధిపుట్టుచున్నది. ఇట్లుకలుగు వ్యాధికి సదరె మూలం (నొప్పిపుట్టించునట్టిదని) అని భావము. ప్రత్యేకశిరోరోగలక్షణములు అనేకపర్యాయములు చెప్పబడియున్నవి. అయినను తిరిగి ఇచ్చట వర్ణించబడుచున్నది.

2వ సద్రావ్యాధి చికిత్స

ఈవ్యాధియందు శిరావేధనము, జలగలనుపట్టించుట కత్తినాట్లు వేసి రక్తముతీయుట మొదలగు నుపాయముల వలన రక్తమోక్షణమును చేయించవలెను. మరియు, అవశ్యకతానుకూలముగా విరోచనము

చేయించుట సమస్త ప్రయోగములకంటె మెదడునుండి దోషమును వేరుపరచుట ముఖ్యావశ్యకము అనగా మెదడునందుగల మలదోషము వెడలించుటవలన ప్రాణవాయువు యొక్క రాకపోకల మార్గఆటంకము వదలి మెదడు పరిశుభ్రతనొందును మరియు, తలయొక్క అవయవము లకు ఆటంకమువదలి మెదడు పరిశుభ్రమౌను. తలయొక్క అవయ వములకు ఆశ్మకు శక్తికలిగించుటకున్న మలదోషమును కరిగించుట కున్న గుల్‌రోగన్ గోరువెచ్చగాకాచి శిరోరోగములయందు చెప్పిన ప్రకారము మర్దించవలెను. మరియు, మైనము, గుల్‌రోగన్ కలిపికాచి నొప్పిగల స్తలమునందు మర్దించవలెను.

మరియు, మొండ, దుమ్ము, తలకు తగలకుండునటుల రోగిని జాగ్రత్తతో నుంచవలెను. యెందుకనిన తుమ్ముటవలన మెదడు కదలు ను. మెదడుకదలుటవలన రోగిమూర్చపోవును గాన దుమ్మునుండి రోగి ని కాపాడవలెను.

మరియు, ఉష్ణము, శీతమువలన కలిగిన తలనొప్పియందు కండ్లు చీకట్లుక్రమ్మొట, మెదడు పొరలయందు వావుకలిగి ఈ వ్యాధి కలుగు చున్నది గాని దీనిని సదరు అనుటకు వీలులేదు. దీనిని దుర్బలమెదడం దురు. దీని చికిత్స దుర్బల శిరోరోగమునందు చెప్పియుంటిని కాబట్టి ఆచికిత్సనే ఇందుపయోగించవలెను.

మరియు, సదరు అనువ్యాధి అపస్మారరోగమునకు సదృశముగా నుండును. ఈవ్యాధియందు మెదడు సంబంధమగు కార్యములు నిలిచి పోవును. ఇట్టిదశయందు సదరు అపస్మారమునకు బేధముండును. అనగా సదరు అను వ్యాధియందు కండ్లుచీకట్లు క్రమ్మచుండును. మరియు, అపస్మారరోగివలెన రోగిపిచ్చివానివలెనుండును. కాళ్ళు చేతులు కదలిం చుటకు శక్తిలేకుండును.

## 2 వ, తలతిరుగువ్యాధి లక్షణములు

ఈ వ్యాధియొక్క సంపూర్ణకారణములను చెప్పుచున్నాను.

మెదడుయొక్క మూలనరములయందున్ను, మెదడునరములయందున్ను, హృదయసంబంధమగు నరములయందున్ను, ప్రాణవాయువు సంచారము చేయుచున్నది. ఇట్టి స్థితియందు స్వల్పకారణమువలన నరములుచలించుటవలన ఈప్రాణవాయువు కదలిపోవును. కాబట్టి తలతిప్పకలుగు చున్నది. ఇట్టిసమయమునందు ప్రాణములతోకూడినట్టి ప్రాణవాయువు కూడా మెదడునందు మూలలయందుచేరి కదలుటవలన ఈవ్యాధి తటస్థించుచున్నది. అనగా ప్రపంచము యావత్తు తనతోకూడా తిరుగుచున్నటుల తోచుచుండును. మరియు, తలతిరుగుటకు స్వల్పకారణములు అనేకములు గలవు.

1. శీత, వుష్ణ, లఘు, గురు, దోషములు మెదడుపొరలయందు జేరుటవలనగాని, నరములయందుచేరుటవలనగాని, అచ్చటనిలిచియుండు కారణమువలన వుక్తదోషవికృతి కారణము వలనగాని తలతిరుగుచుండును. అట్టిసమయమునందు మెదడునందుగల వాయువు (గాలీ) కూడా వికృతికూడా వేరుదోషమువలన తిరుగుచుండును. వాయువుయొక్క పరస్పర విరుద్ధగమనశక్తి కొంతకాలమువరకు విరుద్ధభావము పొందుచున్నది, కాబట్టి వాయువు విశేషగమనముచేయుచుండును. మరియు తన విపరీతకారణమువలన వుష్ణతముగా పెరుగుచున్నది. యీవిధముగా ప్రాణవాయువు తిరుగుచుండును. ఇట్లు తిరుగు వాయువునందు రూహెబౌసరా (చూచునట్టివాయువు) కూడా యిందులోచేరి యుండును. కాబట్టి తానుచూచునట్టి సర్వప్రపంచము తిరుగునటుల కనుపించుచున్న దని చూపించుచున్నది.

2. ఒకానొకకారణమువలన దోషము ఆయాస్థానములయందు పోయినయెడల ఆదోషముయొక్క ఆవిరిసంబంధమగు పరమాణువులు పైకెక్కుటవలన మరియు ఆవిరి పరమాణువులు తలయందుగల మెదడునందుచేరియుండుటవలన తలతిరుగుటకు కారణమగుచున్నది. అనగా వై

నుకవాతజ దుహరారూయందు చెప్పబడియున్నది, అటులనే దోష ఆవిరి వలన తలతిరుగు చుండును.

3. వాతదోషము ఘనీభవించి మెదడుసంబంధమగు పొరలయందుగాని నరములయందుగాని చేరి స్తంభించి వానియొక్క శక్తియనగా నరములకు పొరలకు చలనముకలుగు సమయమునందు మెదడునందుండునట్టి వాయువు చలనము అనగా ఈరెంటి సంయోగమువలన పరస్పరభేదము కలిగి తలయందు పీకు, తలతిప్పు, లెటస్తించును. అనగా మెదడునందు సంచారముచేయునట్టి వాయువు వాతదోషమువలన చెడిపోవునని భావము. మరియు వాతసంబంధమగు దోషమువలన మెదడునందు నివశించియుండు వాయువునకు లఘుత్వము సంభవించి విరుద్ధస్వభావికము నొంది తలతిప్పుపుట్టించుచున్నది.

అనగా ప్రాణవాయువుపై నాక్రమించుకొని ప్రాణవాయువుకంటె వాతబలము అధికమై పరితాపమునొందుచున్నదని భావము.

4. అచ్చటకల గురుదోషమువలన మెదడునందుండు నట్టివాయువు, మురలిధీర్ అనగా మెదడుసమీపమునందున్నట్టి సంచారవాతపూరితమగు నరములద్వారా సంచారము చేయునట్టివాయువు, మెదడునందు చేరి మెదడుతో సంగమము కలిగియుండుట వలన మెదడునందుండునట్టి వాయువు, తనసరిమార్గమునందు సంచారము చేయజాలకుండును మరియు ఈవాయువు మెదడునందుచేరి వెనుకకుమరలి తిరుగనారంభించును. ఈకారణమువలన తలతిప్పు ఉత్పన్నమగుచున్న మరియుతలతిరుగునట్టి శక్తి కలిగించుటకు దోషఆవిరిపరమాణువులు హెచ్చుట వలనకూడా ఈవ్యాధిపుట్టుచుండును. ఇట్టిసమయమునందు మెదడునందు త్రిప్పుకలిగించునట్టి కేవలము మెదడుసంబంధమగు వాయువునందు వాతదోషమువ్రవేశించి దృష్టియొక్కపదార్థమునందు చేయుటవలనసర్వవస్తువులుకూడ తిరుగునటుల తోచుచున్నది. కండ్లుచీకట్లుక్రమ్ముచున్నవి.

(ఉదాహరణము) ఈరోగియందు పర్వతములుగాని గోడలుగాని

అవునట్టి ఏవస్తువు అయినను సమీపించిన యెడల తిరుగునట్టిశక్తి ఉత్పన్నమగును.

ఒకప్పుడు ఈ మొదలగు దోష కారణములవలన ఆకారి పరమాణువులులేని తలతిప్పువ్యాధి పుట్టించును. మరియు, ఈసమయమునందు ఏవస్తువైనను మెదడునందు తిరుగనారంభించినను లేక మెదడునందు కేవలము జీవము వాతముతో సంబంధముకలిగించో ప్రాణము తిరుగుటకు కారణము. దృష్టిసంబంధమగు ప్రత్యక్షపదార్థములలోనుండునవి మారిపోయిన యెడల అవశ్యకముగా సమస్తవస్తువులు తిరిగినట్లు తోచుచుండును.

5. అచ్చటిదోషము మెదడునందేగాక శరీరసంబంధమగు ఇతర అంగములయందు ఉత్పన్నమై నిలిచియుండును. అనగా ఆమాశయము, గర్భాశయము, పిత్తాశయము, మూత్రాశయము మొదలగు అంగములయందు వాతదోషమువలనకలుగు ఆవిరియొక్క కారణమువలన మరియు, వాతదోషము మొదలగునవి మెదడునందుజేరి తలతిప్పుకలిగించును ఈకారణముల. తలతిప్పుకలిగించునట్టి మలము మెదడునందు చేరి యుండును. లేక ఇతర అంగములయందుండును. కాబట్టి తలత్రిప్పు వ్యాధి కలిగించునట్టి దోషములను రెండువిధములుగా విభజించి ఈక్రిందవర్ణించుచున్నాను.

1. బేధము. తలతిరుగునట్టుల చేయు మలము ముఖ్యముగా మెదడునందుండును ఈమలము ఆరువిధములు. (1) కష్టసంబంధమగు మలలక్షణము. అనగా తలకువేడి సోకటవలన తలత్రిప్పు శాంతినొందును. విశేషలక్షణములు కఫజ శిరోరోగమునందు చూపించబడియున్నవి.

2. త్రిదోష జనితదోషకారణమువలన కలుగుచుండును దీనిలక్షణములు మిక్కిలి ఆలోచనకలిగి రోగిచైతన్యుడైయుండును. నాడి కఠినత్వముకలిగి దుర్బలముగానుండును. దీనిలక్షణములు వాతజ శిరోవే

దనయందు చెప్పబడియున్నవి. మరియు మిక్కిలి ఆలోచనవలన రోగి విశేషకాలము చైతన్యరహితుడై యుండుట అతిసముచ్చయమునందు త్రిదోషజని తదోషము పిత్తమునందు జేరియుండును. మరియు నాడి దుర్బలమునొందుటకు రెండుకారణములుగలవు. మొదటికారణము శక్తిదుర్బలమునొందుట రెండవకారణము హృదయసంబంధములు కఠినత్వమునొందుట రెండవది యగు హృదయసంబంధమగు నరములు కఠినత్వమువలన నాడికూడా దుర్బలముకఠినత్వము జెందియుండును.

3. హృదయముయందు రక్తదోషమైనచో కఫ, వాత, తలతిరుగువ్యాధి లక్షణములకంటె వెంట వెంట వ్యాధికనుపించుట తిరిగిశమించుచుండుటకట స్తమగును. మరియు తక్కినలక్షణములు రక్తజదోష శిరోరోగలక్షణములు కలిగియుండును.

4. పైత్యకారణమువలన తలతిరుగునట్టివ్యాధి ఉత్పన్నమైన చోదీనిలక్షణములు శీతోపచారములవలన శమించుట తలతిప్పవెంటనె ఆగిపోవుట పిత్తజతలనొప్పియందు చెప్పిన లక్షణములు కలిగియుండుట మొదలగునవి కలిగియుండును.

5 జలుబు, వాతమలమువలన తలత్రిప్పు కలుగుచున్నది, దీని కారణము మెదడునందుగల చలువవలన కలుగుచున్నది. ఈవ్యాధి యందు తలకేవలము బరువుగానుండ నేరదు.

6. స్వల్పచాత ఉష్ణప్రకృతివలన తలత్రిప్పకలిగినయెడల దీనిలక్షణములు ఉష్ణశిరో రోగమునందు జెప్పబడిన లక్షణములు కలిగియుండును. మరియు తుమ్ములు విశేషముగా వచ్చుట ముక్కుఆరుట, తలతిరుగు సమయమునందు తలయందు స్వల్పముగా చెమటపట్టుట, మూర్ఛరోగివలె భూమిపైపడిపోవుట, యీలక్షణములు కలిగియుండును. మరియు, ఈలక్షణములు, ఉష్ణమువలన కలుగుననియు, ఈరోగము దీర్ఘకాలము యుండనేరదనియు ఈ తల త్రిప్పు యావత్తు తలతిరుగునట్టి వ్యాధులకంటె వ్యాధికనుపించినతోడనే శాంతిం

చును గాని యీతలత్రిప్పగా రోగి ఘోరముగా పృథివిపైపడియుండు వని గ్రహించవలెను.

తలత్రిప్పరోగ చికిత్స.

కఫవాత మరియు వాతముయొక్క తలత్రిప్పనందు శీతప్రకృతి కలిగియున్న యెడల మలము పచనమగునట్టి క్రియవలన మలానుకూలముగా పక్వపరచి మెదడు, శరీరమును శోధించునటుల వస్తికర్మ గండూషము (కషాయములతో పుక్కిలించుట) లు మొదలగు ప్రక్రియలను వాటివిధిపూర్వకముగా చేయవలెను. ఈక్రియలను కఫ వాత తలనొప్పులయందు చెప్పబడియున్నవి.

మరియువాతము హరించుటకై కస్తూరి గాలియా (ఇదివకసుగంధద్రవ్యము) తులసి, చెంబేలి మొదలగువస్తువులు వాసనచూడవలెను. మరియునకచికని,జున్ను, నూరి నశ్యముచేసి రోగినితుమ్మునటులచేయువలెను. మరియు తెల్లమిరియాలు, మసాంబరం కుంకుమపువ్వు, జున్ను, ఈవస్తువులు దవనము, మరువము, రసముతోనూరి బనప్షానూనెతో కలిపి నశ్యముచేయవలెను.

అథవా అక్కలకర్ర, ఆనాలు, లవంగములు. అడవినీరుల్లి శిరకాతోనూరి తలకుపేపనము చేయువలెను.

మరియు బాబూనా, ఐరంజాసప్, గార్ఆకులు, అకలీలుల్ మలిక్, సోయి, ఈవస్తువులం కషాయముకాచి యీకషాయముతో రోగికి ఆవిరిపట్టించవలెను. అనగా తలకు ఆవిరిపెట్టవలెను.

మరియు రక్తదోషములయందు రక్తమోక్షణము చేయించవలెను. అనగా పిక్కలయందుండు నరములను ఛేదించుట,జలగలను పట్టించుట మొదలగునుపాయములవలన రక్తమును వెడలించవలెను.

మరియు అతితృష్ణముశాంతించుటకై ఇసప్గోలుగింజలు నానవేసి బనప్షాషర్బతు, ఉన్నాబ్షర్బతు, అందుచేర్చి పానముచేయవలెను. యీరోగికి యవనూక, మరియు తప్తీల్ (వకవిధముగుభోజనపదా

ర్ధము) మజావిరాతిరన్ [అమ్లాసము] మరియు రక్తజశిరోరోగమునందుచెప్పిన పత్యములుకూడా యీరోగికి హితవుగానుండును.

పిత్తదశయందు కరక్కాయలు, శాదరాసి, యీరెండువస్తువులు కషాయము గాచి ఆకషాయమునందు రేలగుజ్జు, మాదీఫలము, శీరెఖిస్త్ కలిపి కోష్ఠము మృదుత్వమునొందుటకై వుపయోగించవలెను. మరియు పిత్తజశిరోరోగమునందు చెప్పబడిన చికిత్సలను చేయవలెను.

ఉష్ణా, వాతము.లయందు ఉష్ణాధిక్యతవలనకలిగిన తలనొప్పియందు చెప్పినవిధముగా ఉష్ణవాతములను తొలగించునట్టి చికిత్స చేయవలెను.

మఱియు, రక్తదోషము, అనగాదోషము, రక్తము, మిశ్రిమమైయున్నచో సలేరు, అనగా (మోచేతినుండి వెళ్ళునట్టి నరమును) ఛేదించి రక్తమోక్షణము చేయించవలెను.

మరియు, ఉష్ణమును శాంతినొందించుటకై అనగాదోషము మలకోశమునందుజేరి, పిత్తజలక్షణములు కలిగించును. అట్టిదశయందు ఉత్తమకషాయాదులవలన శరీరమును మృదుత్వము నొందించవలెను. మరియు ఉష్ణజ, శిరోరోగమునందు చెప్పినసుగంధ ద్రవ్యములను అగ్రాణించవలెను. తలకు కాపడముచేయుట సేపనలు మొదలగునవి చేయుట వుత్తమము.

2 ఇతరఅవయవముల దోషమువలన కలుగుతలతిప్పులక్షణములు

దోషము అమాశయమునందు, మూత్రాశయము, మెడ, పాదములు, తొడలు, పిక్కలు, పొట్టపైపొరలు, జీవనరములు, వాయునాశములయందున్నచో, వీటిలక్షణములు వేరువేరుగా చెప్పబడును.

మెడఇరుపార్శ్వములయందు అనగా కర్ణముల క్రిందిభాగమునందుండు నరములయందు దోషముజేరి ఆదోష ఆవిరికారణము హృదయము యకృత్ నుండి వెడలుచున్నది. అఆవిరి పరమాణువులయొక్క మార్గము హృదయము యకృత్ నుండి చెవుల వెనుకభాగమందుండు

నరములు ఈనరములు మెడయొక్క పార్శ్వములయందున్నవి. కాబట్టి పరమాణువులు ఆనరములద్వారా వెక్కి మెదడునందు చేరుచున్నవి. ఈపరమాణువులు నాలుగువిధములు

### 1 ఆమాశయమునందు గలదోషము లక్షణములు

ఆమాశయమునందు దుష్టమలములుచేరుటకు నాలుగుకారణములుగలవు. మొదటికారణము ఆమాశయమునందు శీతదోషము ఖనీభవించుటవలన దోషములు చేరుచున్నది. దీనిలక్షణములు తలతిరుగుటయు పూర్వము తలముందుభాగమునందు నొప్పిఆరంభమై మధ్యభాగము అనగా మాడువరకు ప్రవేశించుట మరియు మలదోషము అధికమైనచో తలనొప్పి వెనుకభాగమువరకు ఆక్రమించుట దీనివిశేషలక్షణములు ఆమాశయసర్వదోష ప్రకృతియందు వర్ణించబడును. మరియు వెనుకకూడా చెప్పియున్నాము.

### ఆమాశయదోషహర చికిత్స

కాబోలు కరక్కాయలు, చిన్నసోపు, సోపువేరు, అజామోదం తెగడ, నర్కచూరు, (పొడగుకచూరము,) సునాముఖిఆకు, గాఫిస్, ఈవస్తువులను ఒకటిగాచేర్చి దంచి కషాయముకాచి వడియబోసి ఇందులోకసూంగింజలరసము ఎర్రశర్కర, ఆముదము, మునక్కబరము, ఈమొదలగు వస్తువులను యీకషాయమునందు చేర్చి వస్తి (ఎనిమా) చేయవలెను. మరియు అవశ్యానుకూలముగా వమన విరోచనాది ఔషధములనుగాని లేహ్యమాయములనుగాని, యూరజ్ గాని, ఉపయోగించుటకు ప్రయత్నముచేయవలెను. మరియు విరోచనానంతరము ఆమాశయమునకు, పుష్టి, పాచనశక్తి, కలిగించుటకై ఇత్రీఫలల్ మొదలగు ఉష్ణజవారిష్ పుపయోగించవలెను.

### ఆమాశయ శీతవాతలక్షణములు

2. ఆమాశయమునందు శీత, వాతము, శీతదోషము వలనకలుగుచున్నవి. దీనిలక్షణములు శీతవాతలక్షణములతో సమానముగానుండును. ఖల్త్ (దోషసమూహమునకుపేరు) మరియు కడుపులో

దేవుట, వాంతివచ్చినట్లుండుట మొదలగులక్షణములు కలిగియుండును గాని వమనమునందు ఏవిధమైన దోషము వెడలకుండును ఆమాశయము నందుమాత్రము నిలిచియుండుటవలన వమనము ద్వారా వెడలకుండును. మరియు నొప్పి, పీకు, అధికముగా యుండును.

**ఆమాశయశీతవాతచికిత్స**

శీతదోషములందు చేయు చికిత్స చేయుటఉత్తమము. మరియు ఈదోషముతో వాతము చేరినయెడల వాతము సహరించునట్టి వస్తువులను సేవించుట మంచిది. మరియు వాతమును తొలగించుటకై మధిర(సారా) యందుజీలకర్ర, శాదరాసి యను చేర్చికాచి ఇవ్వవలెను.

**ఆమాశయమునందు ఉష్ణరక్తదోష లక్షణములు**

3. ఉష్ణదోషము పిత్తముతో చేరి ఖపీభవించినచో దీని లక్షణములు నిరన్నగర్భమునందు తలతిరుగుట భుజించిన వెనుక తలత్రిప్పుశాంతించుట ఇవిగాక యావత్తు లక్షణములు వెనుకపిత్తజ ఆమాశయదోష జనిత శిరోరోగమునందు చెప్పబడియున్నవి. గానచదువరులు గ్రహించగలరు.

**ఆమాశయఉష్ణ పిత్తదోష చికిత్స**

శికింజబీన్ వేడినీళ్ళయందు చేర్చి, పానము చేయవలెను. దీనివలన వమనమగును. మరియు కరక్కాయకషాయమునందు పాలువిరిచిన నీళ్లు ఆలుబకరా, పుల్లనిదానిమ్మ, కాయబరసము, తియ్యదానిమ్మ రెండు సహసూరి ఈవస్తువులు ఒకటిగాచేర్చి ఉపయోగించవలెను. దీనివలన కోష్ఠము మృదుత్వమునొందును,

**కరక్కాయకషాయవిధానము**

దేశవాళికరక్కాయలు, పచ్చనిఆలుబకరా, నపిస్తాన్ చింతపండు కాసినివిత్తులు ఈవస్తువులను కషాయముగాచి వడియబోసి అందులో మాదీఫలరసాయనముజేర్చి కలిపియివ్వవలెను. మరియు ఈకషాయము

నకుబలము కలిగించుటకై నల్ మోనియాచేర్చి యిచ్చుటవలన మిక్కిలిబలము కలిగియుండును.

## మావుల్ జుబ్న చేయుక్రమము

పాలువిరిచి నీళ్ళుతీయుటకు మావుల్ జుబ్న అందరు. హకీమురాజీగారు యీక్రిందివిధిని బోధించిరి. ఎర్రనిరంగుకలిగ నిరోగియై యౌవనముగలదై 40 దినములక్రిందట ఈనినట్టి మేకను దెచ్చి దానికొన్నిదినములవరకు దోసకాయలు, పచ్చిధనియాలు, కాహుకను, ఇస్పగోలు ఆకులు, మాత్రము మేపుచు ఆయాకాలము ఆమేకపాలుపిండుకొని కళాయిచేసిన రాగిపాత్రయందుగాని మట్టిపాత్రయందుగాని పోసి పొయ్యిమీదనుంచి కాచిదించుకొని మరియొక శేరు పచ్చిపాలు ఆకాగినపాలలోకలిపి రెండుచటాకుల మూడుతులముల నాల్గుమాషములు మిక్కిలి పుల్లని శికింజబీన్ బెల్లపునీరుచేర్చి పైచర్మముతీసినఅంజూరకర్రచివర నలియగొట్టి కొంచెము కొంచెముపోసి ఆకర్రలో యీమొదలగు వస్తువులనుచేర్చి పాలుతోడుకోకుండా కలియబెట్టి ముతకబట్టయందుకట్టి తెల్లవారువరకు ఆమూటను వ్రేలాడగట్టి దానిక్రింద పాత్రనుంచి ఆపాత్రయందు స్రవించిన నీళ్ళను తీసికొని పొయ్యిమీదనుంచి పొంగువచ్చువరకుకాచి దించుకొని ఉపయోగించుకొనవలెను. యీనీళ్లనుపుయోగించుతరి శికింజబీన్ కలిపి ఉపయోగించుట మంచిది,

## 2. పాలువిరిచి నీళ్లుచేయు క్రమము

అమీర్ దౌలాతల్ మిరాజ్‌గారి విధిప్రకారము మావుల్ జుబ్న తయారుచేయు విధానము చెప్పుచున్నాను.

ప్రతిదినము 2 న్నర శేరు పైనచెప్పబడిన అంశములుగల మేకపాలుదెచ్చి కాచి అందులో 3 న్నర మాషముల చుస్తా కలిపియుంచినయెడల దీనివలన పాలు పేరుకొనును. ఆ పేరుకొనినపాలు కత్తితోకోసి అనగా అడ్డముగా నిలువుగా కోసి ఆపైని 7 మాషములు చేదువుచ్చకాయవరుగు నూరి చల్లవలెను. తదుపరి ఆపాలను బట్టలో మూటగట్టి

పై విధముగా వ్రేలాడకట్టవలెను. అడుగుభాగమునందు స్రవించు తేట నీరు సన్ననిబట్టతో వడియబోసి అందుండి ముప్పాతికభాగము తీసికొని 31 న్నర మాషములు శికింజబీన్ కలిపి పొయ్యిమీఁదనునిచి సన్ననిమంటతో పొంగువచ్చువరకు కాచి తరువాత దించుకొని వడియగట్టి వుపయోగించవలెను.

ఈనీళ్ళను ఘంట కొకపరియాయము యిప్పించవలెను. మరియు 1 న్నర గంట కొకసారియిచ్చుట మంచిదని కొందరిమతము. ఈజలపానము చేసినతరువాత 100 అడుగులు నడచుట మంచిది. మరియు అంజీరుకర్రతో కలుపుటవలన ఉపయోగములేదని కొందరిమతము. మరియు మేకపాలు దొరకనియెడల ఆవుపాలతోకూడా మాపుల్ జుబ్న తయారు చేసికొనవచ్చునని కొందరు అభిప్రాయమిచ్చుచున్నారు. అయినను మేకపాలు మిక్కిలి ప్రశస్తము. ఎట్లనగా మేకపాలయందు వెన్నభాగము తక్కువగానుండును. మరియు, యావత్తు పాలకంటె మేకపాలు పలచగానుండును. ఈకారణమునుబట్టి మేకపాలు మిక్కిలి ప్రశస్తమని చెప్పియున్నారు. మరియు, అంజూరకర్రతో కలియబెట్టుటవలన శరీరము మృదుత్వమొందుచున్నది.

### నాలుగవ ఆమాశయదోషలక్షణము.

ఆమాశయమునందుండువాతము ఉష్ణదోషము పొందిన యెడల దీని లక్షణములు ఉష్ణప్రకృతియందు చెప్పినలక్షణములు కలిగియుండును. మరియు, ఆమాశయమునందు పొడిచినట్లుండుట తొంట్లునొప్పిగానుండుట ఆమాశయమునుండి గాలివెడలుటవలన అనగా త్రేణువులు వచ్చుటవలనగాని లేక అపానవాయువు వెడలుటవలగాని తేలికగానుండును.

### నాలుగవ ఆమాశయదోషచికిత్స.

కరక్కాయకషాయమును పానముచేయించి ఆమాశయమును

శుశ్రూషలచవలెను. అనగా పైనవర్ణించిన కషాయము నిప్పించవలెనని భావము. మరియు, నకెమోలియా, ఆకషాయమునందుచేర్పుటయుంచిది.

—2 వ. ఇతరఅంగముల దోషములనుగురించి చెప్పుచున్నాము—

1. ఆమాశయదోషరోగములయందు కలుగు లక్షణముల తరువాత ముందు కణతలక్రింది భాగమునందు చెవుల వెనుకవైపునుండు పుట్టి నరములయందు దోషము చేరుటవలన నీవ్యాధి ఉత్పన్నమగునని చెప్పియుంటిమి. ఆనరములకు సుబాతియా (ఎదురకలిగించునట్టివి) అని అర్థము. ఈనరములద్వారా పరమాణువులు పైకెక్కి ఖనీభవించి తల త్రిప్పును కలిగించును. దీనిలక్షణములు ఈనరములు అదురుట,లాగుట, ఉబ్బుట, బరువుగానుండుట మొదలగు లక్షణములు కలుగుచున్నవి. ఇట్టి స్థితియందు విబంద ఔషధములు లేపనముచేయుట చేతితో అనచుటవలన తలనొప్పి శమించుచున్నది.

మరియు. మలదోషము హృదయము, యకృత్, ప్లీహామునందు పుట్టి పైకెక్కుచుండిన పైనవివరించిన లక్షణములు గాక ఇతర అంగములయందు కూడా కష్టముకలిగియుండును. గాని ప్రత్యేక అంగముల కష్టములు ఆయా అంగముల స్థానములయందు చెప్పబడును.

—రెండవ తలత్రిప్పచికిత్స—

ఈవ్యాధి యేదోషమువలన కలిగినదని పరియాలోచించి ఆయా దోషములకు తగినటుల వుపాయములచేత ఆయాదోషములయొక్క ఆవిరి తొలగించునట్టి చికిత్సలను చేయవలెను.

—యకృత్ దోషసంబంధమగు తలత్రిప్పు లక్షణములు—

యకృత్ (లివరు) యందు దోషములముచేత నిలిచిన యెడల దానికార్యములయందు హానికలుగును. దానిహానివలన ఇతర అవయవములకు కష్టము సంభవించును. మరియు, మలదోషము చెరుటవలన మూత్రముద్వారా వెడలించునట్టి చికిత్సలను చేయవలెను. అటుపిమ్మట శేషపుషగబతు శాంతినొందించునట్టి ఔషధములను ఇవ్వవలెను.

తిల్లి(ప్లీహా)యందుండు మలదోషమువలన కలుగుతివ్వ.

ప్లీహామందు దోషమువృద్ధివించి ఆదోషమువలన కలుగు తివ్వ సంభవించుతరి యెడమచేతినరమును ఛేదించవలెను. అనగా నడిమి వ్రేలునుండి ముంచెయ్యివరకు వెళ్ళునట్టి నరము మరియు మలదోషము ను నష్టపరచునట్టి ఔషధమును ప్లీహాపై లేపనముచేయవలెను మరియు ప్రత్యేకముగా రోగఅంగమునకు చికిత్సచేయవలెను. మరియు విరోచన ము చేయించునట్టి ఔషధమునిచ్చి దోషమునుతొలగించవలెను. దీని వలన తలయొక్క నరములయందుండునట్టి దోషముగాని లేక అంగము లవలన కలుగు దోషమువలనగాని కలుగునట్టి తలత్రివ్వ శమించును.

మరియు యేనరమునందు దోషముచేరియున్నదో ఆనరము వృ బ్బి మిక్కిలి యదురుచుండును. అట్టిస్థితియందు దోషమున్నట్లు గ్ర హించి ఆస్థానమునందు చికిత్సచేయవలెను దోషము వెళ్ళునట్టినరములు కణతలయందుండి చెవులవెనుకవైపు వెళ్ళునట్టి నరములయందు దోషము కూడినయెడల నరములుబ్బియుండును. ఇట్టి స్థితియందు శిరావేదనచేయ వలెను శిరావేదన చేయుటకుముందు అగ్నిప్రయోగము అనగా పళా కు నివ్వులయందుకాల్చి వాపుగలనరములపై వాతవేయవలెను. మరి యు వెనుక తలనొప్పి ప్రకరణమునందు చెవులవెనుకనుండు నరములు ఛేదించుటవలన సంతానము కలుగనేరదని చెప్పియుంటిని కాబట్టి నిదుర ను కలిగించునట్టి నరములయందు మలదోషమున్నయెడల ఆనరమును ఛేదించకూడదు. వాతవేయకూడదు. చేతితోఅణచకూడదు. ఆనరము తెగుటవలన రోగి మరణము నొందనేరదుగాని నిదురకలిగించునరములు రెండుగలవు. ఆనరములకు బిరాద్, బరాజైన హృదయముయొక్క నర సమూహము వకటియెడమవైపు రెండవది కుడివైపుగను పైకివెళ్ళినవి) నిదురను పుట్టించునవి గనుక నుబాతియా అనుపేరు. కలిగినది. యీ నరములద్వారా చమురువంటినీరు మెదడునందు చేరుచుండును. అట్టి స మయమునందు నిదురవిశేషముగా వచ్చుచుండును.

{ జీవనరములు, నరములు, గర్భాశయము, మూత్రాశయము, మూత్రపిండముల దోషములు. }

పైన రెండుజీవనరములయందు దోషముచేరి యున్నయెడల తల తిరుగునట్టిరోగమునకు కారణమగుచున్నది. దీనిలక్షణములు మెడనరములు దుండుగా వుబ్బియుండుట, మరియు మెడబిగిసికొని యుండుట, అట్టుపై తలతిరుగుసంభవించుట మొదలగు లక్షణములుకలుగును.

బిదాజైన్ అనగా యకృత్ నుండి పైలుదేరినరములు యీనరములు మిక్కిలి వేగముగా రక్తమును ప్రవహించునట్టులచేయునరములు యీనరములు మెడ యిరుపార్శ్వములయందున్నవి. అనగా గొంతు సమీపమునందున్నవి. పార్సీభాషయందు యీనరములకు షారగ్ యందురు. వీటివర్ణనము ఉల్ బునాహార్ యను గ్రంథమునందు యిట్లువ్రాయబడియున్నది.

ఈవ్యాధియందు నరములలోనుండు దోషము తొలగుటకై పైనవరించిన నరములను శిరావేదనముచేయవలెను. శిరావేదనముచేసిన తదువరి మలము వెడలక దోషము కలీజా (యకృత్) యందున్నట్లు తెలిసే యెడల యకృత్ సంబంధమగు పరీక్షచేసి చికిత్సచేయవలెను. ఇందు విషయమై పైనవ్రాయబడిన విధిప్రకారము చేయవలెను.

(4) మలదోషము, గర్భాశయము, మూత్రాశయము, మూత్ర పిండములు, కాళ్ళు, పిక్కలు, తొడలు, పొట్టపైనుండు పొరలు ఈ మొదలగు వానియందు నిలిచియున్నయెడల దీనిలక్షణములు అనగా ఈచెప్పినఅంగములలో దేనియందువిశేషముగా మలముండి అట్టుపైని తలతిప్పకలుగుచున్నది. మరియు ఈఅంగములనుండి ఏదోవకవస్తువు పైకెక్కినటుల రోగికితెలియబడును. వెంటనే తలతిప్ప వుత్పన్నమగుచున్నది, మరియు ప్రత్యేకఅంగముల లక్షణములు వానివానిస్థానములందు వర్ణించబడును.

రజోసంబంధమగు రుధిరము నిలిచిపోవుటవలన వుష్ణము, గర్భ

స్థానమునందు నిలిచి గర్భమునందునొప్పి గర్భము పిండినట్లుండుట మొదలగు లక్షణములు గలిగియుండును. పిదప తల త్రిప్పు కలుగుచుండును. మరియు గర్భస్థానము మూత్రకోశము మూత్రపిండములు పొట్టపైపొరలయొక్క మలదోషము బహుగా, వృష్ణముగానుండును. మరియు కాళ్ళు మలము శీతముగానుండును. ఈకారణమువలన హృదయమునకు పాదములు దూరముగాయున్నవని గ్రహించవలెను.

{ జీవనరములు, నరములు, గర్భాశయము, మూత్రాశయము మొదలగు దోషచికిత్స. }

ఏయంగమునందు వ్యాధి కలిగినదో యేయంగము వ్యాధివలన పీడింపబడుచున్నదో ఆలోచించి దృష్టినిలిపి చూచి ఆయంగమునందుండు నట్టి దోషము తొలగు నుపాయములను చేయవలెను. అనగా శిరావేదనము వస్తికర్మ విరోచనము మొదలగు కర్మలనుచేసి మలమును తొలగించవలెను. మరియు శరీరము మాలీసుచేయుట రోగిదశానుకూలముగా చేయుట హితవుగానుండునని తోచినయెడల చికిత్సరోగి అవశ్యకతానుకూలముగా చేయవలెను మరియు మెదడునకు బలము కలిగించుటకు ఔషధములను యివ్వవలెను. మలము పెరగకుండునట్టుల నుపాయముల ను చేయవలెను.

{ దెబ్బతగులుట (అభిఘాతము) వలన కలుగు తలత్రిప్పులక్షణములు }

తలకు దెబ్బతగులుటవలన మెదడునందుండువాయువు సంచారము చేయుటకు ఆటంకము సంభవించును. ఇట్టి కారణమువలనకూడా తలత్రిప్పు సంభవించుచున్నది. (వుదాహరణము) నీళ్ళయందు రాయి మొదలగు గొప్పవస్తువులు పడవేసిన యెడల నీళ్ళుయాకత్తు ఆకొలనుయందు కదలిపోవును. నీళ్ళకెరటములు విశేషముగా వచ్చుచుండును. కొంతసేపటికిగాని ఆకొలనుయందుండు నీళ్ళు పూర్వమువలె నిలువజాలవు ఇదే విధముగా తలకు దెబ్బతగులుటవలన తలయందుండు వాయువు చెదరి

కొంతసేపటికిగాని స్వస్థానమొందజాలము. ఇట్టి అవస్థను వాయువు అనుభవించుటవలన తలత్రిప్పు సంభవించుచున్నదని గ్రహించవలెను.

♦దెబ్బతగులుట (అభిఘాతము) వలన కలుగు తలత్రిప్పుచికిత్స♦

తలకు దెబ్బతగిలిన యెడల గాయముమానునట్టి చికిత్సలను చేయవలెను. ఈచికిత్సలవలన దెబ్బమానిపోయి తలత్రిప్పుమాత్రము తగ్గనియెడల మెదడు ప్రకృతానుసారముగా చికిత్సచేయవలెను మరియు దుష్టప్రకృతి అకస్మాత్తుగా మెదడునందు ఉత్పన్నమైన యెడల ఈ ప్రకృతివలన వాయువునకు అభ్యంతరము కలుగుటవలన వాయువువిశాలముగా తనకార్యములను నివర్తింపజాలకుండును. ఈ కారణమువలన తలత్రిప్పుసంభవించును. శరీరమునందుగల అవస్థాదోషములు అనగా ఆవిరికారణములు మొదలగు వాతములు మెదడునందుచేరి తలయందుండు వాయువునకు యిబ్బందికలిగించు కారణముగాక మరియు, సూామెను జాజ్, ముస్తరీప్, (భిన్నదుష్టప్రకృతి) దీనినమీాపమునందు వర్ణించబడుచున్నది. దీనిచిహ్నములు లఘుత్వమునొందుట, శీత, ఉష్ణములు, ఖనీభవించుటవలన తలత్రిప్పు కలుగుచున్నది. మరియు, తలలోభాగములందున్న పైభాగమునందున్న ఉష్ణశీతదోషములు ప్రవేశించుటవలన కలుగు తలనొప్పియందు వెనుక చెప్పియుంటిని. గాన అట్టి దుష్టప్రకృతిని తొలగించునట్టి ఔషధమువలన చికిత్సచేయవలెను. అట్టివస్తువులతో సంబంధము వదలివేసి జాగ్రతవహించవలెను. అట్టి ఓషధులను సాధారణతలనొప్పియందు వివరముగా వ్రాయబడియే యున్నవి. మరియు, తలత్రిప్పు తగ్గినవెనుక మెదడునందుండు గాలి తిరుగనారంభించును. ఇట్టి అవస్థయందు తలతిప్పు సంభవించును. (వుదాహరణము) ఒక గ్లాసులో నీళ్లుపోసియుంచి ఆగ్లాసునొకసారి త్రిప్పియుంచిన యెడల అందుండు నీళ్ళు కొంతసేపటివరకు కదలుచునేయుండును. కాబట్టి ఇవ్విధముగా తలత్రిప్పినప్పుడు తలయందుండువాయువు కదులునని భావము.

—ప్రకాశవస్తుదృష్టి తలత్రిప్పలక్షణములు—

మనుజుడు తేజస్సుగలవస్తువులను దీర్ఘకాలమువరకే చూపుగా చూచుటవలన తలత్రిప్పకలుగును. ఇందుకు కారణము చూచునట్టి వాయువు. ఆవస్తువుచు విశేషకాలము చూచుటవలన మెదడునందుగల వాయువు కదులుచుండును. అందువలన తలతిరుగ నారంభించును. మరియు, ఈతలత్రిప్పు కొంతవరకుండును. మిక్కిలి బలముగలవానికి తల త్రిప్పవిశేషకాలముండును. బలహీనునకు తక్కువగానుండును. ఇట్లుండుటకు కారణము బలవంతునికి విశేషబలము తగ్గిచుటవలన ఆలశ్యము గానుండునని భావము.

—ప్రకాశవస్తుదృష్టి తలతిప్పచికిత్స—

తలతిప్పగిలిచియున్న యెడల దుష్టప్రకృతిని తొలగించునట్టి నుపాయములను చేయువలెను. ఇట్టిదుష్టప్రకృతిని తీసివేయునట్టి చికిత్సలను పైనచెప్పియున్నాను.

—హృదయదుర్బల తలత్రిప్పలక్షణములు—

ఒకొ్కకసమయమందు హృదయముయొక్క దుర్బలమువలన సదర్ (కండ్లుచీకటి క్రమ్ముట) దువారా (తలత్రిప్పు) కూడా కలుగుచుండును. ఈవ్యాధి దుర్బలునికి కలుగుచున్నది.

—హృదయదుర్బల తలత్రిప్పచికిత్స—

హృదయమునకు బలముకలిగించుటకై చుక్కకూరషరబతు, నిమ్మకాయషరబతు, చందనపుషరబతు, సేప్షరబతు మరియు, మనస్సునకు వుల్లాసము, హృదయమునకు బలము కలిగించునట్టి వస్తువులను ప్రకృతానుసారముగా ఇవ్వవలెను. మిక్కిలి బలము సుచికరమైన పత్త్యభోజన పదార్థములను యివ్వవలెను.

(లాభము) దువారా (తలత్రిప్పు) కారణములయందు సుమెమి జాజ్ మఖ్తలిప్, వర్ణనమునందు చెప్పబడినది. దీనిని వర్ణించుట అవశ్యముగాన వైద్యవరులు దుష్టప్రకృతిని మఖ్తలిప్ ముజ్బిల్యందు

విభజించియున్నారు. వానివర్ణనము విరుద్ధముగానున్నది వాక్యము జాలినూస్‌గారు ఇందునిమిత్తమైన ముస్తబి స్వశరీరమునందు సామాన్యముగానుండును. ముఖతలిప్ ఒకేఅంగమునందు చేరియుండు వ్యాధి అని వర్ణించిరి.

మరియు, హకీము శేకు అలీ అబూశేన గారు వచించిన దేమనగా ప్రకృతి అంగముయొక్క ప్రధాన వస్తువునందు నిలిచియుండి నిజప్రకృతివలె సమానముగును. దీని ముస్తబి అందురు. ముఖ్తలిప్ ఇట్లుగాదు ముస్తబిమూలీం అనగా కష్టమునొందించునది కాకుండును. యెటులనగా దీనికిన్ని శరీరమునకు విరుద్ధభావము లేకుండును. ఈ వ్యాధి కారణమువలన విరోధముకలుగనేరదు. ముఖ్తలిప్ అనగా విరుద్ధతగాన కష్టముకలిగించుచున్నది. (బాధనొందించునది) సమత్వము వలన తత్వము దానితో పోరాడుచున్నది. ఈవాక్యమునకు దృష్టాంతర మేమనగా అర్జి అను తత్వము అనగా బాహ్యప్రకృతివలన యేదోయొక అంగమునందు ఉత్పన్నమగును. ఆఅంగమునందు నిజప్రకృతికై తిరుగునట్టి హీనముగాక సహజముగా ప్రకృతియందుచేరిన యెడల ఇట్టిప్రకృతికి ముస్తలిబి. మరియు ముస్తలీము అందురు.

దీనివుదాహరణము బరస్ (తెల్లమచ్చ) వ్యాధి ఈవ్యాధిప్రకృతి దశానుకూలముగా మారజాలదు. పైప్రకృతి తనతోకూడా అంగములయందు సహజముగా ప్రవేశించునట్టి శక్తికలిగియుండును. ఇటులకలుగు దానిని ముఖ్తలిప్ అని వచించుచుదురు, దీని వుదహారణము తపె అవని అనగా జ్వరము ఈజ్వరము ఉష్ణదోషకారణమువలన ఉత్పన్నమగును ఈజ్వరము వమనముచేయించుటవలన సహజముగా శాంతినొందుచున్నది. అనగా నిజప్రకృతివైపుకు మారుచున్నదనిభావము.

# దీర్ఘనిద్ర [సుబాత్] లక్షణములు.

గాఢనిదుర కలుగుటకు కారణములను వచించుచున్నాను. రోగికఠినముగా మేలుకొనకుట, ఇట్లు మేలుకొనకుటకు 10 కారణములుగలవు. (1) శీతదుష్టసామాన్యప్రకృతి విశేషత్వమువలన పుత్పన్నమగుచున్నది. దీనిలక్షణములు సుత్ హావత్ అనగా నిరోగ ప్రకృతి వలన నాడినిలిచి నడుచుచుండిన హృదయశక్తి విశేషముగా యున్నదని గ్రహించవలెను. మరియు శరీరము ముఖకాంతి ఆకుపచ్చరంగు కలిగి యుండి ముందుగా తలనొప్పి కలిగించును. శీతవస్తు వుపచారము చేసియుండినను దుష్టపదార్థము సేవించినను అనగా మత్తుపదార్థములు భుజించినను ముఖకాంతి హీనముగా నుండును.

### (1) శీతదుష్ట ప్రకృతిసామాన్యతవలనకలుగు గాఢనిదురచికిత్స.

ప్రకృతిమార్పునొందుటకై లఘుశీఘ్రమైనట్టియువృష్ణశరములను సుగంధద్రవ్యములను అఘ్రాణించవలెను. సాంబల, తులసిఆకు కషాయము గోరువెచ్చగానుండు నప్పుడు తలపైపోయవలెను. మరియు మహానింబగింజలనూనె, చంగల్వకోష్టు, జుఫ్నా, అడవినీరుల్లి, ముఖిజజ్, అక్కలకర్ర, ఈవస్తువులను చూర్ణించి శిరకాలో కలిపి తలపై లేపనము చేయవలెను,

మరియు దివాల్ముష్కు, మసాకీతూస్, అనేకద్రవ్యములతో తయారుచేయబడిన మాజూన్లు ఇవ్వవలెను.

మరియు కోడిపిల్లలమాంసము, సెనగకట్టు, ఈవస్తువులలో అకరోటునూనె, ఆవనూనె చేర్చి వండి రోగికివ్వవలెను.

మరియు మత్తుపదార్థములుచేరిన ఔషధసేవన ఈరోగకారణమైనచో విషహార ఔషధసేవనవలన ఈవ్యాధిని శాంతించునటుల చేయవలెను. విషహారఔషధములను ఈపుస్తక అంతమునందు వ్రాయబడియున్నవి.

2వ కారణము.

రెండవకారణము మెదడుయొక్క అగ్రభాగమునందు అపక్వమలము ఘనీభవించి యున్నయెడల దీనిలక్షణము రోగియొక్క తలముందుభాగమునందు కనురెప్పలయందు వుబ్బుకలిగియుండుట కండ్లుత్రిప్పనప్పుడు బరువుగానుండుట ముక్కుయెండుట, చిక్కనినీరు వెడలుట, అరుచికలుగుట నాలుక మొద్దుగానుండుట ఈమొదలగులక్షణములు కలిగియుండును.

2వ కారణచికిత్స:

ప్రదమమున మెదడునందుగల దుష్టమలమును ఔషధశేవనవలన వస్తికర్మవలన నిర్మలపరచవలెను. యిందువిషయమై సర్సాం, నిసురిగున్, అనుతలవ్యాధియందు వెనుక చెప్పియున్నవి. కాబట్టి ఆకషాయములను ఔషధములను సేవింపవలెను. మలము శుద్ధతినొందించుటకు ముందుగా ప్రకృతిని నిలువునటుల కాపాడవలెను. సుబాత్, మొదటిలక్షణము అనగా సాధారణ జలుబులక్షణములయందు చెప్పబడినమరియు కఫ జ్వరమునందు దీనిచిన్నెములు చెప్పబడును.

3వ కారణము.

చెమ్మగల నీచ ఆవిరి పరమాణువులవలన ఆవిరిబైలువెడలి మెదడునందు ప్రవేశించును. మరియు కఫజ్వరమునందు దీనిచిన్నెములు జ్వరమునకు ముందుగా కనుపించుచుండును.

3వ కారణచికిత్స.

ఈవ్యాధియందు ముందుగా జ్వరము హరించునట్టి చికిత్సలను చేయుటప్రశస్తము మరియు మెదడునకు బలముకలుగుటకై గుల్ రోగన్ పన్నీరు, శిరకా, ఈవస్తువులు యేకముగా కలిపి అందుదూదితడిపి రోగిమాడుపై వుంచవలెను. మలముహరించుటకై పాశోయ (కషాయాదులయందు రోగిని కూర్చుండబెట్టుట) మొదలగు సదుపాయములు శేయవలెను, పాదములనుమర్ధించవలెను. కాళ్ళుచేతులు నాడి మొదల

గునవి బంధించవలెను. మరియు రుమ్మించుటవలన కూడా లాభము ప్రాప్తించగలదు.

## అభిఘాతకృతనిద్రలక్షణము.

(4) సుడేగెన్ రెండుకణతలపై దెబ్బతగులుటవల్లన అచ్చటినరములు తెగిపోయినయెడల మెదడునందు దోషము సంభవించుచున్నది.

(5) తలపై దెబ్బతగులుటవలన, తలఅదరుటవల్లన, తలపెంకు బ్రద్దలగుచున్నది. ఇట్టికారణమువలన మెదడు అనగిపోవును. మరియు మెదడు చితుకుచున్నది. దీనివ్రత్యేక లక్షణములు హేతువువలన వ్రతీతమగుచున్నది.

## అభిఘాత కూర్రనిదుర చికిత్స.

దీనిచికిత్స వెనుకవిరుగుట దెబ్బతగులుట అనగా గాయమును మాన్పు చికిత్సలను అభిఘాతశిరోరోగమునందు చెప్పబడినవి గాన తిరిగి అంత్యభాగమునందు వ్రాయబడును.

{ అంగమునుండి పరమాణువులు మెదడునందు వ్రవేశించి నిద్రకలిగించు లక్షణములు. }

(6) ఆవిరికణములు ఆమాశయమునుండి, మెదడునకు చెక్కుట వలన క్రూరనిదురపుట్టించుచున్నది. దీనియుదాహరణము తాకి విపరీతించుచున్నాము. అజీర్ణమువలన, కామమువలన కునిదురకలుగుచున్నది దీని లక్షణములు కండ్లయందుచీకటివచ్చుట తలతిరుగుట చెవులయందుభిన్న భిన్నశబ్దములు వినబడుట కండ్లయందు ఈగలు, దోమలు, పురుగులువంటుల తోచుట మరియు వరగడుపునందు తలత్రిప్పుట నిదురపట్టకపోవుట మొదలగునవి లక్షణములు.

(7) పుప్పసములు (లంగ్స్) అనగా వూపిరితిత్తులయొక్కగాలి నుండి పరమాణువులు పైకిలేచుటవలన కలుగు లక్షణములు. ఊపిరితిత్తులుబ్బుట, రొమ్ముపుబ్బుట, వూపిరికష్టముగా వెడలుట, ఇప్పుడు, దగ్గు గలుగుట నాడివంకరగానడచుట యీమొదలగులక్షణములు వూపిరి

తిత్తులయొక్క పరమాణువులు పైకెక్కుటవలన కలుగునని గ్రహింపవలెను.

(8) భోజనము, ప్రేగులలో పురుగు లుద్భవించుటవలనగాని లేక పురుషవీర్యము లేక స్త్రీయొక్క ఆర్తవరుధిరము లేక భగము, లేక స్రవవరక్తము రజస్వల రుధిరము స్రవించక ముందు స్రవించురక్తము మొదలగునవి విశేషముగా స్రవించునట్టివి నిలిచిపోవుటవలన గర్భస్థానమునుండి ప్రేగులవలన ఆవిరిపరమాణువులు మెదడునందు ప్రవేశించునుగాన ఇట్టి స్రవము నిలిచినమొదలు గర్భస్థానమందు పరమాణువులు పైకెక్కి తలత్రిప్పు అతినిదుర కలిగించుచున్నవి. దీనిలక్షణములు యేఅంగము నుండి పరమాణువులు లేచుచున్నవో ఆఅంగమునందు బాధకలుగుట, యెల్లప్పుడు నిదుర తలతిరుగుచుండుట మొదలగునవి కలుగుచుండును. మెదడునకు కష్టము కలిగించునట్టి అంగములనుండి ఆవిరిపరమాణువులు మెదడునందు చేరుచున్నవి.

అంగములనుండి పరమాణువులు మెదడునందు చేరి కలిగించునిద్రచికిత్స.

ఏఅంగమునందు కష్టముకలిగియున్నదో ఆఅంగమునకు చికిత్స చేయవలెను. ఈచికిత్స విషయమై వెనుక వ్రాయబడియున్నది. అంగములయందుగల కష్టము తగ్గినపిమ్మట హృదయమునకున్ను తలకున్ను బలము కలిగించునట్టి చికిత్సలను చేయవలెను. ఈచికిత్సలవిషయమై వెనుక వ్రాయబడియున్నవి.

రజోరక్తము అధికముగా వెడలుటవలన కలుగులక్షణములు.

(9) యోనిద్వారమునుండి రుధిరము విశేషముగా వెడలుటవలన క్రూరనిద్ర విశేషముగా వచ్చుచుండును, రుధిరము విశేషముగా వెడలుటను గురించి అనేకస్థలములందు చెప్పియున్నాను. అయినను యిందు విషయములో విశేష శ్రద్ధవహించవలెను.

రజోరక్తమధికముగా వెడలుటవలన కలుగు నిద్రచికిత్స.

సరేరూ (మధ్యమాంగుల్యమునుండి ముంచేతివరకు పోవునట్టి

నరము) అఫ్ నే అందామ్ (ఇదిచకనరము) నరేరూ బాసలిక్ తో కలిసి యుండునది మరియు యీనరము బొటనవ్రేలికి సమీపమునయున్నది. తర్జనివ్రేలుముందుభాగమునుండి మోచేతివరకు ధారాళముగా వెళ్ళునట్టి నరము. ఈనరములకుఛేదించి రక్తమోక్షణముచేయించవలెను. అనగా నరమును ఛేదించవలెను. రక్తము వెడలించిన తరువాత పిక్కలపై శస్త్రముతో గంట్లువేసి రక్తము వెడలించవలెను. ఇట్లు చేయుటవలన మెదడునందుండు మలము క్రిందిభాగమునకు దిగును. మరియు సాఫీన్ [కాలినరము]ను ఛేదించుట మిక్కిలియుపయోగము. ఈవ్యాధిలిగ్గుటకై రక్తజ సర్సాంవ్యాధియందు చెప్పిన విధానము యిందుపయోగించవలెను. గాని రోగానగుణ్యముగా చికిత్సచేయుట వైద్యుని అభీష్టమై యున్నది.

శిరావేదనక్రమము, శిరావేదనచేయునట్టి నరముల వివరము చిత్రపటముతో శిరావేదన ప్రయోజనములు మొదలగునవి 2 వ అధ్యాయమునందు విపులముగా వివరించబడును.

దుఃఖవిచారాతి క్యారనిద్ర లక్షణములు.

(10) దుఃఖము లేక విచారము మిక్కిలికష్టము కఠినక్రియలు చేయుట శరీరమునుండి మలము విశేషముగా వెడలించుట మొదలగు వానివలన ప్రాణవాయువునందుగల తేజస్సు హరించును. ఇట్లు హరించుటవలన ప్రాణవాయువు శరీరమునయావత్తు సంచారముచేయుటకు శక్తిహీనమైయుండును. ఇట్టి దశయందు తక్షణమే హృదయమును శాంతింపజేయు నుపాయములను చేయవలెను. మరియు మెదడునందుగల వాయువు తనకార్యములను నెరవేర్చుకొనుటకు అలసియుండును. ఈసమయమునందు రూహెహైవాని [హృదయసంబంధమగు ప్రాణము] తోసహాయమునుపొందుటకై కష్టము సంభవించును. ఇట్టిస్థితియందు తిరిగి వెళ్ళనారంభించును. దీనిలక్షణములు కష్టముకలుగు కారణమువలన కలుగు క్యారనిద్ర ముందు సూచన కనిపించుట, ఆలస్యము నిదుర స్మరంతిలేకుండావట్టుట ఈ మొదలగు లక్షణముకలిగియుండును.

### దుఃఖనిద్రా రాది క్రూరనిద్ర చికిత్స

ఉష్ణప్రకృతిగల రోగికి జీర్ణశక్తి గలవానికి మాంసరసము, పన్నీరు, నేప్ రసము, కలిసి ఇవ్వవలెను. మరియు సనుకతి తూస్ మాజూస్ నందు సమభాగముగా తవాష్టీరి కలిపి యివ్వవలెను. శేషామస్భతు, వాని మస్తకముపై [illegible]గా వినియోగించవలెను. అభిప్రాయమేమనగా? అచేతన సంబంధమగు [illegible] చేయవలెను.

మరియు శీతప్రకృతిగల రోగికి జవారిష్ సారితూస్ తేనెనీళ్లు బేదానా కాయ అష్ట, ద్రాక్షసారాయి వీనితో జేర్చి యిప్పించవలెను. మాంసరసముకూడా ఇందు చేర్చుటకుండెను.

[లాథర్గస] సుభాత్ (అచేతనమైన నిదుర) గసి [స్మరంతిలేక పోవుట) ఈరెంటియందు భేదమేమనగా సుషుప్తిగల నిదురవానికి అర్థము ఈనిదురగ. వానినాడి ఒక్కొకప్పుడు బలముగానుండును. మరియు రోగ పురుషుని నాడితో సమానముగా నుండును. మూర్ఛగలవానినాడి దుర్బలముగానుండును. అతినిదురగలవానినాడికంటె కఠినముగానుండును.

మరియు, మూర్ఛరోగి ముఖము పచ్చగానుండును అతినిదురగల వాని ముఖము సాధారణరంగుగానుండును. ఒక్కొకప్పుడు ఆకుపచ్చ రంగు కలిగియుండును. దీనివిషయమై వెనుక ఒకటవ ప్రకరణమునందు చెప్పియున్నాము.

### (సనాస్యము) (క్రూరనిదుర)

మరియు, సక్తా, సుబాత్ వ్యాధులయందు భేదమేమనగా అతినిదురగలవానిని కఠినముగా మేలుకొనునటుల చేయవచ్చును. వాని చేష్టలు నిద్రించువాని లక్షణములతో సమానముగానుండును. మరియు ఈరోగిజ్ఞానేంద్రియములు తక్షణమే మందగతియగుచున్నవి. కొందరికి ఈవ్యాధి శాంతించుచున్నది. గాని సక్తా (సన్యాసము) అను వ్యాధిగల రోగి సమస్తచేష్టలు సర్వేంద్రియముల చేష్టలుడిగి శవమువలె నుండును (విశేషదుష్టవ్యాధి) మెదడునందుగల దోషప్రకృతివలన కలిగిన

ఈవ్యాధియందు చల్లనినీరు దాగుట, పుక్కిలించుట, హానికరము. యెటులననగా మెదడుయొక్క స్వప్రకృతి చల్లగానుండును. నరముస్తనర ములు మెదడునుండి వెడలివచ్చుచున్నవి. కాబట్టి ఈనరములయందు కూడా శీతప్రకృతి కలిగియుండును. శీతపదార్ధములను నానవచూచుట నోటియందుంచుకొనటవలన ఆపదార్ధములయందుగల శీతము, దంత ములు, దవడలు, తాలువులనరములద్వారా మెదడునందు ప్రవేశించు చుండును. కాబట్టి మెదడునందు శీతము అధికమై హానికలిగించుటకు కారణమగుచున్నది. జలంబువలన కష్టముసంభవించిన యెడల వెంటనే హానిప్రాప్తించును.

లేక ఉష్ణదోషమువలన మెదడునందు కష్టము సంభవించిన యెడల కొంతకాలము తరువాత హాని సంభవించును. అయినను ఉష్ణ శీత ప్రకృతులదోషములు రెండును హానిదాయకములని గ్రహించవలెను



## అతిజాగరణలక్షణములు.

సహార్ (విశేషముగా మేలుకొనట) సదర్ (నిదుర) అనగా అనిద్ర అనబడుచున్నది. అనిద్ర అనగా నిద్రలేకపోవుట ఈనిద్రకు సంబంధమగుచున్నది. ఇందునుబట్టి ఈవ్యాధికి అనిద్రయని పేరు పెట్ట బడినది. మరియు, ఈవ్యాధి యెనిమిది కారణములవలన యేర్పడు చున్నది.

### 1 వ. అతిజాగరణలక్షణములు.

(1) నూయెమిజాజ్ యాబిస్ (సాధారణశుష్క దుష్టప్రకృతి) దోషకారణమువలన నిర్ధారపట్టకుండును. మరియు, నిది మెదడునందు ఉత్పన్నమై మెదడును శుష్కింపజేయుచున్నది. దీనిలక్షణములు తల్ హావాస్ (ఇంద్రియములు) లఘుత్వమునొందుట నాలుక ముక్క ఆరుచుండుట తలనుస్పర్శించుటవలన వేడిగానున్నటుల దోచుట ఈలక్ష

ణములు శుష్కమైనదున్నను కలుగుచున్నవి. మరియు మెదడునందు శుష్కత్వము అధికమైనకొలది నిదుర అలస్యముగా వచ్చును.

1 అతిజాగరణచికిత్స

మెదడునకు సుపాయము ఘుటము చేయవలెను. మరియు, బనప్షా, కలువపూలు, కాహూవిత్తులు, పచ్చిధనియాలు ఖురాసాని ఓమము పోస్తుకాయలు ఈవస్తువులు నీళ్ళలోవేసి కషాయముగాకాచి ఈకషాయము రోగితలపై పోయవలెను. ఈకషాయమును రోగి పుక్కిలించునట్లు చేయవలెను. మరియు, మేకతలమెదడు నీళ్లలోవేసి ఉడికించి ఆకషాయమును ఒకజానెడు ఎత్తునుండి రోగితలపై పోయవలెను. ఇట్లుచేయుటవలన లాభముకలుగకుండిన యెడల బనప్షా కలువపూలు ఈవస్తువులు యెండినవిగాని అథవా కాహూవిత్తులరసమునందుగాని కషాయమునందు గాని లేక పచ్చిధనియాలు గసగసాలరసము ఇవియావత్తు కలువపూల నూనెయందుకలిపి ద్రవదార్థములలోచేర్చి రోగికివాసన చూపించుచుండవలెను. మరియు, సొరగింజలతైలమును ఆడశిశువుగల తల్లిచనుపాలలో కలిపి తలకు మర్దించవలెను. ఈపాలు తైలముల నస్యముచేయవలెను.

కోడిపిల్లలమాంసము, పావురపుపిల్లలమాంసము, మేకపిల్లమాంసము, యీమాంసాదులలో నొక్కొక్కటి, కాహు, పాలక్, కాహు విత్తులు, సొరకాయ, చేర్చి వండి యివ్వవలెను. మరియు భోజనము పచనమైనతరువాత గోరువెచ్చగానుండు నీళ్ళతోస్నానము చేయవలెను. మరియు, పరిశుభ్రమగు విశాలముగానుండు స్థలమునందు రోగిని నివసింపజేయవలెను. మరియు, ఏవస్తువు మెదడునకు శుష్కత్వము కలిగించునో అట్టివస్తువులను వర్జించవలెను.

2వ సాధారణ ఉష్ణ శీతదుష్టప్రకృతి.

సాధారణ ఉష్ణ, శీతదుష్టప్రకృతి మెదడునందు ఉత్పన్నమగుట వలన ఈరోగమునకుకారణమగును, అనిద్ర ఈవ్యాధిమిక్కిలిదుష్టస్వాభావికమైనది దీనిలక్షణములు మెదడు శుష్కించి లఘువుగానుండుట. తల

యుండుచుంట, అతిదాహము, మొదలగు లక్షణములు కలిగియుండును దీనిని సూహేమిజాజ్ హార్ యాలిస్ అనబడును.

2వ నిద్రనాశనచికిత్స.

మెదడునందు చెమ్మ, జలుబు, కలిగించునట్టి వస్తువులను ప్రయోగించవలెను. మరియు, పైన పాధారణ శుష్కత్వమునందు చెప్పిన వస్తువులను ఉపయోగించవలెను. ఆవస్తువులను చల్లని పదార్థములలో చేర్చి ఇవ్వవలెను.

3వ వాతశుష్క దుష్టప్రకృతి లక్షణములు

వాతశుష్క దుష్టప్రకృతి ఉత్పన్నమైన కారణమువలన నిద్రను నశింపజేయును. దీనిని సూయమిజాజ్ యాబిస్ సౌదావి అనుచున్నారు.

పిత్తజ, ఉష్ణ శీతదుష్టప్రకృతి లక్షణములు

పిత్త కారణమువలన ఉష్ణ, శీతదుష్టప్రకృతి మెదడునందు ఉత్పన్నమగును. దీనిలక్షణములు చికిత్స, వెనుక వాతజ దుష్టప్రకృతి యందు చెప్పబడియున్నది.

3వ, 4వ, కఫ, పిత్త, వాత, దుష్టప్రకృతి అనిద్ర చికిత్స

మరియు, కఫమును, పిత్తమును, వాతము మొదలగువాని ప్రకృతిని తగ్గించి శరీరమునకు స్వస్థతనొందించి పమపరి మెదడునకు చెమ్మపుట్టించునట్టి వస్తు ఉపచారము, లేపనములు మొదలగునవి ఒకటో ప్రకరణమునందు ఈసంబంధమను వ్యాధిని గురించి చెప్పియుంటిమి. వానిని ఇందుపయోగించవలెను.

5వ కారమల దుష్టప్రకృతి నిద్రనాశన లక్షణములు.

ఉప్పనిమలము మెదడునందు ఖనీభవించును. ఈరతూబత్ (నీరు) నందు అపక్వమగు ఉష్ణము ప్రవేశించుటవలన అప్రకృతిగుణములు ప్రకటనమగుచున్నవి. అట్టిమలసంబంధమగు వ్యాధియందు ఒకవిధమగు మంటకలిగి ఒగ్గమై భస్మమైన చందమున దుర్గంధము కలిగియుండును. ఈవ్యాధిలక్షణములు ముక్కువెంట నీళ్లు, చీమిడి కారుట, కండ్లు పుసి

కట్టుట, కండ్లు అంటుకొనుట, తలనుండి వెచ్చని ఆవిరి వెడలుట రోగి నిదురనుండి కలువరవడి లేచుట ఈమొదలగు లక్షణములు క్షౌరమలము వలన కలుగురోగమునందు కలుగునని తెలియవలెను.

—5 వ. క్షౌరమల దుష్టప్రకృతిచికిత్స.—

రోగికి ప్రతిదినము ప్రాతఃకాలమునందు సోపువేరు, యష్టిమధుకము గౌజబాన ఈవస్తువులను కషాయము గావించి గుల్ ఖందు నూరి కలిపి ఇవ్వవలెను. రోగికి రోగపక్వమగువరకు ఈకషాయమును వుపయోగించవలెను. రోగముపూర్తిగా శాంతినొందిన వెనుక యూరజ్ మరియు శబియూర్ ఈరెండువిధముల మాత్రిలు పక్వమగుదోషమును వెడలించుటకై ఉపయోగించవలెను. మలము వెడలిన తరువాత బాబూనా తైలము యష్టిమధుకవు తైలము తలపై లేపనము చేయవలెను.

—5 వ. క్షౌరమల దుష్టప్రకృతి పథ్యములు—

చవ్వనినీటియందు నివశించునట్టి చేపమాంసము పెద్దకోడిమాంసము, మేకపిల్లమాంసము ఈమొదలగు మాంసములు ప్రత్యేకముగాగాని లేక పాలకూర, సొరకాయలు మొదలగు వస్తువులను రోగికి పథ్యశాకములుగా వుపయోగించవలెను. మరియు, ఉష్ణ తిక్త లవణ వస్తువులు అపథ్యములని తెలియవలెను.

—6 వ. భేదము నిద్రానాశనలక్షణములు—

అజీర్ణము, జ్వరము, శోకము, ఆలోచనము. చింత మొదలగు కారణములవలన నిదురనశించుచున్నది. ఇందుండి ప్రత్యేకలక్షణములు వాటివాటి హేతువులనుబట్టి తెలియబడుచున్నవి.

—6 వ. భేదము నిద్రానాశనచికిత్స—

ఈవ్యాధి యేహేతువువల కలిగినదో ఆహేతువును విచారించి కనిపించి ఆహేతువును దూరపరచునట్టి మార్గములను ఆలోచించవలెను. తదుపరి హేతువు నశించి వ్యాధిశేషించి యుండినయెడల ఉచిత ఔషధములతో చికిత్సచేయవలెను.

### 7 వ. కారణత్రిదోషజనిత నిద్రనాశనలక్షణములు

సర్ తాన్ (త్రిదోషజనిత వాపు) లేక దీనితో సమానమగు వ్యాధి మెదడు సమీపమునందు ప్రవేశించుచున్నది అదియే 7వ హేతువు. నిద్రనాశనము నొందించునదియని తెలియవలెను. భోజనపానాదులయందు వాతమును పుట్టించునట్టియు త్రిదోషముకలిగించునట్టి పదార్థములను సేవించుట అనగా వాతపదార్థములు సేవించుటవలన తలయందుండునట్టి పరమాణువులు లేచుచున్నవి. ఈ కారణమువలన నిదురయందు పీడకలలు కనుపించుట, నిదురయందు భయపడి ఉలిక్కిపడి లేచుట మరియు, శరీరమునందు ఆవిరిచేరియుండుటవలన తిరిగి నిదుర పట్టకుండుట మొదలగు లక్షణములు కలిగియుండును. మరియు ప్రత్యేకలక్షణముల చికిత్సలను అనగా యేకారణమువలన ఈవ్యాధి కలిగినదిన్ని ఆలోచించి ఆవస్తువులను సేవించుట మానివేయవలెను. మరియు అయారజ్ పైకరా సబిరూర్ మాత్రలు రోగికి యుపయోగించవలెను.

దీనికారణము సర్ తాన్ (వాపు) ఇదికరినముగా తగ్గుచున్నది. సర్ తాన్ వాపు విషయమై చికిత్సలను యెచ్చటచెప్పబడియున్నవో ఆ చికిత్సలను యుపయోగించుట వుత్తమము.

మరియు వృద్ధులకు రెండుకారణములవలన నిదురపట్టనేరదు. వార్ధక్యమునందు శరీరప్రకృతి మారిపోవును, మెదడు నీరసమగును. యెవ్వనుని మెదడుకంటె శుష్కించియుండును. ఈకారణమువలన నిదుర తగ్గునని తెలిసికొనవలెను. మరియు దీనిలక్షణములు నిదుర మేలుకొనుటకు తగినకారణములు యేమియు కనుపించకుండును. ఈవ్యాధిచికిత్స మిక్కిలికష్టముగా నుండునుగాని నిత్యము రాత్రికాలమునందు బాబూనా కషాయము యుపగంజి తలపై వేయవలెను. మరియు బాబూనాతైలము, పుష్పహారతైలము, నశ్యముచేయవలెను. మరియు నశ్యము చేయునట్టి తైలమునందు కాహూ గింజలరసము కొద్దిగాచేర్చవలెను.

(సూచనీయము) రాత్రికాలమందు ఈవ్యాధిగల రోగికి కాళ్లు చేతులు, కట్టి కూర్చుండబెట్టి పెద్దదీపమును యెదురుగా బెట్టి పురాణములు, శాస్త్రములు, కథలు. చదువుచూ కొందరు. రోగివద్దయుండవలెను. మరియు రోగిని నిదురపోకుండునటుల చేయవలెను. రోగి నిదురకు పరితపించినయెడల వెంటనే దీపము తీసివేసి నిశ్శబ్దముగాయుండవలెను. మరియు ప్రకృతానుసారముగా రోగియొక్క అరికాళ్ళు, అరిచేతులకు తైల లేపనము చేయవలెను. తలపై కూడా తైలలేపనముచేసి మర్దించవలెను. మరియు నిద్రాభంగము కలుగునట్టి శబ్దములు మొదలగునవి వర్జించవలెను. కొంతదూరమునుండి రోగితిరుగలిశబ్దము వినబడునటుల చేయుట లాభదాయకము.

## సుబాత్, సహారి మరియు సహారేసుబాతియొక్క లక్షణములు.

ఈవ్యాధియందు రోగి మేలుకొనుట, నిద్రించు వృత్తమము. అందువలననే సుబాత్ (మేలుకొనుట) సహారి (నిద్రించుట) మేలుకొనుటనిద్రించుటయని ఈరోగమునకు నామాంతరముగలదు. ఈరోగము కఫ పిత్త సంయోగమువలన పుట్టుచున్నది. మరియు కఫము విశేషమైనయెడల మేలుకొనుటకు కారణమగుచున్నది. దీనిని సుబాతె సహారీ [నిద్రించుట మేలుకొనుట] అందురు. మరియుపిత్తాధిక్యతవలన నిదురనుండి మేలుకొనటకు కారణమగుచున్నది. కాబట్టి ఈరోగమునకు సహారెసుబాతి (నిద్రించుట మేలుకొనుట) అనివచించుచున్నారు. మరియు మెదడు పుట్టుటకుకూడా సహారిసుబాతి అనుచున్నారని హాకీము కిర్సిగారు వచించియున్నారు. ఇది పిత్తకఫమువలన పుట్టుచున్నది ప్రత్యేకదశయందు సుబాతె, సహరి, అనగా, మేలుకొనుట, నిద్రించుట, అని చెప్పుదురు.

ఈవ్యాధిలక్షణములు ఒకప్పుడు నిదురవిశేషముగావచ్చుట, ఒకప్పుడు విశేషముగామేలుకొనుట, నిద్రించుకాలము, మేలుకొను కాలముకంటె, జాస్తిగానుండుట, బావి, తలయందు ఆవిరివెడలుట,

ఒకప్పుడు దీనిలక్షణములు మారి, లీసుర్గుస్ .(శ్లేష్మజసర్సాం) సహా రెనుబాతి (నిద్రించుట మేలుకొనుట) లక్షణములు అనగా ఒకప్పుడు నిద్రించుట ఒకప్పుడు మేలుకొనుట మరియు ఈరోగమునందు లక్షణము లు కరానితూస్ [పిత్తజసర్సాం] వ్యాధిలక్షణములకు సమానముగా నుండును. ఒక్కొకరోగికి శరీరమునందు దుష్టదోషము సంభవించి రోగి యెంతవరకు మేలుకొనియుండునో అంతవరకు శాంతినొంది రోగివరుండి కండ్లుమూయగనే తాపము గరిజ్ [స్వాభావికతాపము] శరీరములోనుం డు దోషములనుపచనముచేయుటకై ఆరూఢమాగును గాని తాపశక్తి పూర్తిగా పచనముచేయ జాలక ప్రత్యేకదోషములను మాత్రము ప్రేరే పించును. ఈకారణమువలన పరమాణువులను రేగగొట్టును కాబట్టి ఈ పరమాణువులు మెదడునందు ప్రవేశించును, యీకారణమువలన రోగి వెంటనే నిదురనుండి మేలుకొనును పరుండినను నిదురపట్టకుండును గాని కునికిపాట్లుపడుటవలన హాయిగానుండును. మరియు సహారి సుబాతి [నిద్రించుట మేలుకొనుట] వ్యాధికి మరియొకకారణము కలదు. యీ దశ శుష్కప్రకృతిగలవానికి ఒక్కొకప్పుడు విశేషము కలుగుచున్నది.

## చెడు లక్షణములు.

ఈరెండువిధముల వ్యాధులయందు రోగి యెల్లికిలపరుండియుం డును. భోజనపానములుకూడా విడిచియుండును మరియు దాహమునకు నీళ్లు త్రాగుసమయమునందు కొరపోయి చాలాబాధపడును. అనగా నీళ్ళు వాయునాళమునందుప్రవేశించి తిరిగి నోటిలోకివచ్చును. ఆవెంటనే విశేషముగా వెడలనారంభించును. మరియు కంఠమునందు జలమునిలిచి యుండి ముక్కువెంట వెడలనారంభించును. ఈలక్షణములు మిక్కిలి తీవ్రమైనవి. మరియు, ఒకొకసమయమునందు మూత్రవురీషములు కూడా బంధించును. శ్వాస కష్టముగా వెడలుచుండును. దీనిదశ ఇఖ్తె నాకురిహార్ (గర్భస్థానమునందు దోషము సంభవించి దానిమార్గము లను చెడగొట్టుట) వలన కలుగుచున్నది.

## ఇస్త్రినాకరీహార్క

ఇస్త్రినాకరీహాస్ అనగా సుబాత్ సహారియొక్క భేదమందురు. ఈరెంటియందు భేదమేమనగా సుబాత్ సహారియందు విశేషముగా కనికిపాట్లువచ్చిన తరువాత మాట్లాడుట, పలుకుట ప్రుచితముగానుండును. మరియు, గర్బస్థానము చెడునట్టి కారణమువలన రోగిముఖము తన ప్రకృతియందే యుండునుగాని మార్పుజెందదు. మరియు, సుబాత్ సహారివ్యాధిగల రోగిముఖకాంతి దోషానుసారముగా మారుచున్నది. ఈ వ్యాధి పిత్తలక్షణములవలన వర్తమానమునందు కలిగినయెడల సర్సాం శ్లేష్మము వలన భిన్నమగుచున్నది. ఈవ్యాధి కఫలక్షణమువలన కలిగిన యెడల పిత్తజసర్సాంనందు భిన్నమగుచున్నది.

(సూచనీయము) అప్పుడప్పుడు కఫ పిత్తములు రెండున్ను సమానమగుచున్నవి. ఈదశయందు రోగి నిద్రించుట మేలుకొనుట సమానముగానుండును. ఇటులనే విశేషలక్షణముకూడా కలిగియుండును.

## ఇస్త్రినాకరీహార్ చికిత్స

ఈవ్యాధియందు ఉభయదోషమిశ్రిత నుపాయములను ఆలోచించవలెను. సాధ్యమైనంతవరకు ప్రారంభదశయందు శిరావేదనము చేసి రక్తమోక్షణముచేయవలెను. పిక్కలపై కొమ్ములతో రక్తము తీయవలెను. యెందుకనగా మెదడునందుండి మలము పిక్కలయందు దిగుచున్నది. కాబట్టి రక్తమోక్షణము ఉత్తమము. ఇస్తవరాగ్ కల్లో (నాలుగు దోషములను తీసివేయుట) మరియు, కఫము అధికముగానున్న యెడల యారజాత్ గారి ఖూకై డ మొదలగు ద్రవ్యముల వలన దోషమును తొలగించవలెను.

మరియు, పిత్తము అధికముగానున్న యెడల కరయాక్కా కషాయము శిలలకొయు మాజక నకమోసిగూ మొదలగు ద్రవ్యములవలన దోషమును తొలగించవలెను. అభిప్రాయమేమనగా కఫజసర్సాం, పిత్తజసర్సాం ఈవ్యాధుల చికిత్స సమకూర్చి దోషములకు తగినటుల న్యా

నృత అధికతానుసారముగా తగ్గించి హెచ్చించి ఉపయోగించవలెను. అనగా పిత్తము అధికముగానున్నయెడల పిత్తహారవస్తువులు విశేషముగను, శ్లేష్మహారవస్తువులు తక్కువగను జేర్చి ఉపయోగించవలెను. శ్లేష్మము అధికముగా నున్నయెడల శ్లేష్మహారవస్తువులు విశేషముగను పిత్తహారవస్తువులు తక్కువగను చేర్చి యుపయోగించవలెనని భావము.

మరియు, మలదోషమును పక్వపరచి తీసివేసినపిమ్మట ప్రకృతి స్వభావికమగు అవస్థయందు మార్చుటకై లేపనములు, నశ్యములు కాపడములు మొదలగు చికిత్సలను ఉపయోగించవలెను. అనగా రోగ బలానుకూలముగా యుక్తచికిత్సలను చేయుట మంచిది. మరియు అతిభోజనము వలన ఈరోగము కలిగినచో గరిష్టభోజన పదార్థములు వెడలుటకై వమనము చేయించవలెను. ఆమాశయమునకు స్వస్థతనొందించవలెను, మిక్కిలి మద్యపానము చేయుటవలన మత్తుకలిగి ఆమత్తువలన ఈవ్యాధి సంభవించినయెడల అట్టి రోగికి మత్తుతగ్గువరకు వ్యాధి చికిత్సచేయకూడదుగాని మత్తుతగ్గుటకై చికిత్సచేయవలెను. ఈవిషయము సుబాత్ అను వ్యాధియందు కూడా గుర్తించవలెను. మద్యపానముయొక్క మత్తుతగ్గించుటకై వటికి 4 మాషములు నీళ్లయందుకలిపి పానము చేయించవలెను.

—:జమూద్ అను వ్యాధి లక్షణములు:—

ఈవ్యాధికి శఖూస్, అఖ్జహా, ముదరికహా, ఫాతుగస్ మొదలగు నామాంతరములు గలవు జమూద్ అనగా వ్యాధినామము. ఈ వ్యాధిగలరోగి కదలుట, నడచుట, గ్రహించుట మొదలగు జ్ఞానము లు లేనివాడై యుండును అనగా ఈరోగి నిలిచియుండునప్పుడు, కూర్చుండియుండునప్పుడు లేక పరుండియుండునప్పుడు, లేక ఇతరపనులు చేయునప్పుడు యీవ్యాధి తటస్థించిన ఎడల రోగి చేయుపనుల దశయందే యుండును అనగా నిలిచియుండునప్పుడు యీవ్యాధి కనుపించినచో నిలుబడియేయుండును. రోగి కూర్చుండునప్పుడు యీవ్యాధి తటస్థించి

నయెడల కూర్చుండియేయుండును, పరుండు సమయమునందు యీ వ్యాధి తటస్థించినచో పరుండియేయుండునని తెలిసికొనవలెను. మరియు కండ్లువిప్పి చూచుచున్నప్పుడు యీరోగము కనుపించినచో కండ్లువిప్పియేయుండును. కండ్లుమూసికొనియుండునప్పుడు యీరోగము తటస్థించినచో కండ్లుమూతబడియే యుండును. శఖూస్ అను వ్యాధినే జమూద్ అందురు. యీవ్యాధియందు కండ్లు మూతపడకుండుటవలన శఖూస్ అనుపించుచున్నని. మరియు, జమూద్ అనువ్యాధియందు కండ్లుమూతబడియుండును. కాబట్టి అఖ్ జహా మరియు జమూద్ అను వ్యాధియందు కండ్లుమూతబడి యుండును కాబట్టి అఖ్ జహా మరియు, ముగరిశా అనుచున్నారు జమూద్ అను వాక్యమునకు యూనాని భాషయందు ఫాత్ గం అనుచున్నారు. ఫాత్ గం అనుశబ్దమునకు నిశబ్దముగా యుండుటయని భావము యీవ్యాధి వాతజ దోషమలము వలన కలుగుచున్నది. యీమలము మెదడు వెనుకవైపు పొరయందు ఖనీభవించి యుండును గాని మెదడునందు చేరియుండదు. అయినను సంయోగకారణము వలన మెదడుయొక్క సమస్తభాగములయందు కష్టమును కలిగించుచున్నది. యీతరణమునుబట్టి చేష్టలు జ్ఞానము సర్వదా నసించుచున్నవి.

ఈ రోగలక్షణములు యీవ్యాధి అగస్మాత్తుగా తటస్థించుచున్నది. ఉఛ్వాస నిశ్వాసములు లేక ఇంద్రియజ్ఞానము లుడుకుటవలన చూచువారికి ఈరోగి శవమువలె కాన్పించుచుండును.

జమూద్ సుబాత్ యందు ఒకభేదము సుబాత్ వ్యాధియందు రోగికి శ్వాసబంధించును. మరియు జమూద్ అనువ్యాధియందుయిట్లుండక రోగి అతినిద్రకలిగియుండును అనగా అచేతనుడై మూర్ఛరోగివలె కండ్లుమూసికొనియుండును. సుబాత్ వ్యాధియందు రోగికండ్లుమూతబడక విప్పబడియుండును. మరియు సుబాత్ అను రోగి ముందుమూర్ఛ నిదుర క్రమేణ హెచ్చుచుండును. మరియు జమూద్ అనువ్యాధియందు

అగస్ మాత్తుగా మూర్ఛ నిదుర కలుగుచుండును. సుబాత్ అనువ్యాధి యందు రోగి మంథముగను, తినముగనుండును. సుబాత్ అనువ్యాధి యందు రోగికఠినముగా పనులుచేయువాడై యుండును. ఒక్కొకప్పుడు మూర్ఛనిదురయందు పిలిచినప్పుడు పలుకుటకూడా గలదు. మరియు జమూాద్ అనువ్యాధియందు రోగియెప్పుడు పనిచేయలేక అసమర్థుడై యుండును, ఈమొదలగులక్షణముల తారతమ్యములుసుబాత్, జమూాద్ వ్యాధులయందు కనిపెట్టవలెను. వీనిలక్షణముల భేదాభేదములను గమనించి రోగమును విమర్శించి చికిత్సచేయవలెను.

## సక్తా (సన్యాసము) అను వ్యాధి లక్షణములు.

జమూాద్ అనువ్యాధి గలరోగి గొంతులో యేవస్తువుపోసినను గుటకవేయజాలకుండును. సక్తా వ్యాధిగలరోగి గొంతులో యేవస్తువు వేసినను గుటకవేయగలుగును. మరియు సక్తావ్యాధిగ్రస్తుడు వెల్లికిల పడియుండును గాని జమూాద్ వ్యాధిగల రోగిదశ యిట్లుండదు. అందువలన ఈరోగిఅట్లుపడియుండజాలడు. యెందుకనగా ఈవ్యాధి వకేదశ యందుండనేరదు. నిశ్చేష్టిత సంజ్ఞాహీనత గలవాడై యుండును, జమూాద్ అనువ్యాధి సక్తాఅనువ్యాధి సామాన్యముగా వకే విధముగానే యుండును.

## జమూాద్ (శీతజసర్సాం మెదడువాపు) భేదములు.

జమూాద్ అనువ్యాధియందు జ్వరముండదు. సర్సాంవ్యాధి యందు జ్వరము అవశ్యముగాయుండవలెను. యిందుభేదముగలదు. యెట్లనగా జమూాద్ అనువ్యాధియందు రోగి శవాకారము కలిగి నిచ్చేష్టితుడై యుండును. సర్సాం వ్యాధియందు రోగి యిట్లుండనేరడు.

## జమూాద్ వ్యాధి చికిత్స.

మెదడును పరిశుభ్రనొందించుటకై త్రిదోషదుష్టములమును తొలగించునట్టి ఔషధములనుచేర్చి వస్తికర్మచేయవలెను. వస్తిప్రయోగమువలన రోగిప్రకృతికి భంగముకలుగకుండునటుల లక్ష్యముంచవలెను

అనగా శరీరప్రకృతి బలముగానున్నయెడల పాదితీగె, ఖిన్‌పాయీజ్ శంఖపుష్పి కరక్కాయలు, కాబోలు కరక్కాయలు, గారిఖూన్ యీమొదలగువస్తువుల కషాయముతో వస్తిచేయవలెను. మరియు రోగిప్రకృతి దుర్బలముగానుండిన గోధుమపొట్టు, చుకంధరాకులు యీవస్తువులు శీతకషాయముచేసి యీకషాయమునందు నువ్వులనూనె, బూరె ఇర్మని, చేదుపుచ్చకాయ గుజ్జు కలిపి వస్తిచేయవలెను. వస్తియనగా యెనిమా అనిఅర్థము.

మరియు, రోగి చైతన్యుడైన యెడల రోగిబలవంతుడుగానున్నచో మలము వెడలించుటకై మాత్రిలు యారజ్ మరియు, త్రిదోషహారకషాయములు ఇచ్చి మలము వెడలించవలెను.

మరియు, రోగిదుఃఖితుడైనచో చేతనుడైన తరువాత కేవలము మృదువస్తిప్రయోగించవలెను ఈవ్యాధియందు బాబూనా యెండిన జూపా అకలీలుల్ మలిక్ సోయి, అడవినీరుల్లితో చేయబడిన శిరకా, యందుకలిపి తలపై లేపనముచేయవలెను. అనగా తలవెనుకవైపు లేపనముచేయవలెను. మరియు, రోగి చేత పడకుటకు ముందు లేపనము చేయవలెను తరువాత ఈచెప్పబోవు ఉష్ణతైలములను అనగా చంద్రతైలమునందు అడవినదాపాకు, దవనము, మరువము, జున్నుచేర్చి తలపై లేపనముచేయవలెను. మరియు, వ్యాధి దశతగ్గారంభించిన యెడల తేనెతో చేయబడిన గుల్‌ఖందు ఇవ్వవలెను. దాహమునకుగాను నీళ్ళకుమారుగా తేనెనీళ్ళుకలిపి యిచ్చుట వుత్తమము. ఈరోగమునందుపయోగించు వస్తువులు యిందుదహరించినవె యివ్వవలెను. మరియు వస్తికర్మ (ఎనిమా) వలన మలము వెడలించుటవలన హలునాయొక్క తీక్ష్ణత్వమువలన నిదురనశించినయెడల చైతన్యుడైనప్పుడు గోయవెచ్చగానుండు బనప్‌షాతైలము తలపై మర్దించవలెను. మరియు, బాబూనా, సోయి, అకలీలుల్‌మలిక్, గులాబిపూలు, గసాలువిత్తులు, పోస్తుకాయలు, ఈవస్తువులు నీళ్ళలో వేసి కషాయకాచి ఆకషాయమునందు బనప్

షా తైలముచేర్చి తలకు కావడము చేయవలెను. అనగా శిరోజవస్తి చేయవలెనని భావము.

—9. నసియాన్ (మరుపు పుట్టించుట) కారణములు—

స్మరణశక్తి విచారశక్తియందు కలుగు ఉపద్రవములకు నశియాన్ అందురు ఈవ్యాధి మూడువిధములుగానుండును. (1) జికరి (మరుపు నుకలిగించు)వ్యాధిలక్షణములు. జికరి అను వ్యాధియందు బాహ్యేంద్రియములు వరావస్తువికి కలి ఆరోగ్యముగానుండును మరియు చూచుటకు వినుటకు యేమాత్రకు వీలేకుండునుగాని వినిన మాటను చూచినవస్తువును రోగి శీఘ్రముగా మరచిపోవును. ఈజికిర అను వ్యాధి రెండువిధములు (1) స్మరణశక్తినష్టమగుట (2) కేవలము స్మరణశక్తియందు హానికలుగుటవలన ఈవ్యాధికలుగుచున్నది. మరియు, ఈవ్యాధియందు రెండు ఉపద్రవములుగలవు. (1) మెదడు వెనుక భాగమునందు పైత్యము జలుబు విశేషముగా చేరియుండును గాని నిలువజాలకుండును. యెటులననగా ఆటంకపరచుట నిలుచుట మొదలగునవి. సామాన్య శుష్కత్వమువలన కలుగునుగాని ఈవ్యాధియందు శుష్కత్వము జలుబుయొక్క విశేషత్వమువలన అసనిజదశయందుండనేరదు. అట్టి స్తితియందు స్మరణశక్తి నష్టదావరిచేయకుండును. మరియు, హేతువు యొక్క న్యూనాధిక్యానుబట్టికలుగగలదు. దీనిలక్షణములు నిదుర అధికముగా వచ్చుచుండుట తల వెనుక భాగము బరువుగానుండుట మెదడునుండి మలము ఎల్లప్పుడు వెడలుచుండుట మొదలగు లక్షణములు కలిగియుండును.

—నసియాన్ (1)వ భేదము జికరి చికిత్స—

మెదడునందుగల మలమును దూరపరచుటకై తీవ్రమైనవస్తి (ఎనిమా) కర్మచేయవలెను. ఈవస్తియందు కంతరియూన్ గుగ్గిలము జావబీగు (దుర్వాసనగల ఒకజిగురు నిది లోభాగము తెల్లగను పైభాగము మెరిగానుండును) బూరెయిర్మని, చేదుపుచ్చకాయగుజ్జు పొంద

లగు వస్తువులను నూరి చేర్చి వుపయోగించవలెను. దీనివలన రోగము శమించకుండిన మెదడునకు స్వళ్ళతనొందించుటకై యారజ్ పైకరా మరియు, కషాయములను పానముచేయించవలెను.

మరియు, ఆనాలు, నల్లజీలకర్ర, అక్కలకర్ర, యీవస్తువుల క్వాథమునందు తేనెచేర్చి పుక్కిలిం చవలెను. అథవా, తెల్లతెగడ, జున్ను మెత్తగానూరి వాసనచూడవలెను. దీనివలన తుమ్ములు కలిగి మెదడు శుభ్రతనొందించుటయందు మిక్కిలి లాభదాయకము గాని హుకనా (వస్తి) విరోచనమునకు యిచ్చినతరువాత నశ్యకర్మ చేయవలెను. మరియు, సంపూర్ణముగా మెదడు స్వళ్ళతకలిగిన తరువాత ప్రకృతి నిజదశయందు మార్చుటకై బూరెయిరమని, జున్ను, ఆవాలు, సదాపాకు ఈవస్తువులను, అడవినీరుల్లి గడ్డలతో చేయబడిన శిరకాలో నూరి సునాముఖితైలమునకలిపి తలవెనుకభాగమునందు లేపనము చేయవలెను.

మరియు, జున్ను, సౌసన్ తైలమునందుకలిపి తలకు మర్ధనచేయవలెను. ఉష్ణమును కలిగించునట్టి మాజూన్‌లయందు నల్లజీడిగింజలు, వస, చేర్చి సేవించవలెను.

ఉష్ణమాజూన్ చేయు విధానము

నల్లజీడిగింజలు, 31½ మాషములు. ముసాంబరము 270 మాషములు. గారీఖూన్ 105 మాషములు. ముద్దలవంగపట్ట, వస, జరావంద్, కుంకుమపువ్వు, దాల్చినిచెక్క, రూమిమస్తకి ఈవస్తువులు ప్రత్యేక ప్రత్యేకముగా 27 మాషములు. పాచితీగె 31½ మాషములు. ఈవస్తువులను చూర్ణించి వస్త్రఘాలితమొనర్చి మాత్రపాకముగా తేనెచేర్చి మాజూన్ (అవలేహ్యము) చేయవలెను. ఈమాజూన్ అనేక వ్యాధులయందు ఉపయోగించును.

(సూచనీయము) శిరకా, శికంజబీన్, అడవి నీరుల్లితో చేయబడిన శిరకా మొదలగు వస్తువులు యీవ్యాధియందు మిక్కిలి ఉపయోగమని గ్రహించవలెను.

మరియు, మెదడు వెనుక భాగమునందు జలుబు శుష్కత్వము యొక్క విశేషత్వమువలన కలుగుదోషము మైనమువలె కఠినముగా నుండును. ఈ కారణమునుబట్టి యేమాటకూడ అందునిలువకుండును. ఈ రోగము ముందు వ్యాధికంటె స్వల్పముగానుండును.

## —ఉక్తరోగలక్షణములు—

నిదురపట్టకుండుటకు మెదడు వెనుక భాగము శుష్కించుటవలన కలుగుచున్నది. దీనిలక్షణములు రోగి కఠినత్వమువలన ఆగి ఆగి మాట్లాడుట, మాటకీసుగా, బొంగురుగా వచ్చుచుండుట, తల వెనుకభాగము పీకినటులుండుట యీమొదలగు లక్షణములు కలిగియుండును.

## —ఉక్తరోగ చికిత్స—

మెదడునకు ఉష్ణము, చెమ్మకలిగించుటకై కోడిమాంసరసము పక్షులపిల్లలమాంసరసము నిప్పించవలెను. మరియు, తత్సామానమగు పదార్థములు సేవించవలెను. మరియు, ఆవుకాలి మూలుగ, బాదంనూనె, బాబూనా తైలము మొదలగునవి తల వెనుకభాగమునందు మర్దించవలెను. మరియు, బాబూనా, అలసివిత్తులు, బనప్షా, ఈ వస్తువులు కషాయముకాచి తలకు కాపడము చేయవలెను. ఒక్కొకప్పుడు ఈరోగము సాధారణ జలుబువలన ఉత్పన్నమగుచున్నది. దీనిలక్షణములు ఉక్తమగు రెండింటిలక్షణముతో సమానముగానుండును. దీని చికిత్సకూడా పై వ్యాధితో సమానముగా చేయదగును.



# చింతవలనకలుగు వ్యాధి లక్షణములు



చింతయనగా అనేకకారణములుగలవు. అనగా విచారశక్తి యనుమానశక్తి, ధ్యానశక్తి, బోధశక్తి, మొదలగు యీశక్తు వలన చింతయనుపేరు కలిగినది. యీరోగమందు ఆలోచించవలసిన అంశమేమనగా యేకారణముచేత విచారము కలిగినదని ఆలోచించవలెను. యీవిచారమువలన మెదడునకు బలము తగ్గిపోవును. అథవా ఏకారణమువలన విచారము కలిగినను జ్ఞానశక్తి నశించును. అనగా యిచ్చట సింహమున్నదని భీతిన్ని, యిచ్చట తల్లి, తండ్రి యున్నారనే ధైర్యము ఇత్యాదిధ్యానములు బాహ్యేంద్రియములద్వారా స్మరణశక్తి గ్రహించి గొప్పగొప్ప ఆలోచనలు అనగా సింహముయొక్క భీతియు మాతాపితాయొక్క ప్రేమాతిశయమున్ను మొదలగునవి స్మరణశక్తిద్వారా బుద్ధియందు ప్రవేశించును. యీయంశము అనగా సంతోషముకంటె విచారము మిక్కిలి భీతిగలదగుటవలన విచారశక్తి ఏకాగ్రతనొంది యేమియు ఆలోచించజాలకుండును గాన ఆఅంశమును వదలివేయును. యీవిధమగు ఉపద్రవములకు చింతయొక్క ఉపద్రవములందురు. మరియు తల్లిదండ్రులను చూడనప్రేమకంటె సింహమునుచూచినభయము గొప్పదిగాన విచారమువలన స్మరణశక్తి యితరయంశములను ఆలోచించజాలకుండును.

ఇట్టిఉపద్రవములు 4 విధములు (1) మెదడుయొక్క మధ్యపొరయందు బుద్ధినివాసస్థానము యీస్థానమునందు చెమ్మ జలుబు ప్రవేశించి యచ్చటనుండునట్టి విచారశక్తి శీతప్రకోపమునొంది హీనమగుటవలన విచారహీనమగుచున్నది. యెటులనగా శక్తి మెదడుయొక్క మధ్యభాగమునందు అనగా తననిజస్థానమునుండి మెదడుయొక్క వెనుకభాగమునకు జరుగుచున్నది. అచ్చటినుండి తిరిగి నిజస్థానము అనగా

మెదడుమధ్యభాగమునకు చేరుచున్నది. ఇటుల దిగుట యెక్కుటవలన విచారక్రియ వుత్పన్నమగుచున్నది. మరియు స్వాభావికమగు వృష్ణము లేనిది స్వభావికమగు గమనశక్తి కాజాలదని గ్రహించవలెను. యీకారణమువలన మెదడుయొక్క మధ్యభాగమునందుండు పొరయొక్క పరికృతికంటె దీనివెనుక నుండునందు పొరలయందు వృష్ణము స్వల్పముగా నుండును. మరియు వృష్ణముకలుగుటవలనగాని లేక పురాతనవ్యాధివలనగాని యీపొరలయందుండు వృష్ణముశించును అట్టిస్థితియందు అవశ్యముగా విచారశక్తియందు వుపద్రవముకలుగుచున్నది. యీవిచారశక్తియందు వుపద్రవము వుత్పన్నమైనయెడల సర్వదా నష్టము కలుగుట విచారశక్తి కలుగుట హేతువుయొక్క న్యూనాధిక్యతవలన కలుగుచున్నదని గ్రహించవలెను.

(2) జలుబు శుష్కత్వముతోచేరి మెదడుమధ్యపొరయందు ఘనీభవించుటవలన నచ్చుట వుపద్రవముపుట్టుచున్నది.

(3) సాధారణజలుబు మెదడుయొక్క మధ్యపొరయందు చేరుటవలన యీవ్యాధికలుగుచున్నది.

4. మెదడునందు, ఉష్ణపరికోపము అధికమై విచారశక్తియందు ఉపద్రవమును పుట్టించును అనగా ఇట్టిదశయందు మస్తిష్కసంబంధమగుకార్యములయందు తందరకలుగుచున్నది. కాబట్టి విచారశక్తియందు వుపద్రవముకలుగుచున్నది. దీనిపరిత్యక్తలక్షణములు పైనవుదాహరించియున్నాము. మరియు యీవ్యాధి యేకారణమునుబట్టి కలిగినదో ఆకారణమును గమనించి చికిత్సచేయవలెను. దీనివుపద్రవమునందు రెండవ మెదడుయొక్కవ్యాధియందు పలుమారు వచించియున్నాము. ఈ చింతయొక్క వుపద్రవమునందు లేపనలు మర్దనలు మొదలగునవి మెదడుమధ్యభాగమునందు చేయవలెను. యిందుండి కొద్దిలక్షణములు కూడా తోచగలవు. అనగా వ్యాధికారణము జలుబు వాతమువలన కలిగినయెడల తలమధ్యభాగమునందు బరువుగానుండుట మరియు శుష్కము

వుష్ణముగల శిరోవ్యాధియందుగలుగు లక్షణములు కలిగియుండును. దుష్ప్రకృతియనగా సాధారణముగా గాని దోషయుక్తముగాగాని యుండిన యెడల ఆయాదోషానుసారముగా చికిత్సచేయవలెను.

(లాభము) చింత (విచారము) యొక్క వుపద్రవమువలన స్మరణశక్తి నశించజాలదు. యెటులనగా గుర్తును మరచుట అనియుందురుగాని దీనినిజయర్థము తోచకున్నది. అప్పటికప్పుడు గూఢార్థముల ఫలములుచెప్పుట విద్యాసంబంధమగు యర్థమును గ్రహించుట మొదలగునవి వేదశక్తియొక్క హీనదశవలన కలుగజాలదు, యిందువలన సాధారణ విధివలన యీరోగమును నసయాన్‌భేదమని గ్రహించితిని. మరియు సాధారణముగా అనేకవైద్యవరులు యీవిచారహీనతను యీవ్యాధి స్వాభావికముగా హానుల్, మరఖన్‌త్, యని వచించుచున్నారు. మరియు విద్యాసంబంధమగు గూఢార్థములు గ్రహించుటయందు మరుపు కలిగియుండిన దీనిని బలాదత్ యందురు.

(సూచనీయము) ప్రత్యక్ష స్మరణశక్తియందు మరియు విచారశక్తి కర్మభేదము విశేషముగాతోచుచున్నది. దీనివలననే వృథక్ వర్ణించుచున్నాను. స్మరణశక్తియొక్క పనియేమనగా విచారశక్తి సూక్ష్మార్థమును బాహ్యేంద్రియములద్వారా తనయొద్దకు నీడ్చుకొని వానినిజ్ఞాపకముంచుకొనియుండును. అనగా దృష్టి సింహమునుజూచిన భీతివలన విచారశక్తి యచ్చట శత్రువు యున్నదని చెప్పినది. యీశత్రువుయొక్క యర్థము మాత్రము స్మరణశక్తి జ్ఞాపకముంచినదిగాని తక్కిన యావత్తు సంగతులు జ్ఞాపకముంచుట బాహ్యేంద్రియములద్వారా వెళ్ళినట్టి అథవా వానియొక్క సంపూర్ణయర్థమును జ్ఞాపకముంచుట అనగా (సింహముయొక్క రూపము, సింహమునందు శత్రుత కావడము) స్మరణశక్తి పనికాదు. స్మరణశక్తియొక్కపని కేవలము జ్ఞాపకముంచడము మాత్రమే. యెటులనగా సంపూర్ణయర్థమును తెలిసికొనుట దోషబుద్ధి పనిఅయియున్నది. మరియును మనుజుడు దీనియొక్క జ్ఞాత అయియున్నాడు.

బాహ్యేంద్రియము ద్వారా తెలిసికొను వస్తువులను రక్షించుట విచారశక్తి పనిఅయియున్నది. యిట్లుపైన వివరించబడియున్నది.

లేప చేతః విచారముల లక్షణములు.

ఈవ్యాధి రెండువిధములు (1) విచారపనులయందు మార్పులము చాలివచ్చుట, [2] విచారము సర్వదా మిథ్యయగుట, మరియు విచారము బాహ్యేంద్రియముల ద్వారా గ్రహించుట యిట్లుగ్రహించు అంశములను యీజ్ఞానేంద్రియములద్వారా మిళితమై యీయట్టిఅంశములను స్థిరపరచుట, యీమొదలగుపనులు విచారశక్తివలన కలుగుచున్నవి. దీనిని ఫసవి తఖయ్యుల్ యనుచున్నారు. విచారపనులయందు స్వప్నములు స్వల్పముగావచ్చుట ఒకవేళస్వప్నము చూచినను మేలుకొనిన వెంటనే మరిచిపోవుట, యీస్వప్నవిషయములుకూడా యింద్రియములద్వారా విచారశక్తికి చేరవలయునుగాని విచారశక్తి జ్ఞాపకముంచజాలకుండును. విచారశక్తి నష్టమగుట, కారణము తెలియని స్వప్నములు కనుపించకుండుట వకవేళ స్వప్నముచూచినను కథాపిజ్ఞాపకముండకుండుట, మరియు బాహేంద్రియముల ద్వారా దీనిపదార్థముల జ్ఞానము ఆయినది. వేరగుచు, అట్టిస్వప్నములను మరిచిపోవుట జ్ఞాపకములేకుండుట చూచినవస్తువును మరచిపోవుట, చేసినపని మరచుట మొదలగునవి.

మరియు ఈవ్యాధి యొక్క హేతువు లక్షణములు చికిత్సమొదలగునవి వెనుకస్మరణశక్తినాశనమునందు చెప్పబడియున్నవి. గానవిచారమునందు ఉపద్రవములు బహుదాశుష్కత్వమువలన కలుగుచున్నవి. స్మరణశక్తియందు రతూబత్ (నీరు) వలన వుత్పన్నముగుచున్నవి. మరియు ఈవ్యాధియందు లేపనలు, మర్దనలు, శిరోవస్తి మొదలగునవి ప్రయోగించవలసినఎడల తలముందుభాగమునందు ప్రయోగించవలెను. ఎటులననగా తలముందుభాగము ఈరోగస్థానము మరియు, విచారమునందు ఒకవిధమగు వుపద్రవము కలుగుచున్నది. ఈవుపద్రవముకలిగినవ్వాడు

మనుజుడు అదేధ్యాసగాయుండును మరియు లభించనట్టి వస్తువును చూచుచు అట్టివస్తువు సనుకూడనందున తానుచూచునట్టి మనుష్యుడు సగము మనిషిగను, సగము గుఱ్ఱముగను, అథవా తలలేనిమనిషిగను, లేక రెండుతలలుగల మనిషిగను కనుపించును. ఇట్లుకనిపించుటకు విచారించునట్టిశక్తి తగ్గుటవలన సర్వదానష్టముకలిగిన కారణమువలన కాదుగాని ప్రకృతియందు కేడరవలన ఇట్టిదుమువద్రము కలుగుచున్నది దీనికారణము సర్వదా ఉష్ణముయొక్క దుష్టప్రకృతి అనగా పిత్తప్రకృతి మెదడుయొక్క ముందుభాగమునందు విశేషముగా చేరియుండుటవలన మెదడుముందుభాగము వృష్ణముగానుండుట, ముక్కుఆరిపోవుట, ఈకారణమువలన, అనేకవిధములగు వర్ణములు, ధ్యానములు, పనులు, మొదలగునవి, విచారణమునందు వచ్చుచుండును.

మరియు అనేకవిధములు, రంగులను కలిగించుచున్నది. మరియు సాధారణదోషయుక్తమగు, ఈవ్యాధిని అనేకపర్యాయములు వర్ణించి యున్నాను.

3వ వెఱుచారకముల చికిత్స.

సాధారణ ప్రకృతియందు ప్రతిదినము ప్రాతఃకాలమునందు ప్రకృతి స్వస్థానపరచుటకై, బనప్షామరబతు, కలువపూలమరబతు, పన్నీరు, బేదానాగుజ్జు, ఈమొదలగువస్తువులను చల్లనినీళ్ళయందు కలిపి పానముచేయించవలెను. మరియు దోషయుక్తవ్యాధియందు ముందుగా మృదువస్తిని చేయవలెను. మరియు కరక్కాయకషాయమువలన మలము వెడలించవలెను. అటుపిమ్మట ప్రకృతిని నిజఅవస్థయందు మార్చుటకు చికిత్సచేయవలెను.

[లాభము] మెదడుశక్తిజీవనరసలద్వారా సర్వశరీరమునందు ఆక్రమించుచున్నది. దైవకృపవలన సర్వశరీరచేష్టలు కలిగించుచున్నది. ఈశక్తి రెండువిధములు [1] మునరితా [అనుసంధానముచేయుశక్తి (2) మహర్రికా, తిరుగుట, నడుచుట, మొదలగుకార్యములను కలిగించుశక్తి.

### (అనుసంధానశక్తి) లక్షణము

ఈ ముదరికా (అనుసంధానము చేయునట్టిశక్తి) కూడా రెండువిధములు (1) ప్రత్యక్షపదార్థములను బోధయగుట దీనిని బాహ్యేంద్రియములందురు. ఈ యింద్రియములు అయిదు (1) దర్శనేంద్రియము (2) ఘ్రాణేంద్రియము (3) రసనేంద్రియము (4) శ్రవణేంద్రియము (5) స్పర్శేంద్రియము. (2) ఈ శక్తివలన రహస్యకార్యములు బోధయగుచుండును. వీనినే అంతరేంద్రియములందురు. ఇవి కూడా అయిదుగా విభజించియున్నారు గాని వానిని యిచ్చట చెప్పనవసరములేదు. ఇట్లు ఇంద్రియములు 10 అనుసంగతి సర్వత్ర తెలిసేయున్నది. మరియు, గుప్తేంద్రియములనుండి మొదటి యింద్రియమునకు ముస్త్రికి అందురు. ఇది ప్రత్యక్షయింద్రియములద్వారా కనిపెట్టగల శక్తి కలిగియుండును. అనగా బాహ్యేంద్రియముల శక్తిని నిగ్రహించు శక్తికలిగియుండును. యీకారణమువలననే దీనిని ముస్త్రిక్ అందురు. ముస్త్రిక్ అనగా మెదడుముందు భాగము రెండవది విచారశక్తి ఇది ముస్తరిక్ అను కోశము అనగా విచారశక్తిని ఆక్రమించియుండును. ఇది మెదడుయొక్క ముందు పొర వెనుక భాగము. మరియు, రెండుశక్తులు రెండు మెదడు ముందు భాగములయందున్నవి. విచారశక్తియొక్క కారణములు ముందువర్ణించియున్నాను గాన గ్రహించుదురుగాక దీనిని ముదరికా అనుచున్నారు.

### ఖువ్వతె ముతకయ్యాల్

దీనిని మునద్రిఫాయునిఅందురు యెటులనగా ఈరెండును ప్రత్యేక్షఇంద్రియములద్వారా విచారశక్తియందు చేరుచున్నవి. అనగా విచారశక్తియందు ప్రవేశించి ఆకారములను సమకూర్చుచున్నవి. ఈవిషయమును ఈక్రిందవివరించిన విధముగాగమనించవలెను. అనగా ఒకవిద్యమాన పదార్థమునందు అవిద్యమాన పదార్థమును కలుపవలెను. అనగా ఏమనుష్యునికి రెండుతలలున్నట్లు లోచునో అథవా వానిని దూరపరుచవలెను అనగా అట్టిమనుజుని అడిగి దూరపరుచవలెను.

ఇవ్విధముగా ఈవ్యాధి ఉపద్రవములను వర్ణించబడినవి. మరియు యీకార్యములు చంచలచిత్తము, ధ్యానము మానుట, మాటలను పరీక్షించుట, సూక్ష్మార్థములను గ్రహించుట, మాంద్యము మొదలగునవి కలిగినప్పుడు తెలుసుకొనుచున్నవి. ఎటులనగా బుద్ధి శరీరముయొక్క ఆజ్ఞను అతిక్రమించును. అట్టిస్థితియందు ఈవ్యాధి ముతఫిక్కిరా అనిపించును. మరియు దీనిశక్తిని నఫ్సానాల్ అను అర్థము కలిగినది. ఈవ్యాధి ప్రాణి గలప్రతి జీవులకు మనుజునితప్ప ఇతరజీవులకును, తెలుగనేరదు. ఇందువలననే ఖువ్వతెముతఫక్కిరా అనగా విచారశక్తి మనుజునికితప్ప ఇతర యేప్రాణికిన్ని, కనుపించుటలేదు. మరియు చింతయొక్క వుపద్రవమును మరల చెప్పుచున్నాను. ఈశక్తిస్థానము, అనుమానము, ధ్యానము, ఈరెండింటిమధ్యనున్నది.

## ——4 అనుమానశక్తి——

అనుమానమునందుగల శక్తి సూక్ష్మార్థములు ప్రత్యేక ఇంద్రియముల సంబంధమునందుంటూయున్నదని గ్రహించవలెను. అనగా బంధువుని బంధుత్వము, విరోధియొక్క విరోధము, ఈశక్తికారణములు. మరియు ఈశక్తిస్థానము మెదడు సంబంధమగు మధ్యభాగముని గ్రహించవలెను,

5. ఖువ్వతెహాఫజా (విచారించునట్టిశక్తి) ఇది అర్థములను జ్ఞాపకముంచుకొనుచుండును. మరియు, విచారశక్తి మనస్సుయొక్క చాంచల్యమువలన ఉత్పన్నమగుచున్నది. మరియు, ఖువ్వతెహాఫజా అను శక్తి మరచినవస్తువులను, మాటలను, జ్ఞాపకముంచుటవలన దీనిని ముతజిక్కిరా అని కూడా చెప్పుచున్నారు. మరియు. ఖువ్వతెహాఫజా, ముతవహీమా ఇవి మరియు, ముయొఖయ్యాల్ యొక్క నిక్షేపము అయియున్నది. దీనిస్థానము మెదడుయొక్క వెనుకభాగ గాన మెదడు యొక్క భాగలను వెనుక చెప్పియున్నాను.

—ముహర్రికాలక్షణములు—

ముహర్రికా అనునది రెండువిధములు (1) బాయిసా (2) ఫాయిలా. బాయిసా (ప్రేరేపణశక్తి) అనునది రెండువిధములు (1) సహ్వాని (2) గజబీ. సహ్వాని అనుశక్తి లాభకార్యములను ప్రేరేపించుచుండును (2) గజబీ అనుశక్తి హానిని దూరపరచుటకై ప్రేరేపించుచుండును. మరియు, లాభము హాని సామాన్యముగా నిశ్చయమైన యెడల విచారశక్తియొక్క ఆధీనమగును. ఫాయిలా అనుశక్తి నరముల యందు చేరియున్నది. అందువలన నరములు కీళ్ళను ముడుచుకొనును. మరియు, నరములు బలహీనతను చెందును. మరియు, బంధింపబడును. మరియు, చాచబడును. ఇట్టి కారణము వలననే శరీరఅవయవములు నడుచుటకు, తిరుగుటకు, కదలుటకు వీలగుచున్నవి. యీకార్యములయొక్క శక్తి బాయిసా ఆధీనమునందున్నది.

## మాలీఖోలియా లక్షణములు.



ఈవ్యాధి మనస్సుయొక్క విచారప్రకృతి అనుసారముగానుండదు. మరియు, ఈవ్యాధి వాతప్రకృతిగలవానికి తప్ప ఇతరులకు కలుగనేరదు. కొందరువైద్యవరులు యీవ్యాధిని మాలీఖోలియా అని వచించుదురు. పూర్వము యూనాని దేశవైద్యవేత్తలు యీవ్యాధిని మైలేకలియా అను పేరుపెట్టియున్నారు.

ఈరోగముయొక్క సంపూర్ణకారణములు అనగా మెదడునందు యావద్రిముకలిగి మెదడుసంబంధమగు కార్యములు హీనమై మెదడునందుగల నీర్సమువలన మెదడుచేయు కార్యములయందు భంగముకలుగును. ఇట్టిస్థితియందు హేతువుశక్తి దుర్బలమగును. ఈకారణము వలన తొందరవుత్పన్నమగును. మరియు, యీవ్యాధియొక్క ప్రధాన

కారణము ప్రకృతికవాతమా లేక అప్రకృతివాతమా అని ఆలోచన చేయవలెను.

ప్రకృతికవాతమనగా పసిత్తే దోషము కాకుటవలన వుత్పన్నమగుచున్నది. మాలీఖోలియా అను వ్యాధి తన హేతువుయొక్క వేరు వేరు స్థానముల కారణములవలన మూడుభేదములుగా విభజింపబడినది. (1) తల తప్ప తక్కిన సంపూర్ణ శరీరము దోషయుక్తవాతమువలన గాని లేక నిర్దోషవాతమువలన గాని నిండిన యెడల నల్లని ఆవిరి పరమాణువులు దేహమునుండి మెదడుపైపునకెక్కి యీవ్యాధిని పుట్టించుచుండును. తబయి (ప్రకృతి) వాతదోషమువలన దగ్ధముకాదు గాని ప్రమాణముకంటె వాతము అధికమైన యెడల దీనిని వాతబయి (అప్రాకృతిక వాతము) అనుచున్నారు. మరియు, ఏదోషమైనను తన స్వభావిక ప్రమాణముకంటె హెచ్చుకాకూడదు. సమానముగా యున్నచో వ్యాధి కలుగనేరదు. సర్వశరీరమునందు వాతమునిండి యుండుటవలన కలుగు యీవ్యాధి సంపూర్ణలక్షణములు అనగా శరీరము చిక్కిపోవుట, శక్తి హీనమగుట మొదలగు లక్షణములు కలిగియుండును. యీవ్యాధికలుగుటకు పూర్వము యీరోగి క్షారము, లవణము, చేపలు, వంకాయ మొదలగు వాతకారకపదార్థములసేవన విశేషముగా చేసియుండుటవలన యీవ్యాధి ఉత్పన్నమైనదని గ్రహించవలెను. మరియు, నాడి కఠినముగను నానావిధములుగానుండు. యీవ్యాధిదశ నాడిస్థితి ఒకటికొకటి సంబంధము లేకుండును. మరియు, శరీరరంగు నలుపుగను మూత్రము తెల్లగనుండును. మరియు మూత్రముయొక్క స్వచ్ఛత పక్వమునకు ముందు తెల్లగను, పక్వంబైన వెనుక నల్లని రంగుగా మారును. యీవ్యాధి సాధ్యమైనది. యెందుకనగా దోషము విశేషముగా యేఅవయవమునందు నిలువకుండును కాబట్టి యితర దోషసంబంధములవలన కలుగు వ్యాధులకంటె ఇది సాధ్యమైనదని గ్రహించవలెను.

మరియు ఈవ్యాధియొక్క సూక్ష్మలక్షణములు హేతువానుబంధముగా కలుగుచున్నవి. అనగా అరచుట, కేకలువేయుట, నవ్వుట, ప్రసన్నత్వము, కండ్లుయెర్రగానుండుట, నాడిచంచలముగానుండుట, ముఖము శరీరము యెరుపు కలిసిన నలుపురంగుగా నుండుట మొదలగు లక్షణములు కలిగియుండును. ఈలక్షణములు యావత్తు కలిగినప్పుడు రోగివెర్రివానివలెనుండును. యిట్టిస్థితియందు రోగిశరీరమునందుండు రక్తము ఆరిపోవును. కాబట్టి వెంటనే రోగిశరీరమునందు వుష్ణము చెమ్మ కలిగించు నుపాయములను చేయవలెను. రక్తమునందు నీటిభాగము వుష్ణము కలుగునటులచేయుటయే ముఖ్యావశ్యకము యెందుకనగా రక్తము దోషమువలన దగ్ధముండుటయే ఈవ్యాధికలుగుటకు హేతువని తెలిసికోవలెను.

మరియు ఆలోచించుట, చింతించుట, భయపడుట, చెడుఆలోచనలుచేయుట, వంటిగా నివశించుట, ఈమొదలగునవి అప్రకృతికవాతలక్షణములని తెలిసికోవలెను. మరియు ప్రకృతికవాతము దహించుటవలన ఈవ్యాధి వుత్పన్నమగుచున్నది. మరియు ప్రకృతి సంబంధమగు వాతము దహించబడుటకు కారణము అప్రకృతికవాతము ప్రవేశించుటవలన పూర్వము శరీరమునందుండువాతము దగ్ధమై ఈవ్యాధికలుగుచున్నది.

మరియు మిక్కిలి తేజత్వము, మనస్సుమారిపోవుట, కేకలువేయుట, కంగారుపడుట, మేలుకొని నిద్రలేకుండుట కొద్దిగాభయపడుట క్రోధము విశేషముగానుండుట రోగిశరీరము చేతితోతాకుటవలన వేడిగా నుండుట శరీరము పచ్చగానుండుట పశువువలెచూచుట పిచ్చిచేష్టలు యీమొదలగునవికూడా వాతలక్షణములని గ్రహించవలెను.

పిత్తము దగ్ధమైయుండుటవలన యీవ్యాధికలుగుచున్నది. మరియు యీవ్యాధి ఆరంభదశయందు శుష్కత్వము వుష్ణము కలిగించు నుపా

యములను వ్యాధికి పూర్వమువేసియుండుటవలన ఈవ్యాధికలిగినదని గ్రహించవలెను.

మరియు ఉన్మత్తరోగమని చెప్పబడుచున్నది. ఈవ్యాధి జాగ్రత్తగా చూడతగినది. యీవ్యాధి హిందోషమువలన వుత్పన్నమగును. ఈవ్యాధిలక్షణములు ఇటు అటు దిరుగుట నగుగుట ఆకాసమును చూచుట తీక్ష్ణముగా నుండుట, భయపడుట రోగశరీరము తాకిచూచినచో వుష్ణము తక్కువగా నుండుట ఈమొదలగునవి వాతజ లక్షణములు. ఈవ్యాధి కఫము దహించుటవలన కలుగుచున్నది.

దోషములు దగ్ధమగుటకు కారణములు.

దోషములు దహించుట యెట్లనగా అటోమప్రకృతియందువుష్ణము ప్రవేశించుటవలన అచ్చటిలఘుభాగము నష్టమగుచుండును. ఆస్థానము నందు దోషము ఖనీభవించి శ్లేష్మము చిక్కబడి దగ్ధమైయుండివాతముగా మారునని వైద్యవరులు వచించియున్నారు.

మాలీఖోలియా చికిత్స.

ఈవ్యాధియందు హాఫై అందామ్ (చేతితర్జనిశ్రేలునుండి పైకి వెళ్ళునట్టి నరము) మరియు బాసలిక్ (మధ్యమశ్రేలుమండి మోచేతివరకు వెళ్లునట్టినరము) యీరెండు నరముల ఛేదించి రక్తమోక్షముచేయించవలెను. మరియు స్త్రీలకురుతు రక్తము నిలిచిపోయిన మొదలరక్తజమాలిఖోలియా [వున్మాదము] వుత్పన్నమగుచున్నది. కాబట్టి యిట్లు కలుగు వ్యాధియందు సాఫిక్ [కాలినరము] నరమును ఛేదించి రక్తమును వెడలింపజేయవలెను. మరియు బనఫ్షా కలువపూలు, గాజుబాన్, యీ వస్తువులు ప్రత్యేకము 10న్నర మాషములు ఉన్నాబ్ 7 కాయలు సపిస్తాన్ 20 గింజలు. కలకండ 35 మాషములు. యీవస్తువులు కషాయము కాచి షర్బతు చేయవలెను. యీషర్బతును రోగికిప్పించవలెను. దీని వలన దోషముపక్వమై మెత్తబడును. పిదపరి ఆకాశవల్లి కషాయము లనుతీసి వడియబోసి పూర్వవిధిగా మలము వెడలించవలెను. మరియు

చెమ్మను కలిగించునట్టి పణ్యశాలలు, పండ్లు, అన్యపదార్థములు సేవించ వలెను. మరియు గోరువెచ్చని జలముచేత స్నానముచేయించవలెను.

1. మరియు స్నానముచేయుట మూడువిధములుగా వైద్యవరులు విభజించియున్నారు 1. స్నానము సామాన్యముగా చేయుట. అనగా విస్తారముగ నీళ్ళుపోసికొనుట, దీనిని శిరఃకారక స్నానమందురు 2. స్నానమునందు విశేషకాలముండుట దీనివలన రోమఛిద్రములు వికసించి చెమట మొదలగు మలములు తీసివేయును. నీళ్లు శరీరముపై తక్కువగా పోసికొనుటకు హమ్మామ్ యూనీబ [శుష్కకారకస్నానమందురు.] దీని విషయమై ముందు వివరించబడును. 3. నీళ్ళను విశేషముగా శరీరముపై పోయబడిన స్నానముచేయుటవలను విశేషఆలశ్యముగా యుండినయెడల సమస్నానమందురు. యీ మొదలగు స్నానములలో సామాన్యస్నానము చేయించుటవుత్తమము. మరియు మేకపాలు తలపై పోయించవలెను. మరియు బనప్షా, కలువపూలు, కాహుబీజములు, నలియగొట్టిన యావలు పోస్తుకాయలు, గులాబిపూలు, బాబూనా, యీవస్తువులు కషాయముకాచి పెద్దపాత్ర నిండించి ఆపాత్రయందు రోగిని కంఠమువరకు మునుగునట్లు కూర్చుండబెట్టవలెను అథవా బనప్షా, కలువపూలు, మొదలగువాని తైలములను నశ్యము వేయవలెను. యీతైలమును శరీరముపై లేపన చేయుట మిక్కిలి వుత్తమము.

మాలీఖోలియా పథ్యములు.

భోజనద్రవ్యములలో కోడిమాంసము, మేకపిల్లమాంసము, పాలకూర, బాదంనూనె, బాదంపప్పు, మొదలగువస్తువులున్ను ఈవస్తువులతో సమానగుణముగల ఇతరపదార్థములున్ను, అవశ్యకతాను సారముగా రోగికిప్పించవలెను. మరియు సారాంశమేమనగా, నూన్యాధిక్యమగునట్టియును, మధురపదార్థములు తప్ప, లవణరహితమగు పదార్థములున్ను, స్వాదిష్టభోజనములను రోగికిప్పించవలెను. మరియు, మర్బతుకంటువలనవగానుండు పాలూరా(యవాగు)లను అనగా బాదంనూనె, చెక్కెర,

చేర్చి ఇచ్చుట ఉత్తమము. మరియు, ఆవుపెరుగు, వుచ్చకాయ, దోసకాయ, తియ్యని అంగూరుపండ్లు, తియ్యని శేవు (యాల్) కర్బూజాకాయలు ఈమొదలగునవి కూడా ఈవ్యాధియందు హితకరములు. మరియు ఈరోగచికిత్సలన్నిటికంటె రోగికి వ్యాయామము మొదలగు శరీరకష్టములు లేకుండా విడుచుటయె మిక్కిలి లాభదాయకము. రోగిని పనులుచేయకుండునటుల శాంతముగా నుండునటుల హాయిగా నుంచి కథలు, సంతోషమును గలిగించువనులు మొదలగువానివలన రోగిని ఉల్లాసపరచవలెను.

### పాచితీగె కషాయము చేయువిధానము

కాబోకలుంబకాయలు, ఉస్తెఖుద్దూస్, నిర్విషము, దాక్షపండ్లు, ఇవిప్రత్యేకము 45 మాషములు, చాకరాసి, బిసపాయజ్, సునాముఖి, ఇదిప్రత్యేకము 17½ మాషములు. ఈమొదలగువస్తువులు దంచి శే 1½ నీళ్ళలోపోసి ½ శేరునుమిగులునటుల కషాయముకాచి దించుకొని అందులో వెంటనే 35 మాషము పాచితీగెవేసి మూతమూసిచల్లారినవెనుక వడియబోసి 3½ మాషములు, గాఖూరా 7 మాషములు, ముసాంబరము. రెండువస్తువులు నూరి పై కషాయము నందుకలిపి అందు చక్కెరచేర్చి రోగికివ్వవలెను.

### పిత్తజమాలిఖోలియాచికిత్స.

పైత్యదశగల యీవ్యాధియందు శరీరము చెమ్మకలిగించుటకై చెమ్మను కలిగించునట్టి జిగురులు, షరబతులు యిప్పించవలెను. చెమ్మను పుట్టించినవెనుక రోగదోషము మాఖుల్ జుబ్బ యీక్రిందవ్రాయబడినది. దీనిని యివ్వవలెను. మరియు, క్వాథమువలన రోగదోషమునుతీసివేయవలెను. తదుపరి చల్లని చెమ్మకలిగించునట్టి వస్తువులను ఉపయోగించి ప్రకృతిని కాపాడవలెను. మరియు, పరిశ్రమ మాన్పించవలెను. రోగిని శాంతముగా కూర్చుండబెట్టి గానము మొదలగునవి వినిపించవలెను.

### వుక్తక్వాదవిధి

కరక్కాయబెరడు, చింతపండు, పర్పాటకము, ఈవస్తువులు ప్రత్యేకము 65 మాషములు, ఆలుబకరా 20 కాయలు, సపిస్తాన్ (శ్లేష్మాంతకము) 50 గింజలు, గులాబిపూలు, కామంచిగింజలు, ఇవి ప్రత్యేకము 17¾ మాషములు, ఈవస్తువులలో నలియగొట్టినవి నలుగగొట్టి 1¼ శేరు నీళ్ళలోవేసి కషాయముకాచి అర్ధశేరు శేషించినవెనుక దించుకొని అందులో 3¾ మాషములు పాటిగెవేసి మూతమూసి యుంచి చల్లారినతరువాత వడియబోసి ఒకదాగ్ (4 యవగింజలయెత్తు) సల్మోని యాచేర్చి శుద్ధిచేసినముసాంబరము 3¾ మాషములున్ను రసాంజనము 3¾ మాషములు చేర్చి 70 మాషములు, తురంజబీన్, సీరఖిస్తె కలకండ చేర్చి పానముచేయవలెను.

### ముసాంబరము శుద్ధిక్రియము

అర్ధశేరుముసాంబరము దంచి వస్త్రఘాళితమొనరించి యుంచుకొని శిమమాచిపత్రి, జరామాంసి, నేలవేము, దాల్చినచెక్క, ముద్దలవంగపట్ట, ఫూదెబల్సాన్, ముంజగడ్డి, గ్రంథితగరము ఈవస్తువులు ప్రత్యేకము 10½ మాషములు చొప్పున చేర్చి నలియగొట్టి ఒకశేరు నీళ్ళలోవేసి అర్ధాంశముగా కషాయముకాచి దించుకొని వడియబోసి పైముసాంబరమును రాతికల్వమునందుంచి యాకషాయముపోసి చక్కగామర్ధించి కషాయము యినికిన తరువాత ఒకపాత్రయందు తీసికొని యెండించి ముక్కలుకోసి యుంచుకొనవలెను. తదుపరి కల్వమునందు వేసి ఆకషాయముతో మర్ధించవలెను. యెంతమెత్తగానూరితే అంత గుణమునిచ్చును. మరియు, యీనూరిన ముసాంబరము ఒకమట్టిపాత్రలోతీసికొని తేరనిచ్చి పైతేటనువంచివేసి పైనీళ్లుయావత్తుహరించి అడుగుభాగము మడ్డివలెనుండు ముసాంబరమును యెండించి 10½ మాషములు కుంకుమపువ్వునూరి కలిపియుంచుకొనవలెను. యీముసాంబరము దోషరహితమైనది. దీనిని అవశ్యకతానుసారముగా ఔషధములయందు

ఉపయోగించవలెను.

మరియు శుద్ధిచేసిన ముసాంబరము చెక్కిని గుండుకర్షైవాగా నుంచుదురు. అశుద్ధ ముసాంబరము ఉపయోగించుటవలన విశేషముగా విరోచనములగును.

రాజమాలీఖోలియా చికిత్స

ప్రతిదినము మాఉష్షల్ ఫుసూల్ (వేశ్వరపము) ను ఇప్పించవలెను. అథవా, గౌజుబాఁ, కలబపుష్పాలు, బనఫ్షా ఇవి ప్రత్యేకము 10½ మాషములు. బాలంగ్ 3½ మాషములు. గుల్ఖండు 4½ మాషములు. యీ మొదలగు వస్తువులతో ఔషధము తయారుచేసి విరోచనమునకు యివ్వవలెను. మరియు, మలము పక్వమగువరకు యీ ఔషధము ఉపయోగించుచుండవలెను.

మరియు, రుధిరాధిక్యమువలన యీ వ్యాధికలిగిన యెడల శిరావేదనముచేసి రక్తమోక్షణము చేయించవలెను. మలము పక్వమైన తరువాత పాదితీగె కషాయము అంపాయముతో యారజాత్ మాత్రలు వుపయోగించి మలదోషమును తీసివేయవలెను. మరియు, తలనొప్పి యేకారణమువలన యేదోషమువలన కలుగునో నాటి చికిత్సలు ఆయా శిరోరోగములందు చెప్పబడియున్నవి. ఆయా దోషానుగుణ్యముగా ఈ వ్యాధులందుకూడా ఉపయోగించవలెను. యీ వ్యాధియందు చెప్పబడిన ఔషధములలో యారజ్ ఫైకరా ఉస్తెఖద్దూసుకూడా చేర్చవలెను. మరియు, మలము సహజముగా నాలుగు సార్లు వెడలుచుండుట వుత్తమము. మలము వెడలినకొలది శక్తికూడా కలిగియుండును. యెటులనగా రోగము ముదిరినకొలది మలము సహజముగా వెడలనేరదు. కాబట్టి అతీక్ష్ణముగల జారజాత్ ప్రథమమున యారజ్ ఫైకర ఉపయోగించవలెను. అటుపిమ్మట యారజ్ జాలినూస్ ఇవ్వవలెను. పిమ్మట మాజ్ రూసస్ యివ్వవలెను. తరువాత యారజ్‌లో గాజియా వుపయోగించవలెను.

వాయువుకూడా చెడిపోవును. యెందుకనగా హృదయమునందుగల వాయువు మెదడునందుగల వాయువుతో చేరియుండును. అనగా మెదడునందుగల ప్రాణవాయువు హృదయమునందుగల ప్రాణముతో సంబంధము కలిగియుండును. అందువలన సమస్తవిధములగు మాలిఖోలియా వ్యాధులుకంటె యీవ్యాధియందు మెదడు హృదయమునకు బలము కలిగించవలెను.

మరియు భయము, అదురు, సందేహము, ఇవిరోగికి వదలకుండిన యెడల లేక వుష్ణప్రకృతిగా యున్నయెడల పుష్టికలిగించుటకై వుపయోగించుఔషధములు వుష్ణవుమ్మొత్తవ్యాధియందు చెప్పబడియున్నవి. ఆచికిత్సలను చేయవలెను. మరియు శీతప్రకృతిగాయున్నచో నౌసదారు దివాల్ముస్కు అనువానిని వుపయోగించవలెను.

—హకీమురాజీగారు చెప్పిన ముఫర్ర అః నౌసదారూ.—

గులాబిపూలు 16న్నర మాషములు, తుంగముస్తలు పెద్దపాయలగింజలు 17న్నర మాషములు, లవంగాలు రూముమస్తకి, జరామాంసి ఆసారూన్ ఇవిప్రత్యేకము 10న్నర మాషములు. కుర్ఫా, బ్రాంహి, కుంకుమపువ్వు, ఇవిప్రత్యేకము 7 మాషములు. ఏలకులు, బిస్ఫాయజ్, జాజికాయలు, యివి ప్రత్యేకము 3న్నర మాషములు ఉసిరిగెవలువు అర్థశేరు ప్రదమము ఉశిరిగెవోలువు 3న్నర శేరు నీళ్ళలో వేసి అర్ధాంశముగా కషాయముకాచి ఆకషాయమును వడియబోసి పావుశేరు తేనె ఆకషాయమునందుచేర్చి పొయ్యిమీదనుంచి చిక్కబడువరకు కాచుకొని పైవస్తువులు చూర్ణించి యందు యింగువచేర్చి మొత్తమును తేనెతో కలిపి పేముకప్రతో కలియబెట్టి తరువాత ఆపాత్రమూతిమూసి వకచోట రెండుమాసములవరకు యుంచి తరువాత వుపయోగించవలెను. మరియు ఈఔషధమును రోగబలానుసారముగా వుపయోగించవలెను. ఇది శరీరకాంతి జీర్ణశక్తి కలిగించి వార్ధకమును దూరపరచును. ఈనౌసదారునందు తేనెపావుశేరు మాత్రమేయున్నది గాని కొందరు వైద్యులు సగ

భాగము తేనె చేర్చుకొనుచున్ని కొందరు అవశ్యకతానుకూలముగా వక శేరు తేనె చేర్చవలయుననియు మరికొందరు ఔషధము స్వాదిష్టము నొందుటకై చేర్చుచున్నారు గాని హాకీము సమరకందీగారుకూడా తనఖరాబాదెన్ యందు తేనెపావు శేరు చేర్చుమని వ్రాసియున్నారు,

## ఉష్ణదివాల్ మ స్క్ చేయువిధము.

పొడుగుకచూరములు, దరూనంజ్ అకరవి (తెలువలెనుండు ఒక వేరు,) ముత్యములు, కహారోబా, పగడచూరు, ఇవిప్రత్యేకము 35 మాషములు, పచ్చమట్టి, బహామన్ సు పేద్, బహామన్ సుర్ఖ్, జరామూంశి, చిన్నఏలకులు, ఇవిప్రత్యేకము 17½ మాషములు. రాతిపువ్వు, పిప్పళ్లు, శొంఠి, ఇవిప్రత్యేకము 14 మాషములు, కస్తూరి 7 మాషములు, ఈవస్తువులను చూర్ణించి వస్త్రఘాళిత మొనరించి తేనెలోకలిపి మాజూన్ చేయవలెను.

## మావుల్ జుబ్న చేయుక్రియ

ఆర్ధశేరు మేకపాలు ఒక పొంగువచ్చువరకుకాచి, దించుకొని 31½ మాషములు సాధారణ శికింజబీన్ గాని, అప్ తిమూన్ శికింజబీన్ గాని, ఆపాలలో కలిపి చల్లారినవెనుక వడియబోసి రోగికిప్పించవలెను. ఈమావుల్ జుబ్న అనేకసార్లుచెప్పియున్నాము.

## కఫజమాలిఖోలియాచికిత్స.

కఫదశయందు ముంజిజ్ (మలమును పక్వపరచునట్టి ఔషదము) వుపయోగించవలెను. మలము పక్వమొందినవెనుక ఈచెప్పబోవుకషాయమువలన మలమును వెడలించవలెను. అనగా కాబోలు కరక్కాయలు, చాతరాసి ఇవి ప్రత్యేకము 35 మాషములు. సునాముఖి 24½ మాషములు, బిస్ పాయజ్, బాంగు ప్రత్యేకము 10½ మాషములు, ఈవస్తువులను విధిపూర్వకముగా కషాయముకాచి 35 మాషములు ఆకాశవల్లి అందుజేర్చి చల్లారినవెనుక వడియబోసి ఆకషాయమునందు తెగడ, గారిఖూన్ ఇవిప్రత్యేకము 3½ మాషములు చూర్ణించి కలిపి అందు

వారికి కలుగుచున్నది. అందువలననే హాకీముయూసిఫ్‌గారు తత్వజ్ఞానులకు ఉత్పన్నమగునవియు, అఫలాతూన్ మొదలగు హాకీంబిఖిరిగారు, నేను అనేకులకు చూపగాననిన్ని వారు ప్రపంచమును వదలివేసి చదువుతప్ప వేరుపనిలేక యెల్లప్పుడు చదువుచునుండువారికి మాలీఖోలియా అను వ్యాధి కలుగుచున్నిన్ని వారిలో ఒకడు హాకీము ఫారాబీతప్ప లెక్కలేనవారు అనేకులున్నారని తాను చూచిన సంగతిని బట్టి హాకీము త్రిబీగారు వర్ణించియున్నారు. దీనిలక్షణములు యీవ్యాధిగలరోగి సదా చింత, ఆలోచించుట, ఆగి ఆగి మాటలాడుచు వృద్ధిని పై చూచుచుండుట, రోగి తల ముఖములు పిక్కిపోవుట, సిక్కినశరీరము యావత్తు నచూనముగానుండుట, కన్ను లోనికిపుట. నాడి మందముగను ఒక్కొక్కప్పుడు సూక్ష్మముగను ఒక్కొక్కప్పుడు కఠినముగనుండుట. మూత్రము పలచగను శుభ్రముగానుండుట ఈ లక్షణములు కలిగియుండును. యీవ్యాధికలుగుటకు ముందు రాత్రికాలమునందు విశేషముగ మేలుకొనుట, చింతావిశేష్యమువలన తలపై గుడ్డలేకుండా తిరుగుట మరియు, నీరుల్లి, ఎల్లుల్లి, గాడిదెగడపర మొదలగునట్టి తలకు నష్టమును కలిగించు వస్తువులు విశేషము సేవించుట మొదలగునవి యీవ్యాధికి హేతుభూతములు.

## ౨. మాలీఖోలియా చికిత్స.

ఈవ్యాధి రుధిరాధిక్యమువలన కలిగినమొదల నలేరు అను నరమును ఛేదించవలెను. మరియు, రక్తము నీరువలె పలచగానున్నదా లేక యెఱ్ఱగాయున్నదా లేక యెఱుపు తెలుపు కలిసినరంగుగానున్నాదా లేక కేవలము యెఱ్ఱగానున్నదాయని శిరావేదనకాలమునందు రక్తమును పరీక్షించవలెను. రక్తమువల్లగానున్నచో రక్తమును వెడలింపవలెను. అట్లాగా రక్తమునందుగల నలుపు తగ్గి స్వభావికముగురంగు వచ్చువరకు రక్తము వెడలించవలెను. మరియు, రోగికి దుర్బలము కలుగకుండా చూడవలెను. రుధిరమువలన వ్యాధిపోయినదని తెలియబడును. యెటుల ననగా రక్తము కాలినమలము మెదడునందు సిరపడుటవలన శరీరము

నందు అల్లుకొనుటవలన కనిపెట్టవచ్చును. మరియు, రక్తమున్వభావికమైన రంగుకలిగి యెఱ్ఱగ కాంతిగానుండిన కొంతరక్తము వెడలినతరువాత ఆపవలెను గాని విశేషరక్తమును తీసివేయకూడదు. యెందుకనగా మందిరక్తము శరీరమునుండి వెడలిన యెడల ప్రాణమును హరించును. మరియు, దోషము మెదడు సంబంధమగు నరములయందు నిలిచియున్న దనియు శరీరమునందు ప్రవహించలేదని గ్రహించి వెంటనే రగ్‌నరేరు అను నరమును బంధించి దీనికి బదులు నొసలునందుండు నరమును ఛేదించవలెను. రక్తస్రవమును తగ్గించవలెను.

దోషము శరీరమునందు చేరకుండునట్టి వ్యాధియందు రక్తస్రవమునకు బదులుగా మలమును వెడలించవలెను. ఇట్లుమలమును వెడలించుటవలన దోషము ఏకాంగమునందుండి హరించును. మరియు సాఫీన్ కాలినరమును ఛేదించుట. నరేరు నరఛేదనముకంటె ఉత్తమము. విశేషముగా మలమును వకచోటనుండి రెండవచోటునకు మార్చుట అభీష్టమగును.

విశేషముగా స్త్రీలకు రజోసంబంధమగు రక్తముబంధించుటవలన యీవ్యాధి కలుగుచున్నది.

శిరావేదన తరువాత విశేషదోషమును హరించునట్టి కషాయములు మాత్రలునిచ్చి దోషమును హరింపజేయవలెను. మరియు దోషమునకు యోగ్యమగునట్టి ఔషధములు వెనుక చెప్పియున్నవి. కాబట్టి యిందుపయోగించవలెను. మరియు మెదడుకు దోషముకు చెమ్మకలిగించకూడదు. విరోచనౌషధములను యివ్వజనదు. యెందుకనగా మలము సహజముగా వెడలదు. మరియు చెమ్మను కలిగించునట్టి సుపాయములు యీక్రిందచెప్పబడిన వస్తువుపయోగమువలన మెదడునకు మలమునకు చెమ్మకలిగించును. అనగా కోడిపిల్లలమాంసరసము మేక, జింకపిల్లల మాంసరసము మంచినీళ్ళయందుగాని చవ్వనీటియందుగాని నివసించునట్టి చేపమాంసరసమును యివ్వవలెను. మరియు నిశస్తా

(గోధుమసత్తు) కలకండ, గసగసాలు, పీటిగింజలు బాదంనూనెతో తయారుచేసి యివ్వవలెను. మరియు చెమ్మనుకలిగించునట్టి తైలమును గోరువెచ్చగా కాచి వాతజశిరోరోగమునందు చెప్పినవిధముగా తలకు లేపనము చేయవలెను. ముక్కునందు చెమ్మకలిగినప్పుడు మెదడునందును, శరీరమునందును, చెమ్మకలిగినటుల గ్రహించవలెను. మరియు పొట్టుతీసిన యవలు, బనఫ్షా, కలువపూలు, కాహువాకులు, ఈ మొదలగు వస్తువులకషాయముకూడా తలపై పోయవలెను. అథవా సొరగింజలపప్పు, కాహువిత్తులు, పుచ్చగింజలపప్పు, కలువపూలు, బనఫ్షా, ఈవస్తువులను నూరి, చనుపాలలో కలిపి తలకు లేపనముచేయవలెను. మరియు చెమ్మను కలిగించునట్టి షరబతులు పానముచేయించవలెను. అట్టిషరబతులను వెనుక చెప్పియుంటిని. మరియు గోరువెచ్చని మంచినీళ్లతో స్నానముచేయించవలెను. చల్లని గృహములయందు రోగినివసించచేయవలెను. శీతల సుగంధికపువ్వులు, పన్నీరు, మొదలగునవి ఆఘ్రాణించునటుల చేయవలెను. విశేషముగా నిద్రించుట మంచిది.

మరియు పరిశ్రమ, చింత, మైథునము, మొదలగు హానికరములగు పనులను మానివేయవలెను. మరియు మలమును వెడలించిన తదుపరి శరీరమునకు చెమ్మకలిగించుటకు ప్రయత్నము చేయవలెను. అనగా తలమర్ధనచేయుట కాచుట మొదలగు కారణములవలన మెదడునందు శుష్కత్వము కలిగినయెడల ఆశుష్కత్వముపోయించి మెదడునకుపుష్టికలిగించును.

## 3 మాలిఖోలియా లక్షణములు.

వాతజతీక్ష్ణదోషము ఆమాశయమునందుగాని, మూత్రాశయమునందుగాని ప్లీహమునందుగాని, లేక మిరాకు * నందుగాని చేరి అచ్చట

* మిరాకుఅనగా పొట్టపైనాక్రమించియుండు ఝిల్లిపొరకుపేరు. ఈపొరవలనపొట్టపైభాగము బిగించబడియుండును. ఒకప్పుడుపొట్టపైచర్మమునుకూడా మిరాకుఅని చెప్పుదురు. యెటులననగాశాఘాయొక్క అర్ధముపొట్టఝిల్లివ్యాధులయందు వర్ణించబ

ఖనీభవించి నల్లని ఆవిరికణముల దోషముగల పరమాణువులు దోషసంబంధమగు అంగమునుండి శరీరమునందు యెక్కి మెదడునందు చేరి రోగము పుట్టించుచున్నవి పుక్తదోషము నందువలె మెదడునందు చేరి అచ్చట ఇబ్బందికలిగించి మిరాకుభాగములకు అవశ్యముగా వాపు కలిగించుచున్నది. ఇందువలననె దీనిని మూలిఖోలియా మిరాకు అనబడుచున్నది. వాపుకలుగు కారణమువలననే మాలోఖోలియానఫ్ఖా మరియు నఫ్ఖాయె మిరాకియాఅని చెప్పబడుచున్నవి.

ఇట్టివ్యాధియందు దోషసంబంధము యీనాల్గు అవయవములయందు కలుగుచున్నది. యిందువల్లనే యీవ్యాధి నాల్గువిధములుగా చెప్పబడినది. (1) ఆమాశయమునందు దోషముచేరి ఆమాశయమునందు వ్యాపింపబడి విశేషముగా శీతమును కలిగించి వాపును పుట్టించును. మరియు, దోషము ఆమాశయమునందు ఖనీభవించుటకు అనేకులు వేరు వేరు విధములుగా చెప్పియున్నారు గాని యిచ్చట గ్రంథవిస్తరభీతివలన చెప్పకవిరమించితిని.

2. మూత్రకోశమునందు దోషము ఖనీభవించి అచ్చట వాపు గ్రంధులను పుట్టించును

(3) దోషము తిల్లి (ప్లీహము) నందు ఖనీభవించి గ్రంధులు, వాపు పుట్టించును. (4) మిరాకునందు దోషమునిలిచి బాహ్యావేశి కారణమువలన దోషము ఖనీభవించి దగ్ధమొందుచున్నది. ఈకారణమువలన మిరాకునందువాపుకలుగును. ఒకప్పుడు వాపుకలుగకున్నను నల్లని ఆవిరిపరమాణువులు అందుండి పైకెక్కి మెదడునందుచేరి మెదడునందుగల ప్రాణవాయువును నల్లగామార్చివేయును. ఇట్లు మార్చుటవలన భయము, చింత, ఆలోచన మొదలగునవి విశేషముగను పైన వర్ణించియున్నది. అనగా మలము అంగములందుచేరి నిలిచిన యెడల

డును మరియు ఆశఅనగాపొట్టలోఅంగమునకు పేరు. అనగా ఆమాశయము హృదయము మూత్రాశయము ప్లీహము ఇత్యాది.

ఆవిరి పరమాణువులు ఆస్థలమునుండి మెదడునకు యెక్కుచున్నవి. యీ కారణమువలన రోగము ఉత్పన్నమగుచున్నది.

**ఉక్తరోగలక్షణములు**

కాలినవుల్లసితేణువులు విశేషముగావచ్చుట వాతము విస్తారమగుటవలన తేణువులు విలిచిపోవుట, విశేషముగాభుజించినను భోజనబలము శరీరమునకు తక్కువగాచేయుట, ఆమాశయము, మిరాకునందు నొప్పి, మంట, పీకుకలుగుట, రొమ్ము నిగనిగలాడుచు బిగించినటులుండుట, నోటినుండి విశేషముగా నీరూరుట, కడుపు మిక్కిలి మెత్తగానుండుట, నాభియందు శూలకలుగుట, అల్పఆకలి విశేషముగాకలుగుట, భుజములమధ్య నొప్పి యీ మొదలగులక్షణములు కలిగియుండును. మరియు, రోగికి ఆవిరిపరమాణువులు యెక్కు విషయము తెలియబడును. ఆవిరి పరమాణువులు యెక్కుసమయమునందు గొంతు, మాట మందనారంభించును.

మరియు, ప్లీహామునుండి ఆరంభమగు వ్యాధియందు కలుగు లక్షణములు అనగా ఉక్తలక్షణములు తప్ప ప్లీహాముకూడా పెరుగుచుండును. ఇదేవిధముగా ఆమాశయమునుండిపుట్టినట్టిరోగము వాపువలనగాని లేక ఉష్ణములదోషమువలనగాని లేక శీతమువలనగాని వాపునుగలిగించునటుల జ్వరము, దాహము, పిత్తము వమనమువెంట రాకుండునటుల చేయుటవలన యీవ్యాధి వేరుగా ప్లీహామునందుగల దోషమువలన కలిగినదని గ్రహించుటకు వీలగుచున్నది. ఇదేవిధముగా మూత్రకోశమునందు గ్రంధులు పుట్టుటకు కారణము. యీవ్యాధి వెనుక మూత్రపిండముల వ్యాధులయందు చెప్పబడియెను. మరియు, యీవ్యాధియందు వుక్తరోగలక్షణములు కలిసియుండును. యీరోగము రెండేసి మూడేసిస్థానముల సంయోగమువలన కలుగుచున్నది. మరియు, యీ వ్యాధి వుక్తరోగసంపూర్ణలక్షణములు కలిగియుండును. మరియు, రెండవఅవయవమునందు రోగముత్పన్నమగులక్షణములు తెలియకుండినచో

దోషము కేవలము మిరాశయందు కలుగుచున్నది. విశేషముగా కడుపునందు వాపుకలుగును గాని ఆమాశయము నిరోగముగానుండును.

### ఉక్తరోగచికిత్స.

పరీక్షితానుసారముగా పలుబైదినములు ముందు వెనుకసరము శిరావేదనచేయవలెను. యీవ్యాధి రుధిరాధిక్యమువలన కలిగియుండినను మరియు బలము గలవానిని ప్రపదరీవములులేకుండిన అవశ్యకతానుసారముగా సమయానుకూలముగా రక్తమోక్షణము చేయవలెను ఈరోగమునందు వెడల్పు శస్త్రముతో ఛేదించవలెను. యెందుకనగా చిక్కని రక్తము వెడలుటకు వీలుగానుండును. దీని నిదానము యావత్తు వాతరోగమునందు చేయవలెను. దేనియందు శిరావేదన చేయదగునో ఆలోచించిచేయవలెను. మరియు ఈవ్యాధితోకూడా జ్వరమున్నయెడల విరోచనార్థము. (1) కలువపూలు (2) కాశినివిత్తులు, (3) కామంచి, (4) మాదీఫలరసాయనము, (5) కలకండ ఈవస్తువులను నూరిపానముచేయవలెను. మరియు బసప్ పాపర్బతు గసగసాలపర్బతులుకూడా ప్రయోగించుట లాభదాయకము.

### మాలీఖోలియా పత్యములు.

యవనూక, వేయించిన పెసరపప్పు, వీటిని బాదంపప్పుతోచేర్చి యివ్వవలెను. మరియు జ్వరాంశము లేకుండినయెడల కడుపులోభాగమునందు శక్తికలిగించుటకై కేవలము గుల్ఖందు యివ్వవలెను. మరియు విరోచనఔషధమునందు బాలంగు, గౌజుబాన్, సోపు, యీవస్తువులను చేర్చుట మిక్కిలిమంచిది. మరియు కోడిపిల్లలమాంసము కోడిగ్రుడ్లు యిటువలెనే బలము చేయునట్టియు శీఘ్రముగా పచనమగునట్టి వస్తువులు రోగికి భోజనార్థమిప్పించవలెను మరియు యేవస్తువునందు మలము తక్కువగానుండి రక్తము ఉత్తమమగునో అట్టివస్తువులనుసేవించవలెను. మరియు యేఅంగమునందు వాపు లేక దోషము ఆమాశయము లేక మసారికా మిరాకమందుయున్నయెడల అవశ్యకతానుకూలముగా కడు

వు లోభాగముయొక్క అంగములయందు బలమును కలిగించునట్టి వస్తువులను యివ్వవలెను, అనగా రేలకాయగుజ్జు బాదరంజబోయా గాజుబాన్ పాదితీగె అఫసన్తీన్ మొదలగుకషాయమునందు కలిపి కోష్ఠమును మృదువర్చవలెను. తదుపరి విరోచనము చేయించవలెను. మాలీఖోలియా మిరాకియందు అప్‌సన్తిన్ అధికలాభదాయకమని వైద్యవరులు వచించియున్నారు. మరియు అప్‌సంన్తీన్ యొక్క సారాయి షర్బతుకూడా మిక్కిలి గుణము కలిగియుండును.

మరియు దోషము కేవలము ప్లీహామునందున్నచో విరోచనమునకు తీక్ష్ణఔషధము ఇవ్వవలెను. ఎందుకనగా ఔషధమునందు తీక్ష్ణత్వములేనిఎడల మలము తిల్లి (ప్లీహము) నుండి ఆమాశయము మరియు ఇతరఅంగములయందు నిలిచిపోవుచున్నది. మరియు మలము ధారాళముగా వెడలనేరదు. ఇందువలన ప్లీహసంబంధమగు రోగమునందు తీక్ష్ణ విరోచనము యివ్వవలెను. యిట్లుయిచ్చినయెడల దోషము యితరఅంగమునందు చేరకుండును. మరియు రెండవ వుపద్రవము నిలిచిపోవును. మరియు దోషము ఆమాశయము మిరాకు (పొట్టపైనుండు ఝిల్లిపొర) మూత్రాశయమునందు యున్నచో కేవలము శిరావేదనవలన దోషమును తీసివేయవలెను. విరోచనము చేయించునట్టి ఔషధములు యివ్వజనదు. తరువాత అవశ్యకతానుసారముగా అప్పుడు దోషము నిలిచియున్నయెడల కుళ్ళిపోవునను భయము కలుగును. మరియు దోషము సర్వశరీరమునందుచేరి యున్నయెడల దోషమును విరోచనముద్వారా వెడలించుట వుత్తమము,

ఈవ్యాధియందు వమనము చేయించుట సర్వదావర్జితము. యెందుకనగా వమనమువలన లాభము కలిగించుటకు బదులుగా నష్టముకలిగించును. అనగా వమనము దోషముయొక్క పరమాణువులను రేగగొట్టుచున్నది. అధోభాగమునుండి ఊర్ధ్వభాగమునకు తీసికొని వెళ్ళుచున్నది. రెండవది వాతజదోషము శరీరముయొక్క అవయవములయందు

అణగియుండును. అట్లు అణగియుండు దోషములు వమనముద్వారా బైటికి రాజాలకుండును గాన వమనము అవిరివరిమాణుపులను వృద్ధి పరచి కష్టమును బలపరచుచున్నది. మరియు ఒకానొకరోగికి సహజము గా వమనమై దోషము ఆమాశయమునందు నిలిచియున్నయెడల వమన ము చేయించవచ్చును.

## విశేషదృష్టవ్యం.

ఈదోషమువలన వాపులేక కడుపుయొక్క పై భాగమందు యున్నచో గుల్ రోగన్, జరామూంసి, మస్తకి, వీటిని వకటిగాచేర్చి గోరువెచ్చగాకాచి ఆమాశయము, ఆమాశయము ముఖముపై లేపన ముచేయవలెను. గోధుమపొట్టుతో కాపడముచేయుట మరియు బాబూ నా అకలీలుల్ మలిక్, నిమ్మఆకులు, యీవస్తువులను కషాయముకాచి ఆకషాయముతో కాపడము చేయుటవలన వాతమును నష్టపర్చుటకు మిక్కిలి లాభదాయకమగును. మరియు చెమ్మగల కాపడములు మిక్కిలి మంచివి, యెందుకనగా చెమ్మచేయుటవలన వాతమునారించును. శరీరమునందు చెమ్మచేరును. ఇటులనే యేఅంగమునందు దోషముకల దో ఆఅంగముయొక్క దోషమును తీసివేయును. మరియు శక్తి కలిగిం చుటకు వుక్తయోగములరోగములయందు చెప్పబడిన రోగచికిత్సలను చూడవలెను. మరియు మాలీఖోలియా (పిచ్చి) వ్యాధి దశ భిన్నభిన్న దోషస్తానము యితరదోషము యందుచేరుటవలన భిన్నభిన్నములుగా నుండును. దోషము మెదడుమధ్యభాగమునందుచేరినయెడల బుద్ధివివేక ముచెడిపోవును. అనగా మెదడు మధ్యభాగము జ్ఞానమునకు ముఖ్యస్తాన మగుటవలన బుద్ధిచెడిపోవును. జ్ఞానసంబంధమగు సమస్త కార్యములు నష్టమొందును.

మరియు దోషము మెదడుయొక్క సమస్తభాగములను ఆక్రమించినఎడల ఆలోచనము, విచారము, కార్యములు, పనులు, యావత్తు మెదడునుండి ఉత్పన్నమగును కాబట్టి వీనియందు వుపద్రవము కలుగు

ను. మరియు, రెండవ దోషము ఇందుమిళితమగుటవలన అనగా వాతము, పిత్తముతోచేరిన నో రోగిప్రకృతియందుక్రోధము విశేషమగును. కఫము, వాతముతోచేరిన నో రోగిమందబుద్ధిగా యుండును మరియు వణుకుట పొర్లాడుట బాగాతెలిసినవాడగును. దీని నిదానము అనేకవర్యాయము లు చెప్పబడియె. మరియు వాతము ఏదోషమువలన వహించబడినదో ఆదోషముయొక్క దశఅందు అవశ్యముండును. దీనిని ఆరోగిలక్షణము లవలన కనిపెట్టవచ్చును.

## ఉన్మాదరోగలక్షణములు.



ఈవ్యాధు లయావత్తు మాలిఖోలియా భేదములు. ఈఉన్మాదము నాలుగువిధములుగానుండును. ఇందువలన నీఅధ్యాయమునందు నాలుగుభేదములుగా వర్ణించితిని.

1 కుతరూబలక్షణములు.

*ఈకుతురుబ్ ఉన్మాదవ్యాధిభేదము. దీనిలక్షణములురోగిమిక్కిలి

* ఈరోగనామములు, వైద్యవరులు భిన్నాభిన్నములుగా విధించి యున్నారు. హకీంషెక్‌బూఅలిసేనాగారు కుతురుబ్ ఒకవిధమైనపురుగుఅనిన్ని ఈపురుగు, నీళ్లయందువిశేషముగా తిరుగుననిన్నీ ఈపురుగుఒకప్పుడువెనుకకుఒకప్పుడుఎడమవైపునకు, ఒకప్పుడుకుడివైపునకు, తిరుగుచుండును. ఒకప్పుడునీళ్లలోమునిగి వెంటనేబైటికివచ్చును ఈపురుగువలెనె, ఈరోగిఅవస్థకూడా. ఒకప్పుడుకలుగుచుండును. ఇందువలననే ఈరోగమునకు కుతురుబ్ అని పేరుపెట్టబడియె

మరియు కుతురుబ్ మరియొకఅర్ధము, గొర్రెయొక్కకాలి నపాతవెంట్రుకలకుపేరు. అనగా, ఈరోగికూడాగొర్రెవలె పొలములయందు తిరుగుచుండును. మనుష్యులనుచూచి దాగుచుండును. దీనిసదృశముగా, శబ్దముకలిగియున్నది. ఇట్టికారణమువలనఈవ్యాధియొక్కపేరు కుతురుబ్ అనిపెట్టబడియె. మరియు, కొందరు, జబ్బాఅమత్, మరియు ఇల్లితోజబ్ అనుచున్నారు, 'ఈరోగముయొక్క పేరువిషయమై అనేకకార్యములున్నవి, గానిఇందు, ఇంతవరకు ముగించితినని హకీము షెక్అబూఅలి సేనాగారు వచించిరి,

క్రోధముగానుండుట, ఒకచోట నిలువకుండుట, హీనుడై తిరుగుచుండుట, మరియు ఎవరోతన్ను కొట్టిచంపబూనినారని తలచి భయము నొంది, గృహమునందున్ను, సమాధులు మొదలుగాగల స్థలములయందున్ను, దాగియుండుట, రాత్రిసమయమునందుమాత్రము బైటికి వచ్చుట మరియు కొందరు రోగుల భయము భీతిలేకుండా యుండును గాని అధికక్రోధము గలిగి చింతాగ్రస్తుడై పచ్చనిరంగు గలిగి ఎండిన నాలుక కలిగియుండుట, మరియు మిక్కిలి వృణప్రకృతి గలరోగి అని గ్రహించవలెను.

మరియు మనుష్యునిపై కురికి కొట్టబోవుట, పొలములయందు చతుష్పాదజంతువువలె చేతులు, కాళ్ళతోతిరుగుచూ భుజించక తిరుగుచుండుట, ఈరోగిపిక్కలు పాదములు, విశేషముగా తిరుగుటవలన గాయమై కురుపువేసినను మానకుండుట, మరియు రాత్రికాలమునందు తిరుగుటవలన ముండ్లు, రాళ్ళు, మొదలగునవి తగులుటవలన కాళ్ళు యావత్తు బద్దలై చీలిపోవుట మొదలగు లక్షణములు కలిగియుండును.

కుతరుబ్ అను ఉన్మాదచికిత్స

ఈవ్యాధియందు అవసరమైన యెడల శిరావేదనచేయవలెను. దోషము పూర్తిగా పక్వమొందిన వెనుక పాచితీగె కషాయమును గాని యీకషాయమునకు సమానమగు గుణముగల ఔషధమునుగాని ఉపయోగించి దోషమును వెడలించి ప్రకృతి కాపాడవలెను అనగా కావడములు చెమ్మను కలిగించు శీతజతైలాదులను లేపనము చేయవలెను. మరియు, జలుబు చెమ్మకలిగించు నుపాయములను చేయవలెను. యీవుపాయములను వెనుక చెప్పబడినవి గమనించవలెను. శరీరమునందు చెమ్మకలిగించుటకు తగుప్రయత్నము చేయవలెను. మరియు, రుచిగల పరిశుద్ధమగు బలముగల భోజనపదార్థములను యిప్పించవలెను. మరియు, సందేహము నివర్తింపజేయుటకై రోగికి హితవుగా నుండునటుల చేయవలెను. చింతను దూరపరచుటకై సంతోషముకలుగు పనులను చేయించవలెను.

మరియు, హాకీము రహమతుల్లా గారు ఈ వ్యాధియందు ఏలుగా నున్నపుడు రోగి తలపై ముఖముపై కొట్టవలెను. పాదములపై వాతవేయవలెను. యెందుకనగా మెదడు శక్తిని అణచుచున్నది. మరియు, రోగిని తెలివిలోనికి తెచ్చుచున్నదని వచించిరి.

2. మానియా లక్షణములు.

మానియాయనగా నానిపేరు. పశువువలె ఉన్మాదవ్యాధియొక్క చేష్టలను చెప్పును. హాకీము రాజీగారు వర్ణించిన రీతిగా ప్రాచీన వైద్యవరులు మానియా అర్థము చెప్పియున్నారు. యీ వ్యాధిలక్షణములు రోగి పశువువలె తిరుగుట యేవస్తువు కనుపించినను దానిని పరిగెడించి పారవేయుట యెల్లప్పుడు మనుష్యులపై దుముకుట కొట్టబోవుట యీరోగి కండ్లకు మనిషివలె తోచకుండుట అనగా మాంసాహార పశువువలె (పులి, సింహము, మొదలగునవి) కనుపించుచుండుట మొదలగులక్షణములు మానియా అను వున్మాదరోగము నందు కలిగియుండును.

3. దావుల్ కల్వలక్షణములు.

ఇది మానియా అనునీవ్యాధిగల రోగులు సతతము క్రోధముతో కూడియుండును. కుక్కవలె సంతోషము చేయుచు ఒకప్పుడు మూర్ఖుని వలెనుండును. యిందువలన యీవ్యాధికి యీపేరు పెట్టబడినది మరియు వుక్తరోగి యీ వ్యాధిగలవానివలన కరవబడినయెడల ఆరోగి చనిపోవును. అనగా వెర్రికుక్క కరచుటవలన చనిపోయినటుల ఈరోగి కాటువలన చనిపోవునని అనగా కుక్కకాటునుండి విషము యెక్కునటుల యీరోగి కాటువలన విషమెక్కి మెదడునందు చేరి అచ్చటనిలిచి అచ్చట దగ్ధ వాతముయొక్క పరమాణువు లగుచున్నవి.

మరియు మాలియా వాతముచేత దగ్ధమగుటవలన కలుగుచున్నది. దీనిలక్షణములు ఈరోగి చింతాగ్రస్తుడైయుండుట మౌనముదరించినటులుండుట, ఒక్కొక్కప్పుడు మాటలాడ నారంభించినయెడల విను వారికి పిచ్చివదలించుటకు దుర్లభమని భయముతోచుట మరియు క్రో

ధనువచ్చినయెడల దీర్ఘకాలమునకుగాని శమించకుండుట శరీరము చిక్కి-
పోవుట శరీరకాంతి నల్లనగుట.

మరియు పిత్తము దగ్ధమగుటవలన యీవ్యాధికలిగినచో దీనిలక్షణములు అనగా రోగి మిక్కిలి అస్థిరుడై యుండుట మాదిఖ్యామువలన దుర్మార్గములు చేయుచుండుట అటునిటు పొరలుట ఆలోచన చింత, యుండుండుట ఈవ్యాధియందు మెదడులో భాగమునందు వాపుకలుగుట మెదడునందు వాపుకలిగినయెడల అవశ్యకముగా జ్వరమువచ్చును గాని యీవ్యాధియందు మాత్రము జ్వరముండదు.

దావుల్ కల్బ్ అను వున్మాదచికిత్స

ఈవ్యాధియందు పాచనము శరీరమునందు చెమ్మకలిగించినవెనుక హేతువుననుసరించి దోషమును తొలగించవలెను. దోషమును తొలగించునట్టి చికిత్సలయందుకూడా చెమ్మను కలిగించునట్టి ఔషధములను యివ్వవలెను. పథ్యము కూడా మెదడునకు శరీరమునకు హృదయమునకు చలువచేయునట్టియు చెమ్మను పుట్టించునట్టి వస్తువులను దోషానుకూలముగా యివ్వవలెను.

4 సురారాఅను ఉన్మాదలక్షణములు.

ఈరోగమునందు మానియా కరానితూస్ యీరెండువ్యాధులు వకటిగాచేరి యుండును. మరియు రోగారంభమునందు రోగివిశేషముగా మేలుకొనను. యేమితోచక అటుయిటు తిరుగుచుండును. నిదురయందు తొందరకలిగి భయపడిలేచి కేట్టూప్పచేయుచు ప్రశ్నాననుకూలముగా వుత్తరమివ్వక వ్యర్థముగావుత్తరమిచ్చుచుండును. నేత్రములు యెర్రగను భారముగానుండును. మరియు కండ్లలో యేమో వేసినటులరోగి ఆలోచించుచుండును. కండ్లవెంబడి నీరుకారుచుండును మూత్రము తెల్లగను పలచగానుండును. ఒకానొకప్పుడు మూత్రము బంధించి పొత్తికడుపు చేతితో పిడ్డుకొనుచు బాదుకొనుచుండును. ఒక్కొక సమ

యమునందు శరీరము వణుకనారంభించును. ఈలక్షణములు విశేషజ
నూన్ అనువ్యాధి లక్షణములని గ్రహించవలెను.

### జనూన్వ్యాధి చికిత్స.

ఈవ్యాధియందు తలయందుండు మలము తీసివేయుటకున్ను ఆ
విరి పరమాణువులను బంధించుటకున్ను పిత్తజనూన్ వ్యాధియందు
చెప్పిన చికిత్సలను చేయవలెను. మరియు చెమ్మను కలిగించు ప్రయ
త్నములను చేయవలెను. మరియు చేతులుకాళ్ళు బంధించుటవుచితము.
ఎందుకనగా చేతులను బంధించుటవలన రోగికాళ్ళుచేతులు కదలించ
జాలకుండును. అట్లుకదలించుటవలన వ్యాధి అధికమగును (2) మెదడు
నందుండి మలము జారిపోవును. (3) రోగి నకుతాను కొట్టుకొనుట
యితరులను కొట్టుటగాని కలుగజాలదు. ఇందు విషయమై హాకీముత్రిబ్రి
గారు నేను యిద్దరురోగులను చూచితిని. ఆయిద్దరు ఒకరికొకరు కొట్టు
కొనుచుండిరి. మరియు స్త్రీలను స్మశానమునందు చెట్లకు వ్రేలదీశిరని
చెప్పిరి.

### వణుగెత్తుట వ్యర్థప్రలాపన లక్షణములు

ఈరోగము మాలిఖోలియా భేదము. ఇదిఉపద్రవముచింతలయొక్క
కారణమువలన పుట్టుచున్నది. గాని సర్వదానష్టము కలుగకుండును.
మరియు ఈవ్యాధి జ్వరఅంశములేనిది కలుగనేరదు. ఈరోగముస్థాన
భేదములవలన మూడు విధములుగానుండును. (1) రోగము ఆరనభస్థా
నము మెదడునందుకలుగు రోగములు 6 విధములు (1) మెదడు వెనుక
భాగము పౌర విచారస్థానము. ఇదిప్రబలమగు వాతముతో నిండినఎడల
దీనిలక్షణములు రోగిమాలిఖోలియా వ్యాధివలె కష్టము, దుఃఖము
కలిగియుండును (2) పిత్తవాతాదిఖ్యాతము వలన రోగము వుత్పన్నమగును
దీనిలక్షణములు పశువువలె చేష్టలున్ను ధైర్యమును కలిగియుండును
(3) రక్తవాతము మెదడునందు నిలిచినచో ప్రిసన్నత, నవ్వుట,
మరియు, నరములువాచుట, మొదలగునవి యీవ్యాధిలక్షణములు.

(4) మెదడునందు పిత్తము అధికముగానున్న యెడల రోగముకలుగుచున్నది. దీనిలక్షణములు ఉష్ణప్రకోపము, పనితోచకుండుట, (అస్థిరత్వము) తల గొంతునొప్పిగా నుండుట, జ్వరము, శరీరము వచ్చగానుండుట ఈమొదలగు లక్షణములు కలిగి యుండును.

(5) దుర్గంధికతీక్ష్ణ కఫదోషము మెదడునందు నిండియుండుటవలన వ్యాధికలుగుచున్నది దీనిలక్షణములు, పదరుట, కనుబొమలు చేతితో తడువుకొనుచు పైకిచూచుచుండుట, తలబరువుగానుండుట, మొదలగునవి ఈవ్యాధిలక్షణములు.

(6) ఉష్ణము, సాధారణశుష్కత్వము మెదడునందు జేరి యుండుటవలన వ్యర్థముగా పదరుటకు కారణమగును. మరియు మెదడు ఎండుటవలన లఘువుగానుండుట, మేలుకొనుట (నిద్రనాశము) మలము వెడలకుండుట మొదలగు లక్షణములని గ్రహించవలెను.

2వ భేదము రోగముయొక్క స్థానము మెదడుమాత్రమె కాక ఈవ్యాధి ఆమాశయముగాని పొట్టపైయుండు ఝల్లిపొరగాని లేక గర్భస్థానముగాని లేక వీర్యస్థానముగాని లేక ముఖ్యఅంగమునందు జనించును. మరియు, ఈఅంగములలో ఏదో ఒకఅంగమునుండి మెదడునందు హానికలుగును. ఇట్టిహానికలుగుటవలన పదరుటకు కారణమగుచున్నది. మరియు హానికలిగించుట కేవలము యీచెడుదశయొక్క కారణమువలన వ్యాధికలుగుచున్నది. మరియు కష్టముగల అంగములనుండి ఆవిరిపరమాణువులు మెదడునందు యెక్కుట ఆఅంగమునందు కష్టముకలుగుట ఆడలుట వ్యర్థముగా మాట్లాడుట మొదలగునవి యీవ్యాధి లక్షణములు. యీవ్యాధియందు రోగగ్రస్తఅంగమునందు చికిత్సచేయవలెను.

3వ భేదము. ఆవిరియొక్క తీక్ష్ణత్వము వలన సమస్తశరీరమునందుండు పరమాణువులు లేచి మెదడునందు చేరి బుద్ధిని చెరచుచుండును. యీవ్యాధియందుకూడా యుండు జ్వరమువచ్చుటకలదు. గాన ప్రథమమునందు జ్వరమునకు చికిత్సచేయవలెను. యెందుకనగా జ్వరము నశించినయెడల పదరుట వ్యర్థప్రేలాపన మొదలగునవి తగ్గిపోవును.

## అహంకారమూర్ఛ లక్షణములు

ఈవ్యాధికూడా మాలీఖోలియాయొక్క భేదము. యీరోగము నందు విచారముయొక్క క్రియాశక్తి పనులుచెడిపోవుచున్నవి. సంసార సంబంధమగు పనులు నిష్ప్రయోజనముగా చిన్నపిల్లలవలె పనులుచే యుచుండును. యీరోగి ధ్యానము సహజకార్యములయందు స్థిరముగా నుండును. మరియు, పనుల ఫలము మాత్రము సరిగా ఆలోచించజాల కుండును. ఈరోగమునకు రెండుకారణములుకలవు అందు మొదటి కారణము జలుబువలనగాని లేక శరీరమునందు జలుబు శుష్కత్వము వలనగాని మెదడుయొక్క మధ్యపొరయందుకలిగి విచారమును కలిగిం చును. తలయొక్క మధ్యభాగము విచారస్థానము. రెండవకారణము తల మెదడుయొక్కపొర మెత్తనిస్థానమునందు కఫప్రకృతి నిండియుండి ఆజలుబు చెమ్మవలన అనగా కేవలము జలుబువలన కలుగుచున్నది. ఇట్లు జలుబువలన కలుగు వ్యాధిలక్షణములు ముక్కునందు చెమ్మ అధి కముగానుండుట, నిదురపట్టకుండుట ఇట్టి స్థితియందు తలపై వేడినీళ్ళు పోయుటవలన లాభముకలుగుట మరియు, జలుబు శుష్కించు హేతు వుకూడా తెలియబడుట మొదలగునవి.

### మూర్ఛ చికిత్స

ఈవ్యాధియందు ఉష్ణము చెమ్మపుట్టించుటకై కోడిమాంసర సమునందు దాల్చినచెక్క నల్లజీలకర్ర చేర్చి యివ్వవలెను. మరియు, మధురపదార్థములు తియ్యనియావాగులు మొదలగు వుత్తమభోజన ములయందు బాదంనూనెచేర్చి యివ్వవలెను. మరియు, సండ్రినూనె, బాబూనానూనె తలమధ్యభాగమునందు లేపనము చేయవలెను. ఇట్టి చికిత్సలవలన శుష్కత్వము తొలగి శరీరమునందు చెమ్మ వృష్ణముకలు గును. మరియు, యెండుగడ్డి ఆకులు నీళ్ళలోవేసి కాచి ఆకషాయమును తలపై పోయుట లాభదాయకమగును.

మరియు, యీరోగము కఫకారణమువలన కలిగిన యెడల దీని లక్షణములు చికిత్సలను విస్మరణరోగముయొక్క లక్షణములు కలిగి యుండును. చికిత్సకూడా విస్మరణవ్యాధి చికిత్సచేయవలెను. ఈవ్యాధి విచారశక్తియొక్క వ్రువదనము. మరియు, యీ వ్రువదనకారణము కూడా జలుబు వల్లనున్ను, కఫమువల్లనున్ను, కలుగుచున్నది.

మదపిచ్చ లక్షణములు

ఈవ్యాధిని అశక్తియని వాడుదురు. యీవ్యాధి లక్షణములు ఇది కామమువలన కలుగుచున్నది. యీవ్యాధి తండరయందు ఒక భేద ముగానుండును. యీవ్యాధికామాంధకారమని చెప్పుదురు. యీకామ దోషము గర్భముపై చుట్టుకొనినచో రోగిని శుష్కింపజేయును. యీ కారణములవలన రోగి మిక్కిలి చిక్కియుండును. యిందువలననే యీ రోగమునకు అశక్తివ్యాధియని పేరుపెట్టబడినది యిట్టి వ్యాధిని మను జులు తమంతటతాము స్వయముగా సంపాదించుకొనుచున్నారు. యీ వ్యాధి పుట్టినతోడనే సదైవశోకసంతప్తముగానుండును. మరియు, వంటి గా నివశించుట, యేమియు తోచకుండుట పనులయందుఅశక్తిలేక నిష్ప్రయోజనముగానుండుట, తనకు మంచిదిగా తోచుచుండుట, మరియు, మాలీఖోలియా (ఉన్మత్తత) యందు యేయేలక్షణములుండునో ఆల క్షణములు కలిగియుండుట, మరియు, తనకు తాను సంపాదించుకొనుట యనగా రూపముగల పదార్థములనుచూచి తనకు లభించనందున ఆచిం తయందుండుట యని భావము. మరియు, అటువంటి వస్తువును చూచు టయందు సదైవధ్యానముంచుటవలన తన శరీరము యావత్తు అట్టి వస్తువునందు ఆకర్షనముచేయుటవలన కలుగుచున్నది. యద్యాపి, వాస్తవములో రూపవతి అయినను కాకపోయినను అప్పుడప్పుడు సంభోగ విషయాదిఖ్యాతివలన రేయింపగలు యిట్టి చింతయందు మనస్సు యుం చినను లేక రూపముగువస్తువులను చూచుటవలన పూర్ణమగు విచారము మొదలగునవి ఈరోగకారణములగుచున్నవి, మరియు, దీనిసారాంశము

సదా చింతయుంచుటవలన శరీరమునందుగల రుధిరము దగ్ధమైపిచ్చ ను పుట్టించును. అట్టి కారణమువలన యీవ్యాధి దృఢత్వము నొందు చున్నది.

## కామముయొక్క లక్షణములు.

కామాదిఖ్యాతియందు మనుజుడు తలవంచుకొని మౌనుడై యుండును. యేదైననొకమాటవినినను యేదైననొకపనిచూచినను దానిని మరచిపోవుచుండును. ఇట్టిరోగినేత్రములు లోపలికీడ్చినటులుండును. మరియు చంచలముగను నేత్రములు ఆరినటులుండునుగాని యేస్వప్నసమయమునందు కండ్లవెంటనీరు స్రవించుచుండును. మరియు యేదైన యొక వుత్తమవస్తువును చూపునిలిపి అతిప్రీతితో చూడ నారంభించును. మరియు యీవ్యాధిగల రోగి నలుగురితో కూర్చుండుటకు విరక్తిగలవాడై వంటిగా ప్రసన్నుడైయుండును. యీరోగియొక్క నాడియందు భేదమే ర్పడియుండును. యీరోగి ముఖ్యచిన్హములు అనగా తనకుగల ప్రేమ పాత్రినుచూచి అథవా దానిపేరు విని దీర్ఘశ్వాస నిటూర్పువిడువనారంభించును. మరియు యీ చిన్హములయొక్క న్యూనత కారణముయొక్క అధికత్వము రోగి పరాక్రమము దుర్బలమునందు నిర్భరమై యుండును.

## కామముయొక్క చికిత్స.

ఈఅసక్తమనుజునియొక్క ప్రకృతి శరీరము యీరెంటిని ఔషధములు వైద్యములు మొదలగు సదుపాయములవలన చెమ్మను కలిగించవలెను. మాలీఖోలియా (పిచ్చి) రోగమునందు చెప్పబడిన విధముగా యిందుకూడా వుపయోగించవలెను. అనగా రోగియొక్క శోకము చింత దేనివలన హరించునో ఆయావుపాయములను చేయవలెను. కామ సంబంధ ఆసక్తరోగికి అనగా గానములు, నాట్యములు, సంగీతము, పాటలు, వాయిద్యము, కథలు, ధర్మసంబంధమగు ప్రసంగములు పురాణములు, మహాయోగుల చరిత్రలు గొప్పభక్తుల మాహాత్మ్యములు

అనగా మనస్సోల్లాసము కలిగించి మనస్సునకు మార్పుకలిగించు ప్రసంగములు చేయుచుండవలెను. అనగా ఇతరకార్యములయందు మనస్సు లిప్తపరచి తనకు ప్రేమగల వస్తువునుండి మనస్సు విరక్తిజెందునటుల చేయవలెను. మరియు యీరోగముగల పురుషునికి వివాహముకాని పక్షమున వెంటనే వివాహము చేయవలెను. యెందుకనగా ప్రేమతో విషయభోగమువలన కామరోగము దూరపరచునట్టి సామర్థ్యము కలుగుచున్నది. లేక ఇతర స్త్రీ భ్రాంతి అధికమగుటవలన యీవ్యాధికలిగినయెడల ధర్మశాస్త్రానుసారముగా యిద్దరికి సాధ్యమయినంతమట్టుకు వీలుకలిగించి ఇద్దరికి సంయోగముచేయు నుపాయమును చేయవలెను గాని వివాహముచేయుట మిక్కిలి మంచిది. ఇంతకంటె నధికమగు నుపాయము వేరులేదు. యత్నములను వృథాగా నుంచకూడదు. ఎందుకనగా కామము, చింత వృద్ధియగును. మరియు రోగబలవంతుడైనచో దోషములను వుచితవస్తువులతో పక్వపరచి వెడలించవలెను. యీవ్యాధి బహుదా, ప్రకృతిఆధీనమైయున్నది. గాన శరీరమునకు కష్టము హానికలిగించుచున్నది. కాబట్టి ప్రకృతిసంబంధమగు చికిత్సవలన శరీరము మస్తిష్కమునకు తడిపుట్టునట్టి నుపాయములను చేయుటమంచిది. మరియు, ఇందు చెప్పబడిన సర్వవిషయములు సంసారము వదలినట్టి మనుజుల విషయమై చెప్పియున్నాను. మరియు, యీ రోగము విశేషముగా అవివాహముగల యౌవనపురుషులకు కలుగుచున్నది. మరియు, బాల్యమునందే సంభోగమువలన తన్మయుడైన కారణమువలన యీవ్యాధి వుత్పన్నమగుచున్నది. పరాత్పరుడు యవనాంతర దురభ్యాసమును యిట్టి దురాలోచననుండి తప్పించి నిజమార్గమునందుంచుగాక.

---

# భయంకరస్వప్నములు

కాబూస్ అనగా భయంకరస్వప్నమని భావము. యీవ్యాధిని జానూమ్ అని కూడా వచించెదరు. యీ వ్యాధి నిద్రించు సమయమునందు యేదో గొప్ప భారము రొమ్ముపై బడినట్లుండుట అట్టి సమయమునందు శ్వాసబంధించినట్లు ప్రాణరాదకుండుట యెటుకదలుటకు వీలులేకుండుట, మాట్లాడుటకు నోరాడకుండుట, హీనస్వరముతో యితరులను పిలిచినట్టుగాతోచుట, ఒకానొకప్పుడు శ్వాసబంధించిపోవుట మొదలగు లక్షణములు కలిగియుండును. యీవ్యాధిని కాబూస్ అనుచున్నారు.

శ్వాసమునుబంధించి శరీరమును స్తంభింపచేసిన యెడల యీవ్యాధికి కాబూస్ అను పేరువచ్చెను. జాగిత్ అనియు, ఖానికు (స్తంభింపజేయునట్టియు కంఠమును బంధించునట్టివ్యాధి) అనబడును ఒకప్పుడు నిద్రించునపుడు సమయమునందు విశేషముగా తలనొప్పి కలిగి మెడను స్తంభించి మెదడునందుగల వాయుమార్గములను బాధించును. దోషముకూడా నిలిచిపోవును. వాయువు మెండగును. తరువాత కాబూస్ అను వ్యాధి కారణము వలన పిచ్చియు ఉత్పన్నమగును రోగహేతానుసారముగా ఈవ్యాధి రెండువిధములుగా విభజించబడెను.

(1) భేదము ఆవిరియొక్క పరమాణువులు ఊర్ధ్వముఖముగా యెక్కుటవలన యీవ్యాధి పుట్టుచున్నది, దోషబలానుసారముగా యీ వ్యాధి మూడువిధములుగా నుండును.

రుధిరకాబూస్ లక్షణములు.

(1) ఆవిరియొక్క పరమాణువుల మేళము రుధిరమునందు చేరిన యెడల శరీరము, నేత్రములు యెర్రగానుండుట, అతినిద్రగానుండును

గాని గాఢనిద్రకలుగనేరదు. మరియు, నిదురయందు వెరప్రని వస్తువులు కనుపించుట యీ మొదలగులక్షణములు కలిగియుండును.

### రక్తజకాబూస్ చికిత్స

ఈవ్యాధియందు రక్తమోక్షణము చేయించవలెను. కాళ్ళపిక్కలపై సలాకతో గంట్లువేసి రక్తము వెడలించవలెను లఘుఆహారమును యివ్వవలెను. మరియు, రక్తమును పలచనచేయు నుపాయములు చేయవలెను. మరియు, రక్తబలము తగ్గించునట్టి ఔషధములను ఉపయోగించవలెను.

(2) భేదము. ఆవిరివరమాణువుల మలము.కఫమునందు చేరినచో దీనిలక్షణములను వచించుచున్నాను. అనగా యింద్రియములు నీర్సించుట, శరీరము దుర్బలమగుట, నోరు ముక్కు వీనియందు నీరుస్రవించుట, నిద్రించుసమయమునందు తెల్లగను, ఆకుపచ్చగానుండు వస్తువులు కనుపించుట యీ మొదలగు లక్షణములు కలిగియుండును.

### కాబూస్ 2 వ భేద చికిత్స

ప్రథమ దశయందు వమనముచేయించి కఫమును వెడలించవలెను. పిమ్మట మెదడునందుగల కఫదోషముహరించి మెదడు స్థిరత్వమునొందుటకై తుమ్ముకు కలిగించునట్టి ఔషధములతో నశ్యముచేయించవలెను. గంధూషములు, లేపనలు మొదలగునవి చేయవలెను. మరియు, కాళ్ళుమర్ధించుట సర్వదూషితవ్యాధులయందు లాభదాయకమగును. వమనమూలకముగా కఫము వెడలించుటకుగాను (1) సోయివిత్తులు, (2) ముల్లంగివిత్తులు, యీరెండువస్తువులను కషాయముకాచి ఆకషాయమునందు తేనెకలిపి యివ్వవలెను. ఇందువలన వమనమగును. ఇట్టి వమనకరఔషధములు అనేకములు కలవు మరియు, యారిఖ్ఫైకరా కోకాయా గుళిక శిరస్సు, దేహమును, శుభ్రపరచుటయందు మిక్కిలి మంచిదిగాన వీటిని తప్పక వుపయోగించవలెను.

(3) భేదము. ఆవిరి పరమాణువులయందు వాతముచేరిన యెడల దీర్ఘాలోచన కలుగుట, నిమర అధికమగుట, నేత్రములు లోపలికీడ్చుట, మరియు, నిద్రించుసమయమునందు చీకటిగను, నల్లగను కనుపించుట, మొదలగు లక్షణములు కలిగియుండును. మరియు, ఆవిరి పరమాణువుల యొక్క రంగు ఆయాదోషములయొక్క రంగుగలిగి యుండును. అందు వలననే యీ దోషము అధికముగా యుండును. కాబట్టి యీ దోష రంగు కనుపించుచుండును.

కాబూస్ రెండవభేదము

తలయందు జలుబు పుట్టిన కారణమువలన కాబూస్ అను వ్యాధి కలుగుచున్నది. వుక్త రెండురోగములు మెదడునందుగల దుర్బల ముతప్ప వేరువిధముగా కలుగనేరవు. మరియు, యీరోగముయొక్క లక్షణములు నిద్రించు సమయమునందు విశేషముగా జలుబు ప్రవేశించును. యిందు మొదటి భేదముయొక్క లక్షణములేమియూ కనుపించ నేరవు.

2 వ కాబూస్వ్యాధి చికిత్సం

అడవి సదాపనూనె, ముంజగడ్డినూనె గోరువెచ్చగాకాచి తలపై మర్ధించవలెను. మరియు, శరీరమును యెరువు పుట్టించునట్టి వస్తువులు అనగా ఆవాలు, జున్ను, సజ్జీ యీవస్తువులను అడవినీరుల్లికో చేయబడిన శిరకాలో కలిపి శరీరమునకు లేపనము చేయవలెను,

# అపస్మారరోగ లక్షణములు



ఈవ్యాధియందు జ్ఞానము లేక తిరుగుటకు, నడుచుటకు, మొదలగు శక్తిహీనుడై యుండును. మరియు ప్రకృతి మారిపోవును. రోగి లేచుటకు శక్తిలేక పడిపోవుచుండును యిందువలననే దీనిని అరబ్బిభాషయందు సరాజనియు సంస్కృతమునందు అపస్మారమనియు చెప్పుదురు. ఈవ్యాధి సంపూర్ణ కారణము మలసంబంధమగు బంధనము (పిటిక) అనవచ్చును. మరియు మెదడుయొక్క పొరలు తత్సంబంధమగు నరముల రంధ్రములయందు యీవ్యాధి పుట్టుచున్నది. యీకారణమువలన మెదడుసంబంధమగు జీవము తనమార్గమునుండి నరములయందు ప్రవహించజాలకుండును. కాబట్టి బిగబట్టును. అనగా మలసంబంధము నరములయందు నిలిచినయెడల జ్ఞానాది శక్తియొక్క క్రియలయందు ప్రవాహము కలుగనేరదని స్పష్టమగుచున్నది. మరియు నరములుకూడా బిగబట్టజాలవు గాని మలసంబంధమగు బంధపిటిక పూర్తిగా నరములయందు యేర్పడినయెడల సర్వదా జ్ఞానశక్తి నశించును. అనగా సక్తా (సన్యాసం) అనువ్యాధియందు చూడగలవు. మరియు రోగి యిరుచుకపోవుటకూడా కలుగనేరదు. యీవ్యాధిమెదడు ముందుభాగమునందు పుట్టుచున్నది. గాన సమీపభాగమునందుండుటవలన తక్కిన భాగములయందుకూడా కష్టము కలిగించుచున్నది. అనగా ఇతరభాగములయందు కష్టము కలుగదే జ్ఞానశక్తి స్మరణశక్తి నష్టము కాజాలవని ఆలోచించవలెను. మరియు యీరోగముయొక్క విశేషత్వమువలన లేక స్వల్పత్వమువలన లేక యీహేతువుయొక్క తగ్గుదశవలన లేక హేతువు అధికమగుటవలన స్పష్టాంశములుగాను అంతట హెచ్చగుట తగ్గుట మొదలగుచేష్టలు గలుగుచుండును. ఇందువలననే జఖీరెఖ్వారజ్మశాహి అను గ్రంథమునందు

చెప్పినదేమన, ఒకప్పుడు యీక్రిందచెప్పిన లక్షణములు కూడా కలిగి యుండుననియు యీ క్రిందివిధానమును చెప్పబడియున్నది. అపస్మార రోగము కనుపించిన వెంటనే తగ్గిపోవును. తిరిగి వచ్చుచుండును. గాన రోగి నీల్గుట, (యిరుచుకొనుట) మాత్రము యుండనేరదు. ఇట్లు కలుగుటకు వేరుకారణము గలదు. అనగా మలదోషము కొద్దిగా కలుగుట వలన రోగి యిరుచ్చుకొనుట తటస్థించదు. మరియు రోగి బిగించుకొని పోవుటకు మూడుకారణములు గలవు. ఇందు (1) నరములు, దోషముతో నిండియుండుట, (2) వాటినాళములయందు చెమ్మ అధికమగుట (3) మెదడు బిగలాగుట, పీకుట, బంధించినటులుండుట యీకారణములు యావత్తు యీవ్యాధి నివర్తించుటకు శుష్కత్వము కలిగించుటవలన నివారణము కాజాలదు. యెటులనగా రోగి విరుచ్చుకొనిపోవుట (పిట్సు) శుష్కత్వకారణమువలన అయినయెడల నిమ్మళముగా తెరలుపుట్టించును. యీశుష్కత్వము మెదడునందుచేరి మెదడునందుగల చెమ్మ ఆరుట వలన మెదడు బిగబట్టినయెడల రోగికి ముందుగా మరణము సంభవించును. ఇందువలననే అపస్మారమునందు బిగిసికొనుటకు ముఖ్యకారణము మరియు నరములు, దోషముతో నిండిపోవుట మెదడు బిగబట్టుటవలన స్పష్టమగుచున్నది.

మరియు మెదడు బిగబట్టుట మెదడుయొక్క జ్ఞానశక్తి తీక్షత్వమువలన ఆవిరిపరమాణువులు మెదడునందు చేరుటవలన విషమునకును డి కంపుమెత్తి పరమాణువులు పారిపోవుటవలన యీరోగము వుత్పన్నమగుచున్నది. మరియు యెల్లప్పుడు యిట్టిసమయమునందుగల మలము విశేషముగా మెదడునందు చేరుచున్నది. మరియు యీమలము స్వల్పకారణమువలన కొద్దిగా అందుండి వెలి అల్లుగొనుచుండును. ఇట్టిసమయమునందు ఆవిరిపరమాణువులు మెదడుయావత్తు ఆక్రమించుచుండును. మరియు యీపరమాణువులు వాయువు ప్రచారముచేయు నరములయందు నిండుచున్నది. ఇట్టిసమయమునందు సంపూర్ణముగా నిండిన

కారణమువలన బంధనమేర్పడి అపస్మారమను వ్యాధి పుట్టుచున్నది. ఒకప్పుడు మలము మరియొక అంగమునందు నిలుచుటవలన ఆమలముయొక్క ఆవిరిపరమాణువులు మెదడువైపునకు యెక్కుచున్నవి. మరియు హీనదశయొక్క కారణమువలన మెదడు బిగించుటవలన ఆవిరిపరమాణువులు విశేషముగా మార్గములయందు నిండుటవలన బంధనము (సిటికె) ఏర్పడుచున్నది. ఒకప్పుడుమలదోషము బొత్తిగా లేకపోయినను విషజంతువులు అనగా తేలు, పాము, మొదలగునవికొట్టుట, కరచుట, వలన ఆజంతువులవిషము రక్తనాళమునందు ప్రవేశించి అంగముల సంయోగము వలన మెదడునందు చేరును. ఇట్లుచేరినయెడల మెదడునకు జెరుపుసంభవించి మెదడుకొంతతట తానే బిగిసిపోవును. గాని విషము యొక్కసారము మెదడునందు చేరకుండును. మరియు మెదడుబిగించుట వలన అవశ్యముగా బిగిసికొనిపోవుట అపస్మారమను వ్యాధి పుట్టినన్నమగును లేక అట్టిసమయమునందు మలము తక్కువగానుండి మెదడునందు శక్తి విశేషముగానుండిన ఎడల అట్టికారణము వలన కూడా చెడుదశను అతివేగముగా గ్రహించగలుగును అనగా మెదడు బిగిసికొనిపోవునట్టి హేతువువలన ఈవ్యాధి మూడు విధములుగా వర్ణించబడెను.

## 1 వ. భేదము అపస్మారలక్షణములు.

మొదటి భేదము కేవలము మెదడు నుండి పుట్టుచున్నది. దీని లక్షణములు: ఈరోగములు నాల్గు విధములుగానుండును. (1) మెదడునందుగల కఫదోషము వలన ఈవ్యాధిపుట్టగలదు. దీనిలక్షణములు బుద్ధిచెడిపోవుట, ఇంద్రియములు నీరసమగుట తలయందుబరువు అపస్మారము నందుండునప్పుడు నోటినుండి ఆవిరివెచ్చగా విశేషముగా వెడలుట నోటినుండి జొల్లుగారుట ముక్కువెంట నీరుకారుట శరీరముయావత్తు జారిపోయినటులుండుట, ప్రకృతిచల్లగానుండుట, మరియు కదలుటకు కఠినముగానుండుట, తిరుగుటకు కష్టముగానుండుట, ఈమొదలగు లక్షణములు కఫము వలన కలిగినవ్యాధి అనితెలిసేది.

## 1 వ భేదము అపస్మారచికిత్స

మలము పక్వపరచి శరీరమును శుద్ధినొనరించుటకై తీక్ష్ణవిరోచన ఔషధము ఇవ్వవలెను. మరియు కఫము వెడలించుట ముఖ్యము. ఇందువిషయమై యారజ్ మాత్రలున్ను, గారీఖూన్, ఇగామఖఖూన్ గుళికలున్ను ముసాంబరము మాత్రలున్ను, శిశిల్యాస్ మాజూన్, ఈకిందవివరించిన ఔషధమున్ను, మెదడునకు శుభ్రపరచుటకై మిక్కిలి లాభదాయకములు. ఈఔషధమును చేయుక్రమము ఈక్రింద వివరించియున్నాము.

## కఫజ అపస్మార హార గుళికలు

ముసాంబరము, తెగడ గారిఖూన్, కాటుకవిత్తులు, చేదుపుచ్చకాయగుజ్జు, సకమోనియా, ఈవస్తువులు అవశ్యకతానుకూలముగా తేనెతోనూరి మాత్రలుచేసి విరోచనార్థముఇవ్వవలెను. విరోచనమైనతదుపరి మిరియాలు జున్ను మెత్తగా నూరి నశ్యముచేయవలెను. ఈనశ్యము వలన తలయందుగల శేషమలము నశించును. మరియు ప్రతిదినము కొద్దికాలము రోగిని పరిశ్రమచేయుటకు ఆజ్ఞాపించవలెను. మరియు శరీరము చేతులను పైనుండికిందివరకుమర్దించవలెను. పాదములను మర్దించరాదు. క్రిందితట్టునమర్దించవలెను. ఈవిధముగా శరీరము, కాళ్లు, చేతులు, శిరస్సు, మొదలగు అంగములను ఇందులో చెప్పిన విధానముగా ఒకదాని తరువాత నొకటిమర్దించుట మిక్కిలి ప్రశస్తము.

## అపస్మారరోగ అపత్యములు.

మలకారక, అజీర్ణకారక, పదార్థములను శేవించుట, అండశాఖములు భుజించుట, మరియు ఏదోషమువలన దోషముకలిగి ఆదోష మలము కలిగి ఆమలముయొక్క ఆవిరిపరమాణువులు ఉత్పన్నమగునో అట్టివస్తువులను అపస్మారరోగవర్జించవలెను. మరియు, శరీరమునందు దీర్ఘముగా జీర్ణముకాగల వస్తువులను అనగా సేఫ్ (యాఫిల్సు) సలగం, ముల్లంగి యిత్యాది వస్తుసేవన చేయకూడదు. మరియు, శీతము, వుష్ణము, మైదు

నము బొత్తిగావర్జించవలెను. పారునట్టినీరు, వెన్నెలను చూచుట మాన వలెను. మరియు, ఉన్నతప్రదేశమునందు కూర్చుండుట, స్నానసమయ మునందు విశేషముగా నుండుట, విశేషముగా నడుచుట, గుర్రముపై నెక్కి సవారీచేయుట, మెరుపుగలవిన్ని, తిరుగునట్టి వస్తువులను నిదానించి చూచుట యీ మొదలగు యావత్తుపనులు అపస్మారరోగికి మిక్కిలి హానికరములని తెలియవలెను. మరియు, కఫజ అపస్మారముగలరోగికి కౌజుపిట్ట, పూరేడుపిట్ట, మాంసములందు సున్నపుతేటచేర్చి పక్వపరచి భుజించుట మిక్కిలి మంచిది. మరియు, అపస్మారముతోనున్న సమయ మందు యింగువ, తేనెనీళ్ల కలిపి నోటిలో పోయుట మిక్కిలి లాభ దాయకము.

## మాజూ౯ శిశిల్యూన్ చేయు క్రమము

అక్కలకర్ర, ఉస్తెఖుద్దూస్, సియాలియూన్ యివి ప్రత్యేకము 35 మాషములు. గారిఖూ౯ 17½ మాషము ఖ.కిర్దమానా, యింగువ, కచూరములు, పూదేబల్సా౯, బల్సా౯ మాతర్లు, యివిప్రత్యేకము 5½ మాషములు. యీవస్తువులు యావత్తు కల్వమునందుంచి చూర్ణించి వస్త్రగాలితమొనర్చి అడవినీరుల్లితో చేయబడిన శికంజబీ౯యందు కలిపి 4½ మాషము యివ్వవలెను. ఈవస్తువులలో కిర్దెమాన కొత్తదిగా నుండవలెను. యింగువ సుంగధమైనదిగా నుండవలెను.

(అధవా) దీర్ఘశ్లేష్మ అపస్మారరోగికి యారజ్ హిర్మిస్ మరియు శిమసల్లజీడిగింజలు మిక్కిలి వుపయోగకరములని గ్రహించవలెను.

## 2 వ. వాతకారణమువలన గలుగు అపస్మార లక్షణములు.

ఈవ్యాధిలక్షణములు గుండె అదరుట, (హార్టుదడ) నోటివెంట ఆవిరివెడలుట, నోరు పుల్లగానుండుట, రోగి అప్పుడప్పుడు భూమిపై విర చుకొని పడుట, యీరోగియొక్క కాంతి ఆమ్లపదార్థముయొక్క విశే షత్వము వలన వృద్ధిస్థానము వుబ్బుచుండుట, మరియు, అపస్మారమునకు ముందు చెడుఆలోచనలు విచారము అధికమగుట యిట్టిసమయము

నందు మలము మెదడునుండి శరీరమునందు కూడా వ్యాపించియున్నదని గ్రహించవలెను. మరియు, ఈరోగము కఫక అపస్మారముకంటె శ్రేష్ఠమైనదని చెప్పబడును. ఎట్లనగా కఫము మెదడు యొక్క ప్రకృత్యానుకూలముగా నుండును. ఏది అనుకూలముగానుండునో అది స్వల్ప హానిచేయునని గ్రహించవలెను.

ఆ 2 వ. వాతజ అపస్మారచికిత్స

మలమును పక్వముచేయుటకై పాటలీగె, క్వాదము, వాతమును దూరపరచుటకై వాతహరఔషధములు మలమును పక్వపరచుటకున్ను మెదడునందు బలముకలిగించుటకున్ను ప్రయోగించవలెను. మరియు, అంబరు, పన్నీరును వాసనచూడవలెను. కోడిమాంసము, మేకమాంసము మొదలగు మాంసరసములు యివ్వవలెను. ఇస్ఫిదాజ్ కూడా యివ్వవలెను. ఇస్ఫిదాజ్ అనగా ఒకవిధమగు రసపదార్థము.

ఆ 3 రుధిరదోష అపస్మార లక్షణములు

కేవలము రుధిరదోషమువలన అపస్మారవ్యాధి బహుతక్కువగా వుత్పన్నమగుచున్నది. అనగా పిత్తము వాతరక్తమువలన కఫజరక్తము వలన మరియు వాతకఫమువలన పుట్టుచున్నది. మరియు రుధిరవిశేషత్వము తలయందు కలుగుచున్నది. దీనివర్ణనము విశేషముగా చెప్పబడియె తిరిగిచెప్పబడుచున్నది. అనగా రక్తనాళము సంపూర్ణముగా నిండియుండుట ముఖము యెర్రగను బరువుగా నుండుట అపస్మారసమయమునందు ఒకానొకప్పుడు ముక్కువెంట రక్తము స్రవించుట యీవ్యాధికి ముందు అనేకవిధములుగా శిరస్సునందు వేదనము కలుగుట యెల్లప్పుడు తలబరువుగానుండుట కండ్లు చీకట్లు క్రమ్ముట తలతిరుగుట మరియు ఆమాశయముయొక్క రిక్తదశవలన లఘుత్వమునొంది ప్రకృత్యానుసారముగా విరోచనములౌట యీమొదలగు లక్షణములు యావత్తు మెదడునంబంధమగు అపస్మార లక్షణములని గ్రహించవలెను. మరియు యీఅపస్మారము వస్తూ పోతూ యుండును. ఒకప్పుడు ప్రత్యేక సమయమునందు

తలయందుగల కష్టమువలన దుఃఖము నొందుట బుద్ధిచెడిపోవుట యీ మొదలగునవి వాతము రక్తవాతము కఫమువలన బుట్టినట్టిమలదోషము వలన కలుగునని గ్రహించవలెను.

### శివ, రుధిరదోష అపస్మారచికిత్స

ఈవ్యాధియందు సాఫీన అను నరమును ఛేదించి రక్తము వెడలించవలెను. పిక్కలపైని రక్షలువేయవలెను ఆహారమును కొద్దిగా యివ్వవలెను. మరియు మలము తలయందు తప్ప తక్కిన శరీరము యావత్తు ప్రవేశించి యుండినచో మలము శరీరమునందు ప్రవేశించునట్టి లక్షణములు వేరుగానుండును. ఆలక్షణములు కనిపెట్టదగియుండును. అట్టి సందర్భమునందు అవశ్యముగా ముందు రెండుచేతులయందు సరేరూ అను నరమును ఛేదించి రక్తమోక్షణము చేయవలెను. ముందు ఒకచేతినరమును ఛేదించి అటుపిమ్మట అవశ్యానుకూలముగా రెండవచెయ్యి నరము ఛేదించవలెను. మరియు రోగబలానుసారముగా రక్తము వెడలించవలెను. మరియు అపస్మారరోగికి రక్తమోక్షణము చేయుటకు వసంతరుతువు మంచిది. మరియు మెదడునందు దుర్బలము జలుబు ప్రవేశించునట్టిభయము కలుగనియెడల కొన్నిదినముల తరువాత అవసరమునుబట్టి నాలుకక్రిందినరములు ఛేదించి రక్తము వెడలించవలెను. మరియు ముచ్చునగుంటయందు శస్త్రముతో గంట్లుపెట్టి రక్తముతీసివేయవలెను. శిరావేదనము అవసరము కలిగినయెడల నరఛేదనము అనగా చెడుమలము యెచ్చటయున్నదో ఆస్థలమునందు శిరావేదనముచేసి రక్తము వెడలించవలెను. మరియు వారమునకు ఒకపర్యాయము తిరిగి రక్తమోక్షణము చేయవలెనుగాని అన్నినరములు వకేపర్యాయము ఛేదించకూడదు. మరియు మలమును శుద్ధిచేయునట్టి సుపాయములను చేయవలెను. అవసరమునుబట్టి సాఫీన్ అను నరమును ఛేదించవలెను. లేక రెండుకాళ్ళపిక్కలపై రక్షలు వేయవలెను. ఇందువలన యీవ్యాధి శాంతించనియెడల ముక్కును వెడలించవలెను. అనగా రక్తము ద్వారా

మలమును తీసివేయవలెనని భా. ము. మరియు 7 దినములు రోగిని స్థిమితముగానుంచి తిరిగి రక్తమువెంట మలము వెడలించవలెను. అథవా హృదయము (హార్టు) మెదడుయొక్క శక్తిని రక్షించుచు తిరిగి మలము తీయవలెను. ఇందువలన ఆవిరిపరమాణువులను పుట్టించునట్టి మలమును మొదలంట నశింపచేయునని గ్రహించవలెను.

### 4 పిత్తజ అపస్మార లక్షణములు.

పిత్తకారణమువలన అపస్మారము బహుస్వల్పముగా పుత్పన్నమగును. దీనిలక్షణములు కేకలువేయుట యేమిశోచించుట తంద్ర ఉష్ణము నధికముగా నుండుట వమనమగుట ముఖము కండ్లు పచ్చగానుండుట అపస్మారము తఱచుగావచ్చుట మరియు వ్యాధి స్వల్పముగా వచ్చుట ఒకప్పుడు లేకుండుట మొదలగు లక్షణములు కలిగియుండును. అనగా మలము విశేష లఘువుగా పలచగా నుండుట మొదలగు లక్షణములు కలిగియుండును. దీనివిషయమై వెనుక చెప్పియున్నాను.

### 4 పిత్తజ అపస్మార చికిత్స.

ఈవ్యాధియందు పిత్తమలము తీసివేయుటకై ఆలుబకరా షర్బతు చింతపండు షర్బతు చల్లని నీళ్లయందు కలిపి పానము చేయవలెను. మరియు ప్రకృతి స్థిరపడుటకై చల్లని నశ్యములు చేయవలెను. మరియు చెమ్మను కలిగించునట్టి చల్లని తైలములను తలకు లేపనముచేయవలెను. మరియు అపస్మారము వచ్చినప్పుడు యేఅంగము బిగించబడియున్నదో దానిపై తైలములను గోరువెచ్చగా కాచిన నీళ్ళయందుకలిపి ఆఅంగములపై పోసి మర్దించవలెను. ఇందువలన శరీరము బిగించుట దూరమగును. మరియు అపస్మార సమయము నందేగాక తరువాతకూడా తైలలేపనము చేయుటయుంచిది.

(లాభము) మెదడు సంబంధమగు అపస్మారమువలన తలపై నొసలుపై తెల్లని మచ్చకలిగినచో అపస్మారద్రవ్యములు నష్టమైనవని గ్రహించవలెను. హాముదూపన్ అనువారు ఈఅంశమును వచించియున్నారు.

**వివిధ భేదము శరీరమునందు ఉత్పన్నమగు అపస్మార లక్షణములు**

ఈ అపస్మారము శరీర అవయవముల యందు అనగా ఆమాశయము ప్లీహము, (స్ప్లీన్) పొట్టపై పొరలు హృదయము, గర్భస్థానము, చేతులు, కాళ్లు ఇటువంటి వేరువేరు అంగములయందు పుట్టుచున్నది. అనగా సంయోగమువలన కలుగు తలనొప్పియందు వివరించబడినది. మరియు ఆయా అంగములయందు దోషముల ఆవిరిపరమాణువులు వాతములో కలసి మెదడునందు చేరుటవలన అపస్మార రోగము పుట్టుచుండును. మరియు అంగముల సంయోగానుసారముగా ఇట్టి వ్యాధులు అనేక భేదములు కలిగియుండును.

(1) అపస్మారము ఆమాశయ కారణమువలన ఉత్పన్నమగుచున్నది. అనగా ఆమాశయమునందు దూషిత కఫముగాని వాతముగాని పిత్తముగాని నిండియుండినచో ఆదోషములనుండి ఆవిరిపరమాణువులు మెదడువైపు నెక్కుచున్నవి. ఒకప్పుడు తగ్గుచున్నవి. ఇటువంటి హీనఅవస్థయందు మెదడు కష్టమును అనుభవించుచు శుష్కించుచున్నది. ఈకారణమువలన ప్రాణవాయువు సంబంధమగు మార్గములు బాధించబడుచున్నవి. ఇట్లు దోషము ఘనీభవించుటవలన అపస్మారము ఉత్పన్నమగుచున్నది. మరియు దోషము మెదడునందు మలదోషము స్థంభించకుండినచో యీ వ్యాధి కలుగనేరదు. అయినను మేధాశక్తి మిక్కిలి బలముగను తేజోవంతముగానున్న యెడల స్వల్పదోషముకూడా కలుగగలదు. అనగా ఆవిరిపరమాణువులు స్వల్పముగా నున్నను మెదడు బలమువలన మిక్కిలి పరాక్రమము గలవగును.

ఈపరమాణువుల మలము మిక్కిలి కూరిమముగానుండును. ఒకానొకప్పుడు చెడు ఆవిరి పరమాణువులు అధికమగుటవలనకూడా మెదడు కష్టపడుచున్నది. మరియు, బిగిసిపోవుచున్నది. యిట్టి అవస్థయందు మేదోహేతువువలన అపస్మారము ఉత్పన్నమగుచున్నది. మరియు, విశేష ఆవిరిలక్షణములు యిందునిమిత్తము చెప్పబడియె. మరియు,

లఘువగు ఆవిరివలన విశేషమై తిరుగునట్టి, నడుచునట్టి అంగముల యందు దోషబంధనము (పిటిక) యేర్పడనేరదు. యెందుకనగా కారణము బలమునఁ ఉండకుండునో ఆవిరి ప్రాణవాయువుయొక్క స్వాభావిక చేష్టలను యెన్నడు తగ్గించజాలదు. మరియు సామాన్యఅంగములో ఆవిరి యొక్క పరమాణువులు రేగుచున్నవో అచ్చట స్వయముగా దోష సంబధము (పిడిక) యేర్పడుచున్నది. మరియు, పరమాణువులు పైకెక్కినతరువాత మెదడుయొక్క జలుబువలన యీపరమాణువులు జాస్తి యగుచున్నవి. మరియు, ఆస్థానమునందు పిత్తముయొక్క ఆవిరివలన పరమాణువులు విశేషకారణమువలన బ ధనము (ముడి) కలుగుచున్నది. యెటులననగా అందుస్వభావిక గురుత్వము యెప్పుడు కలుగజాలదు. పరమాణువుల మలముయొక్క లఘుత్వము ప్రకటనమగును. యీదేవిధముగా పిత్తజ అపస్మారరోగము మిక్కిలి స్వల్పముగా ఉత్పన్నమగుచున్నది.

1 అపస్మారసామాన్యలక్షములు

(1) అపస్మారరోగి నాలుక పచ్చగను మరియు, నాలుక క్రింద నరములు ఆకుపచ్చగానుండుట.

(2) మనస్సు చెడుటవలన స్వల్పముగా కోపముకలుగుటవలన తల బరువుగానుండును.

(3) అపస్మారము రాకముందు నాలుక మిక్కిలి బరువుగా నుండుట.

(4) స్వప్నములు విశేషముగా వచ్చుట, చెడుస్వప్నములు కలుగుట, స్వప్నములు మరచిపోవుట, నపుంసత్వము కలుగుట ప్రతి వస్తువును చూచిన భయముకలుగుట.

(5) నోట ఆవిరి వెడలుట.

(6) మాలీఖోలియా (ఉన్మాదము) రోగివలె చెడుఆలోచనలు కలిగించుకొనుట.

(7) హృదయము బిగిసినటులుండుట మరియు, సంతోషము లేకుండుట మొదలగు లక్షణములు కలిగియుండును.

(8) ఏకార్యమునందున్ను స్పృహలేకుండుట, ఆగ్రహపడుట, ఈ మొదలగు లక్షణములు మెదడు సంబంధమగు అపస్మారలక్షణములని యెరుంగవలెను.

ఇప్పుడు యితర అంగముల సంబంధములుగల అపస్మారరోగ లక్షణములను చెప్పెదను.

ఆమాశయమునందుగల దోషకారణమువలన అపస్మారవ్యాధి ఉత్పన్నమగుచున్నది యీవ్యాధి 6. విధములుగానుండును. (1) వున్మాదమువలె ఆమాశయముకదలుచుండుట, (2) ఆమాశయమునందు మిక్కలి ఆకలికలుగు సమయమునందు వ్యాధికలుగుచుండుట, (3) ఆమాశయమునందు పొడిచినటులుండుట, మంట, కంపరము (4) ఒక్కొక్కప్పుడు రోగి కేకలువేయుచు లేచుట, ఒకానొకప్పుడు విరోచనము, వీర్యము వకేసమయమునందు వెడలుట, రోగసమయమునందు నరములు లాగుట, పేగులుబ్బుట, కీచుగొంతువచ్చుట. (5) వమనమైనవెంటనే అపస్మారము తగ్గుట, (6) అజీర్ణము మలము నిండినకారణమువలన అపస్మారము విశేషముగావచ్చుచుండుట, రోగసమయమునకు ముందుగా కనుపించుచుండుట, మరియు, విశేషకాలమువరకు నిలిచియుండుట ఈ మొదలగు లక్షణములు ఆమాశయమునందుగల దోషదుష్టత్వమువలన కలుగుచున్నవని తెలియవలెను.

మరియు, దోషప్రకోపమువలన వృద్ధియగుచున్నవి. యెటులననగా ఈరోగము దోషముయొక్క దుష్టహేతువువలన కలుగుచున్నది. ఒక్కొకసమయమున నిద్రావస్థయందు కూడా కలుగుచుండును. ఇట్టిసమయమునందు ఆకలి విశేషమగును. ఎటులననగా ఈఅవస్థయందు రక్తదశపొందుచున్నది. దోషము సహజముగా మెదడునందు చేరుచుండును. దోషము ఆమాశయమునుండి మెదడు

నశు చేరునప్పుడు మధ్యభాగమునందు ఆటంకము కలుగజేయునట్టి వస్తువు లేని కారణము వలన మొదటనుండు చేదుచుండును. ఈ కారణము నుబట్టి ఆమాశయ పూర్ణదశయందు మారుమూరు భుజించినను ఈ వ్యాధివలన విశేషహాని కలుగనేరదు. ఎటులనగా ఆమాశయము నిండి యుండు కారణమువలన చెడుదశ మెదడునందు సహజము చేరజాలదు.

(6) విశేషముగా ఉచితభోజనములను భుజించుటవలన అపస్మారము నశించగలదు. ఔషధమును శేవించవలసిన అవసరముండనేరదు. మరియు, ఈ అంశమువలన తెలియబడునదేమనగా, చెడుదోషముల కారణమువలన అపస్మారము పుట్టుననియు గ్రహించనగును మరియు, విశేష దోషమువలన కలుగు చెడులక్షణములు అనేకపర్యాయములు విభజించియున్నవి. ఇటుల చెప్పుటవలన రోగముకలిగించునట్టి దోష భేదములు తెలియబడుచున్నవి

## అపస్మార సామాన్య చికిత్స

ఈ వ్యాధియందు వైద్యునికి వుచితమని తోచినయెడల సలేరు, మరియు, బాసలికు, అకునరములను భేదించి రక్తమోక్షణము చేయించవలెను. యెటులనగా రక్తమోక్షణము వలన నాలుగు దోషములు హరించును. మరియు, సమస్త మలదోషములు హరించుటకై విరోచన వమన, క్రియలను చేయవలెను. మరియు, ఆమాశయ సంబంధమగు అపస్మారమునందు వమనముచేయుట మిక్కిలి గుణదాయకమని గ్రహించవలెను. మరియు, విరోచనము కానటువంటి ఔషధములు క్వాదములు ఉపయోగించుట ఉచితమని గ్రహించవలెను.

దోషము కఫయుక్తమైనయెడల వమనము చేయుటకై ముల్లంగి విత్తులు, సోయివిత్తులు, నూరి తేనెతో చేయబడిన శికంజబీన్ యందు కల్పి యిచ్చి వమనము చేయించవలెను.

దోషము పిత్తయుక్తమైనచో ఖర్బూజావిత్తులు, సోయి, ఖర్బూజావిత్తుల క్వాదమునందు సముద్రలవణముచేర్చి అందులో శికంజబీన్

కలిపి ఇవ్వవలెను. దీనివలన వమనమగును. మరియు, ఉష్ణోదకపానము చేయుట వుచితముగా యుండును. ఇట్టి వమనక్రియలవలన వమనము చేయించి ఆమాశయమునకు పుష్టికలిగించవలెను. ఇట్లుచేయుట వలన ఆమాశయమునందు మలము చేరజాలదు. మరియు ఆమాశయమునకు బలము కలిగించు ఔషధములు దోషానుగుణ్యముగా వుపయోగపరచవలెను, అనగా కఫదశయందు గులాబిపూలు, రూమామస్తకి సాంబ్రాణి, అగరు, జటామాంసి, ఈఅయిదు వస్తువులు చూర్ణించి పన్నీరుతో కలిపి ఆమాశయముపై లేపనము వేయవలెను. మరియు, తిరియాకు అరబా * పుష్టమును కలిగించునట్టి జవారిష్, గుల్‌ఖందు, యివ్వవలెను. మరియు, వేయించిన మేకమాంసము జాంగలపశువుల మాంసాదులయందు దాల్చినిచెక్కచేర్చి వేయించి యివ్వవలెను.

వాతదోష అపస్మారమునందు చందనము, పన్నీరు, ఆమాశయముపై లేపనముచేయవలెను. మరియు, కఫజదోషమునందు చెప్పిన ఔషధములను యివ్వవలెను మరియు పాలుత్రాగునట్టి మేకపిల్లమాంసము కోడిపిల్లమాంసము పెసలు, బాదంపప్పు, పాలకూరచేర్చి వండిన శాకమును యివ్వవలెను.

పిత్తజదోష అపస్మారమునందు పెద్దపాయలు, కాహూఆకులు, వేముచిగుళ్లు నూరి శిరకాలో కలిపి లేపనము చేయవలెను. మరియు బేదానపండురుబ్బు, తవాషీరి, యెండిన ధనియాలు, నూరి రసముతీసి యివ్వవలెను. మరియు దానిమ్మగింజల రసముగాని చింతపండుగాని మేకమాంసమునందు వేసి ధనియాలతో సుగంధమును కలిగించి వుడికించి యివ్వవలెను.

---

* తిరియాకు అనగా విషహర ఔషధము ఇది విషప్రకోపమును దూరపరచును. తిరియాకు అరబా అనునది నొక ఔషధము ఇందు హబ్బుల్‌గారు ఖస్పియానా ముర్ మకిజరావంద్ తబీల్ మొదలగు వస్తుసముదాయముతో చేయబడును.

గర్భాశయ సంబంధమగు అపస్మారమ హేతుదోషముల కారణములవలన వృద్ధిమైనదో శుష్క శిరోరోగమునందు చెప్పిన చికిత్సలను ప్రయోగించవలెను. మరియు ఆగర్భాశయ రక్తదశనొందినప్పుడు వచ్చునట్టి వ్యాధియందుకూడా శుష్కశిరోరోగమునందు చెప్పిన చికిత్సలు చేయవలెను.

2 వ భేద అపస్మార లక్షణములు

ప్లీహము (స్ప్లీన్) దోషకారణమువలన అపస్మారరోగము ఉత్పన్నమగుచున్నది. దీనిలక్షణములు ప్లీహ ఉబ్బుట, కరిక్యము జెందుట మొదలగునవి.

3 వ భేద అపస్మారలక్షణములు

ఈఅపస్మారము పొట్టపైనుండు ఝిల్లిపొర దహించుటవలన కలుగుచున్నది. దీనిలక్షణములు పుల్లనితేనుపులు వచ్చుట, కడుపులో ఆరాటము పైపొరయందుమంట, మేను గోచకుండట, వమనము నందు అపక్వమగు అన్నము వెడలుట యీమొదలగు లక్షణము కలిగియుండును.

4 వ. భేద అపస్మార లక్షణములు

ఈ అపస్మారము, వీర్యస్థానమునందుగల దోషమువలనగానిలేక గర్భాశయ దోషమువలనగాని కలుగగలదు. దీని లక్షణములు రజోధర్మము నిలిచిపోవుటవలన వీర్యము తగ్గుటవలన దోషములు గర్భస్థానము వీర్యస్థానములయందు ఖనీభవించి చెడుటవలన ఆదోష ఆవిరిపరమాణువులు మెదడునందుచేరి అపస్మారవ్యాధిని కలిగించును. మరియు రజస్సు నిలిచిపోవుటవలన అనేకదినములు మైథునము లేక వీర్యపతనము లేనికారణమువలన పొత్తికడుపు, మూత్రపిండములు, కడుపు మొదలగు వానియందు నొప్పి, భారము మొదలగునవి కలిగియుండును. మరియు గర్భాశయమునందు వికారముకలుగు కారణమువలన బహుశా

గర్భవతులగు స్త్రీలకు ఈఅపస్మారము కలుగునందురు. మరియు నిది ప్రసవించినంతోడనే తగ్గిపోవును.

4వ. శేక అపస్మార చికిత్స

ఈవ్యాధి ప్లీహాము మాలిఖోలియా (ఉన్మాదము) మిరాకు ఇక్తినాకురహిం (శిశునంచి) బిగించుట, యింకను చికిత్స రజోధర్మము నిలిచిపోవునట్టి కారణమువలన కలుగు ప్రకరణమునందు చెప్పబడియె. ఇది హేతువానుసారముగా మూడువిధముల అపస్మారవ్యాధులయందు చేయదగియుండును. ఇందు చెప్పినప్రకారము విరోచనమునకున్ను, బలము కలిగించునట్టి ఔషధములున్ను, ఇవ్వవలెను. మరియు స్త్రీగాని పురుషుడుగాని, వీర్యమును స్తంభింపజేయుటవలన అపస్మారము కలిగిన యెడల సంభోగముచేయించుట ఉచితము.

5వ. భేద అపస్మార లక్షణములు.

ఈ అపస్మారము ప్రాణవాయువుయొక్క సంయోగమువలన ఉత్పన్నమగును. దీని లక్షణములు ప్రాణవాయువు సంబంధమగు ప్రకరణమునందు తెలియగలదు. ఈవ్యాధి ప్రాణవాయువునందుచేరి హృదయమునందు ఉష్ణము కలిగించినయెడల ఆవుష్ణమును తగ్గించునట్టి ఉపాయములనుచేయవలెను మరియు, ప్రాణవాయువునందుగాని, మసారికాయందుగాని దోషసంబంధము కలిగినయెడల అట్టిసంబంధములను విడదీయునుపాయములను ఇంతకువ్రాయబడిన అంశముల ప్రకారం చేయవలెను. కఫము జలుబు కలీజా (యకృత్)నందుచేరినఎడల శ్లేష్మకషాయమువలన ఆయాదోషమును హరింపజేయువలెను. మరియు, ప్రకృతి స్థిరపడుటకై ఉచితనుపాయముల చేయవలెను.

6వ. భేదము ప్రేగుల దోషజనిత అపస్మార లక్షణములు

ప్రేగులయందు క్రిములుచేరుటవలన వీనిఆవిరియొక్క పరమాణువులు, ఇ దుాడి లేవి కొంచ ఘనాదు చేయుచున్నవి. ఇట్టిస్థితియందు నరములయందు గల దోషమువలన బంధనము (పిటికి) ఏర్పడి అపస్మారమును కలి

గించును. దీనిలక్షణములు చికిత్స క్రిమిరోగమునందు చెప్పబడి యున్నది.

## 7వ. భేద అపస్మార లక్షణములు.

కాళ్ళయందుగాని, చేతులయందుగాని, దోషముఖరీభవించు నట్టి కారణమువలన అపస్మారరోగము కలుగుచున్నది. అనగా వాతకారణము దోషస్థానమునందుండి తీసి మెదడునందు చేరుటవలన మెదడు సంకోచమునొందును. మరియు, మెదడు ఆరుటవలన అపస్మారరోగము పుట్టుచున్నది. మరియు, అంగములయందు అనగా చేతులు మొదలగు వానియందు వాతము కలుగుటవలన కొంతయు ఆ అంగములయందుగల ఒకనరమునందు తేజస్సుగల మలము చేరి స్తంభించబడి యూహేహైవాని (హృదయమునందుగల శక్తిస్థానము) యందు ప్రాణవాయువు ఆనరము నందు ప్రవేశించజాలకుండుటవలన ఆస్థానమునందుగల రక్తము దోషయుక్తమై జలుబు కలుగును. అందుండి చల్లనివాయువు పుత్పన్నమగు చున్నది. ఒక్కొకసమయమునందు కొంతకాలమునకు మలసంబంధమగు జలుబుపై భాగమువరకు ఎక్కుటవలన ఆస్థానము చల్లగానుండును మరియు ఇట్టి అపస్మారరోగశరీరము చల్లగానుండును. మరియు జలుబుస్థానమునుండి నరముల ద్వారా మెదడునందు చేరి మెదడుసంబంధమగు పొరయొక్క ప్రకృతిని చెరచి అచటనుండి మలము గట్టిపరచి స్తంభింపజేయును ఇట్లు మలము స్థభించుటవలన మెదో సంబంధమగు ప్రాణవాయువుయొక్క మార్గములను నొక్కి చేయును. అట్టిస్థితియందు అపస్మారముకలుగుచుండును. మరియు మలమును బంధించుటకు జలుబు కారణము కాజాలదు గాని మెదడు మలము విషదశయందు గ్రహించుచుండును. మరియు ఆరిపోవును. మరియు నరములు బాధించబడి అపస్మారము కలిగించును. తిరిగి శరీరమునందుగల వేడిప్రకృతి మారుటవలన కలుగునట్టి జలుబు మొదలగువాని వున్నతదశలగ్గనిదే మెదడుయొక్క విషమదశప్రభావము నశింపనేరదు, విషప్రభావము నశించువర్యంతము అపస్మారరోగము

వదలకుండును అపస్మారము యొక్క న్యూనాధిక్యత ఇట్టికారణమువలన కలుగుచుండును. అనగా మలము జాస్తి అయినకొలది బలము అధికమగును. అపస్మారము మిక్కిలి న్యవధిగా విడుచును. మరియు అపస్మారము నెలనెలకు వచ్చుచుండును మధ్యకాలము ఘడియు అరఘడియ కూడా వ్యవధి యివ్వనేరదు. అట్టిస్థితియందు రోగము అసాధ్యమగుచున్నది. మరియు దోషము లఘువుగను కారణము దుర్బలముగానున్న యెడల రోగిజీవించును.

చేతులు కాళ్లు వీటిదోషమువలన పుట్టినట్టి అపస్మారలక్షణములు చల్లనివాయువు ఆఅంగములనుండి పైకెక్కి నిమ్మళముగా రెండవ అంగమునందు చేరి అచ్చటనుండి పైకెక్కి మెదడునందు ప్రవేశించునటుల రోగికి తోచుచుండును. అపస్మార సమయమునందు నేత్రములు తెరచియుండుట నేత్రములవెంట నీరుస్రవించుట ముఖకాంతి నల్లగా నుండుట కాళ్ళుచేతివ్రేళ్ళు బిగలాగుట, రెండవఅంగము లాగుచుండుట మరియు అపస్మారము వచ్చుటకుముందు ఆవలింతలు విశేషముగా వెడలనారంభించుట శరీరము తిరిగిపోటులుండుట ఒల్లు విరుపు మూత్రము వెంటవెంటనే విడుచుట మొదలగు లక్షణములు కలిగియుండును.

### 7వ భేద అపస్మార రోగ చికిత్స.

అపస్మారము వచ్చుటకుముందు ఆఅంగములకు పైభాగము అనగా కాళ్ళుచేతులు పైనుండినవారు బ్యాండీను ఇత్యాది వానితో బిగించికట్టవలెను. ఇటుల కట్టుటవలన శీతవాయువుచెడుదశను పొందజాలదు. అనగా తేలుకుట్టినవెంటనే ఆఅంగమును త్రాటితో బిగించి కట్టుదురు. యెందుకనగా తేలువిషము పైకెక్కకుండును. ఇటులనే జలుబుకల అంగమును బంధించి ఆఅంగమును అగ్నితో కాపడము చేయవలెను. మరియు ఔషధములు పట్లు కట్లు మొదలగువాని వలన వుష్ణము కలిగించవలెను. అనగా అక్కలకర్ర చిత్రమూలము ఇంగువ వర్పియూన్ మరియు బల్సాన్ నూనె మొదలగు వస్తులేపనము చేయు

వలెను. మరియు వుష్ణము శీతముగల వస్తువులనుచేర్చి (సమశీతోష్ణము) గల వస్తువులను లేపనము చేయుట వుత్తమము. యెందుకనగా రక్తము నందు వుష్ణప్రభావము మిక్కిలి బలముగలదగును. మరియు వేడినీళ్ళ యందు బాబూనానూనెకలిపి ఆఅంగము ఆనీళ్ళయందుంచవలెను. ఆనీళ్ళుచల్లారినవెనుక ఆనీళ్ళక్రింద అగ్నియుంచి నీళ్ళను వేడికలిగించ వలెను. మరియు అపస్మారము కనపించనప్పుడు అనేకపర్యాయములు కఫమును వెడలించవలెను. మెదడునందు వుష్ణము జలుబు ప్రవేశించుట కై అడవినీరుల్లితో చేయబడిన శికింజబీన్ ఉస్తెఖద్దూసెషర్బతు మొదల గునవివుపయోగించవలెను. మరియుఅడవిసనాపాకుకస్తూరిఅంబరు, మొదల గువుష్ణవీర్యముగలవస్తువులనువాసనచూడవలెన. మరియుపొదినాతైలము అథవా యిటువంటి స్వభావికముగలతైలములను తలపై లేపనముచేయ వలెను. మరియు, శరీరము మలహీనముగను మెదడనందు బలముకలిగి యుండినయెడల యిట్టిస్థితియందు అంగమునందు వుష్ణము కలిగించు టకై ఆవాలు, జున్న, నల్లమిరియాలు, యవలు యీమొదలగునవి చూర్ణముచేసి తేనెతోకలిపి ఆఅంగమునకు లేపనముచేయవలెను. అథవా జైతూన్తైలము మొదలగునవి లేపనముచేయవలెను. మరియు, యీ చెప్పిన చికిత్సవలన ప్రయోజనము కలుగనియెడల ఆఅంగముపై జీడి నూనె పావురములము అంజీరుచెట్టుపాలు మొదలగువానితో వాతపడుటు ల లేపనముచేయవలెను. మరియు, కోకనజ్తైలము లేపనం చేయవలెను. యీలేపనాదులవలన అంగముపై వాతపడిగాయమగును. ఈగాయమును వెంటనే మాన్పగూడదు. యెందుకనగా యీగాయమునుండి హీనమల ము చీముగామారి కొద్దికొద్దిగా ఆగాయమునుండి వెడలనారంభించును. గాయముచేయునట్టి ఔషధములు లేపనముచేయుట రక్తవేయుటకంటె యంత్రముతో రక్తము వెడలించుట మంచిది. మరియు, వ్రణము త్వరలో మానకుండటకు సీసపుముక్కను ఆవ్రణముపై కట్టియుంచ వలెను. యిది గాక అనేకవుపాయములవలన వ్రణము త్వరలోమాన్ప

కొందుట చాలాఉత్తమము. మరియు, యితర అంగములయందు కలుగునట్టి అపస్మారమునకు కూడా ఉత్తరీతిగా చెప్పబడుచున్నది.

హకీం జాలీనూస్ గారి వాచా

జాలీనూస్ అను మహానీయులు వారి అనుభవము యీవ్యాధియందు వచించుచున్నారు. వారు ఒక అపస్మారరోగిని చూచినారనిన్ని ఆరోగి బాలుడనిన్ని యీరోగము పిక్కలయందుగల నొప్పివలన కలిగినదనిన్నీ ఆరోగినివిచారించగా చల్లనివాయువు మెదడునందు పిక్కలలో నుండి యెక్కినట్లు తోచుచున్నదని చెప్పెను.

మరియొక అపస్మారరోగిని విచారించగా కాలిబొటనవ్రేలునుండి చల్లనివస్తువు పైకెక్కినటుల తోచుచున్నదనిచెప్పెను. గాన అపస్మార రోగము కాలివ్రేళ్ళనుండియు పిక్కలనుండియు కలుగునని హకీము జాలీనూస్ గారు వచించిరి.

హకీము రూఫస్ గారి వాచా

ఒకపురుషునకు చేతిబాధవలన అపస్మారము కలుగనారంభించినది. ఆరోగి తన చెయ్యి మంచుకంటె చల్లనగుచున్నదని బాధపడుచుండువాడు అనియు చేతిదోషమువలనకూడా యీవ్యాధి వుత్పన్నమగుననియు హకీమురూఫస్ గారు దృఢపరుచుచున్నారు. కాబట్టి యీఅపస్మారము యితర అంగములనుండికూడా కలుగ గలదని తెలిసికొనవలెను.

3 వ విషసంబంధ అపస్మారలక్షణములు

స్థావర జంగమ విషముల వలన అపస్మారము కలుగుచున్నది. అనగా విషసంబంధమగుదశ,మస్తిష్కమువలన ఉత్పన్నమగును. ఈరోగము రెండువిధములు (1) విషసంబంధమగు జంతువులు కరచుటవలన యీరోగము వుత్పన్నమగును. దీనిలక్షణములు విషజంతువుల కాటు నొందినవెంటనే అపస్మారము కలుగుట.

3 వ విషసంబంధ అపస్మారచికిత్స

విషసంబంధమగు జంతువుల విషమును నశింపజేయునట్టి ఔషధ

ములు మొదలగునవి విమర్శికరణమునందు చెప్పబడును. గాన వానిని వుపయోగించవలెను. మరియు, 7 మాషములు సోపు, 35 మాషములు గుల్ ఖంను యీ రెండువస్తువులు కషాయముకాచి వడియబోసి అందులో తిరియాకు అరబా కలిపి పానముచేయవలెను. యిది మిక్కిలి లాభదాయకమైనది.

తిరియాకు అరభా విధి.

పాషాణభేది హబ్బుల్ గారు (ఏపివిత్తులు) పాలమడ్డి గుంద్రటి కచూరము మొదలగు నాలుగువస్తువులు సమభాగములు గ్రహించి చూర్ణముచేసి వస్త్రఘాళితముచేసి యీచూర్ణములో తేనెచేర్చి కల్పి అవలేహ్యము చేయవలెను. దీనిని తిరియాకు అరబా అందురు.

రెండవ తరగతి అపస్మార లక్షణములు

ఈఅపస్మారము బలము అధికమగుటవలన కలుగుచున్నది అనగా ఎవనికి మేధాశక్తి బలము మిగుల తేజోవంతముగా నుండునో అట్టి మనుజుడు దుర్గంధాది దినుసులను ఆఘ్రాణించుటచే అధికకష్టమునుపొందగలడు. ఇట్టిస్థితియందు శరీరము బిగిసికొని పోవునట్టి అపస్మారము కలుగుచున్నది. దీనిలక్షణములు తలనొప్పిగానుండునప్పుడు మేధాశక్తి బలము గలదగుటవలన కలుగువిషయమునందు చెప్పబడిన లక్షణములు కలిగియుండును.

రెండవ తరగతి అపస్మార చికిత్స.

ఈవ్యాధియందు గసగసాల మర్దనము స్నిగ్ధపదార్థములు ఉపయోగించుట మిక్కిలి ప్రశస్తము మరియు పథ్యకరచేపలను యివ్వవచ్చును. భోజనమునందు గసగసాలు కాహుగింజలు అవశ్యముచేర్చవలెను.

మరియొకవిధమగు అపస్మార లక్షణములు.

దీనిని యూనాని భాషయందు ఇబీలమిహావో అందురు. ఈవ్యాధియందు చేతులు కాళ్ళు బిగియుటగాక కొయ్యవలె బిగిసికొనిపోవుట తప్ప యితరలక్షణములు ఈజాతి అపస్మారమునందు కలుగనేరవు ఈ

అపస్మారము అన్నివిధముల అపస్మారములకంటె మిక్కిలి క్రూరమైనదిన్ని మరియు ప్రాణనాశకరమైనదని ఆర్యులు వచించిరి మరియు యీవ్యాధి ఆరంభదశయందు శరీరముయావత్తు బిగిసికొనిపోవనారంభించును. తక్కిన అపస్మారములయందు అపస్మారము వచ్చినప్పుడు మాత్రము శరీరము బిగిసిపోవునుగాని ముందుగా దీనివలె అపస్మారము రాకముందు శరీరము బిగించనేరదు

మరియొక విధమగు అపస్మార చికిత్స.

ఈఅపస్మారము వాతమువలనగాని శ్లేష్మమువలనగాని కలుగుచున్నది. గాన యిందువిషయమై కఫవాతము హరించునట్టి నుపాయములను చేయవలెను. మరియు శరీరము బిగిసికొనిపోవుటకుముందు చెప్పబోవునట్టి చికిత్సలవలన శరీర బిగింపు తగ్గించవలెను.

మరియొకజాతి అపస్మారము

ఇదిమరియొకజాతి అపస్మారము. దీనిని యూనాని భాషయందు తిబియూఅనివదించుచున్నారు. మరియు ఉమ్ముల్ శిబియా(పిల్లలకువచ్చునట్టి అపస్మారము) అనియు దిహాలుస్సిబియా అనియు, ఉమున్ శయాతీన్ అనియు ఫిజాఉస్సిబియాఅనియు చెప్పుదురు. ఉమ్ముస్శిబియాని అనుశబ్దము విషయమై వైద్యులకుభిన్నభిన్నఅభిప్రాయములుగలవు. మరియు హకీము రాజీగారు ఇదిఒక విధమగు అపస్మారమనియు నిది ఒక విధమగు వృష్ణసంబంధమగు జ్వరమువలన వుత్పన్నమగునని చెప్పిరి.

పెమొహ్రిశా నవరాలి (పిత్తజవృష్ణజ్వరము) అందురు. ఈజ్వరమునందు శుష్కత్వము అధికమై రోమకూపములు బాధించబడి చెమట బొత్తిగా బైటికి వెడలకుండును. యీవ్యాధియందు మూత్రము తెల్లగా నుండును. మరియు కొందరు వైద్యులు యీవ్యాధిపిల్లలకుమాత్రము వచ్చుననియు అప్పుడు దీనిని ఉక్తనామములతో పిలువబడుననియు చెప్పియున్నారు.

హాకీము అబ్దుల్ ఫరహాగారు మిఫ్తా అల్‌వైద్యగ్రంథమునందు ఉమ్మిసిబియా అనువ్యాధి ప్రత్యేకముగా అపస్మారమునకు చెప్పెదరు. మరియు, ఈవ్యాధి విశేషముగా పిల్లలకు వచ్చుచుండుటచే యిందువలననే దీనిని ఉమ్మిస్సిబియా అనిపేరు పెట్టబడినది. పసిపిల్లలకు అధికముగా అపస్మారము రాపడమునకు కారణమేమనగా శిశువులకు జన్మించిన మొదటనందు వాతము నిలిచియుండును. యీరోగము శిశువుల క్రిమే ణాహారించును. మరియు, జన్మించినవారి తలయందలి రంధ్రములు, గడ్డలు, మొదలగు వర్ణములు లేని ఆవర్ణము లేనందున యీవాతము వెడలిపోవును. గర్భమునందు గాని జననమైన తరువాత గాని మెదడునందు వికారము కలిగినచో అవశ్యముగా అపస్మారము ఉత్పన్నమగును. యీ వ్యాధి వయస్సు మిరినకొలది క్రమముగా తగ్గిపోవును. చికిత్సచేయు నవసరముండదు. మరియు, విరేచనము వమనములు కలిగించరాదు. అని అబ్దుల్‌ఫరహాగారు మిఫ్తా అను గ్రంథమునందు చెప్పుచున్నారు.

మరికొందరు వైద్యవరులు జీలానీగారు శిశువులకు అపస్మారముయొక్క చికిత్సచేయవలెనని చెప్పుచున్నారు. మరియు, బుద్ధిమాన్‌బిరుగ్వరులు దోషానుసారముగా చికిత్సచేసి ఇతరదోషములను హరింపజేయుట యుత్తమమని భావించినయెడల అట్టియోగ్యమగు చికిత్సలను ప్రయోగించి మలమును హరింపచేయవలెను. మరియు, శిశువులు పెద్దయగువరకు వ్యాధిగ్రస్తులుగా నుండుట బుద్ధిమాన్ వైద్యవరులకు విరుద్ధాంశము. మరియు, జన్మించినందుకు దోషము తలయందు వ్రణములు మొదలగు వానివలన హానిచెందిన కొంతయు విశేషము గలిగియున్నచో అపస్మారము కలుగుచుండును గాని కొలది కాలములోనే క్రమముగా దోషానుగుణ్యముగా స్వయముగా నష్టమగుచుండును. యిందు విషయములో అసగాబ్ అలామాత్ అను గ్రంథకర్తలు *ఉమ్మిస్సిబియా

* మరియు ఫిసీయా, ఆబూకలసా, రుజహానీ ఇవి కూడా అపస్మార రోగమునకు పేర్లు. శిశువులకు వచ్చునట్టి అపస్మారమునకు *జూన్ అందురు. ఫిసీయా అనగా చేష్ట

బాలు పోయవలెను. గాని యీరాగుల ఆబాలుని కలిసి అయిన యెడల మంచిది మరియు, ఆబాలుని చల్లనిగనుండు దు పరుండబెట్టవలెను. మరియు కఫసంబంధ లక్షణములు కలిపిన దిన యెడల కఫజ అపస్మారము నందు చెప్పిన నుపాయములను చేయవలెను. దానిపాలను పరీక్షించి నుపాయములను చేయుటయును మరియు, బాలురకు పాలయిచ్చునట్టి దాని పురుషసంపర్కము లేకయుండవలెను. మరియు, పురుషు, తుపాకి మొదలగు భయంకరమగు శబ్దములు బాలునికి వినబడకుండునట్టుల జాగ్రత్తతో కాపాడవలెను.

మరియు, సమస్త అపస్మారరోగములలో రోగి నాలుక కొరుకు కొనుట సహజము కాబట్టి సన్నని బట్టయందు దూదిపెట్టి చిన్న దిండువలె కుట్టి అపస్మారము వచ్చు సమయమునందు ఆదిండును రోగినోటిలో యుంచవలెను. యిందువలన నాలుక కొరుకుకొనజాలడు. మరియు, నోరుకూడా తెరవబడియుండును. అట్టిస్థితియందు యింగువ, జున్ను యీ రెండువస్తువులు తేనెతో తయారుచేసిన శికింజబీన్ యందు కలిపి రోగినోటిలో పోయవలెను. అథవా, నఖచికిని, కటుకరోహిణి, చేదుపుచ్చకజ్జు, కాకరకాయరసము, నల్లమిరియాలు, నల్లజీలకర్ర, శొంఠి, వర్ఫియూన్, జున్ను యీవస్తువులలో సంప్రాప్తమగు వస్తువులను నూరి ముక్కునకు లేపనము చేయవలెను. మరియు, సాంబ్రాణి ముఖము యెదుట ధూపము వేయవలెను. తరువాత పైవస్తువులనునూరి రోగిముక్కులోనుంచి వూదవలెను. యీ మొదలగు సదుపాయములు యావత్తు రోగివెంటనే చైతన్యుడగుటకు చేయవలెనని గ్రహించవలయును. మరియు రోగి శీఘ్రముగా చైతన్యుడగుటకు ఈ చికిత్సలను చేయవలెను. మరియు వూదేసలీబుభుజములపై (దండలకు) కట్టుట సమస్త అపస్మార రోగము శాంతింపచేయును పచ్చివూదేసలీబ్ దొరికినచో మిక్కిలి మంచిది. అథవా, ఎండిన వూదసలీబ్ గాని పచ్చిదిగాని దండవేసదాపా వీటిని వాసనచూచుటవలన అపస్మారరోగి చైతన్యుడగుటయేగాక అపస్మా

రము తిరిగి రాకుండా అడ్డగించును గాన మిక్కిలి లాభదాయకము. మరియు ఉష్ణమును కలిగించు వస్తువులతో శిర తాబ్ (కాపడము) చేయుట వలన రోగిని చైతన్యునిగా చేయును. ఉష్ణము కలిగించు వస్తువులను వెనుక శీతజశిరోరోగమునందు వర్ణించియున్నాను కాబట్టి ఆవస్తువులను ఈ వ్యాధియందు ఉపయోగించవలెను.

(సూరవనీ షూకూ) అక్కలకర్ర దంచి చూర్ణించి రోగినాశికము నందుంచి ప్రాకినమొదల తుమ్ములను కలిగించును. తుమ్ముకలిగినవెంనే అపస్మారమునుండి రోగి చైతన్యుడగును. మరియు 25 సంవత్సరముల వయస్సు వచ్చిన తరువాత పుట్టినట్టి అపస్మారము కేవలము మెదడునందు గల శీతప్రకృతివలన కలుగునదనియు దీనిచికిత్స మిక్కిలి కఠినమనియు నిది అసాధ్యమనియు వైద్యవేత్తలు వచించెదరు

## అపస్మారరోగమునందు హానికరములు.

శీఘ్రముగా తిరుగునట్టియు మెరుపుగల తిరుగునట్టి వస్తువులను చూచుట, ఎత్తుగలప్రదేశములయందు యెక్కుట స్నానము విశేష కాలము చేయుట విశేష వాయువు (గాలి) వీచునట్టి ఇండ్లయందు నివసించుట చెట్లెక్కుట యెండాకాలమునందు చల్లని వస్తువులు శీతాకాలమునందు ఉష్ణపదార్థములను సేవించుట మైథునము చేయుట మిక్కిలి విద్యాభ్యాసము చేయుట, లేక చదువుట వ్రాయుట పరుగిడుట, గుర్రమునెక్కి సవారిచేయుట, అధికముగా నడుచుట, మిక్కిలి శరీరవ్యాయామము చేయుట జాగరుగానుండు, ఆకుకూరలు తినుట, మద్యపానము చేయుట కాలినడక మెరుపు చూచుట పిడుగుశబ్దము వినుట గరిష్టభోజనము చేయుట, పంది మొదలగు నీచమృగముల మాంసమును భుజించుట, కలగం, కన్నబ్, గాడిదగడపర, ముల్లంగి, వెల్లుల్లి, నీరుల్లి, తురకవేప, చిరుసెనగలు, పోదినాఆకు, గాక ఇతర ఆకుకూరలను భుజించుట యీమొదలగునవి అపస్మారరోగమునందు అపథ్యములని గ్రహించవలెను.

మరియు మలమును పేరేపించుచున్నవి. మరియు అజామోదము అపస్మారరోగమును రేగగొట్టుచున్నది ఉష్ణోదకమునందుస్నానమాడుటవలన మెదడు నీరసమగును. శీతోదకస్నానము దోషము లనుపించుచున్నది సమస్తవిధములగు ఘం జాతులు సమస్తవిధములగు పాలు పాలతో తయారుచేసిన పదార్థములు హానికలిగించుచున్నవి, మరియు పిప్పళ్ళు, ఆవాలు, మొదలగు వస్తువులు ఆవిరిపరమాణువులను పైకి రేగగొట్టుచున్నవి మరియు మెదడునందు దోషములను చేర్చుచున్నవి. గాని దాల్చినచెక్క, చిన్నసోపు, తెల్లజీలకర్ర, కరివేపాకు, ఈవస్తువులు లాభదాయకములు ఇవి దోషములను మెదడునుండి క్రిందికి దించుచున్నవి నరములనుండి వాతమును తీసివేయుచున్నవి. గంధమువాసన, మాగీటలాఖ (నల్లగను యెర్రగనుండు ఒకవిధమగు వస్తువు) కతరాణ (ఇదివక విధమగు నూనె) యీవస్తువుల ధూపము మిక్కిలి హానిదాయకములు.

మరియు పగలు విశేషముగా నిద్రించుట కడుపునిండా భుజించి వెంటనే నిద్రించుట, మేలుకొనుట, ఈ మొదలగునవి హానిదాయకములు. మరియు అపస్మారరోగి యెదుట గంధపేరోజా ధూపమేయుట వలన హానికలిగించును. అనగా అపస్మారము శీఘ్రముగా వచ్చును. మేకమాంసము విశేషముగా భుజించుటవలన అపస్మారము పుట్టును. మేక చర్మము పూరిన నీళ్లు శరీరమునకు తగులుటవలన కూడా అపస్మారము కలుగగలదు. అకస్మాత్తుగా క్రోధము శోకము, భయము, కలిగించునట్టి మాటలు వినుటవలన కోపము దుఃఖము కలుగుటవలన మిక్కిలి హానికలిగించును. కొందరు వైద్యవేత్తలు యీవ్యాధియందు శాహు, ధనియాలు, వుపయోగించకూడదని ఆజ్ఞాపించిరిగాని హకీము శేకు అలి అబూశేనాగారి మతమునకు విరుద్ధమని గ్రహించవలెను.

# సన్న్యాసం అను రోగ లక్షణములు

సన్న్యాసం అనగా సక్తా అందురు. ఈ వ్యాధి అగస్మాత్తుగా వుత్పన్నమగును. యీవ్యాధిగల రోగి తిరుగుట, నడచుట, గ్రహించుట, మొదలగు అంగములు యావత్తు అగస్మాత్తుగా నిలిచిపోవును. యీ వ్యాధి తలయందు పుట్టి సర్వశరీరమునందు ఆక్రమించును. ఇట్టిస్థితియందు సర్వశరీరము నిష్ప్రయోజనమై సర్వేంద్రియములు సౌంజ్ఞహీనములగుచున్నవి. మరియు శ్వాసతప్ప ఇతర సౌంజ్ఞలేమియు లేకుండును. రోగి తిన్నగా వెల్లికిల పరుండియుండును. ఒక్కొక్కప్పుడు వుచ్ఛ్వాస నిశ్వాసములుకూడా యున్నట్టుతోచదు. ఈరోగిముఖము శవముఖమువలెనుండును. సక్తా (సన్న్యాస) రోగమునకున్ను శవమునకు గల భేదాభేదములు ఈప్రకరణ అంతమునందు వర్ణించబడును. మరియు నిచ్ఛేష్టతగాయుండుట యీరోగమునకు ప్రధానలక్షణము గనుకనే యీవ్యాధికి సక్తా అను నామము కలిగినది. యీరోగము మెదడుసంబంధమగు సమస్తపొరలయందు సంపూర్ణముగా దోషము బంధించి ఖరీభవించుటవలన యీవ్యాధి కలుగుననియు ఇదియే పూర్ణహేతువని గ్రహించవలెను. మెదడునందు దోషబంధనమేర్పడుటకు రెండుకారణములు కలవు. (1) మెదడు రొముక్కయు మెదడు సంబంధమగు చర్మము మార్గములు కఫము రక్తము వాతముతో నిండిపోవును. మరియు పిత్తము మెదడునందు నిండినమెదల బంధనమేర్పడజాలదు. గాని సక్తా (సన్న్యాసము) మాత్రము వుత్పన్నమగును. అథవా పిత్తమువలన వాపుకలిగి ఆవాపుకారణమువలన మెదడునకు పత్తిడి కలిగి యీవ్యాధివుత్పన్నము కాగలదు. (2) తలయందు విశేషముగా జలుబు ప్రవేశించుటవలనగాని దెబ్బతగులుట అదరుటవలన వాపుకలిగి ఆవాపువలన హీనమగు ఆవిరిపరమాణువుల చెడుదశవలనగాని అపస్మారమునందు చెప్పినట్టి అంశములు తలయందు ప్రవేశించుటవలనగాని మెదడు విశేషముగా శుష్కించును. మరియు మెదడు

యెండిపోవుటకు తాత్పర్యమేమనగా మెదడున బంధమగు ప్రాణవాయు వు మెదడునందు రాకపోకలకు మార్గములేకుండా యంతునటుల మెదడు యెండిపోవును. ఇట్టిదశయందు సన్యాసమనువ్యాధి పుట్టున్నమగును. మరియు మెదడు సంబంధమగు ప్రాణవాయువు రాకపోకల మార్గములు బంధించకుండి మెదడు శుష్కించనియెడల బంధమేర్పడజాలదు. యీ రోగముయొక్క వ్యాధ్యాధిక్యత హేతుబలాబలమునందు నిబ్బరమైనది.

మరియు హాకీముబుకురాత్ గారు సక్తా (సన్యాస)రోగము బలము గలదైనచో అసాధ్యమైనదనియు ఈరోగము దుర్బలముగాయున్నచో సహజముగా కుదురుటకు కష్టమనియు యీరోగముయొక్క బలాబలము శ్వాసనడుచుటకు కఠినత్వము సులభములనుకని పెట్టి గ్రహించవగును. మరియు ముఖమునందు ఇళకలుగుట శక్తిదుర్బలమగుటకు ఛిన్నములు నాడీయు గంధి విశేషత్వము వలన ముఖకళ కలుగనేరదు. శ్వాసయందు గ గ బ్బు కలుగుట లేక శ్వాసన శవకుండుట మరియు నీళ్ళు మొద లగు ద్రవపదార్థములు గొంతులో పోసినయెడల ముక్కు వెంట వెడలుట యిట్టి లక్షణములుగల సన్యాసరోగి శీఘ్రముగా మృతినొందునని చెప్పిరి.

మరియు హాకీముజాలినూస్ గారు మనుష్యుడు స్మృతిలేక పడి యుండును. నడచుట, తిరుగుట, కదలుట, మొదలగునవి నిలిచిపోవును. ఈలక్షణములుగలవానికి సక్తా (సన్యాస) వ్యాధి అనిగ్రహించవలెను. సుబాత్ స్వాకనిదని అని కనిపెట్టవలెను. సుబాత్ సక్తా రోగమునకు భేదముండును. ఈభేదమును సుబాత్ రోగముయొక్క వర్ణనమునందు సక్తారోగము జుమూద్ వ్యాధులమధ్య భేదము జుమూద్ వర్ణనమునందు వ్రాసియుండెను. జుమూద్ అనువ్యాధి రోగిని త్రిప్పివేయును. అట్టితల తిప్పు రోగిచెవులయందు శబ్దము కలిగినయెడల సక్తా (సన్యాస) రోగ ము పుట్టున్నమగుటకు హేతువనియు గురుజులి శరీరము యాకత్తు అద ర నారంభించినయెడల అట్టివానికి సక్తారోగము కలిగి అతివేగముగామృ తినొందును. కొందరనగా సన్యాసవ్యాధి మండు సాధ్యముగా రింము

కారణములు మాత్రము చూపించబడినవి కాబట్టి నేనుకూడా యీవ్యాధిని రెండుకారణములతో వర్ణించితిని.

1 వ భేదము సన్న్యాసముయొక్క భేదము.

ఈవ్యాధి మెదడుసంబంధమగు గుల్లభాగములయందు మలము నిండుటవలన కలుగుచున్నది, ఇదిమూడువిధములు.

(1) మెదడునందు వాపుసంభవించుటవలన సక్తా (సన్న్యాస) రోగము కలుగును ఈవాపు శీతకారణమువలనగాని వుష్ణకారణమువలన గాని కలుగుచున్నది. దీని చిన్నెములు చికిత్స సర్సాం అధ్యాయము నందు వ్రాయబడియున్నది. మరియు వాపువలన కలుగు సక్తావ్యాధి అగస్మాత్తుగా కలుగనేరదు. ఈవ్యాధియందుముందుగా సర్సాం చిన్నములు కలుగుచున్నవి. తదుపరి సన్న్యాసమనువ్యాధి వుత్పన్నమగుచున్నది. ఇటులనే పిత్తజ కఫజ సర్సాం (మెదడువాపు) వ్యాధిఅంతమునందు సక్తా (సన్న్యాసం) యనువ్యాధి కలుగునని గ్రహించవలెను. మరియు వాపువలన కలుగునట్టి సక్తారోగము జ్వరము లేనిదికలుగనేరదు. ముందు సర్సాంవ్యాధి కలుగుట అథవా దెబ్బ తగిలి వాపుకలుగుటయే దీని ప్రధానకారణము.

(2) చిక్కిలి కఠినమలము మెదడుయొక్క గుల్లనరములయందున్ను పొరలయందున్ను ప్రవేశించుటవలన వాపు సంభవించనేరదు గాని జ్ఞానాదిశక్తియొక్క మార్గములు బంధిచబడును. ఇట్టికారణము కఫసంబంధమగుమలమువలన కలుగుచున్నవి. మరియు వాతమలమువలన జ్ఞానశక్తియొక్క మార్గములు స్వల్పముగా బంధించును కాబట్టి ఈవ్యాధి వాతదోషమువలన స్వల్పముగా వుత్పన్నమగును.

(3) శరీరమునందు రుధిరము అధికమైనయెడల యావత్తు శరీరమున్న హృదయసంబంధమగు నరములు పూర్ణమగును. ఇట్టిస్థితియందు మెదడుసంబంధమగు గుల్లనరములు నిండినయెడల మనస్సుయొక్క మస్తిష్కముయొక్కయు ప్రకృతి శక్తియొక్క మార్గములు సర్వము బంధిం

చబడుటవలన హృదయసంబంధమగు నరములు క్రమముగా నెరవేర్చుట
కు అశక్తినొందును. కాబట్టి శ్వాసబంధించబడును. అట్టిసమయమునందు
సంపూర్ణశరీరము చల్లగానుండును. ఇట్టిదశయందు సన్న్యాసమనువ్యాధి యు
త్పన్నమగును కొందరు ఈవ్యాధి హృదయమునందు గ్రంథులమొందుటవలనకలు
గుననివచించెదరు. కాబట్టి దీనిలక్షణములు చికిత్సహేతువాని సారముగా
అనేక పరిశోధనములు వర్ణించబడెను గాని తిరిగి ఇచ్చుటకూడా చె
ప్పబడుచున్నది. అనగా ఈవ్యాధి కఫహేతువైనదో శరీరము నిస్సత్తువ
శరీరము తెల్లబడుట యీవ్యాధి తరుచుగా కనిపించుచుండుట శ్వాస
యందు గర గర శబ్దము కలుగుట మొదలగులక్షణములు కలిగియుండు
ను. ఇట్టి లక్షణములు అసాధ్యమనియు యీలక్షణములుగలరోగి జీవిం
చుట దుర్లభమనియు నెరుంగవలెను.

### సన్న్యాసవ్యాధి చికిత్స

ఈవ్యాధి చికిత్స రెండువిధములు (1) రోగసమయమునందు చే
యు చికిత్స (2) చైతన్యమైన తరువాత చేయు చికిత్స మరియు ముం
దుగా మలమును వస్తికర్మవలన వెడలించుట తదుపరి మెదడునందు వు
ష్ణము కలిగించునట్టి ఉపాయములను చేయుట మరియు వస్తి కర్మ (ఎనీ
మా) కు ముందుగా మలమును కరిగించు నుపాయములను చేయవలెను
మెదడునకు వుష్ణము కలుగునట్టి చికిత్స చేయుట ప్రశస్తమని గ్రహించ
వలెను.

### మెదడునకు వుష్ణము కలిగించు విధానము

కస్తూరి, అడవిసదాపాకు, లవంగములు, యీవస్తువుల వరిమళ
మును ఆఘ్రాణింపచేయవలెను. అథవా నఖచికనిఆకు (ముక్కుతుమ్ముడాకు)
నల్లమిరియాలు, జున్ను, యీవస్తువులు మెత్తగా చూర్ణించి ముక్కు
పుటములయందూదవలెను. మరియు సూచితనగు కాపడములు చేయ
వలెను. అనగా మెంతువస్తువులతోగాని లేక వచ్చు వస్తువులు వేయించి
కాపడము చేయవలెను. మరియు తలవెంట్రుకలు గొరిగించి జున్ను,

ఆవాలు, నూరి శిరకాలో కలిపి వృశికించి తలపై లేపనము చేయవలెను. ఈ చికిత్సవలన మెదడునందు ఉష్ణము ప్రవేశించును. మరియు సమదా ముక్కను వేడిచేసి తలకు కాపడము చేయుట లేక ఇటికరాయి నిప్పుల పై వెచ్చచేసి తలకాచుట లేక సమదాటోపిని తలకు పెట్టి అందుపై ఇసపరేకు వెచ్చచేసి కాచుటయు యీ మొదలగువానివలన తలకు కాపడము పెట్టుట మిక్కిలి ప్రశస్తము మరియు తలవెనుకభాగమునందు మిక్కిలి ఉష్ణము కలిగించుట ప్రశస్తము. మరియు వమనకరద్రవ్యములు అనగా కోడి వెట్రుక ఆముదములో ముంచి తమపరి యారిజ్ పైకరా అందుపై లేపనముచేసి గొంతులో త్రిప్పవలెను ఇట్లుచేయుటవలన వమనమగును. దీనివలన వాంతికాకుండినయెడల సౌసన్ నూనెయందు కోడివెంట్రుక ముంచి లేకయిలరయేనూనెయందైనను కోడివెంట్రుకముంచి రోగిగొంతుకలో త్రిప్పవలెను. మరియు, కఫజ సన్యాసవ్యాధియందు ఆమాశయముఖము మిక్కిలి కఫముతో నిండియుండును. కాబట్టి యీ వ్యాధియందు వమనము మిక్కిలి లాభదాయకము. సదాపాకునూనె, సౌసన్నూనె, మొదలగు ఉష్ణతైలములలో మైనము చేర్చి గోరువెచ్చగా నుండునప్పుడు మెదడునందున్ను, నాసికయందున్ను, చీలమండలయందున్ను, వేయవలెను. మరియు, తిరియాక్ కబీర్ సమురుదీతూస్ అను యీ ఔషధములు తేనెనీళ్ళలో కలిపి సమపాయముగా పీలుచబట్టి గొంతుకలో ఒక్కొక చుక్క చొప్పున పోయుచుండవలెను. మరియు, తిరియాకు కబీర్, సమురుదీతూస్, దొంకనిపో సోపు, చిన్నసోపుజీలకర్ర కషాయమునందు గుల్ ఖందు కలిపి పోయవలెను.

### వస్తి (ఎనిమా) చేయుక్రమము.

హాశా, సోయి, బరంజాసఫ్ శీన కంతర్యూన్, సొంపు సదాపాకు, మొంకుకి బుదాలు నలియగొట్టినవి, తాజామోదము యీ వస్తువులు కషాయముకాచి వడియగోసి ఆకషాయములో మొఱ్ఱశక్కర, జైతూన్‌నూనె, గుగ్గిలము, రసాంబరము, బూరెఆర్మని చేదుపుచ్చ

గుజ్జు, సకమోనియా, మొదలగునవి అవస్థానుకూలముగా గ్రహించి చూర్ణించి పైకషాయములో కలిపి వస్తిప్రయోగించవలెను. మలరహితమైన 4 వ. దినము, 7 వ. దినమునందు గాని 14 వ. దినమునందు గాని మలముయొక్క బలమునుబట్టి పైనెనప్రమాణము గతించిన వెనుక మలమును వెడలించవలెను. యీలాగున్నదినము గడచిన తదుపరి మలమును పక్వమునొందుటకై ప్రతిదినము భిన్నసోపు, సోపు, గోజాబాన్ యివి ప్రత్యేకము 1½ మాషకములు, గుల్‌ఖండు 35 మాషములు, యీవస్తువులు యావత్తు నకటిగాచేర్చి విరోచనార్థమివ్వవలెను.

చెనగకట్టు, కవుజుపట్ట, పూరేటిపిట్ట మాంసమునందు, జీలకర్ర, దాల్చినిచెక్కచేర్చి భోజనార్థముతో నివ్వవలెను.

హకీము మొహంమ్మద్ జికిరియాగారు సన్యాసము, పక్షఘాతము, అర్ధాంగము మొదలగు వ్యాధులయందు యింగువ యుపయోగించుట వలన మిక్కిలి ఉపయోగమైనదనిన్ని, వారునిపెట్టినారనిన్ని ప్రాతఃకాలమునందు సాయంకాలమునందు వేంగిజప్రమాణము యింగువ బ్రాందిలో కలిపి పానముచేయించవలెననిన్ని, 4 వ దినము 7 వ. దినము 14 వ. దినము గడచిన వెనుక అయారిజాత్ లేక అతి తీక్ష్ణము గల మాత్రలు ప్రయోగించి మలమును వెడలించవలెననియు, ప్రతి 7 వ. దినమునందు ఒకటిరెండు పర్యాయములు ప్రకృతానుసారముగా విరోచనమునకు యివ్వవలెననియు మరియు, రోగి చైతన్యుడైనను, 24 వ. దినమువరకు యీప్రకారములవలన రోగబలమును తగ్గించవలెననియు తరువాత ప్రతిదినము ప్రాతఃకాలము అంజూరుతైలము వేళ్ళ కషాయములతో వుపయోగించవలెననియు వచించిరి.

మరియు, అర్ధాంగ వాత చికిత్సవలన కఫజ సన్యాసరోగము హరించును. ఒకప్పుడు తిరిగి పక్షవాతము అర్ధాంగవాతము వుత్పన్నము కాగలవు అనగా పక్షదోషమువలన అంతమునకు సన్యాసరోగము కలుగగలదు. యిటుల పక్షవాతము తరువాత వచ్చుటకు కారణము రక్త

మూచెమటవలన జనించునని యు, అట్టిసమయమునందు రక్తమోక్షణము యిక్కిలి అవసరమనియు రక్తము వెడలించుటవలన రోగము నివారణ మైనను రక్తమోక్షణము చేయుటయందు ఆలశ్యమైన యెడల అర్ధాంగ వాతముగాని, సన్యాసముగాని, కలుగగలదు. యీ కారణమువలన వైద్యవరులు కఫజ సన్యాసరోగమునందు రక్తాధికచిహ్నములు కను పించినచో సమస్తచికిత్సలకంటె ముందుగా రక్తమోక్షణము చేయవ లెను. మరియు, రక్తజ దోషము శరీరమునందు విశేషముగా ప్రవేశిం చినచో దీనిలక్షణములు ముఖకాంతి నలుపు కలిసిన యెరుపురంగు కలిగియుండుట, నొసలునందు చెమట పట్టుట, రక్తనాళములు రెండును బరువుగానుండుట, మరియు, రక్తజ సన్యాసము రక్తమోక్షణమైన వెనుక పక్షవాతమునందు ప్రవేశింపజాలదు. యెందుకనగా అటువంటిరోగము నందు రుధిరము వెడలించనిదే యీ వ్యాధినుండి తప్పించుటకు మార్గము మరియొకటి లేదు. రక్తము వెడలించుటవలన దోషశేషముండనేరదని కొందరి అభిప్రాయము యిందు వ్రాసితినిగాన గ్రహించవలెను.

### సన్యాసము రక్త వ్యాధి చికిత్స

ఈవ్యాధిగలవానిని రోగమునుండి తప్పించవలెనని రెండు చేతుల నరేరు అను నరములను ఛేదించి విశేషముగా రక్తము వెడలించవలెను. వైద్యునికి బుద్ధికుశలత కలిగియున్నయెడల మెడనర ములు అనగా జీవనరములనుండి రక్తము వెడలించవలెను. తరువాత కాళ్ళపిక్కలపై శస్త్రముతో గంట్లుపెట్టి రక్తము వెడలించవలెను. అ టుపిమ్మట కాళ్లు, చేతులు మర్దించుట బంధించుట శికంజబీన్ వేడినీళ్ల లో కలిపి పుక్కిలించునటుల చేయుట సాధారణమైన వస్తి (ఎనిమా) చేయుట ఈమొదలగునవి యీ వ్యాధికి సామాన్య చికిత్సలని యెరుంగ వలెను. ఈ చికిత్సలు చేసినపిమ్మట తలయందు బలము చేరుటకై గుల్ రోగన్ (గులాబినూనె) బాబూనానూనె, శికా, మొదలగునవి తలపై లేపనముచేయవలెను. తరువాత తిరిగి సాధారణవస్తి ప్రయోగించుట

ప్రశస్తము యీసనుపాయములవలన వ్యాధిహరించగలదు. సన్యాస రోగమునుండి తప్పించుకొనిన తరువాత లఘుభోజనములున్న కరోచ నమునకు యివ్వవలెను భోజనమునకు యవగంజి యివ్వవలెను. క్రమే ణా కంజుపిట్టమాంసము, పూరేడు, కోడి, మాంసములనుయివ్వవలెను. ఈవ్యాధి వాతదోషము వలన కలిగినచో దీనిలక్షణములు చికిత్స అప స్మారాది రోగములయందు వ్రాయబడిన రీతిగా చేయవలెను. మరియు రోగము రెండు దోషములవలనగాని మూడు దోషములవలనగాని కలిగినయెడల ఆయాదోషలక్షణములు కలిగియుండును గాన ఆయా లక్షణములకు తగినటుల చికిత్సకూడా దోషానుకూలమునుగా చేయ వలెను.

## రెండవ సన్యాస రోగ లక్షణములు.

మెదడు శుష్కించుటవలన యీసన్యాసరోగము ప్రుత్పన్నమగు చున్నది దీని చిన్హములు వేరువేరుగా నుండును కాబట్టి దీనిచిన్హము లనుబట్టి చికిత్స వేరుగానుండును. ఈవ్యాధి ఆరంభమునందు కారణము ల సంఖ్యను వర్ణించబడి మె మరియు అపస్మారముయొక్కయు కాబూస్ యొక్కయు వ్యాధుల ప్రకరణమునందు మెదడు ఆరుటకుగల హేతువు ల వర్ణనముకూడా చెప్పబడియున్నది.

## విశేషముష్టవ్య

సన్యాసముగలరోగి యెల్లప్పుడు శవమువలెనుండును. మరియు ఈ సరవ్యాధివలన చనిపోయిన వానివలె సన్యాశిరోగముగలవానికి వెంట నే దహన భూస్థాపితములను చేయకూడదు. ఇందువిషయమై జాలీనూ స్ గారు "సన్యాసరోగముగల వానికి 72 గంటలవరకు స్మశానవాశిగా చేయకూడదని చెప్పిరి.

## సన్యాసరోగి జీవితమరణములను కనిపెట్టు నుపాయములు.

సన్యాసరోగముగలరోగి జీవించియున్నడా లేక మృతినొందినా డా అని కనిపెట్టుటకు 5 హేతువులుగలవు. (1) ఏకినదూది లఘువగు

పింఛముగాని మృధువగు నన్నని పావురపు వెంట్రుకనుగాని రోగి ముక్కువద్ద నుంచినయెడల ఆవెంట్రుక కదలినచో జీవమున్నదనియు కదలనిచో రోగిచనిపోయినాడని గ్రహించవలెను (2) కేవలము తేలికగానుండు పాత్రయందు నీళ్ళుపోసి రోగిరొమ్ముపై నుంచవలెను. నిదానించి ఆపాత్రినుచూచుచుండవలెను. అంతలి నీళ్ళు కదల నారంభించినయెడల రోగికి ఉచ్ఛ్వాస నిశ్వాసములున్నవనియు మరియు నీళ్ళు కదలకుండినయెడల శ్వాసనిలిచినదని గ్రహించవలెను. (3) పొత్తికడుపు గుహ్యాముయొక్క ఛిద్రమునందున్న గుదిస్థానముయొక్క లోభాగము వెనుకవైపునకు తిరిగినట్టి ఒకనరము హృదయమునుండి వ్యాపించియున్నది. రోగియెంతవరకు జీవించియుండునో అంతవరకు ఆనరము కదలుచుండును. కాబట్టి ఆనాడీనరమునందు వ్రేలునుంచితాకినచో ఆనాడి కదలుచుండినయెడల రోగిజీవించియున్నాడనియు ఆనాడి కదలకుండనిచో రోగి చనిపోయినాడని భావించవలెను. (4) నేత్రములయందుగల పాపయందు తేజస్సుయున్నచో రోగిజీవించియున్నటుల గ్రహించనగును. (5) వెలుగుగల యింటిలో ఆరోగికండ్లువిప్పిచూచినయెడల కంటిపాప చూడగా చూచునట్టివాని ప్రతిబింబము స్పష్టముగా కనుపించినచో రోగిజీవించియున్నాడని తెలిసికోవలెను. ఇటులనే చీకటిగదిలో రోగినుంచి దీపము వెలిగించి రోగి కండ్లువిప్పి దీపము దగ్గరకు తీసికొనిపోయి కండ్లను పరీక్షించగా ఆదీపమురోగియొక్క కండ్లయందు కనుపించినయెడల రోగిజీవించియున్నాడనియు అట్లు కనుపించకుండిన రోగిచనిపోయినాడని గ్రహించవలెను. మరియు రోగిశరీరము వుబ్బి కుళ్ళినచో అట్టిరోగిని వెంటనే దహనపరచవలెను.



# సర్వాంగసచ్చు -పక్షఘాతము యొక్క లక్షణములు.



ఇస్తరఖా అనగా తిమ్మిరిసచ్చురోగమునకు పేరు. ఇది ♦ అజలా బహాశల్ శీర్ణము నొందుట వలనకలుగుచున్నది. ఈవ్యాధివలన అవయవములు అజలాయొక్క కారణమువలన తిరుగుచున్నవి. ఈఅజలాయందు హీనత్వము కలిగినచో తిమ్మిరి కలిగియుండును. హేతువుయొక్క అనేకత హీనతవలన శరీరము తిమ్మిరి చేష్టహీనత నొందుచున్నది. దోషము కేవలము సంధులయందును కీళ్ళయందు మాత్రమునుండి చర్మమునందు చేరనియెడల శరీరమునకు తిమ్మిరి పుట్టనేరదు. ఒకానొకప్పుడు ఒకనరమునుండి రెండవనరమునందు కష్టమునంభవించినయెడల శరీరము ఆనరముతోన బంధము కలిగియుండు కారణమువలన శరీరము సచ్చుపడుచున్నది. శేషించినశరీరము ఆరోగ్యముగానుండును. అనగా గొంతు, నాలుక, మూత్రకోశము, కుడిచెయ్యి, గోళ్లు, లేక యితర అవయవములు దుర్బలమునొంది సచ్చువ్యాధి సంభవించును. మరియు శేషశరీరము ఆరోగ్యముగానుండును. ఒకప్పుడుశరీరముయొక్క చెడుమెదడు సంబంధమగు జీవనరములయందు మెదడు సంబంధమగు జీవనరములయందు దోషము కలుగుచున్నది. ఇట్టిదశయందు శరీరము తలనుండి పాదములవరకు సచ్చుపడుచున్నది. ఈవిధముగా కలుగు ఇస్తరఖా (సచ్చు) కలుగుటకు పూర్వపు ప్రాచీన వైద్యులు పక్షవాతమనియు అర్ధాంగవాతమనియు ఫాలిజ్ అనివచించియున్నారు. ఫాలిజ్ అన

♦ అజలా అనగా చేపఆకారమువంటి కండరము ఇది శాశపిక్క, మొదలు, భుజదండముల వరకు వ్యాపించి యుండును

బశల్ అనగా శరీరముయొక్క జీవనరమునకు పేరు ఇది అనేకములగు నరములతో కలిసియుండును. ఇవిశరీరముయొక్క అవయవములకు తిరుగుటకు శక్తినిచ్చును దీనికారణమువలన కదలింపుటకు ముడుచుకొనుటకును శక్తి కలిగించును.

గా అరబ్బిశబ్దము. దీని అర్థము సగభాగమని గ్రహించనగును. ఒకానొక ప్పుడు శరీరము యొక్క ఒకనరము మరియొక నరముతో అనగా చెడు మెదడులో వుత్పన్నమైన జీవనరములయందు దోషము కలుగుచున్నది. ఇట్టి దశయందు పాదవుగా అర్ధశరీరము నిష్ప్రయోజనమైపోవును. తదుపరి తలయందుగల జీవనరములు ఆరోగ్యముగా నుండునుగాని ఒకానొకప్పుడు ముఖచర్మము తిమ్మిరిగానుండును ఎందుకనగా అచ్చటి నరములు ముఖమునకు ముఖసంబంధమగు అంగమునకు జ్ఞానము నుండి కలిగించుచుండును. అచ్చటినుండి బైలువెడలి మెడముచ్చునగుట బైటికివచ్చు



చున్నది. ఈనరము చెడు మెదడునందు పుట్టిన జీవనరము మరియు నఖీరె అను గ్రంథమునందు కొన్ని పక్షవాతములు అనగా శరీరము పొడుగునుండి సగము శరీరము సుస్తీనొంది నిష్ప్రయోజనము గలదగును. ముఖ అవయవములు ఆరోగ్యముగా నుండును యిందు విషయమై పైన వర్ణించి యుండులక్షణములు కలిగియుండును. మరియు, తలయొక్క సగముభాగము కూడా యిందు కలిసిన మెడల పాలిజ్ అనగా పక్షవాతమనియు, లఖవా అనగా అర్ధాంగ వాతమనికూడ వకే పరియాయము పుట్టుచున్నదని వచించియున్నది.

చెడు మెదడునుండి వుద్భవించు జీవనరములు చూపించు చిత్రపటము.

కిబిలునహావు అను గ్రంథకారుల వక్కాణింపు, అర్ధాంగము ఈరెండువ్యాధులు చెడుమెదడునుండి పుట్టినట్టి నరములయందు ఉత్పన్నమగుచున్నవి. యీదశయందు తల యొక్క అవయవములు తప్ప సర్వశరీరము పక్షవాతమువలన పడిపోవును. మరియు, ఇటువంటి ఇస్తిరఖావ్యాధికి యూనాని భాషయందు లాఖాబిలక్విహ్ హా అనగా పక్షవాతము అందురు. ఇస్తిర్ఖా యందు సుఖచర్యలు తిన్నగాయుండును. ఇందువిషయమై పైన చెప్పియున్నాము. మరియు, ఇస్తిర్ఖా సామాన్యమైనది.

మరియు పక్షవాతము వచ్చుటకు కారణము సంపూర్ణముగా మెదడుయొక్కయు, చెడుమెదడుయొక్కయు, నరముల మూలములయం దుద్భవించినయెడల సక్తా అనగా సన్న్యాసముచు వ్యాధి అనుపించును. ప్రాచీన వైద్యవరులు ఇస్తిరఖా వ్యాధిభేదమని చెప్పియుండలేదు. యీ రెండువ్యాధులు కూడా ఒకటిగానే వర్ణించియున్నారు. మరియు, యీ రోగమునందు రెండు సంపూర్ణ కారణములుగలవు. (1) అచ్చటి జ్ఞానశక్తి గమనశక్తియొక్క ప్రాణవాయువు సంబంధముగు నరములు కండరముల యందు బంధనమేర్పడుట వలన గాని లేక నరములు తెగిపోవుటవలన గాని ఉక్తమగు ప్రాణవాయువు ఆనరములయందు ప్రవేశించజాలకుండును. అచ్చట బంధనమేర్పడుట వలన ప్రాణవాయువు సంచారము చేయునట్టి నరములు బంధించబడుట వలన బంధనము లేకుండినను ఉక్తశక్తి నరములయందు ప్రవహించును. పిమ్మట అంగముల ప్రకృతియందు ఇట్టిలక్షణములు సంభవించును. యిందువలన అచ్చటశక్తి యొక్క బలమును గ్రహించును. మరియు, ఇటువంటి ఉపద్రవము యొక్క కారణము ఉష్ణము, జలుబు, చెమ్మ శుష్కత్వములవలన కలుగుచున్నది. మరియు, జ్వరాంశము యింద్రియములయందు స్వల్పహాని కలిగించును. యీలక్షణము కలిగియుండిన యెడల శుష్కత్వము అనగా తపెదిక్ (క్షయ) రోగి వలన తెలియగలదు. కాబట్టి ఉష్ణము

చెమ్మ అంగములయందు విశేషముగా యుండుటవలన యింద్రియముల శక్తి తమ స్వభావిక శక్తియందుండును. మరియు, ఉష్ణము శుష్కత్వము అధికమై యేవిధముగా శక్తిని బంధించుచున్నవో ఈశ్వరుడెరుగును గాని మానవులకు సాధ్యపడజాలదు. మరియు జలుబు ప్రాణవాయువు యొక్క ప్రకృతికి విరుద్ధముగానుండును. మరియు నిజప్రాణవాయువు అనగా జీవాత్మసంబంధమగు వాయువు దేహఆధీనములో లేదు గాని జీవాత్మ యొక్క స్థానమునందు దోషము ఆక్రమించుటవలన ఆస్థానమునకు శుష్కత్వము కలిగించుట వలన మొదలగు కారణములవలన యీవ్యాధి కలుగుచున్నది. మరియు యెల్లప్పుడు జలుబు జీవస్థానమునందు చేరి యుండినచో బహుశ ఒకఅంగమునుండి రోగము పెరుగనేరదు. ఇట్లుకలుగురోగ చికిత్సకూడా సహజముగా నుండును. అనగా ఉష్ణమును కలిగించు లేపనతైలాదుల వలన తగ్గిపోవును. మరియు చెమ్మ శరీరసంబంధమగు కీళ్ళయందున్న సంధులయందున్న చేరి చుట్టబడిన కారణమువలన నరములు కండరములు ఒకటికొకటి చేరుచున్నవి. కాబట్టి ప్రాణవాయువుయొక్క రక్షణములు అనగా జీవాత్మకు మంధముగను తీక్ష్ణముగను బిగించును. మరియు వాయువును నరములలో చేరనియ్యక ఆటంకము కలుగును మరియు దేహప్రకృతి జలుబును గ్రహించుటవలన తపించుచుండును. మరియు జలుబు ప్రాణవాయువునకు విరుద్ధముగానున్నయెడల ఇస్తరఖా వ్యాధి కారణము శరీరముయొక్క అనేకభాగములలో కలుగుచున్నది.

మరియు దోష సంబంధమా లేక నరములు తెగిపోవుట మొదలగు అంశములవలన కలిగినదా లేక బంధన మేర్పడుటకు సామాన్యహేతువులు వర్ణించెద. యిట్లు బంధనమేర్పడుటకు 7 విధములుగలవు. (1) దోషము అంగమునందు జీవనరములద్వారా క్రిందికి దిగుచుట్టి ప్రాణవాయువుయొక్క శక్తిని బంధించేయును. అనగా జీవనరముల మార్గములు బంధించునట్లు బిగించబడును. ఇట్లు బిగించబడిన అంగము అట్టు

నిటు కదలించుటకు వీలులేకుండును. మరియూ యితర కారణమువలన బంధనముకలుగుచున్నది. గాని బంధనము విడదీయుటవలన దోషసంబంధమగు మడి అనగా పిటికె హరించుచున్నది.

(2) మరియు చిక్కని జిగురుగల రతూబత్ అనగా ద్రవము వాయుసంబంధముకు నరములయందు నిండినయెడల శక్తిమార్గములు బంధించబడును. యెటులనగా వాతిమానందు చిక్కదనముండదు. కాబట్టి నరములలో ప్రవేశించజాలదు. చిక్కదనముండిన యెడల ఇస్త్రర్ఖా రోగము కలుగనేరదు. దీనివర్ణనము తనమ్నుజ్ ప్రకరణమునందు భిన్నభిన్నములుగా చెప్పబడును. మరియూ మలము పలచగను చిక్కగనున్నదో అంగమునందున్నను ఇస్త్రఖా (సచ్చు) నీర్సత్వము కలుగుచున్నది. కొన్ని వ్యాధులయందు బిగిసికొని సిల్గుట (పిట్సు) కలుగుచున్నది. ఎటులననగా పలచని మలము నరములయందు ప్రవేశించునుగాని చిక్కని మలము గట్టిదనమువలన తనమ్నుజ్ (బిగించబడుట) అనగా చిక్కదనమువలన నరములకు పొడవునందును వెడల్పునందును విశాలపరచును. గాన యీవ్యాధి కలుగుచున్నది.

(3) చెడుమలము వలన గాని లేక ఏదోనొక అంగమునందు ఉష్ణము చేరుటవలనగాని ఆ అంగము వుబ్బుచున్నది. ఇట్టివాపువలన మలము బంధించబడును. ఇట్లుమలముబంధించు కారణమువలన శక్తియొక్కమార్గము బంధించబడును.

(4) నరముల మూలములయందు గాయముగాని దెబ్బగాని తగులుట వలన నరములు చితికి అణగి పోవును. ఇట్టిహేతువు వలన శక్తి రాకపోకల మార్గములు బంధించబడును.

(5) నరముయొక్క కంరము గాని లేక మరియొక నరముతో చేరునట్టి మార్గము గాని తనస్థానమునుండి తప్పి * పోయినచో శక్తి

* కుడివైపుగాని, ఎడమవైపుగాని, దెబ్బతగులుటవలన నరములు అణగిపోవును. ఇటులనరములు అణగుటవలన శక్తి రాకపోకలమార్గము బంధించబడుచున్నదని

మార్గములు బంధించబడును.

(6) నరము తప్పిపోయినను బిగిసిపోయినను లేక మిక్కిలి జలుబువలన నరమునందు బాధనము (ముడి) కలిగినను శక్తిమార్గములు బంధించబడును.

(7) లోభాగమున నుండుగల హేతువు వలనగాని లేక బాహ్య కారణము వలన గాని ఏకోనొక అంగము కీలుతప్పిపోయినను శక్తిమార్గము బంధించబడును కీళ్ళు వనలుటకు కారణముసంధి బంధము లయందు ఒకవిధమగు శ్లేష్మము ఇంద్రియములసందులను బంధించుటకు ఒకటి కొకటి చెమ్మకలిగి తిరుగుటకు వీ గునటుల ఆయాకీళ్ళయందు పుట్టుచుండును. ఇట్టి జిగురుగల పదార్థము ఆకీలునందు తగ్గిపోయినయెడల సంధిబంధము అవశ్యముగా విడిపోవును. అనగా ప్రాణవాయువుయొక్క శక్తి సంచారముచేయునట్టి నరములు యేకారణములనైనను బంధించబడుటవలన ప్రాణవాయువు అస్థానమునకు రాజాలని కారణమువలన కీళ్ళయందు దుర్గతి ప్రవేశించునని గ్రహించవలెను.

## అభిఘాత అంగవైకల్య లక్షణములు.

ఇస్తిరఖా అనగా నరము తెగుటవలన కలుగు వ్యాధిపేరు. ఇది దాగియుండును. అనగా ముఖ్యముగా విశేషభాగము ఆక్రమించియుండు నరము తెగిపోయినయెడల దీనిలక్షణములను వచించెద. దెబ్బగాని గాయముగాని తగిలినవెంటనే అంగము నిర్వనమైపోవుట దెబ్బగాని గాయముగాని తగిలినతరువాత చాలాకాలమునకు ఇస్తిర్ఖా అనువ్యాధి పు

గ్రహించవలెను ఎటువలెనగా రంధ్రము నరముయొక్క మార్గము. మరియు ఈనరము మోకాలివద్దనున్నది. మోకాలు కీలు అనరముపైపును వంగినచో అచ్చట నరము అణగిపోవుచున్నది, ఈనరము చెడు మెదడునుండి పుట్టినది. ఈనరము మార్గము బంధించబడుచున్నది. కాబట్టి మోకాలు వెనుకకు విరిగించో ఈదశయందు నరము బిగించుటవలన మార్గము బంధించబడుచున్నది. అనగా నరము అణగుటవలన ఇట్లుకలుగునని భావము.

త్పన్నమగుట మొదలగునవి ఇవి నరమునందు వాపు ప్రవేశించుటవలన కలుగులక్షణములు. మరియు నరము తెగిపోవుటవలనకలుగువ్యాధి యే చికిత్సవలన కూడా కుదురజాలదు. కాబట్టి దీనిచికిత్స చెప్పలేదు. మరియు నరము వాచుటవలన కలుగు ఇస్తర్ఖావ్యాధియందు అంగము (అవయవము)లాగుట పోటుకలుగుట ఇట్టిసమయమునందుజ్వరమువచ్చుట మొదలగు లక్షణములవలన కనిపెట్టవలెను. వాపువిశేషముగా నుండినచో బాధ అధికమగును. జ్వరముకూడా జాస్తిఅగును. వాపు తగ్గినకొలది నొప్పితగ్గుచుండును. జ్వరము తగ్గిపోవును. మరియు వాపు లేక నొప్పిమాత్రముఆరంభముచుండియుండినయెడల అవయవముపట్టుకున్నప్పుడు మాత్రము నొప్పిగానుండును. మరియు వాపు స్వల్పముగా నుండినను నొప్పితక్కువగా నుండినను జ్వరము తక్కువగా నుండినను వ్యాధిబలము కూడా తక్కువగా నున్నదని గ్రహించవలెను. దీనినిఇస్తర్ఖా అనుచున్నారు.

మరియు, తిమ్మిరి కలిగి నడుచునప్పుడు నొప్పి యెక్కువగానుండును ఇట్టిస్తితియందు వాపు తీక్ష్ణమగుటవలన ఇస్తర్ఖా వ్యాధి పుత్పన్నమైనదని గ్రహించవలెను. యీవ్యాధియందు మిక్కిలి గాఢమగు చికిత్సచేయవలెను.

మరియు, వేరు వేరు ఇస్తర్ఖా వ్యాధులు తలకు దెబ్బతగులుటవలన, మోకాలు కీలు తప్పుటవలన, మరియు, సంధి విడిపోవుటవలన కలుగుచున్నవి. యీవ్యాధి నరము తెగుటవలనకూడా కలుగుచున్నది. దీనిబేధములు ఆయా హేతువులను బట్టి గమనించవలెను. మరియు, కీలునందు మరియొక వస్తువున్నదని తోచినయెడల కీలు తప్పినదని గ్రహించవలెను. మరియు, మోకాళ్ళకీళ్ళుమతస్తానమునుండి తప్పిపోయినయెడల దీనిలక్షణములు అనగా లోభాగమునందు తప్పిపోయినదని గ్రహించవలెను యిట్టిస్తితియందు పిర్రు, మెడ, లోభాగమునకు వంగిపోవును. మరియు, రోమ్ములబైటికివచ్చును. మోకాలుకీలు బైట్నైపుత్ప

వచ్చి బిగిసిపోవును. మరియు, నరము తెగుట వలన గాని శుష్కత్వము వలన గాని ఇస్తర్ఖావ్యాధి కలిగినయెడల దీనిలక్షణములు చూచుటకు ముడుచుటకు కఠినముగానుండును. మరియు, నరములయందు జలుబు ప్రవేశించి కఠినత్వము నొంది కఠినమైనచో దీని చిన్నెములు కారణమునకు ముందు కనుపించును. మరియు, కారణము సాధారణజలుబు లేక సాధారణ చెమ్మవలన కలిగిన యెడల యీవ్యాధి నిమ్మళముగా ఉత్పన్నమగును. దీనిలక్షణములు తాకుటకు కష్టముగా నుండును. మరియు, నరములకు వేడికలిగించునట్టి ఔషధములవలన యీవ్యాధి శాంతి నొందును.

మరియు, రెండేసి దోషములు ఒకటిగాచేరుట వలన యీవ్యాధి పుత్పన్నమైన యెడల వాటిదశ చిన్నెములను బట్టి గ్రహించవలెను. యిందు విషయమై పలుమారు చెప్పబడియున్నవి తిరిగి చెప్పబడుచున్నవి. అనగా చల్లని జలపానము చేయుట, మంచులో తిరుగుట, నీళ్ళయందు * విస్తారముగా నివశించుట మొదలగు కారణమువలన దుష్టప్రకృతి సాధారణముగా చెమ్మవలస కలిగిన చిన్నెములని గ్రహించవలెను.

మరియు, ఇస్తర్ఖా అను యీవ్యాధి కఫ వాతమువలన కలిగిన యెడల దీనిలక్షణములు సమస్త విధములగు శక్తి ఆలోచన విచారము మొదలగునవి నశించుట మరియు, మెదడునకు దెబ్బతగులుట, మెదడు అదరుటవలన కలుగు ఇన్తర్ఖా వ్యాధిగాక మరియొక ఇస్తర్ఖా వ్యాధి కలుగుచున్నది. దీని లక్షణములు మూత్రము చిక్కగను, మాలిన్యముగానుండుట, మొదలగు లక్షణములు కలి

* హాకీము జాలినూస్ గారు చేపలుపట్టువానికి ఇస్తర్ఖా రోగము కలిగినదనియు ఆమనుజుడు యెల్లపుడు నీళ్ళలోయుండుటవలన మూత్రస్థానము గుదస్థానమునందు జలుబు ప్రవేశించి ప్రేగులు మూత్రకోశము నచ్చుపడి మల మూత్రములు తమంతటతాము వెడలనారంభించినవనియు తాను స్వయముగా చూచినానని హాకీము జాలినూస్ గారు తమ అనుభవమును ఇందు చెప్పియున్నారు.

గియుండిన యెడల యీవ్యాధి అర్ధాంగ వాతముగ కలిగించున నియు యిది కఫదోషమువలన కలిగినదని గ్రహించవలెను.

రక్తజ శిథిలత ఇస్తర్ఖా రోగలక్షణములు నరములు నిండినటుల పూర్ణముగా నుండుట నాడినేత్రములు ముఖము యెర్రగానుండుట ఈ వ్యాధికి సాక్షీభూతములు దీనివలన శిథిలత నొప్పి అపస్మారము ప్రేగులయందు నొప్పి సన్యాసము యీమొదలగు రోగ చిహ్నములు కలుగును. మరియు గర్భము పతనమైన తరువాత వుత్పన్నమగు యీవ్యాధి లక్షణములు యీరోగము అంతమునందు కలుగుచున్నది. దీనిని ఇస్తర్ఖాయ జౌరాని (అభిఘాత రోగసంధి) అనిచెప్పుదురు. మరియు విశేషముగా కూలంజ్ * అనువ్యాధి యందు ఇస్తర్ఖా వ్యాధికూడా రాగలదు. దీనిలక్షణములు రెండుభుజములు రెండుతొడలు దిగజారిపోవుట.

ఇటు ప్రత్యేక అంగములకు వచ్చునట్టి పక్షవాతమువలన ఆఅంగములు నిష్ప్రయోజనము గలవై ప్రయోగము లేనివగును. మరియు నాలుక గొంతు వుపజింహ్వ, మూత్రకోశము చక్కగానుండు ప్రేగులు మొదలగునవి సమ్బపడి నిష్ప్రయోజనము గలవగును. వీనిలక్షణములు ఆయా అంగముల వ్యాధులయందు చెప్పబడును. మరియు మూత్రకోశము తిన్నగానుండి ప్రేగు నీర్సమైనయెడల వీటిలక్షణములు మాత్రము చెప్పెద. మూత్రము యిచ్ఛలేకుండే వెడలుట శక్తినశించుట ఒక్కొక్క

* కాబ్లుతసనాయా అను గ్రంథకర్తగారు ఈక్రిందివిధిని చెప్పుచున్నారు, నేను అనేకులకుచూచితిని వారికి ప్రేగులయందు నొప్పి అధికముగా నుండేది వీరిలో కొందరికి ఒకభుజముజారి పోయినది కొందరికి రెండుభుజములు జారిపోయినవి, కొందరికి రెండుభుజములు రెండుతొంట్లుకూడా జారిపోయినవి ఇటువంటి వారిలో అనేకులకు భుజములు కదలకుండుటకూడా చూచితినని వచించిరి మరియు హకీంయూనుస్ గారు వచించిన దేమనగా మృతినొందుసమయమునందు కూలంజ్ అనువ్యాధి కలిగి దైవవశాత్ తిరిగిజీవించినను కాళ్ళు, చేతులు, సమ్బపడి కార్యహీనములైనవనియు వారిస్వానుభవమును చూచినటులవచించిరి,

సమయమునందు శక్తివచ్చుచుండుట ఇట్టిసమయమునందు అంగము వదులగుచుండుట (అనగా వచ్చుపడుట) శరీరకాంతి మారుచుండుట మరియు అంగము చిక్కిగాని చిన్నదిగాగాని కనుపించనియెడల రోగము కుదర గలదని గ్రహించవలెను.

మరియు అర్ధాంగ పీడిత అంగము మిక్కిలి చిక్కిపడై చిన్నదైన చో ఇట్టిఅంగమునకు చికిత్సప్రయోజనములేదనియు అట్టిరోగిని వైద్యుడు వర్జించవలెననియు హాకీమురాజిగారు వచించియున్నారు. మరియు అర్ధాంగపీడిత అంగము యితర అంగమువలెనే సమానముగా నుండి చిక్కకుండినచో చికిత్సకు సాధ్యపడును. అట్టివిధానమును చెప్పెదను.

## కఫజ అర్ధాంగ చికిత్స.

కఫజ అర్ధాంగ వాతమునందు ఆరంభ దశయందు దుర్బల కారణము కనిపెట్టి నాలుగవదినము ఏడవదినము పదునాలుగవదినము గడవనిదే యేవిధమైన చికిత్సచేయకూడదు. హాకీముసాహెబ్‌గారు అర్ధాంగ పీడితునికి 4 లేక 7 లేక 14 దినములు గతించువరకు యేవిధమైన ఔషధము యివ్వకూడదు, యెందుకనగా ఆరంభమునందు విరోచనమునకు ఔషధమిచ్చుటవలన రోగము హెచ్చుచున్నది. కాబట్టి ప్రథమమున మృదువగువస్తిచేయుట వుచితము మరియు మలమును కరగించునట్టి ఔషధములు యివ్వవలెను. అనగా చిన్నసోపు, పెద్దసోపు, సోయి విత్తులు, వాము, అడవికరివేపాకు, అజామోదం, సోపువేరు, అజామోదవువేరు, యీవస్తువులు చూర్ణించి అందు గుల్‌ఖందు కలిపి ప్రతిదినము ప్రాతఃకాలమునందు వుమ్మకోవలెను. మరియు మలము పక్వమై కరిగినతరువాత 4 లేక 7 లేక 14 దినములు గడిచినవెనుక విరోచనముచేయించునట్టి ఔషధములున్న హబ్బెముతేజ్ (దగణంమాత్రిలు) గాని లేక హబ్బెసైతరజ్ (చితిమూలపుమాత్రిలు) గాని లేక యీ మాత్రిలకు సమానగుణముగల ఔషధములు యీవ్యాధియందు వుపయోగించవలెను. మరియు, యీరోగికి వమనము చేయించుట మంచిది.

మలము వెడలించిన తరువాత మలనాశనము చేయునట్టియు శక్తికలిగించునట్టి తైలములను కీళ్ళపై నరములపై మర్దించవలెను.

ఉష్ణతైలములు అనగా ఆముదము, సోయిగింజల తైలము సార్డన్ తైలము, మరియు, యిట్టి స్వభావికమగు తైలములుమర్దించవలెను.

మరియు, ఒక్కొకప్పుడు జున్ను అక్కలకర్ర, ఈరెండువస్తువులను నూరి మర్దనచేయు తైలములయందు కలిపి మర్దించవలెను. మరియు, ఈచికిత్సలవలన మలము స్వచ్ఛతనొందిన వెనుక ప్రకృతిని కాపాడుటకై తిరియాక్ కబీర్, మసరూదీతూస్ మరియు కలకలాంజ మొదలగు ఈస్వభావికముగల ఔషధములను యిప్పించవలెను. మరియు, తిరియాకు మొదలగు మాజూన్‌లు సందర్భముకానిచో సుకబీనజ్ (ఫిరంగిసాంబ్రాణి) గాని లేక జావసీర్ గాని వేవగింజప్రమాణముగా తేనెనీళ్లలో అరుగదీసి యివ్వవలెను. మరియు, యింగువ ఉపయోగించుట పైనలేపనము చేయుట మిక్కిలి లాభదాయకము.

మిక్కిలి జలుబువలన కలిగినవ్యాధియందు వుదయ ప్రాతఃకాలములయందు తేనెనీళ్లయందు యింగువకలిపి పానముచేయవలెను. యిట్లుపానముచేయుటవలన ఈవ్యాధి అతిశీఘ్రముగా హరించును.

మరియు, 4½ మాషము, యారజ్ పైకరా 2¼ మాషము నల్లమిరియాలు నూరి, తేనెచేర్చి ప్రతిదినము రోగి పుచ్చుకొని జలపానము లేకుండినచో నిది ఆమాశయమునందు ఆలశ్యముగానిలిచి మిక్కిలి గుణమునిచ్చునని కొందరు వైద్యోత్తములు వచించుచున్నారు. మరియు రాత్రి పరుండునపుడు 2¼ మాషము మిరియాలు జున్నుకలిపినూరి ఇచ్చుట మంచిది.

మరియు, మొహమ్మద్ జకరియాగారు అర్ధాంగవాతచికిత్సయీక్రింద వివరించిన విధముగా చేయవలెననియు మలమును శుభ్రపరచుటకు కోకాయా మాత్రిలు యివ్వవలెను. దీనివలన మలముతగ్గిపోవును. మరియు, ప్రతిదినము జీడిగింజలతో చేయబడిన జవారిన్,

అయారజ్, తుమ్రు ఖాస్ తో కలిపి యివ్వవలెను దీనివలన ప్రకృతిమారి పోవును. మరియు, నరములయందు వుష్ణముకలుగుటకై చంగిల్వకోష్ట తైలము మర్దించవలెను. యీ వుపాయములు రోగారంభమునందు చేయ దగినవి. అర్ధాంగవాతము వచ్చినప్పుడు ప్రకృతియందు ఉష్ణములేనిచో ఋతువు కాలము ఆయువు శక్తి మొదలగునవి అనుకూలముగానుండినచో రోగి శరీరమునందు వేడి శరీరకాంతి యెర్రగానుండి రోగియవ్వనుడై బలముగానుండిన యెడల చికిత్స రక్తమోక్షణముతో ఆరంభించుట మంచిది. యెందుకనగా రుధిరమునందు సర్వదోషములు పుట్టుచున్నవి. కాబట్టి రుధిరమును వెడలించి దోషబలమును తగ్గించవలెనని జకరీగారు వచించిరి. మరియు, శిరావేదనచేసి రక్తమును వెడలించిన యెడల తక్షణమే మలము రోగముకూడా తగ్గిపోవును. మరియు, యేస్థానమునందు మలము కేవలము కఫమువలన కలిగి యెరుపురంగుగను శరీరముచల్లగను శరీరము తెల్లగను జలుబుకలిగియున్న యెడల కఫసంబంధమగు చెమ్మను తగ్గించుటకై శిరావేదనము చేయవలసిన అవసరమున్న యెడల శిరావేదనమునకు ఒకఘడియముందు తిరియాకు ఒకమాత్రగాని లేక మసరూదితూస్ గాని లేక సంజీరనియా గాని ఇత్ కదిజాయా ఒక మాత్రగాని యిందులోసందర్భమై మాత్రను పురాతన సారాయిలో గాని తేనెనీళ్ళలోగాని అరుగనిసి యివ్వవలెను. తదుపరి శిరావేదన చేయవలెను. రోగిప్రకృతియందు ఉష్ణమున్నయెడల శిరావేదనచేసినను చేయకున్నను ముందు ఉష్ణమును తగ్గించవలెను. అనగా శికింజబీన్ యివ్వవలెను. మరియు, మాంసరసములయందు జీలకర్ర శిరకా కలిపి పానముచేయించవలెను. మరియు, యెండిన ఫలములు భుజించవలెను. గుల్ రోగన్ శిరకా కలిపి అందులో బట్టముడిచి ఆబట్టను తలపై వేయవలెను. యీ నదుపాయములవలన ఉష్ణముశాంతిపొందును. పిమ్మట అర్ధాంగమునకు చికిత్సచేయవలెను. యెందుకనగా హకీము శేకు అలి అబూశేనాగారు పక్షవాతము జ్వరము ఒకటిగా కలిసివచ్చిన యెడల

పక్షఘాతచికిత్స వెంటనే చేయకూడదనియు ఇట్టిసమయమునందు శికింజబీన్ గుల్ ఖంద్ తో కలిపి ఇచ్చుట ఒక్కటి లాభదాయకమని వచించిరి.

మరియు, హకీము జాలినూస్‌గారు పక్షఘాతము జ్వరముకలిసి వచ్చినప్పుడు మెదడునుండి వాతము నరములవైపు తిరిగి పక్షఘాతము అర్ధాంగవాతమును కలిగించిన తరువాత అచ్చటచ్చట ఉష్ణము ఆరంభించును ఒకప్పుడు ఆరోగ్యఅంగములయొక్క ప్రకృతికూడా ఉష్ణముగా మారుచుండును. మరియు, శరీరముయొక్క సగిభాగము అగ్ని ముట్టించినటుల వేడిగానుండును. యిటుల కలుగుటకు రెండుకారణములు గలవు.

(1) మెదడు సంబంధమగు ప్రాణవాయువు పక్షఘాతము వచ్చినభాగమునందు ప్రవేశించును. ఆవాయువు రోగభాగమునకు చేరుటకు ఆభాగము బంధించబడియుండుటవలన నిరోగభాగమునందు ప్రవేశించును. కాబట్టి ఆభాగమునందు అత్యంతవుష్ణము కలిగించును.

(2) పక్షఘాతముగల శరీరము దుర్బలముగల దగుటవలన రుధిరమును గ్రహించజాలదు గనుక రక్తముకూడా నిరోగ అంగమునందు చేరును. మరియు, ప్రాణవాయువుకూడా రుధిరముతో కలిసి ప్రవహించుచుండును. యెటులననగా రుధిరమునకు ప్రాణవాయువుతో సంబంధముకలిగియుండుటవలన రుధిరముతో చేరి శరీరమునందు తిరుగుచుండును

మరియొక కారణముగలదు. అనగా పక్షఘాత చికిత్సయందు వేడిగల ఔషధమును ప్రత్యేకముగా చెప్పబడెను. యీవేడి ఔషధములుకూడా రోగ అంగముకంటె నిరోగ అంగమునందు వానిప్రభావమును విశేషపరచుచుండును. ఈహేతువువలన కూడా నిరోగ అంగమునందు వేడి అధికముగుచున్నది.

## —పక్షవాతమునందు గమనించవలసిన విషయములు.—

ఈరోగికి విశేషముగా ఆకలికలిగేవరకు ఆహారము యేమియు ఇవ్వజనదు. తీవ్రముగా దాహము కానిదే దాహమునకు నీళ్లుకూడా

ఇవ్వజనను, నీళ్లకుబదులుగా తేనెనీళ్లను ఇవ్వవలెను. మరియు, హితవగు పత్యకారక భోజనపదార్థములను భుజించవలెను. మరియు, కొద్దిగా రొట్టెను తేనెనీళ్లలో నానవేసి ఇవ్వవలెను. ఈసమయమునందు రోగి దుర్బలముగానున్నచో, పక్షులమాంసమును అనగా కంజుపిట్ట, పూరేడుపక్షి మొదలగు మాంసములను వేయించిఇవ్వవలెను. మరియు, లేతకోడిపిల్లలమాంసము ఇట్టిగుణముగల పదార్థములు వుపయోగించదగును. ఈవ్యాధియందు మద్యపానము మిక్కిలి హానికరమైనది. ఎందుకనగా సారాయి మలమును నరములయందు చేర్చునట్టి స్వాభావికము గలది. మరియు, నిది ఆమాశయమునందుచేరి పులిసి శిరకాగా మారుచున్నది. శిరకా జీవనరములకు, మెదడునకు హానిదాయకముగాన సారాయి కేవలము హానికలిగించును.

మరియు, రోగారంభమునందు సాధ్యమైనంత వరకు స్వల్పముగా యివ్వవలెను. దాల్చినచెక్క, జీలకర్ర, చేర్చి మాంసమునకు సువాసనకలిగించవలెను. శరీరమునందు ఉష్ణము అధికముగానున్న ఎడల జీలకర్ర చేర్చిన మాంసరసము కంటె ఉత్తమపదార్థము వేరొకటి లేదని తెలిసికోవలెను. ఎందుకనగా, మాంసరసము జ్వరాంశమునుకూడా శాంతినొందించును కఫమును హరించును.

జ్వరనాశక అర్ధాంగమునందు వుత్తమరసము

తెల్లనీరుల్లిగడ్డ ఒకటి తరిగి దానిని బాదంనూనెలో వేసి వేయించి అందుకొద్దిగా నీళ్లుచల్లి రెండుపొంగులువచ్చినతర్వాత శిరకా తెల్లపంచదార కొద్దిగా తరువాతిచేర్చి కొద్దిగా తగ్గినతరువాత గరంమసాలాచేర్చి ఇవ్వవలెను. మరియు, కుందేలుమెదడు వేయించి పుచ్చుకొనుట వలన పక్షఘాతము, కంపవాతమునకు, లాభదాయకములు. మరియు, బిల్గోజా పప్పులో తేనెచేర్చి భుజించుట మిక్కిలి గుణదాయకము.

### జీవనర నిర్మల కారక అద్వితీయ మాత్రిలు.

ముసాంబరము, చేదుపుచ్చకాయ గుజ్జు, ఇవి ప్రత్యేకము 35 మాషములు, పర్ఫియూన్ 17½ మాషములు, గుగ్గిలము 35 మాష ములు, ఈవస్తువులను విధిపూర్వకముగా శుద్ధిచేసి, నూరి, మాత్రలుచేసి ముందువారము ప్రతిదినము ఇవ్వవలెను. రెండోవారము మానివేశి మూడవవారములో 3 మాషముల 3 రతులు ఇవ్వవలెను. నాలుగవ వారము మానివేసి అయిదవ వారములో 36 రతులు వాడవలెను. 6వ వారములో కొద్దిగా ఇవ్వవలెను. ఇటులనె 54 రతులవరకు వాడవలెను.

### మొహంమ్మద్ జకిరియాగారు కనిపెట్టిన మాత్రిలు.

ఇంగువ, జునప్న, చేదుపుచ్చకాయగుజ్జు, కంతర్యూన్ ఇవి ప్రత్యేకముగా 1½ మాషములు, గుగ్గిలము అన్నిటికి సమానముగాచేర్చి లేహపాక విధిగా మాత్రిలు చేయవలెను. ఈ ఔషధము యావత్తు ఒక మోతాదు. ఈమాత్రలు, మలము వెడలించుటకున్ను, జలుబుగల ప్రదేశమునందు ఉష్ణము కలిగించుటకున్ను, మిక్కిలి ఉపయోగము. మరియు, సముద్రపునీటియందు కూర్చుండుట, పరిశ్రమచేయుట, ఉప వాసముచేయుట, తుమ్ముట, గొప్పధ్వనితో శ్లోకములు చదువుట, తరు వాణి, ఆవాలుచేర్చి పుక్కిలించుట మొదలగునవి పక్షఘాతరోగమునందు మిక్కిలి హితకరములని తెలియవలెను.

### ఆది అంతములయందు చేయు వస్తిలక్షణములు.

మరువము, సోపు, నఖముదిప్పలు, మెంతులు, ఆముదాలు, యష్టిమధుకము, కంతరియూన్ ఈవస్తువు ను మంచినీళ్లయందు చేర్చి కషాయముకాచి వడియబోసి తరువాత తేనె, తరువాణి, పాతజైతూన్ నూనె, చేదుపుచ్చ గుజ్జు, ఈవస్తువులు కూడా పైకషాయములో చేర్చి వస్తి (ఎనిమా) చేయవలెను. మరియు, నదీజలము, గంధకముండునట్టి గనినీళ్ళు, తప్ప పక్షవాతముగల అంగముపై ఇతరజలము వేయకూడదు వేడినీళ్ళుపోయకూడదు. ఎందుకనగా కాచిన మంచినీళ్ళు దోషములన్ను

అధికపరచును జీవనరములకు లఘుత్వము, మృదుత్వము కలుగజేయును. చల్లనినీళ్ళు సమ్ప్రవడిన అంగమునకు శాంతికలిగించును కాబట్టి పలచని దోషము నీళ్లుజలుబునుచేర్పుటవలనదోషముకీళ్లుఒకటిగా చేయుచున్నవి.

మరియు, హకీము మాసోదాగారి కుమారుడుగారు చెప్పిన స్వానుభవము విరోచనము చేయించుటవలన పక్షవాతము నశించుచున్నది రక్తాదికారణమువలన శరీర సమ్పుకలిగినచో శిరావేదనము వలన రక్తమోక్షణము చేయించవలెను. మరియు, అవశ్యానుకూలముగా ఇతరనుపాయములను చేయువలెననియు విరోచనము లగుట వలన పక్షఘాతము శాంతించునని చెప్పెను.

సరాహాఅస్‌బాబ్ గ్రంథకర్తగారు ఇందువిషయమై వచించినదేమనగాయిందువిషయమై ఆలోచించవలసిన దేమనగా పక్షఘాతము రక్తమువలనగాని లేక జీవనరములు తెగుటవలనగానికలుగుచున్నది ఇట్లు కలిగిన వ్యాధికి చికిత్స చెప్పబడియుండలేదు. అనగా అసాధ్యమని తెలియవలెను. మరియు, ఉష్ణాదిఖ్య కారణమువలన పక్షఘాతము ఉత్పన్నమైనచో శిరావేదనము చేయువలెను.

మరియు ఆరంభమునందు పోకచెక్క, చందనము, యెండినతుమ్మకాయరసము, మామిసా, మొదలగు దోషహర అస్యవస్తువులు కానరాకురసముతోనూరి లేపనము చేయవలెను. మరియు వ్యాధివృద్ధినొందు సమయమునందు దోషమును తొలగించునట్టి సదుపాయములను చేయువలెను మరియు మృదుత్వము నొందించునట్టి వస్తువులు ఓషధులను నూరి లేపనముచేయవలెను. అనగా యవపింశి పచ్చిధనియాలరసము గుల్‌రోగన్ ఈవస్తువులు ఆదిమొదలు అంతమువరకు లేపనముచేయవలెను. మలమును కరిగించి హరించునట్టి వస్తువులు అనగా బాబూనా చుకందరుఆకులు క్యాబేజితైలము శుద్ధమైనమి యీవస్తువులు యేకముగా కలిపి లేపనము చేయవలెను. ఈలేపనము వాపుగలస్థలమునందు చేయవలెను. పక్షఘాతమువలన పడిపోయిన అంగముపై లేపనముచే

యకూడదు. శీతజవాపువలన అంగము సచ్చుపడుటకు కారణము అయినచో వాపుగల అంగముపై హబ్బుల్ గారు మిరియాలు కస్తూరి బాలింతబోలు, సర్విశాయ, కుంకుమపువ్వు, జున్ను, పటిక, యీ మొదలగునవినూరి కటుకరోహిణితైలములో కలిపి అందు మైనము చేర్చి వుడికించి చూర్ణముకలిపి లేపనము చేయవలెను.

మరియు, ఇస్తర్ఖా (సచ్చు) అను వ్యాధి అభిఘాతమువలన ఉత్పన్నమగును. మరియు, నరములు తెగక యేమిభంగము కలుగకుండిన యెడల శరీరమును శుభ్రిపరచుటకై శిరావేదనము చేయవలెను. మరియు, విరోచనమునకుకూడా యివ్వవలెను. మరియు, మలనిస్సారక బలకరమగు ఔషధములు అనగా బాలింతబోలు, జావశీరు, జుత్వ, ఫర్పియూన్, మైనము, గుల్రోగన్తోకలిపి యే స్థలమునందు గాయముగాని, దెబ్బగాని, వాపుగాని యున్నయెడల ఆ స్థలమునందు లేపనము చేయవలెను. మరియు, అంతమునందువాపు కనిపించినయెడల మలమును నశింపజేయునట్టి ఔషధములను లేపనాదులయందు ఉపయోగించవలెను.

హకీంజాలీనూస్గారు ఒకమనుజుడు గుర్రిపునవారిచేయుచు పడిపోయెను. అతనికి రెండుకాళ్ళు పడిపోయినవి. ఆతనికి పక్షఘాతము సంభవించినది. వైద్యులు కాళ్ళకు పట్లు వేయవలెననిరిగాని నేను అందుకు అంగీకరించనైతిని దెబ్బతగిలిన స్థలమునందు మాత్రము వాపుతగ్గుటకు వాపుపై ఔషధలేపనముచేయుటకు ఆజ్ఞాపించితిని. మరియు, ఔషధలేపనవలన వాపు తగ్గి రోగమునుండి విముక్తినొందెను. మరియు, పక్షవాతము మోకాళ్ళకీస్ళుజారుటవలన కలిగిన యెడల అందుకుచికిత్స మోకాళ్ళను వాటిస్థానమునందు చేర్చుటయె అని గ్రహించవలెను. ఇటులనె యేస్థానమునందైనను కీలుతప్పిపోవుటవలన ఫాలిజ్ (పక్షఘాతము) ఉత్పన్నమైనయెడల ఆకీలు పాటునకు చేర్చునట్టి నుపాయములను చికిత్సలను చేయవలెను. మరియు, సాధారణ దుష్టప్రకృతి

రెయొక్క కారణమువలన రోగముకలిగిన యెడల ప్రకృతిశాంతినొందు నట్టి నుపాయములను చేయుటయె యిందుకు చికిత్సయని తెలియవలె నని హకీంజాలీనూస్‌గారు చెప్పిరి.

హకీం మొహ్మంమ్మద్ జికిరియాగారు ఒకమనుష్యుడు ఉపవాసముచేయుటవలన అతని జఠరదీప్తి తగ్గిపోయినది. శరీరమునందు ఉష్ణము అధికమైనది. యిందుకు వైద్యులు యారజ్ఫైకరా అను ఔషధమును ఉపయోగించిరి. యీచికిత్సవలన ఆరోగికి మిక్కిలి కష్టముకలిగినది. అప్పుడు అతనిని స్నానముచేయించగా వాతము తగ్గి శరీరము ఆరోగ్యమునొందినదని హకీము మొహ్మంమ్మద్ జికిరియాగారువచించిరి.

నాలుక, గొంతు, పీక, (గొంతుక్రిందిగొట్టము) మొదలగునవి నచ్చువడువిషయమై చెప్పబడుచున్నది. మాటరానియ్యని ఈవ్యాధికి చికిత్స వేరు వేరు ప్రకరణములయందు వర్ణించబడును.

(రోగసంధి) (బహురాన్) ఇస్తరఖాచికిత్స

ఈరోగమునందు సాధారణముగా ఉష్ణతైలములు అనగా నర్గిస్ తైలము, సౌసన్ తైలము, ఆముదము, నార్దక్ తైలము మొదలగు తైలములను మర్ధించవలెను. మరియు, ఆఅంగమునకు పుష్టికలిగించు నట్టి ఔషధములు వుపయోగించవలెను. మరియు, ఆఅంగమునందు దుష్టమలము చేరకుండునటుల బాబూనా, నఖంచివ్వలు, దవనము, మరువము మొదలగువస్తువులు కషాయముకాచి గాని లేక కాశీనిరసము నందునూరి ఆరనమునందుకలిపి యిందుచల్లని గుణముగల ఓషధులను కలిపి మర్ధనచేయుట లాభదాయకము. మరియు, యీవ్యాధియందు కొబ్బరినూనె మర్ధనకును భోజనాదులయందు ఉపయోగించుట మిక్కిలి గుణకరముగానుండునని గ్రహించవలెను.

ముంతన్కబీజు మాత్రలు చేయుక్రమము.

యారజ్ 35 మాషములు, చేమవుచ్చకాయగుజ్జు శువ్వరం అనగా యిది ఒకమూలికెజాతి దీనిగింజలు చిగిశెనగలవలె నుండును.

చిన్నకంతర్యూన్, మాహిజెహరా, యివిప్రత్యేకము 17½ మాషములు, పర్ఫియూన్ 8¾ మాషములు, సన్న, శొంఠి, యింగువ, నుకబీనజ్, జావశీరు, చిత్రమూలము, ఆవాలు, మిరియాలు, ఇవిప్రత్యేకముగా 3¾ మాషములు, యీవస్తువులను నీళ్ళతోగాని లేక మరియే యోగ్యమగు రసముతోగాని నూరి మాత్రలు చేసి అవశ్యానుకూలముగా వుపయోగించవలెను. ఈమాత్రలవలన పక్షఘాతము, అర్ధాంగవాతము, నికరస, అనగా కాలిబొటనవేలునందు పుట్టునట్టి నొప్పి, యీనొప్పికి చల్లని కఫకారకవస్తువులను పట్టువేయుట లాభదాయకము.

### దుర్వాసనగల మాత్రలు చేయుక్రమము

చేదువుచ్చగింజ 7 గతులు, కతెరా (బాదంజిగురు) 9¼ రతులు, సురంజాన్ (దీనిని హిందీభాషలో బరబరీఅంటారు. యిది అడవి యెల్లుల్లివలెనుండును.) బూజిదాన్ (ఒకకరజాతి) మాహిజెరా, కరక్కాయలు, యివి ప్రత్యేకము 1¾ మాషములు యీవస్తువులు ఒకటిగా నూరి మాత్రచేసి ఒకమోతాదుగా నివ్వవలెను. యీమాత్రలు ఉష్ణమునందు ఉష్ణప్రకృతిగల శరీరముగల రోగికివ్వవలెను.

### శౌతరజ్ మాత్రలు చేయుక్రమము

తెల్లతెగడ 35 మాషములు, ముసాంబరము 70 మాషములు, శొంఠి, అవాలు, సైంధవలవణము, వస, చిత్రమూలము, యివి ప్రత్యేకము 7 మాషములు, పిప్పళ్ళు, అక్కలకర్ర, యివి ప్రత్యేకము 3¾ మాషములు, తెల్లపంచదార 14 మాషములు, యీవస్తువులు యావత్తు చూర్ణించి వస్త్రగాలితముచేసి కల్వమునందుంచి క్యాబేజిరసముతో గాని లేక యోగ్యమగు కషాయములతోగాని నూరి మాత్రలుచేయ వలెను. యీమాత్ర 10 మాషముల ప్రమాణము వుపయోగించ వలెను.

# తసన్నుజ్ (అనగా) అవయవములు బిగించు రోగము



ఈ వ్యాధి అర్థముకూడా పేరునకు సమానముగా తసన్నుజ్ అని విధించబడినది. అనగా శరీరసంబంధమగు జీవనరములకు ఒకానొక కారణమువలన కష్టముసంభవించి ఆకష్టకారణమువలన రెండువైపుల నరములకుగల దుర్గతివలన సమసూపము తొలగుచుండు అంగము ఒక వైపుకు బిగబట్టును. మరియు, యీవ్యాధి శరీరమునందు వెంటనే ప్రవేశించజాలదు. హేతువు బలముగలదైనను, దుర్బలముగలదైనను, ఆవ్యాధిగల భాగము దుర్బలము నొందుచున్నది. ఇట్లు దుర్బలమునొందిన వెంటనే చికిత్సనిమిత్తము లేకనే అయవయము తన నిజదశయందు మారుచున్నది. అన్నగా ఆవళింతయందు కనిపెట్టబడును. అటులనే అపస్మారమునందుకూడా కనిపెట్టవచ్చును. యీవ్యాధి కారణమువలన వాత ఆవిరి పరమాణువులు జీవనరములయందు దోషము చేరుటవలన మరియు, ఒకప్పుడు జీవనరములయందున్న రక్తనాళములయందున్న చెమ్మ ఆరిపోవుటవలన ఆనరములు శుష్కత్వమునొందు కారణమువలన తసన్నుజ్ అనగా అంగములు బిగలాగునట్టి వ్యాధి ఉత్పన్నమగును. ఒకప్పుడు జ్ఞానోత్పాదక నరమునందున్న, మెదడునందున్న వాతము ప్రవేశించుటవలన తసన్నుజ్‌వ్యాధి కలుగుచున్నది. చెమ్మ, శుష్కత్వము మొదలగు హేతువులు కలుగని యెడల యీవ్యాధిని నాలుగువిధములుగా వర్ణించి చెప్పితిని గాన చదువరులు గ్రహించుదురుగాక.

## అవయవము బిగించు మొదటి వ్యాధి లక్షణములు

మొదటి ప్రకరణముగల తసన్నుజ్ రోగము వాతకారణమువలన కలుగుచున్నది. యీవ్యాధి రెండవపేరు ఇకాల్ అందుచే ఇకాల్ అనగా ఒంటికాలిత్రోడు అని అర్థము యీవ్యాధి చిన్నెలములు ఏవా

రోగము శీఘ్రముగ కలదిగా నుండును. మరియు, ఇది మనుష్యుని తగ్గుతూ హెచ్చుచుండును. యీవ్యాధి ప్రవేశించుటకుముందు విశేషముగా ఆవలింతలు వచ్చుటయే దీని ప్రకారముగా వైద్యులు ఆవలింతలు ఒక విధమైన తశన్నుజ్ అని పలుకుదురు. రెండు చెక్కిళ్ళ మూలములయందుగల చాల ఆవిరి కారణమువలన పుట్టుచున్నది. తిరిగి వెంటనే శమించుచున్నది.

### అవయవము బిగబట్టు వ్యాధి చికిత్స

ఈరోగము ఆవిరిపరమాణువులు హెచ్చుటవలన కలుగునట్టి కారణమువలన కలుగు తశన్నుజ్ వెంటనే శాంతినొందనేరదు. మరియు వాతమును నష్టపరచుటకై మలమును నశింపజేయునట్టియు, చెమ్మను కలిగించునట్టి తైలములను మర్దించవలెను.

### రెండవ అంగము బిగబట్టు రోగవిధానము

ఈవ్యాధి శరీరమునందు మలమునిండియుండు కారణమువలన కలుగుచున్నది. దీనిని తశన్నుజ్ రతబబీ అని వాడుదురు. యీవ్యాధి గురువగు కఫదోషమువలన కలుగుచున్నది. మరియు, యీరోగము కఫమువలనగాని, వాతమువలనగాని ఉత్పన్నమగుచున్నది. అనగా ఉక్త మలము నరముల ఛిద్రములయందు ప్రవేశించి నరములను విశాలత్వము నొందించును. యిట్టి సమయమునందు ఆనరముల పొడవు అవశ్యముగా తగ్గిపోవును అనగా నరము పొడవుతగ్గి వెడల్పు హెచ్చును. మరియు, నరముకుంచించుటకుకూడా కారణమిదియేయని గ్రహించవలెను. యిట్టి సమయమునందు నరముకుంచించిన యెడల అంగమునకు యీ నరముయొక్క వుపయోగము లేక పోవుటయేగాక ఆనరమువలన అంగము చెడిపోవును. కాబట్టి కదలించుటకు వీలులేకుండును.

(సూచనీయము) కఫసంబంధమగు మలము నరముయొక్క ఛిద్రమునందు ప్రవేశించునట్టి కారణమువలన తశన్నుజ్ అనగా అంగము బిగబట్టునట్టి వ్యాధి వుత్పన్నమైన యెడల యీవ్యాధివలన ఇస్తర్ఖా

అనగా నచ్చురోగముకూడా కలుగ గలదు. యెట్లనగా మలము యెంతకాలము జీవనరము తత్సంబంధమగు తంతువుల మొదళ్ళయందు చేరి నరములయందు ప్రవేశించకుండునో అంతపర్యంతము అంగము నచ్చు పడనేరదు మరియు, తనన్నుజ్ యందు రాజసంబంధ నరము యొక్క రోమాంచమునందు దోషము చేయును మలము ద్రవముగను గట్టిగను రెండువిధములుగా కలిసియున్న యెడల తనన్నుజ్ (అంగము బిగబట్టు నట్టివ్యాధి) ఇస్తర్ఖా అనగా నచ్చువ్యాధి యీరెండు రోగములు కలుగ గలవు.

మరియు రుధిరదోషసంబంధమగు తనన్నుజ్ అనగా నరము మొదలు (మూలము) వృద్ధి మలము నరమునందున్న తత్సంబంధమగు సన్న నరములయందున్న ప్రవేశించి ఆనరమును పొడవుచేసి తగ్గించును. ఒక్కొక్కప్పుడు పిత్తము రుధిరమువలెనే నరములయందు పూర్ణమై తనన్నుజ్ వ్యాధిని బుట్టించును. మరియు తనన్నుజ్ యొక్క వృష్ణజ్వరము ఇట్టికారణమువలన మలము జ్వరవేడివలన కరిగి అచ్చటజీవనరము మొదళ్ళయందుండు మలము కరిగి నరమునందు ప్రవేశించి తనన్నుజ్ అనగా బిగబట్టునట్టి రోగమును బుట్టించినయెడల నిది ఇంతెలాయి అనగా మలమునిండునట్టి కారణమువలన కలుగునది అనిపించును మరియు యీ తనన్నుజ్ యొక్క విరుద్ధమగువృష్ణజ్వరము. వెశుక, ప్రకృతిశుష్కించుట వలన పుట్టున్నమగును. కాబట్టి యీవ్యాధి శుష్కదోషసంబంధమగు తనన్నుజ్ (బిగబట్టు) వ్యాధియని గ్రహించవలెను.

(తనన్నుజ్) బిగించునట్టిరోగ లక్షణములు.

తనన్నుజ్ కఫసంబంధమగు మలదోషకారణమువలన కలిగిన యెడల దీనిలక్షణములు అనగా బిగించుకొనుట (పిట్స) అగస్మాత్తుగా వుత్పన్నమగును. మరియు విశేషముగా తిరుగుటకు, నడచుటకు, ఆటంకము అలసటగానుండుట మూత్రము చిక్కగానుండుట శరీరము తెల్లగానుండుట మారోనము నీర్సించుట బిగించునట్టి అవయవము తాకిన

యెడల మృదువుగను చల్లగానుండుట దాహములేమి నిదురాదిఖ్యముగా నుండుట జీవసరమునందు నీర్స్రావము రోగారంభమునందు కఫమును వృద్ధిచేయునట్టి వస్తువులు సేవించియుండుట యీ మొదలగులక్షణములు కఫదోషమువలన కలిగిన తసన్నుజ్ అనగా బిగించురోగమునందు కలుగు చిహ్నములని గ్రహించవలెను.

వాతమువలన కలుగు యీ వ్యాధిలక్షణములు అనేకపర్యాయములు చెప్పియున్నాను కాబట్టి గ్రహించవలెను.

మరియు రక్తజవాపుకారణమువలనగాని ఒకప్పుడు పిత్తవాపు కారణమువలనగాని అంగము బిగించవారంభించినయెడల ఆవాపులక్షణములు ఆఅంగమునందు ఆవిరి వెడలినటులనుండుట నొప్పి కలిగియుండును. యీలక్షణములు కలిగియుండినయెడల యీవాపురక్తదోషము వలన కలిగినదని గ్రహించవలెను.

మరియు యీవాపునందుపోటు మంట కలిగియుండినయెడల పిత్తదోషమువలన కలిగినవాపు అనిగ్రహించవలెను.

మరియు వుష్ణజ్వరమువలన దోషము కరిగి నరమునందు ప్రవేశించి స్తంభించి వాపుకలిగించును. దీనిలక్షణములు ముందుగా జ్వరమువచ్చుటయేతప్ప యితరలక్షణములేమియు కలుగకుండునుగాని జ్వర అంతమునందు చెమ్మ ఆర్చివేయుటవలన బిగింపు అనగా తసన్నుజ్వ్యాధి సంభవించును. అట్టిసమయమునందు కంతులు అనగా వాపు కలుగనారంభించును. మరియు చెమ్మ ఆరిపోవుటవలన దినక్రమేణ శరీరము శుష్కించనారంభించును. యీరోగము జ్వరముతోకూడా అవయవములను బిగబట్టునట్టివ్యాధిని బుట్టించునని గ్రహించవలెను.

## (తసన్నుజ్) అంగముబిగబట్టురోగచికిత్స.

కఫసంబంధమగు తసన్నుజ్ అనగా అంగము బిగబట్టునట్టి రోగమునందు దోషమును పక్వపరచుటకై ప్రాతఃకాలమునందు వేళ్ళకషాయమునందు గుల్ఖందుకలిపి పుచ్చుకోవలెను. మలము పక్వము న్గొం

దినతరువాత యూరజ్ఫైకరా మొదలగు ఎత్రీఫలాతమునందు చెప్పబడిన ఔషధములను కఫము హరించుటకై వుపయోగించవలెను. గాని మలమును ఒకేపర్యాయము వెడలించక నెమ్మదిగా అనేకపర్యాయములు కొద్దికొద్దిగా వెడలించవలెను. సమస్తవ్యసనములరోగములయందు మలమును నెమ్మదిగా వెడలించుట వుత్తమము అనగా మలము గుల్లనరములయందుండి నెమ్మదిగా స్రవించునుగాని ఒకేసారియాయము వెడలజాలదు. గనుక క్రమేణ వెడలించుట మంచిదని చెప్పబడియె.

మరియు శక్తి తననిజదశయందున్నయెడల దుర్బలము కలుగకుండును మలము స్వచ్ఛతనొందినపిమ్మట సదాపాకుతైలముగాని చెంబేలితైలము మొదలుగాగల వుష్ణతైలములను మర్దించవలెను. యీతైలములయందు జున్ను, అక్కలకర్ర, ఫర్ఫియూన్, మొదలగువస్తువులను తైలములయందుచేర్చి మర్దించుట మిక్కిలి గుణదాయకము మరియు యుక్తమగు ఆహారములను తినుసమయమునందు యిప్పించవలెను.

వాతమువలన తసన్నుజ్ అనగా బిగబట్టునట్టి వ్యాధియందు మలమును పక్వపరచి వెడలించవలెను. తైలాదులను మర్దించుచు వాతమును హరించునట్టియు పక్వపరచునట్టి ఔషధములను యీప్రకరణమునందు చెప్పినరీతిగా వుపయోగించవలెను.

మరియు జీవనరములయందు వాపుసంభవించిన కారణమువలన బిగబట్టునట్టి రోగము ఆరంభించినయెడల వాపువలన కలుగునట్టి ఇస్తరుఖా అనగా సచ్ఛురోగమునందు చెప్పిన ఔషధములు పట్లు మొదలగునవి వుపయోగించవలెను. మరియు దోషానుకూలముగా మలమును నశింపచేయుటకై లేపనము చేయవలెను యీరోగము వుక్తకారణము వలన వుష్ణజ్వరము కలిగినతరువాత బిగిసికొని పోవునట్టి రోగము సంప్రాప్తించినయెడల వమన విరోచనములకు చికిత్సచేయుట వుత్తమము ఇట్టి వ్యాధి మిక్కిలి సహజముగా నుండును.

### శుష్కదోషమువలన కలుగు బిగింపు రోగలక్షణములు.

ఈవ్యాధిని ఇస్త్ఫిరాగ్ అనికూడా వాడుదురు. మరియు ఇస్త్ఫిరాగ్ అనగా మలమును తీసివేయుట అని అర్థము. దీనిలక్షణములు అనగా యేఅంగమునందు బిగింపుకలుగుచున్నదో ఆఅంగము దిక్కుట వలచవమట, దీనిలక్షణములు మరియు విశేషముగా ప్రసంగించుట పరిశ్రమ చేయుట మిక్కిలి ఆకలితో పరితపించుట ఇత్యాదిశుష్కత్వము నొందించునట్టి కారణములవలన యీరోగము వుత్పన్నమగును. అథవా యీరోగమునకు ముందు పిత్తజ్వరము కలిగినయెడల దీనిలక్షణములు యీరోగము నెమ్మదిగావృద్ధియగుట వ్యాధిగల అంగముపై తైలమును మర్దించగా ఆస్థానము వెంటనే ఆరిపోవుట మొదలగు లక్షణములు పిత్తజతీక్ష్ణజ్వరమువలన కలుగు తసన్నుజ్‌రోగలక్షణము నిగ్రహించవలెను. మరియు రోగ అంగముపై తైలమును లేపనముచేసినయెడల ఆతైలము హరించకుండిన వాతశీతప్రకృతివలన పుట్టిన రోగమని తెలియవలెను.

మరియు, శరీరమునందు స్వాభావిక చెమ్మ నష్టము నొందక మొదటు జీవనరములుమాత్రము ఆరిపోవును. యిట్టిదశయందు అవయవములు బిగబట్టుట నారంభించును. యీకారణమువలన శరీరమువక వైపుకు బిగిసిపోవుట తటస్థించును మరియు ఒకవైపుకు బిగబట్టునట్టి వ్యాధి సామాన్యము అసాధ్యమైనదనియు సాధ్యపడజాలదని గ్రహించవలెను.

### శుష్కత్వతసన్నుజ్ అనగా బిగించుకొనువ్యాధి చికిత్స.

ఈవ్యాధియందు శరీరమునందున్ను రోగగ్రస్త అంగమునందున్ను చెమ్మకలిగించుటకై మిక్కిలి వుపాయములను ఆలోచించవలెను. మరియు, శరీరమునందు చెమ్మకలుగుటకు గాడిదెపాలు, మేకపాలు, యవనూక, యివ్వవలెను మరియు, బేహానాగింజలగుజ్జు, బనప్షా షరబతు, కలువపూలషరబతు కలిపి యివ్వవలెను. సొరగింజలతైలము, బాదంనూనె, ఒకటిగాచేర్చి యివ్వవలెను. యీవస్తువులలో కొన్ని

మాత్రము సంప్రాప్తమై కొన్నిసంప్రాప్తము కాకుండి చిక్కనమట్టుకు వుపయోగించవలెను అథవ మేకపిల్లలకాళ్లమాంసమునందుగాని గొర్రె పిల్లలకాళ్లమాంసమునందుగాని, పాలకుకూర, బాదంనూనెచేర్చి వండిన శాఖము నిప్పించవలెను. అథవా సవ్వనీళ్ళయందు నివశించునట్టి చేపల మాంసము, గోధుమగంజి, గోధుమనిశాస్త్రా (గోధుమసత్తు) తెల్లచక్కెర, బాదంనూని చేర్చి శేవించవలెను. యీమొదలగు వస్తుశేవనవలన శుష్కత్వము హరించును. మరియు, ప్రతిపదార్థమునందు బాదంనూనె చేర్చి ఉపయోగించుట లాభదాయకము.

మరియు, రోగికి ఆవిరియందు కూర్చుండబెట్టి ఆవిరిపట్టునటుల చేయుట, చెమటపుట్టించునట్టి మైనపుఅరఖు బిగిసిపోయిన అంగముపై విశేషముగా మర్దించుట మిక్కిలి లాభదాయకము. మరియు, శుష్కత్వమును దూరపరచి శరీరమునందు చెమ్మకలిగించునట్టి కావడములు లేపనలు చేయవలెను. మరియు, బనప్షా, కావాలుఆకులు, తుఖ్మహిత్, యవలు, ఖిత్మిఆకులు, పాషాణబేది ఆకులు, సొరకాయ, కలువపూలు, యీమొదలగు వస్తువులు నీళ్లలోవేశి కషాయముకాచి ఆకషాయముతో రోగి శరీరమునకు కావడము చేయవలెను.

మరియు, బనప్షా, ఇతిమి, యవపిండి, ఇస్పగోలుగింజలు నూరిన మద్ద సొరగింజలతైలము యీవస్తువులను యేకముగాకలిపి లేపనము చేయవలెను.

## మైనపుఅరఖు చేయుక్రమము.

ఆవుకాళ్లమూలుగ, కోడికొవ్వు, తెల్లమైనము బనప్షాతైలము నందు పైవస్తువులుచేర్చి కాచి ఆడశిశువు తల్లిచనుపాలు కలిపి మర్దించవలెను.

మరియు, రోగికి జ్వరమున్న యెడల పాలుపానముచేయుట నీరుల్లిగడ్డలను ఉపయోగించుట వర్జించవలెను. మరియు, జ్వరరోగికి లేపనములు చేయజనదు. మరియు పట్లువేయుట, తైలాదులు మర్దించుట,

మొదలగు చికిత్సలు వర్జించవలెను. మరియు, తపేదిఖ్ (క్షయ) రోగమునందు ముందు చెప్పబడును. క్షయరోగముకూడా యీవ్యాధితో సంబంధముకలిగియుండును మరియూ, సాధ్యమైనంతవరకు శరీరమునకు చెమ్మకలిగించు నుపాయములను చేయవలెను. మరియు, రోగి కేవలము క్షీరగ్రాహి అయినచో శిశువునకు బదులుగా పాలతల్లికి ఔషధము యివ్వవలెను. తైలములు పట్లురోగముగల శిశువునకు వుపయోగించవలెను.

### 4 తసన్నుజ్ అనగా బిగించు రోగ లక్షణములు.

ఈవ్యాధి శరీరసంబంధమగు జీవనరములయందుగాని మెదడునందుగాని కష్టము సంభవించుటవలన వుత్పన్నమగును. యీవ్యాధియందు చెమ్మ శుష్కత్వము మొదలగునవి సంబంధము కలుగనిచే జీవనరముయొక్క లోభాగమునందుగాని పైభాగమునందుగాని యేదో కష్టము దెబ్బతగిలినయెడల అట్టితరి జీవనరము అహితమునొంది తన స్థానమునందె కష్టదశవలన చుట్టుకొని వకటిగాచేరి యుండును. కాబట్టి జీవనరము వంకరయగుటవలన తసన్నుజ్ అనగా అంగము బిగిసికొను రోగము ఆరంభమగును. మరియు యితర అంగముయొక్క సంబంధము లేకనే జీవనరమునందు కష్టము సంభవించినయెడల యేదైనవిషజంతువుయొక్క కాటు ఆనరమునందు తగిలినదనిగాని లేక జీవనరము తెగిపోయినదని గాని లేక దోషప్రబలమువలన జీవనరము కష్టము పొందుచున్నదని గాని గ్రహించవలెను.

మరియు యిందు చెప్పిన కారణములు గాక మరియే యితర కారణములవలనగాని లేక యితర అంగముయొక్క సంయోగమువలన గాని మెదడునందు కష్టము కలుగుటవలన యీవ్యాధివుత్పన్నమగును. కాబట్టి యీమొదలగు యాపత్తు కారణములను విస్తారపూర్వకముగా వర్ణించుచున్నాను. చదువరులు సావధానముతో చదివి గ్రహించుదురుగాక. మరియు యీవ్యాధి పదివిధములుగా వర్ణించబడినది.

1 వ తసన్నుజ్ బిగించునట్టి వ్యాధి లక్షణములు.

శరీరమునందు యేఅవయవము లేక జీవనరము తెగుటవలనగాని అనగా ఆనరముయొక్క కొంతభాగము ముడుచుకొనిపోవుచుగాని అంటుకొని యుండును. నరముపూర్తిగా తెగిపోయినయెడల ఆభాగము సచ్చుపడుచున్నది. మరియు ఇట్టిస్థితియందు బిగింపు (పిట్సు) కలుగజాలదు.

(2) దోషముయొక్క తీక్ష్ణత్వమువలన అవయవమునందు మంట, పీకుట, ఆర్చివేయుట, యీమొదలగు కారణములు కనుపించినయెడల దోషము జీవనరమునందు ప్రవేశించినదనియు దోషము ప్రవేశించిన కారణమువలన నరము వంకరైనదనియు చెప్పబడును.

(3) నరముపైన తేలుగాని లేక పాము మొదలగు విషజంతువులు కుట్టుట కాటుకొందుటవలనగాని జీవనరమునకు నష్టము సంభవించును. యీవిషసంబంధమగు దశవలన మెదడునందుగల జీవనరము వుత్పత్తినొందు స్థలము అనగా మర్మస్థానము కాబట్టి యిట్టి మర్మస్థానమునందు హానియు కష్టమును సంభవించినయెడల ఆనరములు తమ వుత్పత్తిస్థానమునుండి తప్పిపోవును. గనుక యీకారణమువలన తసన్నుజ్ వుత్పన్నమగును.

(4) విషసంబంధమగు ఔషధములు అనగానల్లమందు *శకరాన్ ఒకచెట్టువేరు ఇత్యాది విషసంబంధమగు అన్యఔషధములు సేవించుటవలన వాతమును ప్రకోపింపచేయును ఇట్లు వాతము ప్రకోపించుటవలన చిక్కబడి బిగించునట్టి (పిట్సు) వ్యాధిపుట్టుచున్నది. యిట్లు బిగించునట్టి రోగము కలుగుటవలన తసన్నుజ్ వుత్పత్తియగును. యీ

* ముల్లాఅపీన్ పుస్తకము సారహా అల్బాబ్ అను గ్రంథకర్త మరియు బుఖరాత్ అనువారు ఇద్దరున్నూ నల్లమందు శక[illegible] చెమ్మను కరిగించి చిక్కబడుసమయమునందు బిగిసికొను వ్యాధిని పుట్టించుచున్నది ఇది గాక దీనియందు విషసంబంధము గొప్పఅంశముగలదు. అనగా శరీరమును విరుద్ధము నొందించును. కాబట్టి జీవనరమునకు కష్టము సంభవించును. కాబట్టి తసన్నుజ్ కలుగుచున్నది. మరియు జీవనరము తమ వుత్పత్తి స్థానమునందు అభిముఖమును పొందుచున్నది

విషదశ మొదలగుచు చెంద ఎరంబ ధనుగు జీవనరములకుహానికలిగించును.

(5) జలుబుయొక్క విశేషవ్యాపు బాహ్యమునుండిగాని లేక లోభాగమునుండిగాని నరములయందు ప్రవేశించినయెడల జీవనరము బంధించబడును. ఇట్లు జీవనరము బంధించునట్టి కారణమువలన తనన్నుజ్ బిగించునట్టి రోగము వుత్పన్నమగును.

(6) అగస్మాత్తుగా దోషమువలన నీలిరంగుగల వమనము వెడలినయెడల మలము విశేషముగా కాలిపోవుట విషసంబంధమగు దోషమువలన ఆమాశయమునకున్ను నరములకున్ను సంబంధముండుటవలన ఝుడరయొక్క కష్టము జీవనరమునకు సంభవించి బిగించునట్టి వ్యాధి కలుగగలదు యిందువలనజీవనరముచుట్టుకొనిపోవును. మరియు ఆమాశయ సంబంధమగు జీవనరము వంకరగుటవలన ఆనరముయొక్క సంయోగముగానుండు మరియొక నరముకూడా వంకరైమూడుచుకొనిపోవును. ఇట్టిస్థితియందు తనన్నుజ్ వ్యాధి వుత్పన్నమగును.

(7) వాతమిస్రిత అప్రాకృతియొక్క పిత్తము ఒకప్పుడు పిత్తముండు అంగముకంటె ఆమాశయమునందు శక్తి అధికముగనుండినయెడల దూరమగును. మరియు వడిపోయినను తిరిగి పిత్తముయొక్క తేజస్సువలన ఆఅంగమునందు ఆమాశయముయొక్క ముఖముతో సంబంధము కలిగియుండు జీవనరము బిగలాగుకొని వంకరైపోవు వ్యాధిని కలిగించును. దీనిని నీలిరంగుగల వమనమునందు వర్ణించియున్నాము.

(8) ఆమాశయముయొక్క రోగములవలన ఆఅంగములయందు ఆమాశయముయొక్క విశేషసంబంధమున్నయెడల బిగింపు వంకరగునట్టి వ్యాధి వుత్పత్తియగును. ఈకారణమువలన ఒక్కొక్కప్పుడు రోగ అంగమునందున్ను పిక్కలయందున్ను మణికట్టు కీళ్ళయందున్ను పీకబిగింపు వుత్పన్నమగును. యెందుకనగా ఆమాశయము చేతులు కాళ్ళయొక్క మధ్యభాగమునందుండి మిక్కిలి సంబంధము కలిగియున్నది.

మరియు హకీము జాలినూస్‌గారు. అగలోకినయనుపేరుగల గ్రంథమునందు వర్ణించియున్నారు. కాబట్టి కాళ్ళు చేతులు ఆమాశయముయొక్క జలుబువలన మిక్కిలి చల్లబడుచున్నవి. ఆమాశయమునందు వేడి అధికముగానున్నచో కాళ్ళుచేతులు వెచ్చబడుచున్నవి.

(9) ఎదో వాకరోగము గర్భస్థానమునందుగాని మూత్రకోశమునందుగాని లేక వీర్యస్థానమునందుగాని సంభవించినయెడల మెదడునందు హాని ప్రవేశించును. ఈకారణమువలన తసన్నుజ్ వ్యాధి వుత్పన్నమగును. మరియు యీ అంగముల సంయోగకారణమువలన మెదడునందు హానికలుగు విషయమై అనేకస్థలములయందు చెప్పబడియున్నవి.

(10) కడుపులో క్రిములు, సొరగింజలవంటి పురుగులు వుత్పత్తియగుచున్నవి. ఇట్లు క్రిమికలుగుటవలన తసన్నుజ్ వుత్పన్నమగును. ఈబిగింపురోగము క్రిములు కరచునట్టి కారణమువలన ప్రేగులు ఒకటిగాచేరిన కారణమువలన తసన్నుజ్ ఆరంభమగును. మరియు జీవనరము ప్రేగులతో సంబంధము కలిగియుండును. గనుక జీవనరముకూడా బిగిసిపోవును. మరియు ఆఅంగమునందుండు జీవనరమునందుకూడా హానిసంభవించినయెడల వాతముయొక్క చెడు ఆవిరి పరమాణువులు కుళ్ళి దుర్గంధిత ఆక్రిములనుండిలేచి ఆమాశయము మెదడునందున్న చేరుచున్నవి. ఇట్టిస్థితియందు ఆమాశయమునకున్ను మెదడునకున్ను కష్టముకలిగి బిగిసికొని పోవునట్టిరోగమునకు హేతువగును. యిటుల మెదడునకు దుర్గతి కలుగుటవలన తసన్నుజ్ వుత్పన్నమగును.

మరియు, నరము తెగిపోవుటవలన కలుగు చిన్నఃములు అనగా అచ్చట కార్యము ముగిసి దోషము తెగినస్థలమునందు ప్రవేశించి మంటకలుగును. మరియు, ఆఅంగము పైవశ దానిని హరించి నిష్ప్రయోజనముగలదిగా చేయును. యీదోషచిన్నఃములు అచ్చట నొప్పిమంట మొదలగునవి ప్లీహమునందు కలుగును.

విషజంతువుల కాటువలన కలిగినదనిన్ని నల్లమందు మొదలగు విషసంబంధమగు ఔషధములు పుచ్చుకొనుటవలన మరియు, మిక్కిలి జలుబు చేరుటవలన నీలిరంగుగల వమనము వెడలనారంభించును. దీని చిన్నఃహములు ముందు కంటె నిచ్చట విశేషముగా చెప్పబడియె, అనగా వాంతి అయిన తరువాత తనన్నజ్ వుత్పన్నమగును.

మరియు, ఆమాశయమునందు పిత్తము చేరుటవలన కలుగు లక్షణములు వమనమునందు పిత్తము వెడలుట కడుపులో కెళ్ళుట అనగా కడుపులో దేవుట, ఆమాశయమునందు మంట మొదలగునవి ఆమాశయరోగములని గ్రహించవలెను.

గర్భస్థానము రెండవ అంగము జీవనరముతో చేరియున్నవో వాటికారణమువలన తనన్నజ్ వుత్పత్తియగును. దీనిలక్షణములు ఆఅంగములయందు కలుగు కష్టమువలన వ్యాధి కనిపెట్టదగును.

మరియు, క్రిమివలన కలుగు తనన్నజ్ లక్షణములు క్రిములు అప్పుడప్పుడు వెళలించుట ప్రత్యేకముగా వాటివాటి లక్షణములు ఆయాస్థానములయందు వర్ణించబడియె కాబట్టి ఆస్థానములయందు చూచునప్పుడు గమనించవలెను.

### విషప్రయోగమువలన కలుగు బిగింపునకు చికిత్స

ముందు రోగహేతువును దూరపరచవలెను. మరియు, తనన్నజ్ అనగా బిగించి వంకరబోవునట్టి రోగము జీవనరము తెగుటవలన వుత్పన్నమైనను వాపువలన కలిగినను దీనిని తమరు యిత్తిసాల్ యందు వర్ణించబడును. కాబట్టి ఆచికిత్సలను ఉపయోగించవలెను.

మరియు, మండునట్టి కారణమువలన తనన్నజ్ అనగా బిగించునట్టి రోగము మంటవలన కలిగినయెడల ఆదోషమును శాంతినొందించవలెను. మరియు, బిగిసిన అంగముపై తైలములు మర్దించుట పట్లువేయుట, కాచుట మొదలగు నపాయములవలన జలుబు ప్రవేశించునటుల చేయవలెను.

విషజంతువుల కాటువలనగాని లేక విషసంబధమగు ఔషధసేవనవలనగాని కలిగిన తసన్నుజ్ వ్యాధియందు విషమువారించునట్టి చికిత్సలుచేయవలెను. ఆచికిత్సలు విషఅధ్యాయమునందు చెప్పబడును. మరియు, స్వల్పముగా అపస్మారరోగమునందు చెప్పబడియున్నవి. వానిని కూడా యుపయోగించదగును.

విశేషజలుబు వలన బిగించునట్టి వ్యాధి వుత్పన్నమైన యెడల తైలములను మర్దించుట తరేడా అనగా కషాయాదులతో కాచుట శికతాబ్ అనగా వస్తువులనువేయించి కాపడముచేయుట మొదలగు వుపాయములవలన శాంతి నొందించవలెను.

మరియు నీలిరంగుగల వమనమువలనగాని అమాశయమునందు పిత్తము చేరుటవలన ఈవ్యాధి ఉత్పన్నమైన యెడల ముందుమలము వెడలించవలెను. మలశేషమున్న యెడల పృష్ఠమును శాంతి నొందించునట్టి ఔషధ ప్రయోగము చేయవలెను. మరియు అమాశయ ముఖమునకు శక్తి కలిగించుటకు వమన విషయమునందు చెప్పబడిన చికిత్సలనుపయోగించవలెను. మరియు కేవలము నీలిరంగుగల వమనము రోగిని చంపివేయును. దీనితో తసన్నుజ్ వుత్పన్నమగును.

మరియు అమాశయము యొక్క దోషమువలన తసన్నుజ్ వుత్పన్నమైన యెడల దానిని అమాశయముయొక్క భోజనమును తీసివేయు యత్నము చేయవలెను. యెందుకనగా అమాశయమునుండి భోజనము క్రిందికి పోవునప్పుడు కష్టము తగ్గిన యెడల తసన్నుజ్ కూడా తగ్గుచుండును. కాబట్టి ఈతసన్నుజ్ * సహజ చికిత్సవలన శాంతించగలదు.

---

* (లాభము) అపస్మారమునందు చెమ్మవలన మలముచేరి ఘనీభవించుటవలన తసన్నుజ్ వుత్పన్నమగుచున్నది. కాబట్టి దుష్టత్వము కలుగనేరదు, గాని అపస్మార సంబంధమగు తసన్నుజ్ యందు మలము స్థిరముగా జీవనరములయందు కలుగనేరదు. ఈకారణమువలన జీవనరము విశాలముగానుండును. కాబట్టి తసన్నుజ్ అనగా బిగించువ్యాధి వుత్పన్నమగునని గ్రహించవలెను, మరియు యిట్లు కలుగు తసన్నుజ్ వెంట్ర

మరియు ఈవ్యాధి త్వరలో ఆరోగ్యముపొందును. మరియు ఇటులనే ఏ అంగమునందు రోగము కలిగి ఆ అంగ సంయోగము యొక్క కారణమువలన తనన్నుజ్ పుత్పన్నమగుటకు కారణమైనచో ఆ అంగము సంబంధముగల రోగమును హరించు నుపాయములను చేయవలెను. ఆయాస్థానములయందు వ్రాయబడిన రీతిగా చికిత్సచేయవలెను మరియు తనన్నుజ్ గల అంగమునందు ఆవ్యాధి అనుసారముగా తైలములను మర్దించవలెను.

క్రిములయొక్క కారణమువలన తనన్నుజ్ కలిగిన యెడల ఆక్రిములనునశింపచేయుట తీసివేయుట మొదలగునవిలాభదాయకములు. క్రిమియు క్రిమినాశక ఔషధములు వాటిస్థానమునందు చెప్పబడి యున్నవి.

## మెడయందు కలుగు తనన్నుజ్

తమద్దుద్ అనగా జీవనరము రెండువైపులయందు లాగుటయని అర్థము యీకారణమువలననే దీనిపేరు పెట్టబడినది. తమద్దుద్ గల అంగము చక్కగానుండును గాని యేవైపునకు వంగనేరదు. ఇట్టి తమద్దుద్ రెండు తనన్నుజ్‌లతో సంబంధించియున్నది. హకీము బుక్రాత్ గారు తమద్దుద్ ముందు వెనుక వైపులయందు తనన్నుజ్‌తో సంబంధించి కలుగును. యిందువలన తమద్దుద్ తనన్నుజ్ కంటె మిక్కిలి క్రూరమైనది. యెందుకనగా ప్రకృతి యిట్టి కష్టమును సహించజాలదు. యెటులననగా 4వ. దినమందు రోగిని వైవశ్యతవట్టునము

---

నే శాంతించనేరదు, అనగా మెదడు, నరములను పుత్పత్తిస్థానముకాబట్టి మెదడు దోషముతోనిండి బిగిసిపోవుటవలన తనన్నుజ్ పుత్పత్తి యగుచున్నది. మరియు ముఖ్యమగు జీవనరములు దోషపూర్ణమై బిగిసిపోవుటవలన యీకారణమునుబట్టి అపస్మార తనన్నుజ్ యందు ఇంతిలాను, మరియు ఇంకిబాజ్, అనగా మెదడు నిండిపోవుట కిక్కిరుచుటయని అర్థము మరియు తనన్నుజ్ యొక్క భయము మిక్కిలికష్టమువలన పుత్పన్నమగుచున్నది. దీని కారణము భయంకరముగానుండి మరియు కష్టసమయమునందు ప్రాణవాయువుకూడా వ్యాధివైపు దిగుచున్నది. ఇట్టిదశయందు తనన్నుజ్ పుట్టుచున్నది. యీవ్యాధి సకృతుగా కనుపించును.

నకు పంపుచు. మరియు, 4 దినములు యీరోగమునుండి తప్పించుకొని నయెడల బ్రతుకుటకు కూడా సందేహముగానుండును. యెందుకనగా హాకీము బుకరాత్ గారు తమద్దుద్ గల ఒకమనుష్యునికి కనుపించి ఆతను 4వ. దినమునందు మృతినొందెనేనియు యీనాలుగు దినములు గతించిన యెడల రోగము సాధ్యపడగలదనియు చెప్పిరి. మరియు, తమద్దుద్ వ్యాధి వంకరయగుట ఆటంకపడుచున్నది. యీకారణమువలన తనన్నుజ్ వ్యాధికి విరుద్ధముగానుండును.

మరియు, తనన్నుజ్ మలము వెడలుటవలన మలము విశేషముగా నిండియుండుటవలన జీవనరము మొదడు కష్టపడుటవలన కలుగుచున్నది. దీనికారణము వలన తమద్దుద్ కూడా కలుగుచున్నది. దీనివలన నది అనుకూలముగానుండును మరియు, యేనోయొక హేతువువలన దానికంటె రెట్టింపు విపరీతముగానుండు. తమద్దుద్ ఖుజాజ్ వుత్పన్నమగుటకు కారణములు అనేకములు గలవు (1) జలుబు వాతము జీవనరముయొక్క శాఖలయందు చేరినను లేక ఘనీభవించినను ఈ కారణమువలన అంగము బిగించుట తిమ్మిరి మొదలగు కఠినత్వము నొందును. ఈలక్షణములుతప్ప పొడుగునందు యేమికొరంత లేకుండును మరియు, వాతము జీవనరమునందుచేరి అచ్చట శీతలముకలిగించునట్టి అంతర్ బాహ్యభాగముల కారణములు అందు ప్రవేశించును.

బాహ్యకారణమువలన ప్రవేశించునది. అనగా నల్లమందు శేవించుట చల్లని జలపానముచేయుట, మంచు యందు దిరుగుట, చల్లని గాలియందు తిరుగుట చల్లని నీళ్ళయందు యీదుట, చల్లని నీళ్లయందు నివశించి స్నానముచేయుట, తిమ్మిరి వుట్టించు ఔషధశేవనము యీ మొదలగు బాహ్యకారణములవలన తనన్నుజ్ వ్యాధి వుత్పన్నమగును.

మరియు, తంతువులయందు చెమ్మ ప్రవేశించుటవలన తంతువులు శరీరఅవయవములయందు స్థూలత్వము నొందును. యీకారణము

వలన ఇస్త్రిఖామలము కలుగుచున్నది. యీ విధము వలన తమద్దుద్ మరియు, ఇస్త్రిఖావాతమునందు భేదముండును అప్పుడు ఇస్త్రిఖా యందు మలమువలచగను చెమ్మగానుండును. కాబట్టి జీవనరమునందు సహజముగా ప్రవేశించును. అనగా ముందు చిక్కగానుండిన మలము ప్రత్యేకసమయమునందు వలచబడుచున్నది.

మరియు తమద్దుద్ వ్యాధియొక్క మలము నరంపులయందు ప్రవేశించిన వెనుక అవశ్యముగా ఇతరకారణము సంభవించినప్పుడు ఆ మలము స్తంభించును. ఈకారణమువలన నరములు తెగుట గడ్డకట్టుట వంకరగుట మొదలగులక్షణములు సంభవించును ఇటుల కటస్థించుట వలన అంగములు కదలుట నశించుచున్నది. ఒకానొకప్పుడు తమద్దుద్ యొక్క మలము నరముల మూలములయందు ప్రవేశించకుండినను వాని సమీపమునందుచేరినను ఆస్థలము కఠినత్వమునొంది గాని లేక ఆస్థలమునందు గ్రంధిగాని కలుగుచున్నవి. ఇట్టిస్థితియందు బిగించు లక్షణములు లేకుండును.

(2) మలము జీవనరముల మొదళ్ళయందు చేరినప్పుడు జీవనరము ఆమలమును తనమూలము గ్రహించును. ఇట్టికారణమువలన అంగము కదలకుండునటులచేయును.

(3) జీవనరమునందు ఒకానొకకారణమువలన కష్టము సంభవించి ఆకష్టమువలన జీవనరము విశాలమునందు సంకుచితమునొంది బిగబట్టును ఇట్టిసమయమునందు తమద్దుద్వ్యాధి కలుగనేరదు. మరియు వమనవిశేషత్వమువలనగాని విషజంతువులు కాటునొందుటవలనగాని జీవనరమునందు గాయము తగులుటవలనగాని యీవ్యాధి కలుగుచున్నది. మరియు వమనకారణమువలన మంటను పుట్టించునట్టి మలము వ్యాధిని పుట్టించునట్టి మలము వమనకారణము వలన ఆమాశయమునందు చేరుచున్నది. మరియు ఆమాశయముయొక్క ముఖము దీనితో కష్టము నొందుచున్నది. జీవనరము ఆమాశయమునందుచేరి యుండును. కాబట్టి

యీవిరుద్ధకారణమువలన జీవనరమునకుకూడా కష్టము సంప్రాప్తమైన యెడల అవశ్యముగా జీవనరము ఆస్థానమునుండి తిరుగనారంభించును. అనగా ముడుచుకొనిపోవును.

(4) శుష్కత్వము అధికమై వికృతియొక్క చెమ్మజీవనరములయందున్న తంతువులయందున్న చేరి కష్టమునొందించును. ఇట్టిస్థితియందు తంతువులు జీవనరము బిగిసిపోయి పొడవునందు అతిశయమొందునట్టి కారణమువలన వమనశక్తిమార్గము ఆటంకమగును. ఇటుల కలిగిన యెడల తనన్నుజ్ (బిగించువ్యాధి) శుష్కత్వమువలన కలిగినదనియు యీశుష్కత్వమునందు భేదమున్నదనియు గ్రహించవలెను. మరియు శుష్కత్వమువలన కలిగిన తమద్దుద్వ్యాధి మిక్కిలి భయంకరముగానుండును.

కొన్ని తమద్దుద్వ్యాధులువిశేషకారణమువలనమలము విశేషజలముకలదైన యెడల యిట్టివ్యాధి మిక్కిలి కఠినమైనదగును. మరియు, కొన్ని దుర్బల కారణములవలన యీవ్యాధి కలుగుచున్నది. అనగా మిక్కిలి బరువుమోయుట కఠినస్థానములయందు పరుండుట మొదలగు కారణములవలన కండరములు బిగిసిపోవును. లేక అణగి పోవును. ఇట్లు యీకండరముల దశ మారుటవలన బిగింపు అంగములయందు సంభవించును. యిట్లు బిగించు వ్యాధిని తమద్దుద్ క్రింద నెంచుదురు. యిటుల భావించుట సహజము.

(5) శరీరమునందుగల చెడువాయువు యీవ్యాధికారణమగును. యీకారణమువలన తమద్దుద్వాత మనిపిలుచుచున్నది. ఈవాతచికిత్స తనన్నుజ్వాతముకంటె కఠినముగానుండును.

(6) శరీరమునందలి అంగములు కాలిపోవుట లేక అంగములయందు గాయముపడుట కండరములు యీకష్టములవలన విడిపోవుట లేక శుష్కించుట మొదలగు కారణములవలన అంగము నిలిచియుండును.

(లాభః) తమద్దుద్, కుజాజ్, తనన్నుజ్వ్యాధులయందునొప్పి

కలిగించును. నొప్పికలిగించుటకు కారణము మలము తంతువులయందు ప్రవేశించినదని గ్రహించవలెను. మరియు, తిరిగిపోవునట్టిచేష్ట దీనిని స్తంభించుచున్నది. యీకారణమువలన నొప్పి యుత్పత్తియగుచున్నది. దీనిని తసన్నుజ్ కుజాజ్ అని కూడా చెప్పుదురు. ఇది మెదడు యొక్క శల్యము అనగా కంఠము క్రిందనుండు కంఠెవలెనుండు యెముకయందు వుత్పత్తిఅయి పాదగ్రనందు విశేషముగా వెనుకనుగాని ముందు వైపు నకుగాని నీడ్వనారంభించును లేక రెండువైపులును పీకనారంభించును. ఒకప్పుడు సమస్త తమద్దుద్ వ్యాధులు యిట్లు నీడ్వనారంభించునని తెలియవలెను.

ఏఅంగమునందు యిట్టి దశయందుగల తమద్దుద్ కుజాజ్ యీరెండు వ్యాధులకు ఒకేఅర్థమని భావించవలెను. మరియూ, జీవనర మునందు వాతముచేరుటవలన కలిగిన వ్యాధి సామాన్యమైనదనియూ నీడ్చునట్టి ప్రత్యేక కారణమువలన బిగబట్టునట్టి తమద్దుద్ చెమ్మవలన, శుష్కత్వమువలన, వాపువలన కలిగినట్టి తమద్దుద్వ్యాధి తసన్నుజ్ యందు వర్ణించబడినదిగాని యీరెంటియందు భేదముకలదు అనగా యీరోగ చికిత్స తసన్నుజ్ చికిత్సకంటె వేగిరము చేయవలెను. యెందు కనగాయీవ్యాధి కష్టముకలిగించి గొంతుబిగించి అగస్మాత్తుగా చంపి వేయును. యీసమయమున కారణము బలముగానుండును.

**ఈరోగమునందు కలిగిన తమద్దుద్వ్యాధి పూర్వలక్షణములు**

ఈలక్షణములు అనేకములుగలవు (1) జీవనరము మచ్చునగుంట మొదలగు అంగములయొక్క అవయవములు కఠినత్వమునొందుట.

(2) శరీరము యావత్తు అదరుట నాలుక యందు భారముగా నుండినటుల తోచుట.

(3) నీళ్ళుమ్రింగుటకున్ను గుటకవేయుటకు కఠినముగానుండుట శరీరము యావత్తు దురద బుట్టుట శరీరము యావత్తు గోకి గోకి యేమి

తోచకుండుట యివి యావత్తు కుజాజ్‌యొక్క పూర్వహేతువులని తెలియవలెను.

మరియు, యీలక్షణములు యీరోగ అంగమునందు కనపించుచున్నవి. అనగా దురదగలరోగి ముఖము నేత్రములు మెడ మొదలగునవి స్వరభంగరోగివలెనుండును. ముఖము నెర్రగానుండుట, నేత్రములులాగుట చిన్నబోవుట, శ్వాస వెంట వెంట పీల్చుట దురద అధికమైన యెడల యీలక్షణములు యావత్తు ప్రత్యక్షమగును. మరియు, ఒకానొకసమయమునందు ముఖకాంతి నల్లగను ఆకుపచ్చరంగుగను యుండును. యిట్టి స్థితియందు తలయొక్కయు మెడయొక్క నరముల యందు మలము నిలిచి ప్రాణవాయువుయొక్క, మార్గములను బాధించివేయును. అనగా యీదశయందు ప్రకృతి సంబంధమగు ఉష్ణము చేరకపోవుటవలన వాతమునందు జలుబు విశేషమై యిట్టి కారణమువలన చర్మమునందు దూరముప్రవేశించి పీకనారంభించును. మరియు, దుర్బలభాగము తెల్లగను యెర్రగనుండు చర్మముయొక్క రోమకూపములనుండి వెంట్రుకలువూడిపోయిన యెడల చర్మము నల్లని రంగుగానుండును. మరియు అచ్చటనుండు దోషము బహుళా వెడలిపోయి కొంతమలశేషము వెడలిన యెడల చర్మము ఆకుపచ్చని రంగగును. మరియు, ఒక్కొకప్పుడు ముఖసంబంధమగు నాడులయందు తమద్‌దుద్ పీకునట్టివ్యాధి వుత్పన్నమగును మరియు, రోగిఆనందముగానే యుండును. మరియు, ఒకప్పుడు తమద్‌దుద్ మూత్రకోశముయొక్క నాడులయందు వుత్పన్నమైన యెడల మూత్రము బిగబట్టును.

మరియు మూత్రకోశముయొక్క నాడులు బిగబట్టుటవలన ఆపిగలశక్తి నష్టమునుగాని మూత్రవిసర్జనము కలిగియుండును. మరియు ఒక్కొక్కసమయమునందు మూత్రకోశముయొక్క నాడులు మిక్కిలి బిగబట్టుటవలన నాళ్ళు తెగిపోవుటగాని లేక ఆనాళ్ళలో నేదోనొకదాని ముఖము చిట్లిపోవుటగాని లటస్థించును. ఇట్టిసమయమునందు మూత్ర

మువెంట రక్తము స్రవించనారంభించును. ఒక్కొక్క రోగికి బిగించుకార ణమువలన కూలంజ్ అనగా పేగులయందు శూల వుత్పన్నమగును. అప్పుడు యీవ్యాధియందు మూత్రము నీళ్ళవలె వెడలనారంభించును. మరియు నాళ్లు బిగించుకారణమువలన రోగి పక్కపై నిలువజాలనంత బాధకలిగి మూత్రము విడుచుచుండును. యిందువిషయమై పైనచెప్పి యేయుంటిని. అనగా తమద్దుద్ ఇంతిలాయి చిన్నములవలె తనన్నుజ్ ఇంతిలాయి వావుగలరోగి చిన్నములు సమానముగా నుండును. మరియు తమద్దుద్వ్యాధిగలవానికి నిదురపట్టకుండును. రెండుభుజము లమధ్య మిక్కిలి నొప్పి కలిగియుండును. మరియు తమద్దుద్యొక్క అనుకూలయుక్త చిన్నములలోనుండి యేదోనొక చిన్నము కలిగి యుండును.

(సూచనీయము) తమద్దుద్ జలుబు, శుష్కత్వమువలన కలి గినయెడల వుష్ణము చెమ్మ అనగా తడికిలిగించునట్టిపట్లు తైలమర్దనలు చేయవలెను మరియు చెమటవెడలనారంభించినయెడల ఆచెమటను శరీర ముపై ఆరనియ్యక తుడిచివేయవలెను. ఇట్టిరోగి శరీరమునందు చలువ కలుగనియ్యకూడదు. అన్యవుపాయములు తనన్నుజ్ ప్రకరణమునందు చెప్పబడియున్నవి.



# శరీరకంపరము (వణుకు) లక్షణములు.



ఈరోగము తనస్వభావికమువలన పేరునకు అనుసరించియున్నది. మరియు యీవ్యాధి తిరుగునట్టియు కదలునట్టియు సంయోగ అంగములయందు తప్ప యితర అంగములయందు కలుగనేరదు. యీరోగము విశేషముగా చేతులు తలయందు కలుగుచున్నది, కాళ్లు మొదలగు సంయోగ అంగములలో స్వల్పముగా కలుగుచున్నది. చేతులయందుయీరోగము వుత్పన్నమగుటకు కారణములు గొప్పగొప్ప వైద్యగ్రంథములలో విపులముగా వ్రాయబడియున్నది. నేను యిచ్చట సంక్షిప్తముగా ప్రసిద్ధకారణములు చెప్పుచున్నాను. ఈరోగముయొక్క పూర్ణకారణములు నడుచునట్టియు కదలునట్టియు అంగములయొక్క దుర్బలమువలన కలుగుచున్నది. మరియు సంచార శక్తి చేతులయందు ప్రకటనమగుచున్నయది యెట్లనగా సర్వశరీర అంగములకంటె చేతులయందు సంచారశక్తి విశేషముగా నుండును. యెందుకనగా చేతులయందు సంయోగము అనగా కీళ్లు (జాయింట్సు) విశేషముగానుండును. కాబట్టి చేతులకు వణుకురోగము త్వరలోవచ్చుచున్నది. మరియు చేతులకంటె కాళ్ళయందు శక్తితక్కువగానుండును. కాళ్ళకంటె యితరఅంగములయందు తక్కువగానుండును. మరియు అదరుట, వణుకుటయందు భేదముగానుండును. అనగా అదరుటయందు సంచారణశక్తి ప్రత్యేకదశయందు ప్రకటనమగుచున్నది. మరియు అంగము నిలిచియున్నను కదలుచున్నను కంపము అనగా వణుకు వ్యాధికి విరుద్ధముగా నెంచవలెను యెందుకనిన నిలిచియుండు దశయందు వణుకుయుండనేరదు. నిలిచిపోవుటకుఅర్థము అంగము యేదోయొక యితరకారణమువలన నిలిచినదిన్నీ లేనిదిన్నీ ఆలోచించవలెను. దీనిని నిరాయనుచున్నారు.

మరియు యీరోగముయొక్క పూర్ణ కారణములు మూడు విధములు (1) నడుచునట్టి శక్తి దుర్బలమైపోవుట (2) అచ్చట గమనశక్తి అంగమువదలి దుర్బలమైపోవుట (3) అచ్చట నడుచునట్టి శక్తి గమనశీల అను నీరెండున్ను ఒకటిగాచేరి ఏకేవరియాయము ఒకేస్థలమునందు దుర్బలము నొందుట యీమొదలగు కారణములవలన యీరోగముయొక్క కారణానుసారముగా మూడువిధములు యిచ్చటనే వర్ణించుచున్నాను.

(1) సంచారణశక్తియొక్క దుర్బలమువలన వణుకురోగముత్పన్నమగుచున్నది. బహుశా దీని భేదములు రెండువిధములు (1) వ్యాధిగ్రస్తునికి రోగాంతమునందు వణుకురోగము కలుగుచున్నది. విశేషముగాభుజించినవెంటనే స్త్రీసంగమము విశేషముచేసినవారికి యీరోగము వుత్పన్నమగుచున్నది.

(2) అచ్చట ప్రకృతియొక్క కారణమువలన వుత్పత్తి యగుచున్నది. మరియు బాధాపా యనగా ప్రభువుయొక్క భయము విశేషముగానుండుటవలన వున్నత ప్రదేశమునుండి క్రిందచూచుటవలన గోడలు పరంజాలపై తిరుగుట మొదలుగాగలవానివలన మరియు అధిక ప్రసన్నత, అధికక్రోధము, అధిక జ్ఞానము మొదలగువానివలన వణుకురోగము వుత్పత్తియగుచున్నది. మరియు యీయావత్తుకారణములవలన గమనశక్తియొక్క అధీనమగుటవలన తొందరవలన వణుకుపుట్టుచున్నది. అనగా భయము శక్తిని దుర్బలపరచుచున్నది. మరియు లజ్జ, క్రోధము ప్రసన్నము, ప్రకృతియొక్క శక్తి చేష్టలను చెరచుచున్నది. మరియు మెదడునందుగలశక్తి హృదయమునందుగలశక్తి అధీనమైయున్నది. కాబట్టి క్రోధము ఆశయమునందు శక్తియొక్క చేష్టయందు తొందరపుట్టించుచున్నది. మరియు భయముతో కలియనియెడల వణుకుకలుగనేరదు. యెటులననగా కేవలము క్రోధమునందు దుర్బలము కలుగజాలదు. మనస్సునందు శక్తి కలుగుటకు చిన్నములు ఇట్టికారణమువలన క్రోధము

భయముతో కలుగదు. క్రోధమువలన కలుగు భయమునందు ముఖ కాంతి యెర్రగానుండును. మరియు భయమువలన ముఖకాంతి పచ్చగా నుండును.

(సూచనీయము) యెల్లప్పుడు క్రోధముగాని భయముగాని కలుగనిదే యీవ్యాధి యితరకారణమువలనకూడా పుట్టగలదు. అనగా జీవనరమునందు మిక్కిలి తందరపుట్టినయెడల వానిచేష్టలు వేరువేరుగా నుండును. మరియు నడుచునట్టి శక్తియొక్క చేష్టప్రబంధము చెడిపోవును. ఒక్కొక్కప్పుడు క్రోధము, సంతోషము, యేదైనలాభము సిద్ధించుట యీవిధమగు ప్రాణమునందు తందరలేకుండా మరియొక కారణమువలన సంయోగముకూడా లేకుండును అయినను వణుకువ్యాధి మాత్రము వుత్పత్తిచేయును. త్వక్కు (చర్మము) నందు వాతము అధికముగాయున్నయెడల అనగా క్రోధము ప్రసన్నత సమయమునందు కలుగు వృష్ణమువలన వాతదోషముకలిగి అచ్చటనుండివచ్చి కండరములయందు ప్రవేశించినయెడల కంపరము పుట్టుచున్నది. యెటులననగా వాతమువలన గమనశక్తియందు విరుద్ధత కలుగుచున్నది. అట్టిస్థితియందుగమనశక్తి దుర్బలమునొందుటవలన వణుకువ్యాధి వుత్పత్తియగుటకు కారణమగుచున్నది. మరియు వణుకువ్యాధి ఒక్కొక్క యవ్వనపురుషునికి స్త్రీసంభోగసమయమునందు కలుగుచున్నది. ఇదికూడా పైవిధముగానే కలుగునని గ్రహించవలెను.

—కంపరము అనగా వణుకు వ్యాధి చికిత్స.—

రోగమువలన శరీరబలము తగ్గి వణుకురోగము వుత్పన్నమైనయెడల హేతువును తొలగించి తరువాత మెదడునకు హృదయమునకు బలము కలిగించవలెను. మరియు సంభోగము అయినతరువాత వణుకు సంభవించినయెడల అట్టిపురుషుడు సంభోగము వర్జించవలెను. మరియు కడుపునకు శక్తికలిగించుటకై వాజీకరవిషయమునందు చెప్పబడిన మసాలములను గమనించి వుపయోగించవలెను.

మరియు, క్రోధము, భయము, ప్రసన్నత్వము, శోకము, మొదలగు విశేషకారణములవలన వణుకు వ్యాధి వుత్పత్తిఅయినచో ఆయాహేతువుల విపరీతమగు నుపాయములను చేయవలెను. ధైర్యము, ఆశ, అవమానము, మొదలగు వానిని కలిగించు నుపాయములతో భయము మొదలగు వానిని తొలగించవలెను.

మరియు, మైధునకాలమునందు వణుకుకలిగినచో అట్టికారణము గల దోషములను తీసివేయవలెను.

2 వ. కంపరము అనగా వణుకు రోగలక్షణము.

ఈరోగము సంయోగ అంగముల జీవనరములయందు గమన శక్తి దుర్బలమునొందుటవలన వణుకువ్యాధి కలుగుచున్నది. యిది మూడువిధములుగా నుండును.

(1) చల్లని ప్రకృతి జీవనరములయందు ప్రవేశించుటవలన ఆజీవనరములు ప్రాణవాయువును తన యిష్టానుసారముగా గ్రహించజాలకుండును. ఇట్లు గ్రహించని హేతువువలన జీవనరము పటుత్వము తగ్గిపోవును. అనగా అట్టిదశయందు గమనశక్తి అంగమువలన పైకిబిగించుచున్నది. మరియు, దుర్బలమును గ్రహింపలేకపోవును. యిట్టిదశయందు ఆఅంగము క్రిందికివాలిపోవును. యిట్లుకటస్తించినప్పుడు గమనశక్తి యొక్క విరోధశక్తియందున్న శరీరముక్రింద తిరుగునట్టి శక్తియందున్న విరుద్ధతకలుగుచున్నది. ఆ శక్తులమధ్య విరోధము కలుగుటవలన కంపము వుత్పత్తియగుచున్నది. ఇది పక్షవాతమునకు విరుద్ధముగా నున్నది. దీనియందు శరీరము పూర్ణముగా తిమ్మిరి కలుగుచున్నది. యిట్టిసమయమునందు గమనశక్తి అంగములను నీడ్చునట్టి దుర్బలము కలిగి దుర్బలముగానుండును. మరియు, అంతవరకు గమనశక్తి అంగములను నీడ్చుబలము లేని యెడల దుర్బలకారణము నిలువకుండిన వణుకు వ్యాధి కలుగ చాలదు మరియు, వణుకు తరుచుగా వృద్ధులకు కలుగుచున్నది.

మరియు చల్లని జలపానముచేయుటవలన వణుకురోగము కలుగుచున్నది. అనగా యేమియుభుజించక నీళ్ళుత్రాగుట అని అర్థము. మరియు పరిశ్రమచేసిన వెంటనే నీళ్ళుత్రాగుట స్నానముచేసిన వెంటనే యేమియు భుజించక వెంటనే చల్లని నీళ్ళుత్రాగుట మొదలగు కారణములవలన వణుకురోగము కలుగునని భావము.

మరియు విశేషముగా మద్యపానము చేయుటవలన వణుకురోగము కలుగుచున్నది. మరియు నిరన్నహారముగా సారాయి త్రాగుట వలన కలుగగలదని గ్రహించవలెను.

మరియు యీగ్రంథకర్త మద్యపానాదిఖ్యాతవలన అధవ, చల్లని వృష్ణప్రకృతిగల భోజనముచేయుటవలన ప్రకృతియందు శీతప్రకోపము కలిగి స్వభావికమగు వృష్ణము తగ్గి వణుకురోగము సంభవించుచున్నది. అనగా కొద్ది అగ్నిపై గొప్పగొప్ప కాష్ఠములను వేయుటవలన ఆఅగ్ని ఆగొప్పకర్రలను దహించుశక్తి లేక నిలిచిపోవును. కాబట్టి వృష్ణము తగ్గిన కారణమువలన జీవనరము ప్రాణవాయువు శక్తి దుర్బలమునొంది అంగములను తమనిజదశయందు వుంచగలుగును. ఇటులనుంచుటవలన వణుకు, తిమ్మిరి, మరియు చల్లని హేతువుగల యితరరోగములుకలుగు చున్నవి.

మరియు విశేషముగా మద్యపానముచేయుటవలన పుట్టునట్టి రోగములు అనేకములుంగలవు. మరియు ఆరోగముల కారణములను వర్ణించుటకు గ్రంథవిస్తీర్ణభీతివలన యిచ్చటవ్రాయనైతిని.

(2) మలము శరీరమునందు నిండుట మరియు అన్నము జీర్ణించకుండుట శరీరపరిశ్రమచేయకపోవుట జీవనరమునందు చిక్కని దోషము వలన బంధనమేర్పడుట యిటులబంధనమేర్పడుటవలన గమనశక్తి శరీరముయావత్తు సంచారముచే ... మరియు గమనశక్తి శరీరనరములయందు సంచరించక దోషములేని నరములయందు మాత్రము చేరి అచ్చట విశేషపరాక్రమమునొంది తాను ప్రవేశించిన అంగమును

పై భాగమునకు బిగించును. ఈ కారణమువలన పరిమాణము తగ్గుటవలన అంగములు ఆవజాలకుండును. మరియు అవశ్యముగా దీని భారమువలన క్రిందివైపునకు వెళ్ళగలుగును. అనగా శక్తి మధ్యనిలిచినయెడల క్రింది వైపుకు రాజాలదనుట. మరియు శక్తి పైకి వచ్చుట శక్తిబలము తగ్గుట క్రిందిభాగమునం దీశక్తి రాజాలకపోవుట దోషము బంధించుట మొదలగు కారణములవలన వణుకురోగము పుత్పత్తి యగుచున్నది. మరియు దుష్టప్రకృతి బంధనముల చిహ్నములు పక్షవాతమునందు వర్ణించబడెను.

దోషయుక్త కంపర చికిత్స.

దోషయుక్తమగు వణుకురోగమునందు మలము నిశ్చలముగా అనేకపర్యాయములు కొద్దికొద్దిగా వెడలించవలెను. అనగా పేళ్ళకషాయముతో వాలుబ్బెసాతరజ్ చితరీమూలపుచూర్ణిలు యారజాత్ యివ్వవలెను. మలము ఆలశ్యముగా వెడలించు విషయమై వెనుకరోగములయందు విరళముగా వర్ణించియున్నాను. మరియు ప్రత్యేకదశయందు పుష్టికరమగు ఔషధప్రయోగములను చేయవలెను. మలమును విశేషముగా తీయుటవలన అపాయము కలుగగలదు.

మరియు కంపరమునందు పుష్టికరములమును వెడలించుటవలననేఅపాయము కలుగకుండునటుల కాపాడవలెను. యెందుకనిన మలవిసర్జన కరమగు ఔషధసేవనవలన శక్తిని దూరపరచి దుర్బలమును కలిగించును. మరియు వణుకు విశేషమగును. కాబట్టి నరముల సంబంధమగు సమస్తవ్యాధులయందును యీవిషయమును జ్ఞాపకముంచవలెను. ఇందువిషయమై అనేకనుపాయములను చెప్పబడియున్నవి. మరియు చంగల్వకోష్టుతైలము చెంబేలితైలమును శరీరముపై మర్దించవలెను. మరియు తెల్లగలిచేరు, కుందేలుమాంసము, నీళ్ళలోవేసి కషాయముకాచి ఆకషాయమునందు రోగిని కూర్చుండబెట్టవలెను, మరియు స్పంధనూనె శరీరముపై లేపనముచేయవలెను. మరియు గోరువెచ్చనిసోయి కషాయ

ముతో స్నానముచేయించుట అంగమును మర్దించుట పిసుకుట, మొదలగు నుపాయములను చేయవలెను. అవశ్యముగా యీయాపత్తు నుపాయములతో వణుకుగల స్థలమునందు రక్తమును పీడ్చివేయుము. ఆస్థానమునందు వ్రూణ్ణము కలిగించును. ఇట్లుచేయుటవలనఆఅంగముయొక్క శక్తిస్థిరపడి వణుకుశాంతినొందును.

చల్లని దుష్టప్రకృతివలన వణుకువ్యాధి వుత్పన్నమైనయెడల ప్రకృతిని స్థిరపరచుటకై దుష్టప్రకృతి సంబంధమగు మలమును తొలగించుటకై దుష్టప్రకృతిమలవ్యాధియందు చెప్పిన ప్రయోగములను నువయోగించవలెను గాని మలమును వెడలించు నుద్యమము చేయకూడదు యెందుకనగా యిందు మలము కలుగనేరదు.

మరియు మద్యపానమనగా సారాయి త్రాగుటవలన వణుకువ్యాధికలిగినయెడల మద్యపానము మానివేయవలెను. మరియు గుల్‌రోగ ఆస్‌తైలమునందు కొద్దిగాశిరకాకలిపి తలపై లేపనముచేయవలెను. మరియు రక్తమును చిక్కపరచునట్టి వస్తుసేవనచేయవలెను. అనగా శ్యాబేజి, చిరిసెనగలు, మరియు యిట్టిస్వభావికమగు అన్యవస్తువులు కుండేలు మాంసము, కుండేలు మెదడు వేయించినవి యీరోగమునందు మిక్కిలి లాభదాయకము.

(౩) ఈవ్యాధియందు జీవనరములు శుష్కించునట్టి కారణమువలన వణుకువ్యాధి వుత్పన్నమగును. అనగా జీవనరమునందుగల గమనశక్తి ప్రకృతానుకూలముగా నుండకపోవుటవలన వణుకువ్యాధి తటస్థించును. శుష్కత్వము నొందించునట్టి కారణము ముందు విశేషముగా చెప్పియుంటిని మరియు అంగము చిక్కిపోవుట యిందలికండరములు బలహీనమగును. మరియు రోగపీడిత అంగముపై తైలలేపనముచేసిన యెడల వెంటనే ఆరిపోవును. కాబట్టి ఆఅంగముపై వ్రణ్ణము కలిగించు నుపాయములను చేయకూడదు. మరియు శుష్కత్వము విశేషముగా యుండనియెడల వణుకువ్యాధి కలుగనేరదని గ్రహించవలెను. యెందు

కనగా క్షయరోగికి శుష్కత్వము అధికమైనను వణుకు కలుగనేరదు గాని క్షయ అంగమునందు వణుకువ్యాధి వుత్పన్నము కాగలదు.

—శుష్కదోష కంపర చికిత్స—

ఈవ్యాధియందు రోగిశరీరమునందు చెమ్మను కలిగించుటకై తెసన్నుజ్ యూవిస్ వ్యాధియందు వర్ణించినరీతిగా పరిశ్రమచేయవలెను.

(3) శక్తిసంయోగ అంగము యీరెండిటి కారణముల వలన వణుకు వ్యాధి ఉత్పన్నమగును. మరియు జీవసరము లోపలి వెలుపలి కారణములవలన కష్టపడుచుండును. బాహ్యకారణములనగా విశేషముగా జలుబు కలుగ జేయుట లేక విషజంతువుల కాటునొందుట లేక అంగము కాలుట యీ మొదలగునవి.

మరియు, లోపలికారణములు అనగా చల్లని దోషములు వకటిగాచేరి ఖనీభవించుటవలన జీవసరమునకు కష్టము సంప్రాప్తించును. యిట్టి తరి సంయోగ అంగములయందు దుర్బలము సంభవించును. దీనిచిన్నెములు యావత్తు కష్టములు ముందుగా సంభవించి ఆకష్టములవలన వణుకువ్యాధి తటస్థించును.

—శక్తి సంయోగ అంగముల కంపరముయొక్క చికిత్స.—

రోగహేతువును తొలగించుటలో శేషమున్న యెడల ఆహేతుశేషమును వుచితమగు ఔషధములను వుపయోగించవలెను. మరియు, వ్యాధికారణము జలుబు అయిన యెడల జైతూన్ తైలమునందు అక్కలకర్ర, యింగువ, జున్ను యీవస్తువులనూరి లేపనము చేయవలెను. మరియు, అంగము కాలుటవలన కలిగిన వణుకువ్యాధియందు ఇసబ్గోలుంగింజలగుజ్జు కోడిగుడ్డు తెల్లసొనకలిపి లేపనముచేయవలెను. మరియు, చల్లని తైలములను ఆఅంగముపై లేపనము చేయవలెను. విశేషనుపాయములు అంగదగ్ద వ్రణములయందు వ్రాయబడియున్నవి.

మరియు, విషసంబధమగు జంతుకాటువలన వణుకు రోగము తటస్థించిన యెడల అట్టిచికిత్సను యీపుస్తక అంతమునందు విషహార

అధ్యాయమందు చెప్పబడియె. కాబట్టి ఆచికిత్సను యిందుపయోగించ వలెను.

మరియు, దోషము ప్రకోపించుటవలన వణుకువ్యాధి ఉత్పన్న మైన యెడల ఆదోషములను తొలగించి శరీరమునకు స్వస్థత నొందించ వలెను. మరియు, యిట్టి నుపాయమువలన ఆయాదోషములను తగ్గించు నదుపాయములు చేయవలెను.

మరియు, బాలురకు యవ్వనులకున్ను ఈవణుకువ్యాధి యెడమ భాగమునందు కలిగిన యెడల దీని చికిత్స మిక్కిలి కష్టముగానుండును. యెందుకనగా యెడమభాగమునందు హృదయము (హార్టు) వున్నది. కాబట్టి ఆహృదయశక్తియందు దుర్బలముకలుగుటవలన యీవ్యాధి వుత్పన్నమగును గనుక హృదయ దుర్బలశక్తి చికిత్సలు కఠినముగా నుండును కాబట్టి అట్టిస్థితియందు కలుగు రోగము కుదురుట కష్టము. మరియు, వృద్ధులకు వృద్ధ దశయందు బలము క్షీణించి వణుకువ్యాధి కలుగుచున్నది. గనుక వృద్ధులకు కలుగు వణుకువ్యాధియందు చికిత్స చేయుట కష్టము యెందుకనగా యీవస్సునందు హృదయయమునందు గల ప్రాణశక్తి మెదడునందుగల ప్రాణశక్తి దుర్బలమునొందును. కాబట్టి యీశక్తుల ఆధీనమునందుండు గమనశక్తికూడా దుర్బలము నొందును యీవత్తుశక్తుల దుర్బలమువలన కలుగు వ్యాధి చికిత్సమిక్కిలి కష్టము గనుక వార్ధిక్యమునందు కలుగు వ్యాధి అసాధ్యమనియు వృద్ధులకు కలుగు వణుకు కుమురుట దుర్లభమనియు వచించుటకు కారణ మైనది.

శిరఃకంపము అనగా వణుకు వ్యాధి చికిత్స.

ఉస్తెఖుద్దూస్ 3న్నర మాషములు యారజ్ఫైకరా 3న్నర మాషములు యీరెండుకలిపి యివ్వవలెను.

మరియు 7 మాషములు ఉస్తెఖుద్దూస్ తేనెనీళ్ళలోనూరికలిపి వుపయోగించుట మిక్కిలిలాభదాయకము.

మరియు 19 దినములు గతించినతరువాత చిన్నర మాషము ఉస్తెఖద్దూస్ పైవిధముగా చిన్నర మాషములగాయితు 5½ మాష మువరకు రోగబలానుకూలముగా యివ్వవలెను. ఈ యోగమును ఒక మహాయోగివలన కనిపెట్టబడినది గాన యీ మాత్రను యువయోగించుట మిక్కిలిలాభదాయకమగును, మరియు దీర్ఘకాలమునుండి యుండునట్టి వణుకురోగమునందు జున్ను తేనెనీళ్ళతో యిచ్చుట లాభదాయకము.

(లాభము) వణుకువ్యాధియందు వర్షజలము మిక్కిలి హానికరము. మరియు శిరావేదన యీరోగకారణానుసారముగా నుండును. మరియు యితర కారణము వెనుక వర్ణించబడెను. హకీం మొహంమ్మద్ జికిరియా గారు అపస్మారరోగియొక్క తల అపస్మారసమయమునందు వణుకునారంభించినయెడల ఆరోగితలయందు వాపు జనించినదని గ్రహించవలెను.



# తిమ్మిరిరోగలక్షణములు.

ఖదరు అరబ్బీభాషయందు తిమ్మిరివ్యాధికి చెప్పెదరు. ఈరోగమునందు కష్టదశ విశేషముగా నుండును. గనుకనే యీవ్యాధికి ఖదర్ అని పేరు పెట్టబడెను. ప్రాచీనవైద్యవరులు యీవ్యాధియొక్క వర్ణన యీక్రిందివిధముగా వివరించిరి. అనగా యీవ్యాధి సర్వేంద్రియముల యందు వుత్పత్తియగుచున్నది. మరియు అచ్చట కారణము బలముగలదైనయెడల స్పర్శజ్ఞానము బొత్తిగా నశించును. అథవా హేతువానుసార

ముగా స్పర్శజ్ఞానము తగ్గుచున్నది. మరియు యీరోగమునందు అంగ ములు తిమ్మిరి కలుగుచున్నవి. ఆఅంగములు తిరుగుటకు కదలుటకు స్వభావికదశయందుండనేరవు గాని అచ్చట దుర్బలకారణము కలిగిన యెడల స్వభావిక దశ బొత్తుగా నశించును. యెటులననగా జ్ఞానేంద్రియ ములుగల జీవనరములు వేరుగను గమనశక్తితో సంబంధము కలిగి వేరు గానుండును. మరియు వేరుసంబంధమగు జీవనరములయందు కారణము బలము గలదైనయెడల జ్ఞానశక్తి మార్గములు బంధించబడుచున్నవి. జ్ఞానశక్తిమార్గములకు ఆటంకము కలుగకున్నయెడల తిమ్మిరిరోగము దృఢము కాజాలదు. ఈవ్యాధి వణుకురోగముతో సంబంధించియుండు ను. మరియు దృఢము నొందినవెనుక ఇస్తర్ఖావ్యాధితో సంబంధము కలిగియుండును. పూర్వవువైద్యులు ఖదరు అనగా తిమ్మిరివ్యాధి జ్ఞాన మునందు స్వల్పముగా వచ్చినవెంటనే ముఖ్యముగావచ్చునని వచించిరి. అనగా తిమ్మిరివ్యాధి అర్థము వణుకురోగమని గ్రహించువారు మరియు వణుకు, తిమ్మిరి, యీరెండువ్యాధులకు ఒకే అర్థముగా భావించుచుం డెడివారు గనుకనే హాకీంశేక్ అలీఅబూసేనాగారు తిమ్మిరిఅర్థము వేరు వేరు వైద్యగ్రంథములలో వ్రాసిరి. ఈగ్రంథకర్త కూడా యేఅంగము నందు తిమ్మిరిరోగము సంభవించునో ఆతిమ్మిరి కలుగచేయునట్టి మల ము వెడలించుటవలన యీవ్యాధి నివారణము కానేరదనియు తరువాత శరీరము త్రిప్పునట్టివ్యాధికూడా తటస్థించగలదనియు తలతిర్పు రోగము కలిగినతరువాత సన్యాసమనువ్యాధి తటస్థించగలదనియు మరియు తిమ్మి రిగల అంగమునందు చీమలుపాకినట్లు సూదులతో పొడిచినటుల తోచు చుండిన యీలక్షణములుగల రోగము జలుబు దుష్టప్రకృతిని బంధిం చుటవలన మరియు జలుబు ప్రకృతిదోషముచే దిక్కువరచునట్టి వ్యాధి యని వచించిరి.

ఈతిమ్మిరిగల నరములయందు రుధిరమునిండిపోవును. అనగా నరములయందు పూర్ణముగానుంటవలన తిమ్మిరి రోగము కలుగుచున్నది.

దీనిచిన్నకమలు యీరోగమునందు వర్ణించబడును. తిమ్మిరి వ్యాధికలు గుటకు కారణమేమనగా జ్ఞానశక్తి అంగములయందు విశేషముగా గాని స్వల్పముగా గాని ప్రవేశించకుండుట మరియు, దీని తుచ్ఛకారణములు యెనిమిది గలవు.

(1) శరీరసంబంధమగు జీవనరములలో యేదో నొకటి అణగి పోవును. అనగా ఒక మనుజుడు విశేషకాలము గొంతుకూర్చుండి లేచు నప్పుడు తన కాళ్ళు తిమ్మిరి యెక్కును. మరియు. అంగము విరుగు టవలన, అంగముప్రూడిపోవుటవలన అంగము బంధించుటవలన, తిమ్మిరి కలుగుచున్నది. యీకారణములయందుకూడా జీవనరమునకు కలుగు వత్తిడివలన కలిగినదని గ్రహించవలెను.

తిమ్మిరిరోగచికిత్స

రోగకారణమును దూరపరచవలెను. అనగా వాతదోషమూలేక పిత్తదోషమూ లేక, రక్తదోషమూలేక శ్లేష్మదోషమూఅను రోగహేతు వులను కనిపెట్టవలెనని భావము. ఒకేవిధముగా కూర్చుండుటవలన తిమ్మిరికలిగిన యెడల వెంటనే మరియొక వైపు కూర్చుండి దశమార్చ వలెను. తిమ్మిరిగల అంగమును నెమ్మదిగా స్థిరపరచవలెను.

అంగము విరుగుటవలన, ప్రూడిపోవుటవలన తిమ్మిరి కలిగిన యెడల యిందువిషమై చెప్పబడిన నుపాయములను చేయవలెను. యీ వుపాయములను ముందు చెప్పబడును. మరియు. అంగము బంధించుట వలన తిమ్మిరి కలిగిన యెడల వెంటనే కట్టిన బందనమును విప్పివేయ వలెను. మరియు, ఆఅంగమును నెమ్మదిగా రుద్దవలెను.

(2) శీతజ అపక్వదోషమువలన బంధనము అనగా నరముల మధ్యపిటికె యేర్పబడి అచ్చటనుండు జీవనరము వలచని వాతదోష మును గ్రహించి ఆదోషమునందు తడిచిపోవును. ఆదోషమునందు మునిగిపోవును. యిట్టి తరి జీవనరము నిస్సత్తువనొందినదై వంకరగును. యీరెండు కారణములయందు జ్ఞానశక్తి తన దశయందుండునుగాని

జ్ఞానశక్తి యీఅంగములయొక్క నరములయందు ప్రవేశించ జాలకుం డును. దీనిచిన్నెలును చికిత్స కఫజ పక్షవాతమునందు చెప్పబడి యున్నది.

(3) మరియొక కారణమువలన అంగమునందు రక్తము విశేష ముగాచేరి ఆఅంగముయొక్క మార్గములు రక్తమువలన బంధించబడి తిమ్మిరిరోగమును కలిగించును. యిట్టి స్థితియందు ఆఅంగముయొక్క రంగు నలుపు కలిసిన యెరుపురంగుగా నుండును.

—రక్తజ తిమ్మిరివ్యాధి చికిత్స—

ఈవ్యాధియందు రక్తమోక్షణము చేయవలెను. మరియు, లఘు భోజనము నొసగవలెను. మరియు, అంగమునందు బహుకాలము ఒకే విధముగా ఒకేవైపు యుండుటవలన యీకారణము వలన రక్తనాళములు నిండి తిమ్మిరి వ్యాధి కలిగిన యెడల అట్టి స్థితియందు ఆఅంగమునకు మార్పుకలిగించుట లాభదాయకము. మరియు, బంధనము వలన అంగ మును తిమ్మిరి కలిగించును వాతము స్వల్పముగా కలుగుచున్నది. మరియు, యీ తిమ్మిరి పిత్తమువలన అప్పుడప్పుడు ఉత్పత్తియగునని గ్రహించవలెను.

(4) బాహ్యమునుండి యేదోకారణమువలన మిక్కిలి జలుబు ప్రవేశించి ఆఅంగముయొక్క ప్రకృతిని చెరచి శరీరమును మంధము చేయును. మరియు, దోషమును సమకూర్చును. యీకారణము ప్రాణ వాయువు స్వభావికముగా ప్రవేశించజాలకుండును. మరియు, శీతజదుష్ట ప్రకృతి అంగములకు కఠినత్వము గలుగజేయును. దోషములను సమ కూర్చును. యీకారణమువలన అంగముయొక్క లోపలి వెలపలి నర ములు గట్టిపడును. యెట్లనగా ఆనరముల భాగము స్తంభింపజేయు చున్నది. కాబట్టి కాళ్ళు, చేతులు, మడిమెలు, పిక్కలయందలి చర్మ ము మొదలగువాని నాశ్రయించి కాళ్లు మొదలగు యీస్థానముల యందు తిమ్మిరి కలిగించుచున్నది. మరియు, చల్లనిదుష్టప్రకృతి కారణ

ములు ముందు వ్రాయబడినవి. మరియు, జీవనరమునందు చిక్కని మలముచేరి నిలిచిపోవును. యిట్లు నిలిచిపోవుటవలన కలుగు తిమ్మిరి రోగము ఉష్ణవస్తుయోగములవలన శాంతినొందినట్లుండును. మరియు, అంగమునందు చీమలు ప్రాకినట్లుండును.

శీతజతిమ్మిరి రోగచికిత్స

జీవనరమునకు మృదుత్వము నొందించుటకై ఉష్ణస్వభావికముగు తైలములను లేపనముచేయవలెను. మరియు, ఉష్ణోదకమును అతిమ్మిరి అంగముపై వేయవలెను. మరియు, జీవనరముయొక్క ప్రకృతి కాపాడుటకై ఉష్ణస్వభావికముగు వస్త్ర కాపడములు వుపయోగించవలెను. మరియు, అంగమును చేతితోగాని మరియేవస్తువుతో నయినను యెర్రబడువరకు మర్దించవలెను.

(5) శరీరమునందు శుష్కత్వము విశేషమై జీవనరముయొక్క భాగములు బిగించబడి జీవనరసంబంధమగు తంతువులు ఒకటి కొకటి చేరిపోవును. అనగా తంతువులయందుండు చెమ్మ శుష్కత్వమువలన నష్టమగును. యిట్టి కారణమువలన అంగముయొక్క లోభాగమునందుండు తంతువులు యీరెండిటి మధ్యభాగము యిక్కలి అరిపోవును. కాబట్టి తంతువులు ఒకటికొకటి కలుసుకొనును. యిట్టిదశయందు అవశ్యముగా మార్గములు బంధించబడును. యిటులమార్గములుబంధించుటవలన ప్రాణవాయువు అతంతువులయందు చేరనికారణమువలన అంగము తిమ్మిరి యెక్కును మరియు, దీనిచిన్నెకములు చికిత్స శుష్కత్వమువలన కలిగిన తనమ్నుజ్ అనగా శుష్కత్వమువలన కలుగు బిగింపు వ్యాధి లక్షణములు చికిత్సయు దీనిలక్షణములు సరిపోలియుండును. చికిత్సకూడా శుష్కత్వత తనమ్నుజ్ చికిత్స యీవ్యాధి చికిత్స సమానముగాయుండునని గ్రహించవలెను.

మరియు, జాలినూస్‌గారు శుష్కప్రకృతిగల రోగి ఉష్ణఔషధములు సేవించుటవలన శుష్కత్వము అధికమై వ్రేళ్ళచివరలనుండితిమ్మి

రి ఆరంభమై పైకెక్కుచున్నది. మరియు యిది రెండవ అంగమునందు కూడా ప్రవేశించును. మరియు పిత్తఉష్ణజ్వరము చెమ్మఆరిపోవుటవలన శుష్కత్వము ప్రవేశించి చేతులు, కాళ్ళు తిమ్మిరి యెక్కుచున్నవని జాలీనూస్‌గారు వచించిరి.

6. శీతజవిషము అనగా నల్లమందు మొదలగునవి సేవించుట వలన తిమ్మిరివ్యాధి పుట్టినదగును. అనగా ప్రాణవాయువుయొక్క ప్రకృతివిషముయొక్క గుణమువలన మారిపోవును. ఇట్లు మారిపోవుట వలన ప్రాణవాయువు సంబంధమగు అంగములు ప్రాణవాయువు మధ్య యున్నవి. గాన ప్రాణవాయువు అంగమునందు ప్రవేశించినను ఆఅంగ ము ప్రాణవాయువును గ్రహించజాలక చల్లని విషముయొక్క జలుబు వలన ప్రాణవాయువునుకూడా నిర్బలము చేయుచున్నది. ఇట్లుమందము చేయు వస్తువులు యీక్రింద 7 వ ప్రకరణమునందు తేటతెల్లముగా వచించియున్నాము.

7. విషసంబంధముగల జంతువుల స్పర్శనము * కాటుమొదల గునవి అనగా తేలుకుట్టు మొదలగునవి జీవనరమునందు ప్రవేశించినయె డల వుష్ణముగాని, జలుబుగాని, ఆజీవనరమునందు ప్రవేశించి తిమ్మిరి వ్యాధిని కలిగించును. మరియు విషసంబంధమగు వస్తువులను భక్షించు టవలన కలుగు చిన్నెలయందు చెప్పబడియె.

## —తిమ్మిరిరోగ చికిత్స—

ఈరోగమునందు తిరియాక్‌ఫారూక్, యుపయోగించుటవలన సమస్తవిషయములయందు మిక్కిలిలాభదాయకము. మరియు పుస్తక

* రహాదా అను నొకవిధమగు చేపగలదు ఆచేపను యెవరైన తనచేతితో ము ట్టికొనినయెడల వెంటనే చెయ్యితిమ్మిరియెక్కును. ఈచేపను బర్క్ అనికూడాచెప్పె దురు. ఆచేప వలలో పడినయెడల చేపలను పట్టువాడు దానిని వలనుండి తీయుట కై పట్టుకొని తిరిగి వలను తప్పించుశక్తి లేనంత తిమ్మిరి యగును.

అంతమునందు ప్రత్యేకవిషముల అనుసారముగా నుపాయములను వర్ణిం చబడెను. కాబట్టి వానిని విషానుగుణ్యముగా యుపయోగించవలెను.

8. హృదయసంబంధమగు శక్తి దుర్బలమైనయెడల కాళ్లు చేతులుయొక్క జ్ఞానశక్తి తగ్గిపోవును. ఇట్లు శక్తితగ్గుటవలన తిమ్మిరి పుత్పన్నమగును. ఇటులకలుగు తిమ్మిరి మూర్ఛయందును ప్రాణి నశించు సమయము అనగా మరణకాలమునందుకలుగుచున్నది. ఇదిఅసాధ్యము.

(లాభము) యేమలమునిండిన కారణమువలన తిమ్మిరివ్యాధి కలుగునో ఆమలము మెదడునందు కలిగినయెడల యావత్తు శరీరము యొక్క జ్ఞానశక్తి మరియు నడుచుటకు, తిరుగుటకు, కదలుటకు, గల శక్తి నశించును. అట్లు నశించినయెడల ఆ దినమే మృత్యువుపాలగును. మరియు యెప్పుడు చెడుమలమువలన కష్టము సంభవించును. అట్టిస్థితి యందు కారణముయొక్క అటంకమువలన యావత్తు శరీరమునందు గాని లేక అర్ధశరీరమునందుగాని జ్ఞానశక్తి తగ్గిపోవుచున్నది. మరియు ముఖముయొక్క అంగములశక్తి ఆరోగ్యముగానుండును. మరియు జీవ నరము మెడనుండి చీలమండవరకు పీవుప్రక్కనుండి బైలువెడలినది. ఆ నరమునందుగల ఒకభాగము అంగమునందుచేరియున్నది. ఒక్కొక్క ప్పుడు యీనరమునందు తిమ్మిరి పుత్పన్నమగును. మరియు కఫసంబంధ మగు దోషమువలన కలిగిన తిమ్మిరివ్యాధి దృఢముగానుండును. ఇట్టి స్థితియందు ఆనరముయొక్క లోభాగమునందు పక్షవాతము పుత్పన్న మగునని గ్రహించవలెను. ఇందు విషయమై పైనచెప్పబడియె. ఒకప్పు డు పక్కలయందు వాపు జనించినను పుప్ఫుసములు (లంగ్స్) అనగా పూపిరితిత్తులయందు చల్లని కారణమువలన వాపు కలిగినను సరసాం (తలవాపు) నుండి ఇస్తరఖా అనగా నచ్చువ్యాధి తిమ్మిరి కలిగించును. తిమ్మిరి అధికమయినయెడల పక్షవాతముగాని అవస్మారముగాని సన్యాస ముగాని లేక తసన్నుజ్ అనగా బిగిసికొనిపోవు రోగముగాని కలుగుట కారణమగునని గ్రహించవలెను. జగద్రక్షకుడు సమస్త ప్రాణులను వ్యాధినుండి కాపాడుగాక.

# అర్ధాంగవాత లక్షణములు.

లఖవా అనగా అర్ధాంగము. ముఖసంబంధమగు నరములయందు పుత్పత్తి యగును. నిది కన్ను, కనుబొమ్మ, నొసలు, పెదవి, మొదలగు అంగములు వంకరగుచున్నవి. మరియు ముఖముయొక్క నిజకాంతి అనగా అందము మారిపోవును. రెండు పెదవులు ఒకటికొకటి చేరజాల కుండును. మరియు నోటియందు వకవస్తువుంచి నమలుటకు లాగుట కున్ను, చీకుటకున్ను, ఉమ్మివేయుటకున్ను, ఊదుటకున్ను, ఈలవేయు టకున్ను, సమర్ధతలేకయుండును. ఉమ్మివేసిన వకవైపునకు వడును. దీపము నోటితో వూది ఆర్పలేకపోవును. మరియు కంటిరెప్పలు రెండును ఒకటికొకటి సరిగా మూతవడజాలవు. మొదలగు లక్షణము యావత్తు వకేసారికనుపించును. మరియు ఈవ్యాధి ముఖముయొక్క ఒకభాగము నందు మాత్రము వుత్పత్తి యగును. ఒక్కొకసమయమునందు ఈవ్యాధి ముఖము ఇరుపార్శ్వములయందు కలుగుచున్నది. ముఖము యావత్తు నాక్రమించినదో ముఖము వంకర కనుపించదు గాని కనురెప్పలు రెండును మూయుటకు * ఒకటి కొకటి చేరజాలవు. ఇట్టి దశయందు ముందుచెప్పిన లక్షణములకంటె విశేషలక్షణములు కలుగును. ఒకవైపు లఖవా అనగా అర్ధితమునందు పైలక్షణములు యావత్తుకలిగియుండును. మరియుఅర్ధాంగము రెండువిధములు. (1)తనన్నుజ్ అనగా బిగిం

* హకీముదాజీగారు ఒకమనుజునికి రక్షలు వేయబడినవి. ఆమనుష్యుడు బహుకాలము భుజించకుండెను. అతనికి అర్ధితవాతము వుత్పన్నమైనది. కాని ముఖము మాత్రము వంకరకాలేదు గాని కండ్లుమూయుటకు చాలాకష్టముగా యుండెను. ఒక కన్ను బొత్తిగా మూతవడలేదు. అని హకీముదాజీగారు వచించిరి.

గాటు పొడచుట, పీకుట, మొదలగునవి (2) ఇస్తిరిఖాయి అనగా నచ్చు మరి నిష్ప్రయోజనముగానుండుట. ఇట్లు అర్దితమునకు నేను రెండుభేదములుగా వర్ణించిచెప్పుచున్నాను.

(1) అర్దితఅనగా అర్ధాంగము తసన్నుజ్ అనగా బిగించుట.

మొదటిభేదము తసన్నుజ్ అనగా బిగించుట పీకుట, పొడచుట, మొదలగువాని లక్షణములు మూడువిధముగా నుండును.

(1) నరములవలన నడుచుటకున్ను తిరుగుటకున్ను శక్తి కలుగుచున్నది. ఆనరముల మొదళ్ళునుండి తిరుగుటకు వీలగు నరములయందు ఆశ్రయించియున్నది. అట్టినరములయందు దోషసంబంధమగు బంధనము అనగా పిటికకలిగినగాని లేక చిక్కని నీచవాతము మెదడునందు చేరి నిండియున్న మెదడు నరముల మొదళ్ళు వెడల్పునందు విశేషమై పొడవుతగ్గిపోవును. యీకారణమువలన అంగము బిగబట్టును. మరియు తన దశనుండి మారిపోవును.

(2) మెదడునరముల మూలములయందు వాపు కలిగి కీనుగొంతుపడును. ఈకారణమువలన కీళ్ళుబంధనములున్ను ముఖముయొక్క నరములున్ను బిగబట్టును. ఇట్టిస్థితియందు పక్షవాతము వుత్పన్నమగును. ఇందువలన ముఖసంబంధమగు యేదోవొక కీలు సంబంధమగు బంధనముగాని నరముల మొదళ్లుమెదడునుండి పుట్టుచున్నవి. ఆనరములు తొలగుటవలనగాని యీకారణమువలన అర్ధాంగము పెదవులయందు వుత్పన్నమగును. కేవలము పెదవులయందు కలుగుటకు కారణము అంగముల వర్ణనమునందు తెలియగలదు. ఒకప్పుడు మెడనరముల మూలములు వాచుటవలన అంతమునందు పాలిజ్ అనగా పక్షవాతము కలుగగలదు. ఎందుకనగా జీవనరముయొక్క జ్ఞానశక్తి మార్గములు అణగిపోవుచున్నవి. ఈకారణమువలన మెడయొక్క నరముల మొదళ్ళు వాచుటవలన అంతమునందు ఒకప్పుడు అర్ధాంగము ఒకప్పుడు పక్షవాతము దానియొక్క సంయోగిక కారణములవలన కలుగునని భావించుచున్నారు.

(3) మెదడు సంబంధమగు అంగములయందు శుష్కత్వము విశేషమైన కారణమువలన వాతము లేక మెదడు, చెడుమెదడు నరములు జీవనరములు మొదలగునవి శుష్కించుటవలన దహించబడును. యిట్టి కారణమువలన అర్ధాంగము పుత్పన్నమగును. యిట్టి పక్షవాతము ఉష్ణ రోగముల అంతమునందున్ను, పిత్తజ్వరమునందున్ను, మృతిపొందు సమయమునందున్ను పుత్పన్నమగును. మరియు, మలము విశేషముగా వెడలించుటవలన కూడా బిగబట్టునట్టి పక్షవాతము కలుగుచున్నది. వాతమును నష్టపరచుచున్నది. బిగించునట్టి అర్దితవాత చిన్హములు లలాటము రోగముగల భాగమునందుగల చర్మము కరినత్వమునొందును. పైభాగము బిగించబడి నొసలు యెటు కదలకుండును. తలచర్మము మెడవైపు బిగించబడియుండును. మరియు, నోటి వెంట పుమ్మి మిక్కిలి తక్కువగా వెడలును. కండ్లు మూయుటకు కష్టముగా యుండును. యీఅర్దిత వాతమునందు తలనొప్పి అధికముగానుండును. గాని జ్ఞానశక్తిమాత్రము తన నిజదశయందు నిలిచియుండును. యింద్రియములు మాత్రము చెడకుండును. మెడ మూలమునందు వావు కలుగుటవలన ఉత్పన్నమైన యెడల ముందు వావు కలుగుటవలన ప్రాణము హరించును.

(లాభము) తసన్నుజ్ యాబిస్ అనగా బిగబట్టుటయందు నోరు జిడ్డుగానుండి పుమ్మి రాకుండుట ప్రకటనమగును. చెమ్మ సంబంధమగు తసన్నుజ్ అనగా బిగించువ్యాధియందు యిట్టి కారణమువలన మలము చిక్కగా గాని లేక అపక్వముగా గాని లేక వాతాధిక్యమువలనగాని పుమ్మి విశేషముగా రాజాలకుండును. మరియు, మలము ఇస్తిరిఖా అనగా అంగములు పట్టుతప్పుట, పైదానికి విరుద్ధముగానుండును. యెటులననగా మలము పలచగానుండుట పుమ్మి సహజముగా వెడలును.

### అర్ధాంగమునందు బిగించు వ్యాధి చికిత్స

తషన్నుజ్ హాబిస్, అనగా శుష్క ద్రవ్యమువలన బిగలాగుట చెప్పఁగల వ్యాధియందు వర్ణించియున్నారు. యీ అర్ధాంగవాతమును కూడా ఆ ప్రకారముగా చికిత్సచేయవలెను. యీమాఖవా తషన్నుజ్ అనగా పీకుట, పొడుచుట, బిగించుట యీవ్యాధియందు కూడా తషన్నుజ్ హాబిస్ చికిత్సలను చేయదగును. యీవ్యాధి శుష్కత్వమువలన కలిగిన యెడల మృదుత్వమునొందించు శిక్ శాబ్ అనగా బట్టతడిపికావడము చేయుట శిక్ శాబ్ అనగా కషాయాదులను చర్మపుతిత్తియందు బోసి కావడముచేయుట. మరియు, వెచ్చని నూనె మర్దించుటకూడా లాభదాయకము. తక్కిన అర్దిత తషన్నుజ్జులయందు పలుకు చెప్పఁగల కారణముగల కారణమువలన కలిగిన వ్యాధియందు చెప్పబడిన చికిత్సలను చేయవలెను. మరియు, ఇస్తింకా అర్దితమునందు చెప్పబడును. యిట్టి హేతువువలన యీ రెండు విధములు బహురాన్ (రోగసంధి) చూడవలెను. యీ రెండు విధముల రోగచికిత్స ఒకటిగా చెప్పబడినది.

(సూచనీయము) నాలుగు, లేక ఏడుదినములు గడవనిదే రోగమునకు బలముగల చికిత్స చేయకూడదు. మరియు, ప్రకృతి శుష్కించి మలబంధము కలిగినచో రెండవదినము మృదువస్తి అనగా ఎనిమా, చేయవలెను. మరియు అర్ధాంగవాతముతో సన్యాసము అను వ్యాధి లక్షణములు కనుపించినయెడల అట్టిస్థితియందు అతివేగముగా చేయవలెను. అనగా చిక్కని గాఢమగు వస్తిఖర్మ మరియు విరోచనచికిత్స వలన మలమును వెడలించవలెను అనగా రోగారంభమునందు అయినా సరే చేయవలెను. మరియు ఇస్తిరిఖా ఈరోగమునందుకూడా ఇటులనే చేయవలెను. తక్కిన విషయములను ఇస్తిరిఖా ఈఅర్దితము ప్రకారాంతమునందు వర్ణించబడును. తషన్నుజ్ ఇమ్తిలాయి అర్దితవాతమునందు కూడా దృష్టియుంచుట ఆవశ్యకము. అర్దితవాతచికిత్స నాలుగురోజులవరకు ఆగుటకు ఆజ్ఞగలదు. మరియు, రోగకారణము దుర్బలము అయి

నను లేక కారణము బలముగలదైనను లేక అర్ధాంగవ్యాధితోకూడా తల, శరీరమునందు తాపము కలిగినను జ్ఞానహీనమైనను అట్టిరోగికి 7 రోజులవరకు చికిత్స చేయకూడదు.

మరియు మలము అలక్ష్యముగా వెడలించుటకు కారణము అనగా మలసంబంధమగు అర్ధాంగము లేక తసన్నుజ్ లేక ఇస్తిర్ఖా ఈమొదలగువ్యాధుల మలము తనకుతాను అతిశయమగుచున్నది. అందువలన అవశ్యమైనను వెడలించుటకు సామర్ధ్యము లేకున్నను ఒకేవర్యాయము తీయవలసిన అవశ్యకము కలుగుచున్నది. విరోచనము చేయించునట్టి ఔషధప్రభావము మలమును కదలించినయెడల ఒక్కొక సమయమునందు మలము వెడలక హృదయమునందు మలదోషము ప్రవేశించి అకస్మాత్తుగా చంపగలుగును. మరియు, చెడుమలము యేవైపుకుతిరిగి అర్ధాంగము కలిగించునో లేక మెదడు సంబంధమగుపొరలయందు ప్రవేసించి సక్తా అనగా సన్యాసవ్యాధిని కలిగించునుగాన మృతినొందుటకు హేతువగును. గనుక ఈ గ్రంధకర్త ఈ చికిత్స ఆరంభమునందు దోషమును పక్వపరచి మలమును తీసివేయగల నుపాయములను చేయవలెను. ఆవుపాయములను ముందు చెప్పియుంటిని. మరియు, మెదడు ముందు భాగమునందు వాపుకలిగి ఆవాపువలన అర్ధాంగము కలిగినయెడల ఆ వాపు అనుసారముగా చికిత్స చేయవలెనని వచించిరి.

2 వ ఇస్తర్ఖా ఈ అర్ధాంగవివరము.

ఈ వ్యాధి మెదడునుండి పలచని వాతమలము వకవైపు నరములయందున్ను, జీవనరములయందు ప్రవేసించి ఆనరములు జీవనరములకు చెమ్మ కలిగించుచున్నది. మరియు పొరలయందున్ను, ఝిల్లిపొరలయందున్ను నీర్సము కలిగించును. ఇట్లు కలుగుటవలన ప్రాణవాయువుయొక్క మార్గములు బాధించబడి అంగము నీర్సత్వమునొంది నచ్చువ్యాధి కలుగుచున్నది. మరియు అర్ధాంగము తసన్నుజ్ అనగా బిగించుట వుత్పత్తియగుచున్నది. మరియు, ఇస్తిర్ఖావ్యాధి అర్ధాంగము

స్వల్పముగా ఉత్పన్నమగును. దీని లక్షణములు ముఖముయొక్క అగ్రి భాగము నీరసమైంది సడలిపోవును. మరియు గమనశక్తి దుర్బలమైయుండును. నొసలు, ముఖముయొక్క చర్మము ముందుకు నీడ్చును. పైభాగముకంటె క్రిందిరెప్ప క్రిందికిలాగును. గనుక పైరెప్ప క్రిందిరెప్పతో కలియుటకు వీలులేకుండును. మరియు, కంటివెంబడి నీరు స్రవించుచుండును. నాలుకయొక్క గ్రహణశక్తి తగ్గిపోవును.

మరియు తనన్నుజ్ అనగా బిగిసికొనుట ఇస్తరిఖా అనగా నచ్చుం. లఖువా అనగా అర్ధాంగము. హకీముజాలినూస్ గారు వచించినదేమనగా మూడు మధ్యభాగమునందు వకరంధ్రముండును. సంపూర్ణముఖము యొక్క శల్యములు దీని కారణమువలన వేరువేరుగానుండును. మరియు ముఖముయొక్క లోభాగమునందు ఒకఝిల్లి మూడుయొక్క రంధ్రముతో చేరియుండును. ఆరంధ్రము ఝిల్లికమ్ముకొని యుండును. అర్ధాంగవాతముగాని ఇస్తరిఖాగాని వుత్పన్నమైనయెడల అట్టిస్థితి యందుయేవైపుకు జబ్బుకలిగియుండి అంగములుపట్టుతప్పునో యేభాగము నిష్ప్రయోజనమగునో ఆభాగమునందుండు ఝిల్లికూడా పట్టుతప్పి జారిపోవును. మరియు దీనిరంగు మారిపోవును. ఈఝిల్లిపొరయందు చెమ్మ అధికముగానుండును. రెండవవైపు ఝిల్లి ఆరోగ్యముగా నుండును. ఈరోగమును పరీక్షించువిధము రోగినాలుకపై వైద్యుడు వ్రేలువుంచి అణచినయెడల నాలుక క్రిందికి అణగును. అప్పుడు తాలువులు అనగా దవడలను పరీక్షించవలెను అట్లు పరీక్షించగా తాలువులనరములు యేవైపుకు జరిగినదిన్నీ చూచి ఆవ్యాధి వ్యక్తలక్షణములతో కలిగినయెడల లఖువా ఇస్తరఖాయి అనిగ్రహించవలెను. ఝిల్లిపొర తనస్వభావికదశయందుండిన నొసలు చర్మము బిగించుట మొదలగు తనన్నుజ్ యొక్క యితరచిన్నములు ప్రకటమైనయెడల లఖువా తనన్నుజ్ అని గ్రహించవలెను. ఇస్తరికావ్యాధియొక్క ప్రధానలక్షణములు కనురెప్ప మెప్పుడు ఆడకుండును. తనన్నుజ్ యందు కంటిరెప్పలు మూయుటకు తెరచుటకు వీలుకలుగునుగాని రెండురెప్పలు ఒకటికొకటి కలువజాలవు.

### —పచ్చు బిగింపుగల అర్ధాంగచికిత్స—

ఈవ్యాధియందు 14 రోజులు 7 రోజులు గడచేవరకు శికింజబీన్ బిజూరి లేక అడవినిమ్మతోచేసిన శికింజబీన్ గాని వేళ్ళకషాయము లో గుల్ఖందు కలిపిగాని వుపయోగించవలెను. ఇది తప్ప ఇతరములు యేమియు నుపయోగించకూడదు. హితకరపక్వములు అనగా దెబ్బయందు శుష్కత్వమునందుకూడా సామాన్యమగు వస్తువులను యివ్వవలెను. మరియు జైతూన్ తైలమునందు పెసరకట్టుకలిపిగాని లేక యిట్టి గుణముగల యితరవస్తువుల నుపయోగించవలెను. మరియూ భోజనమునందు రోగికి యెంత యిష్టముగలదో అంతవరకు పెట్టుటవుత్తమము.

మరియు తేనె పావురపుపిల్లలమాంసము మొదలగు పుష్టకరవస్తువులను వాతముతగ్గించుటకై తేనెస్నాజ్ లేఖవా అనగా బిగబట్టునట్టి అర్ధాంగమునందు యివ్వవలెను. మరియు తేనెనీళ్ళను యిచ్చుటవలన యేమీయుపద్రవము కలుగనేరదు. తేనెలోనీళ్ళుకలిపి రోగారంభదినమునందే యివ్వవచ్చును. అనగా తేనెలోనీళ్ళు కలుపుటవలన తేనెయందుగల వుష్ణము శాంతినొందును. మరియు తేనెనీళ్ళయందువేసిఔషధములను చేర్చకూడదు. ప్రత్యేకము తేనెలోనీళ్ళుకలిపి యిప్పించవలెను. మరియు 14 దినములు గడవనిదే గండూషములు నశ్యములు చేయకూడదు. యెందుకనగా గండూషములు నశ్యములు చేయుటవలన వ్యాధిస్థలము నుండి రెండవమలమును వెడలించునుగాని అచ్చటి అవక్వమలమును దూరపరచజాలదు, కాబట్టి యిటులనే అన్నివిధముల తీవ్రఔషధములు రోగారంభమునందు హానికలిగించును. యెందుకనగా మలసంబంధమగు మృదుమార్గములను నష్టపరచును. శేషించియుండు చిక్కని మలమును కఠినముగా పచనమగును. మలము రోగస్థానమునందు నిలిచియుండునది పక్వమైనతరువాత ఆస్థానమునందు నిలువజాలదు. కాబట్టి అంతవరకు సాత్మిక చికిత్సలను చేయుచు మధ్యభాగమునందు యేవిధమైన మల నశాయము కలుగనియ్యకూడదు, అనగా శరీరమునందు మల వరాక్రి

మము లేకుండునటుల చేయవలెను. అటుగాక మలము శ్యానత్వము నొందినచో నియతసమయము గడచినవెనక శరీరము శుద్ధముగుటకై మాత్రలు యాఇజ్ మొదలగునవి పాలిజ్ అనగా అర్ధాంగవాతము పక్షవాతములో చెప్పబడిన ఔషధములను యుపయోగించవలెను. మరియు వెనుక ప్రకరణమునందు చెప్పిన సుపాయములను నెమ్మదిగా చేయుట వుచితమగును. మలమునుండి శరీరమునకు నిశ్చింతనొందించి తలను శుభ్రపరచుటకై గండూషములు అనగా కషాయములను వుక్కిలించుట తరేడా శికితాబ్ నశ్యములు మొదలగునవి చేయవలెను ఇట్లుచేయుటవలన త్వరితముగా గుణము కలిగించును. మరియు 40 దినములతరువాత నశ్యము చేయకూడదు.

### గండూషము అనగా వుక్కిలింత క్రియము

దవనము, మరువము, చాదరాశి, అక్కలకర్ర, ఆవాలు, కబ్రివేరు బెరడు, వుల్లదానిమ్మగింజలు, శొంఠి, యీమొదలగు వస్తువులు దంచి కషాయముకాచి ఆకషాయమునందు అడవి నీరుల్లితో చేయబడిన శికింజబీణ కలిపి వుక్కిలించవలెను. యిది మిక్కిలి గుణదాయకము.

### నశ్యక్రియము

దున్నపోతుపిత్తము గుర్రపుపిత్తము పచ్చియష్టిమధుకవు రసముతోనూరి ఆరసమునందు కలిపి ముక్కులో నశ్యము చేయవలెను.

అథవా దున్నపోతుపిత్తము చకుపాలయందుకలిపి ముక్కులో పోయవలెను. మరియు, గొర్రెపిత్తము, సబ్బాత్ అనగా యిది ఒకజాతిచేవ దీనిని చేవ అని కూడా చెప్పుదురు. దీని పిత్తమును దవనము, మరువము, చుకందరు, యీ మూడువస్తువులునూరి కలిపి నశ్యము చేయవలెను.

మరియు, 6 రతులు సుకబీనజ్, 3½ మాషములు దవనము, మరువమురసముకలిపి 1½ మాషము జైతూన్ నూనెకలిపి నశ్యము

చేసిన యెడల అయిదు రోజులలో పక్షవాతము అర్ధాంగవాతము హరించును.

## —కావడముల విధానము—

చాదరాశి, సదాప, అక్కలకర్ర, దిరమన, బగోగారు, ఆవాలు, బాబూనా, నఖను, దవనము, మరువము మొదలగు వస్తువులు కషాయముకాచి ఆకషాయము తరేడా అనగా చర్మవుత్త్రిలోవేళ కాచవలెను. శికతాబ్ అనగా బట్టకషాయాదుల యందు తడిపి కాచుట. మరియు, జున్ను, నుకబినజ్, జావశీరు, గుగ్గిలము మొదలగునవి వాసనచూచుటవలన కఫము పక్వమొంది మెదడునుండి వెడలి పోవును. మరియు, యిటులనే మస్తకి, అలేకల్‌బతం, అనగా ఒకవిధ మగుజిగురు, వస, యీవస్తువులను నిరహారముగా అనగా వరగడుపునందు నమలుట మిక్కిలి లాభదాయకము.

మరియు, రోగారంభమునందు 4 రోజులు గడచిన వెనుక 4ళే మాషములు యారజ్ పైకరా, శిబియారు అనగా మునహిల్ మాత్రలు వీటిని రాత్రికాలములో వాడుదురు. యీమాత్రలు వుపయోగించి 7 దినములు గతించిన వెనుక హుకనా అనగా వస్తికర్మచేయవలెను. మరియు, రోగిని చీకటిగదియందుంచి అద్దమునందు ముఖము చూచు నటుల ఆజ్ఞాపించవలెను. యెందుకనగా గదియందుగల చీకటివలన అద్దమునందు ముఖము కనుపించనేరదు. కాబట్టి రోగి పరిశ్రమతో తన ముఖము అద్దమునందుచూడ ప్రయత్నించును. అటులచేయుట వలన వంకరగానుండు ముఖము తిన్ననగును. యిట్లుచేయుట మిక్కిలి వుపయోగకరము.

యెల్లప్పుడు నోటిలో జాజికాయ తియ్యకుండా యుంచుట మంచిది. మరియు తోడేలు, ఆవు, నల్లఆవు మొదలగు పశువులమాంసమును వుడికించి శల్యములుతీసివేసి, నూరి జైతూన్‌నూనెయందుకలిపి, రోగి

రొక్క తలపై, మెడపై, గొంతుకపై లేపనము చేయవలెను. మరియు జీర్ణమాంసముమాత్రము ఈరోగమునం దుపయోగించజనదు. మరియు నొసలు, కనుబొమలు విశేషముగా శిరకాతోకడిగి మర్దించుట మంచిది. శిరకాయందు మృదుత్వము నొందించునట్టి వస్తువులు అనగా పాశ, జూఫా, చాదరాశి, అడవిపోదినా, వేసి కాచినయెడల మిక్కిలి గుణదాయకమగును. ఇట్లువేసి కాచిన శిరకాను ముక్కులో పోయుటమంచిది. యెందుకనగా ముక్కుమార్గమునుండి వాతదోషమును తీసివేయగలదు. ఆవాలు శిరకాతోనూరి తలకు లేపనము చేయవలెను.

మరియు దవనము, మరువము, ఆవాలు, కుసుంబా, సదాఫా మొదలగునవి శిరకాలోవేసి గాఢాగ్నియందుకాచి ఆకషాయము ఆవిరి తలకుపట్టించుట వలన ఈవ్యాధియందు మిక్కిలి లాభదాయకమగును. తసన్నుజ్ అర్ధాంగమునందు ముందుగా నరముల మొదళ్ళను మృదుత్వమునొందించి మలమును వెడలించవలెను.

హకీము మొహమ్మద్ జకిరియాగారు ఖరాబాదీన్ అను ప్రాచీన వైద్యగ్రంథములో వ్రాయబడిన దేమనగా అర్ధాంగవాతముగల రోగికి బొత్తిగా వెలుగులేని చీకటిఇంటియందుంచవలెను. మరియు యేవిధమైన మాంసములు, జలుబుగల ఫలములు యివ్వకూడదు. మరియు ప్రతిదినము ప్రాతఃకాలము నిరన్నాహారముగా నుండునప్పుడు గండూషముచేయించి తదుపరి భోజనమునకు యివ్వవలెను. మరియు వారమునకొక పర్యాయము ప్రాతఃకాలమునందు భోజనమునకుముందుగా ఏవైపు కన్ను మూయబడకుండునో ఆవైపు ముక్కులో అక్రోటునూనె మరియు హుబ్బుతుల్ ఖజరా, అనగా ఒకవిధము ఫలజాతి. వీటిని 21 చుక్క వేయవలెను. రెండవముక్కులో 6 చుక్కలు మాత్రము పైతైలముతో చేసిన నశ్యము వేయవలెను. అటుపిమ్మట బాబూనా, చాదరాశి అడవిపొదినా ఈవస్తువులు తొండము గల ముంతయందు వేసి నీళ్ళుపోసి, శీలుచేసి కాచి ఆకషాయమును పాత్రయందు వేసి రోగినందుయుంచి

పైన కంబలికప్పి ఆవిరి తలకు తగులునటుల చేయవలెను. ఇట్లు ఆవిరి పట్టుటవలన వచ్చిన చెమట బట్టతో తుడిచి వేయవలెను. తరువాత ముతకబట్టతో రోగిముఖము, తల మెత్తబడునవరకు రుద్ది, అకోసిటునూనె వెచ్చచేసి ముఖమునకున్ను, తలకున్ను, కణతలకున్ను మెడక్రింద మర్దించవలెను. వకగంట రోగి విశ్రాంతి నొందినవెనుక తిరిగి కషాయముతో ఆవిరిపట్టి చెమట తుడిచి తైలముపూసి, వక గంటఆగి తిర్గి కషాయము కాచి, ఆవిరిపట్టించి చెమటతీసి తైలమును మర్దించవలెను. ఇటుల రోజుకు 10 పర్యాయములు చేయవలెను ఇటుల వారమునకు వకరోజు 10 పర్యాయములు చేయవలెను. ఇట్లు ప్రతివారం ఒక మాసంవరకు చేయవలెను. ఇట్లు చేయుటవలన వ్యాధి తగ్గనియెడల యేచికిత్సవలనకూడా శాంతి నొందనేరదని గ్రహించవలెను.

హకీంమొహంమ్మద్ జకిరియాగారు వచించినదేమనగా భోజనము యేమియునివ్వకూడదు. ఇట్లుచేయుటవలన శరీరము వృష్ణప్రభావము నొంది నరములయందుగల దోషము హరించి నరములు వృష్ణప్రభావము నొందును. ముఖమునకు పైనచెప్పినరీతిగా ఆవిరి పట్టించి చంగల్వకోష్టుతైలము, సదాపాకుతైలము, మొదలగునవి కాచి మెడకు, తలకు మర్దించవలెను. జ్వరముకలిగినను భయములేదు.

మరియు హకీంజాలినూస్ గారు నల్లమిరియాలు మెత్తగాచూర్ణించి మంచినూనెలోకలిపి మర్దించినయెడల యేఔషధము అవసరములేకనే వ్యాధిశమించును. మరియు యీవ్యాధియందు విశేషచికిత్స గంధూషము పుక్కిలించుట, నశ్యము ముఖ్యమైనవి. నశ్యము చేయునట్టి ఔషధములవలన మెదడునకు నష్టము సాధవించినయెడల బనప్షాతైలము పరిశుభ్రముగు చనుబాలలో ఆవుపాలలో చక్కెరకలిపి నశ్యము చేయవలెను. తల ముందుభాగమునందుకూడా లేపనము చేయవలెను. యీవ్యాధియందు మోకాలు కీలు జబ్బల మొదళ్లయందు ఉష్ణముకలిగించుట లాభదాయకము. మరియు, ముచ్చనగుంటయం

దు శస్త్రముతో గంట్లు వేయుటవలన మరణసంగుగల మలము హరించును. మరియు, రోగికి నీళ్ళకు బదులు తేనెలో నీళ్ళుకలిపి యిచ్చుట మిక్కిలి మంచిది. లవంగములు నవలించుట యుపయుక్తము.

మరియు, యీవ్యాధి చిన్నెలు కనిపెట్టు నుపాయములు అనగా యేఅంగమునందు యేభాగములో కష్టము సంభవించినదని ఆలోచించి యీక్రిందిగుర్తులతో గ్రహించవలెను. (1) వ్యాధిగలవైపు జ్ఞానశక్తి బలము తగ్గిపోవును. అదరుపుత్పత్తియగును. (2) వ్యాధిగలవైపు చేతితో తిన్నగాచేసి స్వాభావికదశయందు తెచ్చిన యెడల రెండవవైపు తనకు తాను తిన్ననగును. తిరిగి రెండవదశయందు మారును. అర్ధాంగము యెడమభాగమునందున్నదైన యెడల కుదురుట దుర్లభము. *

## అర్ధాంగవాతముయొక్క పూర్వరూపము.

ముందుముఖశల్యములయందు నొప్పిగానుండుట ముఖచర్మము స్పర్శనశక్తితగ్గుట ముఖము సగభాగము అదరుచుండుట మొదలగు చిన్నెలు కలిగియుండును. అర్ధాంగము ఆరుమాసములవరకు నిలిచియున్నయెడల కుదురుట దుర్లభమనియు యీవ్యాధి సంబంధముగుమలము చిక్కగను పలచగనగుచుండును. మలము పలచగానున్నయెడల అంగమును పట్టువదలించి నిష్ప్రయోజనముగలదిగా చేయును. మలము చిక్కగానున్నయెడల తసన్నుజ్ అనగా బిగలాగునట్టి వ్యాధి

* ఈవిషయమునందు వైద్యులు విరుద్ధముగా వచించుచున్నారు. అనగా యేభాగము పడిపోయినదో ఆభాగమునందు వ్యాధి కారణముండును. పడిపోయినటువంటి భాగము ప్రత్యేకము తనసంబంధమగు ప్రమాణము కలిగించునుగాని నిజముగా తసన్నుజ్ లఖవా యందు యేభాగము వ్యాధిలేకుండునో ఆభాగమునందు మలము దిగియుండును. మరియు వ్యాధివలన పడిపోయినభాగము ఆరోగ్యముగా యున్నదిగాన ఇస్తరిఖాయి అనగా సచ్చుపడినభాగము ఆరోగ్యముగానుండును. పడిపోయిన అంగమునందు మలము కలిగించుచున్నది. యెప్పుడు దీనికి విరుద్ధముగానుండును. ఇటుల యీగ్రంథకర్త వచించెను.

కలిగి పీనుకలుగుటను [illegible] ఈనకోయుందు ముఖము ఒకభాగము పట్టుతప్పిపోవు. రెండవవైపు ముఖభాగము బిగబట్టును. పట్టుతప్పిపోవునట్టి చిన్నెములు ప్రకటనమగును రెండవవైపున బిగబట్టినట్టి చిన్నెములు ప్రకటనమగునని యీమొదలగు కారణములు హాకీంరాజీగారు తన అలియేకబీరా అను గ్రంధమునందు వచించిరి.

(సూచనీయము) హకీము మొహమ్మద్ జికిరియాగారు ఎవరికైనను గురులు అనగా రతులు వేయుటవలన అర్థాంగవాతము కలుగును. నేను ఇద్దరు మనుష్యులను చూచితిని. వీరు యిద్దరు వకేదినము రతులు వేసికొనిరి. రతులు వేయించుకొనుటముందు రోజు కోడిగుడ్లు తినిరి. ఆరోజుననే అనగా రతులు వేసికొనినరోజుననే అర్థాంగవాతము కలిగినది. మరియొకరికి రతులు వేయబడెను. అతను ఆరోజు ఆహారము లేక వుపవాసముండెను. మరుదినము అర్థాంగవ్యాధి కలిగినది. గాని ముఖముమాత్రము వంకరపోలేదు. ఒకకన్నుమాత్రము మూయబడుటలేదు. రెండవనేత్రము కఠినముగా మూయుచుండెను. నీళ్లు త్రాగునప్పుడు నోటినుండి బైటికి వెడల నారంభించుచుండెను. ముఖము వంకరకాకుండుటకు కారణమేమనగా వ్యాధి రెండువైపులు కలిగియుండెను. ముందు అర్థాంగవాతము ప్రకటనమయినది తరువాత సన్యాసమను వ్యాధి ప్రవేశించినది. మరియు అర్థాంగవాతముగల మనుష్యుడు నాలుగురోజులలో మృతినొందును. లేక 14 రోజులు గతించినయెడల సన్యాసమను వ్యాధివలన భయము కలుగనేరదు. అర్థాంగము రెండుమాసములు నిలచియున్న యెడల వ్యాధి వృద్ధినొందును. మరియునిది ఆరుమాసముల వరకు రహితము కాకుండినను, చికిత్సలేక నిలిచియున్నను కుదురుట దుర్లభము అని మొహమ్మద్ జికిరియాగారు వచించిరి.

# అంగములు అదురునట్టి వ్యాధి



ఈవ్యాధి సహాయ్యముగా లేదు. ఇది శరీరము యావత్తుభాగముల యందుఉత్పన్నతగా . . రి . . ్రదము, అభాశయము, నరములు పాణి . ., ప్లీహము, . . . , . . . గర్భస్థానము సంకలనరిములు మరియు, యీవిధముగు అంగములయందు వ్యాపించి అంగములు శుష్కింపజేయును. మరియు వణుకువ్యాధి దీనికి విరుద్ధముగా నుండును. తనన్నిజ వ్యాధివలెనే సంయోగ అంగములయందు యీవ్యాధి కలుగుచున్నది. తిరుగునట్టి అంగములు అనగా కాళ్ళు, చేతులు, తల, మొదలగు అంగములయందు ఉత్పత్తి యగుచున్నది. అదరునట్టివ్యాధి ప్రకృతి యొక్క శక్తి వేగముగా రపరప అదరునటులు చేయుచున్నది. తిరిగి వెంటనే నిలిచిపోవుచున్నది. అనగా కారణము బలముగలదైనయెడల యిట్లు సంభవించుట కలదు. అది ఆగుచుండును. మరియు కారణము బలముగలదైనయెడల నిలిచిపోవుట సంభవము. తిరిగి అదరనారంభించినచో చాలానేటివరకు అదురుచుండును యిటుల అదరునట్టి అంగముల సంచారనశక్తి యేభాగమునందు ముఖ్యముగా చేరియుండదు. అన్నివైపులయందు తిరుగుచుండును. మరియు, దీని అదురు పైభాగమునందుండును గాన యిది వణుకువ్యాధికి విరుద్ధముగా యుండును. అనగా వణుకు వ్యాధియందు అంగముల క్రిందభాగమునందు అదరుచున్నది. మధ్య మధ్య శీఘ్రముగా వ్యాధినిలువదు యీవణుకువ్యాధియొక్క మలము చిక్కగను వాతప్రకృతిగలదిగా నుండును. మరియు గట్టిమలము యొక్క పరమాణువులతో వృద్ధి యగును. యీకారణమువలన వాతముచిక్కబడును. కాబట్టి రోమకూపముల వెంట వెళ్ళనేరదు. కావున దీనివైనుండుటవలన దీనిని వెడలకుండునటుల బంధించుచున్నది. విశేషముగా

శరీరముపై జలుబుగల దోషము విశేషముగా కలిగినయెడల వెంటనే దీనిని దూరపరచునట్టి శక్తి దూరపరచగలదు. గనుకనే రెంటియందు తొందర బైలు వెడలును. యీ తొందరవలన శరీరము అదురనారంభించును. అదరునట్టి ప్రాణమువలన వాతము చిక్కగను, మృదువుగనుండి నష్టము కలుగకుండును యీసమయము వచ్చువరకు అదరుచుండును. మరియు యీవ్యాధి వాతమువలన ఉత్పన్నమగుటకు కారణ మేమనగా త్వరలో శాంతించుచున్నది. వాతము చిక్కబడుటకు ప్రామాణ్యముగలదు. అనగా చల్లని ప్రకృతియందు చల్లని సమయమునందు చల్లని వస్తుశేవన వలన జలుబు కారణమువలన అనగా చల్లని నీళ్ళుత్రాగుట, చల్లనినీళ్ళయందు స్నానముచేయుట మొదలగు కారణములవలన అంగము విశేషముగా అదురనారంభించును. మరియు విశేషమ్మృదువగు అంగములయందు అనగా మెదడునందున్న అటులనె మిక్కిలి కఠినమగు వస్తువులయందు అనగా శల్యములయందు అదురు కలుగజాలదు. యెందుకనగా యీఅంగములయందు వాయువుబంధించనేరదు. రక్తతరంగములుతిరుగుచు అదరుపుట్టించును. మరియు మిక్కిలి కామము, క్రోధము, శోకము వలనకూడా అంగములు అదుర నారంభించును. యీకామ క్రోధాది కారణమువలన ప్రాణవాయువు తిరుగుచు నడుచుచుండును. ఇటుల ప్రాణవాయువుయొక్క సంచారమువలన మలము నష్టమగుచున్నది. ఇట్లు మలము నష్టమగుటవలన మలమునందు మృదుత్వము చిక్కదనము యేర్పడుచున్నది. మరియు వాయువుయొక్క పుద్రేకము మెత్తని స్తలమునందు నిలిచి చిక్కబడి అచ్చట బంధించి కదులనారంభించునని గ్రహించవలెను. ప్రత్యేకసమయమునందు జలుబువలన అదురువ్యాధి ముఖము, నోటిలోభాగమందు కలిగినయెడల అర్ధాంగవ్యాధి కలుగుటకు కారణమగును. దీనిని ఇఖ్తిలాజ్ అని వచించుచున్నారు.

మరియు శరీరము యీపిత్తు అదురనారంభించిన యెడల నవ్యాసమనువ్యాధి వుత్పన్నమగుటకు హేతువగును. మరియు, తమద్దుద్

అనగా బిగించునట్టి సప్పొంగు లేక తసన్నుజ్ అనగా బిగించుకొను వ్యాధి లగును. మరియు, కడుపు యొక్క నరము మూలములు అదర నారంభించిన యెడల మాలిఖోలియా అనగా ఉన్మాదము, అపస్మారము మొదలగు వ్యాధులకు హేతువగును. మరియు, పక్క యెముకల మొదళ్ళక్రిందగాని లేక రొమ్ముయందుగల పొరయందున్న రొమ్ముయందు వాపుకలుగు కారణాలవలన కూడా అపస్మారాదిరోగ హేతువులగును. మరియు, పెదవి అదరనారంభించిన వమనమునకు ముందు కారణమగును. అర్ధాంగము అపస్మార ఆరంభమునందు అవశ్యముగా యగుచున్నది.

## అదురువ్యాధి చికిత్స

రోగకారణముగల వస్తుసేవన మానివేయవలెను. అనగా మంచునీరు చల్లని నీళ్ళపానము చేయుట, చల్లని నీళ్ళయందు స్నానముచేయుట వాతకారక భోజనములను భుజించుట, భుజించినమీదట తిరిగి భుజించుట, విశేషరాత్రి అయిన వెనుక భుజించుట. మద్యపానము విశేషముగా చేయుట, మరియు, అన్య అపత్యకరమగు యిట్టి వస్తువులను వర్జించవలెను. మరియు, అదురునట్టి స్థలమునందు ముతకబట్టతో రుద్దవలెను. లేక ఉప్పు వేయించి కాపడము చేయవలెను. తరువాత ఉష్ణతైలములను అనగా బాబూనా తైలము, చండ్రతైలము మొదలగు తైలములను, చంగల్వకోష్టు తైలమున్ను, ఫర్పియూన్ తైలమున్ను, విధిపూర్వకముగా మర్దించవలెను. ఆరంభమునందు నిర్మలమగు తైలములు పట్లు మొదలగునవి ఉపయోగించవలెను. యీచికిత్సవలన ప్రయోజనము కలుగని యెడల ముందు కంటె బలముగల ఔషధములను వినియోగించవలెను.

మరియు, బాబూనా తైలమువలన లాభము కలిగిన యెడల చంగల్వకోష్టు తైలము ఉపయోగించుట మానివేయవలెను. చంగల్వకోష్టుతైలమువలన లాభము ప్రాప్తించినచో పర్ఫియూన్ తైలము

వాడుట మానవలెను. మరియు, పక్షిలిదినము పాత్రశాలయందు తేనె తో తయారు చేయబడిన గుల్ ఖందు సోపుసార్గమును కల్పించుకొన వలెను. మరియు, మృదుత్వము నొందించునట్టి వుపాయములను చేయ వలెను. ఆహారసంబంధములగు వస్తువులలో చనగంట్లు నిత్తుమాంసము, పావురపు పిల్లలమాంసరసము యిట్టి స్వభావికములగు అన్యపదార్థములు చాలరాసి, దాల్చినచెక్క, జీలకర్ర మొదలగునవి చేర్చి వండిన శాఖ ములు యివ్వవలెను. పాతహార వస్తువులిచ్చి యితరవస్తువులు యేమి యు యివ్వకూడదు. మరియు, నదీనిరు గాట చక్మప్రతిత్తి అనగా పశు వుల మూత్రకోశము బాగుచేసినదానియందు పోసి శికతాబ్ అనగా కావడము పెట్టవలెను. నదీనిరు దొరకని యెడల వుప్పునీళ్ళు ఉపయోగిం చవగును. యిట్టి వుపాయములవలన అదురు హానించని యెడల లఘువగు విరోచన ఔషధము వలన విరోచనములు చేయించవలెను. మరియు, వతవాతమునందు చెప్పబడిన చికిత్సలను చేయవలెను. హాకీము జికిరి యూగారు అదురుగల స్థలము మూతకబట్టతో కద్ది అకరోటునూనె మర్దిం చవలెను. యిట్లు అక్రోటుతైలము లేపనముచేయ అదురు తగ్గిపోవును. మరియు, అదురునట్టి కారణము దుర్బలముగలదైనచో చికిత్స అవసర ములేకనే రోగము శాంతి నొందును. యీవ్యాధియందు స్వల్పముగా ఉష్ణము కలిగించుట లాభదాయకమని హాకీము జికిరియాగారు వచించిరి.

—ఫిహాదజ్ అనగా చక్రిమువలెత్రిప్పు రోగలక్షణము—

యీవ్యాధియందు మనుజుడు తనకు తాను చుట్టుకొని ఆడుచు తిరుగుచుండుట, శరీరము విరుచుట, ఆవలించుట, ముఖము కండ్లు యెర్రగానుండుట మొదలగు చిహ్నములు కలిగియుండును యీవ్యాధి కారణములు భోజనము మద్యపానము విశేషముగా చేయుట, పరిశ్రమ బొత్తిగా మానివేయుట మొదలగు కారణములవలన శరీరము మలము తో నిండి, నరములయందు వాతముయొక్క పరమాణువులు విశేషః గాచేరియుండు కారణమువలన శరీరమునందు నీర్సమేర్పడును.

## సిహాదజ్ అనువ్యాధి చికిత్స

రక్తము, పిత్తముగల మలమును వెంటనే తొలగించవలెను. ఉష్ణప్రకృతిగల వానికి చల్లని నీళ్ళు శాంతినొందించును. యిందు విషయమై చల్లని నీళ్ళు దోషములను శాంతింపజేయుచున్నవి. మరియు, యొంఘుగనిచూలు దంచి చూర్ణించి శర్కరచేర్చి యిచ్చుట మంచిది. మరియు, యీస్థానమునందుగల వాయువు ఆవిరిపరమాణువులు విశేషముగా నుండును. అట్టి మలమును ధనియాలరసము శాంతినొందించును. మరియు, ప్రకృతియందు జలుబువలన వ్యాధి కలిగిన యెడల వసము రవ్వచేసి యిచ్చుట లాభదాయకము. అనగా వాతమును నశింపజేయుచున్నది. మరియు, నిమురను పుట్టించునట్టి రెండునరములను దృఢముగా పట్టుకొనుట, పిసుకుట, వత్తుట మొదలగు ఉపచారములు వాతసంబంధమగు యీరోగమునందుత్తమ యుపాయములు, యెందుకనగా స్మరంతి లేకుండా గాఢముగా నిద్రించుటవలన యీరోగము నశించిపోవును. యెందుకనగా నరములు ప్రాణవాయువు సంచరించు మార్గములు గాన యీరోగసమయమునందు ఆ నరములను పట్టుటవలన ప్రాణవాయువు నిలిచిపోవును. మరియు నరములను వదలిన యెడల ప్రాణవాయువు ఒకేపర్యాయము ప్రవేశించి మెదడునందు నిలిచియుండిన వాతపరమాణువులను నశింపజేయును. మరియు, యీనరములను పట్టు పద్ధతి నాడీశాస్త్రులు నెరుగుదురు. యిచ్చట స్వల్పముగా తెలియజేయుచున్నాను. వైద్యులు వచించినది వ్రాయుచున్నాను నరములను పట్టిన యెడల విశేషకాలమువరకు పట్టియుంచకూడదు. మనము శ్వాసమెంతవరకు ఆపగలమో అంతవరకే నరములను పట్టి వదలవలెను. విశేషకాలమువరకు నరములను పట్టుకొనినచో మృతిసంభవించగలదు గాన తగు జాగరూకతతో ప్రవర్తించవలెను.

# జుకాము అనగా జలుబు మరియు నజలా వ్యాధుల వివరము.



ఈవ్యాధియందు మలము మెదడుయొక్క ముందు పొరలయం దుండి ముక్కువైపునకు దిగుచుండును. దీనిని వైద్యులు జుకాము అనగా జలుబు అనియు, మరియు మలము మెదడునుండి మెడవైపుకు దిగుచుండును. దీనిని నజులాఅనియుజెప్పుదురు నజులా అనునది వైద్యులు ఆమలమునుండి ముఖ్యముగా పిలువబడుచున్నారు. మరియుమలము మెదడునుండి రొమ్ము వూపిరితిత్తులవైపుకదిగుచున్నది. మరియు కొందరకు ఆమలమును ముక్కువైపునుండి దిగుచున్నది. ఆమలము పలచగానున్న ది. ముక్కుమార్గములను బాధించుచున్నది. దీనిని జుకాము అనిచెప్పుదురు. తక్కినదానిని నజులా అనిచెప్పుదురు ఈరోగము వుత్పన్నమగుటకు కారణము ఒకటిగానే చెప్పబడియె, గాని మలము స్రవించునట్టి స్థలముమాత్రము వేరువేరుగా నుండును. ఇందువలన య్యీరెండింటి యొక్క మధ్య సాధారణ ధర్మము యీరోగము మెదడుతో సంబంధము కలిగియుండును. అనగా విరోచనమునకు ఆమాశయమునకు యెట్టిసంబంధముగలదో అటులనే యీ వ్యాధి మెదడుతో అట్టి సంబంధము కలిగియుండును. అనగా విరోచనము యొక్క దుర్బలమువలన ఆమాశయమునందు అన్నము పచనముకాజాలదు. ఇందువలన ఆమాశయమునందు వాతము హీనమై క్షీణీభవించియుండును. మరియు ఆమాశయమునకు శుద్ధిపరచుశక్తి అట్టిమలమును దూరపరచుచున్నది. మరియు అపక్వ పదార్థములు భుజించినచో విరోచనము వెంటనే వెడలుచున్నది. అటులనే ఆమాశయమునందు విశేషవాతము తంతూర్పులతో చేరకున్నయెడల వుపరిఅధికమగును. ఆఅధికమైనవాతము మెదడువైపునకువచ్చుచున్నది మెదడుదానిని పచనము చేయజాలనియెడల మెదడునందు దూరపరచు

నట్టిశక్తి ఆమలమును వచనము చేయకనే దూరపరచుచుండును. ఆమలము, వాతము, జుకాముఅనగా జలుబు, మరియు నజులా గామారి వచ్చుచున్నది. దీని సామాన్యకారణములు అయిదు విధములుగా నుండును.

(1) బాహ్యకారణములనుండి మెదడునకు విశేషముగా వుష్ణము కలిగించుట మరియు మెదడునందుగల వాతమును కరిగించి కదలించును మరియు ముక్కు కంఠము వైపు వెడలించును దీనికారణములు అనగా వుష్ణకారణములు మండుచున్న స్థానమునందున్న అగ్నిమెదుట నివశించుకారణములవలన మరియు ఎండాకాలమునందు మెదడునందు గల వుష్ణము బైటికి వెళ్ళక లోపలనే యుండును. మరియు కస్తూరి, జాన్ను, కుంకుమపువ్వు, ఇత్యాది వుష్ణవస్తువులను ఆఘ్రాణించుట లేక వుష్ణతైలములను తలయందు మర్దించుట ఇట్టికారణములవలన మెదడునందు గలవాతము కరిగి అచ్చటనుండి కదలి ముక్కు, లేక గొంతువైపు దిగును మరియు అచ్చట నిలువజాలక తలకు వుష్ణము కలిగినయెడల అచ్చటనుండి వాతము కరిగి క్రిందవైపు దిగి మెదడునకు మారుగా మృదువగు శరీరభాగములవైపుకు యేర్పడును. అనగా తైలము అగ్నివైపుకు యెటుల వచ్చునో అటులనే వుష్ణమువైపుకు మలము కరిగి వచ్చునని భావము. దీని లక్షణములు కారణముముందు కలుగుచున్నది. అప్పుడు కండ్లు యెర్రగానుండుట ముక్కుదురదవేయుట ముక్కుమండుట, యీమొదలగునవి వుష్ణమువలన కలిగిన జుకాము అనగా జలుబు లక్షణములని భావించవలెను. యీరోగము జ్వరము రావడములోనే జాస్తియగును.

**ఉష్ణమువలన కలిగిన నజులా, జలుబుచికిత్స**

శరీరము మలముతో పూర్ణముగా నున్నయెడల విరోచనము చేయించవలెను. మరియు శిరానేదనము చేయించి రక్తమోక్షణము చేయవలెను. యిటుల చేయుటవలన శరీరమునందుండి మలము తల

యందు ప్రవేశించుట నిలిచిపోవును. మరియు గోరువెచ్చని నీళ్ళతో స్నానము చేయించవలెను. యెందుకనిన కసీళ్ళ దురద శాంతినొందించును. వాతమును పక్వపరచును. చర్మసంబంధమగు రోమకూపములను వికసింపజేయును గాని జుకాము అనగా జలుబు అధికమగుచున్నది. ఇటులనే మెదడుయొక్క దురదశాంతినొంది మెదడునందు జలుబు ప్రవేశించుటకై శీతప్రకృతిగల బనప్షాతైలము కలువపూలతైలము, సొరకాయతైలము, ఇత్యాది చల్లనితైలములను నశ్యము చేయవలెను. అనగా ముక్కులలో పోయవలెను. మరియు మలము అధికమై రోగము హెచ్చినయెడల అట్టివ్యాధి బలము తగ్గించుటకై కర్పూరము గాని అథవా గోధుమపొట్టు శిరకాలోతడిపి ధూపము వేయవలెను.

## కర్పూరధూపము వేయువిధి

ఒక గాజుపాత్ర నిప్పులమీదనుంచి దానిపై కర్పూరము చల్లుచూ అందుండి లేచునట్టి పొగను ముక్కులతో పీల్చవలెను. అనగా కర్పూరమునందు జలుబు అధికముగానుండును గాని కర్పూరపుపొగ ఉష్ణమగు వాతమును శుష్కింపజేసి కూడదీయుటవలన మలము క్రిందికి దిగుట నిలిచిపోవును.

మరియు యిటులనే గోధుమపొట్టు, శిరకాలోతడిపి నిప్పుపై వేసి అందుండి వచ్చుపొగను ముక్కునుండి పీల్చవలెను.

(విశేషదృష్టవ్య) జుకాము అనగా జలుబువ్యాధి యందుచేయునట్టి చికిత్సయందు ఉష్ణముగాని, జలుబుగాని ముఖ్యముగు సంగతి మలము చేయవలెను. మలమును పక్వముచేయుట యీ క్రిందివిధముగా చేయదగును. అనగా వాతము సమముగా యుండునటుల చేయవలెను. వుష్ణము స్వల్పమైనయెడల ఉష్ణమును అధికమగునటుల చేయవలెను. అనగా సమానముగా యుండునటుల చేయవలెను. మరియు జలుబు విశేషమువలన చిక్కగా నున్నయెడల జలుబు తగ్గించవలెనని గ్రహించవలెను. మరియుష్ణము తక్కువగానుండు జుకామువ్యాధియందు,

యనగంజియందు ఉన్నాబ్, సపిస్తాఁ, బనఫ్షా, గసగసాలు, యీ మొదలగు వస్తువులు చేర్చి యివ్వవలెను. మరియు గసగసాలషరబతు మిక్కిలి గుణదాయకమగును మొదటి దినము మొదలు, మూడురోజుల వరకు యీవనూకతో చేసినగంజి తప్ప ఇతర యేవస్తువును యివ్వకూడదు. మరియు జుకాము వ్యాధి తగ్గేవరకు మాంసమును భక్షింపకూడదు. పెసరపప్పుతో, పాలకూరవేర్చి వండి యివ్వవలెను. మరియు గంజులు, గోధుమపొట్టుగంజి, బాకలాపిండి, గోధుమసక్తు, కతిరా అనగా బాదం జిగురు, బాదంనూనె, చక్కెర మొదలగు వస్తువులు కేవలము యిప్పిం చవలెను.

అథవా దోసకాయ, పెద్దదోసగింజలపప్పు, బాదంపప్పు, బాదం నూనె, ఆవువెన్న యీమొదలగు వస్తువులు ఉష్ణకారక జుకాము వ్యాధియందుత్తమ పత్యములు. మరియు మలము ఉష్ణము తీవ్రముగలదైన యెడల వెంటనే శిరావేదనము చేయవలెను. మరియు, మలమునందు తీవ్రత, ఉష్ణాధిక్యత లేనిచో మూడుదినముల తరువాత శిరావేదనము చేయవలెను. యీమూడు దినములలో మలము పక్వమగును. జుకాము అనగా జలుబు వేడివలనగాని లేక జలుబువలనగాని కలిగినను వీపు సంబంధముగు బలముగల తంతువులద్వారా మలము రొమ్మునందు ప్రవేశించును గాన దీని విషయములో వుత్తమవుపాయములు అనగా తలవైపు పల్లముగను కాళ్ళవైపు యెత్తుగానుంచి తలగడపైని ముఖముంచి బోర్లపడుండునటుల చేయవలెను. ఇట్లుచేయుటవలన మలము ముక్కువైపుకు వచ్చును. రొమ్ముపై చేరజాలదు. మరియు జలుబువ్యాధి ఆరంభమునందు తుమ్ములు కలిగిన యెడల హానికలిగించును గాన తుమ్ములు కలిగినయెడల తుమ్ములను తగ్గించవలెను. ఈవుపాయములను తుమ్ములు కలిగించురోగ ప్రకరణమునందు చెప్పబడును. మరియు జలుబువ్యాధి వుష్ణమువలన కలిగినయెడల తలపై బట్టతియ్యకుండా మూసియుంచవలెను. అనగా తలకు బట్ట

చుట్టవలెను. మరియు వుత్తరదిశనుండి వీచు చల్లనిగాలితో కాపాడ
వలెను. దాహమగు విశేషముగా కలిగినను మంచుగడ్డనీరు కూజాలోని
నీరు మొదలగుచల్లని జలపానము చేయజనదు.

మరియు పగలునిద్రించకూడదు. రాత్రిభాగమునందుకూడా
తక్కువగా నిద్రించవలెను. భుజించినవెంటనే నిద్రించుట సర్వదావర్జిం
చవలెను. జలుబు వ్యాధి ఆరంభమునందు స్నానముచేయుట హానికర
ము మరియు మలము కొద్దిగను పలచగానుండినయెడల స్నానముచేయు
టమంచిది. అనగా పలచగానుండు మలము స్నానమువలన రోమకూప
ములవెంట చెమటతో కలిసి వెడలిపోవును. మరియు చిక్కని మలము
నిలిచియుండి కఠినముగా వెడలును మరియు జలుబు వ్యాధి అంతము
నందు స్నానముచేయుట మంచిది. అనగా పక్వమైన మలమును వెంట
నే కరగించి తీసివేయును.

ఎవనికైనను జుకాము అనగా జలుబు అధికముగా నుండినయెడ
ల అట్టివాని ఆరోగ్యదశయందు స్నానము చేయించుట స్వేదము వెడ
లించుట లాభదాయకము. యెందుకనగా అచ్చటవాత ఆవిరియొక్క
పరమాణువులవలన జలుబు నజులా వుత్పన్నమగును గాన చెమటవెడ
లించుటవలన చెమటరూపముగా బైటికి వెడలిపోవును. మరియు ఈ
కారణమువలన జలుబువ్యాధి దశయందు స్నానము వర్జించబడియె.
కాబట్టి భుజించకుండుట, స్నానముచేయుట, నెమ్మదిగా శరీరము మూ
సికొని బైటికివచ్చుట తలవెంట్రుకలు వెంటవెంట గొరుగుట తలగీరు
కొనుట తలదువ్వుకొనుట మొదలగు పనులవలన రోమకూపములు విక
శించునుగాన నజులావ్యాధిసంబధమగు మలమును నశింపజేయును.

మరియు వుష్ణసంబంధమగు జుకాము అనగా జలుబువ్యాధియం
దు విరోచనము చేయించవలసిన అగత్యమున్నయెడల బనప్షా ఉన్నా
బ్, సపిస్తాఁ, ఖతమిలేరు, ఖితిమిగింజలు, పట్టివేరుచేర్చి విరోచనఔష
ధముచేసి యివ్వవలెను. మరియు జుకాము మలము కంఠముపై దిగు

చున్నయెడల దానికి క్రింద వ్రాసిన ప్రకారముగ హానిమ్మగింజలు, చిరిసెనగలు, నీళ్ళలోవేసి కషాయముగాకాచి ఆకషాయమును పుక్కిలించవలెను. మరియు విశేషబలముగల వస్తువుల అవసరమున్నచో గసగసాలు పోస్తుకాయలు అనగా గసగసాల కాయల బెరడును చిరిసెనగలకట్టుయందువేసి కాచి పుక్కిలించవలెను

## గసగసాల పక్వము చేయు క్రమము

గసగసాలు అర్ధశేరు, నాలుగుశేర్లునీళ్ళయందు ఒకఅహోరాత్రి నానవిచ్చి తరువాత తీసి నూరి ఆనీళ్ళలోవేసి అర్ధావశేషముగాకాచి దించుకొని చేతితో పిసికి వడకట్టి అందులో ఒకశేరు పంచదారచేర్చి చిక్కబడువరకుకాచి దించుకొనవలెను.

మరియు, మలము తీక్ష్ణముగను ఉష్ణముగనుండిన యెడల కొద్దిగా గసగసాలకాయల బెరడు చేర్చవలెను. మరియు, పచ్చిగసగసాల కాయలు దొరికిన యెడల 100 కాయలు గింజలు సహితముగా 7 శేర్లు వాననీళ్ళయందు నానవేసి అర్ధావశేషముగా కషాయముకాచి వడియబోసి అందులో పచ్చిద్రాక్షరసము 1 శేరు పంచదార 1 శేరువేసి యీమూడు వకటిగాచేర్చి చిక్కనగువరకు కాచి దించుకొని రోగికి ఒకదిరము యవ అన్నములోకలిపి యివ్వవలెను యీమరబతును దయాకూజా అందురు. మరియు, దీనిని షయఫల్ కజ్ అని పార్శిభాషయందుమయాఖుష్ అందురు. మరియు, దోశాబ్ అనగా పచ్చిద్రాక్షరసమని భావము.

## 2 భేదము జుకాము అనగా జలుబు లక్షణములు

ముఖ్యముగా మెదడుయొక్క ప్రకృతి అంతరుకారణము అనగా లోపలికారణమువలన నజులా మరియు, జుకాము రోగములను కలిగించుచున్నది. యీవ్యాధి రెండువిధములుగా కలుగుచున్నది. (1) మెదడునందు ఉష్ణముసంభవించి వాతమును తన వైపునకు నీడ్చుకొనును. గాని అట్టి వాతమును పచనము చేయజాలక వదలివేయును.

(2) మెదడు సంబంధమగు అంగములలో దుష్టప్రకృతి సంభవించి వాటియందు దుర్బలమును కలిగించును. గాన అచ్చట స్వాభావికముగా పచనము చేయజాలకుండును. కాబట్టి అచ్చటి మలము రాజాలక విశేషముగా మెదడునందు చేరి యుండును. అట్టిసమయము నందు దూరపరచునట్టి శక్తిగా శికముద్వారా వెడలగొట్టుచున్నది. మరియు, సర్వశరీరమునందు ఉష్ణప్రకృతి కలిగియుండు కారణమువలన ఆవిరి పరమాణువులు మెదడునందు చేరి మెదడునందు ఉష్ణప్రకృతి కలిగించును. దీనిచిన్నెములు ముందు ప్రకరణమునందు చెప్పబడియె. మరియు, నాడి వంకరగా వెంట వెంట నడుచుచుండును.

—౨వ. భేదము జుకాము అనగా జలుబు చికిత్స—

ముందు ప్రకరణమునందు మలమును వెడలించి ప్రకృతిని మార్చునట్టి విధానమును వచించబడియున్నది. ఈ వ్యాధియందు కూడా పై విధముగానే సదుపాయములతో ప్రకృతిని మార్చవలెను.

—౩వ. భేదము జుకాము అనగా జలుబు వ్యాధి లక్షణము—

బాహ్య కారణములు అనగా వెలపలనుండి తలయందు జలుబు ప్రవేశించును. అనగా యెల్లప్పుడు చల్లని నీళ్ళయందు తల తడిపి యుంచుట. మరియు, పరిశ్రమచేయుటవలన గాని లేక స్నానముచేయుటవలనగాని లేక వేరుపనులయందుగాని శరీరమునందు వేడి సంభవించిన యెడల రోమకూపములు వికసించును. అట్టితరి తలకు బట్టలేకుండా చల్లని గాలిలో తిరుగుటవలన రోమకూపములు బంధించబడి తలచర్మము కఠినత్వమునొంది ఆఆవిరి పరమాణువులు నష్టమునొందును. గాన పరమాణువుల మార్గములు బంధింపబడి పచనము నొందని కారణమువలన పరమాణువులు వకటిగాచేరి వాతమును కలిగించి గొంతులో గాని లేక ముక్కులో గాని స్రవించు చుండును. అనగా ఆవిరివలన ఆవిరి పరమాణువులయొక్క ఆవిరి యెక్కునట్టివైపు వాతము కలిగించి స్రవించునటుల చేయుచున్నవని భావము.

మరియు జలుబు దుష్టప్రకృతియొక్క కారణమువలన మెదడుచల్లనై దుర్బలము నొందినదై తన స్వాభావిక ఖర్మలను చేయుటయందు నీర్స మొందును. ఇట్టిసమయమున మలమును పచనము చేయలకుండును. కాబట్టి యీ మలమును దూరపరచునట్టిశక్తి ఆమిగిలిన మలము మెద డువంటి మృదువగు మార్గములద్వారా తీసివేయుచున్నది. దీని చిన్నః ములు వుక్తకారణమునందు చెప్పబడియే యున్నవి. మరియు చల్లని జుకాము అనగా జలుబు, లోపలి వెలపలికారణమువలన కలుగుచున్న ది. యీవ్యాధియందు కండ్లు ముఖము స్వభావికముగా యుండును. గాని కండ్లు ముఖము బరువుగా నుండును. మరియు గొంతునుండిగాని, ముక్కునుండిగాని వచ్చునట్టివాతము అచ్చటనిలిచి తెల్లగను, నీలిరంగు ను మారుచున్నది. మరియు జుకాము వ్యాధియందు జ్వరము వచ్చిన యెడల వ్యాధివెంటనే నశించును. మరియు రంగుమారుట ఉష్ణముగా నుండుట సాధారణవ్యాధియందుగాని దోషయుక్తమలదోషానుకూల ముగా తగ్గుట హెచ్చుట మొదలగునవి విశేషముగా వర్ణించబడి యున్నవి.

### 3 వ భేదము, జుకాము చికిత్స.

యీరోగమునందు స్జలు వేయించి బట్టలోవేసి సికతాబ్ అన గా కాపడము చేయవలెను. మరియు స్నానము చేయించవలెను. ఇట్లు చేయుటవలన రోమాంచములు వికశించును. మలముకూడా పక్వము నొందును. మరియు యేవస్తువువలన రోమాంచములు వికసించి మల మును పక్వపరచుచుండునో అట్టివస్తువులతో కాపడము చేయుట మం చిది. మరియు మెదడునందు జలుబు కలిగించవలెను. మెదడునందుగల వాతము నశించుటకై యేవస్తువు మెదడునందు వేడికలిగించి మలబం ధనము విడదీయుచున్నదో అట్టివస్తువులను అనగా వుష్ప, అగరు, చం గల్వకొష్టు, నల్లజీలకర్ర మొదలగునవి. శిరకాలోతడిపి అగ్నిపై వేసి వచ్చుపొగను ముక్కుతో పీల్చుటమంచిది, ఇటుల పొగపీల్చుట వలన మెదడునందు చెమ్మకలిగించి వాతమును పక్వపరచును.

### 4 వ భేదము జుకాము అనగా, జలుబు రోగలక్షణములు.

ఈరోగము ముఖ్యముగా మెదడునందుగల చల్లని ప్రకృతి వలన కలుగుచున్నది. మరియు వెలుపలికారణము అనగా బాహ్యాకారణము. ఈవ్యాధియందు యేమియు చేరకుండును. మరియు జలుబువలన కలుగునట్టి జుకాముర్వ్యాధి ప్రకరణమునందు చెప్పబడెను. దీని లక్షణములు ఇంద్రియములు నిష్ప్రయోజనములగుట తలయందు ఆవిరి వెడలుట, శరీరము నీరసముగా నుండుట, ఉష్ణపదార్థ సేవన వలన సుఖముగా నుండుట మొదలగు లక్షణములు జలుబునందు చెప్పబడెను.

### 4 వ భేదము జుకాముర్వ్యాధి చికిత్స.

ఆవిరిపట్టుట, కావడముచేయుట, వాసనచూచుట అనగా రుచితమగు వస్తువులతో వాసనచూచుట మొదలగు వానివలన తలకువేడి యెక్కించవలెను. మరియు యీవ్యాధికి అనుకూలమగు వస్తునము దాయములను మూడవప్రకరణమునందు చెప్పబడియున్నవి. మరియు అంతర్, బాహ్యాకారణములు వకటిగాచేరి నజులా, జుకాము వ్యాధులను వుత్పన్నముచేయును. జుకాము శరీరములోపలి కారణము, వెలుపలికారణములతో వుత్పత్తి యగుచున్నది. యీవ్యాధి బహుభేదములుగా నుండును. మరియు శీతజ జుకాముగలరోగికి గోధుమపొట్టు నీళ్ళయందు తేనెకలిపిగాని లేక అవిసిగింజలు వేయించి చూర్ణించి, తేనెలోకలిపి ఇందులో కొంత మిరియాలచూర్ణము చేర్చిగాని, గోధుమజావగాని లేక ఇట్టిగుణము గలవస్తువులను భోజనార్థం యివ్వవలెను. మరియు పావురపుపిల్లల మాంసము పక్షుల మాంసము వేయించి ఇవ్వవలెను.

### 5 వ జుకాముర్వ్యాధి లక్షణములు.

ఈరోగము సంపూర్ణశరీరముయొక్క ఉష్ణప్రకృతివలన ఆవిరిపరమాణువులు పైకెక్కి మెదడునందు విశేషముగాచేరి యుండును. ఇటుల చేరుటవలన జుకాము నజులా అనువ్యాధులు వుత్పన్నమగును. మరియు పై నాలుగువిధములగు జుకాము లక్షణములు తిరిగిచెప్పుటవలన గ్రంథ

గితము మొండినదనిశూలు, గుగ్గులు, అంబరు, మొదలగువస్తువుల ధూపమువేసి పొగపీల్చవలెను, ఈవ్యాధియందు యవఅన్నము మిక్కిలి గుణకారిగానుండును. మరియు మొదటివప్రకరణమునందు చెప్పిన పథ్యకర వస్తువులను వుపయోగించుట లాభదాయకము.

**2వ. భేదము రక్తజ జుకాము అనగా జలుబు లక్షణములు.**

ఈవ్యాధియందు నేత్రములు యెర్రగానుండుట, తల బరువుగా నుండుట సౌంజ్ఞనాశనము, నిదురపట్టకుండుట, గుండ్లు బాగుచుండుట, ముక్కు, చెవులు, నోరు వీటియందు దురద, నోరు తియ్యగానుండుట, దుర్గంధముగానుండుట, ముక్కువెంట గులాబిరంగుగలమలము వెడలుట మొదలగు లక్షణములు కలిగియుండును.

**రక్తజ జుకాము చికిత్స**

వరేరు అను నరమును ఛేదించవలెను. మరియు, ఉచితమగు వస్తువులతో శరీరమును మృదుపరచవలెను. యవగంజి యివ్వవలెను. యిట్టిసమయమునందు మలమును చిక్కపరచవలసిన అవసరమున్న యెడల ఉన్నాబ్ షరబతు, గసగసాలషరబతు యివ్వవలెను. మరియు, మలమును చిక్కపరచునట్టివస్తువులను యీసమయమునందుఉపయోగించినను|పయోగించకున్నను మలమునిలిచిపోయినదో యిటువంటి మలమును వెడలించవలసినఅవశ్యము కొరంతయున్న యెడల యీ నిద్రదశయందు వుపయోగించదగిన వస్తువులను పిత్తజ జుకాంనందు చెప్పినరీతిగా ధూపమువేసి ఆధూపమును నాశికముద్వారా పానము చేయించవలెను. యెందుకనగా రక్తజమ మలము పిత్తమలముకంటె మిక్కిలి గట్టిగానుండును. కాబట్టి అట్టి మలముయొక్క బంధనమును తీసివేయుటకై, జరామాంశి, * చదరస,

అగరు మొదలగు వస్తువులుచేర్చి ధూపముపానము చేయవలెను. మరియు బాబూనా, నఖంచిప్పలు, దవనము, మరువము యీ మొదలగు వస్తువులు కషాయముకాచి ఆకషాయముతో తలకు ఆవిరిపట్టి పట్టవలెను. యిటుల ఆవిరి పట్టుటవలన మలము పక్వమొంది మలబంధనమును వదలించును.

## 3వ. భేదము కఫజ జుకాము అనగా జలుబు లక్షణములు

ఈవ్యాధి అన్నిటికంటె సులభముగా నుండును. అనగా కఫమో పవికృతి మెదడుయొక్క ప్రకృతితో సంబంధము కలిగియున్నది. యీ వ్యాధి రోగగ్రస్తఅంగముయొక్క రంగుతో సమానపకృతిగానుండును గాన యీవ్యాధియందు భయము తక్కువగానుండును. అనగా హేతువు దుర్బలకారణమువలన యీవ్యాధి కలుగుచున్నది. దీని చిన్నములు తల బరువు, సౌంజ్ఞనాశనము, నోటివెంట వాతిమలము వెడలుట, నోరు అరుచిగానుండుట, భుజించినప్పుడును, నిద్రించునప్పుడు, నాలుక కొరుకుకొనుట, మాటహీనస్వరముగాయుండుట, ఆరోగ్యదశయందు శాశికము మలరహితముగా యుండునప్పుడు ముక్కు మొదలునుండి మాటలాడునప్పుడు వచ్చునట్టి శబ్దము ధారాళముగా వచ్చుచుండును. మరియు, మలము చిక్కబడిన మెదడ శ్లేష్మము నాశికమునందు నిలిచి యుండినచో ధారాళముగా మాటలాడుటకు కష్టముగానుండును. యిట్టి కారణమువలన శబ్దము హీనముగా వచ్చును

## కఫజ జుకాము చికిత్స

శరీరమును మృదుత్వము నొందించుటకై జూపా, ఇష్టిమధుకము, అంజూరపండ్లు యీ మొదలగు వస్తువులను నీళ్ళయందువైచి కషాయముకాచి మాధీపల రసాయనముచేర్చి యిప్పించవలెను.

భోజనమునకు గంజులు యివ్వవలెను. అనగా గోధుమ పొట్టు, బాదంపప్పు తేనె నీళ్లు కల్పి యివ్వవలెను. పన్నీరు ఉపయోగించవలెను. యెందుకనగా కేవలము నీళ్ళు మలమును అపక్వపరచి ఆలస్యముగా పక్వము నొందించును. కఫమును వృద్ధిచేయును. మరియు, మలమును పక్వమొందించవలసిన అవసరమున్న యెడల సోంపు, బాబూనా, కాసూస్, చాతరాసి, నఖలు, మొదలగునవి కషాయముకాచి ఆకషాయముతో ఆవిరి పట్టించవలెను. మరియు, సాధారణముగ జలుబునందు చెప్పబడిన చికిత్సలను చేయవలెను. మరియు, మలసంబంధముగ బంధనము కలిగి మలము గొంతువైపు గుండెవైపు ప్రవహించుచుండిన యెర్రవంచదార, కాగితములు, జటామాంసి, ఆవాలు, చందనస్ జిగురు మొదలగునవి ధూపమువేయవలెను.

—4 వ వాతజ జుకాము అనగా జలుబులక్షణములు.—

యీవ్యాధి తరచు కలుగనేరదు. యీవ్యాధి సంపూర్ణముగా వాతమువలన కలిగినయెడల మిక్కిలి క్రూరత్వము వహించును. దీని లక్షణములు రెండు నేత్రములు ఆరిపోవుట, తలనొప్పి, తలబరువు నోటి యందు, మాడినవస్తువుల రుచివలె నుండుట యేవస్తువును వాసనచూచినను పొగవంటి వాసన, కుళ్ళిన వాసనవలె దుర్గంధముగా నుండుట మొదలగు లక్షణములు కలిగియుండును.

—వాతజ జుకామువ్యాధి చికిత్స—

బనఫ్షా, ఖిత్మి, కాహూబీజములు, నేతిబీరబీజములు యీ మొదలగు వస్తువులనుకషాయముకాచి, ఆకషాయముతో రోగితలకు ఆవిరిపట్టించి చెమట వెడలించవలెను. మరియు యీ కషాయమును రోగితలపైభాగమునందు పోయవలెను. మరియు యీ కషాయమునందు గసగసా

లు వేసి వండి రోగికి యివ్వవలెను మరియు హారీరా అనగా యవాగు, నిశస్త అనగా గోధుమపాలు వొండించినది మొదలగు వానియందు చక్కెర బాదంనూనె చేర్చి యివ్వవలెను.

మరియు దోషమువలన బంధనము కలిగినయెడల చక్కెరచేర్చ వలెను. చంద్రస్ జిగురు దూపము వేయవలెను. తక్కిన దోషమును తగ్గించునట్టి ఉపశమనోపాయములను చేయవలెను. ఇట్టి చికిత్సలను చెప్ప బడియే యున్నవి.

(సూచనీయము) జుకాము అనగా జలుబు. నజులాఅనువ్యాధుల సంబంధముగు మలమును ఉష్ణముగను పలచగ నుండును. ఒక్కొకప్పుడు చల్లగను చిక్కగను కొన్ని సమయములయందు పలచగను కాలుచుండునటుల చేదుగనుండును. మరియు ఒక్కొక సమయమునందు పుల్లగను చిక్కగను ఒక్కొకసమయమునం దుప్పగను మరికొన్ని సమయములయందు చెడుస్వాదుగను కొన్నివేళలయందు స్వాదురహితముగను నప్పగ నుండును. ముఖ్యముగా గమనించవలసిన విషయము యీ వ్యాధియందు చికిత్సచేయుటలో యెంతమాత్రము ఉపేక్షించకూడదు. యెందుకనగా జుకాము వ్యాధి వేగరము వక్వమొంది వ్యాధిహరించని యెడల యుతరవ్యాధులను కలిగించుటకు కారణమగును. అనగా కండ్లు, ముక్కు, చెవులు మొదలగువాటియందు వ్యాధులను కలిగించును. ఖునాక అనగా ఒకవిధము వాపు, గొంతు ఆమాశయమునందునొప్పి జర్బ అనగా అతిసారము, సహజఅనూ అనగా పేగులయందుమంట, ప్రక్కటెముకలయందువాపు, శూసా అనగా పక్కలయందు కలుగు శూలవ్యాధియందు కలుగువాపు, కూలంజ్ అనగా ప్రేగులయందు నొప్పి మొదలగు వ్యాధులను కలిగించును. అనగా నజులావ్యాధి మలము యేఅంగమునందు ప్రవేశించునో ఆ అంగమునందు కలుగు రోగ

ములను కలిగించును. మెదడునకు దుర్బలము కలిగించి నిస్సారశక్తి కలిగిగాని లేక, మలము వెడలునట్టి మార్గములు బంధించబడిగాని లేక, చిక్కని దోషమలము మెదడునందు స్తంభించుటవలన గాని, ఆవిరియొక్క పరమాణువులున్ను వాతమున్ను మెదడునందు బంధించబడును. ఇట్టి స్థితియందు మెదడుసంబంధమగు గుల్లభాగములయందు మలము ప్రవేసించినయెడల సక్తా అనగా సన్యాసము ఉత్పన్నమగును, మరియు ఉష్ణప్రకృతిసంబంధమగు మలము మెదడు సంబంధమగు గుల్లభాగములయందు ప్రవేసించినయెడల అపస్మారవ్యాధి కలిగించును. మరియు మెదునందుగల నరములయందు మలము స్వల్పముగా చేరినచో, తలనొప్పి అర్ధలనొప్పి కలిగించును. మరియు మెదడునందుగల నరములయందు, జలమువంటి వుష్ణసంబంధమగు మలము చేరినయెడల మాలిఖోలియా అనగా అతివాగుడు, ఉన్మాదము కలిగించును. మరియు మెదడునందున్ను మెదడును కలిగించునట్టి నరములయందున్ను మలము చేరినయెడల సర్సాము వ్యాధి అనగా మెదడునందు వాపు, కూౄరనిదుర మానియా అనగా ఇదిఒక విధమగు ఉన్మత్తవ్యాధి యీమొదలగు వ్యాధులను కలిగించును. మరియు తలయందుగల నరములయందున్ను, మెదడునందుగల నరములయందున్ను మలము లేటస్తించినయెడల తలతిరుగునట్టి వ్యాధియు, కండ్లు చీకట్లుక్రమ్ముట మొదలగువ్యాధులు కలుగును. ఇందువలననే మెదడునందు మలము యున్నంతవరకు నజులాను బంధించు చికిత్స చేయకూడదు. ఒకవేళ నజులా బంధించినను తిరిగి స్రవింపచేయవలెను. అనగా పైనవిధించినరీతిగా చికిత్సచేసి మలము స్రవించునటుల చేయవలెను. అట్లు చేయక నజులా మెదడునందు నిలిచినయెడల పైన చెప్పిన వ్యాధులను కలిగించుటకు కారణభూత మగును.

**అసాబా అనగా కనుబొమలయందు శూలరోగ లక్షణములు.**

ఈవ్యాధి లలాటము, నేత్రముల కొలుకులయందు కనుబొమలయందు నొప్పికలుగుచున్నది. మరియు నిది వకబొమయందుగాని ఒక్కొ

క్కనసమయమునందు రెండుబొమలయందుగాని శూలకలుగుచున్నది. ఈకారణమువలన యీస్థలమునందు కట్టుకట్టవలసియుండును. ఈనొప్పి యీస్థలమునందు కలుగుటవలన దీనికి అరబ్బీభాష యందుఅసాభా అని పేరుపెట్టిరి. ఈవ్యాధి రెండువిధములు (1) వృష్ణదేహమునుండి పరమాణువులు పైకెక్కిన కారణమువలన చర్మము కఠినత్వమునొంది రోమాంచములు బంధించబడి యీస్థానము బంధించబడును. ఈకారణమువలననున్న ఉత్తరదిశగాని శరీరమునకు తాకుటవలన మరియుచల్లని నీళ్ళయందు స్నానము చేయుటవలన యీవ్యాధి కలుగుచున్నది. దీని చిన్హములు కనుబొమలయందుపోటువలన కనురెప్పలు లేవకుండుట బాధవలన యెల్లప్పుడు బొమ్మ పడియుండుట మరియు కండ్లు తిప్పలేకపోవుట నొప్పిని శేషత్వమువలన నొసలు బిద్దలై నటులుండుట మొదలగు లక్షణములు కలిగియుండును.

## —అసాబా అనగా కనుబొమల చికిత్స.—

కఠినముగను గరిగలవస్తువుతో నాశికమునందు గీరవలెను. దీనివలన ముక్కునుండి రక్తముస్రవించినచో మలము బొమల సమీపము నుండి తొలగిపోవును. మరియు నాశికమునుండి రక్తము స్రవించినయెడల సరేరు అను నరమును ఛేదించి రక్తమును స్రవింపజేయవలెను, తరువాత కర్పూరము సిరకా వాసనచూడవలెను. మరియు పిక్కలు పాదములు మర్దించవలెను. భోజనపదార్థములతో శిరకా కలకండకలిపి యివ్వవలెను. మరియు యవగంజితో కలకండచేర్చి యివ్వవలెను. మరియు వైద్యుడు సమర్ధత ఆలోచించి పథ్యమొనంగుట తదుపరి పర్యావసానము.

(2) సాధారణ దుష్టప్రకృతి కణతలయందున్న కండ్లయందు చేరినయెడల కణతలయందు కండ్లయందుపోటు కలిగించును. ఈవ్యాధి

విశేషముగా యెండయందు తిరిగి శరీరము చల్లబడకముందే చల్లగాలి యందు తిరుగుట చల్లనినీళ్ళయందు స్నానముచేయుట యీమొదలగు కారణముచే మలుపలన తలసంబంధమగు రూపకరూపములు మూయబడి ప్రవాహము బంధించబడి దీనివలన తలనొప్పి కలుగును. ఈనొప్పి జూకాము ప్రకరణమునందు వర్ణించియున్నాను. మరియు ఇటువంటి విధమగు అసామాదిన్నామములు సూర్యుడు వుదయించునప్పుడు నొప్పి ఆరంభమై పొద్దు యెక్కినకొలది నొప్పికూడా హెచ్చుచుండును. మరియు సూర్యుడు అస్తమానమగుటకు పొద్దు దిగినకొలది నొప్పి తగ్గుచుండును. అనగా సూర్యుడు అస్తమనమయమునకు చేరినకొలది నొప్పికూడా తగ్గనారంభించును. తిరిగి సూర్యోదయము కాగానే తిరిగి నొప్పికూడా అరంభమగును.

### సాధారణ దుష్టప్రకృతి శూలచికిత్స.

చలువజేయు నుపాయముల ఆలోచించవలెను. రోమకూపములు వికసించు నుపాయములయందు పరిశ్రమచేయవలెను. మరియు కర్పూరము నూనెలో అరుగదీసి ముక్కులోపోయవలెను అనగానశ్యము చేయవలెను.

### సఖ్నరోగ లక్షణములు.

ఈవ్యాధి మెదడుసంబంధమైనది. ఇది తరుచుగా కనుపించుచుండును. ముండ్లు గ్రుచ్చినటులకనుపించును గనుకనే దీని పేరు సఖ్నా అనిపెట్టబడినది. ఈవ్యాధిగలవాని మెదడునందు నొప్పి విశేషముగా కనుపించి జిలతోకూడియుండును. ఇట్టిస్థితియందు రోగి పిసికికొనుట, గుద్దుకొనుట, బిగించుట, వేడినీళ్ళను తలపై దారగా పోసుకొనుట మొదలగు పనులవలన నొప్పిశాంతి నొందినటులుండుట యీవ్యాధి కలుగుటకు కారణము కొద్దిఅవిరిపరమాణువులు మృదుశక్తియును తేజస్సునుపీల్పు

నట్టి స్వభావిశేషముగలవి. మెదడునైపు నెక్కుటవలన అచ్చట దుర్బలతనొందును. యీకారణమువలన శిరఃస్థానముగల పొరలయందు దోషము ఘనీభవించి మంటు, జిగు, కలుగజేసి, ఇట్టి జలకలిగించునట్టి ఆవిరిపరమాణువులు రోమరంధ్రములగుండా చెమటకలిగించును. మరియు యీఆవిరికారణము తిరిగి చెమటపుండి వెడలిపోవును. మరియు వలచనైనకొలది చెమ్మను జలుబును కలిగించును. విశేషమైనయెడల శుష్కత్వము జలుబు కలిగించును.

## —నఖ్యాసరోగ చికిత్స—

ఈవ్యాధియందు ఆవిరిపరమాణువులు దగ్ధమొందునట్టి తీక్ష్ణము గల మలమును కలిగించునట్టి తేజస్సుగలుగుచున్నది. కాబట్టి దోషప్రకృతిని నిజదశయందు తెచ్చునట్టిఉపాయములను చేయవలెను. మరియు చెమ్మను జలుబును కలిగించునుపాయములను చేయువలెను. మరియు మావుల్ జుబ్న అనగా పాలువిరిగినపిల్ప చల్లతేట ఇసప్గోలుగింజలు నానవేసినగుజ్జు బాలింతబోలు గసగసాలషర్బత్తు బనప్షాషర్బత్తు మొదలగునవి యిప్పించవలెను. అథవా వుచ్చకాయ పొడుగుకోవకాయరసము యీమొదలగునవి యిందులాభదాయకములు. మరియు మేకపాలు పటికిబెల్లముచేర్చి పానముచేయుటయును యవగంజి, కాఫీ, పాలు, మొదలగునవి యివ్వవలెను. ఇట్టి వుపయోగించుటవలన రోగము శాంతినొందనిచో కరక్కాయ [illegible]వందు సపిస్తాను అనగా శ్లేష్మాంతక మొదలగువాని కషాయము పర్పాటకపు కషాయము యీమొదలగు కషాయములయందు కలకండచేర్చిపానము చేయవలెను. దీనివలన ప్రకృతి నిర్మలమగును. మరియు యేవస్తువులు మలదోషమునుమాత్రము ద్వారా చెమటద్వారా వెడలించునో ఆవస్తువులను వుపయోగించి మలదోషమును తగ్గించవలెను. మరియు రోగి

బలముగలవాడైనయెడల మలము మూత్రములనుండియు చెమటనుండి యు వెళ్ళినను శిరావేదనము చేయవలసిన అవసరమున్నయెడల వైద్యు డు పరీక్షానుకూలముగా రోగిదశ కనిపెట్టి శిరావేదనముచేసి రక్తము వెడలించవలెను. మరియు మలమును తొలగించినవెనుక ప్రకృతిశాంతి నొంది ఆరోగ్యము కలుగుటకై పట్లు, కాపడములు, మరియు చల్లని తైలలేపనలు చేయవలెను.

ఇది శ్రీమదిమాంబేగ్ సాహేబు పౌత్ర వాచ్చా బేగ్ సాహేబు
పుత్ర భేషజ విద్వద్విధేయ రహంతుల్లాబేగ్
నామధేయ ప్రణీతంబైన
తిబ్బె అక్బర్ షాహి
అను గ్రంధమునందు
శిరోరోగ
అధ్యాయము.
సంపూర్ణము.



యాకరీముల్ మారూఫ్.
బిస్మిల్లా ఇర్రిహమానిర్రిహీం.

# తిబ్బె అక్బర్షాహీ.



మూడవ అధ్యాయము

## నేత్రరోగలక్షణములు





నేత్రిములు ఉపఅంగమన బడును. నేత్రములయందుగల జీవ నరములు, ప్రాణవాయువుసంబంధ మగు జీవాత్మనుండి సంచారమొం దినవి. మరియు, హృదయమునం దుగల రక్తసంబంధమగు జీవవా హినియను నరములు నేత్రిములయందు అల్లుకొని యున్నవి. మరియు నేత్రమునందు యేడుపొరలుండును. యిందు మూడు పొరలు వాతసం బంధముగలవి. వీటిని ప్రత్యేకదశయందు విస్తార పూర్వకముగావర్ణక్ర మాను సారముగా వేరు వేరు ప్రకరణలయందు చెప్పబడును.

(లాభము) నేత్రిములయొక్క ముఖ్యస్వభావిక ప్రికృతి ఉష్ణము తడిగలది. నేత్రిములు యిటుల ఉష్ణముచ్ను, తడియున్న లేకుండిన యెడల దీని ప్రికృతిస్వభావికము ముఖ్యముకానేరదు. మరియు, రెండవ సంయోగమువలన కలుగునది. మరియు, నేత్రిముయొక్క ప్రికృతి ఉష్ణదిన్నకము లెవ్వియనగా నేత్రములు వెంట వెంట చలించుచుండు

ట, అందు కాంతి మెరయుచుండుట, రంగు యెఱ్ఱగానుండుట, తాకి చూచిన వేడిగానుండుట, యీ మొదలగునవి వృష్ణలక్షణములు. జలబు లక్షణములు వీటికి విరుద్ధముగానుండును. చెమ్మలక్షణములు కండ్ల నుండి మకిలినీరు విశేషముగా వెడలుట, నేత్రములు పెద్దవగుట, మొదలగునవి చెమ్మలక్షణములు.

శుష్కచిన్నములు నేత్రములు చిన్నవగుట, మకిలినీరు స్రవించకుండుట, మరియు, లోభాగమునందు శుష్కత్వముకున్నచో తాకిన యెడల కఠినముగానుండుట మరియు, కరంజ్ నేత్ర (పిల్లికండ్లవంటికండ్లు) సంబంధముగు ఉష్ణమనియు గ్రహించవలెను. చెమ్మ రెండవ రంగుగల చెమ్మయందు కలుగుచున్నదని గ్రహించవలెను. మరియు, నల్లనిరంగు గల గ్రుడ్లయందు వృష్ణము చెమ్మ తక్కినరంగులకంటె అధికముగానుండును. కాబట్టి విశేషముగా నల్లగ్రుడ్డునందు నజూలుల్మా అనగా నీటి బిందువులు దిగుచున్నవి. యిటులనే వేరు వేరు వ్యాధులు పుట్టుచున్నవి. మరియు, పరమాణువుల విశేషత్వమువలన ఉత్పన్నమగుచున్నవి. శౌహలాఅంఖ్ అనగా నలువు మెరుపుగలకన్నులు సాధారణ స్వభావికముువలన కలుగుచున్నది. యథ్యాపి హేతువానుసారముగా నేత్రసంబంధముగు యావత్తురోగములను వేరు వేరు చికిత్సలను వర్ణించబడియున్నవిగాన గ్రహించవలెను.

మరియు, ప్రత్యేకముగా నేత్రసంబంధముగు పొరలయొక్క వాతసంబంధమగు వ్యాధులను వేరుప్రకరణములయందు వర్ణించబడును. ఇవి (1) సాధారణదుష్టప్రకృతివలన కలుగునది. (2) దోషయుక్త దుష్టప్రకృతివలన కలుగునది. (3) తఫర్రుఖె ఇస్తిసాల్ అనగా గాయము వాపు మొదలగునవి. (4) యీవ్యాధి నేత్రముల సమస్తభాగములయందు ఉత్పన్నమగును. అనగా నేత్రము బైటికి వచ్చుట, దీని సమానముగా రెండవ నేత్రముకూడా కొద్దిరోజులకు కలుగుట, యీ మొదలగు లక్షణములు నజూలాసంబంధమగు నేత్రరోగలక్షణములని గ్రహించవలెను.

## —నేత్రవ్యాధుల చికిత్స—

ఈనాలుగు విధములలో (1) సాధారణదుష్ట ప్రకృతిని స్థిరపరచ వలెను. (2) రెండవవ్యాధియందు మలమును వెడలించవలెను. (3) వ్యాధియందు వాపు గాయములను వుపాయమువలన తగ్గించవలెను. (4) నేత్రవ్యాధి విషయమై నేత్రసంబంధమగు ముఖమును బాగుచేయ వలెను. మరియు, కష్టము అనగా కన్నుయొక్క భాగముల సంయోగ ములయందు కలుగుచున్నది. ఆకష్టమును దూరపరచవలెను. సాధారణ ప్రకృతి తన నిజదశయందు మారినటుల అప్రధాన ప్రకృతినిరుద్ధముగా నుండు ఔషధములను యుపయోగించవలెను. అనగా అప్రధాన ప్రకృతి విరుద్ధముగా అనగా అప్రధానప్రకృతి ఉష్ణమైన యెడల కామంచి కాసిని కాహూ రసము, వన్నీరు, మరియు కోడిగ్రుడ్డు తెల్లసొన మొదలగు వస్తు వులను ప్రయోగించవలెను.

మరియు చల్లని ప్రకృతిఅయినచో కస్తూరి మమీరా అనగా వకచెట్టువేరు, వస, మిరియాలు, మరియు ఇంతకు వుష్ణస్వభావికమగు వస్తువులతో చేయబడిన ఔషధము వుపయోగించవలెను.

మరియు ప్రకృతి చెమ్మగలదైనయెడల మైలతుత్తము వెండిము లినము మొదలగు గుణముగల వస్తువులతో చేయబడిన ఔషధమును వుపయోగించవలెను.

మరియు శుష్కప్రకృతి అయినచో దీనిచికిత్సలయందు పాలు బాదంపప్పు, కోడిగ్రుడ్డు తెల్లసొన, ఇసప్‌గోలుగింజలగుజ్జు మరియు ఇట్టి గుణముగల యితరవస్తువులు యుపయోగించవలెను.

మరియు భోజన పానాదులయందుకూడా ప్రత్యేక కారణము యొక్క అనుకూలముగా వుపయోగించవలెను.

(లాభము) నేత్రమలము యేమవిధములుగా తీయబడునని గ్ర హించవలెను.

(1) యీవ్యాధులయందు భుజించునట్టి ఔషధము స్వల్పముగను, లఘువుగలదిగను, [illegible] ఉత్తమముగా నుండవలెను. అనగా అజీర్ణముకలిగించునట్టియు, [illegible] ని యెగరగొట్టునట్టియు వస్తువులను ఉపయోగించకూడదు. [illegible] సమశీతోష్ణముగలవియు, లఘువుగా జీర్ణించునట్టి వస్తువులను యుపయోగించవలెను.

(2) యీ నేత్రవ్యాధియందు శరీరమునందు మలమునిండియున్న యెడల ముందుగా మలమును తీసివేయవలెను. తరువాత ప్రకృతిని అనుసరించి రోగబలమునుబట్టి తగుచికిత్స చేయవలెను.

(3) యీ వ్యాధియందు మెదడును స్వాధీనపరచునట్టి ముఖ్యమగు వస్తువులతో స్థిరపరచి పిమ్మట గురులువేయవలెను అనగా రక్షలు వేయవలెను. అథవా పరేరుటను నరమునుగాని లేక, తత్సంబంధమగు నరమునుగాని ఛేదించి రక్తమును వెడలించుట యీవ్యాధియందు మిక్కిలి లాభదాయకము.

(4) యీవ్యాధియందు మలమును నాశికముద్వారా నస్యాముల వలన తుమ్ములను కలిగించి తీసివేయవలెను. దీనివలన నేత్రమునుండి మలము తిరిగిపోవును. యెందుకనగా నేత్రమార్గము అన్నిటి సమీపమున యున్నది. మరియు తుమ్ములను కలిగించునట్టి ఔషధములను ఉపయోగించుటవలన నేత్రములను శుభ్రపరచుటయందు మిక్కిలి గుణము కలిగించును. మరియు యెంతవరకు శరీరము శుద్ధినొందకుండునో అంత పర్యంతము మలము అగపడదు. మలము నిలిచేవరకు చికిత్సయందు ఆ రోగము కాకూడదు. యెందుకనగా శరీరమునందు మలము వెడలింపక నేత్రములకు చికిత్సచేయుటవలన హానిసంభవించును.

(5) నేత్రమునందుగల కొలికినరమును ఛేదించవలెను.

(6) నేత్రములయందు నీరు స్రవింపచేయునట్టి, వస్తువులతో నేత్రసంబంధమగు మలమును శుభ్రపరచవలెను. మరియు నేత్రముల

వెంట నీరువచ్చునట్టి వస్తువులను, ఉపయోగించుటయందున్ను, వరమును భేదించుటకున్ను, ముందుగా కోష్ఠమును శుద్ధిపరచుట అత్యావశ్యకము. ఇందువలన హానికలుగ గలభయముండనేరదు. మరియు శరీరము మలరహితమైనచో హాని కలుగజాలదు.

(7) మరియు కంటియందుగల వాపు యేఅంగమునుండి వచ్చుచున్నదో ఆఅంగమునందుండు మలము తొలగించి పరిశుభ్రత నొందించవలెను. మరియు ఆఅంగముయొక్క నుపాయములతో అనగా వాపు గాయములను తగ్గించి చెమ్మరానట్టి వుపాయములు ఔషధములు నుపయోగించవలెను.

మరియు చెమ్మను తగ్గించునట్టియు మిక్కిలి శుష్కత్వము కలుగకుండునట్టియు మంటను కలుగనియ్యకుండునట్టియు యీక్రిందివస్తువులను వుపయోగించుట మంచిది (1) సురమా. (2) కుంకుమపువ్వు. (3) మైల్ తుత్తం. (4) సఫెదా. (5) శాదనాజ్. అతసీ అనగా సిరిసెనగలతో సమానముగానుండు రాయి సుసాంబ్రం యీమొదలగువస్తువులు వుపయోగించవలెను. అనగా యీవస్తువుల ప్రకృతి నేత్రము ప్రకృతితో సమానముగా నుండును మరియు నేత్రములకు హానికలిగించునట్టి విరుద్ధప్రకృతిని స్వల్పముగా నష్టపరచుచున్నది. యీవస్తువులు నేత్రప్రకృతి ఉష్ణము చెమ్మగలదైనచో చెమ్మనుకలిగించునట్టి ఔషధములు నేత్రములకు నష్టము కలిగించును. అదియును స్వల్పముగా చెమ్మ కలిగించి మంటకలుగకుండునట్టి ఔషధము నేత్రములకు బలముకలిగించును. మరియు బలము వహించునట్టి అంగము రోగసంబంధమగు మలమును గ్రహించజాలదు. మరియు ఆరోగ్యము నొందించు నేత్రచికిత్సలయందు జ్ఞాపకముంచవలసినఅంశము అనగా నేత్రములను నిజదశయందు తెచ్చుట మరియు నేత్రఅవయవములయందు వుపద్రవములు వుత్పన్నమైనయెడల అట్టియుపద్రవములను దూరపరచుట ముఖ్యావశ్యకములు అనగా మలమును వెడలించుట రక్తమోక్షణముచేయుట

మొదలగునవి. మరియు అనేక కారణములవలన వుపద్రవములు కలుగుచున్నవి. అట్టి వుపద్రవములను ప్రత్యేకప్రత్యేక స్థలములయందు వర్ణించబడును.

(లాభము) నేత్రచికిత్సయందు ప్రథమమునందు నొప్పితో వాపు కూడా యున్నదా లేదా యని పరీక్షించవలెను. మరియు తలనొప్పితో కూడా వాపు కలిగినయెడల యేదోషమువలన కలిగినది యేదోష చిన్నములు బాగుగాప్రకటనమగుచున్నవి. మలము సర్వశరీరమునందున్నదా లేక కేవలము తలయందే యున్నదా అని పర్యాలోచించి అట్టిదోషములను గ్రహించవలెను.

మరియు మలము శరీరమునందున్నయెడల దోషానుసారముగా సర్వశరీరమునుండి మలమును తొలగించి పిమ్మట మెదడునందుగల మలమును తీసివేయవలెను. తత్పశ్చాత్ నేత్రములను శుద్ధపరచవలెను మరియు శరీరమలము పూర్ణరహితము కానియెడల నేత్రచికిత్స చేయకూడదు. మరియు మలమును నష్టపరచునట్టి ఔషధములను నేత్రములలో వేయకూడదు.

శరీరమునందు యెచ్చటనైనా వాపుకలిగి ఆవాపువలన తలనొప్పి అధికముగానున్న నేత్రములయందు నొప్పి వుత్పత్తి అయినయెడల విశేషకష్టము జ్ఞాపకశక్తి బొత్తిగా తగ్గిపోవుట ఇట్టివ్యాధిని ప్రత్యేకకారణముయొక్క అనుసారముగా సహాయములనుకూడా యథావిస్తారముగా వర్ణించబడును. ఇచ్చట సూక్ష్మరీతిగా వ్రాయుచున్నాను.

ఇట్టినేత్రసంబంధమగు మలము వాతసంబంధమగు చిక్కని దోషమువలన కలిగినయెడల వుచితమగు విరోచన ఔషధముద్వారా సర్వశరీరమును శుద్ధపరచవలెను. అనగా మసాంబరము మాత్రలుగాని లేక కౌకాయ మాత్రలుగాని ఉపయోగించి మెదడును శుద్ధపరచవలెను. మరియు విశేషమలమును పైనుండి తీసివేయవలెను. అనగా నేత్రములను మెంతిరసముగాని, పరిశుద్ధమగు పాలతోగాని కడుగవలెను.

మరియు శరీరము స్వాశ్చతనొందినది లేనిది గమనించి మలము వక్వ మైనయెడల పుచితఔషధముల నేత్రములయందు వేయవలెను. మరియు శరీరమునందు ఇతర స్థలములయందు యెచ్చటనైనను పలచని నీరువంటి మలము రక్త, పిత్తమునందు కలిసినయెడలనుండుగా అవశ్యకమని తోచినయెడల నరమును ఛేదించి రక్తమును తీసికోయవలెను. పిమ్మట విరోచనమునకు ఔషధమునిచ్చి తరువాత శిరోజములమును క్రిందికీడ్చవలెను. మరియు యెచ్చట వాతజమలము నిలిచియున్నదో పరిశోధించి ఆలోచించి, అట్టిమలమును నశింపజేయునట్టి వస్తువులను యుపయోగించుట మిక్కిలి లాభదాయకము.

మరియు శరీరముయొక్క భాగములయందు రక్తజమలము యున్నచో శిరావేదనముచేయుట మిక్కిలి లాభదాయకము. మరియు రక్తము విశేషము చిక్కగానుండినను నేత్రముల నరములు యారక్తముతో నిండియున్నను, శిరావేదనము చేయ జనదు. మరియు నరములు ఇట్టి దశయందునిండియున్నచో అభ్యంగనముచేయుట భోజనమునకు స్వాశ్చమగు లఘువదార్థములను శేవించుట మొదలగునవి లాభదాయకమగును. మరియు యాాజ్పైకరా, కౌకాయ మొదలగు మాత్రలు యివ్వవలెను. మరియు కనికలను ప్రయోగించవలెను. లేదా నీళ్ళతో అరుగ తీసి నేత్రములకు అంజనమువేయవలెను. మరియు మలమును నష్టపరుచునట్టియు, చిక్కని లోథిరమును పలచనచేయునట్టియు ఔషధమును కండ్లకు లేపనముచేయవలెను. మనము చేయు ట్టిరోగికి మధ్యపానభ్రాంతి కలిగినయెడల స్నానముచేయించి కొంచెము సారాయి పానముచేయించవలెను. మధ్యపానము మెదడునందు ఉష్ణము కలిగించును. మరియు అభ్యాసము లేనివారికి యివ్వకూడదు. సారాయి పానముచేయుట వలన మలబంధనముఅనగా పిటికను కలిగించును. మరియు రక్తమును పలచన చేయును. ప్రాణవాయువును చిక్కపరచి నలుపురంగు కలిగించును. మరియు నేత్రములయందు వాపు లేక మలము నేత్రములయందుండి

మొల్లప్పుడు స్రవించుచుండిన నిది. చికిత్సవలన కుదురనేరదు అనగా మలము తలపుర్రె పైభాగమునుండి వచ్చుచున్నదిగాన దీనిననుసారముగా నుపాయములను చేయవలెను. తలపుర్రె పైభాగమునుండి మలము వచ్చునట్టివ్యాధి లక్షణములు నేత్రము ముఖము యెర్రగానుండుట తలయందున్ను నొసలునందున్ను వుష్ణముగానుండుట తలనరబంధముగు నరములు బరువుగానుండుట మొదలగు లక్షణములు కలిగియుండును. గాన నేత్రరోగములయందు వైద్యులు జాగరూకులై వ్యాధిని గమనించి ఆయావ్యాధులకు తగిన చికిత్స చేయుట మంచిది.

## నేత్రరోగ చికిత్స.

రక్తమోక్షణము చేయుట విరోచనము చేయించుట మొదలగు వానివలన మెదడు స్వచ్ఛతనొందును, మరియు మెదడునకుపరిశుభ్రమగు నట్టి యుపాయములను చేయవలెను. మరియు నేత్రరోగములయందు చెప్పబడిన ఔషధములను నేత్రములయందు వుపయోగించవలెను.

(విశేష దృష్టవ్య) బాధగల నేత్రములయందు వుచితమగు చికిత్సలను చేసినను బాధతగ్గక వ్యాధి హరించకుండిన వుత్తమ చికిత్సలను చేయుమార్గమువదల కూడదు. యెందుకనగా చల్లని ప్రకృతిగల మలము మిక్కిలి చిక్కగా నున్నదనియు యీకారణమువలన వ్యాధి ఆలస్యముగా తగ్గుననియు యిట్టి మలమును పక్వపరచి వెడలించుటకు బహుకాలము పట్టుననియు గ్రహించి చికిత్స చేయుచుండవలెను.

(సూచనీయము) నేత్రమువలన యీక్రింది వివరించిన విధముగా రక్షించవలెను. అనగా కాపాడవలెను. కండ్లకు లాభకరమగు వస్తువులను వుపయోగించవలెను. మరియు, హానికరమగు వస్తువులను వర్జించవలెను. మరియు, యేయేవస్తువులు నేత్రములకు హానికలిగించునో అట్టి వస్తువులను వచించుచున్నాను అనగా (1) పొగ (2) దుమ్ము (3) విశేషగాలి (4) వేడిగాలి అనగా వడగాలి (5) చల్లగాలి (6) విశేషముగా [illegible] (7) తేజస్సుగల వస్తువులను చూచుట (8) మెల్లికలవరుం

డుట (9) మద్యపానము చేయుట (10) అన్యసంబంధమగు మత్తుపదార్థ ములను శేవించుట మొదలగునవి నేత్రరోగులు వర్జించవలెను. యిందు వలన నేత్రములకు నష్టము కలిగించును మరియు, నల్లమందు శేవించు టమాత్రము వర్జితముకాదు మరియు, అపక్వమగు వస్తువులను శేవించ కూడదు. అపక్వవస్తు శేవనవలన అపక్వవస్తువుల ఆకారమునుండి పరమాణువు లు మెదడునందు ప్రవేశించును. కాబట్టి అపక్వవస్తువులు మానివేయ వలెను. అనగా గింఢినా, ఉల్లి, తెల్లి మొదలగు వస్తువులను శేవిం చుట. మరియు, అజీర్ణకర పదార్థములను సేవించుట, విశేషముగా స్నానముచేయుట, విశేషరక్తమోక్షణము చేయుట విశేషముగా రక్తము వేయుట అధికనిద్ర అతిజాగరణము మిక్కిలి సంభాషణ మిక్కిలి లవణ పదార్థములు మిక్కుటముగా భుజించుట, మిక్కుటముగా భుజించిన వెంటనే నిద్రించుట, విశేషముగా భుజించుట, రాత్రికాలమునందు భుజించుట, అతిసంభోగము, మరియు చిక్కని క్షారమగు మద్యపాన ము చేయుట, మరియు ఆమాశయముయొక్క ముఖమును చెరచునట్టి వస్తువులు ఇవి యావత్తు నేత్రదృష్టి తేజస్సునందు హానిదాయకములు గాన యీవస్తువులను శేవించుట, జడచిత్తులసి, సోయి, జైతూన మొదలగువానిని శేవించుట, సూక్ష్మవస్తువులను చూచుట, చిన్నఅక్ష రములనుచూచి చదువుట యీ మొదలగునవి యావత్తు నేత్రములకు హానికలిగించును గాన నేత్రరోగులు యీయావత్తు పనులు మాని వేయవలెను.

మరియు, ఒక్కొకసమయమునందు పరిశ్రమరీతిగా పరిశ్రమ చేయుట మంచిది. మరియు, నేత్రములయందుపయోగించదగిన వస్తువు లు అనగా చల్లనిమంచినీళ్ళయందు కండ్లు తుడిచి నేత్రములు విప్పవ లెను. మరియు, సుర్మా, మైలతుత్తము, సోపు, దవనము, మరువము మొదలగు వస్తువుల కషాయమునందు అరుగదీసి కండ్లకు వుపయోగిం

చుటవలన నేత్రదృష్టియందు తేజస్సునొందించును. నేత్రములకు జలము కలిగించును. మరియు, దానిమ్మకాయతో చేయబడిన నల్లఔషధము న్ను సోవురనము నేత్రములయందు వేయుట మంచిది. యీ మొదలగు సంగతులను గ్రహించదగినవి.

---

# తబ్ కేసలబియా రోగవర్ణనము

నేత్రఅవయవముయొక్క చిత్రపటము.

1 ముల్తహిమా
2 కర్నియా
3 అనిబియా
4 అన్కబుతియా
5 సబకియా
6 ముసిమియా
7 సలిబియాఅను పొరలు 7 గలవు. నేత్రములలో మూడువిధముల నీరుకూడియుండును.
8 బైజియా




9 జుజైదియా 10 జుజాజియా ఈనీరు పొరలమధ్యభాగమునందున్నవి. వీటి వివరము క్రింద వర్ణించబడును. 11 ప్రకాశవాహిని 12 నల్లగ్రుడ్డు.

తబ్ అనగా మెదడునందుగల కఠినమగు ఝిల్లీపొరనుండి వచ్చని నరముద్వారా బైలువెడలి వచ్చునట్టి జీవసరము. దీనిని వైద్యులు మెదడుసంబంధమగు పొరలనుండి కలిగినదని చెప్పుటలేదు. ప్రతివైద్యులు ఝిల్లీపొరయని చెప్పుదురు.

మరియు, నేత్రమునందు ఆరుపొరలుగలవు. కాబట్టి ప్రత్యక్తపొరల యందు వాపు, శుష్కత్వము ముడుచుకొనుట, బలహీనత్వము కలుగుచుండును. యిట్లు కలుగు వ్యాధులను నాలుగు విధములుగా వర్ణించుచున్నాను.

(1) పొరయందు వాపుకలుగు విషయమై

ముఖ్యముగా యీపొరయందుగాని లేక పొరసంయోగమువలన గాని యీపొరయందు వాపుకలుగుట యిటుల వాపుకలుగుటవలన కలుగు చిహ్నములు నేత్రములు బైటికివచ్చినటుల కనుపించుట నేత్రములచుట్టు నొప్పిగా నుండుట మరియు వాపుసంబంధమగు మలము రుధిరదోషమైనయెడల దీని చిహ్నములు నేత్రములు లాగుట దురదకలుగుట మొదలగునవి ఒక్కొక్కసమయమునందు నేత్రములయందు మెచ్చుట దురదకలిగినదిన్నీ తెలియకుండుట మొదలగు లక్షణములు సంభవించును.

మరియు వాపుపిత్తసంబంధమైనయెడల నేత్రములయందు మంటకలుగుట, దీనిలక్షణములు. మరియు యీవాపుశ్లేష్మసంబంధమువలన కలిగినయెడల నేత్రములు బరువుగానుండుట రెప్పలు వ్రేలబడుట మొదలగు లక్షణములు కలిగియుండునని గ్రహించవలెను. యేదోషము లేకపోయినను నల్‌బియా అను పొరయందు వాపుకలిగి నేత్రము బైటికి వచ్చి నొప్పికలిగియుండును. నిది నల్‌బియా రోగలక్షణములని గ్రహించవలెను.

నల్‌బియారోగచికిత్స

రక్తసంబంధమగు నల్‌బియావ్యాధియందు సరేరు అను నరమును ఛేదించవలెను. మరియు శరీరమును మృధుత్వము నొందించుటకై లఘు ఔషధముల ప్రయోగములను చేయవలెను. అనగా కలువపూలు, బనప్‌షా, ఖితమి, వున్నాబ్, సపిస్తాన్, యవపిండి, నువ్వులనూనె మొదలగువానియందుకలకండచేర్చియివ్వవలెను. అధవా, ఉన్నాబ్, సపిస్తాన్,

అలూబఖరా, కలువపూలు, ఖికమీా, మెంతిపనియాలు మొదలగు
నవి కషాయముకాచి వడియబోసి అందు మాదీఫలపురసముచేర్చి పాన
ముచేయించవలెను. మరియు స్రవించుకట్టి మలము నిలిచిపోవును. తల
మలరహితమైనయెడల శియాఫెఅబియజ్ అనగా తెల్లని కనికెలు మెం
డు ధనియాలు కామంచి కషాయమునందు అరుగదీసి నేత్రములయందు
వేయవలెను.

### శియాఫెఅబియజ్ చేయుక్రమము.

నిశస్తా అనగా యెండించిన గోధుమసత్తు జింకరు కతిరా, ఇలియూ
వత్తు ప్రత్యేకము 7 మాషములు. సఫెదా 21 మాషము. నల్లమందు 1
మాషము 1రతి, 1 బిడ్యాపుగింజయెత్తు. యీవస్తువులు సూవత్తు కోడి
గుడ్డు తెల్లసొనతో నూరి కసికెలు చేయవలెను. దీనిని తెల్లశియాఫ
అందురు. దీనిని పైనచెప్పిన కషాయాదులలో అరగదీసి కండ్లలో
వేయవలెను.

(లాభము) మలమువలన కష్టపడునట్టి కంటియందు గారవేయ
వలెను. అనగా తైలసేవనముచేయవలెను. ఇట్లు పట్టువేయుటవలన
దుష్టమలము స్రవించుట తగ్గిపోవును. దుష్టమలము తగ్గేవరకు పట్టువే
యవలెను. గాని కంటిలో యేమియు వేయకూడదు. అనగా మిక్కిలి
తీవ్రమగు వస్తువులను కండ్లలోవేయుటవలన బాధఅధికమగును.

మరియు పిత్తదశయందు ప్రకృతిని రక్తదోషములయందు చెప్పి
న కషాయాములతో మృధుపరచి అటుపిమ్మట పొట్టుతీసిన యవలు తి
య్య బేదానా, కసుకోటి విత్తులపప్పు చూర్ణించి కొద్దిగా అంజరూద్
చేర్చి మొత్తము వస్తువులు నీళ్ళలోవేసి కషాయముకాచి వడియగట్టి
ఆకషాయమును కండ్లలోవేయవలెను. ఈకషాయము కాచుపద్ధతి చిన్న
మట్టిపాత్రయందు వస్తువులనువుంచి అందు మంచినీళ్ళుపోసి మరియొక
పెద్దపాత్రయందు నీళ్లుపోసి ఆకుండలో వస్తువులువేసిన పాత్రయుంచి
పొయ్యిమీద పెట్టి కాచవలెను. క్రిందకుండయందుండు నీళ్ళుకాగిచిన్న

పాత్రయందుంచి ఎండు వస్తుసారము దిగువరకు కాచవలెను. తదుపరి అందు
కొంచెము అంజరూద్ చేర్పవలెను. అనగా అంజరూద్ విశేషముగా
చేర్పబడినయెడల కంటికందు మిక్కిలి కోతకలిగించి రంధ్రమువేయు
స్వభావికముగలదు. అంజరూద్ అనగా ఒకవిధమగు చెట్టుజిగురు.
మరియు, తబఖేసలబియా, పిత్తజవాపునందు యీకషాయము కండ్లలో
వేయుట మిక్కిలి లాభదాయకము. దానిమ్మగుజ్జు, కాసిని లేతచిగుళ్ళు
యీరెండు వస్తువులనునూరి గుల్‌రోగన్ కలిపి కండ్లపై లేపనముచేయ
వలెను. అనగా పట్టువేయవలెను.

మరియు, కఫసంబంధమగు వాపునందు మలమును వక్వపరచి
శోధించి తీసివేసిన తరువాత రూమిమస్తకి తైలము, కస్తూరి, జూపా,
కషాయములో కలిపి నశ్యముచేయవలెను అథవా, తుమ్మచెక్క, వే
యించిన నల్లజీలకర్ర, కుంకుమపువ్వు యీవస్తువులను మెత్తగానూరి
పీల్చవలెను. యిట్లు నశ్యము చేయుటవలన తుమ్ముకలుగును. యీమొద
లగు వుపాయములు రతూబత్ అనగా నీరువెడలించుటకని గ్రహించ
వలెను. యిట్లు మలము వెడలుటవలన మెదడు స్వాశ్చతనొందును. ఈ
వ్యాధిగల మలము మెదడునందు ఖనీభవించిన యెడల మలము స్తంభిం
చి బాధనమేర్పడును. అటుల బంధనమేర్పడుటవలన సుద్దాను అనగా
తలనూపత్తు ఆక్రమించియుండు తలనొప్పి. మరియు నిది మెదడుయొక్క
లోపటిపొరయందు అనగా మూనికస్ పేరుగల పొరయందు మూనికస్
అనగా మెదడునందు నిలిచియుండునట్టి ఝిల్లిమూనికస్ మెదడుయొక్క
లోపటిపొరతో చేరియున్నవి. యిందువలననే మెదడునందు నిలిచియు
న్న కఠినఝిల్లియందు వుపద్రవముకలిగినచో దానిద్వారా తబకేసల్
బియా అనగా కంటిపొరయందు వాపు ఉత్పన్నమగుచున్నది. దీనిలక్ష
ణములు కంటికో భాగమునందుండి కన్ను బైటికివచ్చుట, కన్నుమెరు
పులేకుండుట, అనగా మలము నేత్రముయొక్క లోభాగమునందుండని
కారణమువలన నేత్రములు మెరుపుయుండనేరవు. మరియు, దీనిని తగ్గిం

చునచుపాయుములు చికిత్సలు సుద్ధాయుబైజయూ అను వ్యాధియందు చెప్పబడునుగాన చదువరులు గ్రహించెదరు గాక

—౨ వ. భేద శుష్కత్వ నలబియూ లక్షణములు.—

దీనిచిన్నః ములు కంటిమొదలునందు నొప్పికలుగుట కన్ను వెనుక భాగమునకు యీాడ్చుట యీామొదలగులక్షణములుశుష్కత్వనలబియూ యందు కలుగునని గ్రహించవలెను.

—శుష్కనలబియూ చికిత్స—

శరీరము, మెదడు, కండ్లు దీని ప్రకృతియందు చెమ్మకలిగించుటకై జలుబుగల వస్తువులను వుపయోగించవలెను. మరియు చెమ్మకలిగించునట్టి మధ్యతులు వుపయోగించవలెను. మరియు మేకపాలు తలపై పోయుట నశ్యముచేయుట మంచిది. బనప్షాతైలము నశ్యముచేయుట లాభదాయకము నేత్రములను బంధించి యుంచవలెను. యిట్లుచేయుట వలన శుష్కత్వము కలుగనేరదు. యెందుకనగా నడచునట్టి కారణము వలన గాలితగిలి ఉష్ణము ఉత్పత్తియగును. గాన చెమ్మను ఆర్చివేయును.

—౩ వ తబకెనలబియూ వర్ణనము.

ఈవ్యాధియందు మెదడునందుగల పొరచుట్టుకొనుచున్నది. ఈ పొరచుట్టుకొనుటకు రెండుకారణములుగలవు. (1) కారణము కంటికి వుష్ణగాలి తగులుటవలన రతూబతు అనగా నీరు జజాజియూ అనగా కలిగిననీనమువలెనుండు కంటినీరు. మరియు జుజైదియూ అన నీరుమంచు వలెనుండును. తబకెనలబియూ అనగా నేత్రములపొర నట్టనడుమనున్నది. ఈపొర శుష్కించిపోవును. మరియు రక్తదశ నొందనికారణమువలన రతూబతెజుజైదియూ అనగా మంచువలెనుండు నీరు తబకెనబకియూ అనగా కంటిమధ్యపొర. మరియు తబకెముశిమియూ అనగా కండ్లపొర తబకెనలబియూయందు నిలిచిపోవును. అనగా తబకెనలబియూక్రింద

మరియొకటి ఇటువంటి పరిదేశముండను. దీనిపై పుతిరిగి స్వయముగా యెండి చుట్టుకొనును. ఈపొర శల్యములతో చేరి యుండును. గనుకనే తనలోతాను చుట్టుకొనుచున్నది.

2 వ భేదము నేత్రములకు విశేషముగా యెండతగులుటవలన నేత్రములను బంధించుటవలన నేత్రసంబంధమగుపొరలు నేత్రసంబంధమగు నీరు బిగిసిపోవును. మరియు ఒకదానితరువాత మరియొకటి దాని క్రిందనుండువాని సహాయమును పొందుచుండును తబకెసలబియూఅను కంటిపొరవరకుచేరి తదుపరి సలబియా వ్యక్త కారణమువలన తనకుతాను చుట్టుకొనును. మరియు వ్యక్త నేత్రసంబంధమగు పొరముడుచుకొనుటకు చిన్నశములు రోగికి తనకన్ను మరియొకదానిలో చుట్టుకొనినటుల తోచును. మరియు దీనితోకూడా యేదోపకవైపుకన్ను బైటికివెళ్ళివచ్చును. ఇటుల కన్నువేరైబడినవైపు బిగించినటుల తోచుచుండును.

—తబకెసలబియాచికిత్స.—

ఇల్తభా అనగా చుట్టుకొనిపోవుటకు కారణములు. వడగాలివలనగాని లేక గట్టిగా కట్టుటవలనగాని కలిగినయెడల ప్రకృతిని కాపాడుటకు యత్నించవలెను. మరియు భుజించునట్టియు పానము చేయునట్టియు కాచునట్టియు స్నానము చేయునట్టియు తైలమర్దనలుచేయునట్టియు చెమ్మగల ఔషధములను లేపనచేయుటయు నాశికముద్వారా ఔషధమును పీల్చుటయు నశ్యములను చేయుటయు యీమొదలగు నుపాయములను చేయుచుండవలెను.

(లాభము) ప్రథమదశయందు చెమ్మగలిగించుటకు కారణమేమనగా వుష్ణమగు గాలివలన శుష్కత్వము కలిగినయెడల అట్టి శుష్కత్వమును దూరపరచునట్టి వుపాయములను చెప్పబడుచున్నవి. మరియు గట్టిగా బిగించికట్టుకట్టుటవలన వుత్పన్నమైనయెడల అచ్చటచెమ్మను కలిగించుటకు కారణమేమనగా కండ్లపొరలు నీరు మృదుత్వము నిర్వ్యయో

జనముగల్పై నిజదళయందు సహజముగా రాగలవు. కాబట్టి ప్రథమము నందు చెమ్మను కలిగించుట మంచిదని చెప్పుచున్నాను.

నేత్రములపొరలు నీర్సపడుటవలన కలుగులక్షణములు. నేత్రపొరలయందు చెమ్మ దుష్టప్రకృతి సాధారణమైనదిగాని లేక దోషయుక్తమైనదిగాని యీవ్యాధియందు అనగా అరోగియొక్క నేత్రము క్రిందికి జారి వ్రేలాడుచున్నదను సందేహము తోచుచుండును. మరియు కండ్లను కదలునటులచేయు నరములు దుర్బలము జెందుటవలన నరములు జారి పోవుటవలన రోగి పైచూపుచూచుటకు కఠినముగాయుండును.

మరియు సాధారణదుష్టప్రకృతి అయినయెడల శోకము నొప్పి రహితముగా నుండును. దీని చిహ్నములు దోషయుక్తమైనయెడల దుఃఖము నొప్పి అవశ్యముగానుండును. మరియు మలము అధికముగాగాని స్వల్పముగాగాని యుండినయెడల పోటు, పీకుట, సంభవించును. దోషానుసారముగా నొప్పియందు విశేషబాధ లఘుత్వము తీక్ష్ణత్వము కలుగునుగాన దోషానుకూలముగా చికిత్సచేయవలెను.

నేత్రపొరలు సచ్చుపడునట్టి వ్యాధి చికిత్స

మలమును పక్వమునొందించిన పెచుక శరీరమునకున్ను, మెదడునకున్ను వుచితమగు మాత్రిలతోనున్ను యారాజ్ యిత్యాది ఔషధములతో స్వచ్ఛతనొందించవలెను. పిమ్మట పరిధానాంగమును బాగుచేయుటకై వుచితమగు గండూషముల చేయవలెను. మరియు, మస్తగి, రాతినజ్, వన యీవస్తువులు వేరు వేరుగా బీజరహిత దాత్రిపండ్లతో కలిపి నమలించవలెను. మరియు, పక్షులమాంసము వేయించిగాని లేక యిట్టి గుణముగల యితరవస్తువులు చెమ్మను ఆర్పునట్టి వస్తువులను భోజనమునకు యివ్వవలెను. మరియు, దోషయుక్త దుష్టప్రకృతియందు నరము చచ్చుపడునట్టి కారణముగాని లేక రక్తజదోషకారణమువలనగాని లేక కఫజదోషకారణమువలనగాని కలిగిన యెడల శిరా

వేదనము చేయవలెను. * తదుపరి శూలము ప్రశమునొందించునట్టి బలముగల విరోచనము చేయించునట్టి ఔషధములను వుపయోగించవలెను.

{ నేత్రిమూలయొక్క ముశీమియా అను పొరయందు కలుగు రోగలక్షణములు }

ఈపొరయొక్క కల్పనము మెదడుయొక్క మెత్తని ఝిల్లిపొర పక్కనుండి బైలువెడలిన రక్తసంబంధమగు నరము అనగా దీనిని యకృత్ సంబంధమగు నరమందురు. ప్రాణవాయువుగల నరము. యీ నరము హృదయమునుండి వెడలుచున్నది. అనగా మెదడు సంబంధమగు మెత్తని ఝిల్లి యకృత్ సంబంధమగు రక్తనాళము హృదయ సంబంధమగు జీవనరము మొదలగువాని నాశ్రయించియుండు పొర దీనిని ముశీమియా అందురు. దీనిని ముశీమియా అనుటకు కారణమేమనగా సబికియాపైన కప్పుకొనియున్నది. అనగా ముశీమియా గర్భస్థానమునందుండు శిశువుపై కప్పుకొనియుండు పొరపేరు. అందువలననే

* శిరావేదనము చేయుటవలన గలుగు వుపకారములు రక్తజదశయందు ప్రకటమగుచున్నవి. మరియు, కఫజదశయందు ప్రకృతి శక్తి, ఆయువు, ఋతువు, వర్షము, మొదలగునవి అనుకూలముగా నున్న యెడల రక్తము క్షీణముచేయుటవలన మిక్కిలి లాభముకలదు. అనగా రక్తము,దోషములను సంగ్రహించి పెరుగెత్తుటయందు మిక్కిలి సామర్థ్యముగలది. కాబట్టి రక్తమోక్షణము చేయుటవలన కఫదోషముకూడా వెడలిపోవును. యిందువలననే రక్తమోక్షణమువలన సంపూర్ణదోషములను నిస్సారముచేయుచున్నది. మరియు, శరీరమునందు శుష్కత్వము కలిగించుట అవశ్యముగాన సరహోఅజ్బాబ్ అను గ్రంథకర్తగారు బుద్ధిమంతులగు వైద్యవరులు పక్షవాత వ్యాధి ఆరంభమునందుకూడా రక్తము వెడలించుటకు అంతు యిచ్చుచున్నారు. మరియు ముందు రక్తము వెడలించుటకై నరమును వెడల్పుగా ఛేదించుటకు వీలుగానుండవలెననియు రక్తము వెడలునట్టి కారణమువలన నరము వెడల్పు అగుననియు ఔషధములతో బాగు చేయవలెననియు నరము వెడల్పు అగుటవలన మలమునడిపించుటకున్ను తీసివేయుటకున్ను సహజముగా యుండునని వచించియున్నారు.

దీనిపేరు ముశీమియా పెట్టియున్నారు. ముశీమియా అనగా గర్భస్థానము. మరియు, ముశీమియా హృదయసంబంధమగు నరముల విశేషత్వము వలననే రూపమునందు కలియుచున్నది. యెందుకనగా ఈపొరయందు నరములు విశేషముగా యున్నవి. మరియు, రెండవ పొరయొక్క రతూబత్ అనగా నీరు వచ్చుటకు మార్గమైయున్నది. యిందువలననే రక్తజరోగములు ఇందులో విశేషముగా నుత్పన్నమగుచున్నవి. మరియు, యిందు యేదైన యుపద్రవము ఉత్పన్నమై నేత్రసంబంధమగు నీరును చెరచుచున్నది. యెటులననగా సబికియా పుట్టి సబికియా పొరతో పుష్టి నొందుచున్నది. మరియు, తన భాగమును గ్రహించి మిగిలిన దానిని బాగుచేసి జుజాజియా అను రతూబత్ అనగా నీరు చేయుచున్నది.

మరియు తనభాగమును పుచ్చుకొని మిగిలినభాగమును బాగుజేసి జులైదియా అనునీరు చేయుచున్నది. ఇందువలన ముసిమియా అను పొరయందు యేకష్టము కలిగినను కష్టమువలన కలుగుపొరము అచ్చటనుండి వచ్చుచున్నది. అచ్చట చెడిపోవుచున్నది. ఒక్కొక్కప్పుడు ముశీమియా అను పొరవాచుటవలన అసబెముజబ్బిఫా అను వచ్చుని రంగుగల జీవనరము మెదడునుండి కంటిలోపలికి వచ్చియున్నది. అచ్చట నేత్రసంబంధమగు వెలుగు యుండునట్టి స్థానము ఈవాపువలన అణగిపోవుచున్నది. మరియు దృష్టి దుర్బలముచేయుచున్నది. మరియు యీ పొరయందు వ్యాధి కలుగుటవలన కలుగు చిహ్నములు అనగా నేత్రములయొక్క వెనుకవైపు అనగా పొడవు వెడల్పునందు మెరుపు పుత్పత్తియగును. మరియు నేత్ర ఆవరణమునందు అనగా ముసిమియాస్థలమునందు నొప్పిగానుండును.

## ముశీమియాపొరరోగచికిత్స.

ఈవ్యాధియందు రక్తమోక్షణముచేయుట వుచితస్థానమునందు రక్షలువేయుట కొమ్ములతో రక్తముతీయుట జలగలను బట్టించుట మృదువగువస్తువులతో శరీరమును మెత్తపరచుట అనగా ఇసప్గోలుగింజలు

బార్తంగ్, కామంచిఆకులు, మొదలగువస్తువులువకటిగాచేర్చి కషాయ
ముకాచిఆకషాయమునందురసాంజనముగానిశియా ఫెలభియజ్గాని అర
గదీసికండ్లలోవేయుటఇత్యాదివుపాయములతో రోగముమశాంతినొందిం
చవలెను. మరియు ఖర్జూరవుకాయలునూరి ఇనబ్గోలుగుజ్జుకొద్దిగా శిర
కా గుల్రోగన్, అందుకలిపి కంటిపై పట్టువేయవలెను. మరియుశియా
ఫెఅలియజ్ అను ఔషధము రక్తకాంతిని తగ్గించుటయందు అద్వితీయ
మైనదిగాన యిక్కాలి స్వల్పముగా వేయవలెను. ఇందువలన హానికలుగ
నేరదు. అనగా దీనిని విశేషముగా వాడుటవలన రక్తమును అపక్వము
నొందించును. రోమాంచములయందు నిలిచిపోవును. యీకారణము
వలననే మలము శుభ్రపరచుటకు ముందుదీనిని కండ్లయందు వేయుట
వర్జించియున్నారు. అనగా పైన వర్ణించబడియున్నది.

## సబకియా పొరయందు కలుగు రోగలక్షణములు.

ఈపొర అసబెతు జిచ్విఫా అనుపొరప్రక్కనుండివుత్పత్తి అయినది.
మరియు నిది జుజాజియా తథా జులైదియా ఽతూబతు అనగా నీరుపై
ని వీటివెనుకవైవునుండి కలిగినదై వీనితో అంటుకొనియుండును. అన
గా జులైదియా మరియు బైజియా అనగా నేత్రముయొక్క గ్రుడ్డు తెల్ల
నికాంతికలిగియుండు నీరు మధ్యనున్నది. ఈకారణమువలన యీపొర
యీరెండువిధముల నీళ్ళను ఆక్రమించియున్నది. అనగా నీళ్ళనుచుట్టు
కొనియున్నది. ఈకారణమువలన దీని అర్థానుసారముగా దీనిపేరు శబకి
యా అనిపెట్టబడియె మరియు కారణమువలన కూడా దీనిని సబకియా
అనుచున్నారు. అనగా మృదువగు ఝిల్లీపొరనుండి విశేషముగా నర
ములు యీపొరయందువచ్చియున్నవి. కాబట్టి నిది వల యాకారముగా
నరములతో అల్లుకొనియున్నది. మరియు కొందరువైద్యులు దీనిని పొర
యని భావించరు. యెందుకనగా వారిమతమునందు పొరఒకవస్తువును
కప్పబడి యుండవలెనని యందురు. ఈసందర్భమును గమనమునందుం

బిరి గాని సబకియా యిటులకాదు వారిమతమునందుకూడా నేత్రహార యని భావించబడుచున్నది.

నేత్రవ్యాధులయందు యేవ్యాధి యీహారవలన కలుగువ్యాధు లకంటె మిక్కిలి కఠినమైన వ్యాధి వేరులేదని గ్రహించవలెను. దీనికి రెండు కారణములు గలవు. (1) ఔషధశక్తి యింతవరకు ప్రవేశపెట్టుట చాలాదుస్తరము. మరియు, పైలేపన అయినను నేత్రములయం దుప యోగించినను ఔషధశక్తి రోగస్థానమునందు ప్రవేశించనేరదు. (2) యీహార రెండవ వస్తువును వేగిరము గ్రహించుచున్నది. మరియు, యీహారయందు నరములు విశేషముగానున్నవి. కాబట్టి విశేషమలము హారయందు స్రవించుచుండును. మరియు, అచ్చట నిలిచియుండు కార ణమువలననున్న యీహార రతూబతె జలీదియా సమీపమునందున్నది. మరియు, అనబెముజ్జవ్విఫాతో కలిసియున్నది. గనుక ప్రాణవాయువు యొక్క ప్రకాశము ఉష్ణముగలది. యీహారయొక్క ఉపద్రవము హాని జలిదియా అనబెముజ్జవ్విఫాలోచేరుచున్నది. యీహారయందు అయిదు విధముల రోగములు కలుగుచున్నవి.

యరకాన్ అనగా కమలవాత. లక్షణములు.

ఈరోగము కంటిలోపల యుత్పత్తియగును. ఈరోగము కలిగిన వెంటనే నీరుస్రవించనారంభించును. నీరుస్రవించుటకు కారణము కమల వాతమునందు నీరుస్రవించవు. దీనికారణమేమనగా యీవ్యాధి కేవల ము తబకెముల్ తహీమా అనగా నేత్రముపై నాక్రమించియుండు మొద టిహారనైయీహార రంగుగలదైనయెడల కమలవాతమునకు విరుద్ధముగా నుండును. యెటులననగా యిందులో నేత్రము శుష్కించి నీరుస్రవించు ట తటస్థించును. అనగా దీనిమలము సబకియా అను హారయందు కలు గుచున్నది. మరియు నేత్రము వెంట నీళ్ళు స్రవించుటకుకారణము స్వల్ప పిత్తము సబకియా అను హారయందు పడుచున్నది. ఈహారయొక్క జ్ఞాన శక్తి తేజస్సుగలిగియుండును. కాబట్టి అధిక కష్టము సంభవించి ఈపిత్త

మును జలిదియాయందు ప్రవేశపెట్టుచున్నది. అనగా రసమును ప్రవేశ పెట్టుటవలన యీపిత్తము యీపత్తు పొరలయందు ఆక్రమించుకొనును గాన యీపత్తు పొరలను తనస్వభావికరంగు కలిగించుచున్నది. మరియు నీళ్ళతో జేరి బైటికివెడలుచున్నది.

## యరకాన్ అనగా కమలవాత చికిత్స.

ఈవ్యాధియందు అవసరమున్నచో సరేరు అనునరమును ఛేదించి రక్తమోక్షణము చేయించవలెను. తదుపరి కరక్కాయలకషాయముతో శరీరమును మృదుపరచవలెను. శోధనానంతరము శియాప్ అబియజ్ ఆడశిశువుగల తల్లిచనుపాలయందు కలిపి కండ్లలో పోయవలెను. మరియు ఇసప్గోలుగింజలగుజ్జు కాశిసిరసము కోడిగ్రుడ్డు తెల్లసొన గుల్ రోగన్ యీమొదలగునవి పకటిగాచేర్చి కండ్లపై పట్టువేయవలెను. మరియు మలముయొక్క తీవ్రతయందు దుర్బలము ప్రకటనమైనచో తగ్గనారంభించును. మరియు శేషించిన మలమును వెడలించుటకై బనప్షా ఖితమి బాబూనా అకలీలుల్ మలిక్ యీమొదలగు వస్తువులను కషాయముకాచి ఆకషాయముతో ఆవిరిపట్టవలెను.

(౨) ఈవ్యాధి మలసంబంధమగు బంధనము పొరలయొక్క నరములయందు కలుగుచున్నది. ఈకారణమువలన ఐతూబతేజాజాజియా అనగా కంటి సంబంధమగునీరు జలిదియాయందు ప్రవహించునట్టి రసము నిలిచిపోవును యెందుకనగా యీరసము ప్రథమమునందు ముశిమియా అనుపొరనుండి సబ్కియా పొరయందు చేరుచున్నది. మరియు సబకియాపొరనుండి జాజాజియా మరియు జలిదియా రతూబత్ అనగా నీరునందు చేరుచున్నది. ఇట్లు చేరునట్టినీరు యీసమయమునందు సబకియా అనుపొరయందు బంధనమేర్పడుటవలన అవశ్యముగా వుక్తరతూబతు అనగా నీరునందు రసము ప్రవేశించుట నిలిచిపోవును. మరియు ఈ యీపొరయందు తిమ్మిరికలుగుటకు చిన్నములు యేమనగా కన్ను లోభాగమునకులాగికొనిపోవుట మరియు కన్నునిండిపోవుట కంటియం

దు రతూబత్ అనగా నీరు ప్రకటనముకాజా-కపోవును గాన రోగికండ్లు నొప్పి కలిగియుండుట మొదలగు లక్షణములు కలిగియుండును.

౨౮వ. కమలవాత చికిత్స.

ఈరోగమునందు శిరావేదనము చేయుట ఉత్తమము. మరియు, శరీరము స్వస్థతనొంది బంధనమును విడదీయుటకై శికింజబీన్, బిజూరి, మరియు, దేశీయ ఔషధములను సేవించవలెను. మరియు, బంధనము అనగా ముడి విడిపోయిన వెనుక నేత్రము ఆరోగ్యము నొందుటకై శేషించియున్న శుష్కత్వమును తొలగించుటకై చెమ్మను కలిగించునట్టి ఔషధములను నేత్రములయందు వేయవలెను. మరియు, సర్వశరీరమునకు చెమ్మకలిగించుటకు నుపాయములను చేయవలెను. మరియు, నేత్రములు తమ నిజదశయందు రానియెడల బంధనము విడదీయకముందు మిక్కిలి చెమ్మకలిగించునట్టి ఔషధములను యుపయోగించుట వలన యేమియు లాభము కలుగనేరదు. ఒక్కొకప్పుడు నరములు నిండి నరములయందు పీసు తటస్తించిన యెడల విశేషహాని కలిగించును.

(౩) రుధిరజ కమలవాత లక్షణములు.

(౩) వ. ఈవ్యాధియందు నబకియా అను పొరతో చేరియుండు నరమునందు యేదో ఒక నరముయొక్క ముక్కము చిట్లిపోయిన యెడల ఆనరమునుండి విశేషముగా రుధిరము వెడలి తబకెము ల్తహిమా అనగా నేత్రము పైభాగమునందుండు వలచవి పొరయందు వచ్చుచుండును. మరియు, తబకెఇనబియా అనగా నేత్రము పైభాగమునందుగల మూడవపొర. మరియు, తబకెకర్నియా అనగా నేత్రముపైనుండు రెండవ పొర. దీనిక్రింద ఇటుల అనారోగ్యముగా నుండును. మరియు, యీకారణమువలన కేవలము మల్తహిమా అనుపొర కుళ్ళిపోవును. కాబట్టి తెలుపు, నలుపు రంగులను త్రోసివేయును. అనగా ఇచ్చట మలము తబకెకర్నియా, తబకెఇనబియా, యందుకూడా కలిగినయెడల తెలుపు, నలుపురంగులను త్రోయజాలదు. మరియు, యెప్పుడును ఉత్తరుధిర

ము కేవలము కంటిరెప్పలయందు చేయుచున్నది. ఇది ఒకరెప్పయందు గాని, లేక రెండురెప్పలయందుగాని వృద్ధియు చేయనట్టి కారణమువలన కనురెప్పలు ఉబ్బుచున్నవి. కనురెప్పలుబ్బుటవలన కన్నులిప్పుటకు కష్టముగా నుండును మరియొకప్పుడు ముల్తహిమాఅను పొరయందున్న రెప్పలయందున్న రక్తము ప్రవహించుచుండును. ముల్తహిమాఅను కంటిపొరయందున్న కంటిరెప్పలయందుకూడా జనించుచున్నది. అనగా యీరోగకారణము సబికియాఅను పొరయందు కలుగుచున్నది యీకారణమువలన యీపొరయొక్క రోగము గ్రహించబడును.

మరియు, ఒక్కొక్క ప్రత్యేక దశానుసారముగా రెప్పలరోగమందు భావించుదురు యీవాపు సూక్ష్మనరములు చిట్లుటవలన ముల్తహిమాపొరయందున్న, రెప్పలయందున్న ఉత్పన్నమగును. అనగా ముల్తహిమాఅను పొర రెప్పలతోకలసియుండును. ఇట్టిదశయందు సబకియాఅను పొరతో యేమి సంబంధము కలుగకుండును. మరియు, యీవాపు పసిబిడ్డలకు విశేషముగా కలుగునని గ్రహించవలెను దీనిని బద్దీనజ్ అని వాడబడును. యీవ్యాధి పెద్దలకు కలిగినయెడల సీగ్ అని చెప్పుచున్నారు. యీవ్యాధి పిల్లలకుమాత్రము విశేషముగా కలుగును.

(లాభము) కంటితెల్లగ్రుడ్డువాచుటకు కారణము. ముల్తహిమా పొరయందు మలము చేయుచున్నది. మరియు, రెప్పలు వాచుట, బైటివైపుకు తిరుగబడుట మొదలగునవి దీనిచిన్నెలు. మలము రెప్పలయందు చేరుటవలన రెప్పలు విశేషముగా ఉబ్బుచున్నవి. యెల్లప్పుడు రెప్పలు కదలించజాలకుండును మరియు, కండ్లు కనుపించవు. ఒకప్పుడు రెప్పలు లోభాగము చిట్లిపోవును. ఇట్లుచిట్లుటవలన రెప్పలనుండి విశేషముగా రక్తము స్రవించుచుండును. అప్పుడప్పుడు మలము వృద్ధిగతి నొందినయెడల రెప్పలలో గుల్లలు లేవనారంభించును.

## అంకుశ రుధిరజనకములనాళ చికిత్సలు

ఈవ్యాధియందు అవశ్యముకలిగినయెడల సరేయఅనువరమును ఛేదించి తలవెనుక రెండువైపులయందు రక్షలువేయవలెను. విశేష రక్తముతీసివేయవలెను. ఇట్లుచేయుటవలన బాధతగ్గనియెడల కరకాయకషాయము, చింతపండు, మాడిఫలరసము మొదలగువానితో శరీరమునకు మృదుత్వమునొందించవలెను. ఇటుల అనేకపర్యాయములు ఉపయోగించి తదుపరి మలమును వెడలించవలెను. దీనివలన శక్తి నిలిచియుండును. విశేషముగాభుజించకూడదు అనగా లఘువుగాభుజించవలెను. మొదటిదినము మొదలు మూడవదినము నాలుగవదినము వరకు కేవలముచనుపాలు మాత్రము కండ్లలో వేయవలెను. అథవా, పిస్తాకాయబెరడు చిరసెనగలు రసాంజనము దానిమ్మకాయగుజ్జు, నూరి కాశిని ఆకులు కాశినిగింజలు మొదలగువి నీరు వేరుగా గాని వకటిగా చేర్చిగాని నూరిఅందులో గుల్‌రోగన్ అనగా గులాబిపూలతో చేయబడిన నూనె కలిపి కండ్లపై పట్టువేయవలెను మూడవ నాలుగవ దినమునందు శియాప్ జరూరె బలకాయ తయారుచేసి పరిశుభ్రమగు చనుపాలయందు కలిపిగాని లేక ఇసబ్‌గోలుగింజల గుజ్జునందుగాని లేక బేదానాగింజల గుజ్జుయందుగాని అరగదీసి రెప్పలపైపట్టువేయవలెను. మరియు 7 దినములతరువాత జరూరె అస్పరెనగీను అనగా చిన్నది. మరియు శియాఫేఅహమరెలయ్యాన్ మరియు జరూరేసీమాసీమ్ జరూరె అబియజ్ నగము జరూరేఅజఫర్ కలిపి ఉపయోగించవలెను. ఇట్లుచేయునప్పుడు వ్యాధితగ్గనారంభించును. అప్పుడు జరూరేఅజఫర్ కబీర్ అనగాపెద్దది వుపయోగించవలెను. మరియు కనురెప్పవాచి గాయమై కఠినముగా తెరవబడినయెడల యీవుపాయములవలన యేమిబాధము ప్రాప్తించనిచో జరూరేఅగరబ్ వుపయోగించవలెను. మరియు జరూరె రెప్పలపై చేయవలెనుగాని, కంటిలోవలమాత్రము వేయకూడదు. రో

గలంతము...దు, రెప్పలయందు పురక ఉత్పన్నమైనచో శియాపెలబి యజ్తోగాని అహాపేర్గలయ్యాన్తోగాని రెప్పలను గీరవలెను.

జరూరే * మలాము చేయుక్రమము.

గాడిదెపా ... శుద్ధిచేయబడిన అంజరూద్, నిశస్తా అనగా గోధుమసత్తు, ... నాలుగువస్తువులు సమానముగా చేర్చి చూర్ణించి వస్త్రగాలితము చేసియుంచుకొని సమయానుకూలముగా వుపయోగించవలెను.

2 మందూ ఔషధములకంటె బ...గుణగల ఔషధము.

శుద్ధిచేసిన అంజరూద్ 35 మాషములు, కలకండ 10½ మాషములు, గోధుమసత్తు 3½ మాషములు, సముద్రపునురుగు 1¾ మాషము యీవస్తువులను నూరి వస్త్రగాలితమొనర్చి యుపయోగించవలెను.

జరూరెలజఫర్, నగీర్ అను ఔషధమును కరనియాపొరయొక్క వెనుక అధ్యాయమునందు చెప్పబడినది.

శియాఫెలహామరెయ్యాన్ చేయుక్రమము.

శాదనజ్ అదసీ మగనూల్ అనగా చిరిశెనగలతో సమానముగా నుండు పకవిధమగు రాయి. విధిపూర్వకముగా శుద్ధిచేసినది. 32 మాషములు. 28 మాషము తాంబ్రభస్మము, శుద్ధిచేసినముత్యములు, ఆకుపత్రి ఇవి ప్రత్యేకప్రత్యేకము 14 మాషములు, తుమ్మజిగురు కతిరాఅనగా బాదంజిగురు, శుద్ధిచేసిన బాలంలబోలు, యివి ప్రత్యేకము 7 మాషములు కహారోబా, కుంకుమపువ్వు, యివిప్రత్యేకము 3½ మాషములు. ఈ వస్తువులనుచూర్ణించి, వస్త్రగాలితమొనరించి కేవలము ద్రాక్షసారాయితోనూరి కనికెలుచేసి యుంచవలెను. దీనిని శియాఫ్ అహామరెలయ్యాన్ అనుచున్నారు.

* జరూరె అనగా యెండువస్తువులను చూర్ణించి ఆచూర్ణమును నేత్రములయందుగాని వ్రణములయందుగాని చల్లుటకు జరూరె అందురు.

## జరూరెమామానీమ్

అనగా జరూరెములతోయూ, మరియూ అజఫరెనగీరు యీరెం డవుషధములు సమానముగాచేర్చి కలుపు టవలన దానిని జరూరెని మానీమ్ అందురు.

## జరూరెజఫర్ బీర్ చేయు క్రమము.

శుద్ధిచేసిన అంజరూద్ 24½ మాషములు, కుంకుమ పువ్వు 10 మాషములు, మామిసా 7½ మాషములు, మునాంబరాసా నల్లమందు గోధుమసత్తు, గులాబిపూలు యివి ప్రత్యేకము 1½ మాషములు పాల మడ్డి 6 తులములు యీవస్తువులు జతగాచేర్చి చూర్ణించి వస్త్రగా లితిమొనరించి యుంచుకొని వుపయోగించవలెను మరియు, ఈరెండు ఔషధములున్ను ఖరాబాదీకబీర్ అను గ్రంథమునుండి సంగ్రహించ బడెను.

## ఘరియొక వర్దీనజ్ అను వ్యాధిలక్షణములు

ఒక విధమగు వర్దీనజ్ అను వ్యాధి కలుగుచున్నది. యీవ్యాధి బహులస్త్రీలతుగా ఉత్పన్నమగును. యీవ్యాధి కండ్లయందు శుష్కత్వ ము కలుగుటవలన కండ్లయందుపోటు విశేషముగా నంభవించి యేమి తోచక అగమ్యగోచరుడై యుండును. మరియు ఇట్టి కష్టమునంభవిం చినను కన్నుయెరుపుగాని, వాపుగాని యుండనేరదు. గాని తలపురెి మాత్రము కాలిపోయినటులతోచుట మొదలగు లక్షణములుగల వ్యా ధిని వర్దీనజ్అని చెప్పుదురు.

## వర్దీనజ్వ్యాధి చికిత్స.

శరీరమునందు,నేత్రములయందు ప్రకృతిస్థిరపరచుటకై పరిశోధి చేయవలెను. అనగా చెమ్మను కలిగించవలెను. మరియు ఆవిరి పరమా ణువులను మెదడునందు చేరకుండునటుల ఆపవలెను.

4 వ వ్యాధి సుద్రాయుహదకా అనగా కంటిగ్రుడ్డునందు కలుగు నొప్పిపేరు. మరియు, శాకికెరింర్ అనగా నిది కంటిచుట్టు పోటు కలుగువ్యాధి. మరియు, సూదితో పొడచినటుల పోటుకలుగును. ఒక్కొకప్పుడు పోటులేకుండును. మరియుదానికి పార్శ్వపునొప్పియు కలుగుచున్నది. యీనొప్పి నూనెలు కారణముల వలన కలుగుచున్నది. (1) యీ వ్యాధి కలిగించునట్టి నరములు సబికియూల పొరంగో కలిసి యుండును. ఆనరములయందు మేదోవమువలన బంధనము యేర్పడి మార్గములు బంధించబడును. అందుండి చెడు ఆవిరి పరమాణువులు బైలుదేరును. శరీరము ఆ ఆవిరి పరమాణువులను దూరంచేయుటకై ప్రాణవాయువును శుభ్రపరచుటకు హృదయసంబంధమగు నరములకు బలపూర్వకముగా నడిపించుచుండును. గాన, యీవ్యాధి కలుగుచున్నది. దీనిని కన్ను పోటు అందురు,

## 1వ. కన్నుపోటు చికిత్స

మలమును శుభ్రపరచుటకై యారజ్ మాత్రలను వుపయోగించవలెను. మరియు, కణతలయందు జలగలను పట్టించి రక్తముతీయించవలెను. యిట్లు చేయుటవలన రోగము శాంతినొందును. యీకారణమువలన దీనిని వర్ణింపబడినది.

## 2వ. కన్నుపోటు లక్షణములు.

ఈరోగము కలుగుటకు కారణము రుధిరము, ఉష్ణము కలిసి యుండుటవలన ఉష్ణఆవిరి పరమాణువులు ఆరక్తమునుండి బైలువెడలి పోటుకలిగించును.

## 2వ. కన్నుపోటు చికిత్స

ఈరోగమునందు ఉష్ణప్రకోపము తగ్గించుటకై చల్లని ఔషధములు ఉపయోగించవలెను. మరియు, వుచితమని తోచిన యెడల రక్తమోక్షణము చేయవలెను.

(శీ)వ వ్యాకరణము. యీరోగము నామమునకు హృదయసంబంధ మగు నరములయందు మలమునిండి నరములు యీ మలముతో సంపూ ర్ణముగానిండి పిమ్మట కఠినముగా యేర్పడి పొంగి వచ్చిన శిరది కన్నులోపల నొప్పిని కలిగించును, దీనిని పొందిన మనుష్యుని నేత్రములయొక్క శబకియా పొరయందు ప్రవేశించిన యెడల యిట్టి స్థితి కలుగును అర్ధతల నొప్పి మరియు, కణతలయందు పోటు పుట్టుచున్నది. వృత్తములకు విశేషము గా కలిగినయెడల సంభవించు ఒక పార్శ్వమునొప్పి కంటినరము గ్రుడ్డు నందు శూలకలిగించునని కొందరిమతము.

(లాభము) హృదయసంబంధమగు గుల్లనరములయందు మలము నిండి ఒకటిగాచేరి ఘనీభవించిన యెడల యీవ్యాధి జనిస్తించును. ఇట్లు కలుగురోగము రెండువిధములుగా వర్ణించబడినది. అందు (1) హృదయ మునందు హృదయసంబంధమగు మలముయొక్క దోషము హృదయ నరములయందు ఘనీభవించుచున్నది (2) యకృత్ సంబంధమగు గుల్లనరముల మలము ప్రాణవాయువు సంబంధమగు నరముల శాఖల నుండి ప్రాణసంబంధమగు నరముల మధ్యను హృదయ సంబంధనరముల యందు చేరుచున్నది.

శీవ. కన్నుపోటు చికిత్స.

పార్శ్వపునొప్పియందు చెప్పబడిన చికిత్స యీవ్యాధియందు ఉపయోగించునని గ్రహించవలెను. మరియు, ఆవశ్యకమని తోచినచో శిరావేదనము చేయవలెను. మరియు, విరోచనఔషధములను వుప యోగించవలెను. అదురునట్టి నరములను బంధించవలెను. యీరోగము యొక్క చికిత్సయందు అసావధానముగా యుండక తత్క్షణమె చికిత్స చేయవలెను. శిరావేదనచేయుటలో త్వరపడవలెను. యిటుల చేయుట వలన గొప్ప గొప్ప దుఃఖములు భయము తొలంగును. మరియు, యీగ్రంథకర్త యీవ్యాధిని నిజూలుల్ మా అనగా కంటియందు నీరు దిగుటగాని లేక పొరలు వెడల్చుచేయుచున్నది. మరియు, రతూబతె జై

జియా యనగా కంటినీరు చెడుచున్నది. కాబట్టి శిరావేదనము చేయుటలో త్వరితముగా చేయవలెను. మరియు, చికిత్సలో ఆలశ్యముచేయ కూడదు. ఆలశ్యముచేసిన యెడల యితర వ్యాధులను కలిగించుటకు కారణమగునని వచించిరి.

## నేత్రములయందు వేయునట్టి ఔషధములు.

ఎఱ్ఱకూరరసమునందు సియాంఘా మామిసా అనగా వక చెట్టుజాతి. దీనికి జలు గసగసాలతో సమానముగాయుండును. రసాంజనము కోడి గ్రుడ్డుతెల్లసొన ఆడశిశువుస్త్రీపాలు గుల్‌రోగన్ మొదలగునవి వకటిగా చేర్చి కండ్లలో పోయవలెను. తలనొప్పి యెమరు వలన విశేషకష్టముగా యున్నచో తీక్ష్ణమగు జిగటగల వస్తువులను కాగితమునకు పట్టించి కణతలకు వేయవలెను. ఈ ఔషధమును చేయుపద్ధతి అనగా కాశినివిత్తులు కావాలివిత్తులు, యివి వక్కొక్కటియు 7 మాషములు రసాంజనము 10న్నర మాషములు నల్లమందు 1⅓ మాషములు. యీ మొదలగువస్తువులనునూరి ఇసప్‌గోలు గింజలగుజ్జు నందుకలిపి బట్టకుగాని కాగితమునకుగాని 3న్నర మాషములు లేపనముచేసి కణతలపై అంటించవలెను. దీనివలన సుఖత్వము కలుగును, ఇటులచేయుటవలన తలనొప్పిహరించును. మలము నశింపజేయును.

(5) ఈరోగము పొరలయందు తక్రయకెత్తిసాల్ యందు రణముగాని వాపుగాని పుట్టుచున్నదగును. తిరిగి ప్రకాశముకూడా దీనియందు ఆక్రమించియున్నది. ఇట్టిస్థితియందు కంటి నల్లభాగములయందును చేరి కంటి రతుబతు అనగా సిరలను ప్రవేశించి దృష్టిని వకేవరియాయును నశింపజేయును. ఈవ్యాధిని ఇన్తిశారయాన్‌నూర్ అని చెప్పుదురు. మరియు జజూమె అదజాశల్ ఐన్ అనికూడా చెప్పుదురు. అనగా కన్నుయొక్క యావత్తుభాగములయందుగల ప్రకాశమును చెడుపునట్టి వ్యాధిఅనిఅర్థ

ము. యీవ్యాధియందు యేచికిత్సచేయుటకున్ను చికిత్సచెప్పబడియుండ లేదు. కారణమేమనగా యీవ్యాధి ఆరంభదశయందే దృష్టినిచేరిచి నేత్రాంగములను భంగపరచును.

## రతూబత్ జుజాజియా అనగా కండ్ల సంబంధమగు నీరు యందు కలుగురోగములు

జుజాజియా అనగా కంటిసంబంధమగునీరు అనగా ఉద్రవము. నీరు స్వచ్ఛముగను చిక్కగను తెల్లగానుండు రంగునందు కొంచెము మెరుపుకలిగి కరిగించినగాజువలెయుండును. గనుకనే దీనిని జుజాజియా అని పేరుపెట్టుటకు కారణమైనది ఈనీరు జులైదియా అనునీరుయొక్క వెనుకభాగమునందు జులైదియా అను నీరునకు విశేషముగా ఆక్రమించుకొనియున్నది. మరియు దీనిద్వారా జులైదియాలో రసమునుచేరుచుచున్నది. యీసంబంధమగు వ్యాధులు నేత్రసంబంధమగు యావత్తు వ్యాధులకంటె చికిత్సచేయుటయందు మిక్కిలి కఠినముగా నుండును. యెందుకనగా ఔషధము కండ్లయందున్న కండ్లపై భాగమునందు యుపయోగించుదురు గాని యీవ్యాధులు మిక్కిలిలోభాగమునందు కలుగుటవలన ఔషధముయొక్కశక్తి అంతవరకు ప్రవేశించుటకు మిక్కిలి ఆలశ్యమగునని గ్రహించవలెను. మరియు యీనీరు సంబంధమగు వ్యాధులలో రెండువ్యాధులు ముఖ్యమైనవి (1) యీనీరునందు రసముచేరకుండును. ఇట్లు రసముచేరకుండుటకు రెండుకారణములు గలవు- (1) అచ్చటరసము ప్రవేశపెట్టునట్టి నరములయందుగల మార్గములు బంధించబడియుండును. (౨) మలముని శేషముగా తీయుటవలన ఇటులనేయితరకారణములవలన కష్టము కలుగును. ఇందువలన శుష్కత్వము ప్రవేశించి వ్యాధిసంభవించును. దీనిచిహ్నములు అనగా రోగినేత్రములను

కదలించినాలగుచుట పంటిక్రింద్ర రాయి గుల్లుగాని రాయి గానియుండి క్రొమ్మరొకచుట్టువలె భ్రమించుట సూర్య కిరణములను బొత్తుగా చూడలేకపోవుట వెలుగునహించ జాలకుండుట రెండునేత్రములు పైభాగమున కీచ్చుట కండ్లవెంట నీరు స్రవించకుండుట మొదలగునవి మలసంబంధమగు బంధనమువలన కలుగులక్షణములని గ్రహించవలెను మరియు, ఒకొక్కప్పుడు నరములు పూర్ణముగా నుండిన యెడల నేత్రసంబంధమగు నీరుసంబంధ్యతిరేకముగా నేత్రములలో నీరు స్రవించుచుండును. ఒకప్పుడు రోగి చెవుల వెంబడి చీమువంటి పదార్థము స్రవించనారంభించును. నోరు చప్పగానుండును. మరియు, కండ్లవెంట నీరు స్రవించుట చెవుల వెంట చీముకారుట నోరు చప్పగానుండుట యీ మొదలగునవి మలబంధనమువలన రసము ప్రవేశించని స్థలమునుండి ఉత్పత్తియగుచున్నవి. మరియు, బంధనముగల కారణమువలన రసము ప్రవహించకుండును. కాబట్టి అచ్చట శుష్కత్వమేర్పడి నేత్రములలో భాగమునకు సిద్ధమగుచున్నవి, గాని బంధనముల చిన్నలు లేమికూడా కనుపించవు. అయినను బంధనముయొక్క వుపద్రవమువలన రెండవ అంగమును చేరదీ యీ వ్యాధి కలిగించుటకు కారణమగుచున్నది.

## నేత్రసంబంధమగు నీరు చికిత్స

ఈ వ్యాధియందు రసము ప్రవేశించుటకు కారణము బంధనముకలిగి యున్న యెడల దీని అనుసారముగా విరోచనమునకు ఔషధముల నిచ్చి దోషబంధనము అనగా పిటికె మారిపోయినట్టి సహాయములను చేయవలెను. మరియు, అచ్చటి మాంసము చల్లగానున్న యెడల సోపు, ముంబ గడ్డి, పాపిలీగె, పాచిలీగె తుంగ, మొదలగు వికషాయములకాగి మరిబహు ధీరాడుత్తోడనే కలిపి పానము చేయవలెను మలము ఉష్ణముగానున్న యెడల శీనివిత్తులు, అతిమధురము, తామంచి, ద్రాక్షపండ్లు, బేదానా, పర్పాటకము యీ మొదలగు వస్తువులు కషాయముకాచి సాదా

శికింజబీన్ కలిపి యివ్వవలెను. క్షణక్షణమునకు బాధకలుగుటవలన బాధ
నము బహుతీవ్రముగా కలుగును కాబట్టి చెమ్మను కలిగించుటకై
ఖుర్ఫాబిజా, ఖతమియా ఆకులు నూరి కోడిగ్రుడ్డు తెల్లసొన బనఫ్షా తైల
ము యీవస్తువులను కలిపి కండ్లకు లేపనము చేయవలెను తరువాత శియా
ఫ్ అబియజ్ ఆడశిశువు తల్లిపాలలో అరగదీసి నేత్రములలో వేయవ
లెను. మరియు, బనఫ్షా తైలముతో నశ్యముచేయవలెను

మరియు రసముచేరని కారణమువలన శుష్కత్వము కలిగినను,
నరములు చిట్లిపోయినను చెమ్మకలిగించు విషయమై మిక్కిలి పరిశ్రమ
చేయవలెను. అనగా చనుపాలు తలపై వేయుచుండవలెను. లఘువగు
రుచి అనుసారముగా పథ్యకర ఆహారపదార్థములను భుజించవలెను. మరి
యు, చెమ్మను కలిగించునట్టి తైలాములతో నశ్యముచేయుట యీతై
లము తలకు మర్ధించుట మొదలగునవి లాభదాయకములు.

(2) యీవ్యాధియందు కండ్లు వాపులేకనే పెద్దవగును. రోగికం
డ్లుత్రిప్పుటకు మూయుటకు కష్టముగా నుండును. ఆయాసముమీద విప్ప
గలుగును మరియు, కండ్లు విప్పినప్పుడు నేత్రములు పూర్తిగా పడునేమో
యని సందేహము తోచుచుండును. యీ కారణమువలన నేత్రములు
పెద్దవగుచుండును. దీనిని అరబ్బిభాషయందు హాజుల్ఐన్ అని చెప్పు
దురు. అనగా కండ్లు బైటికివచ్చుట అని అర్థము. కండ్లుబైటికివచ్చుటకు
రెండు కారణములుగలవు (1) అచ్చటనున్న నరములలో యీనీరు సం
బంధమగు రసము ప్రవేశించి నరములు వెడల్పు అయినందున రసము విశే
షముగా చేరును. కాబట్టి వృక్తములము యీరసముతో చెమ్మగిలి అవ
శ్యముగాతన స్థలమునుండి బైటికివచ్చును. మరియు, కండ్లు బైటికివచ్చు
ట, వుబ్బుట, కీసుపోవుచుండుట, అరచుటకు మాటలాడుటకు నొప్పిగా
నుండుట యిట్టిసమయమునందు తటస్థించును. మరియు శ్వాసబిగబట్టి
నట్లు తోచుట దీనియందుకూడా నరములు విశాలమగుటకు ఒకభేద
ము కలదు. విశాలమగుట వలన కలుగు చిన్నములు. నేత్రము వెంట

చిక్కని జిగురుగల చమురువంటి నీరు వెడలుట యని గ్రహించవలెను. (2) రెండవ కారణము మలము పొరలయందు ప్రవేశించుట. ఆపొరలు యీమలము విశేషముగా స్రవించుటవలన యెర్రబడును. అనగా స్త్రీలకు రజోధర్మము నిలిచిన కారణమువలన గర్భకాలమందు కలుగునటుల యీవ్యాధియందుకూడా కలుగునని గ్రహించవలెను. మరియు, వెనుక చెప్పినవ్యాధి కఠినము కాదు. మరియు, యీవ్యాధిని హాజాజ్ అను రతూబత్ జుజాజియా రోగమునందు చేర్చుట, ఆలోచించుట అసంభవము. యెందుకనగా యిది తెల్లిసంబంధమగు యావత్తు పొరలయందు వుత్పన్నమగును.

### నేత్రము పైకొచ్చునట్టి వ్యాధిచికిత్స

తల శుభ్రపరచుటకై శిరావేదనము చేయవలెను. మరియు రక్తులు వేయవలెను. ప స్తిగ్మవలన విరోచన ఔషధములవలన విరోచనము చేయించవలెను. మరియు, సాధారణముగా శరీరమును పరిశుభ్రపరచిన వెనుక కండ్లు శుభ్రపరచుటకై మలము హరించి నశింపజేయునట్టియు నేత్రములయందుండి స్రవించునీరు తీసివేయునట్టివిన్ని మొదలగువానిని హరింపజేయునట్టి అరక్కాయలు, పిప్పళ్లు, సరుల్లిసనము, సోపురసము, అజామోదపురసము మొదలగువాటితో ప్రత్యేక ప్రత్యేకముగా శియాఫ్ సమాగ్ అను ఔషధము అరగదీసి నేత్రములలో వేయవలెను. మరియు స్వల్పముగా భుజించుట, సముస్సడకస్సలకంటె మిక్కిలి లాభదాయకము. యెట్లనగా మలముయొక్క సహాయ్యమును హరించును. నేత్రములు పైకివచ్చుటకున్ను, నేత్రరోగముల అంతమందున్ను, విశేషలాభదాయకములగు ఔషధములను వేరు వేరు అధ్యాయములయందు వర్ణించబడి యున్నది.

# తూబతె జులైదియా అనగా నేత్రసంబంధమగు నీరు లక్షణములు



ఈనీరు నేత్రములు యొక్క ఆపత్తు భాగములకంటె శ్రేష్టమైనవి. యెందుకనగా ప్రధానమగు దృష్టి యీనీరుతో సంబంధము కలిగియుండును. శేషభాగములు దీని అధీనమైయుండును. యిందునలన యిది నేత్రములయందు వృష్ఠిత్తిలయినది. యిది, ముందుగడ్డతో సమానమగు రంగు కలిగి స్థిరముగాయున్నది. గనుకనే దీనిని జుదిలైదియా అనిపిలువబడును. దీని ఆకారము గుండ్రముగా యుండును. కాబట్టి దీనిని బర్‌దియా అనగా వడిగళ్ళు అని యుండొరు గాన అరబ్బిలో జల్ బరిప్ (వడిగళ్లు) అనుచున్నారు. మరియు బర్‌ద్ అనగా వడిగండ్లు అని అర్థము. మరియు, జులైదియా యొక్క ముందుభాగము వెడల్పుగను వరువవలెనుండును. వెనుకభాగము పొడవుగా నుండును. మరియు, ముందుభాగము వరువవలె నుండుటవలన పోరమయొక్క భారము యిందుపై పడుటకు అధికస్థలము కలుగును మరియు క్షుద్రపదార్థములకుకూడా అధికభాగము కలుగును. మరియు వెనుకభాగము పొడవుగా నుండుటవలన అనబెము జవ్విఘాయయందు రూపము యొక్క ఛాయబాగుగా కనుపించును. మరియు యీనీరునందు రోగము సంయోగమువలన ఉత్పన్నమగును. ఆరోగములు విశేషముగా యుండును. అచ్చట ఒకటిగా నుండునుగాన దీనిని యిందు రెండు భేదములతో చెప్పుచున్నారు.

## సంయోగమువలన ఉత్పన్నమగు రోగభేదములు

ఈరోగములు ఆరువిధములుగానుండును. యీ నీరుయొక్క ఆకారము మారిపోవును. యిది ఆరువైపులలో నేదోనొకవైపుకు అల్లుకొనిపోవును. యిందువలన నిది 6 విధములుగా మారునని చెప్పితిని.

(1) నీరు వెలుపలివైపు అనగా క్రింది భాగమునకు దిగిపోవుట. నీరుయొక్క కార్యములు జుజాజియా అను నీరు తగ్గుటవలన కలుగుచున్నవి. అనగా శబకియా అను పొరయందు నీరుబంధించబడుటవలన గాని నీరుయొక్క రసము జులేదియా అను పొరయందు ప్రవేశించును. యిందు విషయమై ప్రత్యేక ప్రత్యేక స్థలములయందు వర్ణించబడినది.

(2) రతూబత్ అనగా నీరు యెండు భాగమునందు ప్రవేశించి బైటికివచ్చుట యీ అంశము రెండు విధములుగా నుండును. మరియు, జుజాజియా అను నీరు తడిసి చెమ్మగిలును. యిటుల చెమ్మయగుట వలన బైటిభాగమునకు వచ్చును. దీనిని జుజాజియా సంబంధమగు రోగములయందు వర్ణించబడియున్నది. యిచ్చట నరములు దీని వేగరమును శాంతినొందించుచున్నవి. యిట్టి కారణమువలన నరములు పట్టు వదలి కండ్లు బైటికివచ్చును, గాని కండ్లు పెద్దవికావు. మరియు, హిజూజ్ అనగా కండ్లు పైకివచ్చుటవలన ఆనీరుతో జుజాజియా తడుచుటవలన వుత్పన్నమగును. జుజాజియా తడుచుటవలన కండ్లు బైటికి వచ్చిన యెడల కండ్లు అవశ్యముగా పెద్దవగును.

—సంయోగమువలన కలుగు కంటినీరువ్యాధి చికిత్స—

ఈవ్యాధినీరు జూజెజ్ నుఖాయి అనగా కండ్లు బైటికివచ్చుట జారిపోవుటకు వుపాయములు ముతలఖ్ ఇస్తఖా అనగా జారుట పట్టు వదలుట అని అర్థము. యీవ్యాధి ప్రకరణమునందు చెప్పబడియున్నది. శేషించిన నాలుగు విధములయందు జులైదియా అను నీరు మొదటి భాగమునందున్ను, రెండవదానియందు కుడిభాగమునకున్ను, మూడవ దానియందు పైభాగమునకున్ను, నాలుగవదానియందు క్రిందిభాగము నకు దిగిపోవును. యిట్లు దిగుట రెండు విధములు.

(1) మొదటిది యెడమ కుడివైపులకు నీరు చేరినయెడల అంతట ప్రత్యేకవస్తువు వెడల్పుగా కాన్పించుచుండును.

(౨) నీరుపైభాగమును క్రిందిభాగమునందు చేరిన యెడల అనగా ఒకకంటినీరు పైభాగముగను, రెండవదాని నీరు క్రిందనుండి ఒకటి తన నిజదశయందున్న, రెండవది పైకి క్రిందికి నున్నయెడల అట్టిదశయందు యేవస్తువు అయినను రెండు కండ్లకు చూచిన యెడల ఆవస్తువు కను పించును. అట్టి వ్యాధిగలవానికి హాబిల్ అనగా మెల్ల అందురు యీ వ్యాధిని వేరుగా వర్ణించబడును.

—సంయోగమువలన వుప్పన్నమగు రెండవ భేదము.—

ఈవ్యాధియందు రతూబత్ అనగా నీరు యొక్క రంగు అల్లు కొనును. యిట్లు కంటిరంగు మారుటకు మూడు విధములుగా చెప్ప బడును.

(౧) ఇచ్చట నీరు జులైదియా యొక్క రంగు మార్చివేయును. మరియు, అధిక దోషము రంగు అనుసారముగా కలుగుచున్నది. అనగా యెరుపురంగుగాగాని, పసుపురంగుగాగాని, తెలుపురంగుగాని, నలుపు రంగుగాగాని మారును. మరియు, యీరోగమునందు ప్రత్యేకమగువ స్తువు ఆరంగుగా అనగా కన్నురంగుతో సమానముగా కనుపించును. మరియు యీనీరు రంగువలె కనుపించునని భావము.

(౨) ఈనీరుపై మలముగాని చెమ్మగాని లేక శుష్కత్వముగాని అనగా శుష్కత్వము నొందినదిగాని చెమ్మగలదిగాని జులైదియాయొక్క సంయోగమువలన అధికమగును. దీనివర్ణనము ముందుచెప్పబడును.

(౩) జులైదియాయందు గరిగాని కఠినత్వముగాని కలుగనేరదు. యెటులననగా అనబెముజవ్విఫా అనగా కంటి గుల్లనరము నధిక జులై దియా మలమును ఆక్రమించినది. ఈగుల్లనరమునందు గరి ప్రవేశించు టకు కారణమేమనగా మంట కలిగించునట్టియు విశేష అజీర్ణకరమైనట్టి యు తీక్ష్ణత్వము చురుకు గలదియగు శుష్కదోషము మెదడునందుండి యీగుల్లనరముపై స్రవించుచున్నయెడల మంటకుముందు కండ్లవెంట నీరు స్రవించునటులచేయును. తిరిగి గుల్లనరమునందు గరి వుత్పన్నమగు

ను. ఈగుల్లనరముయొక్క గిరివలన నీరు జులైదియాయందుకూడా గరిప్రవేశించును. మరియు అసబవమూజబ్బిఫా స్వాభావికమగు మృధుత్వ మున్ను నిర్మలత్వమున్ను వుత్పత్తి కలిగించును. దీని కారణములు రెండు విధములుగా నుండును. (1) అందు మొదటి కారణము రూపము రంగు మరియు వికాశము సహజముగా మారిపోవును. (2) యిచ్చట ప్రకాశము ఈగుల్లనరముతో జులైదియాపై కుక వచ్చును. అచ్చట దీని స్వాభావికము యేమియు మారకుండును. సహజముగా వెడలుచున్నది. జులైదియా అనునీరునందు గరి ప్రవేశించుటకు కలుగులక్షణములు గలవు అనగా దృష్టియందు దుర్బలమువచ్చుట అట్టిసమయమునందు నేత్రములు త్రిప్పునయెడల కంటిగ్రుడ్డునందు చురుకు గరి నుండుట కన్ను నిలిచి పోయినటులనుండుట మొదలగు లక్షణములు కలిగియుండును. యెందుకనగా జులైదియా అనునీరు ఇనకబుతియా అను కంటిపొరనుండి స్రవించుచున్నది. ఒకప్పుడు ఇన్కబుతియా మలముయొక్క తీక్ష్ణత్వమువలన బిద్దగును ఇట్లుబద్దలగు వ్యాధికి నుపాయముయేమియు తోచలేదు.

## జులైదియా అనుకంటినీరు సంబంధమగు వ్యాధి చికిత్స.

ఈక్రిందవివరించిన వస్తువులతో తలను శుభ్రపరచవలెను. ఇందు విషయమై మద్యశ్రేణియందు వృష్ణము కలుగును. అనగా అఫస్నతీన్ గులాబివువ్వు, మామిమస్తకి, నుపాంబరము, యీ మొదలగువస్తువులు మరియు ప్రకృతిని బాగుచేయుటకున్ను చురుకు తగ్గించుటకున్ను వుచిత భోజనమును సేవించవలెను, మరియు బనప్షాతైలము ఆడశిశువుగల స్త్రీపాలు కోడిగ్రుడ్డుసొల్లసొన యివి కలిపి నశ్యము చేయవలెను మరియు గుల్రోగన్ పన్నీరులో దిండువలెకట్టిన బట్టతడిపి కండ్లపై వేయవలెను. మలమును శోధించుటకై యేయే ఔషధములయందు మద్యశ్రేణి వృష్ణముకలదో ఆవస్తువులను వినియోగించవలెను. అనగా విశేషవృష్ణముగల ఔషధములు మెదడుసంబంధమగు వృష్ణమును అధికపరచుచున్నవి. మరియు చల్లనిఔషధములు నేత్రభాగములను చెరచి దృష్టి సంబంధమగు ప్రాణ

వాయువుకు చికిత్సవరచుచున్నది. మరియు సుద్యుల్లేణి వృద్ధుడుగల ఔషధములు సర్వవ్యాధులయందు లాభదాయకముగాన వానియొంలిమాత్రము కలిగించనేరవు.

(లాభము) యీరోగమునందు దృష్టి దుర్బలమగుటకు కారణము జులైదియా అను నీరు జిగటగను మరియు శుభ్రముగను వుత్పత్తి అయినది. ఇందువలన చూచునట్టి వస్తుస్వరూపముఇచ్ఛానుసారముగా అందులో ఆకర్షించబడుచున్నది. ఇట్టినమయమునందు యీనీరునందు గుణము లేనియెడల చురుకును కలిగించునట్టి కారణము దానియొక్క కొన్ని భాగములయందుగాని పైనగాని కలిగినయెడల రూపములు ఆకర్షించుటయందు తప్పక వుపద్రవము సంభవించును. దృష్టికూడా దుర్బలము నొందును.

౩వ భేదము జులైదియా అనుకంటినీరునందు కలుగు రోగములు.

ఈనీరురూపము సమీపమునందుండు అంగములు మారిపోవును. అనగా లోపలివైపు కంటికొవ్వులయందు వాపువుత్పత్తియైనయెడల అట్టి వాపు కారణమువలన స్థలము తగ్గిపోవును. మరియు కొద్దిగా జలిదియా యెంతవాపునకు సమీపముంటునో అంతవేగరము అణగిపోవును. ఈ కారణమువలన జలిదియా యొక్క కొన్నికొన్ని భాగములు ఒకటికొకటి కలుసుకొనును. ఇటుల కలుసుకొనుట రోగిగ్రహించగలడు ఇందువలననే యీరోగమునకు జగతా అనగా పిండుట్టి వ్యాధి అందురు. దీనిలక్షణములు రోగికి జులైదియాంతూబత్ అనగా నీరునందు విశేషముగా నొప్పియు పత్తినట్లునుండును. కండ్లుపోటుకలిగి కదుపుటకు వీలులేక యుండును. కండ్లు గులివముతో నీళ్ళతోనిండియుండును. యీ మొదలగు లక్షణములు కలిగియుండును. యీవాపుయొక్క చికిత్స నేత్రసంబంధమగు వాపు చికిత్స చేయవలెను. అనగా రమద్ కండ్లపోటునందు వర్ణించబడును. మరియు రతూబతేజుజాజియాయందు తీక్ష్ణము

గంమలను చేయుటవలనవావు వ్రణములు కలుగుచున్నవి. యీకారణ మువలన రతూబత్ అనగా జులైదియా అనునీరు బ్రద్దలగుచున్నది.

### జులైదియా అను కంటినీరు రోగములు.

రతూబత్ అనగా కంటి నీరు ప్రమాణము తగ్గిపోవును. ఇట్లు తగ్గుటకు రెండుకారణములు గలవు. (1) రతూబత్ జులైదియా అను నీరు తన ప్రమాణముకంటె హెచ్చిపోవును. దీనికారణము రతుబతెజులైదియా అనునీరు నిండుటయే కారణమగుచున్నది. దీని చిహ్నములు చూచునట్టి వస్తువులు కొంత పెద్దవైనను చిన్నవిగా కనుపించుచుండును దీనికారణము ఇట్టిసమయమునందు జులైదియా అనునీరు పెద్దదైనయెడల చూచునట్టి వస్తువు అందు చెడిపోవును. మరియు దీనిభాగములు హెచ్చినయెడల దాగిపోవును. ఇట్టిదశయందు అవశ్యముగా చూచునట్టి వస్తువులు చిన్నవిగా కనుపించుచుండును. ఎందుకనగా ప్రాణవాయువు తన నిజమార్గమునందు చేరజాలదు. మరియు దీనిచికిత్స యీక్రింద చెప్పబడును.

### జులైదియా అను కంటిరోగ చికిత్స.

ఈవ్యాధిగలరోగి భోజనము స్వల్పముగా చేయుటమంచిది. శరీరమునందుండునట్టి మలము తొలగించు ఉపాయములను చేయవలెను.

(2) వ భేదము జులైదియా అనుకంటినీరు తనప్రమాణముకంటె తగ్గిపోవును. దీనిచిహ్నములు చూచునట్టివస్తువులు వాటిప్రమాణముకంటె పెద్దవిగా కనుపించును. దీనికారణము ఇట్టిస్థితియందు రతూబత్ అనగా నీరు తగ్గినయెడల ఈసమయమునందు ప్రాణవాయువు ఖనీభవించి బలపూర్వకముగా బైలువెడలును. ఈకారణమువలన ప్రత్యేకమగు వస్తువులు తమప్రమాణముకంటె పెద్దవిగా కనుపించుచుండును. కాబట్టి ఈసమయమునందు రతూబతు అనగా నీరు చిన్నదైనచో దృష్టియందు దుర్బలము తటస్థించును.

**౪ వ. భేదము జులైదియా నీరు రోగలక్షణములు**

ఈవ్యాధియందు ముఖ్యముగా జులైదియా అను నీరు వందు రోగము ఉత్పత్తియగును. యీ రతూబతుయందు కేవలము శుష్కత్వము ప్రవేశించును. యీకారణమువలన రూపము కాజాలకుండును. మరియు, యీశుష్కత్వము దీని శ్రోణిదికాదు గాని గరికలిగించు చున్నది. యిందువలన యీవ్యాధియందు గరికలిగించుటకు చిన్నములు బొత్తిగా కనపించవుగాని రూపము గ్రహించుటలో కొదువ సంభవించుచున్నది. యీరోగకారణము రెండు విధములు (1) ఇచ్చట నిర్జలముగానుండుట మలమును అధికముగా వెడలించుటవలన సర్వశరీరము శుష్కత్వమునొందుటవలనయీ వ్యాధి కలుగునని గ్రహించవలెను.

**౪ వ. భేదము రతూబత్ జులైదియా చికిత్స**

ఈవ్యాధియందు శరీరప్రకృతియందు చెమ్మకలిగించునట్టి వస్తు సేవన నిస్సందేహముగా చేయవలెను. మరియు, మసబతులు పానము చేయవలెను. తైలములు లేపనము చేయవలెను. మరియు, స్నానము చేయవలెను. మరియు పరిశ్రమచేయుట, ఉపవాసముండుట, సంభోగము చేయుట, మలమునకు నష్టముకలిగించునట్టి వస్తులు మానివేయవలెను.

(2) వ భేదము. ఉష్ణకాలములో దేశాటనముచేయుట, నేత్రములలో దుమ్మువడుట మొదలగు కారణములవలన నేత్రములో శుష్కత్వము కలిగి ఈరోగము ఉత్పన్నమగును.

**5 వ భేదము. రతూబతెజులైదియా వ్యాధి చికిత్స**

ఈవ్యాధియందు మెదడు, నేత్రములకు చెమ్మ కలిగించవలెను. ఇసబ్‌గోలు ఇత్యాదిగింజలజిగుర్లు, చనుపాలు మొదలగునవి కండ్లలో ముక్కులో వేయవలెను. మరియు బనప్షా, నల్లకలువపూలు వాసన చూడవలెను. మరియు శిరస్సునందున్ను, నోవలనందున్ను చెమ్మకలిగించునట్టి తైలములను మర్దించవలెను. మరియు, ఇతర సుపాయముల వలన చెమ్మను కలిగించు నదుపాయములను చేయవలెను.

# అనేకబూతియా అను నేత్రసంబంధమగు పొరయందు కలుగు రోగములు.

అనేకబూతియా అనుపొర, నబకియా అను పొరయొక్క ప్రక్కనుండి బైలువెడలినది. సన్నని సూక్ష్మపొరలు ముశీమియానుండి యీ పొరయందు కలిసియున్నవి. యీపొర రతూబతెజులైదియా, మరియు రతూబతెబైజియా యీ రెంటి మధ్యకునిచ్చి చేరినది. మరియు యీపొరను అనేకబూతియా అని పిలుచుటకు కారణమేమనగా, యీపొరవిశేషము మృదువుగా నుండుటవలన దీనిని అనేకబూతియా అని చెప్పెదరు, యీపొర సాలెపురుగుగూడు ఆకారమువలె గలిగియుండును. యీపొర మృదువై నడగుటవలన నేత్రదృష్టియందు చెరుపుకలుగనేరదు. యెందుకనగా అనేకబూతియా, జులైదియా అను పొరలనీరు బైటివైపునుండి మూయబడియుండుటవలన దీనిశరీరము మంధమైనయెడల చూపును పోగొట్టును. కొందరు వైద్యులు యీపొరను నబకియాపొరయొక్క భాగమునుండి వర్జించిరి. అనగా వేరుపొరయని పోల్చజాలకున్నారు. మరియు నబకియా అనుపొరనుకూడా ఇటులనే పోల్చుచున్నారు. యిట్టిదశయందు నేత్రములకు 5 పొరలుమాత్రము చెప్పబడియున్నవి. మరియు, యీపొరయొక్క రోగములు రెండు విధములుగా చెప్పబడియె. (1) రెండవపొరయొక్క సంయోగమువలన కలుగుచుండును. (2) ముఖ్యముగా యీపొరయందే వుత్పత్తియగును.

(1) వ ప్రకరణము. యీవ్యాధిలక్షణములు యీపొరయందు వుత్పత్తియగును. మరియు, దీని సంయోగమువలన రెండుపొరలయందు కూడా ఆక్రమించుకొనును. యిటులకలుగుటవలన అచ్చట వాపుసంభవించును. మరియు, ఒకదానియందు వాపుకలిగి పిమ్మట దానిసంయో

ను కలిగించునట్టి సహాయములను చేయవలెను. ఆవస్తువులను విశేష ముగా వర్ణించబడియున్నవి. మరియు, తన క్నజ్ నిండిపోవుటవలన వ్యాధికలిగిన యెడల యూరజాత్ అను ఔషధమును సేవించవలెను. మరియు, శుష్కత్వము నొందించునట్టి గండూషములను చేయవలెను. మలము శుభ్రత నొందిన వెనుక నేత్రముల వెంట నీరు స్రవించుటకై నుర్మా ఉపయోగించవలెను.

# రతూబతె బైజియా అను నేత్రసంబంధమగు నీరు రోగములు.

రతూబత్ అనగా కన్నుసంబంధమునీరు. యీనీరు శుభ్రతయందున్న, నిజదశయందున్న కోడిగ్రుడ్డువలె నుండును. గనుకనే దీనిని బైజియా అను పేరుపెట్టియున్నారు. మరియు యీరతూబత్ యొక్క రతూబత్ జలీదియాయందు వుత్పత్తి అయినయెడల కలుగులాభము అనగా తీక్ష్ణప్రకాశమగు రతూబత్ జులైదియాయందు నిమ్మళమునిమ్మళముగా స్రవించును. దీని కారణములు రతూబతెజులైదియా యొక్క కష్టమువలన తీక్ష్ణమగు శుష్కత్వము మరియు, ఉష్ణముగల ఔషధముల వలన కలుగు కష్టమువలన, శుష్కత్వమువలన కాపాడబడుచుండును. యీరతూబతునందు మూడువిధముల వ్యాధులు కలుగుచున్నవి. (1) యీరతూబత్ ప్రమాణమునందు హెచ్చినచో ఈవ్యాధి సంభవించును. (2) రతూబత్ అనగా నీరు ప్రమాణముకంటె తగ్గినచో వ్యాధిసంభవించును. (3) ఈరతూబత్ నందు చిక్కదనముకలిగి గట్టిపడినయెడల ఈవ్యాధి సంభవించును. గాన ఈమూడుభేదములను వేరు వేరుగా వర్ణించబడును.

(1) రతూబతెబైజియా అంగనీటివ్యాధి లక్షణములు.

ఈరతూబతు జాస్తి అయినయెడల హానిసంభవించును. కాబట్టి స్వల్పత్వము విశేషత్వమువలన దీనిభాగములు విశేషమగుటవలన శుభ్రముగానుండజాలదు. ఇందువలన రతూబత్ జలీదియా యందురూపములను కూర్చుచుండుటకు హానికలుగుచున్నది. మరియు సూర్యకిరణములు వికసించుటయందు ప్రకృతిమార్గము నుండి ఉపద్రవము వచ్చుచున్నది. ఇందు ఆశ్చర్యములేదు. ప్రమాణము మిక్కిలి విశేషమయినచో యిట్టిదశయందు దృష్టిబొత్తిగా నశించుచున్నది. మరియు కండ్లు చీకటి సంప్రాప్తమగును. రూపములయందు రతూబతుజలీదియా మధ్య ఈ రతూబతు ప్రవేశించుటకు వుదహారణము అనగా మట్టిగోనియందు నీరు దృష్టిని చెరుపుచున్నది. మరియు ఈరతూబతు అధికమగుటవలన కలుగుచిహ్నములు రోగి యిట్టిసమయమునందు కన్ను కదలించినయెడల నేత్రములయెదుట నీళ్ళతోనిండిన నదియున్నటుల కనుపించును భుజించినతరువాత నిద్రించిన తదుపరి దృష్టిమిక్కిలి దుర్బలము నొందుచున్నది. మరియు ఆకలిసమయమునందు మధ్యాహ్నము దుర్బలము కాజాలదు. మరియు యీవ్యాధిగలవాని సమీపమునందుగల వస్తువులకంటె దూరమందుండునట్టి వస్తువులు బాగుగా చూడగలుగును. ఇటుల చూచుటకు కారణము యీరతూబతుయొక్క విశేషత్వమువలన ప్రాణవాయువు హెచ్చుచున్నది. ఈకారణమువలన యింతవరకు దూరము రాజాలకుండును. ప్రాణవాయువు హెచ్చినకారణమువలన మృదుత్వము అనుకూలము కాజాలదు. యీకారణమువలన సమీపమునందుండునట్టి వస్తువులు బాగుగా కనుపించజాలవు. అనగా సమీపమునందుగల వస్తువులను చూచుటయందు ప్రాణవాయువుయొక్క అధికపరిశ్రమ కలుగదు. ఇందువలన ప్రాణవాయువుయొక్క అధికదశయందు మృదుత్వము కలుగుచుండును. అందువలన దూరపువస్తువులనుచూచుటకు సావకాశము కలుగుచున్నది.

(1) బైజియా అను రతూబతు చికిత్స.

ప్రారంభదశయందు కషాయములతో శరీరమును శుభ్రతనొందించి తరువాత శిరస్సునకు శుభ్రతనొందించుటకై యారజ్ మాత్రలను యివ్వవలెను. మరియు తిరువాణికాది అందులోతేనచేర్చి గండూషము చేయవలెను. మరియు దశానుకూలముగా నుండువస్తువులతో కషాయముకాచి ఆకషాయముతో ప్రక్షాళించవలెను.

2 వ భేదము రతూబత్ బైజియా తగ్గుటకు కారణములు.

ఈరతూబత్ తగ్గుటకు కారణము యీక్రిందవ్రాయబడును. మరియు యీనీరు తగ్గుటవలన హాని కలుగుచున్నది. అనగా బొత్తిగా తగ్గినయెడల దృష్టికూడా కేవలము నశించును. మరియు నీరునందు హానికొద్దిగాయున్నయెడల దృష్టిదుర్బలమును నొందును. అనగా రుతూబతు తగ్గినకొలది దృష్టితగ్గునని భావించవలెను.

(లాభము) మెదడునుండి ప్రకాశమగు రుతూబతు అనగా నీరు కండ్లవైపు దిగుచున్నది. అది యీతూబతునందుచేరి ఖనీభవించిన యెడల నిలిచిపోవును. మరియు రతూబతెజలీదియా యందు రూపముల ను గ్రహించునట్టి దృష్టిగలశక్తియొక్క పనిసంపూర్ణము కాకుండును. ఇట్టిసమయమునందు యీతూబత్ అనగా నీరునందు హానిసంభవించినయెడల ఆప్రకాశము దీనివైపువచ్చుచున్నది. అచ్చట పకటిగా నిలువజాలదు. మరియు ఇనబియాఅనుపొర రంధ్రమువలన వెంటనే వెడలి అల్లుకొనుచున్నది, దీనివలన హాని అధికమైనయెడల ప్రకాశము వెడలుటవలన దృష్టియొక్క కార్యములు బొత్తిగానశించును. హానిబొత్తిగా తక్కువయున్నయెడల దృష్టికలశక్తియొక్క పనులయందు దుర్బలము వచ్చుచున్నది. ఈరతూబతుయందు హానికలుగుటకు చిహ్నములు ఈ రోగి తవతీలను కదలించినయెడల కండ్లయెదుట నుయ్యివలెను గుంటవలెను కనుపించ నారంభించును. దీనికారణము యేసమయమునందు రతూబతు అను కంటినీరు పడుచున్నదో ఆసమయమునందు ఇక్కకబూతి

యూ అనుపొరమధ్య ఒకమైదానమువలె యేర్పడుచున్నది. మరియు యీమైదానము గుంటవలె భావివలె కనుపించుచున్నది ఈవిషయము లలో తర్కము జరుగుచున్నది. ఇందువిషయమై శారహాలఅన్‌బాబ్ అనుగ్రంథమునందు వ్రాయబడిన అంశము యీక్రిందచెప్పుచున్నాను. ఈపుస్తకమును వ్రాసిన మహాశయుని ఉద్దేశ్యము అనగా నిజముగా యీనమయమునందు జైజియా అనునీరు తగ్గినమొదల శుష్కత్వము ఋపీభవించును. మరియు యిందులో రెండుపొరలు అవశ్యముగా బైలు వెడలియున్నవి. ఆపొరలలో ఒకటి యిందువర్ణించిన రతూబతుయొక్క సర్వభాగములు ఒకటిగా నిలువబడుచున్నది. ఇట్టిదశయందు దృష్టిబొత్తిగా నశించిపోవుచున్నది. యేమియు కనుపించనేరదు. రెండవది యిచ్చట రతూబతుభాగములు యావత్తు వకటిగా చేరవు. కొద్దిభాగము మాత్రము ఒకటిగా నిలువబడుచు మిగిలినది ఒకటిగా నిలువకుండును. యిదికూడా రెండువిధములుగా చెప్పబడియె. (1) దానిభాగములు ఒకేస్థలమునందు చేరును. (2) అచ్చటి అనేకస్థలములయందు కలుగును. మరియు, రతూబత్ అనగా నీరు భాగములు ఒకేస్థలమునందు ఒకటిగాచేరి నిలిచినచో రోగికి ప్రత్యేకవస్తువునందు గుంటవలెను చీకటిగను కనుపించును. మరియు, ఆరతూబతు భాగములు అనేకస్థలములు ముడుచుకొని పోయినచో యిట్టి నమయమునందు భాగము వకటిగా నిలిచి దీని అనుసారముగా ప్రత్యేకవస్తువునందు గుంటలు, గుంటలుగా, కనుపించుచుండును. మరియు, ఇట్టి చిన్నచిన్నలు రతూబత్ చిక్కదనముకలుగు కారణమువలన కూడా కనుపించుచుండును. దీనిని నేత్రము నందు నీరుదిగునట్టి వర్ణనమునందు చెప్పబడుచు గాన భాగములు ఒకటిగాచేరుట, మరియొక విషయము అనగా శుష్కించిన భాగములు వకటిగా నిలువబడుటకు కారణముగలదు, అనగా శుష్కభాగములు వకటిగా చేరజాలవు గనుక కండ్లు చిన్నవగుట, మరియు ప్రకృతి అనుసారముగా నిదురయందు కష్టముకలుగుట యీరతూబతుయొక్క భాగములు

ఒకటిగా నిలుచుటవలన కలుగుచున్నవి. యీకారణమువలన కూడ రెండింటియందును భేదము భాసించ కలుగును యెట్లులన యితర భేదములు కూడా అనేకములు గలవు

### రతూబతె జలైదియా తగ్గుటకు చికిత్స.

శరీరమునకు పుష్టికలిగించునట్టి యత్నములను చేయవలెను. మరియు, యేవస్తువు శుష్కత్వమునకు నష్టముకలిగించి రతూబత్ ఉత్పన్నముచేయునో అట్టివస్తువులను ప్రయోగించవలెను. మరియు, పుత్తమ భోజనములను భుజించవలెను. చెమ్మనుకలిగించునట్టి రసములు కషాయములతో యెల్లప్పుడు స్నానముచేయవలెను. పిమ్మట ఆడశిశువుగల తల్లి పాలు, కోడిగ్రుడ్డుతెల్లసొన కలిపి నశ్యముచేయవలెను. బనప్షా, కలువపూలు వాసనచూడవలెను. మరియు, తలకు చెమ్మపుట్టించునట్టి తైలములతో యెల్లప్పుడు స్నిగ్ధముగానుండవలెను. మరియు, మెదడును వృద్ధిచేయునట్టి వస్తువులను ప్రయోగించవలెను.

3 వ భేదము. బైజియా అను రతూబత్ చిక్కబడుటకున్ను, గట్టిపడుటకు

### లక్షణములు

దీనివలని దృష్టికార్యములయందు నష్టము కలుగుచున్నది. మరియు, యీనీరు కొద్దిగా మందము కలిగినయెడల దూరపువస్తువులు కనుపించకుండును చిక్కదనము విశేషము కలిగినయెడల సమీపమునందు గల వస్తువులుకూడా కనుపించకుండును. మరియు, యీనీరు చిక్కబడుటకు రెండుకారణములు మిశ్రమైయుండును. అందు (1) కారణము ఈ రతూబత్ అనగా నీరుయొక్క యావత్తుభాగములు స్వల్పముగా చిక్కబడును. యిట్టిదశయందు దృష్టిపూర్తిగా నశించిపోవును. (2) యీరతూబతుయొక్క కొన్నిభాగములు చిక్కబడును. యిట్లు చిక్కబడుటకు నాలుగువిధములుగలవు. (1) అచ్చటి రతూబత్ మధ్యమందు చిక్కదనమేర్పడును. యీచిక్కదనము కంటిపాప ప్రమాణముకంటె అధికప్ర

మాణము కలిగియుండును. మరియు, కంటిపాపలో సమానముగు ప్రి
మాణము కలిగియున్నను యీదశయందు దృష్టిబొత్తిగా చెడిపోవును.
వైద్యవేత్తలు దీనిని నజులా అనగా సీటిబిందువులని చెప్పుదురు.

(2) కంటిమధ్యభాగమునందుండు రతూబతు అనగా కంటిపాప ముందునుండు నీరు. కంటిపాపయొక్క పరిమాణముకంటె మిక్కిలి చిక్కగా నుండినయెడల కంటిపాపయెదుట ప్రత్యాకారముగా తన నిజదశయందుండును. గాని దీనియందు చిక్కదనముండదు. ఇట్టిస్థితియందు యావత్తు వస్తువులు మధ్యభాగములయందు చీకటిగా కనుపించును.

(3) ఇచ్చట రతూబతుయొక్క కొంతభాగము నేత్రముయొక్క పాపయెదుట యున్నది. ఇట్టిస్థితియందు దానికి చిక్కదనము వచ్చిన యెడల మధ్యమధ్య తననిజదశయందుండును. దీనియందు చిక్కదనము కలుగనియెడల దానియెదుట చిక్కదనముండును. ఇట్టిదశయందు విశేషముగా శరీరము వకేసారియావత్తు దృష్టింపబడదు. అనగా శరీర అవయవము వకటి తరువాత నొకటి కనుపించుచుండును.

(4) ఈరతూబతుభాగమునందు చిక్కదనము వేరుగా అల్లుకొనును. ఈదశయందు రోగికి తనకండ్లయెదుట దోమలు, వెంట్రుకలు ఈగలు, మొదలగునవి తిరిగినటుల తోచుచుండును. ఇటుల నిజూలుల్మాయందు కలుగుచున్నది. ఈరతూబతు బైజియా చిక్కదనముగుట వలన నిజూలుల్మాయందు యిదిభేదముకలదు. మరియు నీళ్ళు దిగివచ్చునట్టి రంగు యెప్పుడు అనేకరంగులు కలుగుచున్నవి. మరియు యెల్లప్పుడు నెమ్మదిగా దృష్టిమందమగుచుండును. మరియు చిక్కదనముగుటకు యెప్పుడు తెల్లరంగుకలిగియుండును. ఈవ్యాధి విశేషవ్యాప్తమగుట వలనకూడా విశేషకష్టముకలుగుచుండును. మరియు చిక్కదనము దాని దశయందు యేర్పడియుండును. ఈరోగమువలన నజులావ్యాధిభయము కలుగుచుండును. గాన యిందువిషయమై విచారింపవలసిన అంశమై యున్నది. అభిప్రాయమేమనగా రతూబతు బైజియా చిక్కదనము గలు

గుటకు కారణములు వేరుగలవు. అనగా పైన వర్ణించబడియున్నవి. నిజాలుల్ మూ కారణములు వేరుగలవు. అనగా ప్రకాశమగు రంధ్రమునందు బంధనమేర్పడి ఆరంధ్రములు వెడల్పు అగు కారణమువలన పాపపైకి నీళ్ళు దిగివచ్చును. యీరెండు వ్యాధులు నుత్పన్నమగుటకు కారణములు వేరువేరుగా నుండును. మరియు ఒక రోగము రెండవరోగముయొక్క భయము కలిగించు స్వభావికము కలిగియుండదు. వైద్యులు యీ రతూబతు చిక్కనగుటను నిజూలుల్ మూ యని గ్రహించుచుందురు. గాని యిది కేవలమువారి పొరపాటని చెప్పుచున్నారు. యెందుకనగా నిజూలుల్ మూ సిర్లు తరుగుటవలన ఒక రతూబతు చేరి వచ్చుచున్నది. మరియు బైటిగాలియొక్క సారమువలన రాయివలె నుండును. బైజియా చిక్కనగుటకుగల దశయందు నిజూలుల్ మూ అనగా కండ్లలో నీరుదిగునట్టి వ్యాధియొక్క మోసమువలన కండ్లలో నీళ్ళువచ్చుచుండును గాని వేరు విధమగు రతూబతు యేమియు రానేరదు. మరియు యిదితప్ప దృష్టి తత్కాలము మాత్రము చెడిపోవును. మరియు యీవిషయమును నజులానీరు తీయుట విరుద్ధము అనగా అంతు కేవలము దృష్టితిరిగివచ్చుచుండును. మరియు చిక్కనగుటకు చిహ్నములు ప్రకటనమగుచున్నది.

## —4 వ రతూబతె బైజియా చికిత్స.—

దోషములను పక్వమునొందించునట్టి ఉపాయములను చేయవలెను. అనగా నిజూలుల్ మూయొక్క ఆరంభదశయందు యీచికిత్సచేయుటలాభదాయకమగును. మరియు అవశ్యకతానుసారముగా చికిత్స చేయుట మంచిది. మరియు, యీరతూబత్ చిక్కనగుటకు కారణము దృష్టిదౌర్బల్యము నందుకూడా చెప్పబడియున్నది.



# అన్‌బియా అను కంటి పొరయొక్క రోగలక్షణములు.



యీకంటిపొర మధ్యభాగమునందు. ఉ. వారిమాను వెడల్పవచ్చునట్టి యీపొరయొక్క మధ్యస్థానములో జాలైదినారనుబడు ఒక రంధ్రముగలదు. ఈరంధ్రము వచ్చిద్రాక్షకాయను గుత్తినుండి తెంచినయెడల ఆకాయకురంధ్రముండును. అటులనే ఇనబియా ద్రాక్షవంటివంటి ఆకారముండును. ఈకారణమువలన ఈకంటిపొరయొక్క పేరు అన్‌బియా పెట్టబడియె. మరియు దీనిని జరంగు హాకీము జాలినూస్‌గారి మతానుసారముగా ఆకాశమువంటి రంగుకలిగి యుండుననియు, హాకీము ఆంస్ గారు మతానుకూలముగా నలుపురంగు కలిగియుండుననియు మరియు, కొందరు వైద్యులు యీపొర మునిమిరయాపొరభాగములయందు చేర్చుచున్నారు గాని వేరుపొరయందు లెఖ్ఖించుటలేదు. మరియు నబ్‌కియా అగ్‌కబూతియా మరియు, మాల్‌తహీమా మొదలగు పొరలనుకూడా యిటులనే భావించుచున్నారు. యిట్టిదశయందు మూడు పొరలు మాత్రము చెప్పుచున్నారు. ఆలోచించవలసినది యేమనగా అన్‌బియా అను పొరయొక్క బైటిభాగము నిలిచియున్నది యేలననగా దీనియందు యిటుపైవు కరనియాఅను పొర చేరియున్నది. మరియు, దానిని తాకుచున్నది. లోపటి మరియొకపొర మృదుత్వముగా నున్నది. దానియందు మెత్తని తంతువులు వ్యంజవలెనుండును. దీనిపైన బైజియా అను రతూబతునిలిచియున్నది. దీని తంతువులయందు మూడు లాభములుగలవు.

(1) యిచ్చటి యాపత్తు నీళ్ళను దిగివచ్చినప్పుడు నేత్రములను చేయునట్టి యీనీళ్లను తంతువులక్రింద అణచివేయుచున్నది. మరియు,

అచ్చట యీనీళ్ళను నిలువుమన్నది కంటిరంధ్రము మొదటను నీళ్ళు రానియ్యకుండునట్లు కాపాడును. దీనియందు యేకారణము వర్జితము కాజాలదు.

(2) యిచ్చటి మృదుపదార్థము కంటిపైన వడమండును. ఆ తంతువులు స్పంజియందు నిలిచిపోవుచుండును. మరియు, కంటిపావరంధ్రమునందు చేర్చుచున్నది.

(3) యిచ్చటి రతూబతు అనగా కంటిసంబంధమగు నీరు. బైజియాస్పాంజి నాక్రమించిన కారణమువలన పైస్థానమునందు నిలిచియుండును గాని స్రవించజాలదు. మరియు, యీపొరయందు అయిదురోగములు ముఖ్యముగా కలుగుచున్నవి. (1) రణములు కలుగుట (2) మలము నిండుట (3) తన స్థలమునుండి తప్పిపోవుట (4) అల్లుకొనుట (5) ముడుచుకొనిపోవుట మొదలగు వ్యాధులు కలుగును. యీవ్యాధులను వేరు వేరుగా వర్ణించబడును.

**అనబియా పొరయందు కురుపులు కలుగుటకు లక్షణములు.**

కురుపులు యీరతూబత్ యందు కలుగుచున్నవి. దీని చిహ్నములు నేత్రములలోపల ముందుభాగమునందు నలుపు మెరుపురంగుగల గుల్లలు లేచుట మరియు యీపొరయొక్క గుల్లలు కరినియాపొర సంబంధమగు గుల్లలలో భేదమేమనగా కర్నియా పొరయొక్క గుల్లలు తెల్లగానుండును. అనగా కర్నియా అను పొర తెల్లగానుండును. మరియు అనిబియా అనుపొర కర్నియా అను పొరక్రింద నుండును. ఇందువలన రంగుకలిగియుండును. గుల్లలులేచినసమయమునందు కర్నియాయందు గుల్లలుకలుగుచున్నది. ఇదిమంధమగుచున్నవి. ఇందువలనకర్నియాయందు అనిబియాయొక్క రంగుమారిపోవును. మరియు కర్నియాయొక్క నిజరంగు తెల్లగా కనపించును. యెట్లనగా అన్బియా అనుపొరయొక్క ప్రదేశము నేత్రముయొక్క నలుపు భాగముకంటె పెద్దదికాదు. గనుక ముల్తహిమాయొక్క రణములో భేదము కలిగియుండును. అనగా అన్

బియా అనుపొరయందు గుల్లలు పుట్టుచుండును. ఒకప్పుడు పారించిపో వుచుండును. అనగా కర్నియా అనుపొరను చించివేయుచున్నదని గ్రహించవలెను. యిటుల చినుగుటవలన అనిబియా అనుపొర బైటికివచ్చు చుండును. దీనివర్ణనము వేరుగా చెప్పబడును. మరియు ఒకప్పుడు అచ్చట గుల్లచితికిపోవుచుండును. ఇటుల యీగుల్ల చితికినవెంటనే కర్నియా అనుపొరకూడా చితికిపోవును. అప్పుడు బైజియా అను రతూబతు స్రవించ నారంభించును. మరియు యిటుల స్రవించుటవలన మూడు రోగములు కలుగుచుండును. (1) ప్రకాశము కంటి గ్రుడ్డుయందు ఒక టిగా నిలువనేరదు. మరియు వేగరకం చెదిరిపోవుచున్నది. (2) వాయువు ఆక్రమించుకొనుచుండును. (3) రతూబతె జాజైదియా యందు శుష్కత్వము చేరుచున్నది. యెటులననగా బైజియా పోనియందు చెప్పబడియున్నది.

## 2 వ భేదము అర్కాబియా అను పొర నిండుటకు కారణములు.

ఈకంటిపొరయొప్పుడు రతూబతువి శేషత్వమువలన నిండిపోవుచుం డును. అనగా నేత్రముయొక్క గ్రుడ్డుసమీపమువరకుచేరి దీనిని వెడల్పు చేయుచున్నది. యెటులననగా షేక్‌గారు దీనిని వ్యాఖ్యానముచేసిరి. ఒకప్పుడు ప్రమాణముకంటె యెక్కువై వాపు కలిగించును. మరియు యీవ్యాధివాపుయొక్క భేదము యీవ్యాధియందు నొప్పిగాని దురద గాని యుండదు. యెందుకనగా పొరనిండుట మందమెక్కుట మొదలగు భేదములు వాపుకు విరుద్ధముగా యుండును. వాపునందు దురదకూడా కలుగును. గాని మంధము మాత్రముండదు. గాన గ్రహించవలెను. ఈవ్యాధి నిజాలుల్‌మా అనగా నేత్రమునందు నీరు దిగుటవలన వేరుగా యున్నది. యెందుకనగా ప్రధానమగు అర్కాబియా వెడల్పు కానేరదు. యెటులననగా అనేకులు వైద్యోత్తములు వర్ణించియున్నారు. మరియు యిది అనిబియా అనుపొర వెడల్పు కావడముకూడా ఆరోగ్యమనిరి యేలననగా యీఅంశమును కొందరు దానిని నిజముగా నమ్మనియెడల

నేను యిట్టిదశయందు చెప్పబడిన అంశమేమనగా నేత్రరంధ్రము పెద్దదై నయెడల దీనిని పార్సీలో ఇత్తిసాయనుకాబా అందురు. అనబెముజవ్విఫా అనగా సౌందర్యమగు నేత్రముయొక్క ప్రధానప్రకాశముండు స్థానము వెడల్పుకాక నిది వెడల్పు అగుట నిజాలుల్ మాతో ముఖ్యముగా యున్నది. ఇది అనబెముజవ్విఫా వెడల్పు కావడమని గ్రహించవలెను. మరియు దీనిని వర్ణించెదను.

ఈపొరయందు రతూబత్ అనగా నీరు నిండుటకు చిహ్నములు దృష్టిమర్బలముగుచుండుట, ఒకకన్ను రెండవకన్నుకంటె పెద్దదిగా కనుపించుట, వారదశయందు కన్ను పికినటులుండుట, వకకన్ను రెండవకన్నుకంటె యీసమయమునందు అధికముగా నుండుట మరియు కేవలము కన్నునిండియుండినచో లేక రెండు నేత్రములు నిండియుండినను ఒకదానికంటె రెండవది అధికమగుట మొదలగు లక్షణములు కలిగియుండును

## అన్‌బియా పొరనిండి యుండుటవలన కలుగువ్యాధి చికిత్స

ఈవ్యాధియందు యారజాత్ అనగా విరోచనమాత్రలుగాని మరియు, వుక్కిలింతలు గండూషములు చేయించి మలము తీసివేయవలెను. మరియు, చిక్కని చెమ్మగల వస్తువులు యివ్వవలెను. అనగా గోరెర్రిమాంసము యిత్యాది వస్తువులను పథ్యమునకు యివ్వవలెను. మలము యావత్తు హరించిన తరువాత నిండియుండు నీరును నశించిన వెనుక నేత్రముల రతూబతు నశించిన వెనుక నేత్రముల రతూబతును శుష్కత్వమును నష్టపరచునట్టి ఔషధములను నేత్రములయందు వేయవలెను. దీనివలన శేషమలము హరించును. మరియు, యీవ్యాధియందు ఉపయోగించునట్టి వస్తువులు అనగా సోపురసము, తేనె, యింగువ, మిరియాలు, సుకబీనజ్ అనగా ఒకవిధమగు జిగురు వుస్క అనగా రాతిపువ్వు. మరియు, యిట్టి గుణముగల ఇతర వస్తువులను వుపయోగించవలెను.

## (3) భేదము అన్‌బియాపొర తన స్థలమునుండి తప్పిపోవు లక్షణములు.

ఈ పొర తప్పిపోవుటకు రెండు కారణములుగలవు. (1) ఈపొర యందున్న, దీని సమీపమునందుండు పొరయందు కూడా వాపుసంభవించును. దీని చిహ్నములు నేత్రమునందుండు బరువు నొప్పి కలుగుచుండుట, నీళ్ళుస్రవించుట, మొదలగు కారణములవలన అన్‌బియా అను పొరయొక్క రంధ్రము జాలైదియా అల రతూబతు యెదుటనుండి తప్పిపోవును. కాబట్టి ప్రత్యేక వస్తువు వంకర అనగా మెల్లచూపుగా కనుపించును. మరియు, గ్రుడ్డుబైటికి వచ్చుటవలన, నేత్రప్రమాణము జాస్తి అగుటవలన వాపువలన కనురెప్పలు ఒకటి కొకటి కలుసుకొననేరవు. మరియు, నేత్రమునందు పొర రెండు భాగములైనవని తోచును. మరియు, ఒకటి స్థిరముగా తన నిజదశయందుండును. రెండవదాని యందు చిక్కదనము వచ్చినను నిది తన యెడమ భాగమునుండి తప్పిపోయినను, కుడివైపునుండి కర్నియాయందు చిక్కదనము కటస్తించును. మరియు, యీకారణమునకు విరుద్ధముగా యుండిన యెడల దీనికి విరుద్ధమగు లక్షణములు ప్రకటనమగును.

## (3) భేదము అన్‌బియాపొర చికిత్స

ఈరోగమునందు వుచితమగు విరోచన ఔషధములు యివ్వవలెను. మరియు, అవశ్యమైనచో శిరావేదనముచేసి రక్తము వెడలించవలెను. మరియు, శరీరము స్వస్థతనొందిన వెనుక ముఖ్య అంగమునుండి మలమును వెడలించుటకై కండ్లనుండి నీరు స్రవించునట్టి ఔషధములను కండ్లలో వేయవలెను. అట్టి ఔషధములను కండ్లలో వేయవలెను. అట్టి ఔషధములను ఈపొరనిండిన కారణమునందు వర్ణించబడినవి. మరియు, తన స్థలమునుండి తప్పిపోవుటకు లాభము కలుగునట్టి బాహ్యోపాయములను చేయవలెను. అనగా ఒక సీసపు ముక్కను, కనుగుంటతో సమానముగా దొప్పవలెచేయించి ఆదొప్ప మధ్యయందు రంధ్ర

ముచేసి ఆరంధ్రము మూయకుండా అసీసపుగిన్నె కంటిపై వేసి కట్టవలెను. యిట్లు చేయుటవలన నేత్రము నిజదశయందుండును. మరియు నేత్రము తప్పిపోవుట మిక్కిలి పోటుగానుండుట, యిటు అటు చూచుట మొదలగునవి నశించి మిక్కిలి శుభమగును. మరియు, గొప్పమధ్య రంధ్రము చేయుటకు యుక్తిగలదు. అనగా రోగి ఆరంధ్రమునుండి చూచుటకు కష్టముగానుండును. అనగా చాలాకాలము కష్టముగా చూచునట్టి ప్రకృతి కలిగించినయెడల అవశ్యకముగా నిర్మూలించును. మరియు, నెమ్మదిగా నిజదశయందు మారును.

(2) కారణము తనస్థానమునుండి తప్పిపోవు ఈకరనియా పైకివచ్చిన కారణమువలన అనబియా అను పొర తన స్థానమునుండి జారిపోవును. మరియు కరనియా అనుపొర పున్నతమగు విషయమైయుండు ప్రకరణమునందు వర్ణించబడును.

### నాలుగు అయిదవ భేదములు.

పొరలు విశాలమగుట లేక బిగించుట మొదలగు కారణములను ముందు వేరువేరు ప్రకరణములయందు నేత్రపొరల సర్వరోగముల అంతమునందు చెప్పబడును.



టకు ఆటంకమేమియు చేయనేరదు. మెటులనగా తాను పరిశుభ్రము గాయున్న కారణమువలన దీనియందు మాలిన్యము లేనందున ప్రకాశ మును ధారాళముగా కలిగినటులనే చూపుచున్నవి. కొందరు ఈపొరను వేరుపొరగా భావించజాలరు. అనగా అంబియా, శబకియా, అన్కబూతి యా, ముల్తహి మా అను యీపొరలను సల్బియా అను పొరనుండి లెక్కించుచుందురు. మరియు మ ద్దనుదు మ్సావత్తు రెండుపొరలుగా భావించెదరు. మరియు ఈపొరలలో కలిగినట్టి రోగములు ప్రధానము లగుచున్నవి. అనగా (1) ఖశూనత్, (2) రతూ, (3) శకార్, (4) కరాహ, (5) బ్యాజ, (6) సంతాల్, (7) శమ్మ, (8) సరా, (9) మర్దా అనునవి కంటి యీపొరయందు కలుగునట్టి 9 వ్యాధులను ఈగ్రంథకర్త అభిప్రాయము. శకార్ అనగా చిలుగుట పొరలచినుగుటకు రెండుభేదము లు గలవు. శేషించిన 8 రోగములు వరు వేరుగా వర్ణించబడును.

### —ఖశూనత్ అను వ్యాధి లక్షణములు—

కరనియా అను పొరయందు కఠినత్వము, గరి, వుత్పత్తియగు చున్నది. యిటుల వుత్పత్తియగుటకు మూడు కారణములుగలవు.

(1) యీపొరయందు శుష్కత్వము కలుగుటవలన రతూబతు అనగా నీటియొక్క అంగముల చిద్రములయందు నిండియుండును. దీని వుపరిభాగములను శుభ్రముగా నుంచుచున్నది. కష్టముకలిగినను పైభాగము తనయొక్క యేభాగములైన క్రిందయుండుటవలన సరిగా యుండదు. మరియు దీని హాని పరిశుభ్రత నష్టమగుటవలన ప్రకాశమగు అన్యరూపములను గ్రహించుట యందు భేదమేర్పడుచున్నది.

(2) యిచ్చటి తీవ్రదోషముగాని లేక ఉప్పని మలముగాని ఈ పొరపైన చేరినయెడల యింత తీక్షణము వుప్పువలన ఈపొరను చివ్వివే యును. అనగా యెండుగజ్జయందు శరీరముయొక్క చర్మము పూడిపోవుచున్నదో అటులనే ఈపొరయందుకూడా మలము తీక్షణలవణముల యొక్క కారణమువలన పూడబడును.

(3) తీక్ష్ణమగు ఔషధములను నేత్రములం[illegible] చేయుటవలన ఈహారయొక్క ప్రకృతి మారిపోవును. మరి[illegible] ఉత్పన్నమగును. ఈహారయందు గరికలుగుటవలన కలుగు [illegible] రోగికి [illegible] మూసినప్పుడు తెరచునప్పుడు కంటిపై రెప్ప[illegible] వస్తువుతో రుద్దినటుల యుండుట రోగికి సందేహము కలుగుట[illegible], [illegible] కష్టముగా నుండుటవలన కండ్లనుండి నీరు [illegible]. గాని ఈనీళ్లు స్రవించుట దీనిముఖ్యముగు [illegible] కానేరదు. యెందుకనగా రెప్పలక్రింద చిన్నచిన్న గుల్లలు కలుగునపుడు రెప్పలు చేయుటకు రెప్పలు గరిగల వస్తువుతో తోమినట్లు [illegible]. మరియు ఇటుల గ్రుచ్చుకొనుటవలన నీళ్లు స్రవించుచున్నవి. మరియు, కరనియా అను పొరయందు మంట రెప్పలయందు నొప్పి కలుగదు. మరియు ఈ వ్యాధియందు రెప్పలలో గుల్లలు కలుగుట విరుద్ధముగా యున్నది. దీనివలన మంటరెప్పలయందు నొప్పి అవశ్యముగా కలుగగలదు. మరియు శుష్కత్వము గరి కలిగించుటకు కారణమగును.

—ఖసూనత్ అను వ్యాధి చికిత్స.—

ఖసూనత్ అను వ్యాధి యేకారణమువలన కలిగినను ప్రకృతిని మార్చుటకై చెమ్మను పుట్టించునట్టి ఔషధములను ఉపయోగించవలెను. మరియు యేఔషధమువలన ఈపొరయందుగల గరిలగ్గి పోటుమంట శాంతినొందునో అట్టి ఔషధములను యుపయోగించవలెను. మరియు, తీవ్రదోషము లవణసంబంధము గలదైనయెడల బనప్షా కషాయము నందు రేలగుజ్జు, మాదీఫలముచేర్చి పానము చేయవలెను. యిటుల పానమొనరించుటవలన శరీరమునందుండు మలము వెడలిపోవును. పిమ్మట శీసపుమలినము నేత్రములలో వేయవలెను. అనగా అచ్చటి కర్నియా అను పొర రంధ్రములను పూడ్చుటయందు శీసపుమలినము అద్భుతశక్తి

కలిగియుండును. మరియు శీసపుమలినము బనప్షాతైలములో కలిపి కండ్లలోవేయుటవలనయీవ్యాధియందుమిక్కిలిగుణముకలిగియుండును.

—సీసపుమలినము తీయుక్రియ.—

సీనపుముక్కను అరిచేతిలోగాని లేక, వెనుదుకర్రపైగాని అరుగ తీయవలెను. యిటుల అరుగతీయుటవలన నల్లని రంగుగల మలినము వచ్చును. అట్లువచ్చు మలినమునందు బనప్షాతైలము కలిపి కండ్లలో వేయవలెను.

మరియు, కర్నియా పొరయొక్క పతనములు మాన్పుటకై బేదానా గుజ్జునందు కతేరాజిఅరుగాని లేక బనప్షాతైలముగాని కలిపి కండ్లలోవేయుట లాభదాయకమగును.

మరియు, పావురపుపిల్లల రక్తముతీసి కండ్లలో వేయుటవలన కూడా యింపు విషయమై మిక్కిలి వుపయోగకరముగానుండును.

—పావురపుపిల్లల రక్తముతీయు విధానము.—

పావురముయొక్క పిల్లనుదెచ్చి దాని వెంట్రుకవ్రూడబొకి అందుండి వచ్చునట్టి రక్తమును నేత్రములయందు స్రవింపచేయవలెను. లేనిమెడల ఆపావురముయొక్క జీవనరమును ఛేదించి అందుండివచ్చు రక్తమును తీసికొని యుపయోగించవలెను.

2 వ భేదము కర్నియా అను పొర పెరుగుటకు ఉబ్బుటకు కారణములు.

ఒకప్పుడు కర్నియా అనుపొర ముల్తహిమా అను పొరకంటె వున్నతమగును. మరియు నీపొర మెత్తగుట ప్రత్యక్షముగా కనుపించుచుండును. మరియు ముల్తహిమా అను పొర దరదీనజ్ యందు కర్నియాపొరకంటె మెత్తు అగుచున్నది. అనగా యీపొర మెత్తగుటను గురించి కంటియందు లేచు గుల్లలయందు వర్ణించబడును. మరియు యీరోగకారణము వాత దోషముగల మల్లము యీపొరక్రింద చేరినందున యీమలము హెచ్చులెగ్గులవలన వుబుకుచున్నది. అనగా మెత్తగుచున్నది.

### కర్నియా పొర యొప్పగుటకు చికిత్స.

ఈరోగమునందు ము మా॥ త్రమును చిక్కని దోషములను తీసివేయునట్టి యుపాయములను చేయవలెను. ఎంతమాత్రము కలిగిన వెనుక నష్టమును కలిగించునట్టి వస్తువులను అనగా జరూకెఅన్ఫర్ మరియు శియాఫె అహమర్ మొదలగునవి కర్నియా పొరను బాగుచేయుటకై నేత్రములయందు వేయవలెను. మరియు స్నానజలముతో ముఖప్రక్షాళన చేయవలెను. మరియు పుష్టికరములగు ఆహారము భుజింపవలెను.

### మూడవభేదము శకాకు (చినిగిపోవుటకు) లక్షణములు.

కర్నియా అను పొర నాల్గువైపులు చీలిపోవుటవలన యీరోగము వుత్పత్తియగుచున్నది. మరియు దీనిక్రింద నుండు అన్బియా అను పొర బైటికివచ్చును. ఈరోగమునకు మోరసరన్ అని చెప్పుదురు. ఈ వ్యాధి వర్ణనము వేరు ప్రకరణములయందు చెప్పబడును.

### నాలుగవ భేదము.

కర్నియా అనుపొరయందు శకాకు (బద్ధమగుట) అనగా పైపొర ప్రేలి క్రిందనుండు పొరబైటికి వచ్చును. మరియు అన్బియా అను పొర నిలిచియుండును. దీనినికూడా మోరెసజన్కా అని చెప్పుదురు.

### 5, 6. వ భేదములు.

ఈపొరయందు వ్రణములు తెల్లదనము వుత్పత్తియగును. దీని విషయమై వేరు ప్రకరణములయందు వేరువేరుగా వర్ణించబడును.

### 7. వ భేదము.

సర్తాన్ కర్నియా (కరినవాపు) యందు పిత్తము, వాతము, కలిసియున్నయెడల యీపొరయందు వాపుకలుగుటకు కారణమగును. దీనిలక్షణములు నొప్పివిశేషముగా నుండుట నేత్రముల నరములు పీకినటులుండుట వాపు, యెఱ్ఱపురంగు కలిగిన నలుపురంగుకలిగి యుండుట గ్రుడ్డులో పోటు పొడుచుట అపోటు కణతవరకు పొడిచినటులుండుట తలయందు నొప్పి విశేషముగానుండుటవలన మిక్కిలి కష్టముగా

నుండుట ఆహారమునందిచ్చ లేకుండుట యున్నాపి యీరోగము చికిత్స వలన కుమురజాలదుగాని కొన్ని నవుపాయములవలన నొప్పిన్ని రోగమున్ను నిలిచిపోవును. మరియు యీరోగమువలన గొప్పకష్టములు కలుగగలవు. గాని యీక్రిందచెప్పబడు నుపాయములవలన అట్టికష్టములు రాజాలవు. ఈరోగము హరించు నుపాయము శిరావేదనముచేసి శక్తి అనుసారముగా రుధిరమును వెడలించవలెను. మరియు మూవుల్ జుబ్బతో శరీరమునకు మ్నాధుర్యము నొందించవలెను. మరియు యీసమయమునందు మలమునందు మంట ప్రకటనమైనయెడల నొప్పి అతిశయమగును. అట్టిశరి శిఙాఫె అను ఔషధము కోడిగ్రుడ్డు తెల్లసొనలో కలిపి కండ్లలో వేయవలెను. మరియు ఖతమి, ఖుబ్బాజి మరియు కామంచిఆకులు నూరి పిండి బనఫ్షాతైలమునందు కలిపి కంటిపై లేపనము చేయవలెను మరియు తీవ్రమగు ఔషధములు కండ్లలోవేయకూడదు. యేలయనగా పూర్వము లేని కష్టములుకూడా కలుగగలవు. కాబట్టి యీవ్యాధియందు నేత్రములలో తీవ్రమగు ఔషధములను చేయకూడదు.

౪ భేదము కర్నియా పొరయందు గుల్లలు కలుగుటకు లక్షణములు.

కర్నియా పొరయందు నాలుగు వైపులయందు కుపువులు కలిగించుట్టి పటలము చేరుచున్నది. దీనివలన బాహ్యభాగమునందు అనగా కంటి రెప్పలలోపల కొలుపులయందు గుల్లలు కలుగుచుండును. యీగుల్లలదశ అనగా రంగు నొప్పి మొదలగునవి వేరు వేరుగా కలుగును అనగా మలము స్వల్పముగా గాని లేక విశేషముగాగాని లేక దుష్టస్వభావికము పొందుటవలన గాని కలిగిన గుల్లల విషయమై చెప్పబడుచున్నాము.

మరియు, మలము కొంచెముతియ్యగానున్న యెడలనొప్పి విశేషముగా యుండనేరదు. మలము విశేషముగా పలచనై తీవ్రముగా నున్నచో నొప్పి అధికముగానుండును. మరియు, మలము ప్రత్యేక ప్రత్యేక స్థల

ములయందు కలుగుటవలన గుల్లలు కంటి పైభాగమునందు కలుగుచుండును. నల్లగా శుభ్రముగా కనుపించుచుండును. మరియు, గుల్లలు రెండవ, మూడవ పొరయందు యున్నయెడల వీటిరంగు యిట్లుండదు. అనగా అర్బియా అను పొరయొక్క చాయ వానిపై పడుచుండును. మరియు, అచ్చట మూడవ పొరయందు యున్నయెడల తెల్లని రంగుగా కాన్పించుచుండును. మరియు, రెండవ పొరక్రింద యున్నయెడల నల్లగానుండును. అనగా యీగుల్లలు నలుపు తెలుపు రంగుల మధ్య శ్రేణియందు కలుగునని భావించవలెను.

మరియు, సాహెబ్ తజకర్ గారు యిందు విషయమై తన అభిప్రాయమును వెల్లడించినరీతిని యీక్రిందచెప్పబడుచున్నాను. అనగా మూడవపొరయందు లేచిన యెడల నల్లని రంగుగా కనిపించును. అనగా ఇవి ప్రకాశమగు నేత్రమునుండి వుత్పత్తియగునట్టి కారణము వలన కనుపించును. మూడవ పొరయందు ప్రకాశము ఆపొరనుండి కలుగుచుండును. గాన తెల్లని రంగుగల గుల్లలు లేచును. అవి దాని సమీపమునందు వుండుటవలన తెల్లగానుండును. మరియు, రెండవ పొరయందు మధ్యశ్రేణియందు నలుపు తెలుపు కలుగుచున్నది. నేత్రసంబంధమగు ప్రకాశముకూడా మధ్యశ్రేణినుండి కలుగుచుండును. గుల్లలు కర్నియా అను పొర పైభాగమునందు కలిగిన యెడల అవి అర్బియా అను పొరయొక్క రంధ్రమునకు సమీపమునందు కలుగని యెడల ఆరోగ్యము నొందగలదు. అనగా మలము యొక్క అధిక తీక్ష్ణత్వమువలన కర్నియా పొర బద్ధమైన యెడల కొద్దిగా చినుగును. అనగా కర్నియా పొర బైటిభాగమునందుండు పొర దీని రెండవ పొరకంటె మిక్కిలి కఠినత్వముగానుండిన యెడల అందుండి కొద్దిగా చినుగును. తిరిగి బాగగుటకు దీనిచిన్నములు అనగా అర్బియా పొరరంధ్రమునకు సమీపమునందు యుండనిచో దృష్టియందు భంగము కలుగదు.

మరియు రెండవపొర దిట్టము. అనగా దీనికంటె కఠినముగా యుండనేరదు మరియు గుల్లలు కంటిపొరయొక్క రంధ్రమునందు కలిగినచో మిక్కిలి క్లాంతత్వమును నొందించును. అనగా యిది కుదురుట దుర్లభము. మరియు దృష్టికూడా నశింపజేయును. మరియు, గుల్లలు బైటిపొరతప్ప వేరుపొరలయందు వినుకుట్టు కారణము కనుపించినయెడల అనిరియాపొర మెత్తగున్నది.

౬వ భేదము కర్నియాపొర గుల్లల చికిత్స.

ఈరోగమునకు నవపాయములను దశానుసారముగా చేయవలెను. మరియు నేత్రసంబంధమగు వ్రణములయందు చెప్పబడును. ఈరోగమునందు శిరాభేదన వేయుట మరియు, విరోచనమును చేయించుట వలన మలము క్రిందికి త్రోసివేయవలెను. ఆరంభమునందు మలము నశించునట్టి ఔషధములను ప్రయోగించవలెను. మరియు అంతమునందు శియాపెంబియమ్ యను గవ్వపలుకు పాంచ్రాణి చేర్చినది నేత్రములలో వేయవలెను ఈవ్యాధి నశించినవెనుక శియాఫె అహమరేలయ్యాను అను ఔషధము ప్రయోగించవలెను. మరియు, కర్నియాపొరమెత్తగా నుండుటవలన, దీనిపై గుల్లలయందు భేదమేమనగా మెత్తపొడవు దృఢమగుచున్నది మరియు శలాకతో అణచినను అణగనేరదు. అన్యజాతి గుల్లలు శలాకతో అణచినయెడల అణగిపోవును. మరియు వీటియందు నొప్పి, కన్నీరు నీరుకారుటకూడా తటస్థించును. శలాయి అనగా శలాకఅని అర్థము.

తొమ్మిదవ భేదము.

కర్నియాపొర క్రింద చీముపచ్చి చేరును. యిటుల వచ్చునట్టి కారణములు మూడువిధములుగా చెప్పబడినవి. (1) పొరయందు వ్రణములు కలుగుటవలన చీము తటస్థించి లోపలితట్టు బైటికి వెడలిపోవును. మరియు చీము అచ్చటనే నిలిచిపోవును. (2) నేత్రములు విశేషముగా నొప్పికలుగును. దీని చెడుగులను చీముగామారి అచ్చటనే నిలిచి

పోవును. (౩) తలనొప్పి విశేషముగా నుండును శరీరము బలము దీని వైపునకు అనగా కండ్లవైపునకు నడుచును. దీనికారణమువలన మలము నిలిచి చీముగా మారును. ఈచీము రంగు గోధుమవంటిరంగు కలిగియుండును. మరియు దీనివిషయమై వేరువేరుగా చెప్పబడును. అథవా కర్నియా సంబంధమగు కొన్నివ్యాధులయందు స్వల్పముగా చెప్పబడును. మరియు యిందుండి కొంత విశేషస్థలములయం దాక్రమించుచున్నది. అనగా కంటి నల్లగుడ్డు యావత్తు ఆక్రమించుచున్నది. ఇది విశేషద్వార స్వభావికమైనది.

—కర్నియా పొరయందు చీము చేరుటకు చికిత్స.—

సామాన్యరీతిగా పక్వము నొందించి తీసివేయునట్టి ఔషధములను యుపయోగించవలెను. అనగా జహూరి అస్పరుడు చనుపాలుగాని మెంతి నీళ్ళయందుగాని లేక సీమఅగసివిత్తుల గుజ్జునందుగాని కలిపి కంటిలో వేయవలెను. మరియు మెంతులు అకలీలుల్ మలికయొక్క వెచ్చని కషాయముతో కొంత కొంత కాలమునకు నేత్రములను కాపడము చేయవలెను. మరియు చీముతీసి మాన్పుటకై రూపముఖ్య (తారమాక్షికము) వెండి మఖిలా యీ మొదలగునవి మెత్తగానూరి కండ్లలో వేయవలెను. ఈ రెండువస్తువులు యిందువిషయమై అనగా వ్రణమును మాన్పుటకు అద్వితీయమైనవి. ఇట్టిపనులు చేయుటవలన చీము వెడలనిమొదల అట్టిసమయమునందు శస్త్రమువలన చీము వెడలించుటను ఆలోచించవలెనని గ్రహించవలెను దీనివిషయమై కర్నియాపొరను నల్లని గీర తప్పించి వేరుభాగమునకు శస్త్రముతో చీల్చవలెను ఇట్లు చీల్చుటలో క్రిందిపొర తెగకుండునటుల స్వల్పముగా చీల్చవలెను. తదుపరి ఆచీల్చినభాగమునుండి మహాత్ అను సళాకుతో చీమును తీసి అటుపిమ్మట నేత్రవ్రణముల చికిత్సను చేయవలెను. అవసరము కలుగునంతవరకు అనగా దృష్టియందు చీముచేరి దృష్టిచెరచువరకు శస్త్రప్రయోగము చేయజనదు.

—జరూరె నసగళుచే [illegible]ము.—

శుద్ధిచేసిన అంజరూద్ 3 మాషములు సూసాంబరము కుంకుమపువ్వు రసాజనము ఇవిప్రత్యేకము 7 మాషములు తుమ్మజిగురు తిన్నం మాషములు ఇవి యావత్తు చూర్ణించి సన్నని బట్టతో వస్త్రగాలితము చేసి చనుపాలయందుగాని లేక పైనచెప్పబడిన ఔషధుల కషాయములయందుగాని కలిపి వుపయోగించవలెను.



# ముల్తహిమా పొరయొక్క రోగముల వర్ణనము.



ఈపొరమెత్తని శల్యము గుండ్రముగా స్వచ్ఛముగా మందముగా యుండును. దీని మధ్యమునందు కంటిగ్రుడ్డును కదలించుచున్నది. ఈ పొర తెల్లని శ్లేష్మముతో గూడినమాంసముతో నిండియుండును. మరియు నిచ్చట ఝల్లితలపుర్రెపైన* మరియు తలచర్మమునకు క్రిందనున్న

* పైనవర్ణించబడిన పొర కర్నఝల్లితో పుర్రెపైన యున్నది. దీనినుండి బైలు వెడలినదని హకీము బుఖరాత్ గారు వచించిరి. దీని అనుసారముగా హకీమురాజీగారు కూడా పైవిధమును అంగీకరించిరి. యిందువలన ముల్తహిమాపొరయొక్క వాపు ముందుకారణముతో కలిగినయెడల నేత్రముయొక్క సామాన్యభాగమునందుచేరి మెదడువరకు వ్యాపించును. మరియు అరహిహానిస్, రూపస్, అనుయిద్దరు వైద్యులు చెప్పుచున్నారు. ఆకరినఝల్లి తలపుర్రెలోపల నున్నది. దీనినుండి ఈపొర బైలువెడలినదని ప్రమాణమును చూపుచున్నారు. నేత్రములు విశేషముగా నొచ్చుట, వాచుట మొదలగు కష్టములు సంభవించునప్పుడు బుద్ధిచెడిపోవును. యేమి సందేహములేదు. బైటిఝల్లియొక్క కష్టమువలన బుద్ధి జ్ఞానము మారిపోవును. యెందుకనగా ఈఝల్లి మెదడునకు సమీపమునందున్నది. అనగా తలనొప్పియందు దెబ్బతగులుటవలన కలుగు కారణమువలన వుత్పత్తి అయినచో యిట్టిస్థితియందు బుద్ధి విశేషముగా చెడిపోవుట తటస్థించును.

ది. దీని చివరలో ఉత్పన్నమైనది. మరియు నేత్రము సంతో షాత్రము ఆకారము స్థూలముగానుండుట యిది కంటికొరకు యావత్తుభాగము ను క్రమ్ముకొని యున్నది. కర్నియాపొర ప్రధత్వముతో దీనియందు నిలిచియున్నది యిందువలన యీపొరను ముల్తహీమా అందురు. కొందరు ఈపొరను సబకియా అన్కబూతియా పొరలలో చేర్చుదురు. ఇందువలన వారిమతమునందు కండ్లయందు నాలుగుపొరలు యున్నవని వూహించుదురు. మరియు యీపొరయందు 14 రోగములు పుట్టుచున్నవి. ఈరోగములలో కొన్ని ముఖ్యమైనవి. కొన్ని సామాన్యమైనవి. ముఖ్యమగు వ్యాధులు 9 కాబట్టి యీప్రకరణమునందు తొమ్మిది భేదములుగా వర్ణించబడుచున్నవి. అవిగా (1) రమద్, (2) తరఫా, (3) జఫరా, (4) సబల్, (5) యింతిఫాఖ్, (6) హాక్కా, (7) దూఖా, (8) తూసా, (9) జైసా, మిగిలిన రోగములు వాటి వాటి స్థానములయందు వేరువేరు ప్రకరణములలో చెప్పబడును.

## ఒకటవ భేదము రమద్ (నేత్రములునొప్పి) వర్ణనము.

ముల్తహీమా పొరవావునకు రమద్ అందురు. మరియు, రమద్ హాకీకి అనికూడా దీనిని వాడుదురు. యెట్లనగా రమద్ అనుశబ్దము దీని యెరుపునకు కూడా చెప్పబడుచున్నది. కండ్లలో దుమ్ము, పొగ ప్రవేశించుటవలనగాని, సూర్యవేడిమి ప్రవేశించుటవలనగాని కలుగుచున్నది. యిందు వావుమాత్రము యుండదని గ్రహించవలెను. మరియు, షేక్ అబు అలిశేనాగారు మొదలగువారలు ముల్తహీమాయొక్క వుష్ణమువలనగాని లేక చలువవలనగాని కలుగగలదని చెప్పిరి. దీనిని రమద్ అనిరి. మరియు పూర్వపు వైద్యులు యీశబ్దముచే యీపొరను వుష్ణవావుతో ముఖ్యముగా చేర్చిరి. మరియు పొరయొక్క శీతలవావును తకద్దూను (నేత్రము కొద్దిగానొప్పి కొద్దివావు కలుగుట) అందురు. మరియు సాధారణరీతి కంటియందు నొప్పి కలిగినయెడల దీనినికూడా

రమద్ అందురు యీవ్యాధియొక్క పేరు హేతువాన సారముగా పెట్టబడెను. యెట్లనగా అరబ్బిభాషయందు కండ్లనొప్పికి రమద్ అని చెప్పెదరు. రమద్, పిత్త, రక్త, వాత, కఫ, మలాన దోషముల వలన అయిదువిధములుగా నుండును.



# రక్తజరమదు [కండ్ల నొప్పి] లక్షణములు



ఈరోగమునందు నేత్రములు విశేషముగా వాచి యెఱ్ఱగానుండును. మలినము అనగా పుసి విస్తారముగా వచ్చుచుండును. నరములు మలముతో నిండియుండును. కణతలయందునొప్పి అధిక పోటు కలిగియుండును. మరియు రక్తాధిక్యము వలన కలుగుచిహ్నములు యావత్తు ప్రకటనమగును.

## రక్తజరమద్ (కండ్లనొప్పి) చికిత్స.

ఇతర యుపద్రవములు యేమియు లేనియెడల ముందు యేకన్ను నొచ్చుచున్నదో ఆవైపు నరేరు అను శిరను ఛేదించి రక్తమోక్షణము చేయవలెను. ఇతరయుపద్రవములుయున్నయెడల శిరావేదనముచేయంజనదు. ఇట్టిస్థితియందు ముచ్చనగుంటయందు రతులు వేయవలెను. మరియు రుధిరమును తీసినవెంక కరక్కాయ, ఆలుబకరా, పర్పాటకము, చింతపండు, మొదలగు కషాయములతో కోష్టమును మృదువరచవలెను. మలమును శోధించినతరువాత శియాఫె అబియజ్ కోడిగ్రుడ్డు తెల్లసొన మెంకిగుజ్జు లేక చనుపాలయందు అరుగదీసి నేత్రములయందు వేయవలెను. తరువాత శియాఫె అనగా కనికెనీళ్ళతో అరుగదీసి కండ్లలో వేయవలెను. మరియు వుక్త శియాఫు సర్వజిగురుగల పదార్థములను కండ్లలో ప్రయోగించుట వల శరీరమును పరిశుభ్రత నొందించనిదే

ముందుగా ప్రయోగించకూడదు. మొల్లప్పయొక్క విశేషముగా గ్నపిను చుంచునట్టి కారణమువలన శియాఫ్ మొదలగునవి కండ్లలో వేయుట వలన కంటిపొరయందు వాపు కలుగుటకు పొర చినుగుటకు మచ్చలు గుట మొదలగు అసందర్భములు కలుగుచున్నవి. యెట్టులనగా జఖీరే అను వైద్యగ్రంధమునందు యీక్రిందివిధముగా చెప్పబడియున్నది. అనగా నేత్రమునందు నొప్పి కలిగినప్పుడు వైద్యుడు శరీరమునుండి మలము వెడలించుటకుముందు నేత్రసంబంధమగు ఔషధములను కండ్లలో వేసిన యెడల గొప్పతప్పుచేసినాడని భావించవలెను మరియు నేత్రమునొప్పి ఆరంభదశయందు నీళ్ళుకూడా కండ్లలో ప్రవేశింపజేయకూడదు. యెందు కనగా నీళ్లు మలమును అవశ్యత. నొంగించును. నేత్రసంబంధమగు పొరలను మందముచేయును. నరములకు హాని కలిగించును. మరియు నేత్రములకు అనేకములగు హానులను కలిగించునని చెప్పియున్నది.

—శియాఫె అభియజ్ చేయు విధానము—

సత్తుభస్మము, తుమ్మజిగురు, కతిరాగోందు, యీమూడువస్తువులు నూరి చూర్ణించి వస్త్రగాలితమొనరించి ఇసబ్గోలుగింజల గుజ్జుతోగాని కోడిగుడ్డు తెల్లసొనతోగానినూరి కనికెలు చేసుకొనవలెను. మరియు, శుద్ధిచేసిన అంజరూద్ నల్లమందుకూడా యిందు కొద్దిగా చేర్చుకొనవచ్చును.

మరియు, మలమును వెడలించిన వెనుక నేత్రములకు బలము కలిగించి మలమును తగ్గించుటకై చందనము, రసాంజనము, ఆకాకనూ అనగా శీతతుమ్మకాయ రసము మొదలించినది. మామిసా యీవస్తువులను పచ్చిధనియాలరసముతో నూరి కండ్లపై పట్టువేయవలెను.

మరియు, మధుర ఆమ్లపదార్థములను సేవించవలెను. అనగా దానిమ్మగింజలు, చింతపండు కలకండచెక్కిగాని లేక యిటువంటి స్వభావికముగల యితరవస్తువులుగాని సేవించుట లాభదాయకము యీవస్తువులు రక్తపరితాపమును తగ్గించివేయును. యీవ్యాధి ప్రకృతియందు

ను బైటికి వెడలించగలదు యీమొదలగు దశలవలన వ్యాధి వృద్ధి నొందుచున్నది. గాన మలమును నిలిపి రోగమలమును పక్వమునొందిం చుటకై అంగములనునీర్సమునొందించునట్టి ఔషధములనుకూడా విశేష ముగా యుపయోగించకూడదు. అనగా నేత్రములకు యెల్లప్పుడు తిమ్మి రికలిగించుటవలన నానావిధముల రోగములు కలుగుటకు కారమగును. కాబట్టి యిందు విషయమై హీలతుల్ బరా అను వైద్యగ్రంథమునందు హాకీముజాలీనూన్ గారు యీక్రింది విషయములను వ్రాసిరి.

అనగా వైద్యులనేకులు కండ్లకు నీర్సము, తిమ్మిరి కలిగించునట్టి వస్తువులను ఔషధములను నేత్రములనొప్పియందున్న నేత్రముల పైభాగ మునందున్న ప్రయోగించిరి. యీవస్తువులను ప్రయోగించుటవలన ఆరోగుల నేత్రదృష్టి పూర్వపు దృష్టివలే రాజాలదాయెను. మరియు, పూర్వపుదృష్టికంటె చీకటి లేట్టింది చాలాకాలమువరకు తగ్గకుండెను. పిమ్మట చాలాకాలము తరువాత అనేకులకు కండ్లలో నీరు అనగా అంతర్ కుసుమలు దిగినవి. మరికొందరికి నేత్రదృష్టి క్రమేణా తగ్గిపోయి నది. మరికొందరికి నబులల్ ఐన్ అనగా నేత్రసంబంధమగు నరములం మెరుపు కలుగునట్టి వ్యాధికలిగినది. యిట్టివారిని నేను స్వయముగా చూచితినని వ్రాసిరి.

మూడవభేదము కిఫజరమద్ లక్షణములు.

ఈవ్యాధిలక్షణములు నేత్రములు విశేషముగా వుబుకట, నేత్ర ములు మిక్కిలి భారముగా నుండుట కండ్లవెంట పుసి నీరు విశేషము గా వెడలుచుండుట మరియు నిద్రించునప్పుడు కంటిరెప్పలు ఒకటికొక టి అంటుకొనుట కండ్లమెరుపుమాత్రము తక్కువగానుండుట మొదల గులక్షణములు కఫరమద్ అనగా నేత్రములనొప్పియొక్క లక్షణము లని నెరుంగవలెను.

### కఫజరమద్ చికిత్స

మలము పక్వమునొందినవెనుక మొదట శుద్ధినొందుటకై యూకజాత్ అను మాత్రలు వుపయోగించవలెను మరియును మలముహరించుటకై ముసాంబరము, * రసాంజనము, తుమ్మజిగురు, అకాకియా, అనగా లేతతుమ్మకాయరసము పిండి యెండించినది. కుంకుమపువ్వు, ఈ మొదలగు వస్తువులను పన్నీరుతోనూరి కనురెప్పలనొసలుపై పట్టువేయవలెను.

మరియు మలమువక్వమునొందించి తీసివేయుటకై శుద్ధిచేసినమెంతిరసమునుగాని మరియు అవిసిగింజలగుజ్జునుగాని కండ్లలో వేయవలెను. రెండుమూడు దినములు గతించినవెనుక రోగము అంతమునకు చేరును. తరువాత జరూరెఅవియజ్ నేత్రములలో వేయవలెను. ఈజరూరెఅవియజ్ అను నేత్రములలో ఆలశ్యముగా వేయుటకు ఆజ్ఞయెందుకనగా నిది జరూరె అనగా అవసరమైన మలమును వెడలించును. మరియు విశేషముగా మలమును నష్టపరచునట్టి ఔషధములను వాపునందు ముందుగా కండ్లలోవేయకూడదు. అనగా మలము పక్వమునొందినతరువాత జరూరె అవియజ్ మొదలగు మలశోధన ఔషధములను వుపయోగించుటమంచిదని భావము.

౧

మంచినీళ్లయందు మెంతులునైచి రెండుఝాములవరకుంచి తరువాత ఆనీళ్లువంచివేసి తిరిగి మెంతులకు 20 రెట్లు నీళ్ళుఅందుపోసి పొయ్యిమీదనుంచి అర్ధాంశముగా కషాయముకాచి వడియబోసి ఆగుజ్జును కండ్లలోవేయవలెను.

### జరూరెఅవియజ్ చేయుక్రమము.

అంజరూద్నూరి చనుపాలలోగాని లేక గాడిదపాలలోగాని కలి

---

* హాకీము జాలీనూన్ గారు ముసాంబరము నేత్రముల వాపునందు వుపయోగకారి అనగా మలము నేత్రములవైపు వచ్చునో దానిని అపివేయును. మరియు వచ్చిన మలమును హరించునుగాన నిది మిక్కిలి యుపయోగకారియని చెప్పిరి.

పి పెదుకరములను పట్టించి ఆకులను నిప్పులపై కాచవలెను. చెమ్మ లేకుండా ఆరిన తరువాత ఆకులపైనుండు అంజరూద్ తీసి దీనికి 14 భాగములు నిశస్తా అనగా గోధుమపాలు యెండించి సత్తుచేర్చి యీరెండు వస్తువులను కల్వమునందువైచి మెత్తగానూరియుంచుకొని రెప్పలంటుకొనుట మొదలగునట్టి వ్యాధులయందు మలానుసారముగా కలకండచేర్చి సమయానుకూలముగా వుపయోగించుకొనవలెను. మరియు కొందరు అంజరూద్‌ను చనుపాలయందునూరి యెండించి యిట్లు మూడుభావనలుచేసి కలుపుకొనుచున్నారు. మరియు యెండించునప్పుడు నలకలు దుమ్ముపడకుండా సావధానముగా యెండించవలెను.

## 4 వ భేదము వాతజరమద్ లక్షణములు.

నేత్రవైద్యులు యిట్టిరమద్‌వ్యాధిని రమదేయాబీస్ అనగా శుష్కత్వమువలన నేత్రములు అరుట అందురు. దీనిచిహ్నములు నేత్రములు ఆరుట, బరువుగానుండుట, నేత్రములు ధూమ్రవర్ణముగానుండుట, నేత్రములు గ్రుచ్చుకొనుట మరియు రోగము ముదిరినకొలది కంటిరెప్పలు యెరుపగుట ఒక్కొక్కప్పుడు ముల్తహిమా అను పొరకూడా యెరువుగా నుండుట యీమొదలగులక్షణములు కలిగియుండును. ఈరమద్ అనువ్యాధి బహుశా తలనొప్పివలన కలుగుచున్నది. విశేషముగా రోగిప్రకృతి వాతముతో కూడియుండును. మరియు మెదడునందు శుష్కత్వము యేర్పడును.

## వాతజరమద్ చికిత్స.

మెదడునందు చెమ్మకలిగించుటకై చెమ్మగలపదార్థములను వినియోగించవలెను. ఇందువలన మంచిలక్షణములు వుత్పత్తియగును. ఇందువిషయమై మాలిఖొలియా అనగావున్మాదమునందు చెప్పబడినది. అనగా యవగంజి పానము చేయవలెను. బంప్షా, కలువపూలు, ఖతమీఆకులు, నేతిబీరఆకులు, మరియు యవగడ్డి. యీమొదలగునవి కషాయముకాచి ఆకషాయమును తలముందుభాగమునందు పోయవలె

ను. మరియు యీకషాయములో అవిరిపట్టించుట స్నానముచేయుట మొదలగునవి మిక్కిలి వుపయోగించును. అథవా బనప్షాతైలము పరిశుభ్రమగు చనువాలు కలిపి ముక్కులోవేయవలెను. అనగా నశ్యము చేయవలెను. మరియు బేదానాజిగురు కండ్లలోవేయవలెను. అథవా బాబూనా, బనప్షా, అళిసిగింజలు మొదలగునవి నల్లకలువపూలరసములోనూరి కండ్లకు పట్టువేయవలెను. మరియు శియాపెపీనారంగు కండ్లలోవేయవలెను. మరియు దోషము నందు చెమ్మకలిగించుటకు మందు మలములను నష్టపరచునట్టియు గలములను హరించునట్టియు వస్తువులతో కాపాడుట వుచితమగును. అనగా యిట్టివస్తువులను మందుగా వాడకూడదు. మరియు చెమ్మకలిగించుటకు మందు దుపయోగించినచో శుష్కత్వమును అధికపరచును. అనగా దిక్కువరచునని భావము.

### శియాఫేదీనారంగు చేయు క్రమము.

సఫేదా, వెండిమశిల, ఇవిప్రత్యేకము ౩౫ మాషములు నల్లమందు, ౨ మాషము, కతిరా 5 మాషములు నిశస్తా తెన్నర మాషములు యీమొదలగునవినూరి కనికెలు చేయవలెను.

### 5 వ భేదము త్రిదోషరమద్ లక్షణములు.

ఈవ్యాధియందు నేత్రములు పీకుట, బరువుగానుండుట, నేత్రములవెంట నీరుబొత్తుగా స్రవించకుండుట అప్పుడప్పుడు యీవ్యాధియందు నొప్పికలుగుటవలన నేత్రములు యెరుపుగానుండుట యీమొదలగులక్షణములు త్రిదోషరమద్ (నేత్రములునొప్పి) లక్షణములని నెరుంగవలెను.

### త్రిదోషరమద్ (నేత్రములపోటు) చికిత్స.

బాబూనా, అకలీలుల్ మలికు, దవనము, మరువము యీవస్తువులను కషాయముకాచి ఆకషాయమును నేత్రములపై వేయవలెను. మరియుగోధుమపొట్టునజ్జలువేయించి కాపడముచేయవలెను. మరియు మలములనుహరించునట్టిద్రవ్యములను వేసికాచిననీళ్ళతోస్నానముచేయవలెను.

మరియు మల్తహిహూ అను పొరయందు బాహ్యకారణములవలన అనగా సూర్యకిరణములవలన మిక్కిలి ప్రకాశమగు వస్తువులను చూచుటవలన నేత్రములయందు వుష్ణము ప్రవేశించి నేత్రములయందు నొప్పి కలిగించును. దీనిని రమద్ (నేత్రములు నొచ్చుట) కుతకద్దూద్ అని కూడా చెప్పుదురు. దీని స్వభావము మూడునాలుగు దినములలో చికిత్స అవుసరములేకనే తగ్గిపోవును కాబట్టి దీనిచికిత్సవిషయమై తొందర పడకూడదు. మరియు యీనొప్పి తనకుతాను హరించకున్నను చికిత్స చేయకూడదు. యెందుకనగా దీనిచికిత్స రోగకారణములను తొలగించుటవలన వ్యాధి హరించును. మరియు రోగకారణము నష్టమైనచో చికిత్స చేయవలెను. మరియు దీనిచిహ్నములు హేతువుయందు జరిగినను లేక ప్రస్తుతము జరుగుచున్నను కొద్దిగా యెరువు నొప్పి కలుగును మరియు నీళ్ళు స్రవించనారంభించును.

## వుష్ణమువలన కలుగు రమద్ చికిత్స

ఈవ్యాధి మూడునాలుగు దినములలో శాంతినొందని యెడల హేతువును నష్టముకలిగించి శిరావేదనము చేయవలెను. విరోచనమునకు కరక్కాయలు, ఆలూబకరా, రేలకాయగుజ్జు, మొదీఫలముకలిపి కషాయముకాచి పానముచేయవలెను. మరియు, శియాఫె, అబియజ్ నేత్రములలో వేయవలెను.

(సూచనీయము) రమద్ అనగా నేత్రములు నొప్పి అని అర్థము యెల్లప్పుడు మంచుగడ్డను చూచుటవలనకూడా కలుగును. దీని చిహ్నములు చికిత్సనహితము కుమూరు అనగా నేత్రములతో తెల్లని ప్రకాశమగు వస్తువులను చూచుటవలన కలుగు వ్యాధి. కుమూరు ప్రకరణమునందుకూడా వర్ణించబడును. యీరమద్వ్యాధియందు రెప్పలు బిగిసికొని పోవునదేభయము కలిగినయెడల ప్రకృతిని బాగుచేసి మార్చివేసిన తరువాత శియాఫె, అబియజ్. మరియు, శియాఫె అబీర్ మరియు, జరూరె అబియజ్ అనగా వీనిలో అంజరూద్ చేర్చినది. ఆడశివుగల

తల్లిచనుపాలయందు శోధించబడినదియు నేత్రములలో వేయవలెను. యిటుల వేసినచో రోగము హరించిపోవును. వ్యాధి హరించి నేత్రములు శుభ్రతనొందిన వెనుక గుల్‌రోగన్‌లో శలాకముంచి నేత్రములలో పెట్టి నేత్రములపైని కట్టు కట్టినచో నేత్రములు అంటుకొనుట తగ్గిపోవును. మరియు, నేత్రములు నొప్పిగల వ్యాధులయందు యీవ్యాధి తప్ప యితర వ్యాధులయందు తైలములను నేత్రములలో వేయకూడదు. మరియు, ఇల్తిసాక అనగా ఒకటి కొకటి కలియునట్టి వ్యాధియందు కూడా వర్జించబడును. యిట్టి సమయమునందు నేత్రములయందు అధికముగా మెరుపుయుండి రెప్పలు పేలిపోయినను లేక పూసినటులుండినను రెప్పలు అంటుకొని పోవునను జాగ్రతవహించి యుండవలెను. మరియు, యిట్టి భయముకలిగిన యెడల వెంటనే నుపాయములతో కాపాడుకొనుచు సదుపాయములు చేయవలెను.

**2వ భేదము. తురఫా అనగా పటలము అను వ్యాధిలక్షణములు.**

తురఫా అనగా నేత్రములయందు మెరుపు, నలుపు, నీలిరంగుగల పటనములు యేర్పడును. యిది ముల్తహీమా పొరయందు వుత్పన్నమగును. యీవ్యాధి వుత్పన్నమగుటకు నాలుగు కారణములు కలవు. (1) నేత్రముపై దెబ్బతగులుటవలనగాని కన్ను అదురునంత దెబ్బతాకటవలగాని నేత్రసంబంధమగు ముఖ్యనరములు కొన్ని పేలిపోయి ఆనరములనుండి రక్తము బైలుదేరి ముల్తహీమా పొరక్రింద చేరును. ఒకప్పుడు పొరచిట్లి ముల్తహీమాపొర చినిగిపోవుటవలన యీవ్యాధి కలుగుచున్నది. (2) మలము నేత్రము నిండుటవలన నరములు విశేషముగా బిగించబడునట్టి కారణమువలన నరములు పేలిపోవును. (3) రక్తము యొక్క ప్రకాశము అధికమై వుప్పొంగి నేత్రములవైపు తిరిగి ముల్తహీమా పొరయందువచ్చి చేరును. (4) మిక్కిలి గంభీరముగా కేకలువేయుటవిస్తారముగా పరుగిడుట మిక్కిలి నడుచుట వ్యాకులము నొందుట శ్వాసనుబంధించుట మొదలగు అవస్తలు సంభవించినప్పుడు మొదట

పూర్ణగతి నొందుట. మరియు, రుధిరము పూర్ణశక్తి నొందుట యిరా మొదలగు కారణములవలన తురుషా అనగా నేత్రములయందు యెర్రని పటలము వుత్పత్తియగును. మరియు, యీతురషాయొక్క కారణము దుర్బలమగుచుండును. యిది చికిత్స అవసరము లేనే కొలదికాలము లోనే తనకు తాను హరించి పోవును. గాని దీనికారణము బలముగలదైనచో చికిత్స అవశ్యముగా చేయవలెను. యీవ్యాధిని సామాన్యముగా గ్రామ్యభాషయందు అవిరి అని చెప్పుదురు.

## తురుషా అనగా నేత్రపటలముయొక్క చికిత్స.



మలమును రెండవస్థానమునకు మార్చి శుభ్రతనొందించుటకై వరేరు అను నరమును ఛేదించి రక్తమోక్షణమును చేయించవలెను. మరియు కరకాయకషాయముతో శరీరమును మృదుత్వము నొందించవలెను. సనకమోనియా యీకషాయమునందు చూర్ణించి కలిపి యుపయోగించుట మిక్కిలి లాభదాయకమగును. తూరజాత్ వుపయోగించకూడదు. కాబట్టి యీవ్యాధియందు వస్తికర్మచేయుట మిక్కిలి వుపయోగము. నొప్పిశమించి మలము పక్వమునొందించుటకై మలము హరించునట్టి గుజ్జులను చినుబాలలోకలిపి కాచి వెచ్చగానుండునప్పుడు నేత్రములయందు వేయవలెను. మరియు కోడిగ్రుడ్డు తెల్లసొనయందు దూదితడిపి నేత్రములపై వేసి కట్టుకట్టి రోగిని వెల్లికిల పరుండబెట్టవలెను. నొప్పి శమించనియెడల పావురపుపిల్లల రక్తము వేడిగానుండునప్పుడు కండ్లలో వేయవలెను. మలమును తొలగించుటకై వంటడేగురు, కావిరాయి, సుద్దమట్టి అనగా, నామము యీమొదలగునవి వేడినీళ్ళతోనూరి పావురపు రక్తములోకలిపి వేయుట అన్నిటికంటె ఉత్త

మగుణము నిచ్చును. యిట్టి సమయమునందు వ్యాధి తగ్గనారంభించిన యెడల గవ్వపలుకు సాంబ్రాణి, తుమ్మజిగురు, రాతిపువ్వు, కుంకుమ పువ్వు, మొదలగునవి మలమును దూరపరచుటకై పావురమురక్తములో కలుపవలెను. మలము వెడలించుటకు అతిఅవశ్యమున్నయెడల వచ్చని హారిదళము, ఎఱ్రహారిదళము పావురపురుధిరమునందుకలిపి కండ్లలో వేయ వలెను. మరియు, గింజలుతీసిన ద్రాక్షపండ్లు, కామంచిఆకులు, వటిశుభ్ర మగు పన్నీరు కొద్దిగా సైంధవలవణము మొదలగువస్తువులను వకటిగా చేర్చి నూరి కండ్లపై పట్టువేయవలెను మరియు చాతరాశిఆకు, ఎండు జూపా యీవస్తువులను కషాయముకాచి నేత్రములకు ఆకషాయముతో కావడముచేయువలెను మరియు యీవ్యాధియందు చికిత్స అవసరమై యున్న యెడల సుస్తిచేయక వెంటనే చేయవలెను. యెందుకనగాచికిత్స ఆలశ్యము చేసినయెడల రక్తముయీవత్తు వకటిగాకూడుకొని కఠినత్వము నొందును. రూపము మారిపోవును. ఒకప్పుడు ఈతురుఫావ్యాధి సమాన భాగములు కుళ్ళిపోవును. యిందువలన రణములుకూడాగలుగుచున్నవి. మరియు. నేత్రములు యీవత్తు ఈరణము అల్లుకొనును. గాన యీవ్యాధి యందుఆయా భాగములయందు వెంటనేచికిత్సచేయువలెనుగాని, యెంత మాత్రము వుపేక్షించకూడదు.

మూడవ భేదము జుఫరా అనగా నేత్రపటలముల
వ్యాధి లక్షణములు.

కంటితెల్లగ్రుడ్డునందు జఫరాఅనువ్యాధి అనగా గోరుతోసమాన మగు ఆకారమువలె కలుగుచుండును. కాబట్టి దీనిని పార్షిభాషయందు నాఖూనా అని వాడుదురు. మరియు జుఫరాఅను వ్యాధి ఒక జీవనరము పెరుగుటయని భావింతురు. అనగా ఆజీవనరము కంటియొక్క ముంత హిమా పొరపైనివృద్ధియగుచుండును. మరియు నిది కన్నుయొక్క పెద్దకొలికియందు బహుశా ఎక్కువైవునుండి ఆరంభమగును. మరియు కంటి చిన్నకొలికి వైపునుండికూడా ఆరంభించును. కొందరికి రెండువై

వునుండికూడా ఆరంభమగును. ఈవ్యాధియొక్క ఔషధములు అనేక విధములుగా నుండును. ఒకప్పుడు ఈవ్యాధి కొద్దిగాపెరిగి నిలిచిపోవును. ఒకప్పుడు ముల్తహిమా అను పొరపైన మెల్లప్పుడు పెరుగుచూ అనగా కర్నియా అను పొరవరకు ప్రవేశించుచుండును. మరియు నిది కంటిపాప ను క్రమ్ముకొనును. నాఖూన అను యీరోగము నాలుగువిధములుగా నుండును. (1) ఝిల్లిసద్రుశముగానుండుచు మరియు ముల్తహిమా, అను నేత్రపొరయొక్క కుడి ఎడమభాగములయందున్ను క్రింద పైభాగముల యందుండి ఉత్పన్న మగుచున్నది. కంటికొలికతో సంబంధము కలిగి యుండదు. అనగా యిట్టి జుఫారఅను వ్యాధి దేనితో నియతదశసంబంధము కలిగియుండదు. గాన ఈకారణమువలన సలబ్ అనగా కండ్లనరములు యెఱ్రబడుటవలన కలుగువ్యాధి యేవిధముగా నుండునో అటులనే యుండును. అథవ యీరెండువ్యాధుల బేదాభేదము వర్ణించుట ముఖ్యము. సలబ్ అనువ్యాధి నేత్రముయొక్క యావత్తుభాగములనుండి వుత్పత్తి యగును. గనుక కర్నియా పొరవరకు అల్లుకొనుచున్నది.

మరియు నాఖూనా అనువ్యాధి వకవైపునుండి రెండవవైపుకు ప్రవేశించజాలదు. యిది యెప్పుడు గుండ్రాకారము కానేరదు. నాఖూను యేస్తలమునుండి పుట్టినను వేరువలె పుట్టుచున్నది. రెండవవైపుఅల్లుకొనుచుండును.

సబల్ అనువ్యాధి వేరువలెగాని కొమ్మలవలెగాని అల్లుకొనదు కాబట్టి నాఖూనా, సబల్అను నీరెండువ్యాధుల తారతమ్యములను ఆకారములను చూచి గ్రహించవలెను.

జుఫరా అనగా నేత్రవటలముల చికిత్స

ఈరోగమునందు సరేరు అను నరమును ఛేదించి రక్తమును వెడలించవలెను. విరోచనార్థము యారజాత్ మాత్రలు యుపయోగించవలెను. మలమును వెడలించుటకై శియాపేఅబీడజ్, సియాపేవినారంగ్, బాసలిఖూన్ అకబర్ అను ఔషధములను నేత్రములయం దుపయోగించవ

లెను. మరియు, బౌసగీఖూకా అకబర్ అను ఔషధమును స్నానముచేయు నప్పుడు నాఖూనా అంపటలము మెత్తబడుటకు కండ్లలో వేయుచున్నారు. యెందుకనగా మృదుత్వము నొందించునట్టి ఔషధములశక్తి సార్వకమాగా నుండును.

### శియాఫేకబీజజ్ చేయుక్రమము

నల్లసురుమా, సాదనజ్ యివి ప్రత్యేకము 5¼ మాషము వెండి మలినము 7 మాషములు, రాతిపువ్వు, సుకవీనజ్, పిచ్చళ్ళు యివి ప్రత్యేకముగా 5¼ మాషము ఈవస్తువులలో రాతిపువ్వు, సుకవీనజ్, గవ్వపలుకుసాంబ్రాణి యీవస్తువులను పాతసారాయితో అరుగదీసి తక్కిన వస్తువులనుచూర్ణించి, వస్త్రగాలితముచేసి యిందులోకలిపి శియాఫ్ తయారుచేసి యుంచుకొనవలెను.

### శియాఫెఖీనారంగు చేయుక్రమము

ఇంగ్లీకము, తామ్రభస్మము, యెర్రహారిదళము, గవ్వపలుకుసాంబ్రాణి, తిలకండ, రాతిపువ్వు యివిప్రత్యేకము ఒకభాగము బాలింతబోలం, కుంకుమపువ్వు, పసుపు యివిప్రత్యేకము 14 భాగములు. యీవస్తువులు యావత్తునూరి చూర్ణముచేసి నీళ్ళతోనూరి కనికెలుచేసి యుంచుకొనవలెను ఈకారణమువల్ల నిది శియాఫ్ ఖీనారంగువలెనుండును. యిందువలననే దీనిని శియాఫెఖీనారంగు అని చెప్పుదురు.

### రెండవప్రకరణ నాఖూనా గోరువంటి నేత్రపటల లక్షణములు

నేత్రముయొక్క పెద్దగోలికియందుండు మాంసమునకు బతత్ అందురు. ఆరంభమునందు కన్నియా హార దరినుండి అల్లుకొనునంతవరకు నలుపురంగు కలిగియుండును. అంతటప్రవేశించి చిక్కనై నిలిచిపోవును. మరియు, యీవిధమగు నాఖూనా అనునేత్రపటలము బహుదా అచ్చటనే నిలిచిపోవును. గాని నలుపురంగు పైకి మిగులజాలును. కాబట్టి దీనిని నిశ్చయించుటకు వీలులేకయుండును అనగా తెల్లగ్రుడ్డు పైనుండి నల్లగ్రుడ్డుపైకి చేరువరకు దీనిచికిత్సచేయకూడదు, మరియు, యీవ్యాధివలన

కొద్దికష్టముపోర్చుట వుచితముగానేయుంచును. యెందుకనగా వుష్ణకర ఔషధములువుపయోగించుటవలన దృష్టియొక్క బలము తగ్గిపోవును. మరియు, తీక్ష్ణములమును మిక్కిలితీసివేయునట్టి ఔషధములు విశేషకరి నల్వేమును కష్టమును గలిగించు చుండును. యీ నాఖూనా పటలముతో సమానమగువ్యాధి మరియొకటిలేదు, అయినను యీనాఖూనా తప్ప దీని నితరభాగములను కష్టము కలిగించకూడదు. యధ్యాపి యీవ్యాధి కలుగుటవలన దృష్టి భంగము కాజాలదు. యిది నల్లగ్రుడ్డుపైకి ప్రాకినచో నేత్రదృష్టి భంగమగును. అట్టితరి మొదటిభేదమునందు చెప్పబడిన ఔషధములను కండ్లలో వేయవలెను. అయిన నిది బహుళా నల్లగ్రుడ్డుపైకిప్రాకి దృష్టిని చెరుపునట్టిదికాదు.



## మూడవ భేదము నాఖూనా యనగా గోరువంటిపటలము.

ఈవ్యాధి నల్లగ్రుడ్డుపైకి ప్రవేశించి దృష్టిభంగము కలిగినచో నిస్సందేహముగా దీని చికిత్స శస్త్రముతో చేయవలెను. శస్త్రముతో తీయుక్రమము అనగా నాఖూనాపటలమును రెండువంకరశస్త్రములతో అనగా యిందువిషయమై యుపయోగించు శస్త్రములతో తీసివేయవలెను. అనగా ముల్తహీమా పొరనుండి నిర్మూలముగా యెత్తివేయవలెను. తదుపరి యిందువిషయమై యేర్పర్చబడిన శలాకతో గాని లేక కోడి యీక మొదలువైపునుండి ప్రవేశపెట్టి వేరుతో తీసివేయవలెను. దీనితో యావత్తు లేచిపోవును. అందుండి యేమియు కంటిపైనుండు ముల్తహీమాపొరపై అంటియుండునది. యేమియు శేషము లేకుండునటులవ్రాసి

వచ్చును. ఇటుల శస్త్రప్రయోగము చేయుటకు గొప్పబుద్ధిగలవారుగా యుండవలెను. అనగా యిట్లు శస్త్రకర్మ చేయుటవలన కంటికొలికిగాని కొలికియందుండు మాంసముగాని తెగకూడదు. యెందుకనగా కొలికి యందుండు మాంసపు ముక్క తెగినయెడల కండ్లవెంట యెల్లప్పుడు నీరు స్రవించుచుండును. మరియు యిందు రతూబత్ బైజియా అనగా కంటి నీరుచేరి కండ్లు గ్రుడ్డివగును. కాబట్టి నేత్రవైద్యులు నాఖూనాకున్ను కంటి కొలికికిన్ని మాంసమునకున్ను జాగ్రత్తగా కనిపెట్టి జాగ్రత్తగా తీసివేయ వలెను. అనగా కంటికొలికి చీల్చనేకూవలెను. మరియు నాఖూనాకున్ను కంటికొలికియొక్క మాంసమునకున్ను భేదమేమనగా నాఖూనా అను పటలము తెల్లగా కఠినముగా నుండును. కంటికొలికిమాంసము మృదువుగా నెర్రగా నుండును. మరియు ఒకప్పుడు నాఖూనా యెర్రగాకూడా నుండును. దీనియెరుపు నేత్రకార్యముల యెరుపుతో సమానముగా నుండనియెడల నాఖూనాకు వేరునుండి పీకివేయవలెనని ఆజ్ఞాపించిరి. అనగా కొద్దిగా శేషము కంటిలో నిలిచినను తిరిగి వృద్ధియై కొద్దిరోజు లలోనే పెరిగి మామూలు అంతనగును. ఇటువంటి నాఖూనా అనగా నేత్రపటలవ్యాధి రెండువిధములుగా కలుగుచున్నది. (1) ముల్తహిమా హారతో సంబంధములేకుండా కలుగును. అనగా ఆహారతో సంబంధము లేక వేరుగానుండును కాబట్టి కనిపెట్టుటకు కష్టముగానుండును. (2) ముల్తహిమాహారంతో అంటుకొని పరువువలె నుండును. అభిప్రాయమే మనగా దీనిని కనిపెట్టలేకపోవును. మరియు హారతో సంబంధము లేక యుండునది. అతిసహజముగా శస్త్రకర్మవలన లేచిపోవును. మరియు బద్ధ వలెనున్నచో దీనిని వేరుచేయుటకుపాయము ముందుగా నాఖూనాకు వకవైపునుండి కోసివేసి దానినియెత్తి శస్త్రము అందు ప్రవేశించునంత వరకు ముల్తహిమాహారతో నాఖూనాకు వేరుచేయవలెను. మరియు మిక్కిలి పదునులేని సలాకుశస్త్రముతో కోసివేయవలెను. ఈపనిజాగ్ర త్తగాచేయవలెను. గురువువలన కనిపెట్టక శస్త్రవిద్య నెరుగక అజాగ్ర

త్తతో చేసినయెడల ప్రపంచకమునందు నిందపడియుండి పాపములను సంపాదించినవాడగును. గాన సావధానుడై యుండవలెను.

(సూచనీయము) శస్త్రప్రయోగము చేసిన తరువాత జీలకర్ర ఉప్పు నములి బట్టలోవేసి కండ్లకు పిండవలెను దీనివలన మచ్చపడును. తరువాత గుల్ రోగన్‌లో కోడిగుడ్డు తెల్లసొనకలిపి కండ్లపై వేయవలెను యిందువలన మంటతగ్గిపోవును. మరియు రోగి ప్రత్యేక సమయమునందు పాపను కదలించుచుండవలెను యెందుకనగా కంటిరెప్ప ముల్తహిమా అనుపొరతో అంటుకొనకూడదు. రెండవదినమున వేళ్లను విప్పి తిరిగి జీలకర్ర ఉప్పు నములి బట్టలోవేసి కండ్లకు పిండవలెను. మూడవదినమునందు తరువాత కాహనోసనాయి అనగా సురుమా అ[illegible] అనగా సురుమా యీఔషధములు తప్ప యితర ఔషధములు వుచితమని తోచిన యెడల కండ్లలో వేయవలెను. మరియు నాఖూనాకు ముల్తహిమాపొర నుండి యావత్తు కోసితీసినదో యిట్టిదశయందు శేషించియుండు దానిని జౌనఖూన్ అనగా సురుమా మొదలగువానితో తీసివేయు నుపాయములను ఆలోచించవలెను. కండ్లయందు ఔషధము ప్రయోగించవలసిన యెడల స్నానముచేసినవెనుక వేయవలెను. మరియు నాఖూనాకు శస్త్రముతో తీయుటకుముందు శరీరము, మెదడునందుగల మలమును తీసివేసి సుభ్రపరచవలెను. ఈమలకారణము యేమియు హానికలుగనియ్యదు. గాన మలశోధన ఆపినపిదప శస్త్రకర్మ చేయవలెనని చెప్పియున్నారు.

## అయిదవ భేదము నాఖూనా అనగా నేత్రపటలము లక్షణములు.



మరియొకవిధమైన నాఖూనావ్యాధి వుత్పత్తియగును. నిడిచాలా వక్రతతోగా కలుగును. ఈవ్యాధియందు రెండు పొరలు వుత్పత్తియగును. ఒకటి బైటిభాగమునందు రెండవది లోపునందు కలుగును. ఈపొర

యొక్క పైభాగము ముల్తహీంమా ప్రక్కనుండి బైలుదేరును. నిది ముల్తహీంమాపొరతోచేరి అంటుకొని యుండును. లోపలిభాగము ఆపొరనుండియే నేత్రమును ఆక్రమించియుండును. అనగా నల్‌బియా పొరకు అంటుకొనియుండును. మరియు నల్‌బియా పొరప్రక్కనుండి లోభాగము యితరభాగములవైపు తిరిగి బైటికివచ్చును. మరియు ఈ స్తలమునందు నాఖూనా వుత్పత్తిస్తానమని గ్రహించవలెను. కాబట్టి ఈవిధమగు నాఖూనాయందు లోహసంబంధమగు శస్త్రములను తగులనియ్యకూడదు. అనగా శస్త్రప్రయోగము చేయుంజనదనుట. యెందుకనగా నల్‌బియాఅను పొర తెగిపోవును. నల్‌బియాపొర తెగిపోయినయెడల కుజాజ్ అనువ్యాధి వుత్పత్తియగును. యీకుజాజ్ అను వ్యాధి వర్ణనము వెనుక చెప్పబడియె. యిచ్చట గమనించవలసిన అంశమేమన కుజాజ్ అను వ్యాధి తీవ్రవ్యాధులలో నిది నీవ్యాధి నాలుగుదినములలో చంపివేయును. లేదా నాలుగుదినములలో శాంతినొందును.

{ నాలుగవ భేదము సబల్ అనగా కంటినరములు యెఱవు యొక్క వ్యాధి }

ఈ వ్యాధియందు కంటినరములు యెర్రినగుచుండును. కారణమేమనగా చిక్కని రక్తము మరియు, విశేష ఆవిరి పరమాణువులతో నిండియుండును. యిట్టి కారణమువలన కంటియందు దురద కలుగుచుండును. యీవ్యాధి వుత్పత్తియగు స్తానకారణములు రెండు విధములుగానుండును. (1) మలము ముల్తహీంమా పొరయొక్క నరములయందు ఖనీభవించియుండును. గనుక నరములు ఉబ్బి నిండి యెర్రిగానుండును. మరియు, కర్నియా పొరపైన బైటివైపు ఒకపొర యెర్రిని దుబ్బురంగుగలది వుత్పత్తియగును. యీకారణము వలన యీ నరములు తలవురెప్పలోపలనుండి బైలుదేరి వచ్చును యీ వ్యాధియందు మొదట లోపలమంట, నొప్పి, పోటునహా బైలుదేరును. మరియు, తుమ్ములకు మిక్కిలి కష్టముగా నుండును. కంటిలోపల చుట్టున్ను నొప్పికలుగుచుం

డును. (2) మలము ముల్తహిమా పొరయొక్క బైటివైపు నరముల యందు, మరియు తలపురెప్ప బైటనుండి బైలుదేరి వచ్చుచున్నది. మరియు, యీకారణమువలన నరములు యెర్రగను, బరువుగను, వుష్ణముగానుండును. కర్నియా పొరపైనకూడ ఒకపొర పొగవలె క్రమ్ముకొని యుండును. యీరోగమునందు మలము తలపురెప్పబైటనుండి వచ్చుచున్నది. రెండుకపాలములు యెర్రబడుచున్నవి. మరియు, రెండు బొమలలో వేడిన్ని నొప్పి యెల్లప్పుడును కణతలయందు పోటు అధికముగా యుండును. యిట్టి సమయమున రెప్పలు తనవైపు క్రిందికి లాగినయెడల సబల్ నరము ముల్తహిమాపైనుండి లేచుచుండును. యీ రెండువైపుల సబల్ యందు రోగి సూర్యకిరణములను, దీపపువెలుగును చూచుటకు సహించలేకుండును. మరియు, సబల్ వ్యాధి కారణము చిన్నఃముల నిరుద్ధతవలన మూడు విధములుగానుండును. యిందువలన దీనిని నేను మూడు ప్రకరణములలో వర్ణించితిని.

## మొదటి ప్రకరణము చెమ్మగల సబల్ వ్యాధి వర్ణనము

ఈవ్యాధి చిన్నఃములు కంటియందు నీరు స్రవించుట రెప్పల యందు విశేషముగా వాతము చేరియుండుట; మరియు, యీవ్యాధి యొక్క మలము బహుదా లోపలినరములలో కలుగుచున్నది. యిందు విషయమై వెనుక వర్ణించబడెను. యీకారణమువలన కన్నుచుట్టు నొప్పి, పోటు, తుమ్ములు యెల్లప్పుడు కలిగియుండును. యీరోగ

మాయొక్క చికిత్స శస్త్రములో ఛేదించుటకూడదు. యెందుకనగా యీనరములు ముల్తహిమా అను పొరలో వడియున్నవి. యిందువలన శస్త్రప్రయోగము చేయుట మంచిదికాదు.

రెండవభేదము శుష్కత్వమువలన కలుగు నబల్ వర్ణనము

దీనిచిన్నములు ఝిల్లియొక్క నబల్‌తో నమానముగును. మరి యొకవస్తువు యిటుల కంటి నీరును స్రవింపచేయునదియు రెప్పలయందు వ్యాధిని ప్రకటించునదియు లేదు. యిందులో శుష్కత్వకారణము అనగా మలము నీరు స్రవించుటవలన గట్టిపడును. యిటుల గట్టిపడి శుష్కించి స్తంభించును

నబల్ రోగ చికిత్స

ఈరోగమునకు మెదడు మార్గదర్శినిగాయుండును. కాబట్టి మెదడుయొక్క శుభ్రతకొరకు నరేఱు అను నరమును ఛేదించి రక్తమోక్షణమును చేయించవలెను. మరియు, యారజ్ మొదలగు ఔషధములతో శరీరమును మృధుత్వము నొందించవలెను. మరియు, మలము శుభ్రత నొందుటకై చికితత్సచేసి తదుపరి కోష్టముకు మెత్తపరచి మలమును వెడలించవలెను. అనగా కోష్టముకు మృధుత్వము నొందుటకై రిక్తగర్భమునందు స్నానముచేయించుచుండవలెను. మరియు, తేజత్వము ప్రకాశము నొనర్చునట్టి బానలిఖూగాని యితరములగు స్వభావికముగల నుర్మాలు మొదలగునవి నేత్రములయందు వేయుచుండవలెను నుర్మా ఉపయోగించుటలో నబల్‌యొక్క సూక్ష్మసంధ దశలయందు ధ్యానముంచవలెను. అనగా నబల్ వలచగా నున్నచో శియాఫేదీనా రంగు వుపయోగించవలెను. యింతకంటె తీక్ష్ణముగు ఔషధములను వుపయోగించకూడదు.

నబల్ వ్యాధి శుష్కత్వమువలన కలిగినయెడల కండ్లయందు ఔషధము పెట్టుటకు ఆది అంతేములయందు స్నానముచేయించవలెను. ఇతర నుపాయములు నాఖూనా వృణమునొందించుటలో వర్ణించబడియె.

ఖుటుల వర్ణించబడిన ఔషధసదుపాయములను యిందుప్రయోగించవ లెను. యిందువలన చిక్కని మలము మెత్తబడును. ఔషధగుణమును త్వరలో గ్రహించును. ఒకప్పుడు సబల్‌తో కూడ కన్ను వృష్ణమునొంది నొచ్చుచుండినయెడల కంటిపైని చల్లని ఔషధములను వేయకూడదు. మరియు మలమును ఈడ్చుట, తీసివేయుట పక్వమునొందించుటయందు తృప్తిపరుచవలెను. మరియు కోడిగ్రుడ్డుతెల్లసొన కంటిపై లేపనముచేయ వలెను. జరూరె అగబర్ కూడా యుపయోగించవచ్చును. మరియుకన్ను అధికవృష్ణప్రకోపముతో నొచ్చుచుండినయెడల సియాఫె అవియజ్ మ రియు జరూరెమలకాయ యెల్లప్పుడు ఉపయోగించకూడదు. మరియు శ్యాదనజ్అగసి, మగసూల్ మొదలగునవి అనగా నేత్రముల నొప్పి శమింపని యెడల తీవ్రమగు ఔషధములను కళ్ళలో వేయకూడదు. మరి యు, సియాపెనమాశ ఉపయోగించుట మంచిది. దీనివలన సబల్, రమ ద్, మొదలగువానియందు ఉష్ణము కలిగించును. కాబట్టి యిట్టి ఔషధ ములను వాడుట ప్రశస్తము.

(లాభము) వాతమును వృద్ధివేయునట్టి భోజనపదార్థములు అన గా, పాలకూర, నీరుల్లి, ఎల్లుల్లి, ఓరిచెవగలు, గంధనా మరియు కఠిన పదార్థములు చల్లనిపదార్థములు అనగా చేపలు మొదలగువాని మాంస ములు ఇత్యాదివస్తువులను సేవించుట అన్నివిధములగు సబల్ అనగా నేత్రసంబంధమగు పటలముల వ్యాధులయందు వర్జితము. మరియు, మ ద్యపానము, పాలు పానముచేయుట, పాలతో తయారుచేసిన పదార్థము లను భుజించుట, మిరాయి మొదలగునది ఈవ్యాధియందు హానికరము లు. దుమ్ము, పొగ విశేషముగా మాట్లాడుట, కేకలువేయుట ముక్కు ట, ప్రకాశమగు కాంతినిచూచుట మొదలగునవి నేత్రరోగులకు అహిత కరములు. మరియు ఉత్తమమగు అంశము అనగా ఈరోగికి తలక్రింద తలగడయుంచి తలయెత్తుగా నుంచవలెను. మరియు, వెల్లికిలపరుండుట తలవంచుకొనుట మానవలెను.

మూడవవిధమగు సబల్ అనగా నేత్రపటలముల లక్షణములు.

ఈసబల్ దృఢముగా చిక్కగా పురాతనమూనుండి యుండునదిగా నుండి కంటినల్లగ్రుడ్డునందు ఆక్రమించి దృష్టిబలమును తనప్రకృతియందు చేరనియ్యక ఆపివేయును. ఇందులో రెండు హాంశములు గలవు. (1) సబల్ విశేషమందముగా దృఢముగా నున్న యెడల నేత్రదృష్టి విశేషముగా తగ్గిపోవును. నేత్రసంబంధమగు నరములు విశేషముగా వుబ్బిపోవును. (2) సబల్ పొరయందు చేరినదో కంటిగ్రుడ్డుయందు బాగుగా నబల్ కనిపించుచుండును. అనగా సాలెపురుగుగూడు అల్లినటుల అల్లబడియుండును. మరియు యిట్టి కారణమువలన దీపమందు వెలుగు స్వల్పముగా యున్నదని గ్రహించవలెను. ఈసబల్ యొక్క నరములు చిన్నవిగను, యెర్రవిగను నుండును. ప్రత్యేకదశయందు యెంతయుండునో అంతయు నబల్ యొక్క ముందువివరముకంటె అధికముగా నుండును. గాన చదువరులు గ్రహించగలరు.

సబల్ అనగా నేత్రపటలము చికిత్స.

సబల్ యందు దృఢత్వము చిక్కదనము అధికముగా యుండని యెడల దీనిచికిత్సను వెనుక వర్ణనచేయబడియె గాన సబల్ యొక్క అధికతయందు హరించు సదుపాయములవలన హరించనియెడల అట్టితరి శస్త్రప్రయోగమువలన తీసివేయవలెను సబల్ అను కంటిపై పొరను (పటలమును) తీసివేయుటకు అంబ్లిభాషయందు లకత్ అందురు.

వాసపీఖాన్ సురుమా చేయుక్రమము.

సముద్రఫేనము, వెండిముఖల ప్రత్యేకము 3½ మాషములు మామిరాన్ పసుపు యివి ప్రత్యేకము 10 మాషములు, తామ్రభస్మము సైంధవలవణము ఆకుపత్రి సీసభస్మము, మిరియాలు, పిప్పళ్లు, జటామాంసి, మైలతుత్తము, యివి ప్రత్యేకప్రత్యేకము 7 మాషములు కరక్కాయబెరడు, సముద్రవలణము, శియాషెమామిసా, యివి ప్రత్యేక ప్రత్యేకము 17 మాషములు కస్తూరి 1న్నర మాషములు యీమొదల

గు వస్తువులు దంచి చూర్ణించి సన్నని బట్టయందు వస్త్రగాలితమొనర్చి నేత్రములయందు వేయుటకు యోగ్యముగా సురుమాపొడులచేసి యుంచవలెను. బాసలిఖూశా అనగా రాజులు నబాబులు పాదుషాలు మొదలగు వారికి యోగ్యమగు ఔషధమని భావము.

శియాఫెదీనారంగుచేయు క్రమము.

పసుపు, కాదనజ్, అదళిమగసుల్, కమాసాంబరము, శియాఫె మామిసా, యీనాలుగువస్తువులను సమానముగా తూచి చూర్ణించి కనికెలు చేయవలెను. ఇదిస్వల్పముగు సబల్‌రోగములను దూరపరచును.

శియాఫె సమాద్ చేయుక్రమము.

ఇది సబల్, రమద్వ్యాధులయందు మిక్కిలిలాభదాయకము. సమాక్ (తుతరుగ్‌ద్) అనువస్తువు యెంతకావలయునో అంతతీసికొని మంచినీళ్ళలో నానవేసి దీని రంగును నీళ్ళవడిపోసి యందులో దుమ్ము నలకలు పడకుండా జాగ్రత్తగా యెండించి గట్టిపడినయెడల కనికెలుచేసి యుంచుకోవలెను.

సబల్ నేత్రపటలమును తీయుక్రమము

నేత్రవైద్యులు బుద్ధిమాన్ క్రియకుశల ప్రవీణులు సబల్‌యొక్క నరములను కంటిపైనుండి పైకిలేవనెత్తి కత్తెరలో కత్తిరించవలెను. మరియు నరములను లేవనెత్తుటకు దూరపరచుటకు రెండువిధములు కలవు. (1) బహుశ మంచిసూదితో యీనరములను దారముతో కుట్టి తదుపరి యీదారముయొక్క రెండుచివరలుపట్టుకొని పైకిలాగివేయవలెను. దీని వలన నరములు యావత్తు లేచివచ్చును. (2) యీనరములను క్రమణముతో యెత్తివేయవలెను. సారాంశమేమనగా రోగదశయెటులుండునో అటుల ప్రయోగము చేయవలెను. మరియు నరములను తీసినపిమ్మట స్నానముచేయించి చూడవలెను. అనగా నరములు వున్నవాలేవా అను విషయమై పరీక్షించవలెను. ఇంకానరశేషమున్నయెడల వాటినికూడా తద్విధముగానే తీసివేయవలెను. అనగా శేషభాగము నిలిచినచో వృద్ధి

పోగును. మరియు శిరములు తీసికోసిన తరువాత ఉప్పు జీలకర్ర నమలి బట్టలో వేసి కండ్లలో పిండవలెను. తరువాత రోగితో కన్నురెప్ప లోపట త్రిప్పుచుండుమని ఆజ్ఞాపించవలెను. ఇట్లు కండ్లుత్రిప్పుటవలన రెప్పలంటు కొననేరవు. మరియు కొంచెము గ్రుడ్డుసొన గుల్‌రోగన్ (అనగా గులాబిపూలతో చేసిననూనె) యందు ముంచిన దూదెను కంటిపై వేసికట్టుకట్టవలెను. తిరిగి రెండవదినమునందు మొండవగులాబిపువ్వు నీళ్ళలో వేసి కషాయము కాచి ఆకషాయముతో కన్నుకడుగవలెను తరువాత గుల్‌రోగన్‌లో సలాకు ముంచి కంటిలోపట రాయవలెను. ఇట్లు చేసినచో కనురెప్ప ముల్తహిమా అను కంటిపొరతో అంటుకొననేరదు. ఒకవేళ అంటుకొనినయెడల వెంటనే దూరపరచవలెను. రెండవతూరి జీలకర్ర ఉప్పు నమలి బట్టలో వేసి పూర్వమువలె కంటిలోపిండవలెను. మూడుదినములవరకు ఇటుల జీలకర్ర ఉప్పు నమలి కంటిలో పిండుచుండవలెను. ముల్తహిమాపొర రెప్పతో అంటుకొనినను తీయున్నను మూడుదినములు గడచినపిమ్మట బానలీఖూన్‌గాని యిట్టిస్వభావికముగు యితరఔషధములనుగాని వుపయోగించవలెను. ఈఔషధప్రయోగమువలన నబల్‌వ్యాధియొక్క మూలముబొత్తిగా నశించిపోవును. మరియు రమద్ అనగా కండ్లనొప్పి వావు వుత్పన్నమైనచో ప్రత్యేకముగు చికిత్సలనుచేసి తరువాత నబల్ అనగా పొరచికిత్సచేయువలెను.

(లాభః) మునార్ అనగా శస్త్రమునకు పేరు. లోహముతో కనుదువలె చేయబడును. దీని తల వంకరగా నుండును. యీశస్త్రముఖము మొల్లువలెనుండును. దీనితో చేపలను పట్టుదురు. మరియు, నబల్ వక విధమగు రోగము. రమద్ ఉష్ణము వుపరికారణమువలన ఉత్పన్నమగుచున్నది. రమద్ అనగా నేత్రమునొప్పి ఉబ్బుటవలన రమద్ అందురు. ఈవ్యాధియందు చల్లని పదార్ధములు వుపయోగించుటవలన రుధిరము చిక్కబడి చర్మము మందమగును. రోమాంచములు బంధించబడును. మలము వెడలుటకు ఆటంకము కలుగును. యిట్టి కారణమువలన నర

ములు వుబ్బి వ్యాధి వృద్ధిగొందును. దీని చిహ్నములు ముల్తహి మా అను కంటిపొరవాపు లేకనే మెరుపు మొక్కట యీపొరపైని యెఱ్ఱని నరములు నిండియుండుట యెల్లప్పుడు నొప్పిగానుండుట కండ్ల వెంబడి నీరు స్రవించుట మొదలగు లక్షణములు కలిగియుండును.

రెండవ విధమగు చికిత్స

ఇట్టి స్థితియందు శిరావేధన మొనరించి రుధిరమును వెడలించ వలెను మరియు, విరోచనమునకు వచ్చు మలమును విరోచనముద్వారా వెడలించవలెను. పిమ్మట మలదోషమువలన తీవ్రత అధికముగానున్న యెడల శియాఫెఅబియజ్ కండ్లలో వేయవలెను. లేనిచో యేవస్తువు యేఔషధము మలమును మెత్తపరచి వెడలించునో అట్టి ఔషధములు లేక వస్తువులను కండ్లలో వేయవలెను అనగా శియాప్ అహమర్ లయ్యాన్, సురమా మిశ్రము, జరూరెదిమూది అను ఔషధములను ప్రయోగించి మలమును హరింపచేసి ప్రకృతిని కాపాడవలెను.

జరూరె దిమూదియా చేయుక్రమము

మామిరానెచీని 3కె మాషములు మైలతుత్తం శుద్ధిచేసి నల్ల గాకాల్చినట్టిది శిహ కాల్చినట్టిది శుద్ధిఅయినది. శిహ అనగా ఒక విధ మగు చెట్టుజాతి. దీని ఆకులు సదాపాకులవలె నుండును. మరియు, తబాద్ అనగా శుద్ధిచేసిన తాంబ్రభస్మము సురమా శుద్ధిచేసిన అన్న భేది యివి ప్రత్యేకము 7 మాషములు. యీవస్తువులను చూర్ణించి వస్త్రగాలిత మొనరించి వుపయోగించుకొనవలెను.

సలబ్ అను వ్యాధియందు గజ్జి, దమా యీవ్యాధులు నేత్ర ములయందు కలుగు రోగములు. యీ సలబ్ వ్యాధియందు ప్రతిసమ యమందు నేత్రములు తడిగానుండును. ప్రయత్నము లేకనే కండ్లలో నీరు నిలిచియుండును. యిట్టివ్యాధికి లాభము కలిగించుచున్నది. మరి యు, యీరోగము కొందరికి గాలిసబల్ వ్యాధులను నష్టముకలిగించును. గాన శియాఫె అనబద్, శియాఫెఅబీజజ్ అనునవి కండ్లయందువేయుట

నొసలు యొక్క నరమును, కంటికొలికి నరమును ఛేదించి రక్తము వెడలించుట మిక్కిలి లాభదాయకమైనది.

### నబల్ వ్యాధియందు లాభదాయక శియాఫెఅజవద్

అకాకియా అనగా తుమ్మకాయదంచి రసముతీసి యెండించినది తుమ్మజిగురు ప్రత్యేకము 28 మాషములు తాంబ్రభస్మము 17½ మాషములు, తెల్లతుమ్మచెక్క, నల్లమందు యిది ప్రత్యేకము 5½ మాషములు యీవస్తువులనుదంచి చూర్ణించి వస్త్రగాలితముచేసి నీళ్ళతో నూరి కనికెలుచేసి వుపయోగించుకొనవలెను.

### { ముల్తహిమాఅను పొర ఉబ్బుటకున్ను పైకుబుకుటకున్ను లక్షణములు. }

హకీం బుకరాత్ గారిచే చెప్పబడిన పుస్తకము అనుసారకముగా యిందలివిషయమై వ్రాయునదేమనగా ఇన్తిఫాక అనునది చల్లనివాపు. యిది కంటిలో దురదతో కలుగుచున్నది. నిశ్చయముగా యివ్విధముగా యున్నది. ఇన్తిఫాక కృత్రిమరీతితో వాపుఅని చెప్పుదురు. లేనిచో వైద్యులు వాపును ఇన్తిఫాకయందు భేదముని మితవరచిరి. అనగా వాపు యెటుల కలుగుచున్నదనిన కంటిదృష్టి ప్రకృతానుకూలముగా వ్రణములు కూడా కలుగును. ఇన్తిఫాకు అనగా వాపుపైకివచ్చుటకున్ను, కేవలము దుష్టప్రకృతి కంటియందు కలుగుచున్నది. గాని వ్రణములు మాత్రము కలుగవు. యెందుకనగా పూర్వవైద్యుల మతానుకూలముగా యేకారణమువలన ముల్తహిమాఅను పొర వుబ్బిపోయినను రమద్ అనగా నేత్రమునొప్పియు పైకివచ్చుటయందున్ను కేవలము దుష్టప్రకృతి కండ్లయందు కలుగుచున్నది. వ్రణములు మాత్రము కండ్లలో కలుగవు. యిటులకాకుండినచో పూర్వపువైద్యుల మతమునందు ఈకారణమువలన ముల్తహిమాపొర యుబ్బుటకున్ను, పూర్ణము పొందుటకున్ను రమద్ అనగా నేత్రమునొప్పి అని గుర్తించబడకున్నది. మరియు ఈరోగము కారణానుసారముగా 4 విధములుగా వర్ణించబడుచున్నది.

(1) ఈవ్యాధియొక్క కారణము వాతమైనచో దీనిలక్షణములు అగస్మాత్తుగా రోగము పుట్టుచున్నదగును. మరియు భారము తెలియుచుం డును. ముందు నేత్రములవైపు మిక్కుటమైన చీముపులు, దోమలు కరచినట్టు లమంట కలుగును. మరియు కొద్దిగామంట మురదకూ కూడియుండును. దీనిరంగు కఫజనేత్రవాపునందు నేత్రరంగువలె నుండును. వృద్ధులందు యౌవనపురుషులకు ఈవ్యాధి పుట్టుచున్నది.

### —వాతమూలమైన పుట్టుకకు చికిత్స—

ఈరోగమునందు రెండుమూడు రోజులవరకు చికిత్స చేయకూడదు. ఎందుకనగా వాతమలము తనకుతానే నశించగలదు. ఈ రెండుమూడు దినములలో మలము నశించనిచో వెంటనే జీర్ణమగునట్టి లఘుభోజన పదార్థములను యివ్వవలెను. మరియు ఉష్ణోదకముతో నేత్రప్రక్షాళనము చేయవలెను. ఝిల్లి స్వస్తతనొంది దురదశమించి అవశ్యముగా కలుగును. మరియు రోగారంభదశయందుండి నిలిచియున్నయెడల శియాఫె అబియజ్, సల్లమందు చేర్చునట్టి జహూరెఅజవర్ కండ్లలో వేయవలెను. మరియు మలమును తొలగించుటకై, ముసాంబరము శియాఫె మామిసా అకలీలుల్‌మలిక్ అనగా సఖుందిప్పలు, చందనము మరియు యితరములగు యిట్టి స్వాభావికమగు వస్తువులతో చేయబడిన ఔషధమును నీళ్లతోనూరి కంటిపై పట్టువేయవలెను. మరియు అంతమునందు జరూరె అజఫర్‌సగీరా, శియాఫెహామరెలయ్యాకతో కలిపి కండ్లలో వేయవలెను. మరియు ముసాంబరము, రసాంజనము, కుంకుమపువ్వు మొదలగునవి కామంచాకు రసముతోనూరి కండ్లపై లేపనము చేయవలెను. మరియు శుష్కింపజేయునట్టి పదార్థములను భోజనార్థ మివ్వవలెను. యేవస్తువు వశ్యమునొందించునో అట్టివస్తువులను వర్జించవలెను. మరియు అవశ్యమైనయెడల ప్రతిదినము రాత్రికాలమునందుఇత్రిఫల్ సేవించవలెను.

(2) ఈవ్యాధికారణము కఫము అయినయెడల దీనిచిహ్నములు భారముగానుండుట మరియు వాతవ్యాధి చల్లగను, చెమ్మగనుండును.

యిట్టి సమయమునందు ఈవ్యాధిని శాంతింపజేసినచో దీర్ఘకాలమువరకు దీనియందు శాంతినొందు చిహ్నములు కలిగి తిరిగి వేగరము సరిగా నుండనేరదు.

—2 భేదము కఫదచికిత్స—

యీవ్యాధియందు కఫము హరించుటకు యారజాత్ యివ్వవలెను. అథవా, శికింజబీన్ వేడినీళ్ళతోగాని లేక మైపగ్ తజ్ అనగా పచ్ఛ్రిదాతురసము 14 భాగములు మిగులునటుల కాచిన రసమునందు గాని రేలగుజ్జు మొదలగునవి, సోపుకషాయమునందు కలిపి పుక్కిలించవలెను. మరియు, మలము శాంతించిన వెనుక జరూరె అహమరెలయ్యాన్ కండ్లలో వేయవలెను. తరువాత జరూరె, అజఫర్, శియాఫె, తీక్ష్ణఅహామరెహాద్ యీరెండును ఒకటిగాచేర్చి కండ్లలో వేయవలెను.

—శియాఫె అహమరెహాద్ చేయుక్రమము.—

శాదనజ్ అనగా ఒకవిధమగు రాయి. పేల్చినపటికి, యివి ప్రత్యేకము 6 మాషములు తామ్రభస్మము, కుంకుమపువ్వు. మిరియాలు ఇవి ప్రత్యేకము $1\frac{1}{2}$ మాషములు. యీ యావత్తువస్తువులు చూర్ణించి వస్త్రగాలితమొనరించి సదాపాకు కషాయముతోనూరి కనికెలుచేసి యుంచుకొనవలెను.

3 వ భేదము. నొప్పి, పోటు, దురద, లేక, పుల్ల శరీరమువంటి రంగుకలిగియుండును. అట్టి స్థితియందు ఈవాపునుద్రేలితో వత్తినయెడల తాత్కాలము నిజదశయందు మారి అణచిన గుర్తు ఆలశ్యముగా తగ్గును.

3 వ భేదము చికిత్స

మలమును శోధించుటకై యారజాత్ కలిపిన కషాయము యిప్పించవలెను. మరియు మలశోధనానంతరమునందు పుక్తమరీతిగా నేత్రములయందు ఔషధప్రయోగము చేయవలెను. శియాఫెఖీనారంగు అనగా ఔషధముకూడా యీవ్యాధియందు లాభదాయకమగును.

మరియు బాబూనా, అకలీలుల్ మలిక్, చాతరాసి, దవనము,మరువము మొదలగు వాని కషాయముంతో కాపడము చేయవలెను. మరియు బటానీలపిండి, యవాక్షారము, మునాంబరము, బాబూనా, అకలీలుల్ మలిక్, మొదలగు వస్తువులను సోపు కషాయముతోనూరి కండ్లకు పట్టు వేయవలెను.

4 వ ప్రకరణము. ఈవ్యాధి కారణము వాతమైనయెడల దీనిచిన్నెలు ఇంతిపాల్ అనగా వాపు విశేషముగాయుండి తగ్గనేరదు. ఈ వాపునందు పీకు, జాస్తియగును. కొంచెము నొప్పికలిగియుండును. మరియు పీకు జాస్తిఅయినయెడల పీకుటవలన వాపు తగ్గుచుండును. అనగా చల్లని మలమువలన కష్టము అధికముగా నుండదు. ముఖ్యముగా వాత సంబంధమగువాపు ఎంద్రకాయ అనగా పీత ఆకారముగా నుండును. అచ్చటి జ్ఞానశక్తిని నష్టపరచుచున్నది. మరియు ఈవాపురంగు నలుపుగా నుండును. అనగా వాతరంగువలె నుండును. ఈవ్యాధి ముల్తహిమాపొరయందున్ను, కంటిరెప్పలయందుకూడా కలుగుచున్నది. మరియు యీ వాపు ముల్తహిమానుండి రెండు కంరములవరకు అనగా రెండు రెప్పల వరకు ఆక్రమించును. నేత్రసంబంధమగు పీడలు స్ఫోటకఅంతమునందు పుత్పత్తియగును.

## 4 వ భేదము వాతజవ్యాధి చికిత్స.

యీవ్యాధియందు మలమును పక్వపరచి మలము పక్వమొందిన వెనుక వాతజమలమును త్రోసివేయునట్టి వస్తువులను యుపయోగించవలెను. మలము శుభ్రతనొందినవెనుక జరూరెఅహామర్ లయ్యాన్, మరియు జరూరెఅసఫర్ కండ్లలో వేయవలెను.



# 5 సరతాన్ వ్యాధి వివరము.

సరతాన్ అనగా ఒకవిధమగువాపు. ఈవాపు వాతజమలమును కలిగించి మెత్తపరచుటకుగాను కట్లు వేయవలెను. మరియు వాతజవాపు నందు స్నానము చేయుట లాభదాయకము. మలము శుభ్రతనొందుట కుగాను వెనుక స్నానము చేయుట మంచిది.

**6 వ భే. ముల్తహిమాపొరయందు కలుగు రోగలక్షణములు.**

ఈముల్తహిమా అను పొరవాపు పుబ్బులేకనే కఠినత్వము వహించును. యిటుల కఠినత్వము వహించుటవలన నేత్రము కనుగుంట యందు సవ్యముగా తిరుగజాలదు. మరియు, యావత్తు చేష్టలు నిలిచిపోవును. మరియు యీముల్తహిమాపొరబిగిసి యెర్రనగును. యిందు శుష్కత్వముకలిగి నొప్పిసంభవించును. యిట్టిదశయందు నిదురనుండి లేచినప్పుడు కండ్లు విప్పుటకు కఠినముగా నుండును. యెల్లప్పుడు కంటి కొలుకులయందు స్వల్పముగా పుసి యెండియుండును. యీరోగమునకు అరబ్బిభాషయందు అకుల్ ముల్తహిమా అనగా కఠినత్వము జెందిన ముల్తహిమా అందురు.

**6 ఎ భేదము ముల్తహిమా పొరచికిత్స.**

ఈ రోగారంభమునందు శరీరమును వృధుపరచి యెల్లప్పుడు స్నానము చేయుచుండవలెను. వేడిగానుండు ఆవిరితో తలకు కావడము చేయవలెను. మరియు వేడినీళ్ళలో స్పంజ్ ముడిచి కన్నులకు కావడము చేయవలెను. నేత్రమునందు ప్రక్షాళనము చేయవలెను. మరియు ప్రత్యేకముగా రాత్రికాలములో కోడిగ్రుడ్డు తెల్లసొన గుల్ రోగన్ మరియు, బాతుకొవ్వులో కలిపి కండ్లపై వేయవలెను. మరియు చల్లని భోజనపదార్థములు యివ్వకూడదు. మరియు గుల్ రోగన్ కోడిగ్రుడ్డుసొన బాతుకొ

వ్వతో వండినచమురు తలాపైన లేపనము చేయవలెను. యీచమురులో తలయెల్లప్పుడు స్నిగ్ధముగా యుంచవలెను. మరియు నేత్రములలోనుండి నీళ్లు వెడలించుటకై జరూగెహానరం, ఖానకేఖాన్ మరియు శియాఫె హామకెలయ్యాన్, శియాఫె అమరెహాద్ మొదలగు యీసురుమాలు నేత్రములయందు వేయవలెను.

7భే. మల్లహిమాహారయందు దురదకలుగుటకు లక్షణములు

దురదకలుగుటకు కారణము బహుదా వృప్పనిహారములము కలుగుటవలన పుట్టుచున్నది. మరియు హాంసద్రిమములవలన కంటిపేరు వృప్పగానుండును. ఈపౌర రంగునందు యెఱుపుయేర్పడును. అప్పుడప్పుడు రెప్పలుకూడా యెఱ్ఱబడును. మరియు దురద విశేషముగా నుండుటవలన వ్రణములుకూడా కలుగుచుండును

{ 7 వ భేదము. మల్లహిమా హారయందు కలుగు దురద చికిత్స. }

ప్రథమమునందు విరోచనమునకు యిచ్చి, ప్రతిదినము ప్రాతఃకాలమునందు స్నానము చేయవలెను మరియు మృదుభోజనము సేవించుచుండవలెను. మరియు తీవ్రమగు లవణపదార్థములను వర్జించవలెను. నేత్రములనుండి నీరు వెడలించునట్టి ఔషధములను కండ్లలో వేయవలెను.

8 వ భేదము బతకాలక్షణములు

ఇది ఒకవిధమగువాపు. దీనియందు కఠినమగు గుల్లలు పుట్టుచుండును. మరియు, నిది మాల్తహిమాహారంపైన కంటి రెండువైపుల యందు కొలుకులలో లేచుచుండును. ఒకప్పుడు నల్లగ్రుడ్డుపైనకూడా చిన్నచిన్న గింజలవలె, ముత్యములవలె పుట్టుచుండును. యీరోగము రెప్పలయందుకూడా కలుగుచుండును. మరియు యీవాపురంగుమలము యొక్క దోషమునుబట్టి అనేకవిధములుగా నుండును. అనగా మలము రక్తదోషమువలన వాతజ, అనగా గట్టిగుల్లలులేది వాపుకలిగి యెఱ్ఱని

రంగుతో కూడియుండును యీవ్యాధి కఫప్రకోపమువలనకలిగినయెడల తెల్లగనుండును. యీవ్యాధి రమద్ అనగా నేత్రములనొప్పి అంతమునందు పుత్పన్నమగును. హిందీభాషలో యీరోగమునకు రోహా అందురు. వాతజఅనువ్యాధి దోషమువలన కలిగినచో వాపు కఠినత్వమువలన గుల్లలు, మోాసర్జము అను వ్యాధి రెండు భేదములుగా నుండును. మోరసర్జ కర్నియాఅను నేత్రసంబంధమగు మూడవపొరయందు పుత్పత్తియగును. మరియు ముల్తహిలా అనగా నేత్రము పైపొరయందు పుత్పత్తియగును. మోాసర్జ కర్నియా అనగా నేత్రముయొక్క మూడవపొరచినిగి ఇసబియాపొర బైటికివచ్చును. మరియు ముల్తహిమా అనగా నేత్రముపై ఆక్రమించియుండు పొర చినుగుటవలన కలుగు కారణము ప్రవేశించజాలదు.

8 వ భేదము బతకావ్యాధి చికిత్స.

అప్పుడప్పుడు రక్తజ దశయందు సరేరు అను నరమును ఛేదించవలెను. మరియు కఫజ దశయందు కఫమును వెడలించుటకై ఆకాశవల్లికషాయమును యారజాత్ మాత్రలును ఇవ్వవలెను. మరియు శరీరము స్వస్థతనొందిన వెనుక వ్యాధిశేషమున్నచో నేత్రరంగు యెర్రగా నున్నదా లేక తెల్లగా యున్నదా అని ధ్యానముతో నేత్రములను పరీక్షించవలెను. మరియు నేత్రములు నెర్రగానున్నచో శియాఫె అబియజ్ కండ్లలో వేయవలెను. మరియు కండ్లు తెల్లగానున్నచో శియాఫెఅహమ రేలయ్యాను పుపయోగించవలెను. మరియు చాలా కాలము గడిచినయెడల తీవ్రమగు ఔషధములు అనగా భాసలీఖూ శియాఫె అహమరె హాద్ మరియు యిటువంటి అన్యఔషధములను యుపయోగించవలెను. ఇట్టిస్థితియందు మలము ఖనీభవించినయెడల ముందు పక్వమై ఒకచోట కూడుకొనుటకై శియాఫెఅబియజ్ పుపయోగించవలెను. మరియు వెనుకవైపు పేలిపోయినచో శియాఫెఅహమర్ మరియు శియాఫే కుందూర్ పుపయోగించవలెను.

## శియాఫె అహమర్ చేయుక్రమము.

సాదనజ్ అనగా ఒకరాయి 21 మాసములు తుమ్మజిగురు, కతీరా ప్రత్యేకము 17న్నర మాసములు రాగిబూడి 10న్నర మాసములు వగడచూరు, ముత్యములు, కహరోబా అనగా బంగారు రంగువంటి జిగురు, నత్తు, భస్మము, ఇంగ్లీకము, యివి ప్రత్యేకము 3న్నరమాసములు దంబుల్ అఖవైన్ కుంకుమపువ్వు, యివి ప్రత్యేకము 1½ మాసములు ఈ 11 వస్తువులు చూర్ణించి ఆచూర్ణమును కల్వమునందువైచి నీళ్ళతో నూరి కనికెలు చేయవలెను.

## శియాఫె కుందుర్ చేయుక్రమము.

రాతిపువ్వు, అంజరూద్, యివి ప్రత్యేకము 17న్నర మాసములు గవ్వపలుకుసాంబ్రాణి, 35 మాసములు కుంకుమపువ్వు, 7 మాసములు యీవస్తువులు మెంతికనముతో నూరి కనికెలు చేయవలెను. ఈ ఔషధమును కండ్లకుపయోగించినయెడల బుదక్ వ్యాధి మలము హరించును. మరియు బుదక్ మల ప్రకృతియందు యీఔషధము నుపయోగించి పరిశుభ్రమగు వక్కీరునందు కలిపి నేత్రములపై వేసి కట్టవలెను. ఇటులకట్టినచో యితర పరిశ్రమ లేకనే హరించును.

## 9వ భేదము తూసా అను వ్యాధి లక్షణములు.

ఈవ్యాధి ముల్తహిమా అనగా నేత్రముపైనుండు పొరయందు పుత్పత్తియగును. తూసా అనగా ఒకవిధమగు మెత్తని మాంసమని అర్థము. యీమాంసము మిక్కిలి యెరుపుగానుండదు. మరియు, నిది నేత్రముయొక్క పెద్దకొలికి అనగా ముక్కువైపు వుత్పత్తియగుచున్నది. మరియు, నేత్రకొలికియొక్క యెర్రనరములు దీనిలో నాకూనా వ్యాధి వలె కలిసియుండును.

## 9వ భేదము తూసా అను వ్యాధి చికిత్స.

ఈవ్యాధియందు ముందుగా శిరావేదనచేసి రక్తము వెడలించవలెను. విరోచనమునకు యిచ్చి లద్ మూలముగా శరీరమును శుభ్రత

నొందించవలెను. మరియు, యీ వ్యాధియందు మలము శుభ్రతనొందు వరకు అనేక పర్యాయములు విరోచనమునకు యిచ్చుచుండవలెను. యెందుకనగా యీరోగము తిరిగి పలుమారు వచ్చుచుండు స్వాభావికముగలది మరియు, తూసా అనగా మృదుమాంసమును కరిగించుటలో తొందరపడవలెను. యిటుల చేయుటవలన తూసా బిగితప్పి వూడిపోవును. మరియు, నరములు కంటికొలికికండ్ల యిందులో చేరియుండును. వానిని సళాతుఃకోయెత్తి నాకూనా వ్యాధివలె శస్త్రముతో ఛేదించి గోటితో పట్టి తీసివేయవలెను, మరియు, తెల్లజీలకర్ర వుప్పు నమలి బట్టలో వేసి ఆరసము కంటిలో అనేక పర్యాయములు వేయవలెను. మరియు, కోడిగ్రుడ్డు తెల్లసొన మాత్రము కంటిరెప్పపై లేపనముచేయవలెను. తదుపరి బానలిఖాన్ మొదలగు తీవ్రమగు ఔషధములను నేత్రములయందు వేయవలెను.

## దమా అను నేత్రరోగ లక్షణములు.

ఈరోగమునందు సర్వదా నేత్రములు నిండియుండును. మరియు, యేదైన కష్టము అనగా గుల్లలులేచుట, యెండుగజ్జి రెప్పయందు గరగరలు కలుగుట రెప్పయందు వెంట్రుకలు మొలచుట ప్రత్యేకమునందు కలుగవు. మరియు, నీళ్ళు విశేషముగా వెడలుటయె యీ రోగమునకు హెచ్చుకారణమగును. ఒకప్పుడు యీ వ్యాధి హెచ్చి కంటిపాపయందు తెలుపురంగును పుట్టించును. యితరవ్యాధులుకూడ అనగా సులాక (రెప్పలుమందమగుట) మరియు, దీని సమానమగు వ్యాధిని కలిగించుచున్నది. ఒకప్పుడు రెప్పలు కొరికివేయు రోగము కలుగును.

యీరోగము రెండు విధములుగానుండును. (1) జన్మమునాది వుత్పత్తియగును. (2) యేదైన యితర కారణములతో కలుగును. మరియు, జన్మ నుంచి కలిగిన యెడల దీని చికిత్స చెప్పియుండలేదు. మరియు, యితర కారణముల వలన కలిగిన వ్యాధికి చికిత్స చెప్పబడియున్నది. కాని యిందు కూడా యీరోగమువలన మాంసము విశేషముగా తెగిపోవుట అనగా కంటిపెద్దకొలికియందుండు మాంసము తెగిపోయిన యెడల ఈ వ్యాధికూడా అసాధ్యము కాబట్టి చికిత్సయేమియు ప్రయోజనములేదు. మరియు, దమా వ్యాధియొక్క కారణములు యెన్నియున్నవో వాటితోకూడా దీనిని వర్ణించబడును.

## దమా వ్యాధి మొదటి భేదము.

ఈవిధముగు దమా విశేషముగా పడలుటవలన కలుగుచున్నది. అనగా నాఖూనా అను పటలమును శస్త్రముతో తీసివేయుటవలన కంటికొలికి మాంసముకూడా తెగిపోయినను మరియు, నాఖూనా చుట్టుట వలన దమా అను రోగము వుత్పత్తియగును ఇట్లు వుత్పన్నమైనచో దీనిని కంటికొలికి మాంసము కొద్దిగా తెగి దోషము అధికముగా నిలిచియున్న యెడల మాంసము దేనికది విస్తారముగా ఛేదించబడినచో యిట్టి స్థితియందు రోగమును పోగొట్టునట్టి ఔషధమున్నట్లు యెచ్చట కూడా చెప్పినట్లు కనుపించదు.

## దమా చికిత్స.

ఈవ్యాధియందు జరూరెఅఫసర్ మరియు శియాఫెజాఫరాన్ నేత్రములలో వేయవలెను. మరియు మసాంబరము గవ్వపలుకుసాంబ్రాణి, శియాఫేమామిసా యివి తప్ప మాంసమును వృద్ధిచేయునట్టియు అజీర్ణమును కలిగించి వాతమును శుష్కింపచేయునట్టి వస్తువులను ప్రయోగించవలెను.

శియాఫేజాఫరాన్ చేయుక్రమము.

కుంకుమపువ్వు, జటామాంసి, యివి ప్రత్యేకము 7 మాషము లు పిప్పళ్ళు 4న్నర మాషములు తెల్లమిరియాలు 9 రతులు నవాసారము 4న్నర మాషములు మాదికాయలు 10న్నర మాషములు కర్పూరము 8 రతులు యీయేడు వస్తువులను దంచి చూర్ణించి పన్నీరులోవేసి నూరి కనికెలుచేసి యుంచవలెను. దీనిని శియాఫేజావరాన్ అందురు.

దమూ రెండవ భేదము.

ఈవిధమగు దమూవ్యాధి కలుగుటకు కారణము తల కండ్లు మలములో నిండియుండి గ్రహణశక్తి, పాచనశక్తి, దుర్బలమునొందును. ఇట్టికారణమువలన దమూవ్యాధి వుత్పత్తియగును.

దమూ రెండవభేద చికిత్స.

మొదటను శుభ్రపరచుటకై మునహిల్ అను ఔషధమును పువయోగించవలెను. దీనివలన స్వస్తతనొందినచో నరేరు అను నరమును ఛేదించి రక్తమోక్షణము చేయించవలెను. మరియు మలమును శుభ్రత నొందించినవెనుక శుద్ధిచేసిన మయిలతుత్తమును గాని లేక యీవ్యాధికి యోగ్యమగు యితర సురుమాలుగాని నేత్రములకు వేయువలెను.

{ చెమ్మవలన కలిగిన దమూవ్యాధియందు లాభదాయకమగు సురుమాలు. }

మైలతుత్తం, కరకవలువు, రెండువస్తువులను సమానభాగములుగా తీసికొని నల్లద్రాక్షపండ్లరసములోగాని లేక సమాద్ అనగా బటానీగింజలవలెనుండు సొట్టుకాయలరసమునందు గాని నూరి యెండించి కండ్లలో వేయువలెను. ఇది నేత్రములకు ఆరోగ్యమును కలిగించును.

దమూ మూడవ భేదము.

మొదట నేత్రములయందు వ్రణము ప్రకోపించి దమూవ్యాధి వుత్పన్నమగును. దీని చిహ్నములు నేత్రములు వెంటవెంట చలించుట అనగా కనురెప్పలువాటు వెంటవేయుట వేడిగను పలచని నీరు కండ్లనుండి

స్రవించుట మరియు వ్రణ్రములము నిండియుండుటవలన యీవ్యాధి సంభవించినయెడల మలము నిండుటవలన కలుగు లక్షణములు ప్రకటనముగుట మొదలగు లక్షణములు కలిగియుండును.

### దమావ్యాధి నాలుగవభేదము.

ఈవ్యాధి మెదడునందుగల జలుబువలన కలిగినయెడల అనగా శీతప్రకృతి మెదడునందు ప్రవేశించి యీవ్యాధి కలుగును. దీనిని రెండువిధములుగా విభజించి చెప్పిరున్నారు. (1) యీవ్యాధిమలము చేరకనే కలుగుచున్నది. అనగా మెదడునందు జలుబుకలిగి మలము లేకనే రోగము వుత్పత్తియగును. అనగా బాహ్యకారణము వలన తలయందు జలుబు ప్రవేశించుటవలన నేత్రపొరలు బిగించబడి రతూబతు అనగా నేత్రసంబంధమగు నీరువంటి పదార్థము నేత్రమునందు చుట్టబడి నేత్రములవెంట నీరు స్రవించునటుల చేయును. అనగా చలికాలమునందు విశేషముగా వుదయమునందు కనిపెట్టవచ్చును.

మరియు హకీము త్రిబి అబూహామా హిరిగారివాఖ్యానుసారముగా చెప్పబడుచున్నది. అనగా శీతదుష్టవాయువు వ్రణములుగల నేత్రములయందు ప్రవేశించినవెంటనే నేత్రములయందు నీరు యేర్పడుచున్నవి. కాబట్టి యిటిస్థితియందు దీనిచిహ్నములు వ్రణములు శాంతింపచేయుటవలన తగ్గిపోవును. ఇందుకు సందేహము కలదు. అనగా దమావ్యాధి మిక్కిలి నవ్వుటవలనకూడా వుత్పత్తికాకుండు ఇదియు బిగించబడుట పిండబడుట వలన కలుగుచున్నది. అనగా విస్తారముగా నవ్వుటవలన తల రొమ్మురొమ్ముల ప్రదేశములు మిక్కిలి విస్తీర్ణము నొందుచున్నవి. కాబట్టి ఆప్రదేశములయందుండు నరములు బిగించబడుచున్నవి. ఇట్టి అవస్థవలన నేత్రపొరలు బిగిసిపోవును. నేత్రపొరలు అణగుటవలన రతూబతు అనగా నేత్రసంబంధమగు నీరుకూడా అణగిపోయి, పిండబడి మిగిలినది నేత్రములద్వారా స్రవించుచున్నది.

### దమా వ్యాధి నాలుగవ భేద చికిత్స

మలము నిండుటవలన దమా వ్యాధి కలిగిన యెడల యీమలము వృష్ణసంబంధమైనదైనను లేక జలుబు వలన కలిగినదైనను అట్టిమలమును వెడలించవలెను. శేషించిన మలమును కూడా తొలగించుట వుచితము.

### ఉష్ణప్రకృతి దమా వ్యాధి సురుమా

శాదనజ్. శుద్ధమైలతుత్తం, హేమాక్షికము యీవస్తువులు ప్రత్యేకము 3¾ మాషములు, ముత్యములు, పగడములు, యివి ప్రత్యేకము 1¾ మాషము, శిరాఫె, మామిసా, మసాంబరము యివి ప్రత్యేకము 9 రతులు, యీ 7 వస్తువులను చూర్ణించి సన్నని వస్త్రమునందు వస్త్రగాలిత మొనర్చి వుపయోగించుకొనవలెను.

### శీతప్రకోపముగల దమా వ్యాధి సురుమా

మిరియాలు, 3¾ మాషము, సైంధవలవణము 3¾ మాషములు పిప్పళ్ళు 7 మాషములు, సముద్రపు నురుగు 1½ మాషములు, సురుమా రెండురెట్లు యివి యావత్తునూరి చూర్ణించి వస్త్రగాలితముచేసి వుపయోగించవలెను. మరియు, ప్రకృతియందు జలుబు చెమ్మకలిగియున్న యెడల దీని విషయమై బాసలిఖూను సురుమా లాభదాయకము.

### నేత్రదుర్బలమునకు ఉపయోగించు ఔషధము

కరక్కాయ బెరడు కాల్చిన బూడిది, సైంధవలవణము, మాఘలుకాయలు యీ మూడువస్తువులను సమభాగములుగా తీసికొని చూర్ణించి వస్త్రగాలిత మొనర్చి వుపయోగించుకొనవలెను.

# బవ్వాలతీన్ అను వ్యాధి లక్షణము.



యీవ్యాధియందు ప్రతిసమయమునందు ఆలశ్యముమీద కండ్లవెంటనీరు స్రవించనారంభించి తిరిగి కొంతకాలమువరకు తగ్గి తిరిగి స్రవించి తిరిగి నిలిచిపోవును. కాబట్టి హకీములైనవారు యీవ్యాధికి కారణానుసారముగా దీనిని అవ్వాంతీన్ అని పేరుపెట్టిరి. యీవ్యాధి కారణము కనురెప్ప కొద్దిగా మందమెక్కి చెడిపోవును. ఆ రెప్పలోభాగమునుండి యేదో ఒకవస్తువు పుట్టివచ్చును. యీసమయమునందు రెప్పలలో మొలిచి వచ్చువస్తువు ముత్తిహిమా పొరయందున్న, రెప్పలయందున్న తాకి గ్రుచ్చుకొనుటవలన కండ్లవెంట నీరుస్రవించ నారంభించును. యిట్టి సమయమునందు శరీరమునందు మలమునిండి యుండును. ఆమాశయము, భోజనము, మద్యపానమువలన నిండియుండుటవలనగాని విశేషముగా మేలుకొనుట వలనగాని రెప్పలయందు చిక్కదనము దుష్టత్వము తటస్థించి కష్టము అధికమగును. యిట్టి స్థితియందు కొంచెమునిదురకలిగి ఆమాశయమునందు పదార్థములు లేకున్నను వ్యాధి శాంతించియుండును. రెప్పయందు చిక్కదనము తగ్గిపోవును. కంటి రెప్పలోపటి వాపు తక్కువగా నుండును, అనగా ముత్తిహిమా క్రిందిరెప్పపైన బలపూర్వకముగా ప్రవేశించజాలదు. గాన యిట్టిదశయందు కండ్లవెంటనీళ్లు ప్రవహించవు యీవ్యాధి కారణానుసారముగా కంటిరెప్పరోగములలో వర్ణించబడును. మరియు దమావ్యాధి తరువాత యీవ్యాధి ప్రవృత్తియగును. అనగా దమావ్యాధియందుకూడా నేత్రములవెంట నీరుస్రవించుచుండును. ఈవ్యాధియందుకూడా నీళ్లుస్రవించును కాబట్టి దమావ్యాధి తరువాత యీవ్యాధినికూడా వర్ణించుట విధి అయియున్నది.

బహ్వాం తీక్ చికిత్స.

శరీరమును మలము నుండి శుభ్రతనొందించవలెను. వాతమును చిక్కపరచునట్టి వస్తువులను భుజించకూడదు. మరియు ఈవ్యాధియందు భోజనము లఘువుగా చేయవలెను. మరియు పాచనశక్తిని కలిగించుట వుచితమగును. మలమును తీసివేయునట్టి ఔషధములు అనగా మూలిసా, తుమ్మాకు, కుంకుమపువ్వు మొదలగువస్తువులనునూరి కండ్లపై పట్టు వేయవలెను. మరియు ఈవస్తువులను కషాయముగాది ఆకషాయముతో కండ్లను కాపడము చేయవలెను. మలమును శుభ్రముగా తీసివేసినపిమ్మట నేత్రములనుండినీరు స్రవింపజేయునట్టియు, మలమును నశింపజేయునట్టియు అనగా శౌనలిఖూర్, శియాఫెలహామర్ అను ఔషధములు నేత్రములలో వేయవలెను.

# కుమునా అను రోగలక్షణములు

నేత్రములనొప్పి తగ్గినపిమ్మట నేత్రములయందు ఎరుపు శేషించియుండును. యిట్లు నిలచియుండు ఎరుపునకు కుమునా అందురు. అనగా ఈకుమునాశబ్దము మూడుభాగములయందు వేరువేరుగా చెప్పబడును. (1) కంటిరెప్పలోపట వాతముచిక్కబడుటవలన బరువుపుత్పత్తియగును, రోగినిదురనుండి లేచినవెంటనే కంటిలోమట్టిగాని, ఇసుకగాని, దుమ్ముగాని నలకగాని పడినదని సందేహపడుచుండును. మరియు దీనిదశ కంటిరెప్పయందు కలుగురోగములలో భావించబడును. దీనిని అచ్చటనే వర్ణించబడును. అనగా కంటిరెప్పల రోగములలో వర్ణించబడును. (2) కర్నియాపొరవెనుక చీము నిలిచిపోవును. దీనివిషయమై కర్నియాపొర రోగములలో చెప్పియున్నాను. (3) ముత్తహిమాపొర వ్యాధులయందు

భావించుదురు. మరియు నేత్రముల నొప్పివచ్చును నేత్రము ఎండనారంభించి వాతఆవిరియొక్క పరమాణువులు లేమటవలన దృష్టిదౌర్బల్యము నొంది రోగిచూచునట్టి వస్తువులు పొగక్రమ్మినటుల మంచుక్రమ్మినటుల కనుపించును. మరియు ఈవ్యాధియందు పొరరంగు చెడిపోవును అనగా యెరుపుగను, తెలుపు యెరుపుగనుండును. కన్ను త్రిప్పుటకు భారముగను సుస్తిగనుండును. రోగికితనకండ్లు ముందుకంటె పెరిగినటుల తోచుచుండును. మరియు నేత్రములయందు దురద ప్రత్యేకముగయుండుండును. మరియు దురదకలిగినప్పుడు వేడినీళ్ళతో కడిగినచో బరువు దురద తగ్గిపోవును. ఈవ్యాధి వాతఆవిరి పరమాణువులయందు చెముదశ వృష్ణము అధికమైనయెడల కరుగ నారంభించును. మరియు నివి నేత్రపొరలయందువచ్చి చేరి నిలిచిపోవును.

### తుమునా వ్యాధి చికిత్స

మలము తీసివేయుటకై యారజాత్ మరియు, పాడితీగెకషాయము యివ్వవలెను. ఈకషాయముతో గండూషము చేయించవలెను. తదుపరి జరూరెతుమన అను ఔషధమును కండ్లలో వేయవలెను. మరియు, మెంతులు, నఖము బాబూనా మొదలగు ఇత్యాదివస్తువులతో కషాయముకాచి మలమును కరిగించుటకై కావడము చేయవలెను.

### జరూరె తుమునా చేయు క్రియము.

పిప్పళ్ళు, మామిరా యీవస్తువులు ప్రత్యేకము 12 రతులు, ముసాంబరం 9 రతులు, దేశవాళికరక్కాయలు, నల్లద్రవుమరుగు, రసాంజనము యీవస్తువుల ప్రత్యేకము రెండు మాషములు, యీ 7 వస్తువులు ఒకటిగాచేర్చి చూర్ణించి బట్టగోవేసి వస్త్రఘూలితమొనర్చి వుపయోగించవలెను. మరియు, యీచూర్ణమును సోపురసముతోనూరి కనికెలు చేసి అవశ్యానుకూలముగా వుపయోగించుదురు.

### కజావ్యాధి వర్ణనము.

బూడిదె, నలకలు, దోమలు మొదలగు సూక్ష్మజంతువులు కండ్లలోపడుటకు కజా అందురు.

# నేత్రములలో యేదైన పడినయెడల కలుగు లక్షణములు.



కండ్లలో నలుసు మొదలగు వస్తువులు పడినయెడల కనిపెట్టు విధానము దుమ్ముగాలి వీచిన తరువాత నేత్రమునందు పడిన పిమ్మట నేత్రము వెంట నీరు స్రవించ నారంభించును. యింతకుముందు నేత్రములు యేవిధమైన రోగము లేకుండినయెడల కంటిలో బైటివస్తువుయేదో పడినదని గ్రహించదగును.

## నేత్రమునందు పడిన నలుసు మొదలగువాని చికిత్స.

వేడినీళ్ళతో ఆకన్ను కడిగి తదుపరి చనుబాలను కంటిలో వేయవలెను గాని కన్నుమాత్రము చేతితో నలుప కూడదు. కంటిలో దుమ్ముగాని నలకగాని పడిన యెడల చనుపాలు పోయుటవలన తగ్గిపోవును. యిటుల తగ్గనిచో కనురెప్ప పిరకి కంటిలోవల రెండు రెప్పల మొదట నిదానించి చూచి నలుసు కనుపించిన యెడల ఆనలుసును నళాకుతో తీసివేయవలెను. లేదా కొంచెముదూది కంటిరెప్పలలోవల కొంత వరకు వుంచవలెను. యిటుల నుంచినచో కంటిలో నున్నవస్తువు యీ దూది కంటుకొనును. తరువాత దూది తీసివేయవలెను. మరియు, కంటిలోపడిన నలుసు విశేషపైభాగమునుండి నల్తిహిమా పొరయందుగాని రెప్పలోవలగాని లేనియెడల బట్టతోనున్న అగిసిపలుకుతోనున్న సహాజముగా తీసివేయవలెను. విశేషలోభాగమునందుండి యీ యుపాయముల వలన బైటికి రానిచో సికస్త్రా అనగా గోధుమసత్తు మెత్తగానూరి కంటిలోవేసి కొంతసేపటివరకుంచిన యెడల కంటిలో పడినవస్తువు నిశస్త్రాకు అంటుకొనును తదుపరి దూదితీసివేయవలెను మరియు, కంటి

లోవడిన వస్తువు ఓప్పును కనుపించని యెడల సన్నని బట్ట వేలికి గుట్టు
కొని రెప్పలలోపల తుడిచిన యెడల బైటికివచ్చును. మరియు, గరిగల
వస్తువులు అనగా గోధుమలు, యవలు, మొదలగు వానిపైపొట్టు, లేక
గాజుముక్క, యిత్యాది యితరవస్తువులు కంటి గో అంగి పోయిన యెడల
యిట్టిదశయందు కంటిలో నుండి పలకలు మొదలగునవి. తీసివేయునట్టి
ముఖ్యాఆయుధముతోవట్టి తీసివేయవలెను. యిటుల తీసిన వెనుక చను
పాలుగాని లేక కోడిగుడ్డు తెల్లసొనగాని కంటిలో వేయవలెను. దీని
వలన యేమియు హానిరాకుండా కాపాడును.

కంటిలో జంతువులు పడు లక్షణములు

దోమకంటె సూక్ష్మముగల నొక జంతువు కలదు. దీనికి రెండు
రెక్కలుండును ఒక్కొకసమయమునందు యీ జంతువు కంటిలో పడి
పాపపై అంటుకొని కంటిగ్రుడ్డును పీల్చుచుండును. యీ కారణము
వలన నేత్రమునకు మిక్కిలి కష్టము సంప్రాప్తమౌను. కన్ను యెరు
పెక్కును. యిట్టి స్తితియందు దీనిని తక్షణమే తీసివేయవలెను. దీనిని
తీయుటకు రెండు సదుపాయములు కలవు. (1) ముల్తాని మన్నుమెత్త
గానూరి కంటిలోపోసి ఒకగంటవరకు రెప్పవేయక యుంచవలెను. యిటు
లచేయుటవలన ఆజంతువు యీమట్టి కంటుకొని బైటికివచ్చును. తరు
వాత ఆముల్తాని మన్ను దూదితోగాని బట్టతోగాని తుడిచివేయవలెను.
(2) ముందు కన్ను విశేషముగా కాచిన యెడల ఆజంతువు మెత్తబడు
ను. కాబట్టి తరువాత రంధ్రముగల నలాను తీసికొని దానినుండి కన్ను
వూదవలెను. తరువాత కంటినల్లగుడ్డుపైని యీగొట్టముంచి నిమ్మళ
ముగా వూదవలెను. యిటులచేయుటవలన ఆజంతువు బైటికి వచ్చును.

(లాభః) ముల్తాని ఒకవిధమగుమట్టి. యీమట్టితో తల రుద్దుకొం
దురు. ఈమట్టి మూడువిధములుగా నుండును. (1) తెల్లగను, (2)
ఆకుపచ్చగను, (3) యెర్రగానుండును. యీమూడురంగులలో యెర్రని
రంగుగల మట్టి శ్రేష్టమైనది.

౼౼కంటికి దెబ్బతగులుటకు లక్షణములు.

కంటికిదెబ్బతగులుటవలన కన్ను యెరుపు వాపు కలుగును. అట్టిస్థితియందు శిరావేదనము చేయవలెను. మరియు లఘువగు క్వాథములతోగాని లేక వండ్లరసములతోగాని కోష్ఠమును మృదువుపరచవలెను మరియు అవశ్యమైనచో ముచ్చనగుంటలో రక్షలువేయవలెను. మరియు శరీరము స్వస్థతనొందిన వెనుక నొప్పి శాంతించుటకై పచ్చనికోడిగ్రుడ్డు సొన గుల్‌రోగన్‌లో కలిపి కంటిపై లేపనముచేయవలెను. అప్పుడు మలము రెండవపైపుకు తిరిగి నొప్పి ఆగిపోవును యెరుపు తగ్గును. మరియు కంటియందు నీలిరంగు నిలిచియుండినయెడల ధనియాలు, పొదినా ఆకు సంగెషిల్ ఫిల్ హరిదళము, మొదలగువస్తువులునూరి పట్టువేయవలెను. ఈ పట్టువలన కంటిలోని నీలిరంగు హరించును. సంగెషిల్ ఫిల్ అనగా మిరియాలతో సమానముగానుండు గుండ్రనిరాళ్లు మరియు కంటిపొర ప్రథమమున తన స్వస్థానమునుండి తప్పిపోయినయెడల అనగా శస్త్రముతోగాని లేక రాయితోనైనను లేక యితర యేవస్తువుతోనైనను తప్పిన యెడల ఆహారయందు దుష్టములమూ చేరకుండునట్లు శిరావేదనముచేయుట విరోచనమునకు యిచ్చుట మొదలగు నదుపాయములు చేయవలెను.

ఒకప్పుడు కంటిలోనుండి నెత్తురువచ్చినయెడల ఆరక్తమును తుడిచివేసి శుద్ధిచేసిన సాదనజ్‌లో కొంచెము కర్పూరముచేర్చి దానిపై నునిచి కట్టుకట్టవలెను. రక్తము రానిచో శుద్ధిచేసిన మైలతుత్తమునూరి అందుపై వేయవలెను. మరియు కోడిగ్రుడ్డుసొన కంటిపైలేపనముచేయవలెను. పిమ్మట కొంతకాలమునకు శిరావేదనము చేయవలెను. తదుపరి విరోచనమునకు యివ్వవలెను. మరియు నేత్రముయొక్క రతూబతు అనగా నీరు మలముతో కలిసి నిండవిదే కంటి రణము మాన్పుటకున్ను కంటిగ్రుడ్డుకున్ను చికిత్స చేయకూడదు.

# నేత్రముల యందు కలుగు వ్రణ లక్షణములు.



నేత్రముయొక్క వ్రణము కన్నుయొక్క యావత్తుపొరలయందు పుట్టుచున్నది. అనగా మాల్తహిమా, కర్నియా, ఇనిబియా, అను కంటిపొరలయందు వుత్పత్తియగుచున్నవని గ్రహించవలెను. మరియు యీవ్రణములు ప్రత్యేకించి కనుపించుచుండును. ప్రత్యేకమగు చిహ్నములు రెండుగలవు. యీచిహ్నములు యీవ్రణమునకు విరుద్ధముగానుండును. మరియు యివిగాక యితరపొరలలోకూడా కలుగుచుండును. ఆవ్రణములు ప్రత్యక్షముగా కనుపించనేరవు. గాని లోపట వ్రణము కలిగి చీముపట్టి ఆచీమువలన పైపొరలు చెడి చినిగి రతూబతు అనగా నేత్రమును కలిగించునట్టి నీరులలోచేరి బైటికివచ్చుచుండుటవలన కనుపించుటయేగాని ప్రథమదశయందు వ్రణచిహ్నములు కనుపించనేరవు. మరియు ముందుగా మిక్కిలి పోటు నొప్పి విశేషకష్టము అవశ్యముగా కలుగుచున్నది. ఈవిషయమును వైద్యుడుచూచి కన్నునొచ్చుచున్నదీ, కన్ను వుబ్బినదీ అనే కారణముచేతబట్టి యిది తీక్ష్ణదోషము అనగా దహించునట్టి దోషము కలిగించుచున్నదనియు యిదిపొరయందు జొచ్చి వ్రణమును వుత్పన్నముచేయునని గ్రహించుదురు. మరియు యీకారణమువలన నొప్పి అధికమగుట పోటు కంట్లో పొడిచినట్లు గుచ్చుకొనుట నీళ్ళుస్రవించుట మొదలగులక్షణములు నేత్రసంబంధమగు సమస్తపొరలయందు పుట్టునట్టి వ్రణములయందు కలుగునని గ్రహించవలెను. మరియు యీమొదలగు చిహ్నములు మాల్తహిమా, ఇనిబియా, కర్నియా, అనుపొరలయందు కలుగు వ్రణములతో సంబంధము కలిగియుండును వీటిని వర్ణించుచున్నాను.

### ముల్తహిమా పొరవ్రణములు.

మల్తహిమా అను నేత్రముయొక్క కలుగు వ్రణచిహ్నములు కంటి తెల్లగ్రుడ్డునందు ఒకయెఱ్ఱని మాంసము పుట్టుట, యెఱుపు యావత్తు తెల్లగ్రుడ్డునాక్రమించుట యీలక్షణములు కలిగినచో యేదో ముఖ్యస్థానము రెండవభాగమునుండి మిక్కిలి రోగము కనుపించుచున్నదని తెలిసికోవలెను. మరియు యీచిహ్నములుగాక యితరలక్షణములు యీవ్రణములో అవశ్యము కలుగుచున్నవి. అవివర్ణించబడినవి. అనగా నొప్పివిశేషముగా నుండుట కన్నుగ్రుచ్చుకొనుట పోటు మొదలగు లక్షణములు దీనికి సాక్షియగును. మరియు ముల్తహిమాపొరయందు లేచువ్రణము గుండ్రముగానుండును. దానిని పార్శీభాషయందు దబీలా అందురు.

### ఇనిబియాపొరవ్రణములు.

ఇనిబియా అను నేత్రపొరయందు వ్రణముల లక్షణములు నల్లగ్రుడ్డుపైని ఒకబిందువు తెలుపురంగుగను యెఱుపురంగుతో కనపించుచుండును. అనగా మలము క్షారదశగలదియు విశేష ప్రమాదముగలదైనయెడల కర్నియా అను పొరను బ్రద్దలుగొట్టుచున్నది. మరియు మలమునందు అధికదుష్టత్వములేనియెడల నష్టము కలుగునుగాని కర్నియా పొరచినుగుటకు బలము ప్రవేశించనేదు.

### కర్నియా పొరవ్రణములు.

కర్నియా అను కంటిపొరయందు వ్రణములు కలుగుటవలన చిహ్నములు నేత్రముయొక్క నల్లగ్రుడ్డుపైన ఒకతెల్లని మచ్చకలుగును. మరియు యీపొరయందు తెల్లని వ్రణముకలుగుటకు కారణమేమనగా ఇనిబియా పొర దీనిక్రిందయున్నది యిదిచూచుటకు ఆటంకము కలిగించుచున్నది. మరియు కర్నియాపొర రంగు ఇనిబియాపొర రంగువలె కనుపించుచుండును. మరియు యీపొరయందు లేచువ్రణములు యేడు భేదములుగా చెప్పబడియె ఇందుండి నాలుగు కర్నియా పొర పైభాగ

మునం దుత్పన్నమగును మూడు కర్నియా పొరయందు లోభాగము అనగా చుట్టుభాగములయందు పుట్టుచున్నవి. ఇందువలన యీవ్రణములను రెండుభేదములుగా వర్ణించి చెప్పబడుచున్నది.

—1 వ భేదము. కర్నియా వ్రణముయొక్క వివరము—

కర్నియాపొర వ్రణము పై భాగమునందు పుట్టినదగును. దీనిని హకీముజాలీనూస్ గారున్ను, అనాపోతము గారున్ను కురహా వ్రణము అందురు. మరియు హకీము కన్యయూనా మొదలగు ప్రాచీనవైద్యులు ఈ వ్రణమునకు గరిగల దురద అందురు గాని వ్రణమని చెప్పుటలేదు. యీసాఖ్ కుమారుడు హకీముహానీను గారు ఈ రెంటియొక్క భావమొకటే అనిన్ని కేవలము విరుద్ధము కాదనిన్ని నామము మాత్రము విరుద్ధముగా యున్నదనిరి. యెందుకనగా యిందు దురద గరి గరగరలాడుట యిది హిలాల్ వ్యాధియొక్క భేదము. హిలాల్ వ్యాధియొక్క అర్థము. తక్రుక్ ఇత్తిసాల్ అనగా వ్రణమనబడును. యిది ఒకేరూపముగల అంగములయందు వుత్పత్తియగును. దీనిఅర్థము చెర్మము అదరుట అనబడును. యిందువలన ఈ హిలాల్ అర్థము వ్రణమని భావించిరి. ముఖ్యముగానిది కంటిలో వుత్పన్నమైనచో రోగికి చికిత్సచేయు వైద్యునకు అపరాధి యనజాలరు. ఈరోగము నాలుగు ప్రకరణములుగా చెప్పబడినదని గ్రహించవలెను.

(1) నల్లగుడ్డుపైన ఒక బిందువు పొడవుగా పొగక్రమ్మినటుల ఆరంభించును. దీనిని అరబ్బిభాషలో కతాముఅందురు. యూనానీభాషలో అఖిలూన్అందురు. కతాన్ అనగా దుమ్ముఅనబడును అఖిలూన్ అనగా చీకటి అనబడును.

(2) నల్లగుడ్డుపైని మొదటిదానివలె ఆరంభించి విశేషముగా ఆ క్రమించి ముందు దానికంటె మిక్కిలి తెల్లగానుండును. గాని స్థలము మాత్రము ఆక్రమించక కప్పబడియుండును. దీనిని అరబ్బిభాషలో

సాహబ్ మరియు గిమాంశిగుఫ్ఫ. యూనానీభాషలో లినాల్ యూగ అందురు. మరియు, యీమూడు పదముల యర్థము వేరుగా మారిన దనిపించును.

(3) నేత్రము యొక్క నల్లగుడ్డు అంచునందు ప్రకటనమగును. మరియు, ముల్తహిమా పొరనుండి కొంచెము అనబడును. దీనిని అరబ్బీభాషలో అకలీలీ అందురు యూనానిభాషలో అరఖమూన్ అందురు. అనగా రెండు రంగులుగలది అని అర్థము. యీవ్రణము విస్తారముగా నల్ల వాగలికి [illegible] నల్లగుడ్డుమీద నిలిచియుండును. ఇది తెల్లగా కనుపించుచుండును. యింతువలన ఇకబిమా పొర కనుపించుటకు అటంకమై తెల్లగానుండును. తెల్లగుడ్డుమీదనుండునది యెర్రగా నుండును. మరియు, నల్లగ్రుడ్డు చుట్టు ప్రదేశమునను అకలీలున్ బాద్ అందురు. యూనానిభాషలో అర్ఖామూన్ అందురు.

(4) నేత్రముయొక్క నల్లగ్రుడ్డుమీద వెంట్రుకవలెగాని లేక దీని సదృశముగాగాని యేదైన వుత్పన్నమైన యెడల నిది దీని తాలూకు చిన్నముక్క అని భావించవలెను. దీనిని అరబ్బిభాషయందు నూపా మరియు, ఇఖరాకీ అందురు. యూనానిభాషయందు అబికూమా అందురు. వైద్యులు దీనిని నేత్రసంబంధమగు దమా అందురు. అభికూమాయొక్క అర్థము వుల్లరాని అందురు. మరియు, వైద్యులు హాకీకదమాకువుల్లవూన్ అనిభావించుచున్నారు.

౪ భేదము కర్నియావ్రణభేదము

వ్రణము కర్నియా పొరలోపల వుత్పన్నమగును. ఇది మూడు విధములుగానుండును.

(1) గుండ్రముగను సమానరంగుకలిగి సజ్జగింజల ఆకృతిగా యేర్పడుచున్నది. దీనిపైగరి తక్కువగానుండును. దీనిని యూనానిభాష యందు లోకూయూగ అందురు. అరబ్బిభాషయందు జాబా అందురు. హిందీభాషయందు చుట్టునుండు గుంటయని అర్థము.

(2) ఇది లాకూనావ్యాధి కంటె వెడల్పు అధికముగానుండును. విశాలముగానుండును. దీనిని హాశవగా అందురు. దీనిని యూనానిభాషయందు ఉలుకూ అనివాడుదురు. మరియు, జకీరే ఖ్వారజ్మశాహి అను వైద్యగ్రంథమునందు యీక్రింది విధముగా వ్రాయబడియె అనగా ఈ వ్యాధిని ఫలగమూసా అందురు అనగా కష్టమును కలిగించునట్టిదనియు దుఃఖమును కలిగించునట్టిదని భావము.

(3) ఈవ్రణము విస్తారముగా అన్నిటికంటె మిక్కిలి మలినము తోగూడియుండును. మరియు కొంతకాలమునకు ప్రవేశించిన కంటి రతూబతు దీనిలో మిళితమై వెళ్ళిపోవును కొందరి మతమునందు దబిలా అనగా ఆక్రమించునట్టి వ్రణమని గ్రహించుచున్నారు వ్రణముకూడా యీఅర్థముతో చెప్పబడుచున్నది. దీనివిషయమై మొదటిభేదమునందు నాలుగవ ప్రకరణమునందు వర్ణించబడియె. అనగా ఇకరాకి అబికూమా మరియు హాఫీకాదమా అనునవి ఒకవిధమగు వ్రణములు. అవి దీనితో వేరుగానున్నవి. ఇవి అప్పుడప్పుడు కలుగుచుండును. దానిని జాతుల్ అనగా నరముల వ్రణము అందురు. అనగా దీనియందు నరములు విశ్లేషముగా కన్నుయొక్క ప్రదేశములయందు ఒకదానిపై నొకటి అల్లుకొనియుండునని గ్రహించవలెను. అనగా వలవలె అల్లుకొనియుండునని భావము. ఈవ్రణము బాహ్యపొరను అణచివేయును. ఈవ్రణము గుండ్రముగానుండును. దీనివలన కన్ను చెడిపోవును. ఈవ్యాధి కుదురుట దుర్లభము యీవ్రణముయొక్క వుత్పత్తిస్థానము సలబియా అనుకంటి పొరయందు కలుగుచున్నది.

(లాభము) యీవ్రణములలో ముల్తహిమా పొరపై లేచునట్టి వ్రణము త్వరలో మానును. మరియు దీనిలో నొప్పి యేమియు తోచకుండుట, కంటినుండి నీరు తక్కువగా స్రవించుట రోగికండ్లు మూసుకొనుటకుశక్తి కలిగియుండుట, మొదలగు లక్షణములుగల వ్రణము కుదురుననియు సాధ్యమనియు యీలక్షణములకు వ్యతిరేకముగా విరు

ద్ధముగా నుండి నల్లగ్రుడ్డు పాపముందు యున్నయెడల యీవ్రణము కుదురుట దుర్లభమనియు నిది అసాధ్యమనియు వైద్యులు వచించి యున్నారు.

## శర్కియాహార వ్రణచికిత్స.

ఈవ్యాధియందు యేచిహ్నములు వర్ణించబడినవో ఆచిహ్నములు కనుపించినవెంటనే శిరావేదనము చేయవలెను. మరియు శక్తి ననుసారముగా రక్తమును వెడలించవలెను. మరియు ప్రతివారమున్ను దీని నుండియు ముందుగా సరేరు అను నరమును ఛేదించి కొద్దిగా రుధిరమును వెడలించుచుండవలెను. తదుపరి కరక్కాయలు, చింతవండు, కషాయముకాచి రేలకాయగుజ్జు, కలిపినకషాయమునుగాని లేక యిట్టి స్వాభావికమగు కషాయములనుగాని రోగికిచ్చి శరీరమును మృధుత్వము నొందించవలెను. మరియు కరక్కాయకషాయమునందు కొద్దిగా యారజ్ కలుపుట మిక్కిలి వుత్తమము. మరియు అనేకపర్యాయములు విరోచనము చేయించవలెను. మరియు వ్రణమునేత్రముయొక్క సమీపమునందు కంటిపెద్దకొలికివైపునున్నచో రాత్రిపరుండునప్పుడు కంటికొలికిలో చీము వకటిగా చేరకుండా తలక్రింద యెత్తునుంచి పరుండునటుల చేయవలెను. అనగా చీము కంటికొలికిలోచేరినయెడల ఆకొలికిభాగములను చెడగొట్టును.

లేక కంటి చిన్నకొలికి అనగా చెవివైపు యున్నచో చెవివైపు తలగడయుంచి కంటికొలికి తలగడకు ఆనునటుల ప్రక్కను పరుండి నిద్రించవలెను. యెందుకనగా చీముకూడివచ్చుచుండును.

మరియు. కేకలువేయుట, వాగుట, తుమ్ముట, తలక్రిందఎత్తులేక పరుండుట, గురుపదార్థములుభుజించుట యీమొదలగుపనులు మిక్కిలి హానికరములు గాన రోగిని ఈపనుల అభ్యాసమునుండి తప్పించి కాపాడవలెను.

మరియు వ్రణము బలముగలదై పూష్ఠపుంజముతో కూడి మంటగల స్వాభావికముగలదై నొప్పితో కూడియుండినయెడల శియాఫెఅబియజ్ కోడిగ్రుడ్డుతెల్లసొన చనుపాలు కలిపి కంటిలో వెస్తూయుండవలెను. మరియు ప్రత్యేకముగా చనుపాలు కండ్లలో వేయుచుండబడి. వ్రణము వేగరము పక్వమొందనిచో శుద్ధిచేసిన మెంతులను మరియు, అలసిగింజలరసము లేక, సఖముచిన్నఫలరసము కండ్లలో వేయవలెను. వీనివలన వ్రణము పక్వమొందును. ఇటుల పక్వమునొంది చీము ప్రకటమైనచో వ్రణము శుభ్రమునొందుటకై శియాఫెఅబీర, అంజరూత్ మొదలగునవి ప్రయోగించవలెను. మరియు చీము చిక్కగానుండు కారణమువలన స్రవించకుండనియెడల మెంతులరసము తేనెకలిపి యుపయోగించవలెను. ఇట్లు వేయుటవలన చీము లఘుత్వమునొంది పలుచబడి సహజముగా బైటికిస్రవించును. మరియు వ్రణము చీమునుండి శుభ్రతనొందిన వెనుక శియాఫెకుందురు మొదలగునవి అనగా వ్రణమును మాన్పునట్టియు, మాంసమును కలిగించునట్టియు ఔషధములను కంటిలో వేయవలెను. మరియు వ్రణము పూడిపోయిన వెనుక శియాఫెఅహమరెలయ్యాన్ కంటిలో వేయవలెను. తిరిగి శియాఫ్ కాహితేఅగ్బర్ కంటిలో వేయవలెను. మరియు అవశ్యముకలిగినయెడల నమస్తశియాఫె సురుమాల తరువాత శియాఫెఅజకరు వేయుట విశేషలాభదాయకమగును. మరియు, కండ్లు నిర్మలించిన వెనుక వ్రణచిన్నములు నిలిచియున్నచో యేవస్తువు వ్రణచిన్నములను గుల్లలను మాన్పునో ఆవస్తువులను ఉపయోగించవలెను. మరియు వ్రణము పెరిగి మోర్సజక అయినచో, అజీర్ణమును కలిగించి బలమును కలిగించునట్టి పదార్థములతో చికిత్సచేయవలెను. ఈచికిత్స వలన గరి అధికముకాజాలదు.

అంజరూతె అంజరూద్ చేయుక్రమము

నిశస్తా 21 మాషములు గాడిదెపాలులో శుద్ధిచేసిన అంజరూద్ సత్తుభస్మము యివి ప్రత్యేకము 7 మాషములు యీవస్తువులు వకటిగా చూర్ణించి సన్ననిబట్టతో వస్త్రఘాలితమొనరించి ఉపయోగించవలెను.

# కంటి నల్లగుడ్డుపై తెలుపుపటల లక్షణము.



ఈవ్యాధి నల్లగ్రుడ్డుపైనకలుగు తెలుపునకు బ్యాజ్ అందురు. ఇది రెండువిధములు (1) కర్నియాపొరస్థానమునందు పలచగా ఉత్పత్తియగును. యిట్టితెలుపునకు అబూ లేక, గమాం అనగా మబ్బుఅనియు ఆకాశమనియు అందురు.

(2) ఇది కర్నియాపొరచుట్టు పుత్పత్తియగును. ఈతెలుపునకు బ్యాజ్ అనగా పుల్లికడ్డపై పొట్టుగుంటిది అను యీపేరుకంటె ఇతరపేరు కనుపించలేదు. యీరోగము మూడువిధములుగా చెప్పబడియె (1) వ్రణము కలుగుటవలన చాలాకాలము కన్నుమూసికొని యుండుటవలన నీచములను వృద్ధులగు వదార్థ పైనగ్రించి దుర్బలమువలన కన్ను విప్పుటకు వీలుకాకుండును. యాదాపి వ్రణము ఆరోగ్యము నొందినవెనుక తెలుపు శేషించియుండును. యిటుల కలుగునట్టి తెలుపు చికిత్స వలన సాంతముగా తగ్గజాలదు. మరియు వ్రణముయొక్క చిహ్నముతో తెలుపుకూడా నిలిచియుండును. అనగా కర్నియాపొరయందు వ్రణము పుట్టినయెడల నది పై వరకు ప్రవేశించును. కాబట్టి ఒకటిగా కాజాలకుండును. యెటులయినగా నిది కలియుటకు చిహ్నములు దీనియందు శేషించియుండును. అనగా చర్మమునందు నిలిచియుండునని గ్రహించవలెను. ఈచిహ్నములుగల వ్యాధి నయమగుట దుర్లభమనియు ఇట్టివ్యాధి అసాధ్యమనియు భావించవలెను.

(2) నేత్రము నొప్పిగానుండుటవలన నల్లగుడ్డుపైని తెలుపు సంభవించును. యీ వ్యాధికి చికిత్సచేయుటయందు వుపేక్షించిన యెడల మలము దిక్కునైయుండుటవలన మలము హరించక కండ్లు మూయబడి

యుండి ఇట్టి స్థితియందు నేత్రముయొక్క నల్లగ్రుడ్డుపైన తెలుపు సంభ
వించునని గ్రహించవలెను. మరియు, నీచపలము చేరి యీ వ్యాధి అన
గా నల్లగ్రుడ్డుపై తెలుపు పుట్టించును.

(3) సగముకన్ను నొచ్చుట యిట్లు కన్ను నొప్పి తరువాత కంటి పై తెల్పు వుత్పత్తియగును. కారణమేమనగా తలనొప్పివలన కన్ను మూయబడియుండి ఆకంటిలో దుష్టమలము చేరును. యెటులననగా తలనొప్పి విశేషత్వమువలన కష్టముసంభవించి అట్టి దశయందు మూసికొని యుండుటవలన శాంతినొందినటులుండును. యిట్టి సమయమునందు వనికిమాలిన పదార్థము కన్ను మూయుట తెరచుట తిరుగుటవలన హరించుచున్నది. యిట్లు హరించుపదార్థము కన్నుమూసికొని యుండుటవలన కంటియందు నిలియుండును.

బ్యాజ్ అనగా నల్లగ్రుడ్డుపై తెలుపుకు చికిత్స

కారణము శేషించియున్న యెడల అట్టికారణములు వ్యాధికనుకూలమైనచో ఆకారణములను దూరపరచవలెను. అనుకూలము లేని యెడల యీరోగమునందు శిరావేదనము చేయుట తీవ్రవిరోచనమునకు నొంసగుట అసంభవము. మరియు, నేత్రములో తీవ్రమగు ఔషధములు ప్రయోగించుటవలన ఉష్ణతనొంది బిగిసిపోవును. యిట్టి దశయందు ముందుగా శిరావేదనచేయుట విరోచనముస కిచ్చుట మిక్కిలి యుపయోగము. మరియు, రోగహేతువు దూరమగుటకు కంటియొక్క తెల్లదనము లఘుత్వము నొందినచో కేవలము లాలారనము లాలా అనగా ఒకచెట్టుజాతి దీని ఆకులు గనగసవు ఆకులవలె ఆకులు పూలు కలిగి యుండును. మరియు, కంతరియూన్ ఒకమూలికె నిది రబ్బిల్ వల్ నెల ఆఖరులో వుత్పత్తియగును. దీని రసము తెనెలో కలిపి కంటిలోవేయవలెను. దీనివలన తెల్లనిపొరలు తీసివేయును. మరియు తెలుపు తగ్గుటకు సదుపాయములకలవు, అనగా ప్రతిదినము ప్రాతఃకాలమునందు మందు పటికిబెల్లము నవలి తదుపరి వుప్పునవలి కొంతనేవునిధానించి నాలుకకు

ల్చిన అకీక్, అనగా యిది నశిస్ద్దగాగునాయి, ఆకుపచ్చరాయి, అనగా కత్తినూపురాయి, దీనిని సిల్తియందురు. గూరి యుపిప్పళ్ళు, శిహావే రంగిన్, బంగారుమలినము, మైలతుత్తము, పగడపుచూరు, తెల్లమద్ద, తామ్రమలినము. మైలతుత్తపుమట్టి. మరియు తూతియాయిహామూరి యివి ప్రత్యేకము 7 మాషములు ఒకచోట కిస్నర మాషములని వ్రాయబడియున్నది. వువ్వు, కావిరాయి, యివి ప్రత్యేకము 3 మాషములు హేమాతీకము, గబ్బిలపుమలము యివి ప్రత్యేకము 1¼ మాషము ఆబగీనా 7 మాషములు కస్తూరి 1న్నర మాషము యీ 28 వస్తువులు చూర్ణించి యుపయోగించవలెను.

(2) గోమయము 10న్నర మాషములు కంతరియూక్ 17 మాషములు, ముత్యములు 10న్నర మాషము, మైలతుత్తము 3న్నర మాషములు పగడపుచూరు 10న్నర మాషములు సముద్రలవణము 10న్నర మాషములు రాతిపువ్వు 1¼ మాషములు నిప్పుకోడిగ్రుడ్డుపై బెరడుకాల్చినబూడిద 10న్నర మాషములు మైలతుత్తము 8¼ మాషములు కస్తూరి 2 రతులు యీ 10 వస్తువులు మెత్తగా చూర్ణించి వుపయోగించవలెను. ఇది అనుభవముతో చెప్పబడిన వౌషధము.

మరియు గబ్బిలముయొక్కమలమును తేనెతో అరుగదీసి కంటిలో వేయవలెను. అథవా కోడిగుడ్డుపై పెంకులను తెల్లగాభస్మముచేసి దీనికి సమముగా కలకండకలిపిసూరి జరేసు అనగా యెండించునట్టి ఔషధమును చేసుకోవలెను. ఇది పరీక్షించిన వౌషధము.

### హాజమసగీర్ చేయుక్రమము

కోడిగుడ్డుపై పెంకులను మంచినీళ్ళలో నానవేసి ప్రాతఃకాలము యెండలోనుంచి ఆనీళ్ళు దుర్వాసనవచ్చినయెడల వంచివేసి తిరిగి మంచినీళ్ళుపోసి ఆనీళ్ళు వంచివేసి యిటు నీచువాసన తగ్గువరకు నీళ్ళు పోయుచూ వంచివేయుచు తరువాత ఆపెంకులనుతీసి యెండించి మెత్తగాసూరి కలకండచేర్చి సూరియుపయోగించవలెను.

### హాజరల్ బీరా చేయుక్రియను

శుద్ధిచేసినది కోడిగుడ్డుపై పెంకులు, కాల్చిన పాతమెదురు బూడిది, ముత్యపుచిప్పలభస్మము. మర్జానములు శియె అర్మని అనగా ఒక మూలికెజాతి, సముద్రఫేనము, దోహాజ్ అనగా ఆకుపచ్చరంగుగలరాయి, గోమయము, రజతమలినము, సువర్ణమలినము, సాదనా అనగా ఒక రాయి. గిద్దన్‌యొక్క కాలినపక్క బూడిద, పగడచూరు యివి ప్రత్యేకము ఒకభాగము. ఆకుపచ్చరాయి 14 భాగములు, గబ్బిలపు మలము అర్ధభాగము యీ 15 వస్తువులను చూర్ణించి సన్నని బట్టతో వస్త్రఘాలిత మొనరించి వుపయోగించవలెను.

### హాజబేఅస్సల్ అను ఔషధక్రియము.

గోమయము, అగ్నికోడిగుడ్డుపై పెచ్చులు. ముత్యపుచిప్పల భస్మము, యీవస్తువులు మెత్తగానూరి సిహా అనగా ఒకవిధమగురాయి. పగడచూరు, గబ్బిలపుమలము, సముద్రపుపుష్పం, యీయేడువస్తువులు సమానభాగములు చూర్ణించి వస్త్రగాలితమొనరించి కిర్‌గస్ మరియు కులంగ్ ఆకురసముతో యీచూర్ణమును భావనచేసి యెండించి మెత్తగానూరి యుంచుకొని అవశ్యకతానుసారముగా తేనెలోకలిపి నేత్రముల లోవేయవలెను. ఈఔషధమును నేత్రసంబంధమగు తెలుపు చిక్కబడినప్పుడు యుపయోగించవలెను.



# మోర్సర్జ్ వ్యాధిలక్షణములు.



కర్నియా అనుపొరయందు సన్నసన్నని గుల్లలు లేచిన కారణమువలనగాని కర్నియా అను పొర చినిగి ఇంబియా అను కంటిపొర కర్నియా క్రిందనుండి బైటికివచ్చి ప్రుస్నాకారముగాను ఇటు ప్రుస్నత ముకుటకు వైద్యులు మోర్సర్జ్ అంటారు. మరియు మోర్సర్జ్ అను వ్యాధికి హిందీభాషలో చుంటకాశిర్ అనగా చీమతల అందురు. గాన వైద్యమతానుసారము గా పరిమాణమున ప్రుస్నాడము నామమునుబట్టి భిన్న భిన్న అభిప్రాయములుగా భావించుచున్నారు. యేలననగా ఇనిబియా పొర చీమతలతో సమానముగా పైకివచ్చుచున్నది. ఇటులపైకివచ్చుటకు రాసుల సవలి అనగా చీమతల అంటారు, దీనికంటె, అధికముగా యీగతలవలె పైకివచ్చినచో దీనిని రాసుజ్జాజబాబి అందురు. మరియు విస్తీర్ణమునందు పచ్చిద్రాక్షపండులో సమానముగా యున్నచో దీనిని ఇనబి అనుచున్నారు. ద్రాక్షపండుకంటె విశేషముగాయున్నయెడల అనగా కంటిరెప్పనగకు పరిశేలించి రెప్పవేయుటకు సన్నమూయుటకు సమర్థతలేక యున్నయెడల దీనిని విహాము అనిపాముచున్నారు. యేలననగా యిది నేవు అనగా యాఫిల్ కాయతో సమానముగు పరిమాణము కలిగి యుండును. ఈతెపాయు ప్రాచీనముగలదై పైన కర్నియాపొర చినిగిన భాగము ఒకటికొకటి కలిసిపోయినయెడల దీనిని మిస్మారి అందురు. యెటులననగా ఫలముకంటె మిస్మార్ అనగా మేకతలతో సమానముగు పరిమాణము కలిగియుండును. మిస్మారి అను వ్రణమును నేత్రవైద్యులు సిలూలి చీమలంతలె చీమలో సమానముగా నేత్రముయొక్క మూడవపొరబైటికివచ్చుటఅంటారు. కొందరువైద్యపరులుఫలకిలంగురు ఇట్టి కారణము ఇది ఫల్ మో అజల్ తో సమానముగుచున్నది. అనగా కంటి

రెప్పతో సమానముగా యుండునని భావము. మరియు మొఅజల ఇను
ముతో చేయబడిన ఆయుధము. అనగా యీఆయుధముయొక్క ఆకార
మువలె రెప్పనుండి బైటికి వచ్చుటవలన యీపేరుపెట్టబడియె. అనగా
కదురునకున్న కన్నుకొయొకదింత కంసుభాగమును దారవుకండె
వెనుకకు జరుగకుండునటుల యుంచబడు బిళ్ల అని అర్థము. దీనిని హిందీ
భాషలో ఫికి అని వాడుదురు. మరియు రాసుంగబ్లి యివి రెండున్ను
కర్నియాపొరయొక్క గుల్లలవలె సమానముగా కలుగుచున్నవి. వీటి
యందు భేదమేమనగా మోర్సర్జ్ ఇనిబియా పొరయొక్క
రంగుతో సమానముగా నుండును. పైభాగమునందు
ఒక తెల్లని వస్తువు త్రునగిజలో సకాంచుకు ఆకారముకలిగి కనుపిం
చుచుండును. యిట్టి సమయమున నెక్రిముయొక్క రెండవపొర చిట్లి
ఆపొరక్రింద నుండునట్టి ఇనిబియా పొరబైటికివచ్చిన యెడల కర్నియా
పొరంభాగము ఇనిబియా పొరసమీపమునకు వచ్చుటవలన తెల్లగాకను
పించుచుండును. యిది కూడా మోర్సర్జ్ యొక్క చిన్నము అనగా
నల్లగుడ్డుచిన్నదిగను వంకరగా నుండును. యెట్లనిన నల్లగుడ్డుపైకి
వెళ్లుటవలన కనురెప్పలోనుండి కనుపించుచుండును. మరియు, నేత్రము
లోపల లేచునట్టి గుల్లలు ఒకవ్యాధి కర్నియా పొరయొక్క నాలుగు
భాగములనుండి యేదో ఒక పొరచిట్లిపోయి అందుండి పైపొరతో
యెక్కువగా ఉబికి వచ్చుచున్నదని గ్రహించవలెను. యీ కారణము
ఇనిబియా పొరనుండి తెలుసుకొనుటకు ఆటంకపరుచుచున్నది. ఈబైటి
కి ఉబికివచ్చునట్టి పొరలయొక్క రంగు తెల్లగా యుండుటవలన తెల్పు
రంగుగా కాన్పించుచున్నది. యిట్టి కారణమువలన గుల్లలతో సమాన
ముగు ఆకారము కలుగుచున్నది. యీ రెండింటియందు భేదమేమనగా
ముఖ్యముగా కర్నియా పొర ఉబుకుటవలన కంటి తెల్లగ్రుడ్డుపైని యెఱు
పురంగు యుండనేరదు. యిటుల ఉబుకుటకు కర్నియాయొక్క కఠినత్వ
మువలన శక్తితో అణచినను అనగకుండును. గుల్లలు దీనికి విరుద్ధము

గా కలుగుచున్నవి. అనగా గుల్లబయటంగు కంటితెల్లగ్రుడ్డుపైని యెఱుపు మెరుపు ముఖ్యముగా కలుగుచున్నది.

### మోర్సర్జ్ అను వ్యాధిచికిత్స

కర్నియాపొర చిట్లి దీనిప్రక్క ప్రదేశము కఠినత్వము మాంధము కలుగుటవలన ముందు యే యుపాయములవలన స్వస్తతనొందని యెడల అట్టి స్థితియందు మోర్సర్జ్‌యొక్క చికిత్సను శీఘ్రముగా చేయవలెను. మరియు, ఉన్నతమును హరించునట్టి ప్రయత్నములు చేయవలెను. అనగా సాదనజ్ మగసూల్, రజితములినము, శీసభస్మము, ముత్యపు చిప్పలభస్మము, మరియు, యిట్టి స్వభావికముగల యితర వస్తువులను నేత్రములయందు ప్రయోగించవలెను. యీవస్తు ప్రయోగమువలన వున్నతము హరించుట, ఆవుట, నేత్రములనుండి నీరు స్రవించుట, గుమిగూడియుండుట, కఠినముగానుండుట మొదలగువానిని హరించును. మరియు, విశేషముగా రోగప్రకోపమును శమింపజేసి ఇనబియా పొరను వెలికి రాకుండునటుల కాపాడును.

### కొహాలె అల్ సీరన్ చేయుక్రమము

సురుమా, సాదనజ్, యివి సమానభాగములు తీసికొని మెత్తగానూరి యుంచుకొనవలెను.

మరియు, ఉబుకుటకు శాంతినొందించు నుపాయములు అనగా నేత్రముపై మంధముగా బిళ్ళచలె మడచిన గుడ్డగాని దూదిగాని వేసి కంటిపైన కట్టుకట్టవలెను. మరియు, ఆకట్టు కను గుంటకు సమానముగా యుండవలెను. అవస్యమైనచో 17½ మాషముల యెత్తుగల సీసపు ముక్కగాని 3౯ మాషముల యెత్తుగలదిగాని తీసికొని ఆనేత్రముపై దూదియుంచి ఆదూదిపై యీ శీసపు ముక్కనుంచి కట్టుకట్టవలెను. ఇట్లు కట్టుటకంటె మంచి సురుమా కంటినిండా పోసియుంచుట మిక్కిలి మంచిది. సురుమా వేయుటవలన నేత్రమునకు మృదుత్వముకలిగించి శక్తిని బలపరచునట్టి గొప్పప్రకృతి దీనియందుకలదు. యీసమయమునందు

కంటిపొరబిట్టిన ప్రక్కలు పెద్దగిగను నిలువుగానున్నచో నివి కుదురుట దుర్లభము. మరియు, సితూయెమిస్ఫాలి అనగా నేత్రముయొక్క మూడవపొర, రెండవపొర చిట్లుటవలన మేకు తలవలె యెత్తుగా రావడమునకుపేరు మరియు, నితూయె అనబి అనగా నేత్రముయొక్క మూడవపొర, రెండవపొర చిట్లుటవలన పచ్చిద్రాక్షపండుతో సమానముగా పైకివచ్చుటకు పేరు. యిది దీర్ఘకాలమునుండి యున్న యెడల అధికభాగములనుండి కోసివేయుదురు. యిటుల తీసివేయుటవలన కన్ను వికారరహితముగా నుండును గాని శస్త్రప్రయోగము చేయుట మిక్కిలి భీతికరము.

## హాలీల్ అనగా వంకరచూపు లక్షణములు.



ఈవ్యాధిగలరోగి ప్రత్యేకవస్తువుచూచి తానుచూచినవస్తువు ఒకటియా లేక రెండువస్తువులాయని సందేహించుచుండును. ఈరోగము రతూబతె జులైదియా అనగా మంచువలెనుండు కంటినీరుతో సంబంధముకలిగియుండును. ఇందువిషయమై దీనివ్రికరణమునందు వర్ణించబడినె. ఇందుకూడా చెప్పబడుచున్నది. అనగా రెండునేత్రములయొక్క రతూబతె జులైదియా అనగా మంచువలెనుండు నేత్రసంబంధమగునీరునందు పూర్ణమగు విరుద్ధత వుత్పన్నమైనయెడల ప్రత్యేకవస్తువు రెండుగా కనిపించుచుండును. పూర్ణవిరుద్ధతయొక్క భావమేమనగా ఒక కన్నుయొక్క రతూబతెజులేదియా అను పదార్థము క్రిందివైపుకు పోవును. రెండవకన్నుయొక్క రతూబతెజులేదియా పైభాగమునందు ఉబుకియుండును. యిటుల రతూబతెజులేదియా ఒకకంటియందు పైకిగాని క్రిందికిగాని, రెండవనేత్రము తననిజదశయందుయుండును. మరియు రతూబతెజులేదియా కుడిఎడమ భాగములయందు తనస్థానమునుండి తప్పిపోయిన

మొదల ఇట్టిదశయందు హాబిల్ అనగా వంకరచూపువ్యాధి ఉత్పన్నము చేయజాలదు. యేలననగా రెండు నేత్రములయందు ఇన్‌లేహా జవ్విఫా అనగా రెండుజీవనరములు యున్నవి.

కంటి వెనుక నరములను చూపు చిత్రపరము.



ఆనరములు మెదడునుండి నేత్రములోనికివచ్చి కంటి జ్యోతిఆజీవనరములద్వారా నేత్రములోనికి వచ్చుచున్నది. ఆప్రకారము ఒకటిగాచేరునట్టి స్థలమునందు విరుద్ధతకలుగనేరదు. మరియు ఈఅంశమును ఈక్రిందవివరించుచున్నాను. అనగా యీవ్యాధి వుత్పన్నమగుటకు పూర్ణకారణము ఆలోచించవలసి యున్నది. అనగా మెదడుయొక్క ముందుభాగమునుండి రెండుజీవనరములు బైలుదేరినవి. మరియు, మెదడుయొక్క ముందు భాగమునందు రెండునరములు విశేషవస్తువులు స్తనములయొక్క అగ్రభాగమునకు సదృశముగా బైటికి వెడలివచ్చినవి. గ్రహాణశక్తి అనగా వాసనచూచునట్టి శక్తి యిందుండి కలుగుచున్నది. ప్రత్యేకముగా మెదడునుండి ఒకగుల్లనరము ఉత్పత్తియై ప్రత్యేకించి బయలు దేరుటవలన దీనిని మజవ్విఫా అనగా తామరకాడవలెనుండు బోలునరమని పేరు పెట్టబడినది. యీగుల్లనరము యొక్క రంధ్రమునందు మిక్కిలి సన్ననిసూది జొచ్చునంతటి ప్రదేశము కలదు. ఆనరము కుడివైపునుండి బైలుదేరి యెడమవైపునుండి క్రిందికి వచ్చియున్నది. మరియు, యెడమవైపు నరము కుడివైపునకు ఒకటితో నొకటి కలిసి కుడివైపునుండి క్రిందకి దిగినది. యీ రెండు నరముల యొక్క గుల్లమార్గము ఒకదానిలోనుండి రెండవది వికసించి ఒకటైయ

వీనియందుగా ఉన్నగదళ ఉన్నతమైనది. మరియు, గుల్లప్రదేశము వకటిగా మారిన యెడల ఆప్రదేశము విశాలముగా తోచుచున్నది. ఈ రెండు నరములయొక్క గుల్లప్రదేశసంయోగ స్థలమునకు మిజమెరుస్న్యూర్ అనగా ప్రకాశస్థలము అందురు మరియు, ఆరెండు నరములు తిరిగి ఆస్థలమునుండి ఒకటి రెండుగదానితో ప్రత్యేకమై రెండు శాఖలుగా విభజించబడి యెడమవైపునుండి వచ్చినవనము యెడమ వైపుగావచ్చి యెడమకంటియందు ప్రవేశించినది మరియు, కుడివైపునుండి వచ్చిన నరము కుడికంటియందు కుడివైపునుండి ప్రవేశించినది యీ రెండు నరముల ప్రక్కస్థలము రతూబతె జులైదియూ యందు ప్రవేశించి విశాలత్వమునొందినవి. యిదియే చూచునట్టి శక్తిగల స్థలము. మరియు, యీకుడివైపునున్న యెడమవైపునరము యెడమవైపునున్న ప్రవేశించుటను మాత్రము వర్ణించితిమి.

ఈక్రిందవ్రాయు అంశములు వాకీలు జాలీమూస్‌గారి అభిప్రాయమును యిందు వ్రాయుచున్నాను. యితర వైద్యుల అభిప్రాయము కుడివైపునరము యెడమకంటియందున్న, యెడమవైపునరము కుడికంటియందున్న వచ్చి ప్రవేశించినవని వచింతురు గాని యిది అసంభవము. ముజమెస్న్యూర్ అనగా ప్రకాశము ఒకటిగా చేరుస్థలము యొక్క యావత్తు అంశములు ఒకటి రెండుకండ్లయందు ఒకేస్థలమునందు వుండవలెను. యేవస్తువునైనా చూచిన యెడల శక్తి ఒకేస్థలమునందు చేరవలెను. దీనివలన ఒకవస్తువు రెండుగా కనిపించజాలదు. ఈ స్థలము అనగా ప్రకాశస్థలము ఒకేవస్తువు రెండుకండ్లయందు ప్రవేశించుచున్నది. ఈసమయమునందు ఒకకంటియొక్క పాపపైభాగమునకు వచ్చుచున్నది. రెండవకంటియందున్ను పాప క్రిందికివచ్చుచున్నది. లేదా ఒకటి పైకి ఒకటి క్రిందుగా నుండక వకకంటిపాపపైభాగమును రెండవకంటియందుండు పాప నిజదశయందు స్థిరముగాయున్నను చూచునట్టివస్తువు ఒకటిఅయినను రెండువస్తువులుగా కనుపించుచుండును. ఈకారణమువ

డును. మరియు, దానికి పుంచి భోజనము యిప్పించవలెను. దీనివలన స్వాభావికమగు ఉష్ణము ప్రకృతిశక్తి శరీరమునకు స్థిరపడచును.

(3) అపస్మారమువలన వంకరచూపు ఉత్పన్నమైన యెడల దానికి వాతప్రకోపము కలిగించునట్టి వస్తుసేవన వర్జించి పురుషసంపర్కముతో దూరపరచవలెను.

## 2వ విధమగు వంకరచూపు లక్షణములు.

ఈవ్యాధి పెద్దవారికి ఉత్పన్నమగును. యిది మూడు విధములుగానుండును. (1) యీ వ్యాధి యేదో ఒక అజలా అనగా రెండు భుజములనుండి రెండు పిక్కల వరకు వ్యాపించి కళ్ళు త్రిప్పుటకు కదలించుటకు సహాయము కలిగించునట్టి బద్దపలెనుండు కండరము బిగించబడిన యెడల కంటి గ్రుడ్డు తిరిగిపోవును. యిట్లు తిరిగిపోవునట్టి కారణము శుష్కత్వమైనచో దీని చిన్నెలు మిక్కిలి కఠినమగు రోగముల యొక్కయు, సర్సాం అనగా మెదడునందు పొర వుబ్బుటవలన కలుగు వ్యాధి తరువాత ఉత్పన్నమగుచున్నది.

## 2వ. విధమగు వంకరచూపు చికిత్స.

చెమ్మను కలిగించునట్టి కాపడములు తైలలేపనలు చేయవలెను. తసన్నుజ్ రాబిస్ అనగా శుష్కత్వమువలన బిగిసికొను వ్యాధియందు వర్ణించబడియె, యీవ్యాధియందుకూడ వుపయోగించవలెను మరియు ఆడశిశువుగల తల్లిపాలు నేత్రములలో వేయుటవలన మిక్కిలి లాభదాయకము. యిట్లు బిగించుటకు కారణము అచ్చట రతూబత్ కలిగి కండరములను విశాలపరచును. దీనిచిన్నెలు తసన్నుజ్ ఇత్మిలాయి యొక్క చిన్నెలకు సమానముగా నుండును. మరియు, బహుదా అపస్మారవ్యాధి తరువాత ప్రకటనమగుచున్నది. తసన్నుజ్ ఇత్మిలాయి అనగా చెమ్మవలన బిగించు వ్యాధియందు వర్ణించబడియె. దీనిని ముదిఖాల్ అను ఔషధమును యిచ్చి మలద్వారము నుండి మలము

ను వెడలింప జేయుట, గండూషము చేయుట, సాత్వికభోజనములను నొనర్చుట మొదలగునవి చేయవలెను.

(2) కండరములయందుండి ఉత్తకండరములోనుండి ఒకకండరము బిగితప్పినయెడల కన్ను కంటిగ్రుడ్డు రెండవవైపుకు తిరిగిపోవును. కండరము బిగితప్పుటయే దీని చిన్నె ములు.

## రెండవ వంకరచూపు చికిత్స

ఈవ్యాధిచికిత్స శిరోరోగప్రకరణమునందు వర్ణించబడియున్నది. కాబట్టి ఆచికిత్సలను యీవ్యాధియం దుపయోగించవలెను.

(3) నేత్రముయొక్క పొర, నేత్రముయొక్క రతూబతు అనగా నీరు కఠినమగు వాతకారణమువలన తన స్తానమునుండి తప్పిపోవును. కాబట్టి వీనియొక్క వచనముకఠినమై భిన్నాభిన్నతయొక్క అధికతవలన కంటియొక్క పొరలు రతూబతులను కదలించును. యిట్టి కారణమువలన తన స్తానమునుండి యేదోపొర తప్పిపోవును. దీనిచిన్నె ములు కన్ను అదరుట, ఒకప్పుడు కండ్లవెంట నీరుస్రవించుట ఈలక్షణములు కలిగి యుండును.

## మూడవ వంకరచూపు చికిత్స

ఈరోగమునందు ముందుగా యారజాత్ అనుమాత్రలను ఇప్పించవలెను. దీనివలన నేత్రముయొక్క రతూబతుయందు గలవాతమును హరించి మెదడునుండి క్రిందికి ఈడ్చివేయును. మరియు వాతమును తీసివేయుటకున్ను, వాతమును వచనముచేయుటకున్ను ఉష్ణోదకములో కాపడము చేయవలెను. మరియు మామిరా, సోపుకషాయమునందునూరి లేపనము చేయవలెను. వాతమలము ఆమాశయమునందున్నయెడల ఆ వాతదోషము ఆమాశయమునందుండి మెదడునందుచేరి రోగమును వుత్పత్తి చేయుచుండును. ఇట్టిస్థితియందు వమనవిరోచనములను ఇచ్చి ఆమాశయమును శుభ్రపరుచవలెను. మరియు ఉష్ణ జవారిషులను అనగా ఔషధములను ఉపయోగించుటవలన వాతము హరించును. ఒకానొక

వ్యాధు నీచముగువాతము కలిగియున్నట్టి గుబ్బారె ... చేరి నబకియాఅను పొరలో ప్రవేశించు పటలపొర స్థానమునుండి యెత్తగును. రతూబతెజుజాజియాత్ నాబంధ కలిగి ... యు రతూబతెజుజాజియా, రతూబతెజులైదాత్ ... సి అజులైదియాను తన స్థానమునుండి తప్పించివేయును ఈకారణమువలన నేత్రపొరలు బిగిసి ఒకవస్తువు రెండుగా కనుపించు రోగము అనగా వంశరిమూవు కలిగించును.

# రేచీకటి లక్షణములు.

అశాక్, శబకోరీ మరియు, శబకోంకా అను రేచీకటి యొక్క పర్యాయములు. రేచీకటి అనగా రాత్రివేళ జ్యోతిప్రయోజనమైన నక్షత్రములుకూడా కనుపించకుండును. పగలుమామూలుదశయందుండును. తిరిగిసూర్యుడుఅస్తమించుచున్నకొలదినేత్రమునందుగలజ్యోతిదుర్బలము నొంద నారంభించును. మరియు కొందరి రేచీకటి వగలు మామూలు మయము కూడా కనుపించకుండును. ఇటుల అటస్థించినప్పుడు దీనిని అశా అనగా రేచీకటిఅందురు. ఈవ్యాధి కలుగుటకు మూడు కారణములు కలవు. (1) చూచునట్టి ప్రాణవాయువు దీనిని రూవువనరా అందురు. నీది చిక్కని మలముయొక్క పరమాణువుల కారణమువలన ఈప్రాణవాయువుకూడా చిక్కబడి ఆవిరిపరమాణువులను మెదడు ఆమాశయము నందుండిగాని మెదడుపైపుకుగాని ప్రవేశపెట్టును ఈరెండు కారణముల లో భేదము అనగా ఆవిరిపరమాణువులు మెదడునందే వుత్పన్నమైనఎడల పబకోరి అనగా రేచీకటి ఒకేదశయందు నిలిచియుండును. మరియు ఆ

విరి పరిపాకమునకు వచ్చి ఆమాశయమునందుండి పైకెక్కి వెళ్లుచుండిన ఆమాశయము లఘుత్వమువలన రేచీకటి లఘుత్వమునొంది ఆమాశయము భారమునొందినప్పుడు రేచీకటి విశేషముగా నుండును.

(౨) వేరు కారణమువలన నేత్రముల భాగములయందు విశేషముగా రక్తాబతు తరంగము లగ్ని రక్తాబతె బైజియా చిక్కబడి అనగా యీరెంటియందు కారణమేమనగా పగటియందు వీచునట్టిగాలి రాత్రిగాలి కంటె సూర్యప్రకాశమువలన వృష్ణ గలదై లఘుత్వము నొందును. ఈ కారణమువలన రక్తాబతు బైజియాయొక్క చిక్కదనము కంటియొక్క రక్తాబతు తరంగమునందు లఘుత్వము ప్రవేశించుచుండును. మరియు నేత్రజ్యోతి తేజదశయందుండును. ఈకారణమువలన రాత్రిగాలి చెమ్మగలదగుట గురువుగానుండును. రేచీకటియొక్క కారణము అనగా నేత్రసంబంధమగు రక్తాబతు అనగా నీరునకు సహాయము కలిగించుచుండు. ఇట్లు కలిగినప్పుడు నేత్రమునందుండు చూచునట్టిశక్తి అనగా (దీనిని పర్షీభాషలో ఖువ్వతెబాసరా అందురు.) తనపనియందే సహజముగాపనిచేయును.

(౩) ఎల్లప్పుడును యెండలో నివసించుటవలన సూర్యప్రకాశము నేత్రములయందుండు చూచునట్టి శక్తిని మృదుత్వముగను లఘుత్వమును ప్రపంచుచుండును. విశేషగరుత్వముగానున్నచో రాత్రిఅయినయెడల రాత్రివీచునట్టిగాలి ప్రాణవాయువును గురుత్వము కలిగించును. కాబట్టి రాత్రివేళ యేవస్తువును కనుపించజాలదు. మరియు కారణముముందుగా కలుగుటచే బిన్నాకులకు దాపైయుండును. ఈప్రత్యేక కారణములకు ప్రత్యేకముగా భావింపదగును. రేచీకటి పెద్దకండ్లుగలవానికిన్ని నల్లని కండ్లుగలవానికి వుత్పత్తియగును.

రేచీకటి చికిత్స.

మలమును వెడలించుట అవశ్యమని తోచినయెడల యారజ్ మాత్రలవలన గండూషములవలన మలమును వెడలించవలెను. ఆవిరి

పరమాణువులు ఓతూబతు అనగా నేత్రసంబంధమగునీరును తేలికగను శుభ్రము నొందించుటకై మిరియాలు, నకదికిని, మసాంబరము, మొదలగు వస్తువులను ప్రయోగించి అనగా నశ్యముచేసి తుమ్మును కలిగించవలెను.

(లాభ) సోపు, సోయి, బాబూనా, కౌసూగ, దవనము, మరువము, తులసి, సదాపాకు, యీవస్తువుల కషాయముకాచి యీ కషాయములో ఆవిరిపట్టవలెను. మరియు మేక కలీజా యకృత్ ఖండము అనగా కలీజాయందు కొద్దిగాసోపు, పిప్పళ్ళు కలిపి కుండలోవేసి నీళ్ళతో వుడికించి అందుండివచ్చు నీళ్ళతో తలకు ఆవిరి పట్టించుట మిక్కిలి లాభదాయకము.

మరియు మేకగుండె నిప్పుపైవేసి కాల్చి అందుండివచ్చు పొగతో తలకు ఆవిరిపట్టించవలెను. మరియు రోగి భోజనాదులందు యింగువ, పొదినా, ఆవాలు, చాతరాసియాకు, యింగువచెట్టుజిగురు, యీ వస్తువులు విశేషముగా చేర్చవలెను.

మరియు అడవిమేకగుండె నిప్పుపై నునిచి ఆపైని మిరియాలు, సోపునూరివేసి యిందుండివచ్చునీరు కాచుచుండవలెను. తదువరి ఆ గుండెపై వేయబడినవస్తువులను తీసికొని మెత్తగానూరి వుంచుకొని సురమావలె కండ్లలోవేయవలెను.

మరియు శౌరహా అస్బాబ్ అను వైద్యగ్రంథమునందు పిప్పళ్లు, అడవిపస, యీరెండువస్తువులను మేకగుండెయందుంచి కాల్చి అందుండి స్రవించునీళ్ళను కండ్లలోవేయవలెను. ఇదిరేచీకటిని నసింపజేయు ననియు నిది అద్భుతమగు చికిత్సఅనియు దీని ప్రభావము వర్ణించుతర ముకాదని చెప్పియున్నది.

రక్తదోషము అధికమైనచో సరేరు అనునరమును మరియు నేత్ర కొలికియందుగల నరమును ఛేదించుట లాభదాయకమగును. మరియు

యెవరికైనను చూపునుకలిగించునట్టి ప్రాణవాయువును చిక్కదనముగుటవలనగాని లేక యొండయందుండుటవలన యీవ్యాధి కలిగినయెడల దీనిప్రాయశ్చిత్తములను వచించుచున్నాను. అనగా చెమ్మను కలిగించుట వృష్ణమును కలిగించుట నీచమగు భోజనములను మాన్పుట అనగా నీచ భోజనములు మలమును వృద్ధిచేయునుగాన మాన్పించవలెను. మరియు యేవస్తువు శరీరమునకు ఆరోగ్యము మేలుకలిగించునో అట్టివస్తువులను వుపయోగించవలెను.

## జహరా అనగా పగలు చీకటి లక్షణములు.



ఈవ్యాధి రేచీకటికి విరుద్ధముగానుండును. యీవ్యాధికలుగుట వలన పగలు కండ్లు కనుపించకుండును. మరియు, రాత్రివేళయందున్ను, పగలు మబ్బుక్రమ్మినప్పుడున్ను, కండ్లు కనుపించును. జహార్ అనగా పగలు చీకటి యొక్క కారణములు. నేత్రములందు చూపును గ్రహించునట్టి ప్రాణవాయువునందు కొరంతకలుగును. మరియు లఘువుగానుండును. కాబట్టి సూర్యునివేడి అనగా యెండ ప్రాణవాయువును నష్టపరచుచున్నది. పగలు నేత్రజ్యోతికారణములు నష్టమైపోవును. ప్రొద్దుక్రుంగి రేయి అయినకొలది మేఘము ఆకాశము యావత్తు క్రమ్మినప్పుడు జలుబుకారణమువలన ప్రాణవాయువుగల నరములయందు చెమ్మ ప్రవేశించి కండ్లయందుగల చూచునట్టిశక్తి తన నిజదశయందు ప్రవేశించును. మరియు కొందరువైద్యులు పగలు చీకటి తీక్ష్ణదోషమనియు యీదోషము మెదడునందు ప్రవేశించియుండుననియు, యీతీక్ష్ణదోషపరాక్రమమువలన మెదడునందుండు ప్రాణవాయువును చెరుచుచున్నదనియు పగటివేళ యీదోషమునకు మిక్కిలి సహాయము కలుగుననియు నేత్రములందుండు చూపును గ్రహించుశక్తిని నష్టపరచుచున్నదనియు వచించిరి.

## పగలు చీకటివ్యాధి చికిత్స.

మెదడునకు ఆహారముననుసరించియు, శోలినుండియు చెమ్మనుకలిగించునట్టి సహాయమును చేయవలెను అనగా ఆడశిశువుగల తల్లి చనుబాలు బనప్షాతైలము సొరగింజలతైలము మొదలగునవి నస్యము చేయవలెను. మరియు రీబాసా, అనగా నిది గడ్డిజాతి. దీనిపూవు మెత్రగా నుండును. దీనిరసము కలువపూల షరబతు బనప్షాషరబతు మొదలగు స్వభావికముగల వస్తువులను రోగికి పానముచేయించవలెను. మరియు చల్లని నీళ్లయందు రోగితలముంచి కండ్లువిప్పియుండునటుల ఆజ్ఞాపించవలెను. మరియు ప్రాణవాయువునకు బలము కలిగించునట్టి అనగా రక్తమును వృద్ధిపరచి బలమును కలిగించునట్టి వస్తువులను రోగికాహారముగా నివ్వవలెను. అనగా యువాగులు, కల్లాగయా బాగుగా కాల్చిన రొట్టె మొదలగునవి. మరియు, ఇట్టి స్వభావికముగల ఇతరవస్తువులను కూడా యుపయోగించదగును.

## ఇన్తిసా ఇన్తిశారయొక్క లక్షణములు



వైద్యవరులు యీరెండు శబ్దములలో భేదభావము చూపుచున్నారు. కొందరు ఇన్తిసా అనగా అస్వబెతుజబ్విషా అనగా నేత్రప్రకాశవాహిని విశాలమగుటకు ఇన్తశా అని చెప్పుదురు. మరియు, ఇన్తిశారా అనగా సుకబె ఇంబియా అనగా కంటియొక్క మాడపపార రంధ్రము వెడల్పు అగుటకు ఇన్తిశార అని చెప్పుదురు. మరియు, ప్రాచీన వైద్యుల వాఖ్యమునుబట్టి చూడగా ఇన్తిశా, ఇన్తిశారా అను నీ రెంటియొక్క అర్థము ఒకటిగానే యున్నది. అనగా ఇన్తశా రోగము ఇన్తిశారా రోగము అధికమై యున్నదనియు నిస్సందేహముగా ప్రాచీన వైద్యుల మతానుసారముగా ఇన్తిశా అనగా విశాలమగుట, ఇన్తిశారా అల్లుకొ

నోట యీ రెండును ఒకే యర్థముగానే యొప్పుచున్నవి. యీసమయము నందు అనబెయుజన్విఫా అనగా ప్రకాశవాహిని నాళముయొక్క ముఖము తన స్వాభావికమగు ఛిద్రము కేవలము సన్నమైనది మిక్కిలి ఇరుకైనముగా ప్రవేశించునంత మార్గముగలదై యుండి మిక్కిలి విశాలము నొందును. మరియు, కంటియొక్క మూడవపొరయొక్క ఛిద్రము దీనిని సుకబెయింబియా అందురు. ఇది తన స్వాభావికదశకంటె విశేష వెడల్పుఅయినచో యీదశయందు నేత్రమునందు జ్యోతి అల్లుకొనుట సంభవమని గ్రహింపవలెను. మరియు, వెడల్పు అగుటకు ఇన్త్రసా అనుట ప్రకటనమగును. మరియు, అల్లుకొనుటను ఇస్త్రశార అందురు అనబెయుజన్విఫా వెడల్పు అగుటవలన దృష్టి తగ్గియుండును. కేవలము సుకబె ఇంబియా వెడల్పు అయి తనువాని నేత్రరంధ్రము వెడల్పు అగుట కంటి గ్రుడ్డువరకు చేరినచో యిలహాబా అనుపొర, కర్నియాపొర మధ్య వేరుచేయునట్టి ప్రదేశము ఒంటియుండిన యెడల యిట్టిస్థితి యందు నేత్రజ్యోతి బొత్తిగా నశించజాలదని గ్రహించవలెను. అనగా యీ సమయమునందు అనబెయుజన్విఫా విశాలమగును అనగా సుకబె ఇంబియా నేత్రసంబంధమగు నల్లగుడ్డు యొక్క తెల్లగీతవరకు విశాలమొందిన యెడల నేత్రదృష్టి బొత్తిగా నశింపపోవును. యీ రెంటియందు భేదము కలదు అనగా అనబెయుజన్విఫా విశాలమగుటవలన నేత్రమునందు ప్రకాశము అల్లుకొనును. మరియు, నేత్రసంబంధమగు మూడవపొర ఛిద్రము విశాలమగుటవలన ప్రకాశము అల్లుకొనుట నేత్రభాగములయందు ప్రకటనము కాజాలదు. మరియు. యీ వ్యాధి గల మనుష్యునియొక్క కండ్లవైపు చూచిన యెడల సందేహము తోచును. అనగా నేత్రము యావత్తు నల్లగా మామూలువలెనే యుండును. యిట్టి స్థితియందు సుకబె ఇంబియా వెడల్పగుటవలన నేత్ర భాగమునందు ప్రకాశము కనుపించలేదని భావించవలెను. దీనికారణ మేమనగా నేత్రజ్యోతి యావత్తు నేత్రమునుండి పొరనుండి బైటికివచ్చు

చున్నది. నేత్రముయొక్క వెనుకవైపు అల్లుకొనుచున్నది. నేత్రసంబంధముగు జ్యోతి నేత్రముయొక్క మూడవపొరనుండి వెడలివచ్చుచుండిన నేత్రభాగములయందు అల్లుకొనుచుండును. మరియు, ఛిద్రమునుండి తిన్నగా బైటికివెడలదు. ఇందువలననే నేత్రభాగములయందు జ్యోతి అల్లుకొనడము గోచరమగును. అనబెంజబీఫా విశాలమగుటవలన కలుగు చిన్నెములలోనుండి కలుగుచున్నది. మరియు, అల్లుకొనుట నబకియా పొర చినుగుటవలన కలుగుచున్నది. ఇట్టిస్థితియందుకూడా నేత్రజ్యోతి బొత్తిగా నశించుచున్నది. అంగా నబకియా పొరయొక్క వ్యాధులయందు వర్ణించబడియున్నది. నబకియా పొర అల్లుకొనుట ప్రకాశమువాహిని అల్లుకొనుటకు భేదమేమనగా నబకియాపొర అల్లుకొనుట వకేపరియాయము ఉత్పత్తియగును. మరియు, అనబెముజబీఫా నెమ్మదిగా విశాలమగుచున్నది. యీ అధ్యాయము మూడు భాగములలో వర్ణించుచున్నాము.

**{ అనబెముజబీఫా అనగా ప్రకాశవాహిని విశాలమగుటకు లక్షణములు. }**

ఈవ్యాధియొక్క చిన్నెముల వర్ణనచెప్పబడియె. యీనరము విశాలమగుటవలన దోషయుక్తశిరోవ్యధ అనగా తలనొప్పి తలవెనుక భాగమునందు నిలిచియుండును. యీవ్యాధి సర్నాం వెనుక మానరా అనగా రక్తపిత్తవాపు తనుపరి వుత్పన్నమగును. దీనికారణమేమనగా చిక్కని దోషముయొక్క తీవ్రనైజగల పరమాణువులు నేత్రప్రకాశవాహినియందు ప్రవేశించి యీప్రకాశవాహినియొక్క ఛిద్రమును వెడల్పు చేయును. మరియు, ఒక్కొకప్పుడు నేత్రమునుయొక్క గుల్లనరములు యీ క్తనరము అనగా ప్రకాశవాహిని విశాలము నొందినవెంటనే నుకబెళ్ళని బియా విశాలము నొందకుండును. మరియు యీకారణమువలన దోష ఘనారము అనబెముజబీఫావరకు ప్రవేశించుట మిక్కిలి కఠినమగును. [illegible] చేతిలోకూడా సరిగా చేరజాలదు, యిందువలన అస్బాబ్ అను

[illegible]

గ్రంథకర్త దీనివిషయములో విశేషముగా వచించిరి. అనగా యీవ్యాధియే సమపాయముపలనకూడా కుదురనేరదు. మరియు నిజాలులమా అనగా కంటిలో నీరుగారు వ్యాధియొక్క ఆరంభమునందు లాభదాయకమగునవి యిందు గుణమునిచ్చునని వచించిరి. అనగా నేత్రబిందువు ఆరంభమునందు వుపయోగించు చికిత్సలు యిందుపయోగించునని చెప్పబడెను.

### నుకిబెత్తవిబియూ విశాలమగుటకు లక్షణములు.

ఈవ్యాధికి అయిదు కారణములుగలవు. (1) బాహ్యకారణములు అనగా దెబ్బతగులుట మొదలగునవి. యీమొదలగు కారణముల వలన ఇరిబియూపొర నాలుగువైపులనుండి బిగిసిపోవును. మరియు నేత్రముయొక్క మూడవపొర రంధ్రము విశాలమగును.

### నుకబేత్తవిబియూ విశాలము నొందుటకు చికిత్స.

నరేరుఅను నరమును భేదించి రక్తమోక్షణమును చేయించవలెను. పిక్కలపై రక్షలు వేయవలెను. మరియు, అణగియున్నట్టి ప్రకృతిని మృదువస్తివలన విడదీయవలెను. వమనము దుష్టభోజనములు స్త్రీగమనము మనస్సు వ్యాకూల్యతనొందుట విశేషముగా ప్రకాశమగు వస్తువులను చూచుట ఇత్యాదికార్యములను వర్జించవలెను.

మరియు మొగశిశువుల తల్లిపాలు నేత్రములలో వేయవలెను. బొకలాపెండి, బనప్షా, ఖిఖి మొదలగు వస్తువులనుచూర్ణించి కోడిగ్రుడ్డుసొనలో కల్పి లేపనముచేయవలెను. యీదికిత్సవలన వ్యాధిశాంతించిబాధతగ్గినయెడల లేపనఔషధములలో బాబూనా, మయినపుఅరకు చేర్చవలెను. వీటివలన వాపు సాంతముగా తగ్గిపోవును. వాపుతగ్గినయెడల కొహాతెరోసనాయి అనగా ప్రకాశము వృద్ధిచేయు సురుమా, బాసలిఖూన్ కండ్లలో వేయవలెను. నేత్రములయందు వేయు ఔషధములవలన శేషించియుండు ఫలము హరించును.

(2) ఈవ్యాధికారణము లోభాగమునుండి కలుగుచున్నది. అనగా చిక్కనిదోషముయొక్క తీవ్ర ఆవిరిపరమాణు ప్రభానేత్రముయొక్క మూషవపొర సంబంధమగు నరములయందున్న సకీరూపొర నరములలో పుత్పన్నమై అందుజొచ్చి వాటిని యందు బిగింపు పీకును కలుగజేయును. అనగా బిగించునట్టిభాగము పెరుగును. ఈవిధమగు రోగము మిక్కిలి తలనొప్పికలిగి తదుపరి కలుగుచున్నది. లేక నగసాము (మెదడువాపు) తదుపరి గాని లేక రక్తపిత్తవాపు మెదడునందుకలిగిన తరువాతగాని యీ మొదలగు వ్యాధులు కలిగించిన పిమ్మట తరుచుగా కలుగుచున్నది. యీవ్యాధి ప్రకాశవాహిని విశాలమగునేథయముకలుగగలదు.

ఇందువిషయమై నహీరా అను గ్రంథకర్త యీక్రిందివిధముగా వచించిరి. ఈవ్యాధి అసాధ్యము. యిది కుదురుట దుర్లభము యెటులననగా ప్రకాశము అల్లుకొనువిషయము పైనవర్ణించిన వ్యాధులవలన పుత్పన్నమగుచున్నది. ఇది ప్రకాశవాహిని విశాలమగుటవలన కలుగుచున్నది. మరియు ప్రకాశవాహిని ఛిద్రము వెడల్పుగా పెరుగుటకు తగ్గించునుపాయములేదు కాబట్టి నిది చికిత్సవలన శాంతించజాలదు. అనగా అంతవరకు ఔషధప్రయోగసారము ప్రవేశించజాలదు.

సుఖబెఇసిబియా విశాలమొందుటకు చికిత్స.

ఈవ్యాధి కారణములగు వ్యాధులను తొలగించు నుపాయమును ఆలోచించవలెను. మరియు తీక్ష్ణవిరోచన ఔషధముల నొసంగి మెదడును బాగుచేయవలెను. తదుపరి అసెబెయిజవ్విఫా అనగా ప్రకాశవాహిని ఆరోగ్యముగానుండి నల్లగుడ్డు తెల్లగుడ్డు గీతవరకు వ్యాపించకున్నచో శియాఫెమిరారాత్ నేత్రములలో వేయవలెను. దీనివలన మిగిలిననేత్రజ్యోతి నిలిచిపోవును. మరియు పైనవర్ణించిన రీతిగా ప్రకాశవాహిని విశాలమైనను లేక నేత్రముయొక్క మూషవపొర ఛిద్రము కంటినల్లగుడ్డుయావత్తు ఆక్రమించినయెడల నేత్రజ్యోతి బొత్తిగా నశించిపోవును. ఇటులనశించినచో యీవ్యాధి ఆరోగ్యమునొందు నుపాయము మరియొకటిలేదు.

### కియాఫెమిరారాత్ చేయుక్రమము.

దున్నపోతుచేదు, వంబూత్ అను చేపచేదు, అడవిమేకచేదు, గురిమయొక్కచేదు, చకోరపక్షిచేదు, ఉకాబ్ అను జంతువుచేదు, యీఆరుచేదులు సమానభాగములుగాతూచి యెండించి చేదువుచ్చ గుజ్జు, సుకపీనజ్, వర్ఫియూన్ యివి ప్రత్యేకము కిస్నర మాషములు నూరి పై చేదులలోచేర్చి చూర్ణించి, సోవురనముతోనూరి కనికెలుచేసి యుంచుకోవలెను.

(3) రతూబతెబైజియా స్వల్పముగా పెరిగి, నబకెఇనిబియాను కష్టము కలిగించి విశాలపరచును. యీవ్యాధి తరుచుగా ఆడపిల్లలకున్ను స్త్రీలకు కలుగుచుండును.

(4) కంటి మూడవపొర వుబ్బి దీనిభాగములు బిగిసిపోవును. మరియు రతూబతె బైజియా అనగా నేత్రసంబంధమగు నీరు విస్తారమగుట, కంటిమూడవపొర వాచుట. మొదలగునవి నేత్రపొర సంబంధమగు రోగములయందు వీటి లక్షణములు చికిత్సలు చెప్పబడి యున్నవి కాబట్టి గ్రహించగలరు.

(5) ఇంబియా అనగా కంటి మూడవపొర వుబ్బిపోయి ప్రక్కలయందు బిగించబడును. దీనిభాగములు మధ్యను ఒకటికొకటి కలునుకొనును. ఇట్టిస్థితియందు నేత్రఛిద్రము తనస్థానమునుండి దూరమైనను యీవ్యాధి వుత్పత్తియగును. అనగా ఆపొరలయొక్క ప్రక్కలయందు శుష్కత్వము కలిగియుండును. దీనిచిహ్నములు దుర్బలముయొక్క చిహ్నములు కలిగియుండును. ఈవ్యాధి శుష్కత్వ కారణమువలన కలిగినచో దీనిని వర్ణించబడును. అనగా నేత్రము చిక్కిపోవుట, ఆకలి సమయమునందుగాని మిక్కిలి పరిశ్రమచేసిన వెనుకగాని జాస్తియగును. దీనిచికిత్స నేత్రము శుష్కత్వమునందు చెప్పబడిన చికిత్సలు చేయవలెను. మరియు శుష్కత్వమువలన కలుగునేత్ర దుర్బలమునందు వర్ణించబడును. ఈరోగము యితరరోగములకంటె దుస్సాధ్యమగును.

హాకీము జాలినూస్ యిందువిషయమై వచించినదేమనగా ఇంబి యూహారయొక్క సమస్తవ్యాధులలో వావు మొదలగునవి కదురుటకు ఆయారోగములలోనుండి సహజమగుచు. శుష్కత్వమువలన వుత్పన్న మగురోగమునందు వ్రేతి అంగమునందు చెమ్మను కలిగించుట సహజ ముగా నుండునని వచించిరి.

(3) మూడవప్రకరణముగల యీవ్యాధి నబకియూహార తనస్థాన మునుండి తప్పిపోయినయెడల యీవ్యాధి వుత్పత్తియగును. దీనిచిహ్న ములు నేత్రసంబంధమగు జ్యోతి ఒకపరియాయము నశించును. మరియు (3) వ కారణము నేత్రజ్యోతిని నష్టపరచును. దీనిచిహ్నములు గోచ రించుటలేదుట కాబట్టి యీరోగమునకు చికిత్స చెప్పియుండలేదు.

— జైక అనగా నబకె ఇంబియూహ శుష్కించుటకు కారణము. —

ఈరోగవిషయములో వైద్యులు అనేక విరుద్ధ వాదానువాదము లు చేయుచున్నారుగాని ప్రాచీనులు వకేసమ్మతితో చెప్పిన అంశము యీక్రిందవివరించితిని. అనగా యీరోగము రెండువిధములు (1) జన్మ నుండి శుష్కత్వము నేత్రము చిన్నదిగానుండుట వుత్పన్నమగును. దీనిని ప్రకృతి సహజమందురు. ఇది బహువృత్తమైనదిన్ని శ్రేష్ఠమైనది. అన గా యిందునేత్రజ్యోతి ప్రకాశము నిలిచియుండును. మరియు ప్రకాశ ముయొక్క జ్యోతిని హెచ్చించును.

(2) జన్మించినతరువాత వుత్పత్తిఅయినయెడల యిది నికృష్టమై నదనియు మిక్కిలి క్రూరమైనదందురు. ఎందుకనగా నిది నేత్రసంబంధ మగు జ్యోతిని దుర్బలము నొందించును దుర్బలముయొక్కకారణమునే త్రఛిద్రము చిన్నదగుట కింతు యీకారణము నేత్రఛిద్రమును చిన్నదగా చేయును. దీనిప్రభావమువలన దుర్బలమగుచుండును. లేనిచో జైకు అ నువ్యాధినేత్రఛిద్రము వకటిగా కలుసుకొనువరకు హెచ్చినయెడల క్రూర మైనది కాదనిపించును. ఈవ్యాధి కారణములు 4 విధములు.

శిన, జైక్ అనగా ఇనిబిహూపోం పొందుబడుటకు చికిత్స

మెదడునందు చెమ్మ కలిగించుటకై చన్నీరాలు తలపై వేయవలెను. చెమ్మను కలిగించునట్టి తైలములు ముక్కు చెవులలో వేయవలెను. అథవా సూరేకారవు నీళ్లు, వసాంది రసము, కాహూరసము, ఇసప్గోల్ గింజల రసము, తలపై పోయవలెను. మరియు, మలము వెడలించుటకై రోగికి పిసుకుట చర్ది గుటు, ఆహ్లాద పరిచు వృష్ణ పదార్థములను సేవించుట, ఉష్ణసున్నపు తిలతైల లేపనంబు చేయుట, స్నానము చేయుట, గోరువెచ్చని మంచినీళ్ళలో రోగిని కూర్చుండబెట్టుట, పరిశుభ్రమగు నీళ్లలో రోగి కండ్లు విప్పుట, యీ మొదలగునవి మిక్కిలి వుపయోగములు.

(3) జెకా లక్షణములు

(3) ఈ వ్యాధి కలుగుటకు కారణము ఏమనగా బైజియా తన భాగముకంటె తగ్గుట, కంటిమూడవ పొరయొక్క సహాయ్యము దీనితో చెడిపోవుట మొదలగు సందర్భములవలన వస్తు చిన్నదగును. యీ రోగము వృద్ధాప్యమునందున్న ఉష్ణప్రకోపమగు సర్సాంవ్యాధి అంతమందున్న మెదడునందు వావు కలిగిన తదుపరి విశేషముగా వుత్పత్తియగుచుండును. యీ వ్యాధి చిహ్నములు నేత్రము చిన్నదగుట, శుష్కత్వలక్షణములు కలిగియుండుట, మరియు, మెదడు వ్యాధి దీనికి సాక్షియగుట, శరీరరంగు మారిపోవుట, రూపహీనమగుట, మొదలగు లక్షణములు కలిగియుండును. యీ వ్యాధి పర్చాయి వ్యాధివలె నుండును. యీ రోగచికిత్స కూడా పర్ఛాయి వ్యాధియందు చెప్పిన రీతిగా చేయవలెను. మరియు, సుకైబె ఇంబియా అను పొరయొక్క శుష్కత్వము వలన వుత్పత్తియగు జైక్ వ్యాధియందు వర్ణించబడియున్నటువంటి శీతోపచారములు యీ రోగమందు వుపయోగించవలెను.

(4) కఠినమగు చిక్కని దోషము నేత్రఛిద్రమునందు ఘనీభవించియుండును. దీని చిహ్నములు నేత్రరంధ్రము వైద్యునికి కనుపించకపోవుటయే యని గ్రహించవలెను.

4 న. భేదము జైక అనగా ఇంబిద్యుంపొర ముడుచుకొనటకు చికిత్స మెనడును మలయిుతు రహింపరబి న్యక్కతినొందించి మెదము నందు చెమ్మను కలిగించు నదుపాయములు చేయవలెను. దీనివలన ఖనీభవించిన కఠినకోమము హరించు మార్గమగును.

(లాభః) ఇందువిషయమై వైద్యుల విరుద్ధభావ మేమనగా చెమ్మ, శుష్కత్వము నేత్రసంబంధమగు మూడవపొరయొక్క ఛిద్రము చిన్నదగుటకు కారణమగునని గ్రహించవలెను. ఇందువిషయమై కొందరు యిట్టిదశయందు నేత్రజ్యోతి దుర్బలమై జెండుటను యిదికారణము. కర్నియా అనగా నేత్రముయొక్క రెండవపొర యెండిన పోవుటవలన వికటమును కలిగించును. మరియు నేత్రఛిద్రమును బిగించివేయును లేదా చిన్నదిగాచేయును. లేక బొత్తిగా మూసివేయును. అని అభిప్రాయపడుచున్నారు. మరియు రతూబతు అనగా కంటిపొరగాని లేక తడిగాని నేత్రముయొక్క రెండవపొరను ప్రక్కలనుండి మధ్యకు లాగుచున్నది. ఈ కారణమువలన కంటిరంధ్రము చిన్నదగుచున్నది. యిందుకు ముఖ్యకారణము రతూబతు బైజియాయందు మిక్కిలి శుష్కత్వము ప్రవేశించుటవలన రతూబతెబైజియా ప్రమాణముకంటె తగ్గిపోవును. ఇటుల తగ్గుటవలన కంటిపొర క్షీణించి ముడుచుకొనును. యిట్టిసమయమునందు నేత్రసంబంధమగు రెండవపొర చెమ్మవలన గాని అథవా శుష్కత్వమువలనగాని ముడుతబడును. ఇట్లుముడుచుకొనుటవలన నేత్రముయొక్క మూడవపొర రంధ్రము బిగించుచుండును. యిట్లు లాగుటవలన అనగా మూడవపొర రంధ్రము రెండవపొర రంధ్రము బిగించనారంభించిన యెడల మూడవపొర రంధ్రముకూడా ముడుచుకొనును. మరియు కంటి రెండవపొర భాగములు మూడవపొరను రెండవపొరవరకు వకటిగా చేర్చుకొనినయెడల కంటియొక్క రెండవపొరయందుచిక్కనము రంధ్రములు పడుటయు లటస్థించును. ఈ వ్యాధి వృద్ధులకు అధికముగా ముసలితనమునందు పుట్టుచున్నదగును.

నేత్రముయొక్క రెండవపొర పరిశుభ్రత నొందకుండిన నేత్రజ్యోతియందు హానిసంభవించునని తెలియుచున్నది. మరియు రతూబతె జాజైదియా కంటిపాపపై క్రమ్ముటవలన రోగికి మబ్బుక్రమ్మినటుల పొగక్రమ్మినటుల కాన్పించుచుండును. ఇది కంటిదృష్టియొక్క దుర్బలమందురు మరియు శుష్కత్వము రతూబతెబైజియాయొక్క హీనత్వమువలన నేత్రరంధ్రము చిన్నదగుట దృష్టిదౌర్బల్యమునకు కారణమగును. కర్నియాపొర వికటమునొంది ముడుచుకొనుట నేత్రఛిద్రము చిన్నదగుటకు అయిదవకారణమగును. కాబట్టి జఖిరెఖ్వారజ్మశాహి అను గ్రంథకర్త యిందు విషయమై వచించిన వాక్యము ననుసరించి చెప్పుచున్నాను. అనగా కంటిమూడవపొరరంధ్రము చెమ్మవలనగాని శుష్కత్వకారణమువలనకూడా చిన్నదగు కారణములలో చేర్చుకొనియున్నారు. అనగా ప్రాణవాయువుయొక్క విశేషత్వము బాహ్యమునందుండు చెమ్మవలనగాని శుష్కత్వము వలనగాని మారిపోయి దృష్టిని దుర్బలము చేయుటకు కారణమగుచున్నది. కాబట్టి కొందరువైద్యులు యిట్లు వచించిరి. మరియు కర్నియాపొర ముడుచుకొనుటవలన నేత్రఛిద్రము ముడుచుకొనిపోయినను అచ్చటస్థిరత్వము లేకపోవుట దీనిభాగములు యావత్తు వాటిగాచేయుట యీవ్యాధికి సాక్షియగునని గ్రహించియున్నారు. మరియు నేత్రసంబంధమగు పొరలవ్యాధులయందు పృథక్పృథక్ కారణానుసారము చెప్పబడిన చికిత్సలను యీవ్యాధియందుపయోగించదగును.

మరియు షాహాఅస్బాబ్ అను వైద్యగ్రంథకారులు నేత్రపొర ముడుచుకొనుటకు కారణములు వర్ణించబడిన పద్ధతులు యావత్తు విచారయోగ్యములుగా యున్నవి కాబట్టి వానిని వర్ణించుటకు వుచితముగా యుండలేదని తోచి యిందువర్ణించనైతిని మరియు కేవలము వైద్యుల సమ్మతిగల అంశములను మాత్రము యిందు వ్రాయబడినవి.

౧౦

# తఖయ్యుల్లాత్ అనగా రంగులు రంగులుగా కనిపించుట.

ఈవ్యాధియందు వాయువులోపల రంగులు గలదిన్ని, రంగులు లేకనే కనుపించుచుండును. అప్పుడప్పుడు ఇట్లు కనుపించుచున్నయెడల నిది నజులావ్యాధికి కారణమగును. యిందువలన నజులావ్యాధియొక్క వర్ణనమునకు ముందుగా దీనివిచారణము వర్ణనముచేయుటకు మిక్కిలివుచితముగా తోచుచున్నది. మరియు గాలిలోపల రంగు, నిరంగుగలరూపములు చూపునందు కనుపించుట ధ్యానయొక్క కారణము అని భావించవలెను. యీరోగము యే యేకారణమువలన కలుగుచున్నదో ఆయా రంగుగలరూపములు కనుపించుచుండును అనగా వానివర్ణనముచేయబడుచున్నది. యీవ్యాధియొక్క సంపూర్ణకారణములు నాలుగువిధములు.

(1) చూచునట్టిశక్తి విశేషముగలదై చిన్న చిన్న పరమాణువులు చిన్నచిన్న అణువులు గాలిలోయున్నవి. పగలుకూడా కనుపించనివి యీవ్యాధిగలవానికి కనుపించును. యిటులనే భోజనసంబంధముగు పరమాణువులతో శరీరమూర్తిదళనొందక జ్ఞానశక్తి కారణమువలన ఇటుల కనుపించగలవు, దీనిచిన్నములు జ్ఞానశక్తియందు యేకారణము కొరంతలేకుండును. మరియు చూచునట్టిశక్తి సమస్తఇంద్రియములు బలముగానుండును. అట్టిస్తితియందు గురువై, హీనముగానుండు భోజనమువలన మాంద్యతయేర్పడును. మరియు, ఆకలైనప్పుడు ధ్యాస్నముకూడా తగ్గిపోవును. అనగా రంగురంగువస్తువులు తక్కువగా కనుపించనారంభించును. ఇది యేవిధమైనవ్యాధికాదు. మరియు జ్ఞానశక్తియొక్క దళహీనతమగునట్టి కారణముగాని దీనిని వుపాయములతో నశింపచేయుంజనదు.

(2) కారణము నేత్రసంబంధముగు పొరయందు యేదైనవ్యాధి వుత్పన్నమైనను అనగా కంటి రెండవపొరయందు స్ఫోటకచిన్నములవలన

గాని కన్నునొచ్చుటవలన గురుత్వమునా వృద్ధిచేయునట్టి జలుబుకారణమువలన గాని యీచిన్నెములు కలిగినను యధాపి యీచిన్నెములు మిక్కిలి సూక్ష్మమగుటవలన నేత్రములయందు కనుపించకుండును. ఈ కారణమువలన నివి యంత్రహారముయొక్క యోగ్యతను లోభాగమునుండి కష్టము కలిగించుచుండిన నవి యెంతవృద్ధియగునో అంతచూపు భిన్నమగును. మరియు యీచిన్నెములకు యెంతప్రమాణము అనగా త్రికోణముగాగాని, చతుష్కోణముగాగాని, పంచకోణములుగాగాని, షట్కోణముగాగాని మొదలగు రూపములుగా నుండునో రోగికికూడా ఇటులనే ధ్యానించుచుండును. కాబట్టి లెనకండ్లయందు అటువంటి రూపమె కనుపించుచుండును. మరియు దీనిచిన్నెములు వుక్తకారణములు ముందుగా చెప్పబడియె. మరియు రోగికి చాలాకాలమువరకు పైనుదహరించిన రూపములు కనుపించుచునేయుండును. యింతవరకు ఇతరకష్టములు యేమియు కలుగవు. భోజనకారణమువలన యీవ్యాధి న్యూనాధిక్యత కూడా కలుగజాలదు.

(3) చెమ్మవలనకూడా యీరోగముత్పన్నమగును. యిటుల కలుగువ్యాధులు నాలుగువిధములుగా నుండును. (1) రతూబతెబైజియాయొక్క భాగములు తమంతటతాము రంగుగలవగును. యిట్లగుటవలన రంగువస్తువులుగా కనుపించుచుండును.

(2) రెండవ ప్రకరణము. యీవ్యాధి జలుబు దుష్టప్రకృతియొక్క గురుత్వమువలన నేత్రభాగములయందు ఉత్పన్నమై దీనిచెమ్మ పవిత్రమగు స్థిరత్వమును మార్చివేయును.

(3) బలమగు దుష్టప్రకృతి నేత్రచెమ్మయందుచేరి కంటితడి పొంగనారంభించును. మరియు, కంటితడియందు మిళితమగును. యీ కంటియొక్క చిక్కదనమువలన ఆవిరి రూపమై స్థిరత్వమును నష్టపరుచనారంభించును.

(4) జలుబు, శుష్కత్వము స్త్రీసంగము యిత్యాది కారణములవలన నేత్రిచెమ్మ చిక్కనై ఘనీభవించును. యిట్లు ఘనీభవించి నేత్రి పవిత్రిత నష్టమగును. దీని చిన్నములు అనగా ముందుగా పై కారణములే సాక్షియగును. ముందు వృష్ణము యొక్క కారణమువలన నేత్రిపార వాచును. లేదా యిటువంటి కారణముయొక్క జలుబుగాని శుష్కత్వమును కలిగించునట్టి కారణమువలన అనగా నేత్రిముయొక్క రతూబతులు అనగా నీరు ప్రత్యేకచెమ్మ వ్యాధులయందు వర్ణించియున్నాను. మరియు, యీ రోగము కష్టముమీాదగాని తగ్గజాలదు ముఖ్యముగా కంటిపార పరిశుభ్రిముగా స్థిరముగా నుండినదు అందు గరిమేమియు లేకుండవలెను. యిదితప్ప కండ్లయెదుట యెగురుచుండు వస్తువులు కనుపించుచుండును. మరియు, వాటియందు తగ్గు హెచ్చు యేమియు యుండదు, గొప్పహాని కారణములుకూడా యిందు కలుగవు యివికూడా దీని లక్షణములు.

(4) బాహ్యకారణములు తఖయుల్లాత్ యొక్క హేతువులగును. యీవ్యాధి రెండు విధములు. (1) కండ్ల యెదుట వస్తువులు గాలిలో యెగురుచుండు నటుల కాల్పించకుండును. ఒకవేళకనుపించినను, వెంటనే నష్టమగును. విశేషముగా దీనియొక్క కారణములును దుర్బలమును వెంటనే స్థిరపడునట్టివి. మరియు, యీకారణము సంపూర్ణశరీరమునందుండిగాని ఆమాశయమునందుండిగాని ఆవిరిపరమాణువులు మెదడునందు ప్రవేశించుచున్నవి. యీ ఆవిరిపరమాణువులు యెక్కుటకు వాతకారక భోజనముచేయుట, బహురాన్ అనగా రోగసంధియందుగాని వమనముచేయుట మిక్కిలి క్రోధముగానుండుట యిత్యాది కారణములవలన ఆవిరి ప్రకోపించి అందుండి పరమాణువులు మెదడునందు యెక్కుటకు కారణమగును. దీని లక్షణములు అందుండి దీని హేతువు కనుపించుచున్నది. అనగా గాలిలో యెగురుచుండునట్టి వస్తువులు ఈ వ్యాధిగల వాని నేత్రిములకు కనుపించకుండును. మరియు, ఒకదశ

యుండే నిలిచియుండదు. అనగా కాంగానము మారుటవలన ఒకప్పుడు అధికముగాగాని వకప్పుడు స్వల్పముగాగాని తోచుచుండును. (2) నేత్రముల యెదుట రేణువులు మొదలగునవి యెగురుచున్నట్లు కనుపించుచుండును. నిది నేత్రమునందు నీరు దిగుటకు ముందు ప్రభావమగును. దీని చిన్నములు యితర చిన్నములు యేమియు ప్రకటనము కాజాలవు గాని నిమ్మళముగా నేత్రజ్యోతియందు దుర్బలత్వము విశేషమగుచున్నది. అనగా చికిత్సచేయనిచో నేత్రములయందు నీరు దిగును. మరియు, దీనియొక్క యితర లక్షణములు నజులా లక్షణముల వర్ణనము. నజులా వ్యాధి ప్రకరణమునందు వర్ణించబడును. యీరోగముయొక్క చికిత్సకారణానుసారముగా కంటిపొరల రోగముల యందున్న రతూబతుల రోగములయందున్న చెప్పబడియె.

మరియు, నజులావ్యాధి వర్ణనము నజులా ప్రకరణమునందు చెప్పబడును. సుఖమతికొరకు చికిత్సనహితము యిచ్చుట కూడా కొద్దిగా చెప్పుట శ్రేష్టమని భావించి చెప్పుచున్నాను. యీరోగముయొక్క స్వల్పకారణములు అనేకములు గలవు. (1) వాతదోషము నరముల యందు దిగి దీని ఆవిరి పరమాణువులు మెదడువైపు లేచి ప్రాణవాయువునందు, కలిసి పై కెక్కి అల్లుకొని నేత్రభాగములయందు దిగుచు గాలిలో యెగురుచుండు వస్తువులు కనుపించినట్లు కారణమగుచుండును. దీనిచిన్నములు రోగికి యేమితోచకుండుట అనగా సూర్యకిరణములు ముఖమువైపుకువచ్చి ఉన్నతమై విశాలముగా అల్లుకొనుచుండునట్లు తోచుచుండును.

—తఖయ్యుల్లాత్ చికిత్స.

ఈరోగమునందు ముందుగా శరీరమును యుక్తదోషములనుండి దీని అనుసారముగా వుపాయములతో దూరపరచవలెను. అనగా వాత రోగమునందు చెప్పబడిన చికిత్సలను వుపయోగించవలెను. వీనివలన

ప్రయోజనము కలుగినిచో కణతలయందు నరములు గాని లేక చెవుల వెనుకనైవు నరములను గాని ఛేదించవలెను. తరువాత రక్షము వేయుటవలనకూడా ప్రయోజనము కలుగగలదు. దీని విషయమై నజులా వ్యాధియందు వర్ణించబడును.

మరియు నరములు ఛేదించుట, రక్ష వేయుటకూడా వాతమలము వెడలుటకేయని భావించవలెను. వాతమలమును శోధన చేయక వెంటనే తీసివేయవలెను. యెందుకనగా ఒక్కొక్కసమయమునందు నరము కనపించక రక్షవేయుటలో నరముపై పడక సంబంధి చకపోవుటవలన మలము నిలిచియుండును యిటు నిలిచియుండుమలము నరముద్వారా పైకెక్కును. మరియు నరములను ఛేదించునట్టియు, రక్షలువేయునట్టి విధానము ప్రయోజనము మొదలగునవి యీరాత్తు ఆదాసీసి అనగా అర్ధాంగతలనొప్పి ప్రకరణమునందు చెప్పబడియున్నది.

## తఖయుల్లాత్ లక్షణములు

నరములలో ఉష్ణ రక్త ప్రకోపములో నించి మధ్య వకటితోనొకటి కలుసుకొని యుండుటవలన యెర్రని ఆవిరిగల పరమాణువులు ఇందుండి పైకిలేచి ప్రాణవాయువునందు చేరుచున్నవి. దీనిలక్షణములు తల దుర్బలమునొందుట ఒళ్ళకవ్వాము నిప్పాకణములు నేత్రములలముందుండుసటుల కనుపించుట మొదలగు లక్షణములు కలిగియుండును.

## భేదము చికిత్స

ఈవ్యాధియందు ముందుగా శిరావేదనము గావించి రక్తమోక్షణము చేయవలెను. శిరావేదనము చేయుటకుముందు రక్త వేగరమును అణచుటకై ప్రకృతిని మృదువదార్ధములలో మెత్తపరచవలెను రక్తమును కలిగించునట్టియు, మాంసమును వృద్ధిచేయునట్టియు వస్తువులను వజించి లఘుభోజనమును అసంపూర్తిగా భుజించుచుండవలెను. అనగా మాంసములు, పిండివంటలు, మిఠాయిలు మొదలగు వానిని వర్జించవలెను. యిట్టివ్యాధియందు చికిత్సచేయుటలో త్వరపడవలెను గాని యే

మియు ఉపేక్షించరాదు. ఏమనగా రక్తము హృదయముయొక్క రెండుభాగములయందు వచ్చిచేరును. యిటులచేరుటవలన రోగి మూర్ఛనొందును. మరియు కంఠమునందు వాపుకలిగించి మృత్యువునకు కారణమగును. మరియు ఉక్తరుధిరము మెదడుయొక్క నరములలో ప్రవేశించి సన్యాసమను రోగము అనగా శవాకారముగానుండి వ్యాధినివృట్టించును. కాబట్టి చికిత్సవెంటనే చేయుట ఉచితము. మరియు రక్తమోక్షణము చేయుటకుముందు విరోచన ఔషధములు యివ్వదగదు. రక్తము స్వల్పముగా వెడలించకూడదు. అనగా రక్తముకొద్దిగా వెడలించుటవలన మలము సవ్యముగా వెడలక యిక్కట్టుల పాలగును.

౩ కఫజ రిఖయుల్లాత్ లక్షణములు

కఫముయొక్క చెమ్మ తియ్యగను స్థిరముగానుండి ఆమాశయమునందు ఉత్పన్నమై తిరిగి మెదడుయొక్క మొదటిభాగమునందు గాని, నేత్రముయొక్క మూలమునందుగాని ప్రవేశించి ఖనీభవించియుండును. కఫము ఇట్లుచేరుటవలన తుమ్ములు ఆటంకమగుట, కండ్లురుద్దుకొనుట మొదలగు హేతువులు తటస్థించును. అనగా చల్లని కఫము మలమును కదలించి దోషానుసారముగా ఆవిరిపరమాణువులు యుండుండి లేచి కండ్లయెదుట యేదోఒక తెల్లనిదున్నట్లు చుట్టుకొని క్రిందనుండివచ్చి పైకి వెళ్ళినటుల కనుపించుచుండును. మరియు యిట్లు కనుపించుట తుమ్ములు రాకుండుట కండ్లునలుపుకొనుచుండుట మొదలగు లక్షణములు వున్నంతవరకు యిట్లు కాన్పించుచుండును.

౩ వ భేదము కఫజ రిఖయుల్లాత్ చికిత్స

ఈవ్యాధియందు వమనము చేయించుట ఆమాశయము మెదడునందు గలమలమును యారాజ్ అను ఔషధములతో శుద్ధిచేయవలెను. మరియు మంచిభోజనము కోడిమాంసమునందు సెంగవప్పుచేర్చి దాల్చినచెక్క వలన సుగంధమిచ్చి రోగికివ్వవలెను.

4 శుక్లాత్ లక్షణములు —

కండ్లయెదుట చిన్న చిన్న పురుగులు కనుపించుటకు కారణములగును. ఈప్రకరణమునందు పైనవ్రాయబడియున్నది. అనగా యేహేతువు వల్లనైన రతూబతెలైజియాయొక్క కొన్ని భాగముల యందు ఘనత్వము సంభవించును. దీప్రక్క ప్రదేశములుగాని మధ్య భాగమునందుగాని ఘనత్వము చేరినయెడల చిన్నములు కుడి లేక ఎడమవైపు కంటియొక్క రతూబత్ భాగమునందు ఘనత్వము కలిగినచో అటువైపు మనిషి నిలిచియుండినటుల తోచుచుండును. ఎల్లప్పుడు యీసందేహముతో ఆయాధము దిక్కుచుండును. యిట్టిస్థితి యందు ఎల్లప్పుడు దోమలవలె, నలుసులవలె కండ్లకు కనుపించుచుండును. యెంతవరకు నేత్రము నష్టము నొందకుండునో అంతవర్యంతము యెల్లప్పుడు కండ్లయెదుట దోమలు రేణువులు తిరుగుచుండునటుల కనుపించుచుండును.

— 4 శుక్లాత్ చికిత్స.

దోషములను తొలగించి, బలహారములు రోగి కొనంగవలెను. యేవస్తువుకంటి రతూబతు అనగా నీరునుదగ్ధపరచి నశింపజేయునో అట్టి మర్మ్మ ఇదివరకు చెప్పియుండు ఔషధములను ఉపయోగించవలెను. మరియు సియాఫెమిరారాత్ నేత్రములయందు వేయవలెను. యేదోషకారణమువలన ఈవ్యాధి కలుగకుండిన చికిత్సచేయ నగత్యముండదు. ఇందు శ్రేష్టమగు నుపాయము శ్రేష్టభోజనము నొనంగుటయే నని గ్రహించవలెను.

—5 వ భేద లక్షణము—

(5) దోషములలోనుండి నొక దోషము మెదడునందుచేరి ఒకానొక కారణమువలన ఆదోషమునందుండి ఆవిరి పరమాణువులు నేత్రపొరయందు అప్పుడప్పుడు దిగనారంభించును. యీదోషముయొక్క ఆవిరిపరమాణువులు కంటిపొరయందు దిగునట్టి సమయమునందు ధ్యా

నించి చూచినచో యేదో ఒకవస్తువు బైటినుండి ఉష్ణప్రదేశమునుండి తన ముఖముయొక్క సన్ముఖముగా వచ్చుచుండునటుల కనుపించును. అనగా తనముఖమునకు సన్ముఖముగా నడచుచుండును. అప్పుడప్పుడు యిట్టి ధ్యానమువలన భయముకలుగ నారంభించును. మరియు, రోగి ధ్యానమునుబట్టి దోషకారణము గుర్తించవచ్చును.

5 వ భేద చికిత్స.

మలానుసారముగా శిరానివమును చేయవలెను. మరియు వమన విరోచనములద్వారా మలమును వెడలించవలెను. రోగదశయందు దృష్టియుంచుట ఉచితమగును. దోషమును తొలగించిన తరువాత గసగ్సాలమర్బత్తును దోషము కఠినముగను చిక్కనగుటకై యుపయోగించవలెను. ఆదోషము నేత్రములలో ప్రవేశించకుండునటుల కాపాడవలెను. దోషము చిక్కనై కఠినత్వమొందినయెడల అజీర్ణము ఉత్పన్నమగును. కాబట్టి యితరవ్యాధిసంభవించును. ఇటుల రెండవకష్టము సంభవించిన యెడల వృత్తమనుపాయములతో మలమును నాసామార్గమునుండి క్రిందికి ప్రవేశించునటుల చేయవలెను. మరియు చాలాకాలమువరకు నాసామార్గమునుండి మలమును వెడలించవలెను. నిటులచేయుటవలన కండ్ల మార్గమునుండి మలము తిరిగిపోవును గాని యితరహాని యేమియు సంభవించనేరదు మరియు ధ్యానముయొక్క భేదము వకేవస్తువు విశేషకాలము అనేకరూపములుగా అనేకవస్తువులవలె కనుపించుచుండును. ఇట్లు కనుపించుటకు కారణమేమనగా నేత్రసంబంధమగు రతూబతు అనగా నీరుయొక్క తంతువులు కంటిజ్యోతి మధ్యభాగమునందు యీవస్తువులను చూచుచుండును. వానిమధ్య నిలిచిపోవును. ప్రత్యేకతంతువులు తమ విశేషత్వమువలన ఆవస్తువుయొక్క శరీరమును గ్రోసివేయును. మరియు ఛిద్రము యీతంతువులమధ్య నుండుకారణమువలన ఒకవస్తువు అనేకవస్తువులుగా కనుపించుచుండును. ఇందువిషయమై వాదవివాదములను కలిగించుకొనుచున్నారు. అనగా యీవిధమగు చెమ్మరయొ

క్క తంతువులు కంటికి ముందువస్తువు దూరమగునట్టి దశయందు మాయ బడుచున్నవి. ఇటులనే దగ్గరయుండువస్తువులను చూచునప్పుడుకూడా మాయబడును. ఇందుకు చికిత్స

ఈరోగమునందు [illegible] లేదున్ను శిరస్సుకున్ను మలము నుండి స్వస్థత నొందించవలెను. మరియు అజీర్ణమును కలిగించునట్టి బియ్యపు వంటకములను భుజించకూడదు. ఈవ్యాధియందు సంపూర్ణ వాతకర వస్తువులను వర్జించవలెను. మరియు స్త్రీసంభోగము రాత్రికాలమునందు భుజించుట మానివేయవలెను.

(లాభము) ధ్యానము అనగా కండ్లముందు చిన్నచిన్న పురుగులు దోమలు యెగురుచున్నటుల కనుపించుటయొక్క రెండవభేదము నేత్ర జ్యోతితో సంబంధము కలిగించుకొనును. అనగా పెద్దవస్తువు చిన్నదిగా కనుపించుట దీనికి విరోద్ధముగా సమీపమునుండి దూరమందుండు వస్తువుకంటె బాగుగాకనుపించక దీనికి విరోద్ధముగా అప్పటికి యీరాయావత్తు నేత్రజ్యోతి దుర్బలమగు భేదమునుండి యేర్పడినది కనుక కంటి దృష్టి యొక్క దుర్బలప్రకరణమునందు వర్ణించబడును.

# నజులా వ్యాధి లక్షణములు.

ఈరోగమునందు వైద్యులయొక్క అభిప్రాయము భిన్నభిన్నములుగా చెప్పబడియున్నది. అనగా వకీము శేఖబూ అలీ సేనాగారున్ను వీరి అభిప్రాయమును అంగీకరించువారు గ్రహించిరి. (1) పైరతూబతు అనగా నీరు అరొత్తుగా చెమ్మగామాని తలనుండి దిగి కంటిమూడవపొర రంధ్రమునందు వచ్చిచేరును. కర్నియాపొరద్వార రదూబతైజియాయొక్క మధ్యమునందు



నేత్రబింబపుచూపు చిత్రపటము.

నిలిచిపోవును. యెటులననగా అచ్చట కంటిరంధ్రము ప్రకాశకిరణములు వచ్చుట రూపములు రంగుగామారుట మొదలగు మార్గమునుండి కలుగుచుండును. ఆయుక్తదిమ్మ అనగా షైరతూబతు యీమార్గమును బంధించిన పక్షమున అన్నిమార్గములు తమంతటాము బంధించబడును. ఇటుల తటస్థించినప్పుడు నేత్రజ్యోతి నష్టమగును. ఇటులనే నేత్రముయావత్తు రంధ్రములను ఆక్రమించినచో దృష్టియావత్తు నశించిపోవును. నీరు కొన్నిభాగములలో చేర్చును. కొంతనీరుతో రక్తమైనచో వికసించియుండు చెమ్మవలన చూడగలుగును. మరియు యీ షైతూబతు దిగివచ్చునట్టి దశయందు ఒకటి రెండవదానికి విరుద్ధముగానుండును. ఒకప్పుడు ఈనిజాలులుమా అనగా నజులా మండలమువలె కంటిరంధ్రముయొక్క ఆవర్ణమును ఆక్రమించుచుండును. దీనిమధ్యకొంత ఖాళీయుండును. దీనినుండి నిధానించి సమ్ముఖమునుండి చూచినచో దీని మధ్యభాగము కనుపించుచుండునుగాని ప్రక్కభాగములు కనుపించకుండును. కొల్లప్పుడు మధ్యభాగమును అణచివేయుచుండును. చుట్టుప్రదేశము విడిచిపెట్టబడియుండును. ఇట్టిదశయందు సమ్ముఖముతో యీవస్తువులను చూచుచున్నాడు. దాని మధ్యభాగము మాత్రముకనుపించకుండును. గాని కనుగ్రుడ్డుత్రిప్పుటవలన కనుపించును. ఈకారణమువలన కంటిరంధ్రము వికసించియుండు భాగము చూచునట్టి వస్తువులను యెదుట కలుగుచున్నది. ఒకప్పుడు రతూబత్ అనగా నీరు పలచబడిన యెడల కంటిరంధ్రము యావత్తు క్రమ్మివేయుచున్నది. యీనీరు పలచబడుటకు కారణము సూర్యకిరణములు దీపపుకాంతి చూచుటవలన నేత్రములు భరించజాలక కనుపించడముకూడా తగ్గిపోవునని భావము.

ఇట్లు కలుగుటకు కారణము ముస్తశిరా అనగా పలచగా అల్లుకొనిన రతూబతు అందురు. హాకీము జాలినూస్ గారు వచించిన దేమనగా నేత్రములనుండి నీరు దిగుటకు కారణమేమన రతూబతె బైజయీ కొక్కబడినచో దీనిభాగమునుండి స్రవించునట్టి నీరు గ్రుడ్డు ఆకారము

గాయుండును. పైనదిక్కుని రతూబతు వలన సహాయము పొందుచుండును. మరియు, నీకంటియొక్క తడి నశింపచు కారణమువలన కొద్దికొద్దిగా కంటి మూడవపొర రంధ్రమునుండి బైటికివచ్చి కంటిమూడవపొరపై కంటిరెండవపొర క్రింద నిలిచియుండును. తదుపరి యిటుల కాజాలదు. అనగా రతూబతు అనగా నీరు గ్రుడ్డుతో సమానముగా యుండును. నిది చిక్కబడిన యెడల యిందు జలుబు ప్రవేశించి ఖసీభవించునని కొందరు వైద్యవేత్తలు సందేహించుచున్నారు.

(సూచనీయము) హకీం అహమదుషా హాగారు యీక్రింద అంశములను గ్రహించిరి. అనగా నజూలుల్ మాయ నేత్రబిందువులు మూడువిధములుగా నుండుననిరి. (1) నీరు దిగి కంటి మూడవపొర, మరియు, అన్కబూతియాపొర మధ్యనిలిచి నేత్రజ్యోతిని నష్టపరచును. మరియు, కంటిపాపయందు చిక్కదనము సంబంధించును. దీనిరంగు నల్లని కాకిరంగు కలిగి మేఘచ్ఛాయ సదృశముగానుండును. యిట్లుండు నీటిబిందువులకు చికిత్స చెప్పబడలేదు. గాన అసాధ్యమని భావించవలెను.

(2) కరనియా ఇనబియా పొరల మధ్యభాగమునందు నీరు నిలిచిపోవును. దీనినుండి ప్రయోజనముకలదు.

(3) నేత్రముయొక్క అనబెముజవ్విఫాయందు రతూబతు అనగా నీరు కంటిపాపలోపట యేవిధమైన మంధము కనుపించదు. ఒకప్పుడు కనుపించినను మిక్కిలి స్వల్పముగా కనుపించును. దీనిలక్షణములు అనబెముజవ్విఫా బిగించబడునట్టి వర్ణనయందు యీ వ్యాధి విషయమై కూడా చెప్పబడును. యీవ్యాధిని మాయ అస్వద్ అనగా నల్లని నీరు అనిభావము. యీవ్యాధికికూడా చికిత్స చెప్పియుండలేదు. నేత్రమునందు నీరుదిగుట అనగా నీటిబిందువులకు ఆరుకారణములుగలవు.

(1) అదురుగాని దెబ్బగాని తలకు తగులుటవలన మెదడు కదలి మెదడుయొక్క పొరలయందు బంధించబడిన రతూబతు అనగా నీరు స్రవించి అందుండి కొద్దిగా అనబెముజవ్విఫాయందు వచ్చి చేరును.

తదుపరి నిది నేత్రములోనికి వచ్చును మరియు, నిది యెల్లప్పుడు అనబెముజవ్విఫాయందే యుండి యున్నచో యీ అనబెముజవ్విఫాయొక్క బంధనమగును గాని కంటియందు నీరు దిగునదికాదు అని నామతము.

మరియు, ఒకప్పుడు అనబెముజవ్విఫా కదలి కంటిమూడవ పొరయొక్క ఛిద్రమునందు ముందువిధముగావచ్చి నిలిచిపోవును. దీనినే కండ్లలో నీరు దిగుట అందురు. యెల్లప్పుడైనను అనబెముజవ్విఫా యందు కూడా నిలిచియుండును. కంటిరంధ్రమునందుకూడా వచ్చుచు చున్నది. యిట్టి దశయందు అనబెముజవ్విఫా బాధించబడి కంటియందు నీరు దిగుటకు సంబంధము కలిగియుండును. మరియు, అనబెముజవ్విఫా యొక్క బంధనము నజులావ్యాధికి మధ్యయున్నది. దీనిని వర్ణించెదను. మరియు, యీబంధనము నేత్రమునందు నీరు దిగుట, దెబ్బతగులుట, తల అదురుట మొదలగు కారణములవలన కలుగుచున్నది. యీవ్యాధి వకేవశ్యాయము కలుగును.

(2) శరీరమునందు కౄరదోషమునిండి ఆదోషముయొక్క చెమ్మనుండి ఆవిరి పరమాణువులు బైలుదేరి నెమ్మదిగా నేత్రఛిద్రము నందు ప్రవేశించును. అప్పుడు యీ ఆవిరి పరమాణువులవలన ముందు భాగము పేరుగును. మరియు, అధికమైనచో పరమాణువుల దశ చిక్కని రతూబతు రూపమేర్పడును. యిట్టీతీరి దృష్టి నష్టముగును.

(3) విశేషకాలమునుండి అధికముగా శిరావేదనము అనగా తల నొప్పి నిలిచియున్న యెడల యీ తల నొప్పియొక్క కష్టాధిక్యతవలన దోషము ఉష్ణము నొంది అంగములయందు దుర్బలత్వముకలిగించును. తదుపరి కొద్దిగా దుష్టచెమ్మనరములు అనబెముజవ్విఫా ద్వారా కంటి వైపు దిగివచ్చును.

(4) మిక్కిలి వమనము కలిగియుండు కారణమువలన నేత్రఛిద్రము పెద్దదై దోషము అటూటు తిరుగ నారంభించును. యిట్టి స్థితి యందు రతూబతు అనగా నీరువల్పముగా నేత్రమునందు దిగివచ్చును.

యీకారణమువలన కలుగు యీరోగముకూడా అగస్మాత్తుగా కలుగునని తెలిసెడి.

(5) మిక్కిలి చలి, మరియు, ప్రకృతియొక్క జలుబువలన యీ వ్యాధియొక్క కారణమగును. అనగా మంచుయందు తిరుగుటచలిగాలియందు నివసించుట ఇత్యాదిమనుజులకు యీ వ్యాధి ఉత్పన్నమగును.

(6) చూచునట్టిశక్తి దుర్బలమునొందును. యిటుల దుర్బలము నొందునట్టి హేతువువలన యీవ్యాధి తటస్థించును. నిది సామాన్యముగా వృద్ధులకున్ను, మిక్కిలి దీర్ఘరోగమువలన పీడించబడినవారికిన్ని ఉత్పన్నమగును. మరియు ప్రత్యేకకారణములను వాటివాటి పరిధమదశయందే గ్రహించవచ్చును. మరియు నీవ్యాధి ఒకేపర్యాయము అగస్మాత్తుగా వుత్పన్నమైనచో భేదమునొందించునట్టి చిహ్నములను గమనించ అవసరముండదు. మరియు యీవ్యాధి నెమ్మదిగా వుత్పత్తిఅయినచో నిది ఆరంభించుటకు లక్షణములు వర్ణించుట అవశ్యకము. రోగమును దృఢపరచుటకు నుపాయములను చెప్పబడును.

కండ్లయందు నీరు దిగుటకుముందు కలుగులక్షణమువలన చెప్పుచున్నారు. ధ్యానమునందు నేత్రములయొకుట దోమలు, ఈగలు, రేణువులు మొదలగునవి హేతుఅనుసారముగా కనుపించును. యీకారణమువలన ఎల్లప్పుడు ఇట్లు కనుపించుట నజులావ్యాధియొక్క పూర్వరూపమని గ్రహించవలెను. లేక రెండవకారణమువలన దీనియొక్క తఖయుల్లాత్ యొక్క పరికరణమునందు వర్ణించబడియె. ఐదుతరహాల క్షణములు యుండగలవు. వీనినికూడా చక్కగా పరికటనజేయుటకే దీనియొక్క ధ్యానమువలన నజులావ్యాధి ఉత్పన్నమగునని భీతికలుగగలదు. దీని భేదములుకూడా వర్ణించబడును మరియు నవి అయిదువిధములగు కారణములవలన భేదములగుచున్నవి.

(1) ఈధ్యానమును మునజిరా అనగా భయపెట్టునది. బహుదా యిది ఒకకంటియందు కలుగును. యీచిన్నములయొక్క నిజమార్గము యివితప్ప కంటిపొరయందుగాని రతూబతు అనగా నీరుయందుగాని ఇతర యుపద్రవము యేమియు కలుగనేరదు. అనగా కండ్లయందు దోమలు ఇత్యాదిజంతువులు పారికినట్లు ముందు వర్ణించితిని.

(2) భయమునొందునట్టి ఈధ్యానమును అనగా దోమలు రేణువులు ఇత్యాదివస్తువులు కనుపించు చిన్నములు రెండునేత్రములయందు పుట్టిన్నమెనచో ఇట్టిదశయందు ఆరంభమునందు వ్యాధియొక్క న్యూనత అధికతలయందు భేదము గ్రహించుట వుచితమగును. అనగా రెండు జీవనరములు ఏకసమయమునందు ఆరంభించవు ముందు ఒక కంటియందు ఆరంభమైనపిమ్మట రెండవనేత్రమునందు వ్యాధినికలిగించును. ఒక కంటియందు దోమలు మొదలగునవి విశేషముగా కనుపించును. రెండవకంటియందు తక్కువగా కనుపించును.

(3) ఆమాశయము పూర్ణముగా రిక్తదశనొందినపుడు నేత్రములయందు వస్తువులను చూచుటకు భేదము తెలియకుండును. మరియు, యెల్లప్పుడు నేత్రములయెదుట కొంచెము కొంచెముగా చిక్కదనము హెచ్చుచుండును. యీవ్యాధిఅనగా ధ్యానమునకు మలము కారణము గాన మలము సంపూర్ణముగా నశించువరకు వాంతులను నశింపచేయునట్టి వస్తువులును వమనచికిత్స లాభదాయకము కాజాలవు మరియు మలము యీధ్యానమునకు కారణమగును. గాన పూర్తిగా నశించకుండును. అయారజాత్ మరియు విరోచనౌషధములు మాత్రలు ఇచ్చుటవలన యేమి ప్రయోజనము కలుగనేరదు.

(4) ఈవ్యాధియందు కంటిగ్రుడ్డుయొక్క రంగు మారిపోవుట వలన ఖాళీయేమియు లేకుండును. మూడునాలుగుమాసములు గతించిన పిమ్మట సమస్తఅంగములు సభవించును గాన నజూలాయొక్క ధ్యానమును యితర ధ్యానములతోపోల్చి కనిపెట్టుట వైద్యులకు ఉచితమా

ర్గము. మరియు ధ్యానము జ్ఞానశక్తియొక్క విశేషమువలన శరీరము యొక్క ఆవిరిపరిమాణము ప్రాణశక్తి రెండవభాగముయొక్క రణచిన్నములు లతో కలుగుచున్నవి. సాధారణము దీని చిక్కదనమునకు కుమనా అనగా కంటినొప్పి తగ్గినతరువాత శేషించియుండు ఎరుపు వలన కలుగువ్యాధి కుమునా అందురు. దీని చిక్కదనమావేళ యావత్తు చిక్కదనము కని పెట్టవలెను. మరియు కంటిపొర రతూబతూయందు కష్టముకలుగుటవ లన యీవ్యాధి కలుగుచున్నది. గ్రంథకర్తలు రతూబత్ వ్యాధులయం దు ప్రత్యేకమగు వ్యాధిగాంగా వర్ణనము చేయబడినది. దీనివలన బాగు గా భేదము తెలియబడి ప్రయోజనము సిద్ధించును. మరియు ధ్యానము నేత్రముయొక్క రెండవపొర రణచిన్నములవలన కలుగును. గాని హె చ్చుతగ్గులు లేక ఒకేవిధముగా నుండును.

(౫) ధ్యానము ఆరుమాసములలో నేత్రదృష్టిని నష్టపరచును. ఆరుమాసములు గతించినవెనుక నేత్రములకు నజాకష్టము తగ్గిపోవును. మరియు అకసురా అను గ్రంథకారులు వచించినదేమనగా ఆరుమాస ములవరకు నియమము యీక్రింది కారణములను కనిపెట్టుటకై యేర్ప ర్చబడినది అనగా ధ్యానము దోమలు ఈగలు ఇత్యాదివస్తువులు నేత్ర ములయెదుట కనుపించుట నజులావ్యాధివలన కలిగినదానివలె భయ పడ నవసరములేదు. యీవిషయము అనేక విషయములలో పరీక్షించి చెప్పబడియె.

## నజులావ్యాధి చికిత్స

రోగారంభమునందు శీఘ్రముగా నుపాయములను చేయవలెను. మరియు, అయారజాత్ మాత్రతో శబయాద్ అనగా విరోచనఔషధ ము యీమాత్రలు రాత్రి వుపయోగించుదురు. యీమాత్రలు ఉప యోగించుటవలన శిరస్సునకు స్వస్థత నొందించును. మాత్రలు పుచ్చుకొనుటకు ముందు మలమును పక్వము నొందించవలెను. తరు వాత యీ మాత్రలు వుపయోగించవలెను. మలము పక్వమునొందనిఛో

వెడలించకూడదు, మరియు, మలమును వక్వపరచునట్టి ఔషధములను వుపయోగించుటవలన రోగప్రకృతి శక్తిరక్షణ చేయుట వుచితము. యెందుకనగా ఉష్ణముగు ఔషధముల విశేషత్వమువలన యితర కష్టములు ఉత్పన్నమగుటకు జాలిన్మ. మరియు, శక్తిబలముగల దైనచో విరోచన ఔషధములు వెంట వెంట యిచ్చుట మంచిది. శక్తి బలహీనమైనచో వారమునకొకపరియాయము అయారిజెపైకరా యొక్క కషాయమునందు కంతూర్యూన్ కలిపి యివ్వవలెను. భోజనమునకు యెందు పదార్థములు అనగా చకోరపక్షి, లావుకపక్షిమాంసము, ఎండించియు, వేయించిన గుంటెకాయ, పొట్టు తీయని గోధుమపిండి రొట్టె యిత్యాది యితర యిటువంటి గుణముగల వస్తువులను యివ్వవలెను. మరియు, భోజనపదార్థములలో దాల్చినిచెక్క, శాతరాశి ఆకు, అడవి సదాప, పరిశుభ్రముగు పచ్చిసోపు, కలిపి వుపయోగించవలెను. మరియు, మలమూయావత్తు వెడలించిన తరువాత నేత్రసంబంధముగు నీరును పరిశుభ్రము నొందించునట్టి వస్తువులు ఔషధములు అనగా శియాఫెమీరారాత్. మరియు, బాసలీఖూ అనగా సురుమా యిత్యాది స్వాభావికముగు ఔషధములు నేత్రములయందు వుపయోగించవలెను. మరియు, నీలిగింజల చూర్ణమును సురుమావలె కండ్లలో వేయుటవలన కండ్లయందు నీరు దిగడమునకు ఆపివేశి నేత్రములను బాగుచేయునని వైద్యవరులు వచించియున్నారు. యీవ్యాధియందుపయోగించు మాత్రలు పెద్దవిగానుండవలెను. యెందుకనగా ఆమాశయమునందు విశేషకాలము నిలిచి మెదడునందుండు మలమును చిక్కగా క్రిందికి నీడ్చివేయును. అనగా మెదడు సంబంధముగు వ్యాధులు మెదడుతో సంబంధము కలిగించుకొని యుండునట్టి వ్యాధులను దూరపరచుటకై ఆమాశయమును శుభ్రత పవిత్రత నొందించునట్టి నుపాయములు చేయుట మిక్కిలి లాభదాయకమగును. అనగా మెదడునకున్ను ఆమాశయమునకు సంబంధము కలిగియున్నది. మరియు, ఆమాశయము వ్యాధితో చెడిపోవుట

వలన మెదడునందున్ను ఆహారకోశముతో సంబంధము కలిగి యుండు యితర అంగములయందున్ను ఉపద్రవములు కలిగించును, యీరోగము నకు విశేష ఉష్ణము కలించుటకు భయము కలిగినచో త్రిఫలములు అయారజ్ చేర్చబడిన ఔషధము యిచ్చిన లాభదాయకమగును. మరియు, తుమ్మును కలిగించు ఔషధము యథాపి యీ రోగమునందు లాభదాయకమగును గాని తుమ్ము కలించుటకు భీతిగానుండును. అయి నను ఉపేక్షించజనదు. యెందుకనగా తుమ్మయొక్క ఆటంకము కఠిన ముగానుండును. గాన మరియు, అసంభవము కానేరదు. తుమ్ము నేత్ర మునందు నీరు దిగుటకు సహాయము చేయజాలదు.

మరియు యీవ్యాధియందు ఉష్ణములేక మలము అవశ్యకతాను సారముగా వెడలినను తుమ్మును కలిగించునట్టి వౌషధములను యుప యోగించుటవలన అసాధ్యము కలుగనేరదు. మరియు శేఖకానూన్ అను గ్రంథమునందు యీక్రిందివిధముగా వ్రాయబడియున్నది. అనగా చెవుల వెనుక వైపు నరములు ఛేదించుట లాభదాయకమగును. వుక్త మగు సమస్త నుపాయములు రోగారంభమునందు వుపయోగించునని గ్రహించవలెను. రక్షకుని అనుగ్రహమువలన అనేకులకు అకస్మాత్తుగా కండ్లలో నీరు దిగును. ఇట్టిస్థితియందు విరోచనము చేయించునట్టి వౌ షధములు వుపయోగించుటయు హానికరమగువస్తువులనుండి కాపాడుట యు నిష్ఫలమగును. ఈరోగమునకు తగిన పరిశ్రమ చేయుటవలనకూ డా ప్రయోజనము కలిగినట్లులేదు. ఈవ్యాధికి అనేకనుపాయములు చెప్పబడుచున్నవి గాని తిరిగి కండ్లయందు నీరుదిగుటకు నమ్మతి యే మనగా దీనియందు నిస్సందేహముగా కణతలనరములయందు యుండు విషయమై యేర్పర్చబడిన యినుప ఆయుధముకాల్చి వాతవేయుట వుత్తమము. యెందుకనగా నీరు దిగివచ్చు మార్గమును బంధించుట కంటె వేరు నుపాయమేమియూ యితరములులేవు. యీపని ముఖ్యము గా హిందూస్తానమునందు జరాహా అనగా సర్జను అందురు. మరియు

యీహిందూస్తానమునందుండు గ్రామములలో విశేషముగా ప్రకటన మైయున్నది. ఈవిషయము అనేకులు నెరింగియున్నారు. బహుదా పరీక్షలోకూడా యీవ్యాధి విషయమై సమ్మతించిరి. మరియు వృక్తరోగి పత్యకరముగువస్తువులలో న్యూనతచేయజనదు మరియు శరీరమును యెల్లప్పుడు మృదువుగానుంచవలెను. ఇటులయుంచుటవలన మలము పెరుగుట తగ్గిపోవును. రెండవ సరము కణతి యందు దాగియుండును గాన అవసరమైనపిని వాతవేయుట కఠినముగానుంచును గనుక వృక్తరోగికి శిరావేదనము చేయుట రక్తవేయుట స్త్రీసంగమము మొదలగు మెదడు నకు దుర్బలము కలిగించునట్టిపనులు వాతమును కలిగించునట్టి వస్తువులు భుజించుట బొత్తిగా వర్జించవలెను మరియు యీవ్యాధి వృష్ణప్రకృతి కలిగి విశేషరక్తముగలదైనచో శిరావేదనచేయుట వుచితమని తోచినచో శిరావేదనచేయవలెను.

మరియు శేల్బూఅలీశీనాగారు రోగచికిత్సలయందు యిట్లు వ్రాసిరి. అనగా కండ్లలోనీరు యావత్తు దిగి యావత్తునేత్ర దృష్టి నష్టమైనయెడల, కదా అనగా కండ్లనుండి నీరు స్రవింపజేయుటను చికిత్స అందురు. కదా కండ్లనుండి నీరుతీయువారి సమ్మతియందు కండ్లనీరు ఒక స్థలమునుండి మరియొక స్థలమునకు మార్చుచున్నారు. మరియు కండ్లలోనుండి నీరుతీయుటకు యోగ్యముగా నున్నదా యని నిధానించిచూచి యోగ్యతగానున్నతరి అనబెయుజవ్విఫా బంధించబడినదా లేదా దానితో సంయోగమై యున్నదా లేదా యని కనిపెట్టి తీయుటకు యోగ్యముగాయుండి బంధనముతోచేరి యుండనిచో ఆకంటిలోనుండి నీరుతీయుటకు అభ్యంతరములేదని తెలిసికొనవలెను, బంధనముతోకలిసి యున్నచో ముందుగా సుద్దె అనగాబంధనమును విడదీయవలెను. మరియు అనబయెలుజవ్విఫా బంధించబడియుండు విషయమై లక్షణములు చికిత్స వర్ణనము సహితము రెండు విధముల నజులావ్యాధులయందు భేదము బంధనమువలనగాని, బంధన

రహితముగాగాని కలుగుచున్నది. నేను యీయధ్యాయముయొక్క అంతమునందు వర్ణించుచున్నాను. మరియు కంటియందు నీళ్ళుదిగిన యెడల తీసివేయుటకు అరోగ్యముగాయున్నచో మంచియుపాయముల తో యోగ్యముగా యుండునటుల మార్చుకొని నేత్రమునుండినీరుతీయ వచ్చును.

మరియు శరాహ అన్ బాబ్ అను గ్రంథమునందు వ్రచితమగు వుపాయములతో అన్నివిధములగు నజులారోగముగల నేత్రములనుండి నీరుతీయుటయోగ్యముగానుండును. ఇట్టిస్థితియందు కండ్లనుండినీరుతీయు టకు యోగ్యముగానున్నచో దీనిని కనిపెట్టునుపాయముగలదు. అనగా తెల్లగా, పావుగా, చిక్కగా, పలచగాయుండకూడదు. మరియు రోగికి తుమ్ముకలిగినచో కంటినుండి ఒక ప్రకాశబైటకివచ్చినటుల తోచినయె డల యిట్టిసమయమునందు రోగికండ్లు రుద్దుకొనినయెడల నీటిభాగము చెదరినటుల కనుపించును. ఇటువంటి చిహ్నములు కనుపించినయెడల నీరుతీయుటకు ఆనేత్రము అయోగ్యముగా నుండునని గ్రహించవలెను. వీటిభేదములు అనేకములుగలవు. ప్రత్యేకముగా రంగుచిక్కదనము యే విధముగా యుండునో నిధానించి దాని అనుసారముగా దీనిపేరుపెట్ట బడినది. ఇందులో (1) గమామి యిది వక రతూబతు అనగా నీరు వల్లనిమేఘముతో సమానమగు రంగు కలిగియుండును. ఇందు చలనము మాత్రముండదు.

(2) జైబకి. ఇదియొక గుండ్రని రతూబతు అనగా చెమ్మ. ఇది పాదరసముతో సమానముగా నుండును. నిది అటునిటు తిరుగుచుండును.

(3) జస్సి. ఇది సున్నపుముక్కవలె కనుపించుచుండును. మరి యు కంటిరంధ్రమునందు లాగుట యుత్పన్నముచేయుచున్నది. యిది అటంకము చేయనేరదు. అట్టిపరి కన్నుమూసి తెరచినచో ఆనీరునందు యేవిధమగు భేదము కనుపించకుండును.

(4) అస్మాంగునీ యిది ఆకాశపురంగువలె నుండును. యీనీరు బహుదాకదలకుండును. దీని కారణమువలన తన తేజస్సు ఉష్ణమువలన రతూబత్తు బైజియాతు చెరచుచున్నది. యీవ్యాధి ఆరోగ్యమునొందుట మిక్కిలి కష్టము. కాబట్టి శరహాఅస్బాబ అను గ్రంథకర్త నీరుతీయుట వలన నేత్రము ఆరోగ్యము నొందదని వచించిరి.

(5) ముస్తశిరకీ అనగా వలచనిదియు అల్లుకొనబడినదియు నగు రతూబతు సంపూర్ణము నొందకుండును. మరియు, నిది దృఢముగా కనుపించును. నిది విశేషముచిక్కగానుండదు. యిట్టిస్థితియందు రోగికి స్వల్పముగా కనుపించగలదు. ఒకప్పుడు నేత్రమునందు చూచునట్టి శక్తి దుర్బలము నొందుచుండును. ఒకప్పుడు దుర్బలము కలుగకుండును గాని నిది ఎల్లప్పుడు సమానముయుండనేరదు. నేత్రము బాగుచేయుట నీరు తీయుటకు శక్యముకాకుండును.

(6) జజాజీ, అనగా కరిగించిన గాజుతో సమానమగు రంగుకలిగి యుండును.

(7) అబీయజ్ వదీ అనగా తెల్లగను వడగల్లువలె యుండును.

(8) అజఖరు అనగా ఆకువచ్చని రంగుగలిగి యుండునీరు.

(9) అసర్ అనగా పసపురంగునీరు.

(10) అహమరెజహారి మెరసిగను బంగారువంటి రంగు గలిగి యుండును.

(11) అరజల్ అనగా పిల్లికండ్లతో సమానమగు రంగు.

(12) అస్వజ్ అనగా నల్లనిరంగు నేత్రమును చేయుచుటకు యోగ్యముగా నుండును.

మరియు ఈవ్యాధిగలరోగి లఘువగు శ్రేష్టభోజనములు స్వల్పముగా భుజించవలెను. స్వల్పరక్తము కలిగించునట్టి పన్నీరు, చిరిశెనగలు ఇత్యాది వస్తువులున్నూ, యిటువంటి స్వభావికమగు యితరవస్తువులు వర్జించవలెను. ముఖ్యముగా రాత్రి భోజనము, స్త్రీసంగమము,

మద్యపానమూ, స్నానము మొదలగునవి వదలివేయవలెను. మరియు నీరుల్లి, వెల్లుల్లి, తులసి, చేపలు మొదలగునవి వర్జించవలెను. ముఖ్యముగా చేపలు వర్జించవలెను. గనుక నేత్రములయందు నీరు స్రవించుట కండ్లయందు నీరునూ చికాకు పరచుటకు చేపలు సహాయ్యమగును గనుకనే కండ్లవెంట విశేషముగా నీరు స్రవించుటకు వైద్యులు రోగికి చేపలు తినిపించుదురు మరియు, యీవ్యాధియందు కపాలభేదముల త్రిప్ అనగా క్రోషణము తీసివేయుట్టి సురుమావలన పృథుపరచవలెను. మరియు, శియాపేమిరాగాల్ అనే అన్యపదార్థములగు సురుమాలును నేత్రములలో వేయుచుండవలెను. యిటువంటి సదుపాయములు యీరోగములలో లాభదాయకమగును. కాబట్టి ముస్తశెరకిలా అనగా యిది ఒకపంచవి రతూబతు (నీరు) దీని ఆరోగ్యము యీ వుపాయము కు విరుద్ధముగానున్నది. గాన యిచనై అల్లుకొనిన రతూబతుయందు వుచితమగుచు అనగా చిక్కదనము కలిగించునట్టి ఔషధములను యివ్వవలెను. చేపలను తినిపించవలెను ఇట్లు తినుటవలన నీరు చిక్కబడి సమానమగును. వృక్తరోగములలో కొన్ని వెంటనే ఆరోగ్యము నొందును. కొన్ని ఆలస్యముమీద నీరు తీయుటకు యోగ్యముగా నుండును. అనగా నేత్రములు కనుపించకుండునప్పుడు చెప్పనవసరము లేదు. యిందు గొప్ప పత్యాచారణమునందు రోగికి సంతోషము చేయుట సహజమగును. మరియు, యీవిధమగు కండ్లు యెప్పుడు ఆరోగ్యమగునని యోగ్యతకాజాలవు. అనగా పరీక్షకులకు తెలియబడుచున్నది మరియు, నేత్రములనుండి నీరు తీయుటకు నుపాయము కలదు అనగా ముందు నిదానించి నేత్రములు పరీక్షించవలెను. అనగా యేమీ ఆటంకము కలిగించు యితర అంశములు అనగా తలనొప్పి జలుబు దగ్గు యివితప్ప యీకార్యమునందు ఆటంకము కలిగించు యితర కారణములున్న యెడల ముందుగా వానికి చికిత్సలను చేయవలెను. అనగా శరీరమునకున్ను, మెదడునకున్ను, పరిశుభ్రత పవిత్రత

కలుగుటకై శిరాచ్ఛేదనము విరోచనము వాంతి మొదలగునవి వెడలించుట ముందుగా జరుగవలెను. నేత్రములనుండి నీరు తీయునట్టి దినములందు మబ్బులు, చల్లని గాలి వీచుట, లేక ఉత్తరపుగాలి వీచుట మొదలగునవి లేనట్టి సమయమునందు రోగిని వెలుగుగల గదిలో వుష్ణగాగల మెత్తని పరుపుపైని మెత్తని తలగడయుంచి రోగిని కూర్చుండబెట్టి రెండు మోకాళ్ళను రొమ్మునకు ఆనించుకొని తన రెండు చేతులు పిక్కలలో చేర్చి కూర్చుండునట్లు రోగిని ఆజ్ఞాపించవలెను. అనగా వైద్యునివైపు తిరిగి ముడుచుకొని కూర్చుండునట్లు యేర్పాటుచేసి వైద్యుడు రోగి సమ్ముఖముగా గద్దెపై కూర్చుండవలెను. అనగా రోగికంటె వైద్యుడు వున్నతముగా యుండవలెను మరియు, నొక కన్ను నిరోగిగా ఆరోగ్యముగానుండినచో ఆ కంటిపైని దృఢముగా కట్టుకట్టవలెను. యిటుల కట్టు కట్టుటవలన రెండులాభములు గలవు (1) రోగివలన (2) వైద్యునివలన. రోగివలన నిరోగముగాకన్ను బంధించనిచో కన్ను ఆటునిటు తిరుగుచుండును రెండవకన్నును కూడా తిప్పనారంభించును. కన్ను కదలుచుండిన నీరు తీయుటకు కష్టమగును రెండవది వైద్యుని లాభమనగా నీరు తీసిన వెనుక అచ్చటనుండు వస్తువుల చిహ్నములు అడిగిన వాటిని రోగి చూపించును గనుక సందేహముండనేరదు. రెండవకంటితో చూచుచుండును. నేత్రములనుండి నీరు తీయునప్పుడు రోగి యుక్తరీతిగా కూర్చుండిన యెడల ఒకమనుష్యుని రోగి వెనుక కూర్చుండబెట్టి రోగితలను పట్టుకొని యుండునట్టుల చెప్పవలెను.

తదుపరి వైద్యుడు తనచేతితో రోగికంటిపై రెప్పను యెత్తి కన్నుయావత్తు తెరచి రోగి వైద్యునివైపు చూచుచు కంటియావత్తు పెద్దగోలికి అనగా ముక్కువైపునుండు గోలికియందు త్రిప్పియుంచవలెను. ఈపెద్దగోలికికి అరబ్బీభాషయందు మాల్ అక్బర్ అందురు. మరియు వైద్యుడు తదుపరి సళాకువలన కంటిలోనుండి యెచ్చటనుంచి యేభాగమునుండి నీరుతీయవలెనో గమనించి సళాకుతో రంధ్రము చే

వచ్చినచో నళాకువెంట బూటున్ వేయునంచవలెను. యిట్లు
చేయుటకు కండ్లనుండి నీరు తీయుంచుకొని బాగుపడిన వారి సమాచార
ములను వినిపించుచు సమాచారములతో రోగిని సంతోషపరచుచు
ధైర్యముగను చెప్పుచుండవలెను. దీనివలన మనస్సును దృఢపరచవలెను.
యెందుకనగా రోగికి అపనమ్మకమునకు వలన వమనము పుట్టుచుండును.
ఈకాంక్షణమువలన నేత్రములనుండి ఏరు తీయు సమయమునందు అనగా
ఆదినము రోగికి ఆహారమేమియు యివ్వరాదు, మరియు శరీరకంపము
కలిగి తుమ్ము వడకాండ్లు భినమోసిల గోంచెము అంగూరమద్యము గాని
రిబాస్ మద్యము గాని రిబాస్ అనగా ఒకగడ్డిజాతి దీనిపూలు యెర్రగా నుండు
ను. అథవా దానిమ్మమద్యము గాని యివ్వవలెను దీనివలన కడుపులో
కెళ్లుట తటస్థించదు మరియు కంటినొప్పి తగ్గుటకై దూదివలె
నుండు సాలెగూడు యొక్క కంటిపై నమిలి నోటితో నూదవలెను. అన
గా రోగికన్నుపై నోరుయుంచి గట్టిగానూదవలెను. అనగా ఆవిరి పట్టిం
చుట యనిభావము. దీనివలన నేత్రబాధ తగ్గి స్థాయినొందును. కంటి
నొప్పి లఘుత్వమునొందును. రోగికి కడుపులో దేవినటులుండుట తగ్గి
పోయినచో నళాకు నెమ్మదిగా త్రిప్పుచుండవలెను. దీనినుండి కంటి
కొండపొర వెనుకనుండి అనగా కర్నియాపొర కనుపించును నళాకు
కొన నీళ్ళపై నుంచవలెను. నళాకును నెమ్మదిగా వెనుకకు త్రిప్పుచుకొం
చెము పైకెత్తవలెను. మరియు నీళ్ళను నళాకు చివరతో అణచి నెమ్మదిగా
నుంచవలెను యిందువలన నీరు నిలిచిపోవును. మరియు ఇపబియా అన
గా కంటిమాడోపొరయొక్క రంధ్రము దీనిని లోపటికి లాగుకొనును.
తరువాత నళాకును కొంతసేపటివరకు యిట్లుంచి పిమ్మట కంటిలో నీరు
యుండు స్థలమునందు పట్టుకొనుటకు ధైర్యముకలిగినయెడల నళాకు
చివరను నేత్రరంధ్రమునుండి తప్పించి తీసివేయవలెను. దీనినుండి ఆనీరు
తిరిగివచ్చినయెడల అణచియుంచవలెను. పిమ్మట నళాకును కంటిలో
నుండి తీసివేయవలెను. మరియు నీరు తిరిగివచ్చినచో నళాకు త్రిగివే

యుటవలన కంటినొప్పి విశేషమగును గాన నీరుగల స్థలమును జాగ్రు త్తతో పట్టుకొని మనస్సుదృఢపరచుకొని నీరు యెంతవత్తు క్రిందికి దిగు వరకు సళాకుతీయకూడదు. బహుశా క్రియా అనగా కంటి మూడవ పొరభాగము స్నిగ్ధమైయుండును గాన నీళ్ళు మిక్కిలి కష్టముతో లాగుచుండును. మరియు నీరు మిక్కిలి చిక్కగాగాని మిక్కిలి పలచగాని వుండును. ఈకారణమువలన దీనిని అణచుట అప్రయోజనమగుచున్నది. బహుశా ఒకవారములోపల ఆ రోయి గిన్నెనుండి తిరిగి వచ్చుటకుభయముండదు. బహుశా విశేషకష్టముతో అణగినయెడల తిరిగి వచ్చునని గ్రహించవలెను. ఇట్టిస్వభావికములగల నీరును సళాకువేసి తీయునప్పుడు యెంతవత్తు నీరు రాక కొంతి కంటియందు శేషించియుండును. కాబట్టి వైద్యవరులు వచించుచున్నారు. అనగా సళాకు కంటిలోవేసినప్పుడు మిక్కిలి దుఃఖము కష్టము సంభవించినయెడల సళాకును బైటికి తియ్యాక కంటిగోలికిపైవు గట్టిగా వత్తవలెను.

ఇట్లుచేయుటవలన యిందుండి కొంతరక్తము వెడలును. నీరును ఆరక్తముతో అణచియుంచవలెను. అప్పుడప్పుడు కొంచెమురక్తమువచ్చినను భయపడనవసరములేదు. అనగా నీరు కఠినముగ యుండుటవలన ఆ నీరు రక్తముతో త్రోసివేయబడును. రక్తముయొక్కశక్తి నేత్రముయొక్క గుల్లనరములయందునీరును నష్టపరచుచున్నది మరియు నీళ్ళను రక్తముతో అణచుటయందు మరియొక లాభముకలదు. అనగా రక్తముతో చేర్చబడుండిననీరు అచ్చటనే నిలిచియుండును. ఇందువలన తుర్ఫావ్యాధి ఉత్పన్నమగుచున్నది. యీవ్యాధి బహుదా కఠినముతో ఆరోగ్యమొందును. కాబట్టి నీరు అణగునసమయమున రోగి దగ్గుట, చీదుట మొదలగునవి చేయంజనదు. యిటుల చేయుటవలన ముఖభాగము యెంతవత్తు కదలి కంటినీరు లోభాగమునకు జారిపోవును. మరియు నీరు అణగినవెనుక సళాకును నెమ్మదిగాత్రిప్పి బైటికితీసి కోడిగ్రుడ్డు తెల్లసొన, గులాబినూనె కలిపి నేత్రములపై లేపనము చేయవలెను. జీలకర్రనమలి, బట్టలోవేసి

ఆనిర్మలమగు నీరును నేత్రములో పిండవలెను. తరువాత రెండుకండ్ల బట్టతో కట్టుకట్టవలెను. మరియు బైటికి గోలికినుండి రక్తము గనుపించినయెడల ప్రవ్వనూరి అందుపై చల్లి కట్టుకట్టవలెను. మరియు రోగి చీకటిగా నుండుగదిలో వెల్లికలగా పరుండునటుల ఆజ్ఞాపించవలెను. వత్తిగిలి యెంతమాత్రము పరుండకూడదు. అటు ఇటు తిరుగకూడదు. వకవేళ అవశ్యమై తిరిగినచో మిక్కిలి సాంకేతము కలుగును. దగ్గు, తుమ్ము రాకుండా రోగిని కాపాడవలెను. తుమ్మువచ్చునుండిన ముక్కు చేతితో నలుపవలెను. రోగికి దగ్గువచ్చుచుండిన బాదంనూనెతో విరోచనఔషధమును కలిపినూరి యివ్వవలెను. మరియు నేత్రములను స్తిథిలముచేయునట్టి వస్తువులు తుమ్మురాకుండునటుల ముక్కుపుటములపై లేపనము చేయవలెను. దీనివలన తలనొప్పి కలుగకుండునటుల కాపాడును. మరియు లఘుభోజనము యివ్వవలెను. యోగ్యముగా నుండువస్తువులను పానము చేయవలెను. భుజించుటకు అయోగ్యమగు వస్తువులను వర్జించవలెను. అనగా నమలుటవలన నీరును కదలించును. కాబట్టి నమలునట్టి వస్తువులు మానివేయవలెనని గ్రహించవలెను. రెండవదినము కట్టువిప్పవలసి వచ్చినచో నిమ్మళముగా నేత్రములపైనుండు కట్టువిప్పివేసి పన్నీరులో దూదెముంచి నేత్రమునకు దెబ్బతగులకుండునటుల నిమ్మళముగా కడుగవలెను గాని బలవంతముగా చేతితో తెరువకూడదు. పిమ్మట కోడిగ్రుడ్డునందుగల తెల్లసొనయందు దూదిముంచి నేత్రములపైవేసి బట్టతో కట్టవలెను. మరియు మూడవదినము కట్టువిప్పకూడదు. నాలుగవరోజు గులాబిపూలు నీళ్ళలోవేసి కషాయముకాచి ఆకషాయముతో కన్ను అవశ్యముగా కడుగుచుండవలెను. మరియు, రోగివీపువైపు దిండునుంచి తిన్నగా కూర్చుండబెట్టవలెను. రోగివద్ద తలగడలుంచుటలో శరీరము యావత్తు ఆనునటుల యుంచవలెను. ఆతలగడపైని రోగికి సుఖముగా నుండునటుల దిండుంచవలెనని భావము. మరియు నల్లనిబట్ట రోగి ముఖమునకు అడ్డముగా కట్టవలెను. మరియు శౌతనజ్ మగసూల్ అనగా చిరి

కొంగలవలెనుండు ఒక రాయిగాని, నల్లసురుమాగాని నేత్రములలో వేయవలెను. రెండుమూడు దినముల తరువాత నీళ్ళతో కాచవలసివచ్చిన యెడల రోగికంటియందు ఉష్ణము కలిగినదా లేదా అని నిదానించి చూచి వాపు లేకుండిన సలాకుతో నీళ్ళను దానిస్థానమునందు వేయవలెను అనగా కొంతకాలములో మల్తిహిమాపొర అనగా నేత్రముయొక్క ప్రథమపొరయందు లేనియెడల రణము మాననియెడల యీరోగముగల నేత్రమును బాగుచేయుటయందు అథవా నీరునిండిన స్థలమునందు విశేష మాంసము పెరిగినచో దానిని పౌనెసఖవా అను కత్తెరతీసికొని యెత్తవలెను. యిట్లు మాంసమును తీయుటవలన అపాయము కలుగనేరదు. యీసలాకును ఎగ్రనిరాగితో త్రికోణాకారముగా పదునుగా చేయించవలెను. మరియు నేత్రరంధ్రమునందు నీరు అణచుటకు ఇనబియాపొరను సలాకుతో అణచినయెడల దానిరంధ్రము లోభాగమునకు అణగును. ఈ కారణమువలన రంధ్రములు సంభవించి అందునీరు నిలిచియుండును. కాబట్టి సలాకును యెత్తివేసినయెడల కంటి మూడవపొర తన నిజదశయందు మారును దానిఛిద్రము ఆరోగ్యముగా నుండును. యీనీరును వైద్యుడు నేత్రమునుండి బైటికి తీసివేయుచున్నాడు. ఆవిధానమును చెప్పుచున్నాను. అనగా రెండవపొర క్రిందచీల్చి నీరుతీయుదురు. తరువాత యిందువిషయమై యేర్పరచబడిన నళాకుతో ఆనీళ్ళను బైటికి లాగుకొందురుగాని యిటుల తీయుటవలన గొప్ప భయముగలదు. నీళ్లుదిక్కుబడినచో రతూబతెబైజియా అనగా నేత్రసంబంధమగు నీరుకూడా బైటికి వెడలిపోవును. కాబట్టి దీనిని సావధానముతో తీయుటకు నేను విధానమును యిందు ప్రకటించితిని గాన యిందుగల అంశములను గ్రహించి ధైర్యముసాహసముగల వైద్యుడు యీరోగముగల నేత్రమును తనబుద్ధి కుశలతతో నీరును బైటికి తీయవలెను.

—హబ్బుదహారా అనగా గాత్రి వుపయోగించు మాత్రలు—

ముసాంబరము 35 మాషములు, తెగడ 24½ మాషములు,

రూమిమస్తకి, గులాబిపూలు యివి ప్రత్యేకము 8¼ మాషములు, కుంకుమపువ్వు 1¼ మాషములు, కరక్కాయ బెరడు 17 మాషములు, సకమోనియా 12¼ మాషములు యీ యేడువస్తువులున్ను రోగబలము రీతువనుసారముగా చేర్చి నూరి మాత్రలుచేసి వుపయోగించవలెను. రోగబలము నెరింగి తూకెన మ్యాచత అధికతను హెచ్చుచేయుట తగ్గించుటయందు బుద్ధిమంతుడు గ్రహించవలెను. మలమును వెడలించునట్టి ఔషధములను అనేకస్థానములయందు వివరించి యున్నాను. మరియు, యీపుస్తక అంతమునందు ప్రత్యేకస్థలమునందు ప్రత్యేకసాంకేతముగా చెప్పబడియె కాబట్టి యీ పుస్తక అంతమునందు వెదకి చూడవలెను.

—కంతరియూన్ కషాయవిధి—

చిన్నకంతరియూన్ అనగా కంతరియూన్ దకిక్, తెల్లతెగడ బెరడు యివి ప్రత్యేకము 10½ మాషములు, బిస్ఫాయిజ్ 24½ మాషములు, గింజతీసిన ద్రాక్షపండ్లు 70 మాషములు యీ నాలుగు వస్తువులు వకటిగాచేర్చి 525 మాషముల నీళ్ళలోవేసి 175 మాషములు మిగులు నటుల కషాయముకాచి వడగట్టి యారజ్ మాత్ర యిచ్చి ఆమాత్రకు అనుపానముగా ఈకషాయము యివ్వవలెను. లేక మాత్రను కషాయములో కలిపి యివ్వవలెను.

—నజులావ్యాధియందు యుపయుక్తమగు మాజూన్—

వస, యింగువ, శొంఠి, సోపు, యీ నాలుగు వస్తువులు సమానభాగముగా తూచుకొని దంచి చూర్ణించి వస్త్రగాలితము నొనరించి మంచి తేనె చేర్చి నూరి మాత్రలు చేయవలెను. ప్రతిదినము ప్రాతఃకాలమునందు 4½ మాషములు సేవించవలెను.

మరియు, దవనము, మరువము, చంబేలి, నల్లజీలకర్ర, యెండిన ధనియాలు యిట్టి స్వాభావికముగల వస్తువుల తైలములను తలపై లేపనము చేయవలెను. యెన్ని ఔషధములు వర్ణించబడినవో ఇవి యీవ్యాధి రోగారంభమునందు ఉచితముగును. మరియు, రోగియొక్క ప్రకృతి

యుష్ణము, జలుబు, చెవ్పు, శుష్క త్వము మొదలగు గాని కలుగ ముచేయుట, మలమును తీసి వేయుటకు ముందు నేత్రములలో ఔషధ ము నుపయోగించుట వర్జించవలెను. యెందుకనగా మలమును వెడలించనిది ఆమాశయము ఆరోగ్యమునొందజాలదు కాబట్టి నేత్రములలో ఔషధమును ప్రయోగించుటవలన రోగము విశేషమగును. మరియు, నీరు ల్లిరసము తేనె కలిపికండ్లలో వేయుటవలన నేత్రములు పరిశుభ్రపడును. మరియు, చల్లని జలపానము చేయుట, యింగువ తినుట నేతితో యింగువఅరుగదీసి నేత్రములలో వేయుట లాభదాయకము. మరియు, హకీం శేఖబూ అలిసీనాగారు అబాబిల్ అనగా ఒకవిధముగుపక్షియొక్క తలను కాల్చి మసిచేసి తేనెలో కలిపి నజులావ్యాధి ఆరంభదశయందు కండ్లలోవేయవలెను. యిది అనుభవనీయమైనది చాలాప్రయోజనకారి యని వచించిరి.



# ప్రకాశవాహిని నాళమునందు బంధనము కలుగుటకు లక్షణములు.



ఈవ్యాధికారణములు రెండువిధములుగా నుండును. దీనిలో కూడా కంటియందు నీరుదిగి రానివ్వకుండుట. 2 రెండవియందు నేత్రముల లో నీరు దిగివచ్చినవెంటనే బంధనమేర్పడుట బంధనము నజులావ్యాధి వలన యేర్పడనియెడల దీని చిహ్నములు వేరుగా నుండును గాని నజులావ్యాధి లక్షణము కలిగియుండవు. కండ్లుమాత్రము ఆరోగ్యముగా యుండునుగాని దృష్టిమాత్రము సంపూర్ణముగా నశించిపోవును. అనగా నేత్రదృష్టినగ్గుట బంధనమేర్పడుటవలన కలుగుచున్నది. నేత్రసంబంధ మగు ప్రకాశవాహినినాళములయొక్క బంధనము వాపు కలిగించునట్టి వ్యాధులయందు భారము, నొప్పి, కలిగించుచున్నది. మరియు బంధన

క్క ప్రకాశవాహిని నాళము బంధింపబడినదని గ్రహించవలెను. మరియు విశేషకాలము తరువాత కంటియందు అనగా నేత్రమునుండి నీరు తీయబడి యింతకాలము వ్యవధియయిన రోగికి ఔషధములతో శుభ్రత నొందింపగలిగినచో ప్రకాశవాహిని నాళముయొక్క బంధనము అనగా పిటిక విడదీయుటకు ఉపాయము చేయవలెను. యిందువలన నేత్రదృష్టి స్వస్థతనొందును.

—ప్రకాశవాహిని పిటికె యొక్క చికిత్స—

రోగారంభమునందు కోకాయ మాత్రలుగాని యారజ్ఫైకరా మాత్రలుగాని లేక యిట్టి స్వాభావికముగల ఇతర ఔషధములుగాని మలమును వెడలించుటకై వుపయోగించవలెను నేత్రరోగములయందు చేయవలసిన శిరాఛేదనముచేసి రక్తము వెడలించవలెను. మరియు, కణతలపై జలగలను బట్టించి రక్తమును తీసివేయవలెను. మలమును పాదములయందు చేర్చవలెను.

## ఝులక్ అనగా పిల్లికండ్లు కలుగుటకు లక్షణములు

మనుష్యుని యొక్క కంటిపాప పిల్లికన్నుతో సదృశముగా తెల్లగానుండును. దీనిని కంజీఅందురు. యిది రెండు విధములుగానుండును. (1) జన్మనుండియు, (2) జన్మించిన తదుపరియు కలుగుచున్నది. మరి పిల్లికన్ను కలుగుటకు యేడుప్రధానకారణము గలవు (1) చూచునట్టి శక్తియొక్క విశేషత్వమువలన (2) స్వచ్ఛత ప్రకాశతవలన (3) రతూబతేజాలైదియా అనగా నేత్రసంబంధమగు నీరు విశేషమగుటవలన (4) రతూబతేజాలైదియా యున్నతముగా పెరుగుటవలన (5) రతూబతేజాలైదియాయొక్క న్యూనతవలన (6) రతూబతేజాలైదియా స్వచ్ఛతవలన (7) ఇంబియాపొర నలుపు తగ్గుటవలన కలుగుచున్నది.

మరియు, జన్మించిన తరువాత పిల్లికండ్లు కలుగుటకు మూడు కారణములుగలవు. (1) రతూబతేజాలైదియా వున్నతమగుటవలన

అనగా రతూబతెజులైదియా ఉష్ణమగుటకు కారణమేనగా రతూబతె జులైదియా పెరుగుటయు లేక నంబిసూ మరియు, మసిమియాపొర లు వాచుట అనగా వుబ్బుటవలన అప్పుడు రతూబతు జుజాజియా విశాలమైగాని లేక వుక్తపొరలలో వావు ఉత్పన్నమైగాని రతూబత్ జులైదియా అణగిపోవుచున్నది మరియు, బైటివైపుకు వుబుకుచున్నది. యీ కారణములవలన కంటి గుడ్డుయొక్కరంగు పిల్లికన్నురంగువలె కనుపించుచున్నది మరియు, రతూబతెజులైదియా బైటివైపుకు నుబుకు టవలన యిట్లు సంభవించుచున్నది మరియు, దీనిలక్షణములు చికిత్స కారణములు నేత్రసంబంధమగు పొరలయొక్క రోగములయందు వర్ణించ బడియె. అవశ్యకతాను సారముగా నేత్రపొరల రోగములలో చూచి గ్రహించవలెను మరియు, పిల్లికన్ను కలుగుటకు రతూబతెజులైదియా ఉష్ణతమగునట్టి కారణములవలన కలుగుచున్నది. యీరతూబతు మెత్తగుటకు కారణము ప్రకృతియందు శీతప్రకోపముండినచో చేదు బాదంనూనె, ఆముదము, గార్ నూనె, అనగా యిది బహుగొప్ప వృక్ష మునుండి వచ్చునట్టి తైలముయొక్క పేరు యీ తైలములను ముక్కు లో వేయవలెను. మరియు, గుణకరమగు ఔషధములు అనగా శాతసజ్, పిప్పళ్ళు, కరక్కాయలు యీవస్తువులనునీళ్ళతో అరుగదీసినేత్రములలో వేయవలెను.

మరియు వుష్ణప్రకృతి అయినచో చల్లనిఔషధములు అనగా తుమ్మజిగురు, మరియు చల్లని తైలములను నశ్యముచేయవలెను. నల్ల నురుమా తవాశీరినేత్రములలో వేయవలెను. యెందుకనగా నిది చె మ్మను ఆర్చివేయును, మరియు గుల్ రోగన్ నశ్యముచేయవలెను.

మరియు రోగకారణము జలుబువలనగాని వుష్ణమువలనగాని కలిగినను వుపయోగించవచ్చును.

(2) పిల్లికన్ను కలుగుటకులక్షణములు

(2) నేత్రసంబంధమగు మూడవపొరయొక్క ప్రకృతి చిక్కని రతూబత్ వలన మారిపోవును. యీకారణమువలన దీనినలువురంగు

యాపత్తు నశించును. ఈవిషయమునందు బాలురదో గ్రహించబడు చున్నది. కాబట్టి అనేకపిల్లలు యౌవనులగుటకు ముందు రెతూబతునుయొక్క విశేషత్వము అవశ్యముగుటవలన పిల్లికన్నువలె అగుచున్నవి. ఈ సమయము తరుణ అవస్థయందు కలుగుచున్నది. మరియు వృద్ధము ప్రబలమగుచున్నది. అట్టిస్థితియందు నేత్రముయొక్క రక్త రతూబతులనుండి కొద్దిభాగము స్వయముగా పుడబడుచున్నది. శేషించినది మందిభోజనమువలన కంటిగ్రుడ్డుయొక్క రంగును నల్లగా మార్చివేయును. మరియు ఆరోగ్యము నాశనము గ యుంచును. షేక్ వరుగారు తన వైద్యగ్రంధమునందు వర్ణించినదేమనగా పిల్లికన్ను కలిగించునట్టి వ్యాధి బకనుల్‌యె అనగా కంటిలో తెల్లగా ఉప్పువలె కలుగుచుండును. ఈవ్యాధులలో కొన్ని సజులా కారణమువలన కలుగుచున్నవి. దృష్టి భంగమగుట సజులానీరు తీయుటవలన యీవ్యాధికూడా నశించుచున్నది గాన యిది సజలావ్యాధి భేదమని గ్రహించవలెను. మరియు నేత్రములయెదుట దోమలు మొదలగునవి యెగురుచుండునటుల కనుపించుచుండును.

## పిల్లికన్నుకలుగుటకు చికిత్స

పుష్టికారకా అయారజాత్ అను ఔషధములతో మలమును వెడలించవలెను. అనగా అయారజ్‌జాలినూస్, అయారజ్‌లుకాజియా మరియు యిటువంటి స్వభావికముగల ఔషధములను వుపయోగించి మలమును వెడలించవలెను. గండూషములు చేయించవలెను. గండూషములు చేయుటవలన మలమునుండి మెదడును స్వస్థపరచును. మరియు తుమ్మును కలిగించుటకై వృష్ణముగు ఔషధములతో నశ్యము చేయించవలెను. ప్రకృతినిస్థిరపరచుటకై వృష్ణముగు మాజూంలు యివ్వవలెను. మరియు కుంకుమపువ్వును మెత్తగానూరి నేత్రములలో వేయవలెను. కుంకుమపువ్వు తైలము కంటిగ్రుడ్డును నలుపుచేయుట యందు ప్రధానమైనదని గ్రహించవలెను. ఒకానొక కారణమువలన పిల్లికన్ను

కలిగినను వచ్చిచేదుపుచ్చకాయను వస్తాకునానవేసి కంటిలో లేపనము చేయుటవలన కుంకుమపుష్పమువలె గుణదాయకమగును. నిది పిల్లికన్నును నలుపుచేయునని వైద్యులు వచించిరి.

(3) పిల్లి కన్ను లక్షణములు

(3) పక్వమునొందిన రతూబత్ నుండి పావయందు రంగుకలుగుచున్నది. అనగా కరిగినకారణము వలన పిల్లికన్నువలె కనుపించుచున్నది తరువాత ఘాస్ ఫూస్ యొక్క స్వరూపమును కనపరచుచున్నది. అట్టి స్థితియందు దీనియొక్క రతూబత్ అనగా నీరు నష్టమగుచున్నది. అనగా దీనిలో శుష్కత్వము చేరుచుండినచో అందు స్వచ్ఛత హెచ్చుచున్నది. యీకారణమువలన వృద్ధు నేత్రములు పిల్లికండ్లుగలవానివలె శుష్కత్వరోగమునందు చేరుచున్నవి. నిజరతూబత్ నష్టము నొందుట వలన కాంజీరోగము అనగా పిల్లికండ్లు కలుగుచున్నవి. ఈకారణము వలన యిట్టిరోగము కిన్నియా అనగా నేత్రసంబంధమగు రెండవపొర మాగుచున్నది. మరియు నేత్రదృష్టిని బొత్తిగా సళింపజేయుచున్నది. వైద్యవరులు దీనినికూడా నజులాప్రకారాంతమునందు లెక్కించుచున్నారు. యద్యాపి యీరోగము ప్రారంభమునందు శుష్కత్వము వలన వుత్పన్నమగుచున్నది. యెటులననగా బిగించుట వుబుకుటవలన ఇస్తస్కా, తబలి అనగా జలబంధమునందు భావించుచున్నారు. మరియు కడుపుబ్బుటయందు శీఘ్రించుటకు యేమియూ సాధ్యపడదు. అని భావము. మరియు యీపిల్లికండ్లుగలవ్యాధియందు నజులావలన కలిగిన పిల్లికండ్లయందు భేదముకలదు. అనగా యిందు నేత్రముముందు దోమలు మొదలగు చిన్నచిన్న పురుగులు యెగురుచున్నట్లు కనుపించకుండును. మరియు కంటిలోనుండినిరుతీయుట బాగుచేయుటకూడా యిందు యేమి ప్రయోజనములేదు. మరియును నేత్రము చిక్కుటకూడా శుష్కత్వముయొక్క కారణమువలన కలుగుచున్నది. (చికిత్స) యెట్లు వీలుకలుగునో అటుల తేమ్మను కలిగించుటకు పరిశ్రమచేయవలెను.

# దృష్టి దుర్బలము నొందునట్టి లక్షణములు.

దృష్టియందు వుపద్రవము సంభవించును. అనగా ప్రత్యేకమగు వస్తువుయెటులనున్నదో అట్టినిజస్వరూపముతో కనుపించకుండును. ఇతర మునుండి దృష్టిపని చేయజాలకుండును. బాగుగా నిధానించిచూచినచో ప్రత్యేకనమీపమునందుండు వస్తువు చక్కగా కనుపించుచుండునుగాని చిన్నవస్తువు పెద్దదిగను పెద్దవస్తువు చిన్నదిగను ఆకుపచ్చరంగుగల వస్తువు నల్లగను నల్లనివస్తువు ఆకుపచ్చగను చక్కనివస్తువు వంకరగను వంకరగానుండువస్తువు చక్కగను కనుపించుచుండును. యీమొదలగు యీ వత్తు కారణములు నేత్రదృష్టి దుర్బలము నొందుటవలన కలుగునని తాత్పర్యము. మరియు నేత్రదృష్టి దుర్బలము నొందుటకు పన్నెండు కారణములు గలవు.

మొదటి కారణము.

(1) చల్లని చెమ్మగల దుష్టప్రకృతి దోషయుక్త కంటియొక్క దరిశనశక్తిని దోషకారణమువలన చిక్కపరచును. పిమ్మట ప్రాణవాయువుయొక్క ప్రకృతిని భంగపరచుటవలన నేత్రసంబంధమగు కార్యములయందు మార్పునొందించునట్టి కారణములవలన నేత్రదృష్టియందు దుర్బలము ఉత్పన్నమగుచున్నది. దీని చిహ్నములు అనగా నేత్రముల నుండి చిక్కనినీరు కొద్దికొద్దిగా స్రవించనారంభించుట నేత్రకోలకుల యందు కొద్దిగా మలమువచ్చి నిలుచుట, ఆరోగ్యదశకంటె యిందు నేత్రములు పెద్దవిగా కనుపించుట, నిద్రించినతదుపరి ముఖ్యముగా అజీర్ణదశయందును, ఆమాశయమునందు భోజనపదార్థములు చెడిపోవు సమయమునందు నేత్రదృష్టియొక్క దుర్బలత్వము హెచ్చుచుండుట, యీమొదలగు కారణములవలన యిందు దుర్బలముయొక్క కారణము వలన ప్రాణవాయువును చిక్కపరచును. మరియు దృష్టియొక్క కార్యములయందు మార్పును కలిగించును, కాబట్టి యేవస్తువును చూచినను

దానిపూర్వదశ తెలియకుండును. మరియు కొం[illegible] మును డి [illegible]గ్నిగా పొరయందున్న, రతూబతెబైజియాయందు చిక్కదనము ప్రత్యక్షమగుచుండును. చిక్కదనము కలుగుటవలన కంటిపాప కనుపించజాలదు. చిక్కదనము కేవలము నేత్రఛిద్రము ముందుయున్నచో నలువు, రతూబత్ బైజియాయందు యున్నదని గ్రహించవలెను. మరియు నేత్రసంబంధమగు రెండవపొర యావత్తుభాగములయందు కనుపించినచో కంటి రెండవపొర యందున్న, రతూబతెబైజియా యందుకూడా యున్నదని గ్రహించవలెను.

నేత్రదృష్టి దుర్బల చికిత్స

మొదటునంశుందుమలము వెడలించుటకై విరోచనఔషధములను యివ్వవలెను. మరియు, వృధితమగు వస్తువుల కషాయములతో గండూషములు నొగలుగునవి మిక్కిలి చేయించవలెను. అనగా వస, రూమిమస్తకి నమలి చ లెను. మలము వెడలించినతదుపరి బౌసలిఖూర మును సిక్ అనగా సురుమా, రోశనాయీ కబీర అనగా యిది ఒకవిధమగు సురుమా. యీసురుమాలను నేత్రములలో వేయవలెను.

(2) దృష్టిబంగ లక్షణములు

దోషరహితమగు జలుబు మష్టపత్రికృతి దుర్బలమునకు కారణమగును. దీనిచిన్నములు నేత్రములు ఆరోగ్యదశకంటె చిన్నవిగానుండుటవలన జలుబు రతూబతులు అనగా నీళ్ళను చేర్చుచుండును. మరియు, రతూబతు భాగములు నేత్రములను బిగించుచుండును. కన్ను ఆలశ్యముగా తిరుగుట కండ్లయందు చెరుపు సంభవించుట యీమొదలగు చిన్నములు కలిగియుండును.

2 వ. దృష్టి దుర్బల చికిత్స

మొదట ఆరోగ్యమునొందుటకై పూరేమురతీ మాంసము కోడిమాంసము వేయించి, ధనియాలు, దాల్చిన్నిచెక్క, చెవగవప్పుచేర్చి వుడికించియిప్పించవలెను. మరియు, తురక వేపనూనె, చంబేలితైలమును

ముక్కులో వేయవలెను. ఘష్ణకూస, కలిగించుసట్టిమూలికలను నీళ్ళలో వేసి కషాయముగాచి ఆవిరి పట్టించవలెను. ఈ ఆవిరివలన చెమట పట్టుట యుచితమనితోచినచో ఆవిరిపట్టునప్పుడు బట్టకప్పవలెను. మరియు యీకషాయములో రోగి సర్వాంగములకు ఆవిరి తగులునటుల ఆవిరి పట్టవలెను. చెవులు మొదలగు ముఖ్యఅంగములకు యెల్లప్పుడు ఆవిరి పట్టవలెను. మరియు శియాఫె అజఫరున్న శియాఫే అజకరు మొదలగు ఔషధములను నేత్రములలో వేయవలెను.

### శియాఫ్ అస్ఫర్ చేయుక్రమము

కరక్కాయలు, మైలుతుత్తము, తెల్లమిరియాలు, తుమ్మజిగురు యివిప్రత్యేకము 10న్నర మాషములు కుంకుమపువ్వు, 3న్నర మాషములు. యీఅయిదువస్తువులను దంచి చూర్ణించి వస్త్రగాలితమొనరించి పరిశుభ్రమగు పచ్చిసోపురసములో కసినూరి కనికెలుచేసి యుంచుకొనవలెను.

### శియాఫెఅజఖర్ (చెమ్మగల కనికెలు) చేయువిధానము

జాంగలివచ్చ 10న్నర మాషములు. పేల్చినపచ్చపటిక 21 మాషములు. సముద్రలవణము, సముద్రపు నురుగు గోరపారిదళము యివి ప్రత్యేకము 3న్నర మాషములు. నవాసారము 1¼ మాషములు. రాతిపువ్వు 4న్నర మాషములు. యీతొమ్మిదివస్తువులలోనుండి రాతిపువ్వు మాత్రము పరిశుభ్రమగు సదాపాకురసమునందు భావనచేసి తక్కినవస్తువులనుదంచి చూర్ణించి ఒకటిగా చేర్చుకొని కనికెలుచేసికొనవలెను.

### నేత్రదృష్టి నశించు లక్షణములు.

ఈవ్యాధిదోషయుక్తమగు వుష్ణప్రకృతి దౌర్బల్యము నొందునట్టి కారణమువలన కలుగుచున్నది. దీనిచిహ్నములు నేత్రములు వుబ్బి యెర్రనై వేడిగానుండును. అనగా నేత్రములు వుష్ణసంబంధమగు రతూబతు అనగా నీరును వుడికించివేయును. వాటిని హెచ్చుచేయును. ఈ

కారణములవలన నేత్రసంబంధమగు సంధిబంధములు బిగించబడి పెరుగుచున్నవి. నేత్రదృష్టి చెడిపోవుచున్నది.

—3 నేత్రదృష్టి నశించుటకు చికిత్స.—

రక్తము విశేషముగా యున్నచో శిరావేదనము చేయవలెను మరియు కరక్కాయకషాయమునిచ్చి కోష్ఠమును మృదువరచవలెను. మరియు నీరుల్లి గంధవా మొదలగు దాహకారకమగు తీక్ష్ణమగు లవణపదార్థములు యెన్నడు సేవించకూడదు. సామాన్యముగు విరోచనమైన తదుపరి కండ్లనుండి నీరు స్రవించుటకై నీరు స్రవింపజేయునట్టి ఔషధములు ప్రయోగించవలెను. అనగా బరూదహానర్మీా మొదలుగాగల ఔషధములను నేత్రములలో వేయవలెను.

—బరూదహాసర్మీా చేయుక్రమము.—

మైలతుత్తమును మెత్తగానూరి పుల్లనిద్రాక్షపండ్లరసమునందు భావనచేసి నీడనుయెండించి అరిగ నూరి వస్త్రగాలితము నొనరించి నేత్రములలో వేయవలెను. మరియు మైలతుత్తముతో కూడా ఔషధములను చేర్చవలెనని ఖరాబాదిన్ యందు వ్రాయబడియున్నది.

—4 దృష్టిభంగిరోగ లక్షణములు.—

సాధారణవుష్ణప్రకృతి మిక్కిలి వుష్ణము జెందినచో నేత్రఅంగములయందు వుష్ణము కలిగించి నేత్రసంబంధమగు రతూబతులను యెండించివేయును. ఈకారణమువలన దూరపు చూపు కనుపించకుండును. దీని చిహ్నములు కన్నుచిన్నదై లోభాగమునకు లాగుకొనిపోవుచున్నది. మరియు నేత్రములు మిక్కుటముండి రతూబతు అనగా నీరు తక్కువగా వెడలుచుండును. ఆకలి కలుగునప్పుడున్ను వుష్ణముగానుండునప్పుడు నేత్రదృష్టి మిక్కిలి దుర్బలము నొందుచుండును. మరియు భుజించినపిమ్మట నిద్రించినతరువాత దృష్టిదుర్బలత్వము తగ్గుచుండును.

—4 దృష్టిభంగరోగచికిత్స—

చెమ్మ జలుబు కలిగించునట్టి సుహాయములను చేయవలెను.

ఈవస్తువులను అనేకపర్యాయములు చెప్పియున్నాము. మరియు చెమ్మ కలిగించునట్టి చల్లని తైలములను అనగా బనప్షాతైలము, కలువపూలతైలము, మొదలగునవి తలయందు లేపనము చేయవలెను. యీతైలములతో నశ్యము చేయవలెను. మరియు తియ్యబాదంనూనె నేత్రములలో వేయవలెను. మరియు ఆడశిశువుకన్న తల్లిపాలు నేత్రములలో పిండవలెను. మరియు సారాయిలో విశేషముగా నీళ్లుకలిపి పానమొనరించవలెను. సారాయిలో నీళ్ళువిశేషముగా కలుపుటవలన శరీరమునందు చెమ్మ విశేషముగా చేయును. వృష్ణము మిక్కిలి స్వల్పముగా వుత్పన్నమగుచున్నది.

౫ దృష్టిభంగరోగ లక్షణములు.

నేత్రములో యేవిధమగు వ్యాధిలేకుండుటను గాని రోగము ఆమాశయమునందు వుత్పన్నమగును. దీనివలన చిక్కని ఆవిరిపరమాణువులు లేచి మెదడునందుచే నేత్రములందుగల దృష్టిని దుర్బలము నొందించును. దీని చిహ్నములు ప్రతిసమయమునందు దుర్బలము యుండనేరదు గాని అజీర్ణదశయందు వుత్పన్నమగును. మరియు ఆకలిగానుండునప్పుడు దుర్బలత్వము మిక్కిలి నశించును.

(౫) దృష్టిభంగచికిత్స

ఆమాశయమునందు మలమునిండి యున్నయెడల, ఆమలమును తీసివేయునట్టి యుపాయములను చేయవలెను. మరియు లాభదాయకమగు ఉచితమగు జవారిశలతో ఆమాశయమునకు పుష్టికలిగించవలెను.

(౬) దృష్టిభంగ లక్షణములు.

(౬) ఈరోగమునందు స్వాభావికమగు వృష్ణము దుర్బలము నొందిన కారణమువలన గుల్లనరములయొక్క రతూబతు అనగా నీరు వశ్యమగుటకున్ను, స్త్రీకవడుటకున్ను హానికలిగి చెడిపోవును. ఇట్టితరి దూషితమగు ఆవిరిపరమాణువులు వృద్ధినొంది మెదడునందుగల ప్రకృతి, జ్ఞానశక్తియందు దుర్బలము కలిగించును. యీవిధమగు వ్యాధి మిక్కిలి

వృద్ధులకు కలుగుచున్నవి. యెందుకనగా నష్టముగువస్తువు తిరిగి బాగుప డుట వృద్ధుల ప్రకృతియందు అసంభవము. కాబట్టి యిూవిధముగు రోగ మునకు వైద్యవరులు చికిత్సచెప్పరైరి. యీరోగమునకు దుశ్చికిత్సఅని గ్రహించి చికిత్స చేయకపోవుటవలన రోగము క్రమేణ వృద్ధిజెందు చుండును.

## (6) దృష్టిభంగచికిత్స

మొదటనందుగల మలమును వెడలించి శుభ్రపరచవలెను. మ లము వెడలించినవెనుక శాతగజ్, సముద్రఫుసరుగు, కరకాయబెరడు నూరి నేత్రములలో వేయవలెను. దీనివలన నేత్రములు పరిశుభ్రతనొం దును. మలము నేత్రములనుండి వెడలిపోవును. మరియు సురుమూ మైల తుత్తం మొదలగునట్టి స్వభావికమగు అన్యవస్తువులను నేత్రములలో వే యుటవలన నేత్రములకు బలము కలిగించును.

(సూచనీయము) నేత్రదృష్టి దుర్బలముకలుగునట్టి వ్యాధి వృద్ధు లకు విశేషముగా కలుగుచుండును కాబట్టి వీరికిసర్వదా చికిత్స చేయం జనదు. యెందుకనగా యిట్టివ్యాధికి ఔషధములేదు. కేవలము వృద్ధు లకు కలుగు వ్యాధికిమాత్రము ఔషధము లేదనుట దీనికారణముకూడా చెప్పబడియె.

## (7) దృష్టిభంగ లక్షణములు.

(7) రతూబతెజులైదియా యందు చిక్కదనముకలిగి స్వచ్ఛ త్వము తగ్గినయెడల నేత్రజ్యోతిని రతూబతెజులైదియానుండి బైటికిరాని య్యకుండును. మరియు రతూబతులయొక్క నీడ యిందుపై చిక్కగా అల్లుకొని యుండుటవలన బాధకలిగించును. మరియు,రతూబతెజైదియా చిక్కబడుటకు మూడుకారణములు గలవు.

(1) వాతకారక దోషము శరీరమునందు విశేషించి ఆదోషము లముతో వాతముయొక్క చిక్కని నల్లపరమాణువులు మెదడుపై కెక్క

అచ్చటనుండి క్రిందికి రతూబతెబైజియాలో ఖసీభవించిపోవును. యీ పరమాణువుల చిక్కదనముయొక్క కారణమువలన రతూబతెబైజియాను మలినపరచును.

(2) స్త్రీసంగమము యొక్క విశేషత్వముగల కారణమువలన భోజనసారభాగముల సర్వశరీరమునుండియు విశేషముగా మెదడునుండి వెడలిపోవుచున్నయెడల మెదడునందు మిక్కిలి శుష్కత్వము ఉత్పన్నమగుచున్నది. అనగా నేత్రసంబంధమగు చెమ్మజలము ఆరిపోవును. యీ చెమ్మ మెదడునందుగల చెమ్మనుండి నేత్రములోనికి వచ్చుచున్నది. కాబట్టి యిట్టి సమయమునందు మెదడు శుష్కత్వము నొందుచున్నది. వెంటనే రతూబతెబైజియా ముడువబడి చిక్కబడుచున్నది. అనగా యీ రతూబతు ప్రకాశము స్నిగ్ధత్వము తగ్గిపోవును. మరియు శుష్కత్వము అధికమైనచో కండ్లుయేమి కనుపించకుండును. శుష్కత్వము తక్కువగానున్నచో ఒకవస్తువు తక్కువగా నల్లగుడ్డ నేత్రములపై కట్టినటుల కనుపించును.

(3) భోజనపానాదులలో కుపత్యమగు వస్తువులను భుజించుట వలనగాని లేక యెల్లప్పుడు రాత్రివేళభుజించుటవలన అజీర్ణము సంప్రాప్తమై ఆఅజీర్ణకారణమువలనగాని లేక అన్నము పచనమగుకారణము వలన శరీరమునందు విశేష చెమ్మ ఉత్పన్నమై రతూబతే జులైదియాను చెరచివేయును. ఈకారణమువలన దుర్బలము సంభవించును. దీని లక్షణములు రోగికి తన కండ్ల యెదుట ఒకనల్లని తెరయున్నటుల కనుపించుచును. ఆకాశమువైపు చూచిన దానికంటె పృథ్వివైపు చూచిన యెడల చూపునందు మిక్కిలి ప్రకాశము స్వచ్ఛముగానుండును. యెందుకనగా బహుశా రోగులకు నేత్రములయందు రతూబతెబైజియా చిక్కబడి ధూళియొక్క హీనపరమాణువులు కలియుటవలన కలుగుచున్నది. మరియు, యీపరమాణువుల ప్రకోపము క్రిందివైపు కలుగుచుండును. యీదశయందు నేత్రములు క్రిందికి

చూచుటవలన చిక్కదనము కలుగును. నేత్రములు ఆకాశముపైవు చూచుటవలన చిక్కదనము లేకుండును. మరియు, స్త్రీసంగమము యొక్క విశేషత్వమువలన కలుగుచున్నది. దీని హేతువు ప్రకటన మగుచున్నది.

## (7) నేత్రదృష్టిబంగ చికిత్స.

ఈవ్యాధిగల రోగి ప్రకృతియందు మలవిశేషత్వము యీచిక్కదనమునకు కారణమైన యెడల ఆకాశవల్లి, గారిఖూన్ కషాయములను పానముచేసి మలమును తీసివేయవలెను. మరియు, హానికరమగు వస్తు శేవన మానివేయవలెను. మరియు, స్త్రీసంగమమువలన యీ చిక్కదనముకలుగుటకు కారణమైనచో చెమ్మను కలిగించుటకు పరిశ్రమచేయవలెను. మరియు, స్త్రీసంగమము వర్జించవలెను. మరియు, మలమును వెడలించునట్టి అన్నివిధములగు వస్తువులతో సావధానుడై యుండవలెను. అనగా రోగానుసారముగా చికిత్సచేయవలెననుట. మరియు, శుష్కత్వమును కలిగించుటయందుగాని చెమ్మను కలించుటయందుగాని జాగ్రత వహించవలెనని అభిప్రాయము.

## (8) దృష్టిభంగరోగ లక్షణములు.

(8) రతూబతె జలీదియా చిక్కబడుటవలన నేత్రదృష్టి దుర్బలమునొందును. మరియు, యీ చెమ్మయందు చిక్కదనము వాతదోషముయొక్క కల్మిన చెమ్మవచ్చి చేరుటవలన కలుగుచుండును. యిది మెదడునందు ప్రవేశించనారంభించుచు. యింను కొంతరతూబత్ జలీదియాపై పడుచుండును. దీని చిన్నములు రతూబతె జలీదియా చిక్కనగుచున్నది. అనగా ఒకేవిరియాయము నేత్రములలో నలుపు ప్రబలమగును. మరియు, ప్రత్యక్షమగు రూపములను చూచుటకు ఆవస్తువుల చాయ దీనియందు పడకుండును యిది తప్ప నేత్రములో నజులాగాని ఛిద్రము విశాలత్వము నొందుట మొదలగునవి యేమియు, కలుగకుండును.

అట్టిస్థితియందు వాతము ఔషధములతో నశింపచేయు నుపాయములను చేసిన యెడల కంటినీరుయందు ప్రకాశమువచ్చును చీకటి తగ్గిపోవును.

(8) నేత్రదృష్టిబంగ చికిత్స

ఈరోగమునందు వాతనాశనమగు మంచి భోజనములు ప్రుచితమగును. మరియు, రతూబతె జలీదియా, రతూబతె బైజియాయొక్క చిక్కనగు కారణము వర్ణనము. వాటివిషయములో విస్తారపూర్వకముగా వర్ణించబడియె.

(9) దృష్టిభంగరోగ లక్షణములు

(9) ఈవ్యాధియందు ప్రత్యేకవస్తువు తన ప్రమాణముకంటె చిన్నదిగా తోచిన యెడల నిదినమీపమునందుండినను దూరమునందుండినను చిన్నదిగా కానబడును. కాబట్టి మిక్కిలి దూరమునందుండియు, పెద్దవస్తువు చిన్నదిగాక కనుపించినటుల తోచుచున్నది. యిట్లు కనుపించుటకు కారణమేమనగా ప్రకాశవాహిని నాళము అణగిపోవును.

మరియు చిన్నదగును. ఇట్లు అణగిపోవుటకు బిగిచిపోవుటకు మూడుకారణములు గలవు. (1) వావు. (2) బంధనము (3) శుష్కత్వము మొదలగునవి నేత్రప్రకాశవాహిని నాళము బిగిచిపోయినచో స్వాభావిక ప్రకాశము తననిజదశయందు ప్రవహించకుండును. దీని మార్గము యెంత చిన్నదగునో అంతచిన్నిదగుచుండును. యీకారణమువలన ప్రత్యేకవస్తువు తననిజ ప్రమాణముకంటె చిన్నదిగాకనుపించును. అచ్చట భేదమేమనగా నేత్రదృష్టి సూక్ష్మమగుట నేత్రముయొక్క మూడవపొర రంధ్రము చిన్నదగుటవలన యిట్లు కలుగుచున్నది. మరియునేత్రముయొక్క ప్రకాశవాహిని నాళము చిన్నదగుటవలన యిట్లు కలిగినవలన యిట్లు కలుగుచున్నది. అనగా యిది కంటిమూడవపొర రంధ్రము చిన్ననదగుకారణమువలన దృష్టి చిన్నదైనయెడల యిందుప్రత్యేకవస్తువు తననిజదశయందు కనుపించుచున్నది. యేలననగా దృష్టికంటిరంధ్రమునం

ను కొద్ది స్థానమగుటవలన విశేషముగా ముడుచుకొని కొద్దియగుచు న్నది. అవ్వడుస్థానముమారి రెండునాళములు కలియునట్టిస్థానము అనగా ముజమెయున్నారునందు చేరుచున్నది. యీచేరునట్టి స్థలమునకుజ్యోతిసంగమము అందురు. మరియు తిరిగి తన స్వాభావికదశయందు వచ్చుచుండును. యీకారణమువలన జీవనరము ఆరోగ్యముగా నుండును కాబట్టి ప్రత్యేకవస్తువు తన ప్రమాణముగా కనుపించుచుండును.

(9) నేత్రదృష్టి భంగచికిత్స.

ఈనరము అణగిపోవు కారణము శుష్కత్వమైనయెడల బిగించి నరమును అణచును. మరియు దీనిగుల్లనరములను జంటముడివేసి బంధించును. యిటుల బంధించుటవలన బొత్తిగా బంధింపబడినయెడల చెమ్మను కలిగించునట్టి యత్నమును చేయవలెను. యిచ్చట సామాన్యముగా గ్రహించవలసిన అంశమేమనగా వృత్తచెమ్మ వాపును కలిగించినదా లేదా అను సందేహము కలుగవలెను. చెమ్మయొక్క మలము వాపుకలుగనిదే అయినచో జీవనరమునందు నిస్సత్తువయుండును. మరియు ఈ కారణమువలన దీనిని కొన్నిభాగములు ఒకటికొకటి జీవనరముయొక్క మార్గములు బొత్తిగా బంధించకుండా కలిసిపోవును. యేలననగా యివి ఒకటికొకటి బంధించబడినచో యీస్థితియందు అవశ్యముగా అంధత్వము సంభవించును. యెటులననగా నజులావ్యాధి అంతమునందు వర్ణించబడియున్నది. మరియు ఆచెమ్మ వాపునుకలిగించినచో సమీపమునందుండు అంగములు తెల్లని నరముయొక్క భాగములను నరముయొక్క మార్గములను బిగించి వేయుచున్నది.

(10) దృష్టిభంగరోగ లక్షణములు

యిందు చిన్నవస్తువు పెద్దదిగా కనుపించును. ఆవస్తువు దగ్గరగానున్నను లేక దూరముగానున్నను పెద్దదిగా కనుపించును. యెందుకనగా ఆవస్తువు మిక్కిలి సమీపమునందున్నచో ప్రత్యేకముగా మనుష్యునకు చూపును అనగా ఉంగరము నేత్రమునకు మిక్కిలి సమీప

మునందుంచినచో కంకణముతో సమానముగా యుండునటుల కనబడు చుండును. చిన్నవస్తువు మధ్యమునందుండిగాని దూరమునందుండిగాని పెద్దదిగా కనుపించినచో చెమ్మ, దిక్కుబను కారణమువలన కలుగునని తెలిసేది. మరియు, శుభ్రమగు శరీరసిళ్ళు బిళ్లూరిచూవు అద్దమువలె దృష్టి దుశ్శ్యపదార్థమునకు మధ్యమునగు ఆటంకమగును. అప్పుడు శరీరకారణమువలన నేత్రజ్యోతి వంకరగును. మరియు, జ్యోతివంకరై దానికారణములు ప్రత్యేకవంకరై శక్తిగ్రహించిన యెడల ప్రత్యేక వస్తువు పెద్దదిగా కనుపించ నారంభించును. యీ కారణమువలన చలి కాలమునందు తారాగణఘాలి అధిక మగుటవలన పెద్దవిగా కనుపించు చుండును. మరియు, యెవ్వడు నీళ్ళయొక్క చుట్టుప్రదేశమునందు స్వచ్ఛముగా అక్షరములుఅద్దముక్రింద పెద్దవిగాతోచుచుండును. యింతవరకు కూడా వైద్యవరులు యిందువలన నేత్రదృష్టి యొక్క దుర్బలత్వము నందు అద్దములను వుపయోగించునటుల ఆజ్ఞాపించిరి.

### (10) దృష్టిభంగచికిత్స.

అమాశయమును, శరీరమునుమలమునుండిశుభ్రతనొందించుటకై ఆయారజ్ యివ్వవలెను. దీనివలన రోగమును పుట్టించుటకు కారణము చెమ్మ అయినయెడల ఆచెమ్మ నశించిపోవును. పిమ్మట నేత్రపొరను స్వచ్ఛత నొందించుటకున్ను, నేత్రమునందుండి నీరు స్రవింపజేయుటకున్ను సురుమా అనగా బాసలిఖూా. మరియు దీనికి సమానమగు యితర సురుమాలు కండ్లలో పెట్టవలెను. దీనివలన అచ్చట మధ్యనున్న ఆవిరిగల వస్తువు యావత్తు నశించిపోవును.

### (11) దృష్టిభంగరోగ లక్షణములు.

ఆరోగ్యదినములలో యెంతదూరమునుండి నేత్రములయొక్క శక్తి చక్కగా చూచుచుండునది చక్కగాకనిపెట్టలేక పోవును. మరియు దుర్బలము కలిగినప్పుడు సమీపమునందు యేవిధమగు హానికలుగని యెడల నేత్రములయందు చూచునట్టిశక్తి కొంచెము వలచబడుచున్న

కారణమువలన కలుగునని గ్రహించవలెను. అనగా దూరమువరకు దృష్టియొక్క నిజకళాను కూలముగా తిరుగజాలక అల్లుకొనుచున్నది. దీని కార్యములలో దుర్బలత్వము న్యూనతవచ్చుచున్నది. కాబట్టి యీ వ్యాధి కుదురుట దుర్లభము

### (11) నేత్రదృష్టిభంగ చికిత్స

శరీరమునందు చెమ్మను కలిగించుటకై మేక గొర్రెపిల్లలమాంసము, కోడిమాంసమును వేయించిన కోడిగ్రుడ్లు భుజించవలెను. గోరువెచ్చని మంచినీళ్ళతో శరీరప్రక్షాళనము చేయుచుండవలెను. మరియు, స్నానమునుకూడా చేయవచ్చును. చెమ్మను కలిగించునట్టి తైలములు అనగా కలువపూల తైలము సొరగింజల తైలము మొదలగునవి తలకు లేపనము చేయవలెను. అభిప్రాయ మేమనగా దీనికి చిక్కపరచునట్టి యత్నమును చేయవలెను అనగా ప్రకృతాను సారముగా చేయవలెననుట.

### (12) దృష్టిభంగరోగ లక్షణములు

ఈవ్యాధియందు దూరముకంటె సగ్గరవస్తువులు చక్కగా కనుపించుచుండును. దీనికారణ మేమనగా నేత్రమునందు చూచునట్టి శక్తియందు ఆవిరి పరమాణువులు కలిసి యుండును. గాన చూపు యెంతదూరమువరకు తిరుగుచున్నదో అచ్చట ఆవిరి పరమాణువులు ఆచూపునందు మిళితమై యున్నవి గనుక భ్రాంతిగా కష్టపడుచున్నవి. యీకారణమువలన నేత్రమునందు చూచునట్టిశక్తి బాగుగా చూడగలుగును.

### (12) దృష్టిభంగ చికిత్స

మలమును వెడలించుటకై, అయారజ్ యివ్వవలెను. మరియు, చెమ్మను కలిగించునట్టివస్తువులను వర్జించవలెను. మరియు, నేత్రజ్యోతియందు బలము కలిగించునట్టి వస్తువులు సురుమాలు కండ్లలో వేయవలెను. మరియు, శరాహలన్ బాబ్ అను గ్రంథకర్త యీ వెనుకటి

నాలుగు విధముల రోగములను ఖయాలాత్ అనగా నేత్రములయందు ఈగలు, దోమలు మొదలగునవి యెగురుచుండునట్లు కనుపించు వ్యాధియందు పోల్చిరి.

—x—

## చీకటి యందుండుట వలన దృష్టిభంగమగు లక్షణములు.

ఈవ్యాధి రెండు విధములు (1) విశేషకాలమువరకు మనుజుడు చీకటిగల ప్రదేశముందుండి ప్రకాశమును చూడకుండిన యెడల యీ కారణము వలన చెమ్మహీనమై ఆచెమ్మయొక్క ఆవిరి పరమాణువులు ఆప్రదేశమునందు అల్లుకొని యుంటూయుండునవి యుండకుండనిచో అవశ్యముగా యీకారణమువలన ఆవిరియొక్క హీనపరమాణువులను అల్లుకొని నష్టముచేయునట్టిది. ఇది యుండని యెడల నేత్రదృష్టి చిక్కబడుచుండును. మరియు, చిక్కని రతూబతు అనగా నీరు ఖనీభవించుట స్వభావికమగు చెమ్మయొక్క చిక్కదనము నేత్రసంబంధమగు పొరలయందుచేరి ముడుచుకొనుటవలన నేత్రజ్యోతి మార్గములు బంధించబడుచున్నవి. మరియు, గుల్లసరములు అణగుటవలన రతూబతె బైజియా చిక్కగా నల్లగామారుచున్నది నిది నేత్రదృష్టిని ఆటంకపరచుచున్నది.

(2) విశేషకాలమువరకు చీకటిలో నివసించియుండి వెంటనే వెలుగు ప్రదేశమునకు వచ్చినచో యీకారణమువలననేత్రజ్యోతిప్రకాశమును వెతుకనారంభించునుగాన విశేషశక్తి నేత్రమునుండి వెడలనారంభించును. దీనివలన బైటి ప్రకాశమునందు వచ్చిచేరును. తరువాత ప్రకాశము విశేషబలమువలన వచ్చుచున్నది. ఇందువలన నేత్రఛిద్రము విశేషముగా విశాలమగును. నేత్రఛిద్రము విశాలమైనచో ప్రకాశము

అల్లుకొనును. మరియు సూర్యప్రకాశముకూడా ఆనేత్రదృష్టియొక్క జ్యోతిని దుర్బలము చేయుచున్నది. అనగా దీపపుకాంతిని దీని స్వ్యాన తదుర్బలత్వముయొక్క కారణమువలన తగ్గించివేయుచున్నది.

—— చీకటియందు నివసించుటవలన కలుగు దృష్టిభంగ చికిత్స ——

రోగముగల కంటియందు జ్యోతి హెచ్చుగుటకు మార్గము బంధించుట రక్తూబత్తుబైజిస్తూ సలువు, లుపెక్కుట మొదలగునవి దృష్టిని నష్టపరచు కారణము అయినమొదల దోషమును తీసివేయుటకు సురుమాలు అనగా బాసలీఖూన్ మరియు శియాఫెమురారాత్ మొదలగు యితరములగు యిటువంటివస్తువులను కండ్లలో వేయవలెను. మాజూగాలు భోజనములు మొదలగునవి మలమును తేలిక చేయునట్టియు పవిత్రతనొందించునట్టివియురోగికి వుపయోగించవలెను. ఈరోగిదృష్టి నాశనముచేయు కారణము చీకటిలోనుండి వెంటనే వెలుగులో ప్రవేశించుటవలన కలిగిచో సూర్యప్రకాశము మొదలగు వానిని చూచుటకు సహించకుండిన ఒకనీలిగుడ్డ కండ్లపై నడ్డముగా కట్టవలెను. మరియు అద్దపుముక్కను యినుకవలె మెత్తగానూరి ఆచూర్ణమును చూచుచుండవలెను. మరియు మంచి భోజనములను భుజించవలెను. రాత్రివేళ భుజించకూడదు. స్త్రీసంగమము విడచిపెట్టవలెను.

—,O,—

# ఖిఫ్ఫన్ అనురోగలక్షణములు.



ఈశబ్దముయొక్క అర్థము వైద్యులనేకులు అనేకవిధములుగా చూపుచున్నారు. కొందరు కర్నియా అనగా నేత్రసంబంధమగు రెండవపొర ఇనిబియా అనగా కంటి మూడవపొర జన్మనుండియు వలచగానుం

డును. రతూబతెబ్బైజియా జన్మమండియు బహుళకున్నవగా నుండును. కాబట్టి సూర్యకిరణములు ప్రకాశమునందు ప్రవేశించును. యీరోగము నకు ఖిఫ్ఫస్ అందురు. యీవ్యాధి జన్మమందియే పుశ్వన్నమగునని వైద్యవేత్తలు వచించిరి. దీని చిహ్నములు పగటియందు నేత్రదృష్టి దుర్బలముగానుండుట సూర్యుడస్తమించిన సమయమునందుగాని లేక ఆకాశమునందు మేఘము క్రమ్మబడి సూర్యకిరణములు కనపించనుండు సమయమునందుగాని నేత్రమునందు యేవిధముగునష్టము కలుగనేరదు. మరియు నేత్రదృష్టిబలముగానుండును. ఒకానొకప్పుడు కారణమును బట్టి దుర్బలత్వమును కలుగజేయును. మరియు కర్మియాహారయందు గాని ఇనిబియాహారయందుగాని రతూబతెబ్బైజియాయందుగాని దుర్బలత్వము తగ్గినయెడల పగలైనను నీడయందు చూడగలుగును. మరియు సూర్యకిరణములయందున్న ప్రకాశమునందున్న కండ్లుచిన్నవిగానుండు కారణమువలన మూసికొనుటవలన నేత్రదృష్టి దుర్బలము నొందుచున్నది. యీకారణమువలన యీవ్యాధికి ఖిఫ్ఫస్ అను నామమిడిరి. ఖిఫ్ఫస్ అనగా గబ్బిలముకుపేరు. మరియు కోష్ఠమునందు కఫము యొక్క అర్థము. నేత్రము చిన్నదగుట అని కొందరిమతము. యీఖిఫ్ఫస్ వ్యాధియొక్క చికిత్స చెప్పబడలేదు. మరియు యిందువలన నేత్రపొరలు రెప్పలు నలుపెక్కుట అందురు. ఇందువలన కండ్లలో చూచునట్టి ప్రకాశశక్తి వచ్చినయెడల బనప్షా కాటుక కండ్లలో వేయుట మంచిది. అనగా బనప్షా నూనెతో తయారుచేసిన కాటుక అని భావము. ఇందువలన పవిత్రతయున్ను శుభ్రతయున్ను కలుగజేయవలెను. మలమును తీసివేయవలెను. వృష్ణమును తగ్గించును. మరియు ఖిఫ్ఫస్ దృష్టియొక్క దుర్బలమువలన రెప్పలలో చెమ్మ ప్రకటనమగునని కొందరు వైద్యులు వచించుచున్నారు. దీని వుచిత నుపాయమును చేయవచ్చును. దీని చికిత్స చెప్పబడుచున్నది.

—ఖర్పస్ వ్యాధి చికిత్స.—

ముందుగా శరీరమునుండి మలమును తీసివేయవలెను. తదుపరి తలయందుండు మలమును తొలగించి శరీరమును శిరస్సును శుభ్రత నొందినపిమ్మట మైలతుత్తము సురుమా అస్ఫహాని మరియు ఆస్కే వత్తె అనగా అదిరాఆకులు దానిమ్మపూలు కాల్చినబూడిదెయందు కలిపి కండ్లలో వేయవలెను. దీనివలన నేత్రములయందు బలముకలుగును. చెమ్మనుఆర్పివేయును. నేత్రపొరలు పవిత్రమునొంది చెమ్మ హరించును.

—:♦:—

# కుమూరు అను వ్యాధిలక్షణములు

ఈవ్యాధి యొక్క అర్థము మంచు, విశేషప్రకాశమగువస్తువులు మిక్కిలి మెరుపుగల వస్తువులు విశేషముగా చూచుటవలన నేత్రదృష్టి చాంచల్యము నొంది దుర్బలమగును. యీవ్యాధియందు నేత్రదృష్టి బొత్తిగా నశించుటకూడా కలదు. అనగా యేవస్తువు నేత్రములకు కనుపడకుండును. ఒకప్పుడు యీస్థితియందు చేరనే దూరపువస్తువును మాత్రము గ్రహించజాలకుండును. యీ మొదలగు లక్షణములు తటస్థించినప్పుడు నేత్రదృష్టి దుర్బలము నొందినదని గ్రహించవలెను. యీరోగి నేత్రములకు దగ్గరనుండు వస్తువులు మాత్రము కనుపించుచుండును. మరియు యేరంగుగు చూచినను ఆవస్తువు తెల్లగా నున్నటుల భావించును. అనగా దీనికారణము ఎల్లప్పుడు తెల్లనివస్తువులను చూచుటవలన ధ్యానించునట్టి శక్తియందు తెల్లనిరంగు చక్కగానిలిచి స్థిరపడియుండును. గాన యేవస్తువును రోగి చూచుచుండినను అందు తెలుపురంగు యున్నదని యే ధ్యానించుచుండును. మరియు కుమూరువ్యాధి ఉత్పన్నమగు

కారణములయందు షేక్అబూ అలిసేనాగారు వచించినదేమనగా తెల్ల వస్తువు తీవ్రమగుప్రకాశము తనయొక్క స్వచ్ఛతయొక్క విశేషత్వము వలన నేత్రమునందు చూచునట్టిశక్తిని ఆక్రమించియుండును. అనగా సూర్యకాంతియెదుట దీపకాంతి హీనమగును. అటులనే అనేందినములు గతించుటవలన ఈదళ నేత్రములయందు స్థిరపడి ధ్యానమునందుకూడా నిలిచిపోవును. గాన అట్టివస్తువులను చూచుట మానవలెను. మరియు విశేషముగా కుడినేత్రము దృష్టియందు దుష్టిశేషముండువరకు ఇందు విషయమై సదుపాయములు చేయుచుండవలెను.

## కుమూర్ వ్యాధిచిత్స

ఒకనల్లని బట్ట ముఖముపై అడ్డముగా కట్టవలెను. రోగికి నల్లని దుస్తులను కట్టించవలెను. మరియు, నల్లని కట్టులను కండ్లక్రింద కట్టవలెను. యిట్లు చేయుటవలన రోగి దృష్టి ఆనల్లనిబట్టలపై పడుచుండును మరియు, నల్లని వెంట్రుకలతో నేయబడిన వస్తువులను తురికి దేశస్థులు యాత్రవెళ్ళునప్పుడు విశేషముగా వుపయోగించునట్టి ఆనల్లని వస్తువు రోగి నేత్రములపై కట్టవలెను. యిది నల్లగానుండు కారణము వలన, నేత్రప్రకాశమునందు యిబ్బందికలిగించి ఒకటిగా నిలుపుచున్నది. కాబట్టి యీ నీలివరదాకట్టిన కారణమువలన అందు కలుగునట్టివి చూచుటకు అడ్డుగా నియ్యదు. దీనివలన పొగ క్రమ్మినట్లుండునట్టి నేత్ర దృష్టికనుపించును. దీనివలన ప్రాణవాయువు బలముగలదై నేత్రపొరలను మృధువరచి జలుబును నీడ్చివేయును. మరియు, మంచును చూచుట వలన యీ వ్యాధి వుత్పత్తి అయినచో దృష్టిని బలము కలిగించి ప్రాణ వాయువును లఘుత్వము నొందించుటకై చేదు బాదంపప్పునూరి కండ్లపై లేపనము చేయవలెను. మరియు, నేత్రములును ప్రాణవాయువు పరిశుభ్రత నొందుటకున్ను నేత్రపొరలయొక్క మృధుత్వము మంధము నశింపచేయుటకున్ను రోమాంచములను వికశింపచేయుటకున్ను ఉష్ణోదకముతో కాపడము చేయవలెను.

(సూచనీయము) యెల్లప్పుడు మంచు మూచుటవలన నేత్రములు నొప్పి కలుగును. దీనికారణము కంటిపొర మందముచేసికొనుట రోమకూపములు బంధించబడునట్టి కారణమువలన నేత్రములయందు ఆవిరి పరమాణువులు నిండుచున్నవి. మరియు ఆస్థానమునందు చిక్కబడి అచ్చట నీచములను కలిగించును కాబట్టి దీనివలన వాపును కలిగించు స్వభావికము కలుగుచున్నది. దీనిచిహ్నములు కారణము ముందు కలుగుట యితర చిహ్నములు నేత్రములు వాచునట్టి ప్రకరణమునందు ప్రత్యేక కారణానుసారముగా భిన్నాభిన్నములుగ వర్ణించబడినవి.

## కుమార్ చికిత్స

మలమును కరిగించునట్టియు తీసివేయునట్టి ఔషధములు యుపయోగించవలెను. దీనివలన రోమాంచములు వికసించును. మరియు ఆవిరిపరమాణువులు మలమునందుండినవి పృథుత్వము నొందును. మరియు నలగం, వెల్లుల్లి నూతనఆకులుగాని యెండినపొట్టుగాని యెండిన జూపా, అకలీలుల్ మలికు, బాబూనా, యీమొదలగువస్తువుల కషాయములో వేసి కషాయోష్మా గాచి ఆకషాయముతో ఆవిరిపట్టించవలెను. మరియు తిరగటికల్లుగాని, నల్లనిచదరపురాయిగాని, కాల్చి దానిపై సారాయివేసి అందువలనకలిగిన ఆవిరి తలకు పట్టించవలెను. మరియు రాగిరేకు కాల్చి సారాయిలోవేసి అందువల్లకలుగు ఆవిరి నేత్రములకు తగులునట్లు చేయవలెను. ఇట్లాచేయుటమిక్కిలి ఉత్తమము. మరియు రోమాంచములు వికసించునట్లు చేయుటకున్ను మలమును వెడలించుటకున్ను నేత్రములకున్ను మిక్కిలి ప్రశస్తముగా నుండును.

# సల్లూల్ ఐన్ అనగా శుష్కనేత్ర లక్షణములు.

సల్లూల్ ఐన్ అనగా నేత్రములు చిక్కుటయందురు. అప్పుడప్పుడు యీరోగమునందు నేత్రము మిక్కిలి చిక్కిపోవుచుండును. అనగా కనురెప్పలు లోపుకు అణగి కలిసిపోవునని భావము. ఎప్పుడైనను శుష్కత్వముయొక్క విశేషత్వమువలన చెమ్మయొక్క నిశ్చలత్వమున్ను స్వచ్ఛత్వము నశించుటవలన కంటిదృష్టి కేవలము నశించిపోవును. నేత్ర దుర్బలత్వము యీరోగమునందుండునని గ్రహించవలెను. యీవ్యాధి విశేషముగా వృద్ధులకు వుత్పన్నమగుచున్నది. ఈవ్యాధికారణములు చికిత్సవేరుగా నుండును.

మరియు యీవ్యాధి యౌవ్వనులకు కలిగినయెడల చికిత్సచేయవచ్చును. యీవ్యాధి రెండుభేదములుగా చెప్పుచున్నాను. (1) సల్లూల్ అయిన్ అనగా కంటిగ్రుడ్డు చిక్కిపోవుట వృద్ధులకు వుత్పన్నమగును. దీనికారణములు రతూబతు అనగా నేత్రసంబంధమగు నీరుమారిపోవుట ఆగోగి నేత్రముయొక్క సర్వభాగములలోప్రవేశించుటనిలిచితగ్గిపోవును.

## (1) సల్లూల్ ఐన్ అనగా శుష్కించు నేత్రచికిత్స.

ఈరోగమునందు నష్టమగు ముఖ్యమగు రతూబతులు అనగా, నీరు తిరిగిచేరుట కఠినముగా నుండును గాన యీవ్యాధి కుదురుట మిక్కిలి దుర్లభము కాబట్టి యీరోగారంభమునందు నేత్రములయందు చెమ్మపుట్టించుటకు ఆలోచించవలెను. మరియు పరిశ్రమచేయుట వుచితమగును. యేవస్తువు శుష్కత్వమును కలిగించునో అట్టివస్తువులను వర్జించుట వుచితము.

## (2) శుష్కనేత్ర లక్షణములు

రెండవభేధమగు యీవ్యాధిఅనగా సల్లుల్ ఐన్ (నేత్రములు చిక్కుట) యౌవ్వనులకు ఉత్పన్నమైనను మిక్కిలి తక్కువగా నుండును.

అనగా యీవ్యాధి యౌవ్వనులకుండుచు కలుగదు. మరియు యీరోగము యవ్వనపురుషులకు కలిగినను ఒక కంటియందు మాత్రము కలుగుచున్నది. మరియు రెండునేత్రములలో బహుస్వల్పముగా కలుగును. ముటులననగా యువ్వనుల శరీరమునందు గలచెమ్మ హానినొందుట తటస్థించదు. అయినను వ్యాధి కలుగుచున్నది. యిట్లు యీవ్యాధి కలుగుటకు ఆలోచనీయము ఇందు ఆలోచించవలసిన అంశమేమనగా నజులావ్యాధి సామాన్యముగా ఒక నేత్రమునందు కలుగును గాని రెండునేత్రములలో ఒకపర్యాయము మిక్కిలి అరుదుగా కలుగును. కాబట్టి విశేషముగా రెండునేత్రములలో ఒక్కసారి నజులావ్యాధి పుట్టుటన్నది కాజాలదు. ఇందువిషయమై నజులారోగ ప్రకరణమునందు వర్ణించియున్నాను. మరియు యీవిధమగు రోగకారణమేమనగా రతూబతెబైజ యూగాని రతూబతెజులైదియా యుండుగాని శుష్కత్వము పుట్టున్నదగును. యీశుష్కత్వము కలుగుటకు అనేకకారణములుగలవు. (1) రోగములను విశేషముగా నుండుట, (2) విశేషకాలమువరకు భుజించకుండుటవలన శరీరము క్షీణించినవారికి యీవ్యాధి కలుగుచుండును. (3) ముశిమియా అను నేత్రసంబంధమగు ఆరవపొరయందున్న, సబిరియా అను అయిదవ పొరయందు గల నరముల మార్గములు మలముయొక్క బంధనమువలన మూయబడిన కారణమువలన నేత్రములయందుగల తడియందు బలము చేరక ముందుండు బలము చెడిపోవును.

(4) నేత్రశక్తి దుర్బలమునొంది బిగిసిపోవును. అనగా తిమ్మిరి కలిగించునట్టి వస్తువులు నేత్రసంబంధమగు నరములయందుగాని, నేత్రములలోగాని వేయుటవలన దుర్బలము ఉత్పన్నమగును. మరియు తిమ్మిరి కలిగించునట్టి వస్తువులు, జలుబును సమకూర్చుచుండును. యీకారణమువలన బలముకలిగించునట్టి శక్తిని నశింపజేయుచున్నది. అనగా హకీము జాలీనూస్ గారు హారతుల్ వరా అను గ్రంథమునందు యీక్రిందివిధానమును చెప్పియున్నారు.

ఇప్పటివైద్యులు తఱచుగా కండ్లనొప్పులయందు నల్లమందు మొదలగు తిమ్మిరి కలిగించునట్టి వస్తువులు ఉపయోగించుచున్నారు. యిది మిక్కిలి చెడుఅలవాటుగాన దీనివలన ఈమొదటి వ్యాధులు కలుగును. మరియు చాలాకాలమువరకు వ్యాధి నిగ్రహించుటయేగాక ఒక్కొకప్పుడు నేత్రదృష్టి పూర్తిగా నశింపజేయును. కొందరికి క[illegible]దై చిక్కిపోవును. కాబట్టి యిందువిషయములో ముందుహెచ్చరి[illegible]న్నాను. అయినను యిందువిశేష దుర్గుణముండుటవలన తిరిగి మఱల చెప్పితిని.

### (2) శుష్కనేత్రచికిత్స

ఈవ్యాధియందు రోగినేత్రములలో రోగముయొక్క కారణము మలమువలన ఉత్పన్నమై బంధనమేర్పడినయెడల మలమును వెడలించునట్టి ఔషధములను నేత్రములలో వేయవలెను. మరియు మలసంబంధమగు బంధనమును విడదీయునట్టి ఉపాయములను చేయవలెను. అటుపిమ్మట యావత్తుశరీరము శిరస్సుయొక్క ప్రకృతియందు చెమ్మ కలిగించవలెను. మరియు యీరోగి నేత్రమార్గములు మెరుపుగల రతూబతు విశేషత్వమువలన బంధించబడినయెడల కేవలము చెమ్మను కలిగించునట్టి ఉపాయములు చేయవలెను. మలమును నశింపజేయుట, బంధనము విడదీయుటయందు శక్తిగల ఔషధములను యుపయోగించవలెను.

## హాజ్జుజ్ (కన్నుబైటికి వచ్చుట) యొక్క లక్షణములు

ఈవ్యాధిని స్వల్పముగా రతూబతె జుజాజియా, రతూబతెజులైదియా అను నేత్రసంబంధమగు నీరుయొక్క రోగములలో వర్ణించి

యుంటిని. యిూశాస్త్రమునందు కూడా గుణములయొక్క విశేషత్వము కారణములు తిరిగి పరిగణించుచున్నాను. యిూ రోగమునకు మూడుకారణములు గలవని గ్రహించవలెను.

(1) [illegible] దోషయుక్తమలము నేత్రభాగముల యందు ప్రవేశించుటచే యిూ కారణములవలన కంటి గుడ్డు పెరిగి (ఉబికి) బైటికి వచ్చుచున్నది. దీని చిహ్నములు అనగా నేత్రము యెత్తగుట, ఉబికిన వెంటనే కన్ను పెద్దదిగా కనపించుట, మరియు, పై దోషము యొక్క కారణమువలన కలిగిన యెడల నేత్రమునందు భారముకూడా కలిగియుండును. యిూ మొదలగు లక్షణములు యిూ వ్యాధియందు కలుగునని గ్రహించవలెను.

జహూజజ్ (కన్ను బైటికివచ్చుట) కు చికిత్స

పైన చెప్పిన చెడ్డకారణములవలన మలము వృద్ధినొంది ఆమళ దోషమువలన యిూ వ్యాధి కలిగిన యెడల దీని అనుసారముగా ఔషధములను ప్రయోగించి అనగా వస్తిఖర్మతోనున్ను కనుగుంటలో నుండు మలమును హరింపచేయునట్టి ఔషధములతోనున్ను విరోచనముల ద్వారా మలమును వెడలించుట మొదలగు సదుపాయములతో మలమును నశింపజేయవలెను. మలమును వెడలించిన తరువాత నేత్రముల నుండి నీరును స్రవింపజేయునట్టియు మలమును పెరుగ కుండునటులన యేఔషధము ఆటంకపరచునో నేత్రదృష్టిని బలము కలిగించి స్థిరపరచునో అట్టి ఔషధములు నేత్రములలో ఉపయోగించవలెను. దీనివలన నేత్రములకు బలము కలిగించును. మరియు, కన్ను బైటికి వచ్చుటకు కారణమగు మలమును నశింపజేయుటవలనతగ్గిపోవును. యిూరోగమునందు శియాఫ్ శిమాగ్ ఉపయోగించ దగిన ఔషధముని తెలిసికొనవలెను.

శియాఫ్ సిమాగ్ చేయు క్రమము

సిమాగ్ నీళ్ళలోవేసి కాచి వడియబోసి తిరిగి పోయి మీాదను నిది చిక్కబడువరకు కాచి రాంగ్ ఒక భాగము వచ్చుకర్పూరము

నాలుగు భాగములు కతీరా ఆరుభాగములు యీ వస్తువులు కల్వము నందుంచి పైకషాయములో మర్ధించి కనికెలుచేసి యుంచుకొని సమయానుకూలముగా ఉపయోగించవలెను.

(2) కన్ను బైటికివచ్చు లక్షణములు:—

ఈవ్యాధి కారణముల యొక్క ప్రేరేపణావలన యేకారణమువలన నేత్రగ్రుడ్డు పెరిగి వుబికి వెళ్ళివచ్చినదని గ్రహించి ఉక్తకారణము యిది అని తెలిసి కొనవలెను. అనగా కంఠధ్వని హీనమగుట తలనొప్పి అధికముగానుండుట అతివేగముగా వమనమగుట బిగ్గరగా ఓకరింతకలుగుట, ప్రసవవేదన, క్రోధము, శ్వాసబిగించునట్టి కారణము తటస్థించుట మొదలగు కారణములవలన నేత్రములు బైటికి వుబుకును. యీ రోగచిన్నములు యిప్పుడు చెప్పబడిన హేతువులలో యేదో హేతువు ముందు గతించి యుండును. మరియు, నేత్రములోపలనుండి యెవరో బైటికి తోడితీసినటుల పోటు పీకుట కలిగియుండును. మలము వెడలిన తరువాత యిట్లు హేతువులు తటస్థించిన కన్ను పెద్దదైనటుల కనుపించుచుండును.

—2 కన్ను బైటికి వచ్చుటకు చికిత్స.

ఇందురోగహేతువును తొలగించుటవలన ప్రయోజనము కనుపించదు. బహుదా కారణము దూరమైనను నేత్రము బైటికివచ్చియున్నయెడల సీసపుముక్కగాని లేక సన్నని సురుమాగాని పకసంచిలో వేసి ముచ్చినగుంటపై నుంచవలెను. మరియు కంటిపైన బిగించి కట్టుకట్టి రోగిని వెల్లికిలపరుండబెట్టవలెను. మరియు మలమును అటంకపరచునట్టి తైలములు అనగా దానిమ్మబెరడు అకాకియా అలీకు మరియు ఉసారె లహితుత్తిస్ యీమొదలగువాని తైలములు నేత్రములపై వేయవలెను. మరియు మిక్కిలి చల్లనినీళ్ళతో ముఖప్రక్షాళము చేయవలెను. ఇందువలన నేత్రములకు బలముకలుగును. మరియు నేత్రభాగములను ఒకటిగా చేయును.

(నూతనపేయాము) మిక్కిలి శీతజలము అజీర్ణమును కలిగించును. బంధమును కలిగించువస్తువులు అనగా దానిమ్మపూలు జైతూకాఆకులు గనగనవుఆకులు, మొదలగునవి నీళ్ళలోవేసి కషాయముకాచి రోగిముఖ ప్రక్షాళనము చేయవలెను. యీకషాయము విశేషబాధము చేయును. రోగము వెంటనే శాంతినొందును.

## కండ్లుబైటికివచ్చు వ్యాధి లక్షణము.

కంటిగుడ్డుయొక్క బంధనములు మరియు ఆబంధనములు అనగా కీళ్ళు వసిలిపోవును. దీని చిహ్నములు నేత్రము పెద్దదిగానున్నటుల తెలియకుండును. అనగా యిందుమలమునిండి యుండదు. మరియు కంటి లోభాగమునందు మిక్కిలి పీకుకలిగియుండును గనుక యిందు యే విధమైన వస్తువుయుండదు అనగా కంటి లోపైవుకుండి అణచి బైటి వైపునకు వుబికించును. మరియు అవశ్యముగా కంటిగుడ్డునందు తాపము సంభవించును. నేత్రము తిరుగుచుండును. యెందుకనగా అచ్చటి సంధిబంధము కంటిగుడ్డుకు తాపము విశేషము తిరుగకుండునటుల ఆటంకము కలిగించునట్టి బంధనములు బిగుతప్పి నిష్ప్రయోజనములైనవి. మరియు యీకంటియొక్క సంధిబంధములను నీర్సవరచునట్టి నీచరతూబతు అనగా నీరు అచ్చటచేరియుండునుగాన యీరతూబతును తీసివేయుటకై యారజాత్ అనేక వగ్యాయములు యుపయోగించవలెను. మరియు గండూషములు చేయుట వాసనచూచునట్టి వస్తువులు అనగా యెండువస్తువులను కాల్చి బూకిరి కండ్లకు పొగవేయవలెను. యీ వస్తువులవివరం శిరస్సంబంధముగువ్యాధులయందు చెప్పియున్నాను. ఆవస్తువులను యీరోగమునందు ధూపమేయవలెను. మరియు మలమును వెడలించిన తదుపరి కాల్చినచింతగింజలు, గులాబిపూలు, దానిమ్మపూలు, గవ్వవలుకుసాంబ్రాణి, జటామాంసి, యీమొదలగు వస్తువులునూరి కండ్లపై వేయవలెను. ఇట్లుచేయుటవలన అజీర్ణకారణమువలన కంటి గుడ్డుభాగములను బిగించి దృఢపరచును.

# బుగజుల్ ఐన్ యనగా సూర్య ప్రకాశమును చూడజాలకుండుటకు లక్షణములు



ఈవ్యాధికలుగుటకు రెండుకారణములు గలవు. (1) పైత్యవాయువు వృష్ణప్రకోపమునొంది పరాక్రిమమువలన లేచుచున్నది. పిమ్మట సూర్యరస్మివలన వలచబడి హెచ్చిపోవును. ఈకారణమువలనచూచునట్టి నేత్రశక్తి సూర్యకిరణముల వెలుగుచూచుటకుసహించలేకపోవును కాబట్టి దీనివలన సర్సాము అనగా మెదడువందు వాపును కలిగించునట్టి వ్యాధికలుగుటకు హేతువగును. యెటులననగా సర్సాంవ్యాధి వృష్ణమువలన వుత్పన్నమగును. మరియు దీని చిహ్నములు రెండవదాని చిహ్నములు పూర్తిగా కలుగవు.

## బుగజుల్ ఐన్ అనగా ఎండను చూడలేకపోవుటకు చికిత్స.

ఈరోగమునందు చెప్పును జలుబును కలిగించునట్టి వుపాయములయందు ఆలశ్యముచేయక తరుణమునందే చికిత్సచేయవలెను. దీనివలన యితర గొప్పనష్టములు కలుగనేరవు.

(2) ఈవ్యాధియందు నేత్రమునందు నొప్పి కలుగుట నబ్ రోగముగాని లేక కంటి రెప్పలో యేదైన కష్టముగాని సంభవించును అనగా దురద మొదలగునవి. మరియు, యీ రోగకారణమువలన నేత్రమునకు సూర్యకిరణములను చూచుటకు యిష్టము లేకపోవును. మరియు, యీ కారణమును బట్టి యీవ్యాధి చిహ్నములను భావించవలెను. హేతువును దూరపరచుట యీ రోగమునకు చికిత్స యని గ్రహించవలెను.

# కుమనా ఆనగా కంటియెరుపు లక్షణములు



ఈరోగము రెప్పలతో సంబంధము కలిగియుండును కుమనాశబ్దమునకు మూడు అర్థములు కలవు దీనివిషయమై పైన వర్ణించబడినవి. మరియు, యీ స్థానమునందు అర్థమేమనగా మనుష్యుడు నిద్రించి లేచినచో అతని రెండు నేత్రములలో యిసుక దుమ్ము పడినటుల సందేహించుచుండును యిది వాతప్రకోపముయొక్క కారణమువలన యిటుల తోచుచుండును. మరియు, ఆవిరి హీనపరమాణువులు నేత్రపొరలో బంధించబడియుండును. .యిందువలన యెల్లప్పుడు ప్రత్యేకసమయమునందు యుండనేరదు యేలననగా మేలుకొని యుండు సమయమునందు రెప్పలను మూసి తెరచుటవలన ప్రత్యేకముగా చూచుటవలన ఉదయము ప్రకాశకాలముగుటవలన ఆవిరి పరమాణువులు నష్టమొందుచుండును. మరియు, నిద్రావస్థయందు పరమాణువులకు నష్టముకలిగించు కారణము లేకపోవుటవలన ఆవిరి పరమాణువులు గుమి గూడుచున్నవి. కాబట్టి అవశ్యముగా మేలుకొనిన వెంటనే నేత్రములలో యిసుక దువ్వపడినటుల రెప్పలలో గ్రుచ్చుకొనుచుండును నిదురనుండి లేచిన కొంతసేపటికి ఉష్ణకారణమువలన ఆవిరి పరమాణువులు గుమిగూడియుండునవి యావత్తు నష్టమునొందును.

### కుమనా అనగా కంటి యెరుపు చికిత్స

రోగి ప్రకృతానుసారముగా పుత్పన్నమగు వాతము వృద్ధిచేయునట్టి మలమును తీసివేయవలెను, మరియు యావత్తు శరీరమునందుండి మలమును వెడలించిన తదుపరి కంటిరెప్పలు పొరలయొక్క మలమును తీసివేయుటకై నేత్రములనుండి నీరు స్రవింపజేయునట్టి ఔషధములను నేత్రములలో వేయవలెను అనగా అహామరెలయ్యాక్, అహామరెషాద్, బాసలిఖూన్, శియాఫెతరఖ్, మూతీలఖూన్, మొదలగునవి నేత్ర

ములలో వేయవలెను. మరియు కనురెప్పలపై శియాఫె అస్వద్ ములయ్యాన్ నేత్రములలోకూడా వేయవలెను. ప్రతిదినము ప్రాతఃకాలస్నానము చేయుచుండవలెను. ఇందువిషయమై విశేషము చెప్పబడియె. మరియు నిర్మలమగు ఔషధములవలన ప్రయోజన మున్నంతవరకు తీక్ష్ణమగు ఔషధములు నేత్రములలో ప్రయోగించకూడదు. అనగా అహామరెలయ్యాకా వలన ప్రయోజనము కలిగినచో అహామరెహాద్, మరియు శానలిఖూన్ వుపయోగించకూడదు. విస్తారముగా యీరోగమునందు వృష్ణప్రకృతి కలిగియుండును.

## ఇస్త్రఖావుల్ జప్ అనగా రెప్పలు సచ్చు పడు లక్షణములు

నేత్రసంబంధమగు ప్రధానహారయందు వాపుజనించును. అథవా నేత్రము నొప్పిగానుండినదై రెప్పబలముతప్పి సచ్చుపడును, ఒక్కొకప్పుడు రెప్పవేయుటకు వీలులేక శక్తిహీనమైపోవును. మరియు యీరోగము రెప్పలయొక్క మూలములయందు బిగువు తప్పుటవలన రెప్ప నిస్సత్తువగుచుండును.

### ఇస్త్రఖాఉల్ జప్ అనగా రెప్పలు సచ్చుపడుటకు చికిత్స

ఈరోగమునందు అవశ్యకమని తోచినయెడల ముందుగా శరీరమునందుండు మలమును వెడలించవలెను. మరియు నేత్రమునొచ్చుట, నేత్రసంబంధమగు ప్రథమహారవాపు మొదలగువానియందు గల మలప్రకోపమునుబట్టి మలానుసారముగా ఔషధములతో ఆమలమును తొలగించవలెను. కంటినొప్పి వాపుతగ్గి కనురెప్ప వ్రేలబడుటమాత్రము శేషించియుండినయెడల ముక్కులోపలనుండు నరములను ఛేదించి రక్తమోక్షణము చేయవలెను, మరియు కొనలునందున్న, కనురెప్పలపై నుసాంబి

రము, అక్కలకర్ర, జటామాంశి, కుంకుమపువ్వు, తుమ్మచెక్క యీ మొదలగు వస్తువులు ఆన్ అనగా అధిరారసముతోనూరి లేపనము చేయ వలెను. యీలేపనమువలన మలము శుష్కించును. మరియు నేత్రము నకు బలముకలిగించును.. రెప్పలయందుండు మలమును తీసివేయుటకై నేత్రములనుండి నీళ్ళు స్రవింపచేయునట్టి సురమా రెప్పలోపట వేయ వలెను. మరియు, యీ చికిత్సచేసిన తరువాత దృష్టి స్థిరముగా నుండ నిచో రెప్పను కోసివేయవలెను. రెప్పను కత్తిరించు విధానమును వచించుచున్నారు. అనగా చిన్నకొలికి పైవునుండి పైరెప్పను పెద్ద కొలికి వరకు కోసివేయవలెను. మరియు, రెప్పబిగు తప్పుటను న్యూనత అధికతయొక్క అను సారమునుబట్టి యెంతవరకు తీసివేయుట ఉచితమో అంతవరకు రెప్పను కత్తెరతో కత్తిరించివేయవలెను. మరియు, యేస్థా నమునందు విశేషముగా నీర్సముండునో ఆస్థానమునందు రెప్పను విశేష ముగా కోసివేయవలెను. యెచ్చట తక్కువగానుండునో అచ్చట తక్కు వగా కత్తిరించి వేయవలెను. మరియు, రెప్పకత్తిరించిన వెనుక మూడు నాలుగు కుట్లుకుట్టి దానిపై అనవర్ వేయవలెను. మరియు, ఉప్పు, జీల కర్ర నమలి బట్టతో వేసి ఆనీరు నేత్రములలో వేయవలెను. మూడవ దినమునందుగాని నాలుగవదినమునందుగాని ఆకుట్లు కత్తెరతో కత్తిరించి తీసివేయవలెను. తదుపరి పాలాస్త్రి వేయవలెను. యీ సదుపాయము వలన కంటిరెప్ప లేచిపోవును. కంటియందుండుపావ వికశించును.

(సూచనీయము) ముక్కురెండురంధ్రములలోపల రెండునరము లుగలవు. ఆనరములకు ఇంకుల్ మన్ ఫైదన్ అనగా ముక్కుపుటముల నరములు అందురు. ఆనరములను ఛేదించువిధానము యీక్రింద చెప్ప బడుచున్నది. అనగా .రోగి శ్వాసముబంధించి తపసివలె నుండునటుల సూర్యుని యెదుటనిలువబెట్టవలెను. అనగా సూర్యరస్మి వెలుగువలన నరములు కనుపించుచుండును. అట్టిసమయమునందు శిరావేదన చేయు టయందు నేర్పరియగు వైద్యుడు కత్తియొక్క వీపు అనగా యిందు

విషయమై వుపయోగించు శస్త్రముతో ఛేదించవలెను. ఈ నరమును ఛేదించుటవలన లాభముగలదు. అనగా రతూబాతు అనగా నీరు రక్తముతో కలిసి నేత్రములలోనుండి బైటకి వెళ్ళిపోవును. మరియు ఒకప్పుడు పక్షవాతమువలన కంటిరెప్ప వచ్చుపడి వ్రేలబడును. మరియు అర్ధాంగ వాతమునందుకూడా యిట్లు తటస్థించగలదు. ఒక్కొకప్పుడు యీ బంధనము రెప్పను నీర్సపరచుచున్నది మరియు, నొసలునందు శిరావేదనము చేయునప్పుడు యనగా వైద్యుని మందమతివలన యేవైపు తెగుచున్నదో ఆవైపు కనురెప్ప వ్రేలబడును కాబట్టి వైద్యుడు జాగరూకుడై స్వస్థచిత్తుడై శిరావేదనము చేయవలెను.

మరియు, కందరూమాఖల్ అను వైద్యుడు రాజుగారి కుమార్తెకు శిరావేదనము చేయవలసి నొసలునందు శిరావేదన చేయుటలో ఒకవైపు రెప్పయొక్క సంధిబంధము తెగిపోయినది అట్టి స్థితియందు ఆరోగి రెండు నేత్రములు మూతబడినవి యిట్టి స్థితియందు ఆవైద్యుని హస్తము ఖండించివేయుటకు ఆరాజు ఆజ్ఞాపించెను. అంతటనుండి ఆరాజు ప్రభుత్వము అంతమువరకు చికిత్సయందు పొరపాటుపడినట్టి వైద్యుల హస్తములను నరికించుచుండువాడు.

## ఇన్తిసాకులజన్ప అనగా రెండురెప్పలుఒకటిగా కలుసుకొనువ్యాధి లక్షణములు



రెప్పలు అంటుకొనుట ఒకవైపునందుకలుగును. ఒకప్పుడు రెండువైపులనుండి ఆరంభించును. ఒకప్పుడు రెండు రెప్పలు ఒకవైపువరకు ఒకటిగా కలుసుకొనిపోవును. ఒకప్పుడు రెప్పలు ముల్తహిమా యందున్న కర్నియా అను పొరలయందును అణగిపోవును. మరియు, యీరోగము మూడు కారణములవలన కలుగునని గ్రహించవలెను.

(1) నేత్రము వ్రిధముముచేసు వాది మిక్కిలి యెఱ్ఱబడి కను రెప్ప బద్దలైనటుల చెక్కినటుల కనుపించుచుండును. యిట్టి స్థితి యందు గాయమై ఆగాయము మానిపోయి రెప్ప అంటుకొనుచున్నది.

(2) నేత్రమునందుగాని రెప్పయందుగాని వ్రణమైన యెడల ఆవ్రణమువలన చాలాకాలమువరకు కన్ను మూయబడి గాయముతో కూడా రెప్పకరుచుకొని పోవును.

(3) నజల్ వ్యాధి యందుగాని నాఖూనా అను దుర్మాంసము నేత్రములపై వుత్పత్తి అయినచో దీనిని శస్త్రము చేసి జీలకఱ్ఱ వుప్పు నములి నేత్రమునందు వేయుని హేతువువలన ఆరణము పరిశుభ్రత నొందక రెండు రెప్పలను ఒకటి అంటించుటకు కారణమగును.

కనురెప్పలు ఒకటిగా కలుసుకొనుటకు చికిత్స

ఈరోగనుపాయము స్వల్పప్రయాసతోనే కుదురగలదు. అనగా పూర్తిగా కల్సుకొనిన రెప్పలుగల రోగి రెప్పలు సళాకుతో యెత్తివేయవలెను. అనగా రెప్పయెచ్చట కల్సుకొనియున్నదో ఆస్థానమునకు అంటుకొని యుండని స్థలమునుండి కంగూరాగలసలాకుగాని లేక యిందువిషయమై లోహముతో చేయబడిన ఆయుధముతోగాని ఆరెప్పను యెత్తి వేయవలెను. మరియు ప్రథమపొరయందు కంటిరెప్ప అంటుకొనినచో చెయ్యి నిమ్మళముగా క్రిందనుంచి రెప్పజరుగకుండునటుల పట్టుకొనవలెను. యెందుకనగా కర్నియా అను నేత్రము రెండవపొర రెప్పతోకూడా లేచివచ్చును అనే భయముతో చెయ్యి సహాయముచేసి సలాకుతో కంటికి రెప్పకుమధ్య మార్గమును తప్పించివేయవలెనని భావము. మరియు కన్ను తన స్థిరత్వము నుండకుండునటుల జాగ్రత వహించవలెను. మరియు యీరోగి నేత్రముయొక్క రెండురెప్పలు యేమిసందులేక సరాసరిగా అంటుకొని సళాకు ప్రవేశించుటకు మార్గములేక పోయిన యెడల రెప్పను నెమ్మదిగా నేత్రసంబంధమగు ఆయుధముతో కొంతవేరుచేసి ఆఆయుధముతో విడదీయవలెను. మరియు, రెప్ప యొక్క చిన్నకొలికి

పైవురనగా రెప్పలు యెచ్చట అంటుకొనియున్నవో అచ్చట సళాకులోపలకు ప్రవేశించుటకై సళాకు ప్రవేశించునంత రంధ్రము కాగలందులకు చీల్చి అందుండి యీ సళాకు ప్రవేశపెట్టి రెప్పనుపైకి యెత్తివేయవలెను. మరియు, కత్తిరతో కత్తిరించివేయవలెను. యీ నుపాయములతో రెప్పలు విడిపోయిన యెడల రెప్పలు విడదీసిన వెంటనే జీలకర్ర ఉవ్వా నమలించి బట్టలోవేసి నిర్మలమగు యీ నీరు నేత్రములలో పిండవలెను. దీనివలన గాయమగును. పిమ్మట గులాబిపూల నూనెలో దూది తడిపి రెండుపైవుల మధ్యనుంచవలెను. యిట్లు చేయుటవలన రెండు రెప్పలు తిరిగి ఒకటిగా కలుసుకొనజాలవు. మరియు, కనురెప్పలపైన కోడిగ్రుడ్డుసొన గుల్‌రోగన్ అనగా గులాబిపూలనూనెలో కలిపి లేపనముచేయవలెను. దీనివలన నొప్పి తగ్గి కంటిరెప్పలు మృదుత్వము నొందును. మరియు, నేత్రసంబంధమగు అంగములకు బలము కలిగించును. మరియు, నేత్రముపై వదులుగా కట్టుకట్టవలెను. రెండవ దినము కట్టువిప్పి జీలకర్ర ఉవ్వానమవలి నేత్రములో పిండవలెను. మరియు, కోడిగ్రుడ్డుసొన గుల్‌రోగన్ కలిపి కంటిపై లేపనముచేయవలెను. మూడవదినము నేత్రవ్రణము మాన్పునట్టి కనికెలు నేత్రములలో వేయవలెను. కట్టుకట్ట కూడదు. రోగి చూచునటుల ఆజ్ఞాపించవలెను. దీనివలన రెండవతూరి కనురెప్పలు అంటుకొన నేరవు. మరియు, యీసమయమునందు నేత్రములలో ఔషధమువేయుట మంచిది కాదని తోచినయెడల గుల్‌రోగన్, కోడిగ్రుడ్డుసొన కలిపి వేయుచుండవలెను. అనగా ఔషధము ఉపయోగించవలసినంత అగత్యమువరకు పైచికిత్సనే చేయుచుండవలెను.

(సూచనీయము) కంటి ప్రథమపొర వాచుటవలన రెండురెప్పలు ఒకటిగా కల్సుకొనునని భయము తోచినచో ముందుగా దీని వుపాయములను చేయవలెను.

# సుతరా అనగా కనురెప్పలు చిన్నవగుటకు లక్షణములు

## ౧౨

ఈరోగార్థము దీని నిజగళనుబట్టి పెట్టబడినది. సుతరా అనగా రెప్పలు చిన్నవగుటకు అర్థము. మరియూ అనేకపనులలో పైరెప్ప ముడుచుకొని పోవుచున్నది మరియు క్రిందిరెప్ప బైటిపైవుకు తిరుగబడుచున్నది. అనగా పైరెప్ప క్రిందిరెప్పకు సమానముగా కలుసుకొనుటకు కష్టముగా నుండును. మరియు, క్రిందిరెప్ప తిరిగిపోవుటవలన దీని అనుసారముగా పైరెప్ప ముడువబడును ఇటుల కలుగుటవలన నేత్రిముయొక్క తెల్లగుడ్డు కొద్దిగా కప్పుకొనును గాని నేత్రియావత్తు పూర్తిగా మూయుటకు అలవికాదు. యీవ్యాధిగల నేత్రమును వైద్యవేత్తలు కుందేలుకన్నుతో పోల్చుచున్నారు. ఈనేత్రముగలరోగి నిదుర కుందేలు నిదురఅందురు. యీవ్యాధివలన నేత్రములలో విశేషముగా దుమ్ముపడి నిలిచిపోవుటవలన అనగా కనురెప్పలు సమానముగా మూతపడనికారణమువలన అవశ్యముగా నేత్రదృష్టియందు దుర్బలము ప్రవేశించును. యీరోగము రెండువిధములుగా చెప్పబడియున్నది.

(1) జన్మమునుండియు మలమువలన రెప్ప యేర్పడును. కాబట్టి యిందు మలముయొక్క తొందరవలన చిన్నవిగా వుత్పన్నమగును. కాబట్టి రెప్పలు మంచివిగా కలుగకుండును.

(2) ఇది జన్మనుండి కలుగక, జన్మించినతరువాత యేదో నవీన కారణమువలన కలుగుచున్నది. యిట్లు కలుగుటకు ఆరు కారణములు గలవు. (1) కనురెప్ప తెగిపోవుట అనగా నేత్రిములలోపల రెప్పలయందు వెంట్రుకలు మొలుచునట్టి వ్యాధివలన. (2) రెప్పలలో కురుపులు లేచి విశేషమాంసము పెరిగి, రెప్పలు చిన్నవగును. అనగా విశేషమాం

నము ఆగాయముయొక్క చిన్నః తమువలన కలుగును, అనగా తనకుతాను గాయముపలెనే పెరిగిపోవును.

(3) ఏదైన యితరకారణమువలన పై రెప్పను కత్తిరించినయెడల నిది వుచితముగా కలుసుకొనలేకపోవుటవలన కుట్లు సరిగా కుట్టనికారణమువలన రెప్పచిన్నదగును. (4) కను రెప్పల వ్యాధులలో రెప్పను కత్తిరించివేయుసమయమునందు పై రెప్పను బైటివైపుకువిరిచివేయుదురు. అందుండి కొద్దిగా తెగిపోయి మిగిలినభాగము వదలివేసినచో అట్టితరి నీడ్చునట్టి కారణమువలన గాయముమానిపోవుటవలన రెప్పచిన్నదగును. అనగా దుర్మాంసము త్పత్పన్నమగుటవలన రెప్పబైటివైపు అటులనె తిరుగబడియుండుటవలన కలుగుచున్నది.

మరియు యీవ్యాధివిషయమై వైద్యుల అభిప్రాయమేమనగా రెప్పలయందు శస్త్రకర్మ చేసినవెనుక రెప్పలను బైటివైపుకు విరిచియుంచినయెడల లోవైపుకు తిప్పివేయవలెను. ఇటులచేయక రెప్పవిరిచి అటులనె వదలివేసినచో యీకష్టములకు లోబడవలసివచ్చును. అభిప్రాయమేమనగా నేత్రవైద్యమును చేయునట్టి వైద్యుడు క్రియలయందు కుశలత్వముగలవాడున్ను బుద్ధిమంతుడున్ను యుక్తిపరుడు గానియెడల యీవైద్యముయొక్క గూఢమగు క్రియలను నెరుగక వైద్యము చేయువాడు యీక్రియలలో మోసపోవును. అట్టివానిచే వైద్యము చేయించుకొనుట మిక్కిలి ప్రమాదమగును.

—నుతిరా అనగా రెప్పలు చిన్నవగుటకు చికిత్స.—

ఈమొదలగువ్యాధులు శస్త్రకర్మవలన శాంతించుచున్నవి. రోగి కనురెప్పతెగిపోవుటవలన రెప్పయు విరుద్ధముగా కుట్టుటవలన కుట్టుటకై రెప్పవిస్తారముగా యెత్తుటవలన అథవా రెప్పలుకోసివేయుటవలన, యీరోగము కలిగినచో రెప్ప యేస్థానమునందు అంటుకొనియున్నదో అచ్చట చీల్చి వదలివేయవలెను దీనివలన రెప్ప వేర్లబడును. మరియు నేత్రమును పూర్తిగా కప్పుకొనును. మరియు చీల్చిన చీరికెల మధ్య

మాంసము పుట్టించునట్టి పలాస్త్రి వట్టివేయవలెను. దీనివలన ఆచీల్చిన చీలికె అంచులు కలుసుకొనవు అప్పుడు వానిమధ్య మాంసము పెరిగి వచ్చును. మరియు యీరోగినేత్రములలో కఠినమగు మాంసముగాని లేక విశేషముగా మాంసము పెరిగినయెడల దీనిని అణచివేయవలెను. అనగా ఆయుధముతో పట్టుకొని యెత్తి కత్తెరతో కత్తిరించవలెను. పిమ్మట తీక్ష్ణమగు ఔషధములు కఠినమాంసము వుత్పత్తియయిన స్థలమునందు వేయవలెను. ఈఔషధము వేయుటవలన తిరిగి మాంసము వృద్ధినొందజాలదు. అభిప్రాయమేమనగా యిట్లు మాంసము కలిగినయెడల మిక్కిలి కఠినమగును, మరియు యీరోగికనురెప్ప ఛేదించిన తరువాత రెప్పబైటివైపుకు విరువబడి యుండుటవలన రోగము వుత్పన్నమైన యెడల కంటియొక్క ప్రిధమపొర రెప్పతోకూడా బైటికివచ్చినదిబాగగుటతో వాలిపోయినను యీకారణమువలన రెప్ప బిగిసితిరుగబడినను ఆచికిత్సానుసారముగా యీరోగమునకు సదుపాయముచేయుటమంచిది. ఇందువిషయమై కనురెప్పలు ఒకటికొకటి అంటుకొని పోవునట్టి ప్రికరణమునందు చెప్పియున్నాను. మరియు రెప్పను కంటిప్రిధమపొరతో వుక్తరీతితో వేరుచేయవలెను. మరియు రెప్పలోపలె అనగా పిటికెపలె వుత్పన్నమైనయెడల ఆపిటికెను నష్టపరచుటకై మెంతులు అగసి విత్తులగుజ్జు మరియు దాఖలియూన్నేయవలెను. ఈచికిత్సవలన ఆపిటికె నశించనిచో శస్త్రముతో తీసివేయవలెను.

(5) తలవుర్రెనుండి ఆరంభమై యుండునట్టి ఝిల్లిలోభాగమునందుగల రోగకారణమువలనగాని దెబ్బతగులుట అదురుటవలనగాని అణగుటవలనగాని, ఈదెబ్బ తలపైగాని, నొసలుపై తగులుటవలనగాని ఈఝిల్లిపొరయందు కష్టము ప్రవేశించి బిగిసిపోవును. మరియు నిది సమీపముగా నుండుకారణమువలన పైరెప్ప యందుకూడా బిగింపు వుత్పత్తియగును.

(6) కంటిపైరెప్ప మొత్తునవ్వును విశేషముగా లాగుటవలన రె ప్పచిన్నదగుటకు కారణమగును. మరియు ఝల్లియొక్క బిగింపు గాయ మువలనగాని, దెబ్బవలనగాని, అదురువలనగాని ఉత్పన్నమైనచో దీని చిన్నఃమూలం అనగా ఆఝల్లియందు కష్టము సంభవించును. రోగము నిదానించి దానికారణము కనిపెట్టి వుపాయములను చేయవలెను.

మరియు బాహ్యకారణమువలన రెప్ప బిగించినను లేక లోపటి కారణములవలన బిగింపు కలిగినను లేక ఆఝల్లియందు కలిగినదా లేక తలపుర్రెపైయున్న జిల్లివలన కలిగినదా లేక రెప్పయొక్క కండరముల మొదళ్ళయందు కలిగినదా యని రోగినిచూచి నిదానించవలెను. మరి యు రెప్పకండరముల మూలమునందు కలిగినయెడల శుష్కత్వముయొ క్క మలమునిండి యుండుటవలన కలుగును. బిగింపు ప్రత్యేకమగు కా రణమువలన గ్రహించవలెను. మరియు దీనిఅనుసారముగా చికిత్సచేయ వలెను. మరియు రెప్పఒకటిగా బిగించబడి చిన్నదగును. అందు భారము పీకుకలుగును. బరువుగానుండునటుల తోచుచుండును. మరియు మలము యొక్క లక్షణములు కలిగియుండనిచో మలకారణమువలన బిగించిన దని గ్రహించవలెను. మరియు కనురెప్ప క్రమేణ చిన్నదైనచో అందు చిక్కిపోవునట్టి శుష్కింపచేయునట్టి కారణము మందుకలిగి యున్నచో లాగుట, బిగిసికొనుట శుష్కత్వమువలన కలిగినదని గ్రహించవలెను.

రెప్ప చిన్నదగుటకు చికిత్స.

మలదోషముయొక్క కారణమువలన పీకుకలిగినచో ఆమలమును హరించుటకై సుపాయములను చేయవలయును. మరియు మలమును నష్టపరచునట్టి తైలములను మర్దించవలెను. మరియు మెంతిజిగురుతో నేత్రమును కాడను చేయవలెను. చెమ్మను కలిగించునట్టి భోజనము లనుగాని, కాడములుగాని, తైలములుగాని వుపయోగించవలెను. ఇవి యావత్తు శుష్కత్వదోషయుక్తమగు రెండువిధముల రోగములయందు లాభదాయకమగును. అనగా మలమునిండిన కారణమువలన రెప్పయం

దు పీకు కలిగినయెడల మలమును విసర్జించుటయొక్క కారణమువలన చెమ్మను కలిగించుట, మృదుపరచుట అవశ్యకముగా కలుగును. యిటులనే ఆడశిశువుగల స్త్రీ చనుపాలలో కతీరా, బసప్షా కలిపి లేపనము చేయవలెను. మరియు బసప్షాతైలము, సారంగజతైలము తలపై లేపనము చేయుట యీమొగలగునవి ఈరెండువిధముల కారణములవలన కలుగు రోగములలో లాభదాయకమగును.

# సిర్‌నాక్ యనగా అధిక మాంస లక్షణములు.



లోరెప్పనుండి పెరుగు మాంసమును చూపు చిత్రపటము.

ఇది గ్రొవ్వుతో సమాన ఆకారమగు జీవనరములవలన యేర్పడినటువంటి మాంసవుముక్క వాటి వుత్పన్నమగుచున్నది. మరియు వక ఝిల్లియందు బిగించుకొని పైరెప్పలోపటి వైవు కలిగించుచున్నది. దీని లక్షణము లేమనగా కనురెప్ప మంథమెక్కుట మరియు రెప్ప మంథమెక్కుట వలన కన్నుమూతబడక యెల్లప్పుడు నీళ్ళు స్రవించుచుండుట మరియు యిట్టినమయమునందు తర్జనివ్రేలున్ను మధ్యమవ్రేలుతో పట్టినయెడల రెండువ్రేళ్ళమధ్య ఒకవిశేషవస్తువు యున్నటుల తెలియుట యెంచనకగా యీరోగము కంటిలోభాగములలో అణగిఅంటుకొనియుండును. మరియు దానితో వేరుగా నుండదు. మరియు నిది అటునిటు తిరుగకుండును. రసోలి అనువ్యాధి దీనికి విరుద్ధముగా నుండును. అనగా రసోలి అటునిటు తిరుగుచుండును. మరియు శిర్‌నాక్ కఠినమాంసము నిది రసో-

లివ్యాధిభేదము. ఈవ్యాధిగలరోగి సూర్యరశ్మి మిక్కిలితక్కువగానసహిం చగలుగును. సూర్యరశ్మిచూచినప్పుడు వెంటనె నేత్రములవెంట నీరు స్రవించుచుండును. యీవ్యాధి జలుబు నజులా ప్రకృతిగ వానికి విశేషము వుత్పత్తియగును.

—x—

## సిర్ నాక్ యనగా అధికమాంస చికిత్స.

ఈవ్యాధియందు అవసరానుకూలముగా శరీరమలమును తీసివేయుటకై శిరావేదనము చేయవలెను. మరియు, బనప్షా మాత్రలు మలమును మృధుపరచుటకై ప్రశస్తముగానుండును. మరియు, ముజవర్ కేవలము పక్షిమాంసమును యివ్వవలెను. వాతమును ఉత్పత్తి చేయునట్టి వస్తువులతో దూరముగా నుండవలెను. మరియు, ప్రకృతిని కాపాడునట్టి యత్నములు చేయుచుండవలెను. స్నానము చేయుటవలన లాభదాయకమగును. అనగా మలమును హరించునట్టి మూలికెలను నీళ్ళలోవేసి కాచి ఆకషాయముతో కావడముచేయవలెను. మలమును వెడలించిన తరువాత బానలిఖూశా అగ్బరు నేత్రములలో వేయవలెను. యిందువలన చెమ్మగల మలము హరించిపోవు యీ వుపాయములతో సిద్ధినొందనిచో శస్త్రప్రయోగము చేయవలెను. సాధ్యమగునంతవరకు ఔషధమువలన సదుపాయము చేయుట మిక్కిలి వుచితమగును గాని శస్త్రప్రయోగము వుచితముకాదు. యేలననగా చీల్చుట కోయుటవలన గొప్పభయము కలదు యిందు విషయమై శహారా అస్బాబ్ అను గ్రంథకర్త చికిత్సచేయుట మంచిదని వచించిరి. అనగా యేవిధమైన వ్యాధి అయినను చక్కగా పత్యము చేయుటవలన నష్టపడదు అని వచించిరి. మరియు, అలిఇసాక్ గారి కుమారుడు ఒకమనుజానకు శిరనాక్ వ్యాధి ఉత్పన్నమైనది. మరియు, వైద్యవరులు కష్టము కఠినత్వముతో

దానిని శస్త్రచికిత్సచేయుట చెడుఅనుపాటని గ్రహించి దీని చికిత్స మార్చునట్టి ఔషధము అనగా జరూరె అక్బరు అను ఔషధమును మిక్కిలి వుత్తమమైనదని దీనిని వుపయోగించిరి. యీ జరూరె అక్బరు వలన వ్యాధిహరించి ఆరోగ్యము నొందెను. మరియు, యీ ఔషధము వలన కుదురనిచో శస్త్రముతో యెత్తివేయుట వుత్తమము. మరియు, రెతూబతు స్థలమును మధ్యనుండి వెడల్పుగా చీల్చివేయవలెను. క్రొవ్వు వుండువరకు యిట్లు చీల్చివేయవలెను. శస్త్రము క్రొవ్వువరకు ప్రవేశించని యెడల క్రొవ్వు బైటికి రాజాలదు అనగా యెంతవరకు చీల్చితే క్రొవ్వు బైటికివచ్చునో అంతవరకు చీల్చవలెనని భావము. మరియు బైటికివచ్చిన క్రొవ్వు అలసిముక్కతో పట్టుకొనవలెను. దీని వలన చెయ్యి జారకుండును. పిమ్మట నెమ్మదిగా కుడియెడమవైపులను పైని క్రిందివైపులను త్రిప్పవలెను. దీని వలన మలము యావత్తు బైటికి వచ్చును. మరియు, శస్త్రకర్మ తదుపరి అలిసిముక్కను శిరకాలోనున్న పన్నీరులో నానవేసి చీల్చిన స్థలమునందుంచవలెను మరియు, యీరోగి నేత్రములోనుండి యీ క్రొవ్వుముక్క వేరుతో పెళ్ళగిలి రాక కొంత శేషము మిగిలి యున్నయెడల ఉప్పు మెత్తగానూరి అందుపై చల్లవలెను. దీనివలన శేషించియుండు క్రొవ్వు ముక్క హరించును. మరియు, కొంత నిలిచియున్న యెడల ఒకహాని ప్రాప్తమగును. అనగా ఈ శిరనాక్ వ్యాధియందు విశేషముగా నొప్పితో కూడియుండు వాపును కలిగించును. మరియు, శేషము నిలిచిపోవుచున్నది. నేత్రములు తెరచుటకు ఆటంకము కలిగించుచున్నది. మరియు, శిర్నాక్ ముక్క యుచ్చాను సారముగా తెగిపోయినను యీ కారణమువలన రెప్పయందు కుమ్మకత్వము సంభవించును. క్రొవ్వు రెప్పయొక్క భాగము గాన రెప్ప యిచ్చవచ్చినట్లు మూతబడదు కాబట్టి విశేషముగా క్రొవ్వును కూడా ఛీనివేయకూడదని గ్రహించవలెను.

(సూచనీయము.) యిటుల యేరోగము సంధైనను యీవ్యాధి మధ్యమునంకు విరికి లి బాధగల వ్యాధి కలిగిన యెడల ముందుగా ఆవ్యాధికి చికిత్సచేయుట మంచిది. యీ విధానము అన్ని వ్యాధుల యందు వుపయోగించదగునని గ్రహించవలెను.



## ఇకద్ యనగా పిటికా వర్ణనము



ఈవ్యాధి ముడివలె కంటిపై రెప్పలో కలుగుచున్నది. ఈవ్యాధి వాతసంబంధమగు చిక్కని చెమ్మగల కారణమువలన కలుగుచున్నది. యీ చెమ్మ తలనుండి కంటిరెప్పయందు ప్రవేశించుటవలన దీనిమృదు భాగము నష్టమగుచున్నది. శేషభాగము వలచబడుచున్నది. యిందువలన దీనిని ఇకద్ అనగా పిటికె అని వచించబడియె. ఈపిటికెయొక్క భేదములు మూడువిధములు.

(1) యిది రసోలివలె తిరుగుచుండును. అనగా తనస్థానమునుండి కుడియెడమకున్న పైకిక్రిందకికూడా కదులుచుండును. మరియు పిటిక మంధముగానుండి లోభాగము అంటుకొనకుండినచో యీపిటికెపైనుండు చర్మమును వెడల్పులో చీల్చివేయవలెను. మరియు చీల్చిన చీలిక మధ్యనుండి శస్త్రముతో పిటికెను పైకితీసివేయవలెను. మరియు వెంటనే చివ్వివేయుటవలన దీనిపై చుట్టుకొనియుండు ఝిల్లికనుపించుచుండును. పిమ్మట ఆఝిల్లిని నెమ్మదిగా లాగినఎడల పిటికెనహితము వూడివచ్చును. యిట్లు తీసివేయుటకు సావధానుడై యుండవలెను. మరియు జాగ్రతగా తీసినయెడల ఝిల్లి బ్రద్దలు కాజాలదు. యెటులననగా ఝిల్లి పొర పిటికెపైన క్రమ్ముకొనియున్నది. ఈఝిల్లి చినిగినయెడల చీల్చు

టకు, చివ్వుటకు వ్యవధికాజాలదు. కాబట్టి యీపిటికె పైనుంచుచర్మ ముకూడా వెడల్పునందున్న, పొడవునందుకూడా చీల్చివేసినయెడల పిటికె తీసికొనుటకు సుఖముగానుండును. మరియు లోవల మంధముగా నున్నచో రెప్పపైకివిరిచి రెప్పలోవలనుండి పిటికెగల స్థలమును చీల్చి వేయవలెను. సావధానముతో వృత్తరీతిగా పిటికెవృద్ధికి తీసికొనవలెను. తరువాత జీలకర్ర నమలి బట్టలోవేసి కండ్లలో పిండవలెను. కొంతవరకు రెప్పను స్థిరముగానుంచవలెను. యిటుల యుంచుటవలన రెప్ప పైకి లాగజాలము.

(2) ఈవ్యాధి రాయివలె కఠినముగానుండును. నిది తనస్థానము నుండి కదలకుండును. అనగా యిది కంటితో వేరుగా నుండదుగాన అం దు కలిసి అణగియుండును. యిందువిషయమై శారహాఅస్‌బాబ్ అను గ్రంధకర్త యీపిటిక కురుపువలె నుండునని వచించిరి.

——ఇకరద్ రెప్పలోవలగల పిటిక చికిత్స——

ఈపిటికెను మృదుత్వము కలిగించుటకై వృష్ణోదకము మైనవు అరకు అందుపై వేయవలెను. మృదుత్వము నొందినవెనుక దాఖలిఖూ అను మలాము మెంతులు అవిశిగింజలు నూరి లేపనము చేయవలెను. యీ లేపనాదులవలన యీపిటికె నశించిపోవును. మరియు యీచికిత్సవలన కూడా నష్టపడనియెడల దీనిని చీల్చివేయుట అనుభవము లోహశస్త్ర ముతోను తీక్ష్ణమగు ఔషధములతో చెక్కివేయకూడదు. యెందు కన గా దీనిని ఛేదించుటవలన రోగికి విశేషబాధ కలిగి దుఃఖించుటతప్ప ప్రయోజనముండదు. అనగా యీవ్యాధి వేరుగా తిత్తివలెనుండదు. కాబట్టి దీనికారణమువలన దేనికది లేదిపోవును. మరియు కొద్దిగా శే షించియుండినయెడల దీని శేషమువలన రెండవసారి పిటిక పెరిగివచ్చు ను. అప్పుడప్పుడు వాపుకూడా కలిగించును. మరియు కొందరు వైద్యు లు యీవ్యాధి కారణముగల మలము యావత్తు వెడలినపిమ్మట అప్ప టివ్యాధియొక్క మలము అవశ్యకతానుకూలముగా వెళ్ళిపోయినచో

కత్తెతో కత్తిరించి తీసివేయుదురు. రక్తము స్రవించినయెడల వెంట నే ఆపివేయుదురు. దీనివలన కంటియొక్క రెండవస్థలమునందు ప్రవే శించజాలదు. మరియు రెప్పయందు వాపుకూడా జనించనేరదు.

### (౭) కంటిరెప్ప దుర్మాంస లక్షణము.

ఈపిటిక కంటిపైభాగమునందు ఆక్రమించియుండును. దీనినర ములు నేత్రమునందు నిలిచియుండును. దీనిరంగు వంకాయ రంగువలె ను మెరిసిని రంగుగ నుండును.

### ౭ వ కంటిరెప్పయందు కలుగు దుర్మాంస చికిత్స.

ఈవ్యాధి స్వల్పకాలపరిమాణములో మలమును వెడలించవలె ను. ఇట్లు మలమును తీయుటవలన తిరిగి మలము పెరుగజాలదు మరి యు వాతమును వృద్ధిచేయునట్టి పదార్థములను సేవించకూడదు. వాత మును కలిగించు వస్తువులతో సావధానముగా నుండవలెను. మరియు యేయితరకారణములు యేమియు లేకున్నను దీనిచికిత్స లోహఆయుధ ముతో చేయకూడదు. దీనిని వేరుతో పెళ్ళగించుటకు మిక్కిలి కఠిన మగును. యేలననగా దీని మలము మిక్కిలి పరాక్రమమైనదిన్ని క్షార మైనదిగానుండును. కాబట్టి శస్త్రముతో ఛేదించినయెడల వ్రణము మాన నేరదు. అనగా సరతాన్ (వాపుతోసంబంధమగువ్రణము) యెటుల మాన కుండునో అటులనే యీవ్రణముకూడా మానదనిభావము కాబట్టి శస్త్ర ముతో ఛేదించకూడదు. దీనివలన యేవిధమగు కష్టము రెండవబా ధమువలన విశేషముగా పుట్టిన్నముకాజాలదు.

## శౌరమూన్ యనగా రెప్పలో వెంట్రుకలు మొలచు వా

కొందరు వైద్యులు శౌరమూన్ కలీబ్ శౌరమూన్ జామెద్ అనువ్యాధిని రెప్పలలోపల వెంట్రుకలు మొలుచునట్టివ్యాధి అందురు గాని వీరి అభిప్రాయము సమ్మతిగానేయున్నది. శౌరమూన్ అలీబ్

అనురోగములలో లోరెప్పయందు వెంట్రుకలు మొలచుటకు చెప్పు దురు. మరియు ఆవెంట్రుకల చివరలు కంటిలోపై పుకు తిరుగబడియుం డును. కన్నుతిప్పినప్పుడెల్ల ఆవెంట్రుకల చివరలు లోకంటిగ్రుడ్డుపై గ్రు చ్చుకొనును. యిట్లు గుచ్చుకొనుటవలన కండ్లవెంట నీరు స్రవించు చుండును. ఇట్లు నీరు స్రవించునట్టి కారణమువలన నేత్రము దుర్బలము నొందును. మరియు మలమును గ్రహించునట్టిది అందు ప్రవేశించును. కంటినరములు అనగుట, నీరుకారుట, దురద, కండ్లు మెరసినగుట, మొదలగు లక్షణములు తటస్థించును. శౌరమూ-ఇ-యాద్ అనగా విశే షమగు నీచవెంట్రుకలు రెప్పలోపటిభాగమునందు మొలుచుచున్నవి. యివి లోపునుండి బైటికివచ్చును. యిట్లు యీవ్యాధి రెండువిధములు గా నుండును.

(1) తిన్నగానుండు వెంట్రుకలుమొలచి కంటిలో గ్రుచ్చుకొను చుండును. మరియు, శౌరమూన్‌కలీబ్ అను వ్యాధియందు యేహాని వర్ణించబడినదో ఆలక్షణములు యీవత్తు యిందు ప్రకటనమగును.

(2) వెంట్రుకలు కంటిబైటివైపు మొలుచునుగాని కంటిలో గ్రుచ్చుకొనవు. నేత్రమునకు యేవిధమగుహాని కలిగించవు. వీనివలన నేత్రదృష్టియందు అడ్డుపడి యుండును. దీనివలన రోగి యేవి ధమగు వస్తువు చూచినను కనుపించుచుండును గాని చూచునట్టి వస్తు వులపై నల్లని గీరలున్నట్లు కనుపించును. యిటులనే ఆమనుష్యునికికూడా కనుపించుచుండును. అనగా రెప్పవెంట్రుకలు ప్రమాణముకంటె అధిక మగుచున్నవి. ఆస్థలమునందు ప్రకృతికి విరుద్ధముగా మొలచు చుండును. మరియు ఈరోగముయొక్క కారణము దుర్గంధమగు చెమ్మ వలన కలుగుచున్నదని గ్రహించవలెను. యీచెమ్మ రెప్పయందుండి వెంట్రుకల సమీపమునందు ప్రవేశించుచున్నది. యీకతూబతు అనగా నీరునందు యేపదార్థముచు కలుగకుండును యేలననగాపుప్పదనముకలిగి యున్నచో వెట్రుకలు విశేషముగా రాలిపోవనారంభించును. వెంట్రు కలను మొలవకుండునటుల చేయును.

తెల్లసాన గుల్‌రోగన్ కలిపి వాత వేసిన స్థానమునందు లేపనము చేయ వలెను. అనగా వాతి మానువరకు లేపనము చేయుచుండవలెనని భావము. మరియు ముందు వేసిన వాతయొక్క బాధతగ్గనిదే రెండవతూరి వాతవేయకూడదు. మరియు వెంట్రుకలు పీకివేయనిదే వాతవేయ కూడదు.

మరియు లోరెప్ప వెంట్రుకలు పీకివేసి ఆస్థలమున నవాసాగరము తో రుద్దవలెను. తరువాత సముద్రమునందు నివసించు ఆవుచచ్చురంగు గల కప్పనెత్తురు కుక్కనెత్తురు పక్షుల గుడ్లు మరియు అంజూరపాలు మొదలగు వస్తువులలోనుండి యేవస్తువు సమకూడునో ఆవస్తువు వెంట్రుకలుతీసిన స్థలమునందు మర్దించవలెను. యెందుకనగా యీవస్తువులు వెంట్రుకలు మొలవనియ్యక ఆస్థానమును చెరచి వెంట్రుకల రంధ్రము లను మూసివేయును. మరియు నది యందుండు నురుగు వెంట్రుకలు మొలచునట్టి స్థలమునందు మర్దించినవెనుక ఆస్థలమును చల్లగానుంచి తిమ్మిరి కలిగించును. మరియు యీ చెప్పిన వస్తువులుగాక యిట్టిస్వభా వికముగల ఔషధము లనేకములున్నవి. ఇచ్చట యింతవరకు చెప్పబడి యె. వాతవేయుటకంటె వెంట్రుకలుతీసివేసి ఔషధములు లేపనముచే సి వెంట్రుకలు నశింపజేయుట మిక్కిలి వుత్తమము.

మరియు కుట్టుట, సన్నతలవెంట్రుక తీసికొని ఆవెంట్రుక రెండు చివరలు వకటిగాకలిపి, సూదిలోగ్రుచ్చుకొని మిగిలినవెంట్రుకలో మరియొక వెంట్రుకచేర్చి అనగా ఆరెండవ వెంట్రుకను కూడా పైవిధముగానే ముడుచుకొనవలెను. ఆవెంట్రుకయొక్క కైవారమునందు ఆసూదిలో గ్రుచ్చబడిన వెంట్రుక పడిపోయిన మొదల సూదికొన కంటిరెప్పలోవునుంచి లోరెప్ప వెంట్రుకనవీనావము నందు ఎంతయుచితముగానుండునో అంత బైటికి తీసికొని నలాకుచివరతో లోపలివెంట్రుక కైవారమునందు వెంట్రుక మధ్యనుండునట్లు చేయ వలెను. తరువాత ఆసూదిని నెమ్మదిగా లాగుచుండిన వెంట్రుక కైవా

రము చిన్నదగును అప్పుడు పకేపర్యాయము లాగినయెడల లోవెంట్రుక బైటికివచ్చును. అట్టిస్థితియందు ఆ లోవెంట్రుక ఈవెంట్రుక యొక్క కైవారమునందు తగులుకొని లోపుండి బైటికివచ్చును. ఆవెంట్రుక తనస్థానమునందుపడ్డియెడల రెండవవెంట్రుకలో ఆముందు వెంట్రుకయొక్క కైవారమునందు చేర్చినరెప్ప వెంట్రుకను లోపల వైపు లాగుకొని రెండవదఫా సూదిఅంటించునట్టి అవశ్యముకలిగినచో ముందున్నస్థలమునందు సూదిని గ్రుచ్చకూడదు. యెందుకనగా రంధ్రము విశాలమగును. మరియు లోవెంట్రుక అందు అణగి యుండును. యిందువలన రెండవతూరి ముందుస్థలముతో సమానముగా సూదిని అంటించి లోవెంట్రుకను బైటికి తీసికొనవచ్చును అప్పుడు దానిని అసలు వెంట్రుకతో చేర్చి పిమ్మట మందు సూదితీయునట్టిరంధ్రము సలాకుతో అనేక పర్యాయములు రుద్దుచుండవలెను. యిందువలన లోవెంట్రుకలు అందు చిక్కని నిలిచిపోవును. మరియు, ఇట్లుకట్టుటకు అరబ్బిభాషలో నజుమ్ అందురు.

(సూచన) ఆవెంట్రుకలుగల స్థలమునందు సన్నని పట్టుదారము వుపయోగించవచ్చును. మరియు, యీవెంట్రుకలను కట్టేవిషయమై శారహాఅన్‌బాబ్ అను గ్రంథకర్త యీక్రిందివిధముగా వచించెను. అనగా యిందు వుచితమైనచో లోవెంట్రుకలను సూదిరంధ్రమునందు గ్రుచ్చి రెప్పబైటికి తీయవలెను. మరియు యిట్లుతీయుటకు లోవెంట్రుకలు పెద్దవిగానుండవలెను. మరియు రెప్పను అట్టిస్థితియందు కోసివేయవలెను. అనగా లోవెంట్రుకలు విశేషముగా నుండినయెడల రెప్పనుకోసి వేయవలెనని భావము.

రోగిని వెల్లికిలపరుండబెట్టి వైద్యుడు తన బొటనవ్రేలు, తర్జనీవ్రేలుతో పైరెప్పను పట్టుకొని పైకెత్తి సలాకుయొక్క ముఖము రెప్ప వెనుకవైపుంచి అణచవలెను ఇట్లు అణచుటవలన రెప్ప వెనుకకు విరుగును. తరువాత మూడు సన్నదారములు సన్నని సూదులలో గ్రుచ్చి

కొని ఆసూమలను రెప్పకోపటకుంచి రెప్పపై వైపుకు బైటికితీసికోవలెను. అనగా రెప్పమధ్యనుంచి తీయవలెను. యిట్లు దారములతో తీయుటకంటె రెప్పను ఆయుధములతో యెత్తుకొనుట మిక్కిలి మంచిది. మరియు రెప్పను దారములతోగాని, ఆయుధములతోగాని యెంతవరకు రెప్పను ఛేదించవలెనో వూహించి యింతవరకు తీయవలెనని తనకు తోచినయెడల సూదిని దారమును ఆస్థలమునందు మూడుఛిద్రములు చేసి కత్తెరతో కత్తిరించవలెను. యింతవిషయమై రెప్పతప్ప మరియేయితర భాగము తెగకూడదు. మరియు కత్తిరించినతరువాత సూదితో మూడు చోట్ల మూడుకుట్లువేయవలెను. అనగా టాకాలు ముడివేయవలెను. ముందు మధ్యభాగములు టాకావేశి తదుపరి జరూక్ అజఫర్ ఫాళాస్త్రి అవియజ్ లో కలిపి కుట్టుపై లేపనము చేయవలెను. మరియు రెప్పయొక్క తంతువులు తెగకుండునటుల వైద్యుడు మిక్కిలి జాగరూకుడై రెప్పను కత్తిరించవలెను. మరియు రెప్పను కదులుచుండునటుల చేయు నరములు తెగుటవలన రెప్పఆడుటకు కష్టము సంభవించును. కాబట్టి రెప్ప నరములు తెగకూడదని భావము. కాబట్టి ఈశస్త్రకర్మ విషయమై గొప్ప నిపుణతగల బుద్ధిమాన్ క్రియాకుశలతగల వైద్యుడు అవసరము వచ్చినప్పుడు కత్తిరించవలెను. మరియు రెప్పకత్తిరించుటకు రెండు విధానములను చెప్పుచున్నాను. అనగా కనురెప్పను రెండువ్రేళ్ళతోగానిలేక రెండు ఆయుధములతోగాని కొద్దిగా యెత్తి మిక్కిలి సునుపుగా తయారు చేయబడిన రెండు పుక్కరేకులు రెప్పతో సమానముగాచేసి యెంతవరకు రెప్పతీసి వేయవలెనో నిదానించి ఆరెండు రేకులమధ్య అణచి ఆ రెండు రేకులచివర్లు కట్టివేయవలెను. అనగా ఈరెండురేకుల మధ్యనుండి కంటిరెప్ప చర్మము బైటికివచ్చునటుల బిగించి కట్టవలెనని భావము. యెందువలననగా రెప్పయొక్క మాంసము బద్ధలమధ్య రాజాలదు. చర్మముమాత్రమే పైకివచ్చును. యిటుల కట్టుటవలన ఆచర్మము పది దినములలోగాని అంతకు తక్కువరోజులలోగాని నిర్జీవముగలదై కుళ్ళి

ఊడిపోవును, గాని వ్రణచిహ్నములు కలుగనేరవు. అయినను రోగి యీ చికిత్సకు నోర్వజాలడు.

మరియు, శస్త్రమును చూచుటవలన శస్త్రకర్మ అను శబ్దము వినుటవలన భయమునొందిన యెడల అట్టిరోగియొక్క రెప్పలను తీక్ష్ణమగు ఔషధములతో కోసివేయుట మిక్కిలి వుత్తమము. మరియు, తేజస్సుగల ఔషధముల కనికెలతో రెప్పను కోసివేయవలెనని వూహ కలిగినచో ఆ స్థలమునందు లేపనములు చేయవలెను మరియు, మెంతి ఆకువలె కలిగి. చర్మము యుబికియుండును. వ్రణచిహ్నములు సూచించబడును. అట్టితరి ఔషధములతో ఆవ్రణమునుమాన్పవలెను. మరియు, కొంతకాలము నిధానించి తిరిగిఔషధము లేపనము చేయవలెను. తదుపరికొంతకాలము వ్యవధిగాయుంచవలెను. యిటులఅనేకపర్యాయములు తీక్ష్ణమగుఔషధమును లేపనము చేయుచుండవలెను. అనగా వ్రణమైన తరువాత వదలివేసి వ్రణము పక్కుకట్టి మానిన యెడల ఔషధమును కడిగి మైనపుఅరకు వేయవలెను. దీనివలన రెప్పయందుగల పొక్కు వూడిపోవును. మరియు, అవశ్యమైనచో సఫేదాతో చేయబడిన పాలాస్త్రి వేయవలెను. దీనివలన కఠినముగానుండు రెప్ప స్వాశ్చత నొందును. మరియు, ముందు వైద్యులనేకులు యీ చికిత్సకు ఆజ్ఞ యిచ్చియుండలేదు తీక్ష్ణమగు ఔషధములను లేపనము చేయునట్టి విధానము అనగా సున్నము, సజ్జాకారము ఒకభాగము, సబ్బునీళ్ళు రెండుభాగములు నవాసాగరము ఒకభాగము, పాపడీలవణము ఒకభాగముయీనాలుగు వస్తువులనునూరి వస్త్రగాలితముపరించి సబ్బునీళ్ళలోనూరి కనికెలుచేసియుంచవలెను. లేక చంటిపిల్లల మూత్రముతోగాని, బూడిదె నీళ్ళతోగాని నూరి కనికెలు చేసికొనవచ్చును.

రోగినేత్రమునందు వెంట్రుకలు విశేషముగా లేనియెడల వెంట్రుకలు వాటిస్థానమునందే అనగా రెప్పయందు వెంట్రుకలుండు స్థలమునందేయుండి ఆవెంట్రుకలచివరలు మాత్రము లోభాగమునకు

తిరిగియుండినచో ఆవెంట్రుకలను అనగా వంకరగానుండు వెంట్రుకలను చక్కగానుండు వెంట్రుకలతో చేర్చవలెను. ఈవెంట్రుకలను చేర్చు విధానము ఇంతకుముందే వర్ణించియుంటిని. మరియు ఆవెంట్రుకల స్థలమునందు వాతవేయుట రెప్పను కత్తిరించుట మొదలగు పనులు చేయుటకు వీలుకాదు. యేలననగా యీరెండు విధములగు వెంట్రుకల విషయమై ముఖ్యమగును పరీక్షయందు దీనిని వర్ణించియున్నాను.

మరియు హాకీము జాలీనూస్‌గారు వచించినదేమనగా చిన్నచిన్న గవ్వలు అనగా ఆలిచిప్పలుకాల్చి నూనెలోకల్పి లోపైపుకు తిరిగియుండు వెంట్రుకలకు అథవా రెప్పలోపటి వెంట్రుకలకు లేపనముచేయవలెను. అనగా వెంట్రుకలుతీసిన తరువాత లేపనము చేయువలెను. ఇటులచేసినయెడల తిరిగి వెంట్రుకలు మొలువజాలవు గాన వైద్యోత్తములు యీదువిషయమై జాగరూకతవహించి సాధ్యమైనంతవరకు ఔషధచికిత్సవలన నేత్రవ్యాధులను మాన్పుట మిక్కిలి ప్రశస్తమని నా అనుభవమువలన యిందు చెప్పుచున్నాను.

## రెప్పవెంట్రుకలు రాలిపోవు వ్యాధి లక్షణము.



రోగమునకు నాలుగు కారణములు గలవు. (1) యీస్థానమునందు పుష్టికలిగి అందుపిత్తము వాతము కలియుటవలన రెప్పలయందు తేజస్సము ప్రవేశించి అచ్చటి స్థితిని చెరచి రెప్పవెంట్రుకలు రాలిపోవును. అనగా రెప్పవెంట్రుకలను పుట్టించునట్టి మలమును నష్టపరచును. ఇట్టిస్థితియందు రెప్పవెంట్రుకలు వూడిపోవును. మరియు విశేషముగా రెప్పయందు దుపద్రవము కలుగును. అనగా యావత్తు శరీరమునందు వుపద్రవము కలిగినయెడల శరీరమునందుగల యావత్తు వెంట్రుకలను చెరచును. మరియు కొందరు సర్వశరీరమునందు మలము చేరియున్నను

ఆమలసారము కను రెప్పయందేగాక యితరఅవయవములలో ప్రకటనమై నను ఆఅవయవములయందుగల వెంట్రుకలు వూడనేరవు. యెందుకన గా కంటిరెప్ప మృధువుగను లఘువుగా నుండునట్టి కారణమువలన మల సారమును వెంటనే గ్రహించగలుగుచున్నది. దీని చిహ్నములు దోష ములనుండి ఒకదోషము విశేషత్వముయొక్క చిహ్నములు ప్రకటన మగును. మరియు మంట, దురద, వంభవించును.

## రెప్ప వెంట్రుకలు వూడిపోవుటకు చికిత్స.

ఏదోషమువలన యీవ్యాధి కలిగినదో ఆదోషానుకూలముగా మలము వెడలించవలెను. ప్రకృతిస్థిరపరచునట్టి నుపాయములను చేయ వలెను. యేవస్తువు రెప్పలను బాగుచేయుగలదో ఆవస్తువులను సురుమా వలె నేత్రములలో నుంచవలెను. అనగా రాజావర్తము కావిరాయి చుహారాగింజలు కాల్చినమసి గవ్వపలుకుసాంబ్రాణి కాటుక కినూర్ సి నోవర్ (లిఖ్ బెరడు) జరామూగసి మొదలగునవినూరిన చూర్ణము సురు మావలె వుపయోగించవలెను.

## 2 వ. రెప్పవెంట్రుకలు ఊడువ్యాధి లక్షణము.

రెప్పలను యీడ్చునట్టి శక్తిదుర్బలమునొందునట్టి కారణమువల న రెప్పలయందు బలము చేరకుండును. కాబట్టి రెప్పల వెంట్రుకలు విశే షముగా వూడిపోవును. మరియు హేతువుయొక్క వుపాయము చేయు వరకు వెంట్రుకలు మొలవకుండును. అనగా యేచెట్టునందు నీళ్లుప్రవే శించకుండునో ఆటులనే హేతువుయొక్క వుపాయములు లేకుండిన వెం ట్రుకలు స్థిరత్వము నొందవని భావము. మరియు దీని చిహ్నములు వూర్ణనర్సాంవ్యాధియందున్న మాగియు వ్రిబలమగు జ్వరమును వుత్ప త్తి చేయుచుండును.

## 2వ. రెప్పవెంట్రుకలు వూడుటకు చికిత్స.

ఈవ్యాధియందు నీడ్చునట్టి శక్తిని ప్రేరేపించునటుల నుపా యములు చేయవలెను. శరీరమునందు శక్తిహెచ్చుటకై మంచిభోజన

ములను భుజించవలెను. మరియు, స్నానముచేయుచుండవలెను. మల మును వెడలించుటకై యావత్తు వస్తువులతో సావధానముగా నుండవ లెను. చెమ్మను కలిగించునట్టి వస్తువులను అవశ్యముగా వుపయోగించ వలెను. మరియు, నేత్రములవెంట నీరుస్రవించకుండునటుల కాపాడు నట్టి వస్తువులను నేత్రములలో వేయవలెను. కాబట్టి రెప్పమూలము నందు వృష్ణము ప్రవేశింపజేయునట్టి వస్తువులున్ను వుష్టినికలిగించునట్టి వస్తువులు అనగా ఖానలిఖాన్ కోహాలా రోశనాహి మొదలగునవి వుప యోగించవలెను.

కోహాలా రోశనాహి విధానము

తాంమ్రభస్మము, శాతనజ్ మగసూల్, యివిప్రత్యేకము 17½ మాషములు, మిరియాలు, పిప్పళ్ళు, కుంకుమపువ్వు, చేదువుచ్చకాయ గుజ్జు యీవస్తువులు ప్రత్యేకము 1½ మాషములు, జింగాలవచ్చ, మూసాంబరము, బూరెఇరమని యివి ప్రత్యేకము 3½ మాషములు, వెండి మలినము 7 మాషములు యీపదివస్తువులు మెత్తగానూరి వస్త్రగా లితమొనర్చి జాగ్రత్తతో యుంచుకొని వుపయోగించవలెను.

(3) కఫమువలన రెప్పవెంట్రుకలు వూడువ్యాధి లక్షణములు.

చెమ్మ విశేషముగా రెప్పల మొదళ్ళయందు ప్రవేశించి రెప్ప లను నీర్సముగను నచ్చును కలిగించును. మరియు, రోమకూపములను విశాలముగాచేయును. యీకారణమువలన రెప్పలయందు వెంట్రుకలు, మొలవకుండును. మరియు, విశేషముగా వూడనారంభించును. యీ మొదలగు లక్షణములు కఫమువలన కలిగినవని గ్రహించవలెను.

(3) కఫమువలన రెప్పవెంట్రుక లూడుటకు చికిత్స

కఫమును తీసివేయుటకై అయారజ్ మాత్రలు యివ్వవలెను. మిక్కిలి పరిశ్రమచేయుట, నిద్రమేలుకొనుట, స్వల్పముగాభుజించుట, శుష్కత్వమును కలిగించునట్టి వస్తువులను శేవించుటవుచితము. మరియు నేత్రములనుండి నీరు స్రవింపజేయునట్టి అనగా అహామ కెహాజ్ మరియు

ముంజగడ్డి నేత్రములలో ప్రయోగించవలెను. యిందువలన ప్రధాన అంగమునందుండి రతూబతు అనగా నీరు వెడలిపోవును.

(4) రెప్పవెంట్రుకలు ఊడు వ్యాధిలక్షణములు.

రెప్పయందు బలమును చెరుపు వుపద్రవము కలిగినయెడల ఆ వుపద్రవము బంధించబడును. యింక రెండు సందర్భములు కలవు. (1) ప్రబలమగు దోషము రోమాంచములయందు అణిగిపోవును. యిది రోమముల మొదళ్ళను చెడిచివేయును. ఆదోషము ఆహారరసధాతువుల యొక్క మలము వెంట్రుకలను బుట్టకుండునటుల బంధించును. మరియు ఈవ్యాధి దావుస్సాలిబ్ రోగము యొక్క భేదమగును. దీనివలన తల వెంట్రుకలుకూడా వూడిపోవుచుండును.

4 వ నేత్రరెప్పల వెంట్రుకలు వూడుటకు చికిత్స.

ఈవిషయమును నిదానించి చూడవలెను. అనగా కఠినదోషము వాతమువలన కలిగినదా లేక కఫమువలన కలిగినదా లేక హీనమగు రక్తమువలన కలిగినదా లేక నీచమగు పిత్తమువలన కలిగినదాయని ఆలోచించి చూడవలెను. మరియు పైదోషములలో నిర్మలమగు రతూబతు అనగా నీరుకలిసినను మరియు ప్రత్యేక కారణముయొక్క నిజదశ రెప్పలనుండి గ్రహించవచ్చును. ప్రత్యేకమగు చిన్నెములు దీనికి సాక్షియగును యిటుల విశేషముగా వర్ణించబడియున్నది. తరువాత దోషము యెటులయుండునో ఆదోషానుకూలముగా మలమును తీసివేయవలెను. దోషము తొలగించిన వెనుక లేపనమువలన దావుస్సాలిబ్ యొక్క ప్రతిభేదమునందు వ్రాయబడియె. వానిని లేపనము చేయవలెను. లేపనముచేయు కారణము నష్టమునొందును. మరియు ఆరోగ్యము ప్రాప్తించినచో యీక్రిందవివరించిన వస్తువులు నేత్రములలో వేయవలెను, అనగా ఈవస్తువులు వేయుటవలన రెప్పలలో వెంట్రుకలు మొలచును.

(2) బలము చేరకుండుటకు కారణమేమనగా రోమాంచములు స్ఫోటకమువలనగాని, గాయము మానుటవలనగాని, అగ్నివలనకాలి

లకు చైతన్యము కలించును. ఇందువలన రోగములను పూర్తిగా వెడలి పోవును కాబట్టి ఔషధసారమును వెంటనే గ్రహించగలదు.

మరియు, మలమును వెళ్ళవగచి తీసివేయుటవలన లఘువు మృదుత్వమును నష్టపరచునట్టి ఔషధములతో మలసంబంధమగు మూలమును వెళ్ళగించగలిగిన యెడల శస్త్రముతో గంట్లు వేయుట, గీరుట మొదలగు చికిత్సలయందు అవశ్యముగా సావధానుడై యుండవలెను. అవసరమందు నయమగుటకై యివి అవశ్యమగును. మరియు, ప్రాచీనవైద్యులు గీరుటకు ఆజ్ఞయిచ్చియున్నారు. మరియు యీవిధమగు రోగమునందు ముఖ్యమగును. దీని మలము ఝిల్లి పైభాగమునందు నిలిచియుండును గాని చుట్టబడియుండదు.

(౨) రెప్పలలోపల తీక్ష్ణదోషము దుర్గంధపరమాణువులతో చేరి తలయందు చిన్నచిన్న గింజలవంటి గుల్లలను కలిగించుచున్నది. అప్పుడప్పుడు ఆ ఆవిరిపరమాణువులు కరిగిపోవునట్టి కారణమువలన అందు పుప్పదనము ప్రవేశించును. ఈకారణమువలన యీవిధమగు దురద పొక్కులు కలుగుచున్నవి. ఇందువలన దీనిని హాస్పి అందురు. హాస్పి అనగా ఒకవిధమగు గుల్ల (నిది చెమటకాయవలె నుండును.) యివి చర్మముపై బైరుదేరును. వీటిపరిమాణము లఘువుగా వలచగా నుండు చర్మము రెంటిపైనుండి పొక్కువలెలేచును. అట్టితరి యీరోగమునకు చాలాకాలము గతించిపోవలెను. మరియు చికిత్సచేయుటలో సుస్తి ఆలక్ష్యముచేసినయెడల దమాంవ్యాధి పుత్పన్నమగును. మరియు కంటిగ్రుడ్డునందు దీని దుర్గుణము ప్రవేశించును. కంటినరములు యెర్రగానుండును. కాబట్టి యీకారణమువలన తుమీమ్మజ్ కుమారుడు వచించినదేమనగా కంటి దురదయందు నేత్రసంబంధమగు నరములు నిస్సందేహముగానుండునని వచించిరి.

**హాస్పి అనగా చెమటకాయలవలెనుండు గుల్లలచికిత్స.**

**సరేరు అను నరమును ఛేదించి రక్తమోక్షణమును చేయవలెను.**

మరియు పాటీలీగె కషాయముతో మలమును తీసివేయవలెను. కేవల ము లఘువగు మంచి భోజనములు భుజించవలెను. అనగా యీవ్యాధి ఝిల్లియొక్క పైభాగమునందు కలుగుచున్నది. గాని రెప్ప యావత్తు ఆక్రమించియుండదు. ఇందువలన దీనియందు దురద వుదితము కాజా లదు. యెందుకనగా నహేరా అజ్బాబ్ అను గ్రంథకర్త దురదవలన పొర చినిగిపోవును. కనురెప్ప చెడిపోవును. ఇటులనే యీరోగమునందు మలమును తీయుటకు ముందు మిక్కిలి తీక్ష్ణమగు శియాఫ్ నేత్రముల యందుపయోగించుట వర్జించవలెను. మలమును తీసిన తరువాతకూ డ హానికరమగును. అనగా నహేరా అజ్బాబ్ గ్రంథకర్త మందులతో చేయబడిన కనికెలయొక్క తీక్ష్ణత్వమువలన నొప్పిఅధికమగును.

మరియు రెప్ప లోభాగమునందు మలమును విశేషముగా నీడ్చు చున్నది. కాబట్టి విశేషముగా వాపు జనించుచున్నది. లేక వ్రణము కలిగి చికిత్స చేయుటకు మిక్కిలి కష్టముగానుండును గాన అన్నిటికంటె నుత్తమ నుపాయమేమనగా ఔషధములతో తయారుచేయబడిన కనికె లులేనియెడల ఆఔషధము యుపయోగించి పిమ్మట బరూద్బనఫ్సజి అనగా చల్లని సురుమా నేత్రములలో వేయవలెను. మరియు వుష్ణమగు ఔషధములు నేత్రములలో వేయుటవలన కలిగిన వుష్ణము శాంతించి నేత్రప్రకృతి తన నిజదశయందు స్థిరపడును. గాన యీవిషయమును జ్ఞాపకముంచవలసిన అంశమనిరి.

(సూచనీయము) బహుశ, యీవిధమగు మలము రెప్పలలో వల యెందువలన పేరుకొందబడిన అచ్చటి వుష్ణఆవిరి పరమాణువులతో వుత్పత్తియగుచుండును. మరియు వుష్ణసంబంధమగు ఆవిరి ప్రకృతియం దు పైభాగమునందు కలుగుచున్నది. ఇందువలన ఆవిరి పరమాణువులు నేత్రావర్ణమునందు తమకు తాము నిలువజాలవు. కారణమేమనగా యీవ్యాధియందు కనురెప్ప లావుగను వుబ్బినట్లుండదు. నిస్సందేహ ముగా నిది వుష్ణమువలన కలుగుచున్నది.

## బరూద్ బసఫ్నజి చేయు విధానము

కాశ్మీరదేశపు బనప్షాపూలు, ధనియాలు, తుమ్మజిగురు, కతిరా, యివి ప్రత్యేకము తిన్నగ మాషములు గోధుమసత్తు 10న్నర మాషములు యీపైని వస్తువులు చూర్ణించి వస్త్రగాలితమొనరించి శిరకాలో నైదు భావనలు చేసి యెండించి తిరిగి అయిదు భావనలుచేసి తదుపరి నూరి యుంచుకొని సమయానుకూలముగా యుపయోగించుకొనవలెను. మరియు బరూద్ అనగా నేత్రసంబంధమగు ఔషధములను ద్రవపదార్థములలో భావనచేయుటకు అర్థము.

ఈరోగమునందు కంటిరెప్పలోపల అంజూరుపండునందుండు గింజలవలె కురుపులులేచును. మరియు, కొన్నిగుల్లలు చితికియుండును. యీగుల్ల మొదలు గుండ్రముగను పైభాగము సన్నముగానుండును. ఇందువలననే యీ గుల్లను దానేతిబనీ అనగా అంజీరగింజయని పేరుతో ప్రసిద్ధినొందినది. మరియు, యూనాన్ దేశస్థులు అంజూరపండ్లకు సొకూసీస్ అందురు. మరియు, సరాఫయూన్గారి కుమారుని పేరు తిబిని గాన అంజీరునకుకూడ యీనామము కాబట్టిదీని పేరుకలిగినది. ఎటులననగా అంజీరపండులో పైపు ముక్కలు ముక్కలుగానుండును అటులనే యీ దురదగల రెప్పయందు వుత్పన్నమగును గాన రెప్పకూడా అంజూరపండువలె చినిగినటుల కనుపడుచుండును మరియు, కొందరు వైద్యులు దీనికి పేరుపెట్టుటకు కారణము రెప్పలోపల బిద్దలగుటకు అంజూరపండు చర్మము బిద్దలగుటకు సమానముగానుండునని పోల్చుచున్నారు. అభిప్రాయమేమనగా ఈరోగము అన్నివ్యాధులకంటె క్రూరమైనది. మరియు, చెడురక్తము దగ్ధమగుటవలన యీ రోగము వుత్పత్తియగుచున్నది. సహారా అజ్బాబ్ గ్రంధకర్త యీవ్యాధి క్రూరమైనదని చెప్పిరి. అనగా నిది మిక్కిలి గరి, మంధము, కఠినత్వము, కలిగించును మరియు, నిది కొంతకాలమువరకు నిలిచియుండును. దీని మూలము శరీరమునందు విశేషముగా యుండునని వచించిరి.

(3) కను రెప్పలయందు గుల్లల చికిత్స

ఈవ్యాధియందు శిరావేదనము చేయవలెను. మరియు, మలమును తీసివేయుటకై మతబూద్ అఫ్తీమూన్ కషాయమును పానము చేయవలెను. మరియు, యీ రోగమలము మిక్కిలి చిక్కగానుండును గాన అనేకపర్యాయములు మలము తీసివేయవలెను. మలము యావత్తుశరీరమునుండి హరించిన వెనుక శియాఫ్ అహమరెహాద్ యెల్లప్పుడు నేత్రములలో వేయుచుండవలెను. మరియు, మిస్రితతధా వదాగా అను లోహశస్త్రముతో నెమ్మదిగా చెక్కివేయవలెను. యిట్లు చిక్కిన యెడల రెప్ప తననిజదశయందు మారును. మరియు, శస్త్రముతో చెప్పిన తరువాత శియాఫ్ అబియజ్, శియాఫె అయార్ మరియు, దీజజ్ మొదలగునవి నేత్రములలో వేయవలెను. యీ ఔషధములవలన వ్రణము శాంతినొందును. చెక్కినట్టి కారణమువలన రెప్ప గాయమైన యెడల ఆవ్రణమును మాన్పవలెను. మరియు వదగా అను శస్త్రముకలదు. దీని తల దీనార్ అనగా పామువడగవలెనుండు లోహముతో చేయబడిన శస్త్రమునకు వదగా శస్త్రమందురు.

4 కను రెప్పలయందు గుల్లల లక్షణములు.

ఇదినల్లగానుండి దీనిపై పొక్కుకట్టియుండును. మరియు యీ రోగము పైమూడువ్యాధులకంటె మిక్కిలి అసాధ్యమైనది. యీవ్యాధి మలము సులభముగా వెడలనేరదు. యీ మలమును నశింపజేయుటకు చాలావ్యవధియగును. ఈమలము వాతసంబంధమలము కుళ్ళి అచ్చట వుపద్రవము కలిగించును. మరియు యీరోగమునకు యూనాని దేశస్థులు తూత్ హసీన్ అనగా నీచమైనదని భావము.

4 వ. రెప్పదురద చికిత్స.

వాతమును హరించునట్టి ఔషధములతో శరీరసంబంధమగు మలమును తీసివేయవలెను. మరియు యారజాత్ మాత్రలతో మెదడునందుగల మలమును తీసివేయవలెను. మరియు శ్రేష్ఠమగు లఘుభోజనము

లను ఇప్పించవలెను. అంజూర ఆకులతోగాని లేక ఆయుధముతోగాని చెక్కవలెను. చెక్కునట్టి యుపాయములు ముందు వ్రాయబడియున్నవి. వాటిని ప్రయోగించవలెను.

## వదా౯ అనగా వడగళ్లువలె పేరుకొని యుండు నీరు లక్షణములు.

ఇది చిక్కని రతూబతు అనగా నీరు. ఇది రెప్పలోపల ఖసీఫ వించి చిక్కబడుచున్నది మరియు నిది శుష్కించుచున్నది. కాబట్టి వద౯ అను నామమిడిరి. వద౯ అనగా అరబ్బిభాషయందు వడగండ్లకు అర్థము. మరియు యీవ్యాధి రెప్పయందు కలుగుచున్నది. యిందు పీకు, మంట, వుత్పత్తియగునట్టి మలము కలిగించుచున్నది. ఒకప్పుడు యిందు నొప్పికూడా వుత్పత్తియగును. ఒకప్పుడు దురదకలుగును. అట్టి స్థితియందు గీరుకొండిన రోగికి హాయిగానుండును.

### వడగండ్లవలె రెప్పలో పేరుకొని యుండు నీరు చికిత్స.

ఈరోగము రాయివలె కఠినముగా నుండును గాన ఆమలమును పక్వమొందించుటకై మెంతిపిండి అలిసింజలపిండి రెప్పపైవేయవలెను మరియు రాతిపువ్వు గండపేరోజా మరియు సకుగుల్ వతన్ మొదలగు వ నివి శిరకాలోనున్న జైతూన్ తైలమునందున్న కలిపి లేపనము చేయవలెను. ఈ మొదలగు వుపాయములవలన వ్యాధి హరించనియెడల శస్త్రప్రయోగముచేయవలెను. అనగా శస్త్రముతో రెప్పను నలాకు యొక్క వెడల్పుమొననుండి రెప్పయందుండు చిక్కనినీరు బైటకితీసి వేయవలెను. యేటులనగా నిది అంగమునందు ప్రవేశించిమాత్రము యుండుటలేదు గాని దీనికంటె వేరుగానున్నది. అప్పుడు తీసివేసినయెడల గాయము మానుటకై జరూరెఅజబీర్ వేయవలెను. మరియు యీకో త్రవణము పెద్దదైనచో మధ్యనుండి కట్టివేయవలెను. దానిపై జరూరె

అజఘర్ చల్లవలెను. మరియు యీరోగికంటిలో చిక్కనినీరు గట్టిపడి రెప్పలలో యున్నచో కన్నురెప్పనువిరిచి వెలుపలనుండు చీల్చి తీసివేయవలెను. తదుపరి నేత్రములను వేడినీళ్ళతో కడుగవలెను.

## కనురెప్ప మందమై కఠినముగానుండు లక్షణములు.

రెప్పలు కఠినముగానుండుటకు తాత్పర్యమేమనగా నేత్రములు మూసికొనుటకు కఠినముగానుండును. నేత్రములు యెర్రగా నొప్పి కలిగియుండును. ఈవ్యాధిని అరబ్బీభాషయందు హసాల్ అందురు. మరియు రెప్పలు మంధమగుటకు యిచ్చట అర్థమేమనగా పైరెప్ప లోభాగము మంధముగానుండును. దీనిని దురద అనిభావించవలెను. అట్టిస్థితియందు రెప్పను విరిచిచూచిన యెడల ప్రత్యేకమగు వస్తువుయున్నటుల కనుపించదు. ముఖ్యముగా రెప్పమంధము విశేషముగానుండును. ఈ విషయము కఠినత్వమునకు విరుద్ధముగా నుండును. ఒకప్పుడు క్రిందిరెప్పయందుకూడా వాపు కలుగును. ఒకప్పుడు పైరెప్ప క్రిందిరెప్పలయందుకూడా మంధమగును. మరియు, యీ రోగకారణము ఆవిరివలన యెండిన పరమాణువులు విశేషముగానుండి యీ పరమాణువులవలన కఠినత్వము వుత్పన్నమగుచుండును. యీ ఆవిరి పరమాణువులు మిక్కిలి శుష్కించియుండును. యీపరమాణువులు రెప్పలను మంధము కలిగించును. మరియు, నివి రెప్పలయందుగల చెమ్మను గ్రహించుకొనుచుండును. మరియు, యీ ఆవిరి పరమాణువులలో మంటకలిగియుండదు. లేకున్నను రెప్పలయొక్క అంచులు మంధముగను యెర్రని రంగుకలిగియుండును గాని యీ అంశమువలన యీ రోగకారణము వుత్పత్తియగుచుండును. ఇట్లు కలుగు యీ రోగము నాలుగు విధములుగానుండు

(1) కదలుపట్టి చలనమువలన రోమకూపములు విశాలమునొంది చెమట బైటికి వచ్చిన సమయమునందు ఒకేపర్యాయము చల్లనిగాలి చల్లనినీళ్ళు కనురెప్పలకు తాకుటవలన ఆవిరి పరమాణువులు పలచగను లఘుత్వమునొంది రాశ్చయించును. అట్టితరి చర్మము క్రింద నిలిచి పోవును మరియు, బైటికివచ్చుటకు ఆటంకము తటస్థించును. మరియు ప్రత్యక్షముగా చల్లని రోమాంచములను బంధించునని యిందు విషయమై ప్రకటనమగుచున్నది.

(2) ఈవ్యాధి నిద్రనుండి లేచినతోడనే కనురెప్పలలో భారము గను మాంద్యముగానుండినటుల తోచుచుండును. ఈరోగము ఆవిరిపరమాణువులు మేలుకొని తిరుగుచుండుట మేలుకొని యుండుటవలన పక్వ మొందుచుండునని నిద్రించునట్టి దశయందు పక్వమొందకుండుటవలన విశేషమై తలవైపునకుయెక్కి మెదడునందుబాధించబడును ముఖ్యముగా చలికాలమునందు రాత్రిభాగములో యీఆవిరిపరమాణువులయందు మరధము రోమాంచములు శుష్కించుట తటస్థించును.

(3) ఈవ్యాధియందు దురదగల మలము చిక్కపరచును. ఆమలమునుండి మృదువగు తేలికె భాగమునందు పుప్పదనముకలిగి పచనమై విశేషమగు భాగమునందు పుప్పలేక యుండును. శేషభాగమునందు క్షౌరమొండును.

(4) ఈవ్యాధి నేత్రివాపువలన కలుగు మలమునుండి కలుగు చున్నది. యెటులననగా దీనిచికిత్సయందు ఆరెప్పపై చల్లని పట్లువేయ బడుచున్నవి. ఈమలమునందుగల చిక్కదనము రోమాంచములను శుష్కింపునటులచేయును.

కనురెప్పలు మందమగుటకు చికిత్స.

ముందుగా మలమును పక్వపరచునట్టి కషాయములతో మలము ను పక్వపరచి ఆతరువాత పాచిలీగె కషాయమునందు కాబోలు కరక్కా యలుచేప్పు కాది బాబూనా అకలీలుల్ మలిక్, బనఫ్షా, ఖత్మిఆకులు

మొదలగునవి కషాయముకాచి ఆకషాయపు ఆవిరియందు తలనుంచి ఆవిరి పట్టించవలెను. దీనివలన రోమాంచములు వికసించును. మలము మృదుత్వమొంది వలచబడి సహజముగా వెడలిపోవును. మరియు మలము వెడలినవెనుక నేత్రములను చేతితో రుద్దవలెను. ఇట్లు రుద్దుట వలన రోమాంచములయందు వృష్ణము ప్రవేశించి రోమాంచములను వికసింపజేయును. గాన నిస్సందేహముగా కండ్లు రుద్దుట యీవ్యాధియందు ప్రకటనమైనది. మరియు రెప్పలయందు ఘనీభవించియున్న ఆ ఆవిరిపరమాణువులను నసింపజేయును. ఈకారణమువలన నిద్రలేచిన వెంటనే నేత్రములు రుద్దుకొనినవెంటనే లఘుత్వము కలుగుచున్నది. మరియు హాసావుల్‌అజ్ఫాగ అనగా రెప్పలు యెర్రనై నొప్పికలిగించు వ్యాధియొక్క భేదము. దీనిని యబూసతుల్‌ఐన్ అనగా నేత్రము దురద పెట్టుట అందురు. మొటుబననిన శరాహెఅస్బాబ్ అనుగ్రంథకర్త యీ క్రింది విధానమును వచించెను. మలదోషములేనిదే యీ దురదకలిగిన చో దీనిని యబూసతుల్‌ఐన్ అందురు. ఇట్టివ్యాధియందు కేవలము చెమ్మ కలిగించుటవలన గుణముకలుగును. మరియు మలమును తీసివేయవలసిన అగత్యముండదు. మరియు చెమ్మను కలిగించుటకై ఉష్ణోదకముతో కాపడము చేయవలెను. చల్లని వస్తువులను కషాయముకాచి వేడిగానుండు కషాయముతో కాపడముచేయవలెను. మరియు చెమ్మను కలిగించు నట్టి తైలములు తలకు లేపనముచేయవలెను. ఈతైలములను అనేకవర్గా యములు వర్ణించబడియె.

# కనురెప్ప అంచులు మంద మెక్కి యెరుపు కలుగు లక్షణము.

ఇది ఒకవిధమగు వ్యాధి. యీవ్యాధియందు రెప్పలు దళసరి యెక్కి యెర్రగా నుండును. రెప్పలఅంచు మిక్కిలి మందమెక్కి దుర ద కలిగియుండును గాని లవణసంబంధముగను వృష్ణగానుండును. కొంత

కాలము చికిత్సచేయకుండినయెడల రెప్పవెంట్రుకలు రాలిపోవును మరియు రెప్పఅంచులకు అరబ్బీభాషలో అశఫారుల్ అజ్ఫాన్ మరియం మనాబతుల్ అహదాబ్ అందురు ఈవ్యాధి మలముయొక్క తీక్షత్వమువలన దగ్ధమై చెడిపోవుచుండును. మరియు దీని దుష్టత్వమువలన నేత్రము కూడచెడిపోవును. యీరోగము మిక్కిలి చల్లని వస్తువులు వుపయోగించుటవలన కంటిపరిధమునొం వుబ్బినవెంటనే వుత్పన్నమగును. ఈవ్యాధిని రెండుభేదములలో వర్ణించియున్నాను.

(1) ఈవ్యాధి నూతనముగా ఆరంభమై దీర్ఘకాలము జరుగక లఘువుగానున్నను ఇవి తప్ప యితర లక్షణములు లేకుండినను లేవనము నేత్రిగోలికి యందున్ను, రెప్పలయందుకూడా దురద వుత్పన్నమగును. మరియు, కొద్దిగా మెరుపు కలిగియుండును

## రెప్పలు మెర్రిబడి మందమగుటకు చికిత్స

ఈకారణములను బట్టి చూడగా మలము లఘువుగానున్నది కాబట్టి ఆమలమును వండ్లరసములుగాని లేక యిటువంటి యితరవస్తువులు గుణమును కలిగించునట్టి వస్తువులతో తీసివేయవలెను. అనగా సిమాగ్ వస్నిరులో నానవేసి రసముపిండి నేత్రిములలో వేయవలెను. మరియు, అందు బట్టతడిపి రెప్పలపైని వేయవలెను. రాత్రిసమయమునందు పెద్ద పాయల, కాసినీదిగుళ్లు, గులాబిపూలనూనెలో కలిపి రెప్పలపై లేపనముచేయవలెను. లేక కోడిగుడ్డు తెల్లసొన గుల్ రోగన్ కలిపి బట్టముంచి కనురెప్పలపై వేయవలెను. ప్రతిదినము ప్రాతఃకాలమునందు స్నానము చేయుచుండవలెను. అట్టిస్థితియందు మలమును కదలించుటకై వెంటనే గుణము కలిగించు ఔషధములు ఉపయోగించవలెను.

## (2) రెప్పలు మెర్రిబడి మందమగు లక్షణము

(2) ఈరోగము బహుకాలము వ్యాతీతమై నిలిచియుండి రెప్ప అమంద మెత్తనై మెర్రిగానుండును. మరియు, ఉబ్బిపోవును.

### రెప్ప యెఱ్ఱబడి మందమెక్కు వ్యాధి చికిత్స

సరేరు అను నరమును నొసలుయందుండు నరములను ఛేదించి రక్తమోక్షణము చేయించవలెను. మరియు, పిక్కయందుగాని భుజములమధ్యగాని శస్త్రముతో గంట్లు పెట్టవలెను. గారిఖూన్ మెత్తగానూరి కరక్కాయ కషాయములో కలిపి పానము చేయించవలెను. మలమును తీసివేసిన వెనుక శియాప్ హామురెలైన్ నేత్రములలో వేయవలెను. మరియు, ఉష్ణోదకముతో నేత్రప్రక్షాళనము చేయవలెను. మరియు, వృష్ణోదకముతో ఆవిరి పట్టించవలెను. చిరిశెనగపప్పు, దానిమ్మకాయ గుజ్జు, మైఫక్ లజ్ అనగా ద్రాక్షపండ్లరసము మూడవభాగము మిగులు నటుల కాచిననీరునందు కలిపి లేపనము చేయవలెను. దీనివలన నేత్రములయందుగాపు అజీర్ణము కలిగించును మలముయొక్క తీక్ష్ణత్వము అణచివేయును. ఈరోగికి యీవ్యాధి చాలాకాలమునుండి కంటివెంట నీరు స్రవించుచుండిన మరియు రెప్పవెంట్రుకలువూడి రెప్పఅంచుయందు గాయము కలిగినయెడల యిట్టిలక్షణములుగలరోగి మలము అనేక పర్యాయములు వెడలించవలెను. మరియు యెల్లప్పుడు పత్యముగా యుంచవలెను తరువాత శియాఫ్‌దీజజ్, అహమర్‌లైన్, మరియు అబియాజ్ అను ఔషధములను యేకముగా కలిపి నేత్రములలో వేయవలెను. ఈఔషధములను సోపుకషాయమునందుగాని లేక కషాయమునందుగాని నూరి నేత్రములలో వేయవలెను. పై ఔషధములను యేకముగా కలుపుటకు కారణమేమనగా తననిజదశయందు వచ్చుటవలన మా తీవ్రమును హెచ్చించి నష్టపరచును.

## కభలుల్ అజ్ పాన్ యనగా కంటిరెప్పలయందు పేలు చేరుటకు లక్షణము.

ఈవ్యాధి మూడువిధములుగానుండును. (1) మిక్కిలి చిన్నవిగను తెల్లగానుండును. మరియు నివి కంటిరెప్ప వెంట్రుకల మొదళ్ళయందు కనుపించును వీటిని అరబ్బీభాషయందు సివాం అందురు.

(2) ఈపేలు పెద్దవిగానుండును పీఁరంగు గోధుమరంగుగను లేక దుమ్మువంటి రంగు గలిగియుండును. వీటిని కంకాం అందురు. మరియు కొందరువైద్యులు వీనిని కంకాం అనుటకు కారణము యీపేలకు కాళ్ళు విశేషముగానుండును. తక్కినవాటికి కమల్ అందురు. కాబట్టి కంకాంకును కమల్ అను పేలకును మిక్కిలి భేదముకలదు. వాటికాళ్ళు కనుపించుచుండును. దీనిని అరబ్బిభాషయందు కిదాా అందురు. అభిప్రాయమేమనగా వీటిమలము కఫముకల్గిన రతూబతూవలన కలుగుచున్నది గాని ప్రకృతి దీనిని వక్వపరచిన వెనుక చర్మముయొక్క నలువైపులు యితర వెంట్రుకల మొదళ్ళలో అల్లుకొనుచుండును. యెందుకనగా ప్రకృతిని తన దుర్గంధమలినమువలన క్రిమ్మివేయుచున్నది. ఇచ్చట ప్రకటనమగు అంశమేమనగా నిస్సందేహముగా వెంట్రుకల మొదళ్ళు చర్మముక్రింద మెత్తనిభాగమునందుండు గుల్లభాగముతో వెంట్రుకలకు బలము ప్రాప్తినొందుచుండును. దానిని గ్రహించు యిచ్ఛగలదై యుండును. మరియు కఫజమలముతప్ప యితరదోషమునందు దీనిప్రభావము కలుగనేరదు గాని దీనివలన పేలు వుత్పత్తియగునని గ్రహించవలెను. అనగా పిత్తసంబంధమగు వుష్ణము మిక్కిలి తేజస్సుగలది. మరియుదీని మలము చేదుగానుండును. చేదుపేలయొక్క ప్రకృతికి విరుద్ధముగానుండును. ఈకారణమువలన చేదువస్తువులు పేలనుచంపివేయును. వాతము వీటిప్రకృతివలన జీవనమునకు విరుద్ధముగానుండును. యెందుకనగా వాతము చెమ్మ శుష్కత్వముగల స్వభావికముగలది. మరియు రుధిరము యెటువంటి వస్తువనగా దీనిని ప్రకృతివదలజాలదు.

(సూచనీయము) చెమ్మ గుల్లగను నీచమగును లేక మందిదగును అప్పుడుస్వభావికముగల వుష్ణముగాని లేక వుపరివుష్ణముగాని అందు పని చేయుచున్నచో చెమ్మయందు జీవనమునకుశక్తివుత్పన్నమగుచుండును. మరియు, రక్షకుని కృపవలన దీనియందు జీవుడు వచ్చిచేరుచున్నాడు. ఇది రక్షకుని పూర్ణానురాగముయొక్క కారణము.

## రెప్పలయందు పేలుకలుగుటకు చికిత్స

శరీరమునకు చేదుమలమునుండి పవిత్రతనొందించిన తదుపరి అయారజ్ పైకరా, హబ్బకోకాయా, ముసాంబరము మాత్రలను ప్రయోగించవలెను. గండూషము వలన అనగా అయారజ్ పైకరా తరువాణి మరియు తేనెతో చేయబడుచున్న గండూషములతో మెదడు నందుండు మలమును తీసివేయవలెను. మలము నశించిన వెనుక వేళ్ళ కషాయము ను పానముచేయించి మలమునందు పక్వము మృదుత్వము కలిగినయెడల లోపటిమలము తీసివేసిన వెంటనే ఆనేత్రము మలమును తీసివేయవలెను. అనగా సాధ్యమైన యెడల యీ పేలను రెప్పలయందుండి తీసివేయవలెను. రెప్పలను ఆకషాయములలో నల్లపుప్పువేసి కాచి కడుగవలెను. యిట్లు కడిగిన తరువాత రెప్పను శుభ్రత నొందించునట్టియు పేలను నశింపజేయునట్టియు అనగా పటికే ఒకభాగము అడవిద్రాక్ష అరభాగం యీ రెండు వస్తువులు మెత్తగానూరి యీ ఔషధమునందు నళాకు వుంచి కనురెప్పలలో పెట్టవలెను. పాపటి లవణము మెత్తగానూరి కండ్లలో వేయవలెను. యీ వ్యాధియందు పాండీ లవణము ఉపయుక్తముగా నుండును.

(2) నళాకు పాదరసమునందుముంచి కొంతవరకు వుంచవలెను. పాదరసమునందుగల మలినము నళాకునందు ప్రవేసించును. అనగా నళాకునకు అంటుకొనును తదుపరి యీనళాకును నెమ్మదిగా తీసికొని వ్రేలితో రుద్ది ప్రకృతానుకూలముగా కండ్లలో పెట్టుటవలన రెప్పయందుండు పేలు నశించును. యిటుల శేరహాఅస్ బాబ్ అను గ్రంథకర్త చెప్పియున్నాడు అనగా పాదరసముయొక్క గంధము తల ప్రకృతి ప్రభావము వలన చిన్నచిన్న జంతువులను నసింపజేయును. మరియు యింతవిషయమై పాదరసముతో సమానమగు వస్తువు మరియొకటి లేదని చెప్పెను.

# శయిరా యనగా రెప్పవాపు లక్షణము



ఇది దీర్ఘవాపు యవగింజల ఆకారమువలె రెప్ప అంచునందు పుత్పన్నమగును యిది రెండు విధములుగానుండును.

(1) రెప్ప సమీపమునందు కలుగుచున్నది. దీని మలము చిక్క నిరక్తము యొక్క తేలికభాగము దహింపబడిన భాగము.

(2) ఈ వాపుయొక్క రంగు మెరిసిగను మృదువుగానుండు దీనిని ఖరోక్ అందురు. మరియు, దీని మలము బహుళదా నిర్మలమగు రక్తమువలన కలుగుచున్నది.

## శయిరా అను రెప్పవాపు చికిత్స

శిరావేధన మొనరించి రక్తమోక్షణముద్వారా మెదడునందు గల మలమును తీసివేయవలెను. మరియు, రోగికి లంకనముంచవలెను లఘుభోజన మివ్వవలెను. మరియు, రాత్రి భుజించకూడదు ఆరంభమునందు మసాంబరము, రసాంజనము, మామిసా, వంటకేగురు, యీ మొదలగునవి పరిశుభ్రముగు పచ్చిగాస్నిరమునందు కలిపి లేపనము చేయవలెను. ఆరంభనమయము వ్యాతిరిక్తమైన యెడల వెచ్చని మైనము మరియు, మరహం దాఖిలీయూర్ వేయవలెను. మరియు, యీ చికిత్స రెండువిధముల వ్యాధులకు కూడా ప్రయోగించుచుగాని ముందు విధమగు రోగము ప్రయాణమువలన శాంతినొందజాలదు. మరియు, శస్త్రకర్మ అవశ్యము కలిగినచో దీని విధానము చెప్పుచున్నాను అనగా శయిరా అనగా రెప్పయొక్క వాపును మూలమునుండి పెళ్ళగించి వేయవలెను అనగా గోరుతోగాని లేక కత్తెరతోగాని కత్తిరించి వేయవలెను. మరియు, దీని రక్తమును ఒక గంటవరకు ఆపుచేయకూడదు తదుపరి జారూర్ అజ్ఫర్ అందుపై మర్దించవలెను దీనివలన గాయము మానిపోవును.

# తూసతుల్ అజ్ఫాన్ లక్షణము

ఇది ఒక మాంసపుముక్క యిది యెర్రగా నల్లగా మెత్తగా నుండును, మరియూ, యీ రోగము యొక్క మొలకలవలె రెప్పలో వ్రేలాడుచుండును. యిందువలననే దీనిని తూసా అని పేరు పెట్టబడియె మరియు, యీ మాంసపుముక్క విశేషముగా క్రింది రెప్పలో వ్రేలాడుచుండును. మరియూ, ఒకప్పుడు పై రెప్పలోకూడా కలుగుచున్నది యెల్లప్పుడు యిందులో యెర్రగాను నల్లని రంగుగాగాని రక్తము స్రవించుచుండును ఒకప్పుడు అంధత్వముకూడా కలుగుచున్నది అనగా యిందులో రతూబతు యేమియు బైటికిరాదు. మరియూ, యీ రోగము చెడురక్తము దగ్ధమైన కారణమువలన కలుగుచున్నది.

## —తూసతిల్ అజ్ఫాన్ చికిత్స—

శిరావేదనము, రక్తమోక్షణము, విరోచనకర్మ అయిన తరువాత అన్నికంటె మంచి విధానముకలదు అనగా దానిని శస్త్రము తో తీసివేయవలెను. యెందుకనగా తీక్ష్ణమగు ఔషధములకంటె దీని పరిణామము అన్నిటికంటె మంచిది. ఛేదించువిధానము అనగా మాంసపుముక్కను అయోధముతో మెత్తి కత్తెరతో కత్తిరించవలెను మరియు, కత్తిరించు సమయమునందు దీని వేరును కూడా యుంచక మొదలంట కోసివేయవలెను. లేని యెడల తిరిగి పెరుగనారంభించును. వేరునుండి నాశనము చేయనియెడల ఉప్పుజీలకర్ర నమిలి ఆనీళ్ళు కండ్లలో పిండవలెను. దీని వలన నసించకుండినచో రెప్పను లాగికొని నేత్రములో పిండి మొదలగునవి యుంచి పిమ్మట రెప్పలోనుండు మెత్తమాంసపుముక్క శేషమున్నయెడల అందుపైని తీక్ష్ణమగు ఔషధము లేపనము చేసి రెండుగంటలవరకుంచవలెను. ఆ స్థలము నల్లగా మారిన యెడల ఔషధమును తీసివేయవలెను. పిమ్మట అనేకపర్యాయములు పరిశుభ్ర

మగు పాలతో కడుగవలెను. దీనివలన నేత్రములకు అపాయము కలుగ నేరదు. మఱియు ఔషధమువలన కలిగినమంటయొక్క బాధ యావత్తు పాలతో కడుగుటవలన నశించును. తీక్ష్ణమగు ఔషధములు అనగా గుండ్రిని కచ్చూరము, జాంగలవచ్చ, పటికి, మారుదారుశింగు, సాంబ్రాణి నవాసాగరము, శియాఫెఅజఖరు, మొదలగువస్తువులతో చేయబడిన సురుమావేయవలెను. మరియు కొందరిమతానుసారముగా అన్నిటి కంటె వుత్తమమైనది. అనగా దానిని శస్త్రముతో కోయుటకాదు. తీక్ష్ణమగు ఔషధములను వుపయోగించవలెనని కొందరి అభిప్రాయము. దీనివలన ఆయెరుపు, నలువురంగుగల మాంసఖండము హరించును. మరియు మాంసఫుముక్కను లోహాఆయుధముతోగాని కలశండముక్కతోగాని గీరి జరూరెఅస్వర్ • శియాప్ అహామర్ అందుపై వేయవలెను. వేయతో ఆమాంసపుముక్క వూడిపోవువరకు యిట్లు ఔషధములను వేయుచుండవలెను. ఇటుల ఔషధములవలన నశింపజేయుటకు మిక్కిలి వుత్తమము.

## తహాజ్జుర్ వర్ణనము

ఇదివాలేమువలన కలిగిన మృదుపదార్థము. ఇది రెప్పయందు పేరుకొని గట్టిపడుచున్నది. దీనిమలము పొరయొక్క మలముకంటె మిక్కిలి చిక్కగానుండును.

### తహాజుర్ చికిత్స.

అయారజ్ మాత్రిలతో మలమునుతీసివేయవలెను. మరియు ఆవు మూడ కాలిమూలగ బనఫ్షాతైలముతో చేయబడిన మైనవరకు కలిపి కాచి లేపనముచేయవలెను. ఇందువలన రాయివలెనుండు మలము వలచనగును. తదుపరి మరహందాఖలిఖూన్ వేయవలెను. దీనివలన మలము నశించిపోవును. మరియు యిావుపాయములవలన మలము వెడల

కుండిన రెప్పను ఆయుధముతో అనగా తలగుండ్రముగానుండు ఆయుధముతో రెప్పను విరిది చీల్చివేయవలెను. గోయతో గట్టిగాఅణచవలెను. యిందువలన మలము బైటికివచ్చును. ఈరోగము తిరిగి వచ్చునని భయమున్నచో వ్రణమువ్రిక్క కత్తెరలో కత్తిరించవలెను. దీనివలన విశేషదినములవరకు గాయము మానకుండును. మరియు యీకారణమువలన చాలాకాలమువరకు మలమువచ్చుచుండును. అంగము న్వశ్చతనొందును.

### కరూహుల్ జఫ్న అనగా రెప్పల వ్రణముయొక్క లక్షణము

రెప్పయొక్క వ్రణము బాహ్యకారణమువలన ం వుత్పన్నమగును. లేక వుష్ణవాయువలన మలము పేరుకొని వక్వమై రెప్పయందు వ్రణమును కలిగించుచున్నది.

### రెప్పవ్రణచికిత్స.

శిరిసెనగకాయలు, దానిమ్మకాయపైబెరడు, పిస్తాకాయబెరడు, శిరకాలో వేసి కాచి లేపనముచేయవలెను. దీనివలన వ్రణముయొక్క పొక్కవూడిపోయినయెడల గాయము మానుటకై కోడిగుడ్డులోని సొన కుంకుమపువ్వుతోగాని లేక శియాఫ్ఇస్తఫికాతోకూడ కలిపి చేయవలెను.

### శియాఫ్ఇస్తికాచేయు విధానము.

బంగారుమకిల, మిరియాలు, నల్లమందు, కుంకుమపువ్వు, యివి ప్రత్యేకము యేడుమాషములు, సైంధవలవణము, పాపడీలవణము, మంగకాయలు, యివిప్రత్యేకము 4న్నర మాషములు, తుమ్మజిగురు, శియాఫెచూమిసా, అంజరూద్, యివిప్రత్యేకము 14 మాషములు ఈ వస్తువులు ఒకటిగాచేర్చి చూర్ణించి వస్త్రగాలితమొనర్చి పచ్చిసోపు రసమునందునూరి కనికెలు అనగా సియాప్ చేసుకొనియుంచి సమయమువచ్చినప్పుడు వుపయోగించవలెను.

# తహబ్బుజు వాఇంతిఫాఖ్ అజ్ పాక్ లక్షణము.

ఈరోగము నందు కనురెప్ప వుబ్బి నిగనిగలాడుచుండును. తహబుజ్ వాతమువలన కలిగిన వాపుపేరు మరియు నివాతము శరీరమునందు నిండియుండును. మరియు యీరోగము మూడువిధములుగానుండును. (1) యీవ్యాధిలో అంగములయందు దుర్బలము కలిగి వాటిశక్తి ఆహారరసము పచనము చేయజాలకపోవుట. (2) కఫప్రకోపదోషము యొక్కవిశేషత్వమువలన కలుగుచున్నది. దీని నిజవృష్ణము దీనిని పచనము చేయజాలకపోవును. (3) కఫము దోషమువలన వృష్ణత్వమొంది వాపును కలిగించును.

## తహబ్బుజ్ వాఇంతిఫాఖ్ అజపాన్ చికిత్స.

రోగిలో అవయవములు దుర్బలత్వము యీకారణమైనయెడల లోఅంగములకు బలము కలిగించవలెను. మరియు, కఫాధిక్యము రోగకారణములైనచో లఘుభోజనము పెట్టవలెను. మరియు, కఫమును వెడలించవలెను. మరియు, మహా యితిరిఫల్ యివ్వవలెను. ముసాంబరము శిరకాలోకలిపి రెప్పలపై లేపనముచేయవలెను. మరియు, గోరువెచ్చని నీళ్ళలో శిరకాకలిపి కనురెప్ప కడుగవలెను బట్టగాని స్పంజిగాని వుష్ణోదకములోముంచి కండ్లపై యుంచవలెను. మరియు, రోగికి యీరోగము ఫల్గమోనియొక్క కారణమువలన కలిగినచో సరేరు నరమును ఛేదించవలెను. మరియు, శియాప్ మమీరాసా, చందనము కాశిని రసమునందునూరి లేపనము చేయవలెను. మరియు, యీ రోగమును ఇంత్తిసాఖ్ వ్యాధియందు చెప్పబడియె.

# రెప్ప కఠినవాపు లక్షణము.

---

ఇది ఒకవిధమగు కఠినవాపు రెప్పలయందు జనించును నిది కుదురువలెను కురుపు కలుగుటకు కారణముగానుండును దీనిని గద్‌గద్ అందురు. కురుపు అని కూడా కొందరు వచించుచున్నారు మరియు, నిది నిజదశయందు తహజ్జారు అనగా కఠిన వాపునందు ఒకభేదము దీనివర్ణనము ముందుగా చెప్పియుంటిని. దీనిని గద్‌గద్ అనుచున్నారు.

# సైలూల్ అనగా రెప్పపైన మొలకలు కలుగు వ్యాధి లక్షణము

ఈరోగకారణము వాతమువలన చల్లని దోషము కలిగి ఆదోష మువలన కలుగుచున్నది. (చికిత్స) శరీరమునందుండి వాతదోషమును తీసివేయవలెను. మరియు, మొలకలపై జైతూను తైలపుమడ్డి బలపూర్వకముగా మర్ధించవలెను. లేక నల్లజీలకర్రగాని సైంధవలవణమునూరి యదాశక్తితో మర్దించవలెను. మరియు, యీ వస్తువుల చూర్ణమును శిరకాలో కలిపి లేపనముచేయువలెను యీ వ్యాధి యీ చికిత్సవలన శాంతించనిచో వాటిని పటుకారుతో పట్టుకొని నఖహారణాయి శస్త్రముతో కోసివేయువలెను. రక్తము స్రవించ నారంభించిన యెడల కొంత వరకు రక్తము స్రవింపజేయువలెను. మరియు, వ్రణముపై పటికనూరి చల్లవలెను దీనివలన రక్తము నిలిచిపోవును.

# శరార్ అనగా కంటిలోలేచునట్టి గుల్లలవర్ణనము.

ఈరోగము రెప్పలయందు లేచుచుండును. గుల్లలుఅనగా చిన్న బొబ్బలు అని భావము. దీని చిన్నకములు రెప్పలయందు దురద ఆరంభించును. యీదురద గీరుటవలన వాపుజనించును. మరియు యీ

వాపు విషజంతువుయొక్క కాటువలన కలిగిన వాపువలెనే యొక్క ఆకృతి కలిగియుండును. ఈరోగము రక్తదోషమువలన గాని పిత్తదోషము యొక్క విశేషత్వము కారణమువలన కలుగుచున్నది.

#### శరార్ అను గుల్ల చికిత్స.

శిరావేధనము చేయవలెను. కరక్కాయలు, చింతపండు మరియు యిటువంటి స్వభావికముగల వస్తువులయొక్క కషాయముతో ప్రకృతి మృదుత్వము నొందించవలెను. మరియు వుచితమగు భోజనము నొసంగవలెను. మరియు నేత్రములు పుల్లదాక్షరసముతో కడుగవలెను. పిమ్మట సాదనజ్ నేత్రములలో ప్రయోగించవలెను.

## రెప్పపైలేచు చిన్నగుల్లలయొక్క వర్ణనము

నల్మా అనగా కంటిరెప్పలపై చిన్నగుల్లలు లేచుచుండును. యీగుల్లలలో మ టకలిగి యుండును. యివి కొద్దిగావాచి గాయమై అల్లుకొనుచుండును. మరియు నివి దగ్ధపిత్తమువలన వుత్పన్నమగును. యీరోగము రెప్పయందు వుత్పన్నమై పెరుగనారంభించినయెడల రెప్పలు చిట్లినటులుండును. మరియు రెప్పవెంట్రుకలు వూడనారంభించును. రెప్పలు యెర్రనిరంగు కలిగియుండును.

#### రెప్పలపై చిన్నగుల్లల చికిత్స

మలమును తీసివేయవలెను. మరియు యీరోగకారణమగు వుష్ణమును శాంతింపచేయవలెను. మరియు శియాఫ్మామిసా, కుంకుమపువ్వు, రసాంజనము, తుమ్మచెక్క మొదలయినవి లేపనము చేయవలెను. మరియు శియాఫ్అహామర్లైన్ నేత్రములలో వేయవలెను. దీనివలన శేషించియుండు మలము హరించును.

#### రెప్పయందు మలినమేర్పడు లక్షణములు.

ఈరోగచిన్నము లెవ్వియనగా రెప్పవెంట్రుకల మూలములయందు నవ్వాన్అనగా వ్రాక లేక పొట్టువలె వుత్పన్నమగును. ఒక్కొ

కప్పును గాయమై, చీము ప్రవేశించి గరగరలాడుచుండును. మరియు రె ప్పవెంట్రుకలు వూడిపోవును. మరియు యీరోగి నేత్రములలో వాత ముయొక్క దుర్గంధమువలన ఆవిరివరమాణువుల కారణమువలన నీచ ములము వుత్పత్తియగుచుండును. గాని, దీనిరంగు కొంచెము మాలిన్య ముగా నుండును. యీరోగము కఫముచెడిపోయిన ఆవిరివరమాణువుల కారణమువలన కలిగినయెడల దీనిరంగు తెల్లగానుండును.

## రెప్పయందు కలుగు మలినచికిత్స.

ఈరోగారంభమునందు శరీరమును నీచదోషమునుండి స్వఛ్ఛత వరచి, తదుపరి శియాపేఅహామర లైక్* అథవా శియాఫ్ధీనజ్ నేత్ర ములలో వేయవలెను మరియు చితిమూలము బెరడు కాల్చి గుల్రో గన్‌లో కలిపి లేపనము చేయవలెను. మరియు యీరోగము దీర్ఘకాల గతమైనచో శస్త్రముతో గీరవలెను. లేక వటికిబెల్లము ముక్కతో గీరి తదుపరి జ్యోతివర్ధక సురుమా నేత్రములలో వేయవలెను.

## నల్ ఆమ్ అను తిత్తి లక్షణములు.

ఈవ్యాధికంటిరెప్పయందు వుత్పన్నమగును. నిది కంటియొక్క మాంసము చర్మముతో సంబంధములేకుండును. మరియు దీని నిమిత్త ము వక ఝిల్లి సంచివలె నుండును.

## నల్ ఆమ్ చికిత్స

శరీరస బంధమగు మలము వెడలించినపిమ్మట శస్త్రప్రయోగ ము చేయవలెను. శస్త్రకర్మ అనగా రెప్పచర్మమును నెమ్మదిగా వెడల్ప

---

* అహామర్ అనగా యెరుపునకు పేరు లైక్ అనగా మృదుత్వము శియాపె అహామర్ లైక్ అనేక ద్రవ్యముల సంయోగమువలన చేయబడిన ఔషధము. ఇందు మృదువగు ఓషధులు చేర్చబడును గాని తేజవంతమగు చురుకుగల ఓషధులు లేవు గాన దీనిని శియాఫ్ అహామర్ లైక్ పెట్టబడియె మరియు, దీజజ్ నల్లరంగు పేరు గాని పూర్వకాలపు ఒకవైద్యుని పేరు కూడ దిజజ్ అని యుండెను. యీ ఔషధమును ఆవైద్యుడు కనిపెట్టి తన పేరు యీ ఔషధమునకు పెట్టెను గాన దిజజ్ అని ఔష ధమునకు పేరుకలిగెను.

నుండి చీల్చివేయవలెను ఇందునిమిత్తము సావధానుడై యుండవలెను. శస్త్రము యొక్క చివర రసోలి అనగా కత్తి వలెనుండు బొబ్బయొక్క ఝిల్లియందు ప్రవేశించకూడదు. యీవిషయమై యత్నముచేయవలెను. రసోలి ఝిల్లిసహితము యెన్నిదో బైలువెడలును. మరియు యీవిధముగు నేత్రములో శేషముండిన మొదల తీక్ష్ణముగు ఔషధములు గోఘృతము దీనిపై చేయవలెను ఇందువలన దేనిది బైటకివెడలివచ్చును. మరియు రసోలిఝిల్లి పూర్ణమై అందుండి చీము ప్రవించినచో ఇట్టిదశయందు చికిత్స కఠినమగును. మరియు రసోలి అనగా బొబ్బ తిరిగి వుత్పత్తి కాగలదు.

(సూచనీయము) మస్సా అనగా మొలకలు. పిత్తి, రసోలి, అనగా బొబ్బ. ఈ మొదలగునవి ఒకే అంగమునుండి సంబంధముకలిగియుండవు. అనగా యీగ్రంథముయొక్క అంతమునందు యీరోగములను చెప్పబడును. మరియు యీస్థలమునందుకూడా యిందువలన వర్ణించబడియె. ఈరోగము యీస్థలమునందు వుత్పన్నమగును. అప్పుడు యేవుపాయములవలన చెప్పబడుచున్నవో అది ముఖ్యముగా అనగా ప్రకరణము యెటులనున్నదో అటుల చికిత్సచేయదగియున్నది.

## రెప్పలు ఆకుపచ్చ నీలిరంగు కలుగుటకు లక్షణము.

ఇదివ్రణముయొక్క కారణమువలన రెప్పపై కలుగుచుండును. ఇందుకు చికిత్స యద్యాపివ్రణము శేషించియుండిన మరియు యేమియు దర్పము లేకుండిన శిరావేదనచేయవలెను. మరియు విరోచనముకాగల ఔషధములు యివ్వవలెను. మరియు చందనము, మురుదారుశింగు, వస్నిరుతోనూరి లేపనముచేయవలెను. దీనివలన గాయము మానిపోవును. అటుపిమ్మట సంగెఫిల్ ఫిల్, అనగా వక విధమగు రాయి. యిది మిరియాలవలెనుండును. యీరాయి నూరి లేపనము చేయవలెను. మరియు కుంద

పెంకులు ఒకదానిపై నొకటి అరుగతీసి లేపనముచేయుటకూడా లాభదాయకము. అనగా నిలిరంగును హరించును. మల్లెంగి తుంగ నీళ్ళతో నూరి లేపనముచేయుటవలన దీనిరంగు హరించును యే వస్తువు నీలిరంగును ఆకువచ్చరంగును దూరపరచునో ఆవస్తువులు యీవ్యాధియందు ముఖ్యమైనవని భావించవలెను ఈయౌషధములను యీగ్రంథముయొక్క అంతమందు చెప్పబడును.

## నేత్రలూటి వ్యాధి లక్షణము

కంటికొలికియందు అనగా ముక్కువైపు వాపుకలిగి అటుతరువాత కురుపుపై లూటిగా మారును దీనిని గవద అందురు. మరియు, మలము ఆస్థానమునందు ఖుంభవించుటవలన యీ వ్యాధి కలుగుచున్నది. దీని దశ భిన్నాభిన్నములుగానుండును. ఒకప్పుడు ముక్కువైపు చితికిపోవుచుండును. యీ కురుపు చితుకుచుట్టిస్థలము కంటికిన్ని ముక్కుకున్ను మధ్యమార్గము యీ మార్గమునుండి చీము స్రవించుచుండును. ఒకప్పుడు కంటిరెప్ప చర్మము చినిగి చీము వెడలుచుండును మరియు కనురెప్ప శల్యమును దుర్బలము కలిగించును. ఇట్టి సమయమునందు రెప్పపైన వేళ్ళుపెట్టి చినచో చీము బైటికివచ్చుచుండును. విశేషముగా మువలన దీని తేజస్సువలన మాంసమును అధోభాగమునందుండు శల్యమును దుర్బలమునొందించి చెరచివేయును అనగా యీవ్యాధివలన వెముక చీలిపోవునని భావము. మరియు కంటిలూటి మరియొకటి గలదు. నిది చితికి బైటికిరాక నొప్పితోకూడియుండును. మరియు వాపుయొక్క సంయోగమువలన నేత్రమున దెల్లప్పుడు నిలిచియుండును, ఒకప్పుడు యీరోగమువలన చీముయెల్లప్పుడు నిండియుండును. నేత్రమునందుకూడా దుర్గతి సంభవించును.

### నేత్రలూటి చికిత్స.

ఈవ్యాధియందు ముందుగా నరేరు అను నిరమునుఛేదించి రక్త

మోక్షణము చేయించవలెను. విరోచనము చేయించి శరీరమును, మెదడునకున్ను, పవిత్రము కలిగించవలెను. మరియు లఘువగు మంచిభోజనము లొసగవలెను. అనగా ప్రాణసంబంధ విధానమెటులున్నదో అటుల పత్యమును యిప్పించవలెను. అప్పుడు శరీరసంబంధమలము వెళ్ళిపోయినయెడల రెప్పయందు శియాఫ్‌గర్జలేపనము చేయవలెను. ఈఔషధము యుపయోగించుటకు ముందుకంటిలూటిలోనుండి కుళ్ళిన చీము నీరున్ను తీసివేయవలెను. మరియు యీచీము పాతమాంసితో తుడిచి కుళ్ళిన మాంసమును కోసివేయవలెను. మరియు యిటుల కోసివేయుటకు రెండువిధములుగలవు. (1) శస్త్రముతో (2) ఔషధములతోనున్ను తీసివేయవలెను మరియు యీరోగియొక్క కంటిలో లూటికత్రిమ్మకొనజాలదు. మరియు రెప్పలోవేరుగానుండినచో నీచమాంసమును శస్త్రముతో కోసివేయవలెను. అభిప్రాయమేమనగా యీరోగియొక్క నేత్రములో లూటికురువు దిట్టముగానుండను. మరియు నిది రెప్పతోకలిసి యున్నచో దీని చీల్చుటకై జంగాలవచ్చు మలాము వేయవలెను. మరియు యింతవిషయమై ప్రకటించినదేమనగా చీము దుష్టమాంసము తొలగించనిది శియాఫ్‌గరజ యుపయోగించుటవలన ప్రయోజనము కలుగనేరదు. మరియు యీయుపాయములవలన లాభము ప్రాప్తించనియెడల అగ్నితో కాల్చవలెను. మరియు కాల్చుటకు విధానముకలదు. అనగా వాతవేయునట్టి ఆయుధము చిన్నదిగను గుండ్రమైనముఖము గలదిగానుండును. అట్టి ఆయుధమును తీసికొని అగ్నియందు యెఱ్ఱగా కాల్చి అనేకపర్యాయములు చెడిపోయినమాంసముపై నుంచవలెను. ఇట్లు కాల్చుటవలన చెడుమాంసము యావత్తు కాలిపోవును. చీము దుష్టనీరు శుష్కించును. మరియు వాతవేయుసమయమునందు గోధుమసత్తు మంచుగడ్డనీరులో తడిపి చల్లని బట్టతో వేసి సేకమునందుంచవలెను. దీనివలన వాతయొక్క వుష్ణము నేత్రములో ప్రవేశించజాలదు.

ఇది అన్ని చికిత్సలకంటె మిక్కిలి యుత్తమమైనది. అనగా రాగితోగాని లేక యితరలోహములతోగాని ఒకగొట్టమునుచేయించి దాని ముఖము యీలూటీకురుపుకు సమానముగా యుండునటుల చేయించి ఆగొట్టమును లూటికిసమానముగాయుంచి తగుమాత్రము సీసము కరిగించి ఆగొట్టములోనుంచి పోయవలెను. రోగి ఈలూటిశుభ్రముగా కాలునంతవరకు యీకష్టము సహించియుండవలెను. మరియు ఈవిధానమును వైద్యులు మిక్కిలి మంచిదనిరి. యెందుకనగా ఈదశయందు ఆముఖ్యస్థలమునుండి వారు యావిశేషముగా అల్లుకొనజాలదు. అభిప్రాయమేమనగా యిటుల కాల్చిన పిమ్మట సవేదాములమును వేయవలెను. దీనివలన గాయము మానిపోవును. నొప్పిశాంతించును.

## శియాఫేగర్ అను ఔషధమును చేయుక్రమము.

ముసాంబరము, గవ్వపలుకుసాంబ్రాణి, అంజరూద్, కహరోబా దానిమ్మపూలు, సురుమా, పటికి ఇవి ఒక్కొక భాగము, జంగాలపచ్చ 14 భాగములు, యీవస్తువులు యావత్తునూరి చూర్ణించి వస్త్రగాలితమొనరించి శియాఫ్అనగా కనికెలు చేసికోవలెను. మరియు అవశ్యము కలిగినప్పుడు నీళ్ళతో అరుగదీసి మూడుచుక్కలు నేత్రమునందు కొంతకాలమువరకు వేయుచుండవలెను. ఇటులవేయుటవలన మిక్కిలి లాభము కలుగగలదు. అనగా వ్యాధిశమించి నేత్రదృష్టి విశేషమగును.

(సూచనీయము) ఆవాపునకు ముఖము యేర్పడక వ్రణచిన్నములు కలుగకుండిన మామిసా, కుంకుమపువ్వు, బాలింతబోలు, ముసాంబరము, కాల్చిన ముత్యపుచిప్ప యీయావత్తు వస్తువులు తీసికొని తిలకర్ణూక రసమునందుగాని, లేక పచ్చికాశిని రసమునందుగాని నూరి వాపుపై లేపనము చేయవలెను.

మరియు పదార్థప్రకృతి అనగా దీనిని నములివేళి లూటీగామార్చును కాబట్టి ఔషధలేపనాదులు నశింపజేయును యీచికిత్సవలన లాభమేమనగా వాపును తగ్గించును. మరియు, యీ చికిత్సవలన తగ

నిచో తీక్ష్ణౌషధములను అరగదీసి లేపనము చేయవలెను. అపగా బరానీలు నూరి తేనెలో కల్పి అథవా, సాంబ్రాణి, పావురపుపిట్టములను కలిపి అథవా పటికి నూరిగాని లేక సుఖబీంజ్ సిరకాతో నూరిగాని యీ మొదలగువానిని వేర్వేరుగా లేపనము చేయవలెను యిట్లు లేపనము చేయుటవలన మలమును పక్వపరచి చర్మమును బ్రద్దలుచేయును. శల్యమును చీకనివ్వక ఆపివేయును. మరియు, పావు పక్వమొంది మెత్తబడిన యెడల తుమ్మచెక్క, బాగడచెక్క అరగదీసిగాని లేక యితరములగు యిటువంటి స్వభావికముగల వస్తువులనుగాని లూటిరంధ్రమునందుంచవలెను దీనివలన నాసూరును, కొలికియాటి పూడిపోవును. మరియు, జంగాలవచ్చనూరి వత్తికి పట్టించి ఆరంధ్రమునందుంచవలెను ఈ ఔషధము మంటగానుండును అయినను అనేకపర్యాయములు వుపయోగించదగియుండును. రోగి బాధకోర్వజాలకుండినచో యీ వ్రణము పాకకలిగించును. మరియు, ముల్యపుదివ్వ, ముసాంబరము, తుమ్మచెక్క యీ వస్తువులనూరి వ్రణముఖముచేయుటకై ముందు వెనుక కూడ లేపనము చేయవలెను. మరియు, నదాపాకు, నీళ్లతోనూరి వత్తిని అందులోముంచి వ్రణమునందుంచినచో మిక్కిలి లాభదాయకమగును. మరియు యెండిననమాగ్, కషాయము లూటి రంధ్రములో వేయుట లాభదాయకమగును. ఔషధములయందు వత్తిముంచి ఆవత్తి వ్రణమునందు ప్రవేశింపజేసేయెడల ముందు వ్రణమునరుద్ధి అందుండు మలమునుతీసివేసి ద్రాక్షసారాయితోగాని లేక అజీర్ణమును కలిగించునట్టి మద్యపానాదులతోగాని వ్రణమును పరిశుభ్రముగాకడిగి తదుపరి [illegible]రందు వత్తిఎక్కించే ప్రయత్నము చేయవలెను. ఇట్లు చేయుటవలన వ్రణమునందుండు మలము తగ్గిపోవును. మరియు వ్రణమునందుండే మలము వెడలకుండిన రెండుమూడుదినములు వదలివేయవలెను. ఇట్లు వదలుటవలన మలముయొక్కపత్తు వకటిగా చేరును. తదుపరి వత్తివేసి కడుగవలెను. పిమ్మట వత్తినెక్కించవలెను. మరియు యీలూటి

వ్రణము యొక్క ముఖము బాధించబడి చీము వెడలకుండిన దూలగొండి కత్తుల నూరి కలిపినపి డిలో కలిపి, చపుటాలుతో గాని గాడిదెపాలుతో గాని నూరి అందు కుంకుమపువ్వు స్వల్పముగా కలిపి నూరి లూటీపై వేయువలెను దీనివలన మెత్తబడి ఆలూటీముఖము చిట్లిపోవును. మరియు మైదాపిండి రొట్టెలోనుండు మెత్తనిగుజ్జు, సాంబ్రాణి, తుమ్మచెక్క కషాయముతో నూరి లూటీపైనుంచి కట్టుకట్టినయెడల లూటీవ్రణము చిట్లిపోవును మరియు వ్రణము యొక్క లోతు, విశాలత్వమును తెలిసి కొనటకై ఆవ్రణమునందు కడ్డీ వేసిచూచి పిమ్మట ఔషధములో దూది ముంచి వ్రణమునందుంచవలెను. మరియు తీక్ష్ణఔషధములు వేసినయెడల నేత్రముపై కట్టుకట్టి ఒకగంటవరకు తిరుగనియ్యక రోగిని పరుండబెట్టవలెను. మరియు యీ మొదలగు నుపాయములవలన ప్రయోజనము కలుగనిచో అట్టిస్థితియందు శస్త్రకర్మవలనగాని, అగ్నికర్మవలన దగ్ధపరచుటకు ప్రయత్నము చేయవలెను. వెనుక అవగా శస్త్రకర్మవిషయమై వర్ణించియున్నాను.

## కనురెప్పలు కొలకులయందు దురద కలిగించు వ్యాధి లక్షణము.

ఈదురద కలుగుటకు కారణమేమనగా ఉప్పని రతూబత్ అనగా నీరు నేత్రమునందు స్రవించనారంభించును. దీనివలన నేత్రముల వెంట వుప్పనీరు వెడలనారంభించును. ఈవ్యాధిగల నేత్రమునందు ఎరుపుమంట ఉత్పన్నమగును ఒకప్పుడువ్రణములుకూడా కలిగించును.

### కనురెప్పల కొలకులయందు దురద చికిత్స.

కాస్నినూరి గుల్‌రోగన్‌తో కలిపి లేపనము చేయవలెను. మరియు, హసర్ మీరా నేత్రములతో వేయవలెను. దీనివలన దుష్టనీరు వెడలిపోవును యీ సదుపాయములవలన రోగశాంతి కలుగనిచో చికిత్స తగ్గించి మేక మొదలగు జంతువులమాంసము కేవలము కొద్దిగా రోగి

కాహారార్థమివ్వవలెను. మరియు, అంజూరపండ్లు, ద్రాక్షపండ్లు రోగికి పథ్యమిడవలెను మరియు చెమ్మను కలిగించు నుపాయములను చేయువలెను. మరియు, సముద్ర తీరమునందు సంచారముచేయుట, చెమ్మను కలిగించునట్టి సేవనలు మొదలగు నుపాయములు చేయవలెను. మరియు చెమ్మను కలిగించునట్టి ఖాదనములు భోజనములు, షరబతులు, ఇత్యాదివస్తువులను మాత్రము వుపయోగించవలెను యెందుకనగా మలమును వెడలించుటకు సిద్ధముగా నుండునటుల చేయవలెను. మరియు, మల తేజస్సు అందుగలవున్న తగ్గిపోవును. చెమ్మనుకలిగించు విషయమై ఆలోచించదగిన అంశమేమనగా యీలవణసంబంధమగు నీరు రక్తజదోషము వలన కలిగినచో శిరావేదనచేయవలెను లేక నిది యితర దోషయుక్తమైన యెడల ఆదోషానుసారముగా మలమును వెడలించునట్టి ఔషధములను వుపయోగించవలెను. మలము వెడలిన యెడల ఆనేత్రమునందుండు మలము వెడలుటకై బానలీఖూక అనగా సురుమా మరియు, కౌహాలాగరీజీ రెప్పయందు వేయవలెను.

## కౌహాలాగరీజీచేయుక్రియము.

సురుమా, కాల్బిసఆస్‌పాని 17 స్సర మాషములు తారమాక్షికము, హేమాక్షికము, సాదంజ్ అదసీ, మైంతుత్తం, తామ్రభస్మం, ఇవి ప్రత్యేకము 7 మాషములు కరక్కాయబెరడు, ఫతేరజ్, మిరియాలు, పిప్పళ్ళు, నవాసాగరము, ముసాంబరము, రసాంజనము, కుంకుమపువ్వు సముద్రమునందుండు యేండ్రకాయ, అనగా పీత, యివి యొకత్తు లి⅓ మాషములు శొంఠి 1⅓ మాషములు పచ్చకర్పూరము, లి⅓ రతులు కస్తూరి 3 రతులు లవంగములు 1 మాషము ఈవస్తువులను చూర్ణించి వస్త్రగాలితముచేసి మెత్తగానూరి యుంచుకొని సమయానుకూలముగా నుపయోగించుకొనవలెను.

## నేత్రకొలకులలో కఠినమాంస ముత్పన్నమగులక్షణము

కంటికొలికియందు మాంస ముత్పన్నమగుచుండును. అనగా

ముక్కువైపు కంటిపెద్దకొలికియందు మాంసము విశేషముగా పెరుగ నారంభించును దీనిని గుద్దా అందురు. ఈమాంసము పెరిగినకొలది నేత్రములందుండునీరు దిక్కుబడి స్రవించనారంభించును. ఆనీరు కొలికి యందుండుమాంసమువలన ఆటంకము కలిగి నిలిచిపోవును. ఈకారణము వలన నేత్రములాటి వృస్పిన్నమగుచున్నది. ఇది విశేషముగా పెరుగుటవల న నేత్రదృష్టికి భిన్నము కలిగించును.

## ౧౦

## నేత్రకొలికయందుత్పన్నమగు మాంసచికిత్స.

శరీరమునందుండు విశేషదోషములను తొలగించినపిమ్మట మరహంజంగార్ గాని శియాఫ్ జంగారుగాని ఆమాంసముపై వేయవలెను. దీనివలన ఆరోగ్యమొందనిచో నాఖూనా అనగా గోరు ఆకారముగా తెల్లగ్రుడ్డుపై వృద్ధియగుమాంసమును శస్త్రముతో తీసి వేసినట్లు తీసి వేయవలెను. మరియు విశేషమాంసము నాసిపత్తుతో నేత్రకొలికి నిజదశయందువచ్చినయెడల ఆమాంస మూలమునుండి తెగగదని గ్రహించవలెను. ఇటుల తెగక మాంసశేషముండినచో తిరిగి పెరుగుననే భీతి యుండగలదు. మరియు శస్త్రకర్మ అయినపిమ్మట జరూరె అజఫర్ అందుపై చల్లవలెను. దీనివలన శేషించియుండుమాంసముకూడా హరించి పోవును. మరియు శస్త్రచ్ఛేదనవలన కష్టమును సహించినచో అట్టికష్టమును తొలగించుటకై కోడిగ్రుడ్డు తెల్లసొన గుల్ రోగన్ యను కలిపి లేపనము చేయవలెను.

## శియాఫేజంగాలుచేయుక్రమము

సముదాశరబి, రాగ్, సఫేదా, జంగాలపచ్చ, యివిప్రత్యేకము 7 మాషములు యీవస్తువులునూరి తులసిఆకురసముతోనూరి కని కెలుచేసియుంచుకొని ప్రయోగించవలెను.

గద్య, ఇది శ్రీమదిమాంబేగ్ సాహెబ్ పౌత్ర పచ్చాబేగ్ సాహెబ్
పుత్ర "వైద్యభూషణ" బిరుదావళీ విరాజమాన వైద్యవిద్వజ్జన
విధేయ రహంతుల్లాబేగ్ నామధేయ ప్రణీతంబైన
"తిబ్బెఅక్బర్‌షాహి" అను వైద్యగ్రంధమునందు
నేత్రరోగాధ్యాయము సర్వము
సంపూర్ణము.



యాకరీముల్ మారూఫ్.

బిస్మిల్లా ఇర్రహ్మా నిర్రహీం.

# తిబ్బెఅక్బరిషాహి

నాలుగవ అధ్యాయము.

## కర్ణరోగలక్షణములు.

కర్ణములనగా ఒకమృదువగు శబ్దముచే కల్పించబడిన అంగము. ఇది మాంస సంబంధమగు జ్ఞానేంద్రియములయొక్క నరములతో చేరి యేర్పడినది. యీ కర్ణమువలన మనకు కలుగు ఉపయోగము సామాన్యముగా అందరికి తెలిసిన విషయమే అయినను కొంతవరకు నాకుగల అల్పజ్ఞానమువలన యిందు చెప్పుచున్నాను. అనగా గాలి కెరటములు వేయుచు యిందు నిలిచి ఇజముహాజరీ అనగా ఇదియొక శల్యము. యిందు చెవిరంధ్రముండును. యీ రంధ్రమునందు ప్రవేశించు సమయమునందు ఆరంధ్రముయొక్క జ్ఞానేంద్రియముల జీవనరము యీ కర్ణరంధ్రముయొక్క మధ్యభాగమునందున్నది. దీనివలన వినిపించునట్టి శక్తి కలుగుచున్నది. యీ శక్తికి శబ్దము వెళ్ళి తాకుచుండును. అట్టిస్థితిలో శబ్దమును గ్రహించునట్టి పాత్రమగుచున్నది. మరియు, యీ అధ్యాయమునందు యెనిమిది భేదములు గలవు. అనగా దాగిలి సుత్తి యెముకల కూటము గజరూఫ్ ఒక శల్యము. ఆశల్యము చెవిశల్యముకంటె పృథువుగానుండును యితర అంగముల యందు నిలిచియున్నది. దీనిని పయవు వెముకె అందు. మరియు, ఇజ్మహాజరి అనగా రెండు శల్యములు యీ

రెండు శల్యములలో కర్ణగ్రంథి యుండును నిది శిరస్సుయొక్క రెండవ శల్యముతో సంబంధము కలిగి నిలిచియున్నది. కాబట్టి గిరిని ఇజ్మహో జరి యని చెప్పబడినది. మరియును, అజర్ అనగా అరబ్బీ భాషలో రాయి అని అర్థము. గురించి, యీ కర్ణము శబ్దమును గ్రహించు విధమును తెలిపెద.

కర్ణ అవయవములను చూపు చిత్రపటము




1. కర్ణావృత్తి
2. గజరూప్ అంకె వన్నెదాగిలిసుత్తి ఎముకల కూటము
3-8 కర్ణభేరి
4. చెవులిగాలి
5. కర్ణనాళము
6. కర్ణభేరీత్వచ
7. కర్ణ అస్తులు
9. కంఠకర్ణనాళము

కర్ణములందు గ్రంథులుండి వానినుండి గులిమియనబడు కర్ణమల మూరుచుండును. యీ గులిమి మిక్కిలి చేదుగానుండుటవలన చీమలు మొదలైన పురుగులేవియు చెవిలోనికిపోవు గులిమి కర్ణనాళమునకు చెమ్మకలిగించుటకు నిర్మించబడియె. నడిమిచెవి గిన్నెవలె వంకరగానుండును. దీనికిని కర్ణనాళమునకు మధ్యనుండు మార్గము భేరిపై మూయబడియుండు చర్మముపలె చెవిమధ్యభాగమునందు పలుచని చర్మము మూయబడియుండును, ఈ కారణమును బట్టియె చెవిమధ్యభాగమునకు కర్ణభేరియని పేరు దీనికై వారము అరంగుళముండును. యీచర్మమునకు దెబ్బతగిలినచో బద్దలై తిరిగి కలుసుకొనక వెంటనే చెవుడు

వాభగించును. యీకర్ణభేరి ప్రక్కలయందు రెండు చిన్నరంధ్రము లుండును వానిపై కూడా పలచనిచర్మము మూతబడియుండును. దీని లోపల విచిత్రములైన 3 శల్యములున్నవి. అందు నొకటి సుత్తి యెముక దీనిపొడగైనపిడి కర్ణభేరిచర్మముయొక్క మధ్యభాగముతో చేరి యుండును. 2వది దాగలి వంటిది సుత్తియెముకయొక్క గుండ్రని తలతో సటి యుండును. 3వది చిన్నదైన యెముక నిడ గుఱ్ఱపుజీనురి కాబ్ వలె దాగలి యెముకతో చేరియుండును.

ఈయెముకలన్నియు కర్ణభేరిపైని తగిలెడు శబ్దతరంగములను చెవి లోభాగమునకు ప్రవేశింపజేయుట కుపయోగపడును. మరియు కర్ణభేరి యొక్క లోభాగమునుండి కంఠనాళమనెడి ముప్పాతికెయంగుళము పొడవుగా నుండుగొట్టము కంఠములోనుండి కర్ణభేరియొక్క చర్మమునకు లోపలి వెలుపలి భాగములయందుండెడు గాలిని సమబలముగా జేయుచుండును. లోచెవి మూడుభాగములుగా నుండును. అందలి ముఖ్యభాగము కుహరికా యనబడును. గుండ్రని ఆకారముకలిగి కర్ణభేరికి లోపలి భాగమునందు దానిపై మూసిన చర్మమునకు సమానముగా యెదురుగా నుండును. కుహరియొక్క వలయాకారమునకు గొట్టములుగా నుండెడు రెండవభాగము అర్ధవలయనాళము లనబడును. ఈనాళములు కుహరిక లోనుండి బైలుదేరి శల్యములలో తొలిచిన రంధ్రమువలె విలువంపుగా దిరిగి కుహరికలో కలిగియున్నవి. యీఅర్ధవలయనాళములు మూటిలో నొకటి యడ్డముగాను, రెండు నిలువుగానుండును. కుహరికయొక్క రెండువ్రక్కలనుండెడి మూడవభాగమునకు కర్ణావృత్తి యనబడును. నిది నత్తగుల్ల లోపలిభాగమును బోలియుండును. చెవిలోభాగము అనగా లోపలిమూడు భాగములలో నిర్మలమైన ద్రవపదార్థముండి కర్ణభేరి యెముకలవలన లోపల పుత్పన్నమగు .ధ్వనిని గ్రహించి ఆశబ్దముయొక్క అనేకభేదములను మిక్కిలి స్ఫుటీకరించి యీలోభాగము చెవిలో నుండెడుకర్ణనాడియందుండివచ్చిన భేదములను మెదడునకుదీసికొనిపోవును.

## కర్ణశూల లక్షణములు.

కర్ణశూల అనగా చెవిపోటు దీనిని అరబ్బీభాషలో వంజివుల్ వుజ్న అందురు. ఈ వ్యాధి కారణానుసారముగా హేతువులనుబట్టి నవవిధములుగా నుండునని విభజింపబడినది.

(1) ఈ వ్యాధి వుష్ణస్వభావము యొక్క ప్రకోపముచే దీని యందుండి యేదైనను వుష్ణ ఆవిరి పైకి లేచి కర్ణములో నిలిచి పీడించుచుండినట్టి కారణమువలన రక్తమువలన కలిగించును. దీని లక్షణములు అనగా శూల, పోటు, కలిగియుండును. మరియు నేత్రములు, నాసికయు యెఱ్ఱగానుండును. రోగికి తన చెవులలోనుండి నిప్పుసెగ బైటికి వెడలునటుల తోచుచుండును, గొంతుప్రక్కలో శుష్కత్వము కలుగుట యీ మొదలగు చిహ్నములు కలిగియుండును. మరియు యీ వ్యాధి నాలుగువిధములుగా నుండును.

(1) మలము ఆమాశయమునందుండి వాయువుయొక్క ఆవిరి పరమాణువులు మెదడునందు ప్రవేశించును మరియు ఆమాశయమునందు మలము యేర్పడుటవలన కలుగు లక్షణములెవ్వియనగా ఆమాశయముయొక్క కంఠమునందు మంట కలుగుట మిక్కిలి దాహమగుట చల్లని జలపానవిశేషత్వమువలన శాంతినొందినటులుండుట నేత్రములయందు నీరునిలిచియుండుట యీ మొదలగు లక్షణములు ఆమాశయమునందు మలదోషము చేరుటవలన కలుగు చిహ్నములని గ్రహించవలెను.

### ఆమాశయ మలదోషకర్ణశూల చికిత్స.

అవశ్యమని తోచినయెడల బాసలీక్ అను నరముఛేదించి అవశ్యకతానుసారముగా రక్తమోక్షణమును చేయించవలెను. మరియు కరశ్యాయు కషాయమును పానముచేసి ప్రకృతిని మృదువరచవలెను. మరియు చల్లనిభోజనములు అనగా ఉచితముగునవి భుజించవలెను. గసగసాల [illegible] కాహూవిత్తులు ధనియాలుచేర్చి చేయబడిన కషాయము పాన

మొపరించవలెను. ఇట్టి భోజనపానాదులు ఆమాశయము కుసితము చలువను కలిగించును మరియు ఎగవాయువులు మెదడునందు ప్రవేశించకుండునట్టుల ఆపివేయును. మరియు కష్టముగల అంగమునందు చెమ్మకలిగించుటకున్ను, ఆవిరి పరమాణువులను బొందవోలుటకు ౩, గుల్ రోగన్ అనగా గులాబిపూలనూనె మూడు భాగములు శిరకాలో కలిపి తైలపక్వముగా కాచి చల్లార్చి చెవిలో వేయవలెను, మరియు పోటుతోకూడిననొప్పి బిగబట్టినటులుండుట మొదలగు కారణవిశేషములవలన మూర్ఛ సంభవించినయెడల నల్లమందు చనుబాలలో అరగదీసి చెవిలో వేయవలెను మరియు చందనము, మమీరాసా, వష్నీరు, ధనియాలను నూనెతోనూరిగాని చెవి వెనుకవైపు లేపనము చేయవలెను.

(సూచనీయము) నల్లమందు, చనుబాలు యెల్లప్పుడు ఉపయోగించకూడదు. యెందుకనగా యెల్లప్పుడు నల్లమందు నుపయోగించుట వలనతిమ్మిరి, బరువుఅనగా భారముగానుండుట మొదలగునుపద్రవములు కలిగించును. మరియు నల్లమందు గుల్ రోగన్‌లో కలిపి వేయకూడదు. యెందుకనగా నూనెయొక్క చిక్కదనమువలన నల్లమందు పేరుకొని యుండును. యీ కారణమువలన నొప్పి విశేషమగును. మరియు చనుబాలతో నల్లమందు కలిపివేయుటవలన నొప్పి అధికము కాజాలదు. యెందుకనగా పాలు తేలికైనవగుటకారణమువలన చెవికిదిగి శుభ్రత నొందించును. మరియు నూనెకంటె పాలు నొప్పిని వెంటనే ఆపివేయును. మరియు అంగమును మిక్కిలి మృదుత్వము నొందించును.

## (2) వుష్ణవాత కర్ణరోగ చికిత్స

ఉష్ణదినములలో ప్రయాణము చేయుటవలన నడుచునట్టి హేతువువలన మెదడునందుండు చెమ్మయందు ఉష్ణము ప్రవేశించి అందుండి ఆవిరి వెడలి ఆ ఆవిరిలోనుండి ఉష్ణభాగము వేరై పరమాణువులతో గాలి గామారి చెవియందు నిలిచిపోవును. దీనిలక్షణము రోగి రెండుచెవులయందున్ను, రెండు నేత్రములయందున్ను, నాసామార్గమునందున్ను

వేడి మంట కలిగియుండుట, ముక్కు ఎండుట, వ్యాకులతనొందుట, తాపము, దుదాహము కలుగుట యీ మొదలగు చిహ్నములు కలిగియుండును. యిట్టిస్థితియందు చల్లని జలము పుక్కిలించుటవలన యీచిహ్నములు శాంతినొందునటుల తోచుచుండును. మరియు యీరోగకారణము ఆమాశయమునందు కలుగుచున్నది. అచ్చట ఇంతకంటె విపరీతముగా నుండును. అనగా శీతజలపానము చేయుచుండిన యేమియు శాంతించజాలదు. యీవిధమగు రోగమునందు పుక్కిలించుటవలన రోగశాంతి నొందువలన కలుగుచున్నదనిన, ఉష్ణము కేవలము తలయొక్క అంగములయందు నిలిచియుండును మరియు రోగమునకుముందు ఉష్ణవాయువు శోకుటవలన దీనికి సాక్షియగును.

ఉష్ణవాత కర్ణరోగ చికిత్స.

గుల్‌రోగన్ ఒకభాగము, శిరకా మూడుభాగములు కలిపి తైలము మిగులునటుల కాచి చెవిలో వేయవలెను. మరియు చల్లనిబట్టను చెవిపై వేయవలెను. మరియు మెదడునందు జలుబు, చెమ్మ కలుగుటకు పరిశ్రమ చేయవలెను. అనగా చల్లనికావడములు, తైలములు మరియు చల్లని యితరవస్తువులను ప్రయోగించవలెను. అనగా యీవస్తువులను దాహయుక్త శిరోరోగమునందు చెప్పబడినవి. కాబట్టి చదువరులు గ్రహించగలరు.

ఉష్ణజల విశేషస్య కర్ణశూలలక్షణములు.

ఉష్ణోదకముగాని ఉష్ణకషాయములుగాని మిక్కిలి వుపయోగించుట వేడిజలము చెవిలోపోయుట మొదలగునవియు ఉష్ణమగు ఔషధములపానాదులవలనవుత్పన్నమగును. ఈవ్యాధికారణము అనగా ఉష్ణస్వభావికమగు నీళ్లు చెవిలోపడుటవలనగాని లేక నీళ్ళలో యీదుటవలనగాని వాతము వుత్పన్నమగుచున్నది. నమూజియా అనగా వాయువు చెడుటయందు వర్ణించబడినవి. ముఖ్యముగా ఉష్ణమగుకొండజలమును అరబ్బీభాషయందు మియహాహుమ్మదా అందురు. అనగా

గంధకమునందు గనియందు జలము, వుప్పునీరు, చవిటిభూముల జలము, యిత్యాదివుష్ణస్వభావికజలములు తలకు విశేషముగా వుష్ణమును కలిగించును. మరియు వుష్ణవాతములను పుట్టించుటకు సహాయములగు యీవ్యాధి చిహ్నములు కారణముయొక్క అనుకూలతను బట్టి కలుగుచున్నది. మరియు తల లఘువుగానుండుట తేలు చెవులు విశేషవుష్ణముగానుండుట దీని అంతమధ్యములయందు నొప్పి కలుగుట మొదలగు లక్షణములు కలిగియుండును.

(సూచనీయము) సమస్తవాతరోగములయందు తల లఘువుగా నుండినటుల తోచుచుండును.

### 3 ఉష్ణజల విశేషత్వకర్ణశూలచికిత్స.

అవశ్యము కలిగినచో మలము వెడలుటకున్ను క్రిందికి దిగుటకున్ను శిరావేదనము చేయవలెను. మరియు పిక్కలను బాధించవలెను. పాదములు, కాళ్లు, మర్దించవలెను. ఆవిరిని ఆటంకము కలిగించుటకై చల్లని తైలములు అనగా బాదంపప్పు తైలము, కలువపూల తైలము, సారగింజల తైలము, యీమొదలగు తైలములను వేరువేరుగా ముక్కునందున్ను చెవులయందున్ను పోయవలెను. అభిప్రాయమేమనగా మెదడునందు చెమ్మను కలిగించు లేపన పానాదులను ప్రయోగించుటకు పరిశ్రమ చేయవలెను.

### 4 వాతజకర్ణశూల లక్షణములు

ఉష్ణస్వభావికముగల ఔషధములు సేవించుటవలన వాతము వుత్పన్నమగును. అనగా అచ్చటిదోషములు రతూబతు అనగా నీరును అధికపరచును. మరియు రోగమునకు ముందు కారణము కలుగుటయే దీని చిహ్నములని భావించవలెను.

### 4 వాతజ కర్ణశూలచికిత్స

ముందుగా శిరావేదనమును గావించవలెను. పిమ్మట కోష్ఠము

ను పృథుత్వము నొందించవలెను, మరియు వాతవిరుద్ధమగు లేపనాదులను చేయవలెను.

## రెండవ విధమగు కర్ణశూల లక్షణములు.

చల్లని చిక్కనివాతము చెవిరంధ్రమునందు నిలిచియుండుటవలన యీవ్యాధి కలుగుచున్నది. మరియు యీవాతము అచ్చటనుంచి వెడలుటకు మార్గము చిక్కకపోవుటవలన చెవియందు పోటుకలుగుచున్నది. ఇచ్చట వాతకారణముగను స్తానము విరుద్ధముగానుండును. ఈ రోగము పైవిధముగనే అయిదు విధములుగా విభజించిచెప్పబడియె.

(1) ఈరోగకారణము ఆమాశయమునుండి చెవిపైవరకు ఎక్కిపోవును. మరియు మలము అమాశయమునందు నిలిచియుండును. దీని లక్షణములు కడుపులో వ్యాకుల్యముగానుండుట నోటనీరూరుట మరియు తలనొప్పి ఉష్ణవాతముసంబంధము కలుగు తలనొప్పికంటె యిందు స్వల్పముగానుండుట యిట్టితరి ఉష్ణోదకముతో తలను కావడముచేసిన యెడల రోగికి స్థిరముగానుండినట్లు తోచుట మొదలగులక్షణములు కలిగియుండును.

—రెండవ భేదము. మొదటికారణము చెవిపోటు చికిత్స.—

ఆమాశయమునందుండు మలము వెడలించినపిమ్మట ఉష్ణతైలములు అనగా గారతైలము, సదాపాకుతైలము, ఆముదము చెవిలో పోయవలెను. మరియు ఈతైలములను నీరుల్లి పచ్చిసదాపాకురసములో వేసి కాచి చెవిలోవేసినయెడల మిక్కిలి గుణదాయకమగును. మరియు ఉష్ణమును కలిగించుట నష్టపరచుట మిక్కిలి వుచితమని తోచినచో జున్ను, రాజహంసకూడా యీతైలములో చేర్చుటమంచిది.

— (2) శీతజకర్ణరోగ లక్షణములు.—

తలయందు చల్లని మృధుదార్ధముకలదు అందు ఉష్ణసారము స్వల్పముగా నుండునట్టి కారణమువలన అందునుండి చల్లనివాతము పైలు

## సాధారణ దుష్ట ప్రకృతి కర్ణశూల లక్షణము.

సాధారణదుష్టప్రకృతియందు పిత్తముచెడుటవలన వుత్పన్నమగుచున్నది. దీనిలక్షణములు ముఖమునందు తలయందు నొప్పికలుగుట రోగిచల్లని గాలికోరుచుండుట. యిది దోషరహితదుష్టప్రకృతి లేక కఫ కారణమువలన కలుగుచున్నది. మరియు యిందు జలుబుకలిగించు నుపాయములుచేయుట మరియు చెవినొప్పితోనుంట యెరువు కలుగకుండుట వుష్ణవస్తువులతో ముఖ్యముగా ప్రత్యేకముగా వుష్ణమగును. వీటివలన రోగికి లాభము ప్రాప్తించును

మరియు నొప్పి మలదోషము వలన కలిగినచో తలయందున్ను చెవులయందున్ను భారముగానుండుట నిద్రవిశేషముగా వచ్చుచుండుట, మరియు నాసామార్గములయందు చెమ్మకలిగియుండుట మొదలగు లక్షణములు కలిగియుండును.

### సాధారణదుష్టప్రకృతి కర్ణశూలచికిత్స

మలదోషమువలన చెవిపోటుకలిగినచో యారజాత్ మాత్రలు యుపయోగించి మలమును వెడలించవలెను. మలము శుభ్రతనొందిన వెనుక వుష్ణస్వభావికమగు తైలములు అనగా ముల్లంగితైలము, చంగల్వకోష్టుతైలము, నార్దన్ తైలము, జాంబక్ తైలము, జాంబక్ అనగా (ఒకవిధమగు సువాసనపుష్పము యీపుష్పము తెల్లగానుండును.) యీ మొదలగు తైలములను ప్రత్యేకముగా చెవిలోపోయవలెను. మరియు మలము నష్టపరచునట్టి వస్తువులలోనుండి బాబూనా, సోయి, దవనము మరువము, అక్కలకర్ర, యీవస్తువులు నీళ్ళలోవేసి కషాయముకాచి ఆకషాయములో బట్టతడిపి కావడముచేయవలెను. మరియు మలమును తీసివేయనిదే మలమును కదలించునట్టి వస్తువులు చెవిలోపోయుట అనావశ్యకము. అనగా యేవస్తువు వుష్ణము కలిగించి ప్రకృతిని తనదశయందు మార్చునో అట్టివస్తువులు యీవ్యాధియందు లాభదాయకములని గ్రహించవలెను.

(సూచనీయ ii) జాంబకు తైలమనగా పుష్పములనూనె తో చంబేలి పువ్వులు వేసి కాచుట, లేక నొండ గోవుంచుట వలన ఆపుష్ప సారము ను నూనె గ్రహించును. ఆనూనెను రోగనేజాంబక్ అందురు.

## వాపువలన కలుగు చెవిపోటు లక్షణము.

ముందు వాపుకలిగినపిమ్మట చెవియందు శూలవుత్పన్నమగును ఇది రెండు విధములుగా విభజించబడినది. (1) వాపు వృష్ణమువలన కలుగుచున్నది. (2) జలుబువలన వాపు కలుగును.

(1) వృష్ణమువలన కలుగు వాపు లక్షణములు చెవిపోటు నొప్పి విశేషముగా నుండుట, తల, నొసలు, భారముగా నుండుట, పీకుచుండుట మరియు మంట, బాధ, విశేషముగా నుండుట, ముఖము యెఱ్ఱగానుండుట, మొదలగుచిహ్నములు కలిగి యుండును. మరియు నీవాపు రెండువిధములుగా కలుగుచున్నది (1) చెవిరంధ్రమునందున్న (2) చెవిరంధ్రము బైటిభాగముయొక్క అంగమునందున్న వుత్పన్నమై ప్రత్యక్షముగా కనబడుచుండును. ఈవాపువలన నొప్పివిశేషముగా నుండును. మరియు నిది మెదడునుండియు మెదడుసంబంధమగు మలము నుండియు దూరముగానుండును. మరియు వీటిజ్ఞానశక్తి తీక్ష్ణముగానుండును. ఈవాపు శీఘ్రమై బుద్ధలైనమెదడు అందుండు వినుటకుశక్తిగల జీవనరముండి చితికిపోవుటవలన దీనికి విధమైన అపాయము కలుగకుండును. ఇందుగల రెండులాభ కారణములవలన యీనొప్పియందు విశేషమగు అపాయముకలుగనేరదు.

### —వాపు కారణ కర్ణ రోగచికిత్స—

మలము సంహారింపజేయునట్టియు దూరపరచునట్టి ఔషదముల ప్రయోగించకూడదు. మరియు మలమును వాపుగలస్థలమునకు తెచ్చుకొనవలెను. మరియు శృంగీయంత్రముతో తీసివేయవలెను. తదుపరి రెండుదినముల తరువాత కర్నుబ్ అనగా క్యాబేజ్ ఆకులు, పురాతన

నేతితో వేయించి వాపుపై లేపనము చేయవలెను. ఇట్లుచేసినచో వాపు హరించును. మరియు ఆరంభమునుండి నొప్పినిలిచియున్నయెడల మందినీళ్ళలో బట్టతడిపి వాపుపైనుంచవలెను. నొప్పివిశేషముగా నున్నచో వువ్వువేయించి కాచవలెను.

## కర్ణఛిద్రవాపు శూల లక్షణములు

చెవిలోపటి రంధ్రమునందు వాపుపుత్పన్నమగును. వినునట్టిశక్తిగల జీవనరమునకు యీరంధ్రమునమీాపమునందుండుటవలన వినబడుటకు ఆటంకము సంభవించును. మరియు యీరోగమునందు చీముకలుగువరకు నొప్పివిశేషకఠినముగానుండును. ఈరోగము మిక్కిలి అపాయకరమైనది. నొప్పి విశేషత్వమువలన రోగికి మూర్ఛవచ్చుచుండును. మతిస్థిరముగానుండ నేరదు. అనగా బహుదానరసాం (తలయందువాపు) దశయందుచేరుచున్నది, మరియు ఈనొప్పి ముఖ్యముగా యవ్వనులకు కలిగిన ఏడురోజులలో మృతినొందించును. ఈవిధముగు చెవివాపు కలుగుటవలన యేర్పడుచిహ్నములు చెవిలోభాగము వినుపించుటలో భేదముగానుండుట, చెవిచుట్టు నొప్పివిశేషముగానుండుట శబ్దము కొంతవరకు వినబడుట కొంతవినబడకుండుట యీమొదలగు లక్షణములు రోగికి తోచుచుండుట మరియు మెదడునందున్న తలయొక్క యీావత్తుఅంగమువలన కాపాడునట్టిశక్తియందు దుర్బలము వచ్చుటవలన నేత్రములవెంట నీరుస్రవించనారంభించుట ముక్కునుండి నీరు వెడలుచుండుట మరియు యీరోగికి జ్వరము యెల్లప్పుడు విశేషముగానుండుట మరియు యీవాపు చెవిబైటిపైపునుండినయెడల యీవాపునందు చెవిలోపల వాపుగలరోగివలె జ్వరము యెల్లప్పుడు యుండనేరదు. గాని యొకాహికజ్వరమునిపించును.

### కర్ణఛిద్రశూలచికిత్స.

ఈవ్యాధిగలరోగికి శిరాభేదము చేయించి శరీరమును మృదు

త్వము నొందించునట్టి వుపాయమును చేయవలెను మరియు శియాఫే అవియజ్ చెవిలోపోయుచుండవలెను. మరియు హాకీముజనీతుఖసాక్ గారి కుమారుడుగారు కనిపెట్టిన నదకాఅనుఔషధమును వద్భిధనియాల రసము, కామంచాకురసము, కాసినిరసములలోకలిపి లేవనము చేయవలె ను. మరియు చనుబాలు చెవిలోపిండవలెను. ఈ మొదలగు సదుపాయ ములు నొప్పిని తగ్గించుటకని గ్రహించవలెను. మరియు యీనొప్పి యీావ్రిక్రియలవలన తగ్గనిచో మలమును వదల్వవరచునట్టి అగసివిత్తులు మొదలగునవి నూరి చెవిలోపోయవలెను. ఇటులపోయుటవలన చెవిలో నుండు చీముపక్వమై వెడలిపోవును, నొప్పిశాంతించును.

## నదకా అను ఔషధక్రియము

ఎర్రచందనము, తెల్లచందనము, వంటకేగురు, శూమిసా, రసాం జనము, సపేదా, బూసాదరుబంద్ది, కాసినివిత్తులు, తవాక్షీరి, పచ్చక ర్పూరము ఈపదిఓషధులు ప్రత్యేకముగా మెంగయుదితముగానుండునో తీసికొని చల్లని రసములోనూరి మాత్రలు చేయవలెను. మొదలు లావు గను చివర సన్నముగా నుండునటుల కనికెలు చేసికోవలెను. యీఔ షధమును అవసరముకలిగినప్పుడు అరుగదీసి యుపయోగించవలెను

మరియు బూసాదర్ బంకీ అనగా వకవిధమగు గడ్డిజాతి. దీనిని సమూలమునూరి బిళ్లలుచేసి యుంచుదురు. యీబిళ్లలు స్వభావికము జలుబు, చెమ్మగలవిగానుండును. దర్ బంద్ ఒకదేశమునకు పేరుగలదు.

(సూచనీయము) ఉష్ణవావు రక్తజకారణమువలనగాని పిత్తజదో షకారణము వలనగాని కలిగినచో ప్రత్యేకచిన్నములు వాటికి సాక్షి యగును. యిట్టిస్థితియందు యీబిళ్లను లేపనముచేయుటవలన ఆదోష ప్రకృతిగల వావు తగ్గిపోవును.

## శీతప్రకృతి వాపు కర్ణశూల నిదానము.

చెవిలో చల్లనిప్రకృతివలన వాపుకలిగి శూల సంభవించును. ఈవాపు చెవివెలుపటిభాగమునందుకూడా వుత్పన్నమగుచున్నది. మరియు, చెవిలోపటి రంధ్రమునందున్ను బైటివరకు కలుగుచున్నది. అభిప్రాయమేమనగా యిటుల కలిగినవాపువలన జీవనరములకు దీనికష్టము సంభవించనేరదు. యెందుకనగా వుక్తజీవనరము కఠినముగా నుండును. మరియు రెండునన్నని ఝల్లిపొరలుగలవు. ఆపొరలు మెదడునుండి బైలువెడలినవి. ఈజీవనరమునందు చుట్టుకొనియున్నవి. వాపుకలుగునప్పుడు కఫసంబంధమగు మలము చిక్కగానుండును. యీకారణమువలన వినునట్టి జీవనరమునందు ప్రవేశించజాలదు. కాబట్టి ప్రకృతికూడా చేరనియ్యదు. గాని తనకర్తవ్యము యొక్క ఆజ్ఞవలన యెల్లప్పుడు విపత్తులను దూరపరచుటకు ప్రయత్నించుచుండును. మరియు, యీవాపులక్షణములు అనగా భారము, పీకుట, పోటు, నొప్పి విశేషమగును. మరియు తలనొప్పి, క్రోధము, జ్వరము మొదలగునవి ఉష్ణములమువలనకలుగుచిహ్నములు అనగా వుష్ణశూలములేనిదే కలుగదనుట. వీనిలో యేచిహ్నములుకూడా కలుగనేరవు.

—శీతప్రకృతివలన కలుగు కర్ణవాపుశూల చికిత్స.—

మలదోషమును తీసివేయుటకై యారజాత్ మొదలగు మాత్రలు ఇవ్వవలెను. మరియు కషాయములతో పుక్కిలించవలెను. మరియు సోయితైలముగాని, ముల్లంగితైలముగాని చెవిలో వేయవలెను. మలమును నష్టపరచునట్టి మెంతిపిండి, బాబూనా, రాతినజ్, మయినముఈ మొదలగునవి జైతూన్‌నూనెలోకలిపి కాచి లేపనము చేయవలెను. మరియు వాతసంబంధమగు వాపునందుకూడా యిటులనే చికిత్సచేయవలెనని గ్రహించవలెను. యీకారణమువలన వాపు కఠినముగానుండును. గానలేపనలుచెప్పబడినవి. కాబట్టిలేపనలుచేయుటవలన వాపుమెత్తబడును.

# చెవిలో వ్రణము కలుగుట వలన కలుగు శూలవర్ణనము.

ఈ చెవిపోటు చెవిలో వ్రణముకలుగుటవలన ఉత్పన్నమగుచున్నది. దీని చిన్నములు ముందుగా వాపుజనించుట మరియు, చెవిలోనుండి చీము స్రవించుచుండుట వ్రణము నూతనముగలదైనచో మరహాం అబియజ్, గుల్‌రోగనులో కలిపి చెవిలో పోయవలెను. గాని గాయమును చీముతో రిక్తపరచి తదుపరి వ్రణమును మాన్పునట్టి ఔషధములను వుపయోగించుటవలన గాయము మానిపోవును. మరియు వ్రణమును శుభ్రపరచునట్టి విధానమేమనగా పాతదూది తేనెనీళ్ళలో తడిపి చెవిలో నుంచవలెను. దీనివలన చీము బైటికివచ్చును తదుపరి మరహాంఇస్పిదాజ్ మరియు, మరహాంరాతినజ్ మరియు, అంజరూద్ దమ్ముల్ అఖ్వైన్ అనగా కహరోబా, గవ్వపలుకుసాంబ్రాణి, ఉసారెయాతీస్, ఈ వస్తువులు చూర్ణించి ఆచూర్ణమును వత్తిపైచల్లి చెవిలో ప్రయోగించవలెను.

### మరహాం అబియజ్ చేయుక్రమము.

సఫేదా 1భాగము, మైనము 1భాగము, గుల్‌రోగన్ గాని మంచినూనెగాని రెండుభాగములు, యిందులో మయినమునూనెలో వేసికాచినపేదా కల్వమునందుంచి నూరుచూ కొంచెముకొంచెము అందుపై వేశి నూరుచుండవలెను, చల్లారువరకు నూరిన అంతయు కలసిపోవును. మరియు వ్రణము పురాతనమునుండి మలినముతో నిండియున్నచో మరహాంమిసరి, మరహాంబానలిఖూన్, కబీరా మరియు మరహాంఅహామర్ మరియు మరహాంఖల్‌ఖపసుల్‌హదీద్ మొదలగునవి వుపయోగించవలెను. మరియు రోగిచెవులోనుండి కేవలము నీరుస్రవించుచుండి చీముళారకుండిన మాదికాయనూరి పాతసారాయిలో కలిపి చెవిలో పోయుట

వలన వ్యాధి తగ్గిపోవును. మరియు రోగియొక్క చెవినుండి నీరుస్రవించుచు యిందులోకూడా చీముకలసియున్నటుల తోచినచో శుష్కత్వమును కలిగించునట్టి ఔషధములలో మలమును వలచనచేసి శుభ్రపరచునట్టియు వ్రణమును బాగుచేయునట్టియు ఔషధములను చేర్చుకొనవలెను. మరియు యిట్టివ్రణమునందు నొప్పికలిగినయెడల ఆనొప్పి తగ్గించవలసినయెడల నల్లమందుకాల్చి ఆఔషధములలో చేర్చవలెను. యెందుకనగా, నల్లమందుకంటె నల్లమందుబూడె శుష్కత్వమును కలిగించి తిమ్మిరి కలిగించు విశేషత్వము అధికముగానుండును. మరియు ఈనల్లమందు బూడిదెయందు కొద్దిగా జున్నకూడా చేర్చవలెను. దీనివలన నల్లమందుయొక్క దుర్గుణము తగ్గిపోవును.

మరహంమిశిరి చేయుక్రమము.

జంగాలపచ్చ, తేనె, శెనగపులుసు, గవ్వపలుకుసాంబ్రాణి ఈ నాలుగు వస్తువులు సమముగాచేర్చి, నీళ్ళలోవేసి తేనెవలె చిక్కబడు వరకుకాచి అందులో మయినము గుల్‌రోగన్ అనగా గులాబిపూలనూనె కలిపి ఉపయోగించవలెను.

మరహంబానలికూన్ కబీర్ చేయుక్రమము.

మయినము పావుయెత్తు, జున్న 32మాషములు, బాలింతబోలు రాతినజ్, అలేకుల్‌బతం, ప్రత్యేకము 16 మాషములు, జైతూన్‌తైలము ఒకశేరు ముందు మైనము నూనెలోవేసి కాచి పిమ్మట తక్కిన నాలుగువస్తువులు అందుకలిపి మలాము చేయవలెను.

ఖల్‌కబసూల్ హాదీద్ చేయుక్రమము.

ఖల్‌సుల్‌హాదదు అనగా ఇనపతుప్పు. ఒకనెలవరకు ఖల్ అనగా శెనగపులుసులో బావన చేయబడినది. ఒకనెలకంటె జాస్తిదినములు శిరకాలో భావనచేసి ఆశిరకా అనగా శెనగపులుసు వేరుగాతీసికోనవలెను.

డిటో 2 వ ప్రకరణము.

ఇనుపతుప్పు శిరకాలో బావనచేసి ఎండించి తదుపరి పాతశిర

కాను తేనెపాకమువచ్చువరకు కాచి దించుకొని సమయానుకూలము గా చెవిలో వేయవలెను.

# క్రిమిజకర్ణశూల లక్షణము.

చెవిలో క్రిమి పుట్టుచున్నందువలన నొప్పి పుట్టుచుండును. ఈ వ్యాధి రెండుభేదములుగా నుండును. (1) కుళ్ళినమలమువలన (2) పురాతన వ్రణము వలన చెవిలో క్రిములు కలిగి పోటులుగును.

మలము కుళ్లి చెవిలో క్రిములు పుట్టుటవలన కలుగుచిహ్నము లు చెవిలో దురద పురుగులు పాకినట్లుండుట ఒకానొకప్పుడు చెవిలో నుండి పురుగులు బైటికి వెడలుట మొదలగు లక్షణము కలుగును. ఈ పురుగులు మల విశుద్ధతవలన రెండువిధములుగా నుండును. అనగా నల్ల ని తల కలిగి తెల్లగానుండును. యెల్లప్పుడు చెవిలో కెలికినటులుండును. (2) వ విధమగు పురుగులు శాకీరంగుకలిగియుండును.

## క్రిమిజకర్ణశూలచికిత్స.

క్రిములను నశింపజేయునట్టి వుపాయము లెవ్వి యనగా చేన గవులును, పాపడిలవణము, వసాంబ్రమును, ఇంగూ మొదలగువస్తువులను అజామోదమురసము, అథవా చేమపుచ్చకాయగుజ్జు, లేక సాపునాల్ ఆకులలో కాచిన కషాయముతోగాని నూరి కలిపి చెవిలోపోయవలెను. దీనివలన పురుగులు యావత్తు నశించిపోవును. క్రిమి నశించినవెంటనే వాటినితీసివేయు నుపాయములను చేయవలెను అనగా దివాకువత్తి చేసి దివాకు అనగా ఒకవిధమగు గింజలు ఇవి బాగ్రాతువండ్లవలెనుండును. ఆగింజలను చూర్ణించి గొట్టములోవేసి చెవిలోనూదవలెను. అథవా నఖచికిని అనగా ముక్కుతుమ్ముడాకు నూరి ముక్కులో వూదవలెను. ఇటుల నూదుటవలన తుమ్మువచ్చు సమయమునందు ముక్కునోరు బిగించియుంచవలెను. ఇటులనందినయెడల తుమ్ము వేగము చెవిపైవు

నకు ప్రవేశించి అతుమయొక్క బీళ్ళవలన చెవిలోపలంను పురుగులు బైటికివచ్చును.

మరియు రోగిచెవిలో వ్రణమువలన పురుగులు కలిగినచోముందు పురుగులను నశింపజేసి పిమ్మట వ్రణమును శుభ్రిపరుచవలెను. అటుపిమ్మట వ్రణమును మాన్పునట్టి ఔషధములు చెవిలోపోయవలెను.

## చెవిలో పురుగులు ప్రవేశించుట వలన కలుగు చెవిపోటు లక్షణము.

చీమలు, పురుగులు, చెవిలోదూరుటవలన చెవిలో పోటు సంభవించును. దీనిచిహ్నములు, చెవిలో పురుగుతిరుగునటులతోచుట పురుగులు తిరిగినప్పుడెల్ల నొప్పి అధికముగా నుండుట పురుగులు తిరుగకుండిన శాంతి నొందినటులుండుట యీమొదలగు లక్షణములు కలిగియుండును.

### చెవిలో పురుగులు ప్రవేశించుటవలన కలుగుచెవినొప్పి చికిత్స.

పురుగులను నశింపజేయునట్టియు తీసివేయునట్టి నుపాయములను పైన వుదహరించునటుల వీనినికూడా ఆయాఔషధ వుపాయములతో తొలగించవలెను.

### చెవిలో నీరుప్రవేశించుటవలన కలుగు కర్ణశూల లక్షణములు.

చెవిలోనీళ్లుప్రవేశించుటవలన నొప్పి వుత్పన్నమగును. అనగా చెవిలో నీళ్ళు ప్రవేశించి త్వరలో తిరిగి రాజాలకపోవుటవలన చెవిపోటు సంభవించును. మరియు చెవిగూబమూలమునందు కష్టము సంభవించుటవలన వాపు కలిగించును. ఇట్టిదశయందు అవశ్యముగా నొప్పి కలుగుచున్నది. ఒకానొకప్పుడు యీనీరు చెవి గూబలలోకలిసి వుష్ణమువలన వుబుకనారంభించినచో కొద్దిఅయినను మిక్కిలి భారముకలిగించుచుండును. నీచగుణముగల చెడునీరువలన త్వరలో యీవ్యాధికలుగు

ను. మరియు చెవిలోనీళ్ళు ప్రవేశించుటవలన కలుగుః క్షణము లేక్వి యున నదిలో నీదుటవలన లేక స్నానము చేసినవెనుక రెండుదినము లలో నొప్పి కలిగి ఆనొప్పితోకూడా వినబడుటతగ్గిపోవును.

### చెవియందుండు నీరు తీయు క్రమము.

చెవిలోనుండు నీళ్ళను యిందువ్రాసినప్రకారము తీసివేయునట్టి యత్నము చేయవలెను.

(1) తన అరిచెయ్యి చెవుమీదనుంచి తలచెవిపైవుకు వరగ కొట్టి వంటికాలిమీద నిలువబడి నీళ్ళుబైటికి వచ్చువరకు దుముకుచుం డవలెను.

(2) రోగియొక్క చెవిలో నీళ్ళను మరియొకడు నోటితోగాని పిచికారితోగాని లాగుకొనవలెను.

(3) స్పంజివత్తిచేసి చెవిలోయుంచి రోగిని ఆవత్తివుంచినవైపు పరుండబెట్టవలెను. అట్లుకొంతశేపుంచినచో ఆవత్తి నీరు పీల్చివేయును. తదుపరి ఆవత్తిని తీసివేయవలెను.

## తర్కా, వక్రా, సుమూమ్ లక్షణములు.

తర్కా అనగా కొంతవరకు వినుపించుట వక్ర అనగా బొత్తిగా వినపించకుండుట, సుమూమ్, అనగా చెవిరంధ్రము పూడిపోవుట, యీ మొదలగునవి అప్పుడప్పుడు వీటి అర్థము రెండవదానితో విరుద్ధ ముగా కలుగుచుండును. మరియు చాలాకాలమునుండి వినుటకు కష్టము గానుండినను పురాతనమైనచో దీనిని కొందరు వైద్యవరులు వక్రమని చెప్పుచున్నారు. నూతనముగా వినుపించుటకు కష్టముగా నున్నచో దీని ని తర్కా అని వదించుచున్నారు. అభిప్రాయమేమనగా స్వల్పముగా వినుపించుట బొత్తిగా వినుపించకపోవుట మొదలగువానిని యేడు భాగ ములుగా విభజించబడినది,

(1) జన్మనుండి వినుపించకుండిన అట్టివ్యాధికి చికిత్సచెప్పబడలే దు. దీనికి చికిత్సలేకపోవుటకు రెండు అంశములు గలవు. ఒకటి వినునట్టి

శక్తి నష్టమగుటయు రెండవది యిదిజన్మమునుండియే వుత్పన్నమగును. చికిత్సతో శాంతించనిచో వినుచుండునట్టిశక్తిని కలిగించుట మానవుల కు పనికాదు. ఇదికేవలము అభావముగాన చికిత్సవలన ప్రయోజనము కలుగనేరదని ప్రకటించబడుచున్నది. మరియు హకీము అరస్తుగారున్ను బుకరాత్ గారియొక్క బుద్ధి దీనిని కనిపెట్టజాలదయ్యె. మరియు శ్రవణ శక్తిమార్గము బంధించబడునట్టి వర్ణనము యీఅధ్యాయము అంతము నందు పలవిధమగు దుర్బలత సహితముగా విస్తార వర్ణనము చేయబడును మరియు దీని చికిత్సకూడా స్పష్టముగానుండును. మరియు జన్మమునుండి యు మూగతనముకూడా కలుగునని ప్రకటనమగుచున్నది. యేలననగా శబ్దము చెప్పుటకున్న వుచ్చారణచేయుటకున్న వానికి సర్వదా జ్ఞాన ముండనేరదు. మరియు తెలిసిన సంగతిచెప్పుటకు కఠినముగా నుండును

(2) మిక్కిలి వయస్సుకలిగి వార్ధిక్యము సంభవించి నప్పుడు బధిరత్వము సంభవించును. యెందుకనగా అట్టిదశయందు శక్తి దుర్బల ము జెందుచుండును. మరియు జలుబు, శుష్కత్వము, అధికమగుచు న్నది. యీఅవస్థయందు కలుగు వ్యాధికికూడా చికిత్స ప్రయోజనముం డదు. యిందువిషయములను వైద్యవేత్తలు బాగుగా నెరుగుదురు.

(3) చెవి రంధ్రమునందుండు జీవనరము శ్రవణశక్తికలిగి పరు చబడి యుండును. యీనరము దెబ్బతగులుట, ఉన్నతప్రదేశమునుండి క్రిందపడుటవలన తెగిపోవును. యిటుల తెగిపోవుటవలన చెవిటితనము సంభవించును. కాబట్టి దీనికికూడా చికిత్స ప్రయోజనములేదు యెటుల ననగా తెగినట్టి ఆజీవనరము తిరిగి కూడుకొనుట మిక్కిలి కష్టము.

(4) రోగసంధియందు పిత్తము మెదడునందుచేరి బధిరత్వము పుట్టించును. యెటులననగా తీక్ష్ణమగు యీవ్యాధి పిత్తజ్వరరోగాంతము నందు ఉత్పన్నమగుచున్నది. దీని లక్షణములు పిత్తజలక్షణములు ప్ర కటనమగును. మరియు దీనిని వర్ణనము చేయబడెను. కాబట్టి యావత్తు తెలియగలవు

## రోగసంధియందు కలుగు బధిరత్వచికిత్స.

కరకా, యవక్షారము మొదలగునట్టి వస్తువులతో మలమును తీసి వేయవలెను. అనగా సందర్భమునుబట్టి మలమును క్రిందికిత్రోసివేళి పిమ్మట దానిమ్మరసమును చెవిలోపోయవలెను. నిది అంగమునందు జలుబును పుట్టించును. మరియు అంగములకు బలము కలిగించి పిత్తమును శాంతినొందించవలెను యికర దోషన బాధముగ మలము యీస్థానమునందు ప్రవేశించకుండునటుల కాపాడవలెను.

## దానిమ్మరసము తీయుక్రియము

పుల్లదానిమ్మకాయలను వొలిచి అందుండు కండ గింజలుతీసి కొని పైనుండుచర్మమును వేరువేసి తదుపరి గింజలు గుజ్జు కలిపి పిండుకొనవలెను. పిమ్మట ఆగింజలను పైబెరడులో వేసి అందు కొంచెము ఇనగపులును గుల్‌రోగన గవ్వవలుకుసాంబ్రాణి నూరి కలిపిఆదానిమ్మ బెరడును నిప్పులపై బెట్టి లోపలనుండు వస్తువులు చిక్కబడిన వెంటనే దించి చెవిలో కొన్ని బిందువులు పోయవలెను.

5 వ స్వాభావిక బధిరత్వముయొక్క లక్షణములు.

స్వాభావికముగు దుష్టప్రకృతి కలుగకనే మలము వృష్ణమునొంది గాని లేక జలుబువలనగాని లేక చెమ్మవలనగాని లేక శీతమువలనగాని లేక శుష్కత్వమువలనగాని కర్ణసంబంధమగు అంగములలో ప్రవేశించి స్వల్పముగావినబడినచో అనగా వృష్ణమగు దుష్టప్రకృతిజీవనరసముయొక్క స్థూలత్వమునకు శుష్కింపచేయుచున్నది. నరములు దహింపజేయుచున్నదని గ్రహించవలెను. ఈకారణమువలన శ్రవణశక్తి చక్కగా అందు ప్రవేశించజాలకుండును

మరియు జలుబువలన కలుగు దుష్టప్రకృతి అజీర్ణమునుస్థూలత్వమును కలిగించి ముకుముకొనునటుల చేయుటవలన వినుపించునట్టి అంగములయందు మందత్వము స్థూలత్వము కలుగును. యీకారణము వలన ప్రాణవాయువు శ్రవణజకశయందు ప్రవేశించజాలకపోవును.

మరియు చెమ్మగల దుష్టప్రకృతి జీవనరములయొక్క స్థూలత్వమును సంధపరచుటవలన అవయవములు లేపుకు తాము నొకటికొకటి కలుసుకొనుచున్నవి. మరియు ప్రాణవాయువుయొక్క మార్గము అందు బంధించబడును. మరియు వుష్ణ, శుష్కత్వదుష్టప్రకృతివలె శుష్కత్వమును కలిగించును. ఇందువలన వినునట్టి ప్రాణవాయువు ప్రవేశించజాలకుండును. ఈవిధముగా కలిగిన రోగచిహ్నము లెవ్వియనగా చెవిచుట్టు భాగములలో నొప్పికలుగుట, భారముగానుండుట, పీకుట, బొత్తిగా నొప్పిలేకుండుట, యేలననగా నిది మలరహితము వలన కలుగుచున్నది. మరియు భారము, పీకుట, నొప్పి, మొదలగునవి మలమువలన కలుగునట్టి ముఖ్యఅంశములుగాని చెమ్మ దుష్టప్రకృతి అయినచో నొప్పికూడా కలుగనేరదు, మరియు నేను యీనాలుగు దుష్టప్రకృతులయొక్క చిహ్నములు భిన్నభిన్నములుగా వర్ణించెదను.

మరియు నొప్పి దుష్టప్రకృతిఅయినచో జలుబువలన హానికలిగించును. మరియు జలుబుగానుండు సమయమునందు మిక్కిలి బాధగానుండును.

మరియు వుష్ణప్రకృతి అయినచో రోగి వుష్ణమువలన మిక్కిలి కష్టపడును. యెండవేళయందు నొప్పివిశేషముగానుండును. దీనికారణములనుండి చెవిచుట్టుభాగములయందు మంటకలిగించును.

మరియు శుష్కదుష్టప్రకృతి అయినచో పరిశ్రమచేయుట వుపవాసముండుట జాగరణము యీమొదలగునవి శుష్కత్వమునకు కారణములగును. కాబట్టి యీమొదలగు వనులవలన యీవ్యాధికలుగుటకు సాత్రీయగును. మరియు నేత్రములు, ముఖము, చిక్కిపోవును. యీవ్యాధికి హానికలిగించును గాన చెమ్మను కలిగించుట లాభదాయకమని గ్రహించవలెను.

మరియు చెమ్మగల దుష్టప్రకృతి అయినచో రోగి చెమ్మను పుట్టించునట్టి వస్తువులతో కష్టపడుట శుష్కత్వము కలిగించు వస్తువులతో లాభమును అనుభవించునని తెలిసికొనవలెను.

(సూచనియము) సామాన్య చెమ్మగల ప్రకృతి యీరోగమునకు కధాదిత్ కారణమగును. ఇందువలననే షేక్ అబులీసేనాగారు దీని వర్ణనముచేయక విడిచిరి. మరియు నసార్ జాన్ బాబ్ అను గ్రంథకర్త కూడా షేక్ అబులీసేనాగారివలెనే చెప్పిరి.

స్వభావికదుష్టప్రకృతి కర్ణరోగ చికిత్స.

ప్రకృతియెటులుండునో కనిపించి ప్రకృతానుసారముగా భోజనములు, వర్తులు, కావడములు, చెవిలో పోయునట్టి ఔషధములు మొదలగు నుపాయములను చేయవలెను.

## అపక్వ కర్ణరోగ లక్షణములు.

చిక్కని అపక్వదోషము చెవియొక్క జీవనరమునందు ప్రవేశించును. ఇట్లు ప్రవేశించునట్టి కారణమువలన మెదడునుండి ప్రాణవాయువు ఆజీవనరమునందు ప్రవేశించుటకు వీలులేకపోవును. ఈజీవనరము వినునట్టి శక్తిగలదగుటవలన ప్రాణవాయువు చలనములేని కారణమునుబట్టి దీనిశక్తి అవశ్యముగా నష్టమొందును. దీనిచిహ్నములు వృష్ణవస్తువులు లాభదాయకములగును. ముందుచెప్పని నుపాయములతో లాభము కలిగినయెడల తలబరువు సంభవించును. మరియు తలయందును వందినవ్వాడు బరువు అధికముగానుండును వృష్టము యెరువుగా నుండకుండును.

అపక్వదుష్ట కర్ణరోగ చికిత్స.

యారజాత్ మొదలగునవి ఉపయోగించుట లేక, ఈస్వభావికముగల ఔషధములను వుపయోగించవలెను అనగా వుక్కిలించవలెను. మరియు సోయితైలమును సదాపాకుతైలము చెవిలోపోయవలెను. మక్కి

యు జంబదూంగలనము, దవనము, మరువము, తులసిఆకు, బరంజాసఫ్ చాతరాశి, బాదూర్ ఈ మొదలగు కషాయములతో చెవిచుట్టు భాగములు ముచ్చటగుంట బొందునట్లు కాపడము చేయవలెను. అనగా కషాయము లలో బట్టకడిపి కాపు లెనని భావము మరియు సదాపాకు, చాతరాశి ఆకు, అజామోదము, జైతూన్ తైలము ఈ మొదలగు వస్తువులను కషా యములకాచి సన్నమూతిగల పాత్రలో పోసి దానినుండివచ్చు ఆవిరి పైకి పోకుండునటుల అపాత్రకు గొట్టముతగిలించి ఆగొట్టము చెవిలో పెట్టి ఈకషాయములయొక్క ఆవిరి చెవిలో ప్రవేశింప జేయవలెను.

(సూచనీయము) చెవిలో భారముకలిగినచో అనేకపర్యాయ ములు ఆవిరిపట్టించి భారమును తొలగించవలెను. దీనివలన శక్తిస్థిరము గానుండును. మలమును పక్వపరచును. మరియు, చెవిలో పోయునట్టి ఔషధములు గోరువెచ్చగా నుండవలెను. సర్వదా మిక్కిలి వేడిగాయుం డకూడదు. మలమును పక్వపరచి తీసివేయుటకుముందు యేవిధమైన ఔషధములను చెవిలో వేయజనదు. ఇందువిషయమై యిటుల సమస్త కర్ణరోగములయందు చేయవలెనని గ్రహించవలెను.

## చెవిమార్గములను బంధించు లక్షణములు.

చెవిరంధ్రముయొక్క మార్గము బంధించబడిగాని అందుండు స్మరణశక్తిగల జీవపరమాణువు ప్రవేశించకుండును. ఇట్లు బంధనమేర్పడు టకు మూడు కారణములుగలవు

(ఏ) చెవియందు మిక్కిలి మాలిన్యము చేరి నిలచిపోవును. కా బట్టి దీనిచికిత్స వర్ణించబడును. గుబిలితెడ్డుతో గుబిలితీసివేయవలెను. మరియు గుబిలి మెత్తబడుటకై వెచ్చనినూనె చెవిలో పోయవలెను. మరియు ప్రాతఃకాలమునందు వేడినీళ్ల ఆవిరి చెవిలో ప్రవేశింపజేయ వలెను. స్నానము చేయునప్పుడు వేడిగానుండు పెంకుమీాద చెవినుంచ వలెను. దీనివలన మలము మెత్తబడి తనంతటనే బైలువెడల నారంభించును. ఇటుల మలము వెడలనిచో గుబిలితెడ్డుతో తీసివేయవలెను. అనగా

మెత్తబడిన కారణము వలన సహజముగా వెళ్ళిపోవును. వృందబీజము పాపడీలవణము నూరి వత్తిజేసి చెవిలో నుంచవలెను. మరియు యీ వత్తిని మూడుదినములుంచి నాలుగవదినము తీసివేయవలెను. దీనివలన విశేష మలము వెడలిపోవును.

(బి) రాయిగాని లేకయిసుకగాని గింజలు మొదలగునవి చెవిలో పడినను లేక యేదైన జంతువు చెవిలో ప్రవేశించి చచ్చియున్నను, పురుగులు తీసివేయునట్టి విధానము పైన వ్రాసియున్నాము. గాన గ్రహించవలెను. మరియు రాయి ఇసుక గింజ మొదలగువానిని తీయునట్టి క్రమము చెప్పబడును అనగా యిట్టిస్థితియందు చెవిలో నూనె పోయవలెను. చెవిలో నూనెపోయుటవలన మార్గములు విశాలమగును. పిమ్మట జున్ను చెమ్మకలుగుటకై యివ్వవలెను తుమ్ములు వచ్చుచుండిన చెవివైపు తలవంచి నోరు ముక్కు మూసికొనియుండవలెను. దీనివలన చెవిలోనుండునట్టి రాయి బైటికివచ్చును రెండవది అనగా పిచ్చికారితో లాగివేయవలెను. పిచ్చికారివలన తీయుక్రమమెట్టిదనిన పిచ్చికారి చెవిలో నునిచి గాలిపోకుండా చుట్టు దూదెకుక్కి తదుపరి పిచికారి నెమ్మదిగా లోవలనుండి లాగికొనినయెడల రాయి పిచ్చికారిద్వారా బైటికి వచ్చును. యిట్లుచేయునప్పుడు రోగిని బల్లమీద పరుండబెట్టి తలక్రింది క్రేలాడునటుల చేయవలెను. వైద్యుడు పృథివిపై కూర్చుండి రోగి తలను తన మోకాళ్ళపై యుంచుకొని తలను వీలగునటుల ఆలోచించితీసివేయవలెను. మరియు చికిత్సచేయుటయందు ఆలశ్యముచేయకూడదు ఏమందుకనగా రోగిని త్వరలో చంపివేయును.

### చెవి దుర్మాంస లక్షణములు.

(సి) చెవిలో వ్రణము గలిగి ఆవ్రణమునందు మిక్కిలిదుర్మాంసము పెరుగుటవలన ఆస్థలమునందు ప్రవేశించి క్రొవ్వు పెరిగిపోవును.

### కర్ణవ్రణ దుర్మాంస చికిత్స.

చెవియందు మాంసము విశేషముగా పెరిగినటుల కనుపించిన

చుంచిన యిందునిమిత్తమై యేర్పరచబడిన శస్త్రముతో తీసివేయవలెను. మరియు లోపలచుట్టుభాగములయందు మాంసముండినచో సన్నని శస్త్రముతో నదుపాయముగా ఆమాంసమును తీసివేయవలెను. శస్త్రకర్మఅయిన తదుపరి మొర్రపటికిగాని లేక యిటువంటి స్వాభావికముగల వస్తువులుగాని నూరి వస్త్రగాలితమొనరించి ఒకబట్ట వత్తిచేసి ఆవత్తికి యీచూర్ణము పట్టించి వ్రణము అంటుకోకుండునటుల చెవిలో నుంచవలెను. దీనివలన రక్తము స్రవించజాలకుండును. మరియు రోగియొక్క చెవిలో క్రొవ్వుతోకూడిన మాంసము ఏకారణమువలనకూడా తెగకుండిన అట్టిమాంసమును మెల్లప్పగ పావశిలవణమును వేడిజలములో కలిపి చెవి కడుగవలెను. మరియు జటామాంసి, మెత్తగా చూర్ణించి చెనగపులుసులోకలిపి చెవిలోపోయవలెను. ఇటుల పోయుటవలన చెవియందుండునట్టి విశేషదుర్మాంసము నశింపజేయును. మాంసమునశించినతరువాత వ్రణము మానుటకై చికిత్సచేయవలెను. మరియు వ్రణమును మాన్పునట్టి ఔషధములు చెవిలోపోయవలెను.

(సూచనీయము) జన్మమునుండి చెవిలో బంధనమేర్పడును. ఇటుల యేర్పడుటకు మూడు కారణములు గలవు.

## శ్రవణరంధ్రము మూర్పనొందు లక్షణము.

(ఏ) చెవిమూలమునందు శల్యముండును. ఆశల్యమునందు శబ్దము వచ్చునట్టి మార్గముగాని రంధ్రముగాని వుత్పన్నముకాకుండును.

(బి) శల్యమునందు మార్గమున్నను అందుమాంసమువలన నిండి పూడి బంధించబడియుండును గాన యీరెండువిధముల వ్యాధులు అసాధ్యము. మానవులకు శక్యముకాజాలవు కాబట్టి చికిత్స చెప్పుటకువీలు కాజాలదు. మరియు జన్మనుండి వినుపించదను అంశమును వెనుకచెప్పియుంటిని. ఆవినబడకుండుటకు యీకారణమని భావించవలెను.

(సి) ఒకవిధమగువ్యాధి. నిది చికిత్సకు యోగ్యముగానుండును. ఈవ్యాధియందు మార్గముకలిగియుండును గాని మార్గముపైన పైట్టి

పై వు ఒకహొం కలిగియుండును దీని చిహ్నములు బిగ్గరగా చెప్పబడిన మాటలు వినపించుచుండుట మరియు చెవిరంధ్రముపై వ్రేలుతో తట్టినయెడల కలుగు శబ్దమును వినగలుగును. గాన చికిత్సచేయుటవలన వ్యాధిశాంతించగలదు.

అంశ్లోష్మ వణ కర్ణ ధ్రిచికిత్స.

ఆర్ఘిల్లిహారను రంధ్రముచేసి మార్గమును విప్పివేయవలెను. తదుపరి ఎటికితో వత్తిచేసి ఆరంధ్రమునందుంచవలెను, దీనివలన వ్రణము ఒకటి కొకటి అంటుకొనజాలవు.

(సూచనీయము) శిశువుల చెవియందు బధిరత్వమున్నట్లు తెలిసినచో చాదరాళిఆకు, చేదువుచ్చకాయ, వువ్వు యీమొదలగునవి నమలి ఆరసము ఒక్కొక్కచుక్క పిల్లవాని చెవిలో వేయవలెనని దాదితో ఆజ్ఞాపించవలెను. దాది అనగా సంరక్షకురాలు లేక పాలతల్లి.

## తనిన్ మరియు దబీ లక్షణములు.

కోష్టమునందు బంధించబడుటకు తనీన్ అందురు వైద్యుల సమ్మతియందు అనగా మనుజుడు కేవలము గాలిలోపై వు ఆవిరియొక్క పరమాణువుల గతివలన వినగలుగుచున్నాడు. మరియు బైటిపై వు గాలిలో తిరుగకపోవుటవలన చిన్నశబ్దము మిక్కిలి తీక్షణముగను వలచగనుండినచో తనీన్ అనుపించును. మరియు మిక్కిలి మృదువుగను అధికముగానుండిన దబీ అనుపించును. నిజములో పైగాలి కెరటములు వేయును. పిమ్మట దానిని స్మరణశక్తి గ్రహించవలెను. కాబట్టి వైద్యవరులు దనీన్, దబీ అనగా భిన్నాభిన్నశబ్దములు, తిరుగలి శబ్దము కలుగుటకు సంబంధముకలదు. అనగా కండ్లయెదుట చెడుధ్యాన్నములు అనగా దోమలు, ఈగలు మొదలగు పురుగులు యెగురునటుల కనుపించినట్లు చెవులయందు తిరుగలి విసరినటుల శబ్దము తోచుచుండును. యిట్టికష్టమునకు తశలీన్ అనుచున్నారు. మరియు స్మరణశక్తి కష్టపడుటకు కారణమగును. అనగా బొత్తిగా వినుపించకుండును.

మరియు స్వల్పముగా వినుపించుటకు కారణమేమనగా స్వల్పము గను యితరశబ్దము వినిపించకుండును. తనీన్ అనగా పెద్దశబ్దమును వినుచుండును. మరియు పెద్దశబ్దములను వినుచుండుటకు విశేషకారణములు గలవు కొన్నికారణములను మాత్రము చెప్పుచున్నాను.

(ఏ) చెవియొక్క జ్ఞానశక్తి తీవ్రతకలిగి విస్తారమగును. శరీరము యథాప్రకారము ఆరోగ్యముగా నుండును. మరియు జ్ఞానశక్తియొక్క విశేషత్వమువలన అల్పగతియొక్క లోపలి దోషమువలన ఆవిరిపరమాణువులు కలుగతటస్థించును. యిట్టిస్థితియందు వ్యాధిగా భావించుటకు వీలుగలుగదు గాన చింతతొలగించునట్టి సదుపాయములు చేయుదురు. దీనిచిన్నెములు ఆకలిగానుండు సమయమునందున్ను, ఆమాశయము రిక్తదశ పొందినప్పుడు విశేషమగుట, వాతమును వృత్పత్తిచేయునట్టి భోజనాదులవలన తగ్గుచుండుట మరియు, ఇతర ఇంద్రియములుకూడా తేజస్సునొందుచుండుట మొదలగునవి.

—తనీన్ అనగా గొప్పశబ్దము వినిపించుటకు చికిత్స—

చెవియొక్క జ్ఞానశక్తిని మంధపరచుటకై గుల్‌రోగన్ చెనగపులుసుకలిపి తైలపక్వముగాకాచి అందుకొద్దిగా నల్లమందుచేర్చి చెవిలో పోయవలెను. ఒకప్పుడు వైద్యులు నల్లమందు బిలుగోజా జున్ను, ఆతైలమునందు చేర్చుచున్నారు.

—గొప్పశబ్దము వినిపించు లక్షణములు—

(బి) స్మరణశక్తియు, జ్ఞానశక్తియు, దుర్బలము నొందును. మరియు జ్ఞానశక్తి తేజస్సువలన సూక్ష్మగతి శరీరమునందు ఆహారము పచనమగుటయందున్ను విసర్జనకాలమునందున్ను అవశ్యముగా కలుగుచున్నది. మరియు పవిత్రమగు పరమాణువులగతివలన పచనకాలమునందు భోజనమునుండి బైలువెడలుచున్నవి. నివి సారవంతముగా నుండును. మరియు యీరోగము దుర్బలులగువారికి ముఖ్యముగా కలుగుచుండును.

—తన్ బిన్ (బి) చికిత్స.—

ప్రకృతిని సమానముగా నుంచుటకై పరిశ్రమ చేయవలెను. మెదడునకు బలముకలిగించుటకై సుగంధభోజనముల నొనంగవలెను. మరియు సుగంధద్రవ్యములలో తీక్ష్ణశక్తులేనట్టి వస్తువులను ఆఘ్రాణించవలెను. చెవులకు బలము కలిగించుటకై గుల్‌రోగన్ అథవా శింకాలో వేసి కాచి చెవిలోపోయవలెను.

(సి) ఈవ్యాధియందు తలలో మలినసంబంధమగు గుల్లనరములు నిండి నీచగాలి అందుండి వెడలి స్మరణశక్తి అట్టిగాలిని గ్రహించి యీ వ్యాధికి కారణమగును.

—(డి) తన్ బిన్ లక్షణములు—

తనంతట మలినము చెవివైపునకు దిగును. మరియు గాలి చెవిరంధ్రమునందు నిలిచియుండు స్థానము చిన్నదగును. యీకారణమువలన అడ్డువచ్చునట్టి గాలియందు స్వల్పశబ్దము వినుపించుచుండును. మరియు స్మరణశక్తి దీనిని గ్రహించగలుగును. గాన యీరోగమునందు తలనుండిమలము బైలువెడలుటవలన కారణమగుచున్నది. దీనిచిహ్నములు చెవి లోభాగమునందు లాగుట తలబరువుగానుండుట అట్టిస్థితియందు శరీరముయొక్క గతి అథవా క్రోధము, చింత, హర్షము, భయము, మొదలుగాగల వసులవలన వుక్త గాలి చెలించుచుండినచో చెవిలో విశేషముగా ధ్వని (భిన్నభిన్నశబ్దములు) కలుగుచున్నవి. ఈసమయమునందు గతియొక్క కారణము నష్టమొందినచో ధన ధన అను ధ్వనికూడా తగ్గినట్టుల తోచుచుండును. మరియు దోషము ప్రవేశించుటవలన యీరోగమునకు కారణమైనచో దీని చిహ్నములు తలయందు చెవియందు భారము కలుగుట పీకినటులుండుట మొదలగు లక్షణములు వుత్పత్తియగును. ఈకారణమువలన దోషము ప్రవేశించినట్టి గతి యెల్లప్పుడు కలిగియున్నయెడల ధ్వనికూడా యెల్లసమయములయందుండును.

మరియు ముందు కారణము గలిగినగాను వృద్ధిచేయుచున్నదనుట యిందుకు సాక్షియగును

## (సి—డి) తన్‌బిన్ చికిత్స.

మెదడునకు పవిత్రతనొందించిన పిమ్మట పొదినాలకు అజామోదం, దవనము, మరువము, చాతరాసి, యీమొదలగునవి కషాయము కాచి ఆకషాయముతో ఆవిరిపట్టవలెను. మరియు చంబేలితైలము చంద్రతైలము చెవిలో పోయవలెను. మరియు మలమును వెడలించిన తదుపరి యెందువల్లననగా వాతముయొక్క విశేషములము నష్టమొందును. మెల్లప్పుడు స్నానముచేయించవలెను. గాని మలము శుభ్రతనొందక ముందుస్నానముయొక్క విశేషత్వమువలనతిరుగుట, నడుచుట, సూర్యరశ్మియొక్క వేడిమి అగ్నివేడినుండి అవశ్యముగా కాపాడుకొనుచుండవలెను. ఇట్లుండుటవలన మలము విశేషముగా పెరుగజాలదు.

## శుష్కకారణమువలన కలుగు తన్‌బిన్ లక్షణము.

(ఇ) శుష్కకారణమువలన కలుగునది అనగా శుష్కత్వమున్ను నిరాహారముగా యుండుటయున్ను యీవ్యాధికారణమగును. మరియు యీవ్యాధిగల మనుజునకు భోజనము సంప్రాప్తించినయెడల అవశ్యము శరీరము భోజనమునకై ఆచెమ్మవైపు నుంచువలె శరీరమునందు నిండి యుండునది ఆరూఢమగును. తిరుగుటవలన నడచుటవలన శరీరచెమ్మయందు సంగటము పడుచుండును. మరియు ఆచెమ్మయొక్క నడతయొక్క కారణమువలన ఆవిరిపరమాణువులు ఆశరీరముయొక్క చెమ్మనుండి పుట్టుచున్నవి. ఈపరమాణువులు నడతవలన ఆవిరిపరమాణువులు యింద్రియములకు భోజనముదొరకని కారణమువలన పవిత్రమైనపో చెవియొక్క జ్ఞానశక్తియందు వ్యక్తగతి కలుగనారంభించును. దీనిచిహ్నములు ఆకలినమయమునందు చెవియందు ధ్వనికలుగునటుల మిక్కిలి తోచుచుండుట మరియు దుర్బలముయొక్క అధికత భోజనము సంప్రాప్తించుట దీనికిసాక్షి యగును.

### తిన్ బిన్ (ఇ) చికిత్స

విశేషముగా భుజించుట, పగటియందు అనేకపర్యాయములు భుజించుట చెమ్మగలిగించునట్టి గుల్ రోగన్. మొదలగు తైలములను చెవిలో పోయవలెను మరియు జ్ఞానశక్తి వృద్ధినొందుటకై గంజాయితైలము చెవిలో వేయుచుండవలెను. దీనివలన శ్రవణశక్తి ధ్వని మొదలగు శబ్దములు వినిపించుచుండును.

### తిన్ బిన్ (యుఫ్) లక్షణములు

తందరవలన కలుగుచున్నది. మరియు ఉష్ణదుష్టప్రకృతిదోషములను వృద్ధిపరచి ఆవిరిపరమాణువులను కదలించును. కాబట్టిదీనిని శ్రవణశక్తి గ్రహించును. అనగా కొన్నిరోగములయందున్ను, జ్వరారంభమునందున్ను ఈరోగము ఉత్పన్నమగుచున్నది.

### తిన్ బిన్ (యుఫ్) చికిత్స

ఈవ్యాధియందు జ్వరచికిత్స చేయుట వుత్తమము.

### తిన్ బిన్ (జె) లక్షణములు

ఈవ్యాధి ఆవిరిపరమాణువులను వెడలించి మెదడునందు ప్రవేశింపజేయునట్టి ఔషధములను సేవించుటవలన కలుగుచుండును. అనగా మిరియాలుగాని లేక ఇట్టి స్వభావికముగల వస్తువులుగాని లేక ఆవిరి పరమాణువులను వృద్ధిచేయునట్టి భోజనపదార్థములుగాని ప్రయోగించుట వలన చెవియొక్కగాలి నిలిచి ఆవిరిపరమాణువులను కదలించును. అనగా వెల్లుల్లి, నీరుల్లి, మొదలగునట్టి వస్తువులున్ను వీనికి సమానమగువస్తువులున్ను సేవించవలసిన అగత్యము కలిగి సేవించినచో చెవిలోపల గుబగుబయనుధ్వని కలిగించుచుండును మరియు ఇట్టిశబ్దము విశేషకాలముండదుగాని రోగిమూఖతవలన ఇటువంటి గుణములుగల వస్తువులను నిత్యము భుజించుచుండును కాబట్టి ఈవ్యాధి అధికముగనుండునని గ్రహించవలెను.

### తస్ బిస్ (జి) చికిత్స

ప్రారంభమునందు రోగకారణమును దూరపరుచవలెను. తదుపరిదోషములను తమతమస్థానములయందు చేర్చుటకై పరిశ్రమచేయవలెను.

### తస్ బిస్ (హెచ్) లక్షణములు

ఈవ్యాధియందు చీము మరియు పచ్చనిరంగుగల నీరు వ్రణమునుండి స్రవించి చెవిలో నిలువబడియుండును. నిది అధికమగుట పురుగులు ప్రాకుట మొదలగునవి అచ్చట వుత్పన్నమగుట ఈవ్యాధికి కారణమగును. మరియు ప్రత్యేకచిహ్నములు ప్రత్యక్షముగా కనుపించుచుండును.

### తస్ బిస్ (హెచ్) చికిత్స

చీముగాని, పచ్చనిసీరుగాని ఈరోగమునకు కారణమైనయెడల చెవిసంబంధమగు చికిత్సలుచేయవలెను. మరియు పురుగులు ఈరోగకారణమైనచో ఆపురుగులు నశించునట్టి నుపాయములుచేయవలెను. కదాచిత్ తలయొక్కయు శరీరముయొక్కయు నరములు మలముతో నిండియుండి నలువుకలుగుటకు కారణమగును ఎటులననిన భుజించినవెనుక, నిద్రనుండి లేచినవెంటనే వుత్పన్నమగును. విశేషముగా ప్రకోపించు కారణమువలన మెదడునందు ఆరాటము (తొందర) వుత్పన్నమగును. లేక తలకు దెబ్బతగులుటవలన మెదడు అదరి వికారమొందినయెడల చెవిలో నలువు ఉత్పన్నమగును మరియు ప్రత్యేకముగా ప్రకృతి అనుసారము చికిత్సయు నదుపాయములను చేయవలెను.

(సూచనీయము) తనీన్ దబీ అను యీరెండువ్యాధులు వైటి వైపుకారణమువలన కలుగనేరవు.

(ఎ) దశ అనగా కేవలము మెదడు మరియు చెవితో సంబంధము కలిగియుండును. (బి) దశ గలది. ఆమాశయముతోగాని లేక యితరఅంగముల సంయోగమువలనగాని రోగము వుత్పత్తియగును. ఈత

నీన్ వ్యాధియొక్క మలము తలయందు కలిగినయెడల చెవిలో నలువు యెల్లప్పుడు కలిగియుండును. అనగా యెప్పుడును తగ్గినట్లు కనుపించదు. మరియు తిరుగలి విసరినట్లు శబ్దము మొదలుగాగల శబ్దములు చెవిలో కలుగుటయు, మరియు ఈగలు, దోమలు మొదలగునవి అరచినటుల శబ్దము గలుగుటయు ఆహారాశయము లేక యితర అంగముల సంయోగ ములవలన కలుగుచున్నయెడల అచ్చట వీటికి విపరీతముగా కలుగును. అనగా కొంతవరకు తగ్గుటయు కొంతవరకు హెచ్చుటయు తటస్థించును.

## చెవిలోనుండి నెత్తురు స్రవించు లక్షణము.

చెవినుండి రక్తము స్రవించుటకు కారణములు మూడువిధములు గా చెప్పబడినవి. (ఎ) రోగసంధివలన కలుగును. అనగా నకశీరు (నాసాస్రవము) దీని చిహ్నములు రోగసంధియందు యీరోగము కనుపించును. గాన రక్తము స్రవించుటవలన రోగము శాంతినొందును. మరియు యీరోగమునందు రోగి దుర్బలము నొందకుండునటుల అచేతనుడు కానంతవరకు బంధించుట ప్రుచితమని గ్రహించవలెను. యెందువలననగా యితర విపత్తునందు చేర్చకుండునటుల జాగ్రతవహించవలెను.

(బి) మలము నిండియుండు కారణమువలనగాని లేక గొప్పకష్టము హాని కలుగుటవలనగాని చెవియొక్క లోభాగమునందుండు నరముల ముఖము చిట్లుటవలన గాలిచెవిలోనుండి రక్తము స్రవించుచుండును.

(సి) దుముకునట్టి అనగా రక్తపింజర అను సర్పము కరచినహానికి అనగా యీపాము కరచినవెంటనే దీని విషప్రభావమువలన సర్వశరీరమునుండి రోమకూపములద్వార సమస్తరంధ్రములద్వార రక్తము వెడల నారంభించును. యీసర్పమునకు దక్షిణదేశస్థులు రక్తపింజర అనియు పూర్వదేశస్థులు రక్తపొడ అనియు చెప్పుదురు.

## చెవిలోనుండి నెత్తురు స్రవించుటకు చికిత్స

ఈరోగకారణము శరీరమునందు మలము నిండియుండుటవలన కలిగినయెడల ఆరంభమునందు శిరావేధనము గావించి రక్తమోక్షణము చేయించవలెను. దీనివలన యేవిధమగు ఉపద్రవము కలుగజాలదు. మరియు యీరోగవిపత్తు హాని. ఈరోగకారణమైనయెడల రోగిని చూచినతోడనే అవశ్యకమని తోచినచో అట్టిరోగిని రక్తమోక్షణము చేయించవలెను. మరియు రోగదశానుసారముగా రక్తముస్రవింప జేయవలెను. మరియు స్ప్వకాటుపొందుటవలన యీరోగకారణమైనచో ముందుగా కరచినస్థలమునందు చికిత్స చేయవలెను. మరియు అన్నివ్యాధులయందున్ను, కారణమునుదూరపరచినతరువాత రక్తమునుబంధించుటకై యేవస్తువు రక్తమును ఆపుటకై చెప్పబడినవో వాటిని వుపయోగించి రక్తమును ఆపివేయవలెను. అనగా చెవిలోపోయవలెను. మరియు ఉష్ణముయొక్కయు, జలుబుయొక్కయు రక్షణచేయుచుండవలెను. మరియు జ్వరము ఉష్ణముకలిగినయెడల మాచికాయ శిరకాలోవేశి కాచి అందు కొంచెము పచ్చకర్పూరముకలిపి చెవిలో పోయవలెను. మరియు పచ్చిబొలంగు, పెద్దపాయలరసము, అకాకియా అనగా పిత్తుమదరని తుమ్మకాయ రసముతీసి ఎండించినది యీమొదలగునవి యేకముగాచేర్చి చెవిలో పోయవలెను. మరియు పులుపు తీపిగల దానిమ్మకాయలనుతెచ్చి శిరకాలోవేసి కాచి వుడికినతరువాత బట్టలోవేసిపిండి చెవిలో కొన్నిబిందువులు వేసినయెడల రక్తమును అతిత్వరితముగా ఆపివేయును. మరియు ప్రకృతియందు వుష్ణము లేనిచో గంధనా అనగా గాడిదగడపరసము శిరకాలోవేసి కాచి లేపనము చేయవలెను. మరియు సమానముగా చేయదలచినచో హాతికర్పూరమును కొంచెము గంధనారసమునందు చేర్పవలెను. మరియు గంధనారసము రక్తమును ఆపివేయును. అనగా దగ్గవరచునని భావము.

# చెవి తెగిపోవుటకు లక్షణములు

ఇన్‌కిసార్ అనగా చెవి తెగుటకు అర్థము. మృదువగు అంగము తెగుటకు యెందువలన చెప్పబడియెననగా కొందరు వైద్యులు దీనిని శల్యమనిరి. కొందరి సమ్మతియందు మెత్తని శల్య మిరుగుటకున్ను, తెగుటకున్ను రజ్ అనుచున్నారు మరియు శల్యము తెగుటకు కసూర్ అందురు. యీరోగకారణమేమనగా బలవంతముగా చెవి మర్దించుట అనగా మాలీసు చేయుట లేక, దెబ్బతగులుట లేక తెగిపోవుట మొదలగు కారణములవలన చెవి తెగిపోవునని తెలియవలెను.

## చెవి తెగుటకు చికిత్స

శిరావేదనము చేయవలెను. శరీరమును మృదుత్వము నొందించవలెను. మరియు అకాకియా అనగా తుమ్మకాయరసము యెండించినది మసాంబరము, రాతినజ్, గోగింటాకు యీ మొదలగునవి లేపనము చేయవలెను. ఈ లేపనమువలన తెగిపోయిన చర్మము తిరిగి అంటుకొనును. మరియు అంగమును నిజదశయందు చేర్చును. లోపైపునుండి బైటిపైపునకు విరిగినచో యిట్టిస్థితియందు బైటిపైపు లేపనము చేయవలెను. మరియు బైటిపైపు విరిగినచో బైటిపైపు లేపనము చేయవలెను. మరియు, తెగినవెంటనే చెవిభాగములు వేరైనచో లోపలి వెలుపలిపైపు కూడా లేపనము చేయవలెను మరియు విరిగినస్థలమునుండి రక్తము స్రవించ నారంభించినచో మరహం గజరూప్ కరినఅంగములను చేర్చుటయందు ముఖ్యమైనది. గాని దీనితో సమానమగు గంధఫేరోజా, సమగతం, జాఫ్త, మైనము, బాతుకొవ్వు ఈ మొదలగు వస్తువులతో చేయబడిన వలాస్త్రి గజరూపు మరహం అనబడును. యీ మరహం వేయవలెను. అనగా వ్రణము మానువరకు వేయవలెనని భావము. ఈ వలాస్త్రి తెగిన అంగములకు ముఖ్యమైనది. మరియు తెగినఅంగములను మాన్పునట్టి ఔషధములు మిక్కిలి శుష్కత్వము గలవిగా నుండవలెను. ఈ వలాస్త్రియొక్క శుష్కత్వము పూర్వదశలో వేగరము మార్చగలదు.

## చెవిమూలమునుండి వ్రాడిపోవు లక్షణములు

చెవిమూలమునుండి వ్రాడిపోవుటకు ఇల్కిలావుల్ వుజ్జన్ అందురు ఇందుమూడు కారణములుగలవు (ఏ) బలవంతముగాలాగుట. (బి) అణచునట్టి వాపువలన కలుగుచున్నది. (సి) అణగునట్టి వాతము మొదలగునవి ఈరోగమునకు కారణములగును.

## చెవిమూలమునుండి వ్రాడిపోవుటకు చికిత్స

శిరావేదనము గావించిరక్తమోక్షణము చేయించవలెను పిమ్మట విరోచనమునకు యిచ్చి మలమును వెడలించవలెను. అటుపిమ్మట నెమ్మదిగా చెవి తన నిజదశయందుంచి ఔషధలేపనము చేయవలెను. ఆపై కట్టుకట్టవలెను. ఈకట్టు మూడుదినములవరకు విప్పకూడదు. దీని వలన దృఢత్వమునొందును. దృఢమొందినవెనుక నొప్పి శేషించి యున్నచో నొప్పి అధికతను తగ్గించునట్టి నదుపాయములు చేయవలెను మరియు అంగమును దృఢపరచవలెను. అనగా ఈస్థానమునందు కిరూతి మర్థించవలెను. దీనివలన నొప్పి హరించును.

## కిరూతిచేయువిధానము

బాతుకొవ్వు కరిగించి, ఇత్మిం, ఇస్పగోలు ఆకులు పొడగుబీక బెరడు ఈమొదలగువానిని ఏకముగాకలిపి బాతుకొవ్వునందు చేర్చి తైలపక్వముగా కాచి దించుకొని మర్దించవలెను.

# చెవి మూలము నందు కలుగు వాపు లక్షణము.

ఈవాపు క్రూరమైనది యేలననగా యిటువంటి అంగములయందు వుత్పన్నమగువాపు మృధువుగను మాంసమునుండి కలుగునదిగను వేగముగా మాంసమును చెరచుచున్నది దీనిజ్ఞానశక్తి విశేషతీక్ష్ణముగా నుండును. మరియు మెదడునకు సమీపముగానుండును. కాబట్టి నిది తరుచుగా సర్సాం (తల లోభాగమునందు వాపు) వ్యాధిలో దించుచున్నది. మరియు బుద్ధిని చెరుచుచున్నది. నొప్పి విశేషమువలన రోగి

గించునట్టి ఔషధములను లేపనము చేయుటవలన భయము కలుగును అనగా మెదడు శరీరముయొక్క ప్రధాన అంగము నిశ్శరీరమును రక్షించుచుండును గాన క్రిందికి దిగునట్టి మలము తిరిగి మెదడువైపుకు పోవును. మరియు వైద్యులు ఈరోగమునకు ఏవస్తువులు లేపనము చేయుచున్నారో ఆయౌషధములను ఈక్రింద చెప్పుచున్నాను. అనగా సోయిగింజల పిండి, బాబూనా, అకలీలుల్మలిక్, గుల్‌రోగన్, మైనము, మొదలగు వస్తువులను మైనమునందు కలిపి గోరువెచ్చగా నుండునప్పుడు లేపనము చేయవలెను. మరియు క్యాబేజి ఆకులకు నెయ్యిరాసి కాచి వాపుపై వేసినచో మిక్కిలి గుణదాయకమగును.

మరియు బహురాక్ అనగా రోగసంధి కారణమువలన వాపుజనించినచో మలమును పకటిగాచేయుట యందుపరిశ్రమ చేయవలెను. ఇందువలన ఆస్థానమునందు విశేషమలము ఈడ్వబడును. ఎటువీలు కలుగునో అటుల రోగమునుబట్టి చికిత్స చేయవలెను. మరియు రోగియొక్క వాపునందు ఆరంభదశనుండి నొప్పికలిగి యున్నయెడల బట్టనువేడినీళ్ళయందు ముంచి ఆవాపుపై కాపడము చేసినచో నొప్పితగ్గిపోవును మరియు వాపు పక్వమై చీము జేరినటులతోచి నష్టముకాకుండినచో వాపును పక్వపరచునట్టి ఔషధములను లేపనము చేయవలెను. గాని వాపు వాతకారణమైనచో ఆరంభమునందు చల్లని వస్తువులు అనగా కర్పూరపు మలాము, కామంచారసము, లేపనముచేయవచ్చును. ఈలేపనలవలన వాపు వృద్ధినొందజాలదు. మరియు చల్లని ఔషధములు లేపనము చేయునట్టి ఆజ్ఞ ఈవాపునందు ఎందుకనగా వాతముయొక్క చిక్కనిమలము వేగరము కరుగజాలదు. చల్లనివస్తులేపనవలన వాపు విస్తరించజాలదు.

## కర్ణమూల వ్రణ లక్షణములు.

ఈ రోగమునకు కిలావ్రుల్‌ఫ్రజా అని చెప్పుదురు, నిది చెవివుడికిపాదిపోవుటకు అర్థము ఈవ్యాధి తరుచుగా చిన్నపిల్లలకు కలుగుచు

న్నది. ఎందుకనగా పిల్లలయొక్క శరీరచర్మము మిక్కిలి మృదువుగానుండును.

— కర్ణమూలవ్రణ చికిత్స —

రెండు కణతలు చెవులమూలములయందుండు వెంట్రుకలు తీసివేసి చనుపాలు లేపనము చేయవలెను. దీనివలన మలముయొక్క తీక్ష్ణత్వము తగ్గిపోవును. మరియు చీము కూడా తగ్గును తదుపరి మురిదారుశింగు, కంపిల్లము మెత్తగానూరి ఆవ్రణముపై చల్లవలెను.

# చెవిలో యితర ద్రవ్యములు పడు లక్షణము.

చెవిలో పడునట్టి గింజలు, రాళ్ళు, మొదలగువానిని దీయునట్టి విధానముగలదు. అనగా చెవిలోనుండు శల్యమువంటి విధానమునందు చెప్పబడియె గాని చెవిలో పాదరసము పడినచో తలను చెవివైపునకు వంచివేసినయెడల తక్షణమే రసము బైటికివచ్చుచున్నది. గాని కొంత రసము చెవిరంధ్రమునందు చేరి నిలిచిపోయినచో యీకారణమువలన గొప్పకష్టములు సంభవించును. అనగా బిగిసికొనిపోవుట, లాగుట, బుద్ధిహీనత్వము, విశేషభారము, మొదలగు లక్షణములు సంభవించగలవు. మరియు అంతమునందు సర్సాం అనగా మెదడువాపు సక్తా అనగా సన్న్యాసము అనురోగములలో చిక్కి మృతిబొందునని గ్రహించవలెను.

— చెవిలో యితర ద్రవ్యములు పడుటకు చికిత్స —

చెవిమార్గము విశాలమునొందుటకై వెచ్చని తైలము చెవిలో వేయవలెను. మరియు తలను ఆ చెవివైపు అనగా పాదరసముండు చెవివైపువంచి నఖచికిని అనగా ముక్కుతుమ్ముడాకు, జాన్ను, మొదలగు తుమ్మును కలిగించు వస్తువులను పీల్చి తుమ్మును కలిగించవలెను. తుమ్మువచ్చునసమయమునందు ముక్కునోరు మూసికొని తుమ్మవలెను. ఇట్లుతుమ్ముటవలన తుమ్ముయొక్క అదురు లోపైవునకు తిరిగిపోవును. ఈకారణమువలన చెవిలోనుండునట్టి వస్తువు బైటికివచ్చును.

### చెవి గురక కలుగుటకు చికిత్స.

చెవి దురదగా హెక్కళుగ్ఘట్లగా అగుచు ఈ వ్యాధి కలుగుట కు కారణమేమనగా నెప్పులి పొరలమాంసము కలుగుచున్నది

(దీని చికిత్స) అవాసామాన్యపురసము, పచ్చని ఆకుబొరాగిం జల తైలము చేదుబాదంనూనె మొదలగునే అన్నివస్తువులు చెవిలో పోయవలె ను. మరియు అజామోదము చెనగపప్పులుకులో వేసి కాచి వడియబోసి గోరువెచ్చగానుంచుకప్పుడు చెవిలో పోయవలెను.

### గొప్పశబ్దమువలన చెవులు ధ్వని కలుగుటకు లక్షణములు.

ఇందు రెండువిధములు గలవు. (ఏ) కేవలము మెదడునందుగల శక్తి తక్కువతాను యావత్తు దుర్బలము నొందుట,

(బి) కేవలము స్మరణశక్తి దుర్బలము నొందుట.

ఈరోగము వినుట్టిశక్తితో సంబంధము కలిగియుండును. అన గా కండ్ల దుర్బలము కండ్లశక్తితో సంబంధము కలిగియుండునటుల కలిగియుండును.

### గొప్పశబ్దమువలన చెవులు ధ్వని కలుగుటకు చికిత్స

మెదడునకు బలము కలిగించునట్టి వస్తువులను వర్ణించియుంటిని. అట్టివస్తువులతో మెదడునకు బలము కలిగించవలెను. అనగా భోజనము సుగంధిగవస్తువులు లఘుపదార్థములు మరియు ఇటువంటిస్వభావికము గల ఇతరవస్తువులను ఉపయోగించవలెను.

గద్య, ఇది శ్రీమదిమాంబేగ్ సాహెబ్ పౌత్ర పాచ్ఛాబేగ్ సాహెబ్ పుత్ర "వైద్యభూషణ" బిరుదావళీ విరాజమాన వైద్యవిద్వజ్జన విధేయ రహంతుల్లాబేగ్ నామధేయ ప్రణీతంబైన "తిబ్బెఅక్బర్‌షాహి" అను వైద్యగ్రంథమునందు కర్ణరోగాధ్యాయము సర్వము సంపూర్ణము.

[illegible]

బిస్మిల్లా ఇర్రహిమాన నిర్రహీం.

# తిబ్బెఅక్బరిషాహి

అరువదవ అధ్యాయము.

## నాసారోగలక్షణములు.

ముక్కుపైభాగము శల్యము. తక్కిన క్రిందిభాగము అనగా పరచబడియుండు మెత్తనిశల్యము. నాసామార్గము ఖిసపాత్ అనగా నొకశల్యము. యిది ముక్కుగూటమును సిలువబడి ద్వారము కలిగి యున్నది. మరియు ఖిస్పాత్‌తో కూడా మెదడునకు జీవనరమునుండి ఒకమార్గము గలదు. ఆమార్గమునుండి సుగంధదుర్గంధములు ప్రవేశించి మెదడునందు చేరుచుండును. మరియు, నీరెండు విశేషమగువస్తువులు మెదడుయొక్క ప్రథమభాగమునుండి స్తనముల అగ్రభాగమునకు సమీపముగా బయలువెడలినవి. దీనిని వైద్యవరులు హిమత్ సుదా అనుచున్నారు. మరియు మెదడుసంబంధమగుమలినము ఈమార్గమునుండి బైటికి వచ్చుచుండును. ముక్కురంధ్రమునుండి రెండుమార్గములు మెదడునందు ప్రవేశించి యున్నవి. యిందుండి ఉఛ్వాసనిశ్వాసములు వచ్చుచుండును. మరియు ముక్కుమార్గమునుండి వాయువు పీల్చబడి లోభాగమునకు వెళ్లుచుండును మరియు శబ్దము సమానముగా నుండును. ఈకారణమువలన జలుబు, నజులావ్యాధులయందు ఈరెండుమార్గములయందు చెమ్మ కలుగుచున్నయెడల శబ్దము మారిపోవుచుండును. పరమదయాళుడగు భగవంతుడు ముఖమునకు విలాసముకొఱకు నాశికము నిర్మించినాడు. వాసన చూచునట్టిశక్తి శబ్దమును సమత్వముగా నుంచునట్టిశక్తి సర్వేశ్వరుడు నాశికకు ప్రసాదించియున్నాడు.

॥వాసన చూచుశక్తి నశించుట [illegible]॥

ఈరోగమునకు ఖష్మ అందురు యిందు వాసనచూచుశక్తి నశించును. యీవ్యాధి జన్మతః ఉండి యున్నచో కుదురుట అసాధ్యము గాన చికిత్స చెప్పబడి యుండలేదు. అటుగాక జన్మించినతరువాత యీ వ్యాధి కనుపించినచో కారణానుకూలముగా యితరవిధములుగా భావించి చెప్పబడి యున్నది.

(౨) నాసామార్గము నందు విశేషముగా మాంసము పెరిగి పిటిక వలె నుండును. దీనిమూలముగా గంధముక్రమముగా వాయువు గ్రహించే ద్రియమునందు ప్రవేశించకుండును దీనిని వైద్యవరులు నాసాఖ్య అందురు. భవాసిర్, ఉల్ అఫ్వా అని పర్షీలో చెప్పుదురు. అనగా నాసాపిటిక అని అర్థము. యీమాంసపిటిక అర్శరోగమునందుద్భవించు పిటిక వలె నుండును. మిక్కిలి తెల్లనిరంగు కలిగి యున్నచో దీనితో నొప్పి కూడా యుండదు. దీనిని చికిత్సచేయుట బహు సహజముగా నుండును మరియు యెర్రగను కృష్ణరంగు మిశ్రముగను నున్నచో విశేషముగా నొప్పితో కూడియుండును. దీనిచికిత్స మిక్కిలి కష్టముగా నుండును. ముఖ్యముగా పచ్చనినీళ్లు దుర్గంధము గలిగి స్రవించుచుండును. యీపిటిక నాసాద్వారము నిండునట్టుల పెరుగుచుండును. ఒక్కొక్కప్పుడు మూడునుండి ముక్కుపైటివరకు పొడవుగా పెరుగుచున్న యెడల వైద్యులు దీనిని పేరుఅర్థముతో కూడి పేర్కొనిన రక్తఖండమని చెప్పుచున్నారు.

నాసార్శ్య (౨) చికిత్స

శిరావేధన మొనరించవలెను. వుచితమగు స్థలమునందు శస్త్రముతో గంట్లువేయవలెను. మరియు విరోచనమునకై యారజాత్ ఇవ్వవలెను. మరియు మలము వెడలినవెనుక కసారైకా బాలింతబోలు జంగాలవచ్చు, ఉశన ఈవస్తువులు సమానముగా నూరి పలాస్త్రిచేసి యీ పలాస్త్రి వత్తిచేసి ముక్కులో నుంచవలెను. గాని మలము తీయుటకు ముందు అందుపై ఉష్ణమగు ఔషధము వేయుటవలన వ్యాధి విశేషము

గును. ఏటులనగా వెడలించునట్టి మూలము యీయుపాయమువలన మాంసపిటిక బొత్తిగా నష్టమునొందినచో తిరిగి ప్రయోజనము కలుగ గేదు. లేనిచో తీక్ష్ణమగు ఔషధములు అందుపై వేయవలెను. అనగా యినుపతుప్పు కలదీస్ మొగ్రిహూగిదళము శిరకాలోకలిపి వత్తిచేసి మాంసపిటికపై యుంచవలెను. యీయౌషధము శస్త్రమువలెపనిచేయును. మరియు పిటికవిశేష కఠినమైనదై యీయౌషధప్రయోగమువలనసార్థకము కలుగనిచో అట్టిస్థితియందు చేతిసాజ్ఞవలన ప్రయోగము చేయవలెను. చేతిప్రయోగములు రెండువిధములుగా నుండును.

(1) ఈమాంసపిటికను చివ్వివేయుట (2) శస్త్రముతో తీసి వేయుట మరియు చెక్కివేయునట్టి విధానము రెండువిధములు (అ) చెక్కివేయునట్టి ఆయుధము గొట్టమువలె నుండును. యీపనియందు ముఖ్యకరమైనది. ఆపిటిక గాయమగువరకు యీఆయుధముతో చివ్వివేయవలెను. (ఇ) సుద్రము వెంట్రుకలతో త్రాసువేసి ఆత్రాడునకు ముండ్లు వేసి నాసాపిటికకు నిమిత్తము యేర్పడునట్టి గాజుతో చేయబడిన ఆయుధముతో ముక్కులో ప్రవేశింపజేసి బైటికిలాగవలెను. ఇట్లులాగుటవలన వెంట్రుకలత్రాడునకుండునట్టి ముడ్లవలన రంపముతో కోసినటులనాసాపిటిక తెగిపోయి గాయమగును పిమ్మట ఆఆయుధముతో మలాము అందుపై వేయవలెను. దీనివలన శేషించినయందు మాంసము యావత్తు నష్టమొందును. తదుపరి సఫేదా మలాము యుపయోగించవలెను. దీనివలన గాయము మానిపోవును. (3) శస్త్రముతో కోసివేయుక్రమము అనగా రోగిని ప్రకాశముగు ఒకకుర్చీపై సూర్యునికెదురుగా కూర్చుండబెట్టి రోగిముక్కు యెడమచేతితో విప్పి కుడిచేతితో తీక్ష్ణమగు సన్ననికత్తి తీసికొని మాంసపుపిటిక యెంతవరకు తీయుట వుచితమో అంతవరకు కోసివేయవలెను. అనగా యేమియు శేష ముండకుండునటుల చక్కగా జాగరూకుడై కోసివేయవలెను ఒకవేళ ముక్కుచుట్టుభాగములలోను పిటికాశేషము నిలిచియుండినచో పైనచెప్పబడిన వెం

ట్రుకలద్వారమును ప్రయోగించవలెను. ఇట్లు ప్రయోగించు దానివలన శేషించినను సమూలముగా తెగిపోవును మాంసము యథావిధిగా సంపూర్ణముగా చేరిన తరువాత మాంసమును నష్టపరచి శుష్కత్వమును కలిగించునట్టి ఔషధములను లేపనము చేయవలెను. మరియు దీని విధానమెట్లనగా గాజుగొట్టమునుగాని లేక పక్షి కోడి మొదలగువాని రెక్కలపై ట్రుకలు యిత్యాది వానిని తీసికొని అందుపై గుడ్డచుట్టి ఆ గుడ్డపై యీపిటికెల నాశనమొందించునట్టి ఔషధములు లేపనముచేసి ముక్కులోపటివరకు యుంచవలెను. ప్రయోజనము సిద్ధించువరకు యిట్లు చేయుచుండవలెను. మరియు గొట్టమునకు రంధ్రముండుటవలన పక్షుల వెంట్రుకలయందు గుల్లగానుండునట్టి కారణమువలన వుశ్వాసనిశ్వాసములకు మార్గము కలిగియుండును.

## నాసార్బుద లక్షణములు.

(బి) ముక్కురంధ్రములందు మెత్తనివాపు వుత్పన్నమగును. నిది వెడల్పునందు విశాలముగా నుండును. ఇందు విశేషముగా సన్నని నరములు ప్రకటనమగును. ఈ కారణమువలన ఈ వాపునకు కశిరవుల్ అరజల్ మరియు బిహ్ పాయిజ్ అనుచున్నారు. ఎందుకనగా ఈవాపు చేపయొక్క ఆకృతి కలిగియుండును. ఈ చేపకూడా మృదువుగా నుండును. దీనికి విశేషముగా చిన్నచిన్న కాళ్ళు కలిగియుండును. దీని యందు వెముకలుగాని ముండ్లుగాని యుండవు మరియు కామిలూసనా అను గ్రంథకర్తగారు రోబిమా అను చేపను పట్టుకొనతలచినచో ఆచేప తన ముక్కును తనకాళ్ళతో బంధించుకొనును. అటులనే ఈవాపు ఆచేపవలె నాసారంధ్రమును బంధించును కాబట్టి ఈ కారణమువలన ఈ వాపునకు చేపయొక్క పేరు పెట్టబడినది. మరియు ఈవాపుయొక్క ప్రభావము ముక్కు లోభాగమునందుత్పన్నమై మొదమొదల సన్నసన్న ఎర్రని ఆకుపచ్చ రంగుగల నరములు రోబిమా చేపకాళ్లు ఎట్లుండునో అటుల ముక్కు పైభాగమునందు కనుపించుచుండును. అటులనే

వాపు వ్రణమై అందుండి వచ్చునీళ్ళు స్రవింప జేయుచున్నవి. ఒకప్పుడు యీవాపు సర్తాని (పీక) వలె వ్యాపించును. మరియు ముక్కు ఆధారమును చెరచివేయుచున్నది. ఈవిధముగు రోగిలక్షణములు అనగా వాపు పీకవలె నుండినవైపు వుబికి యుండును. లేనిచో నావు మెటుల మారునో అటుల కఠినత్వము కలిగియుండును. ముందుదానికంటె మిక్కిలి తక్కువగానుండును. ఈ వాపుయొక్క నరములు యావత్తు ఆకుపచ్చరంగుకలిగి బిగిసిపోవును. కనురెప్పల లోభాగము బిగించినటుల తోచుచుండును.

## నాసా అర్శ (బి) చికిత్స

యోగరాజ్ మాత్రలతో మలమును విరోచనముద్వారా మెదడునందుండు మలము తీసివేయవలెను మరియు రసాంజనము, బాలింతబోలు, పచ్చిజూపా, జైతూన్ తైలముయొక్క మడ్డి, మారుదారు శింగు, మెంతిపిండియందుగాని లేక అవిసిగింజల పిండియందుగాని కలిపివాపుపై లేపనము చేయువలెను. అనగా వాపు చక్కగా మెత్తబడు వరకు ఈ ఔషధమును లేపనము చేయుచుండవలెను. తరువాత శస్త్రముతో గంట్లుపొడచి రక్తము తీసివేయవలెను. అథవా జలగను పట్టించి రక్తము తీసివేయవలెను. గాని లోహ సంబంధమగు ఆయుధములను ఈ వాపునందు ఉపయోగించకూడదు. మరియు మాంసమును నష్టపరచునట్టి ఔషధములుకూడా ఈవాపుపై ప్రయోగించకూడదు. ఎందుకనగా ఈ సరతాని అనువాపు వ్రణమైనచో మానుట మిక్కిలి కష్టము సంభవించును. ఒకానొకప్పుడు నొప్పివిశేషత్వమువలన మెదడుసంబంధమగు పొరయందు వాపుకలుగుటకు కారణమగును. ఇట్టిస్థితియందు రోగిని వైవశ్యకోపట్టణమున కేయుటను చేయును. కాబట్టి సరతాని వాపునందు ఎల్లప్పుడు కిరూతి అనగా మైనపుకలిపు లేపనము చేయుచుండవలెను. దీనివలన కఠినత్వము తగ్గిపోవును. మరియు వాపు హరించుటకై

మాజూన్ నిజాహా గాని లేక షర్బతీగా కషాయముగాని ఉపయోగించుచుండవలెను.

## (సి) నాసా పిటిక లక్షణములు

ఈ వ్యాధియందు మెదడు నుండి చిక్కని జిగురుగల మలము దిగి ముక్కువెంట వచ్చుచుండును. మరియు మార్గము మెదడు వరకు గాలి ప్రవేశించకుండునటుల బిగించివేయును. గాన దోషము అచ్చటనే నిలిచి కూడుకొనియుండును. మలము మిక్కిలి చిక్కగను కఠినముగానుండి మాంసపిటికవలె తోచుచుండును. దీని చిహ్నములు రోగికి తలముందుభాగము మొదలగు నాసారంధ్రముల సమీపమునందు భారముగా నుండినటుల తోచుచుండును.

## (సి) నాసాపిటిక చికిత్స.

మూలికల కషాయమునుయిచ్చి మలమును మృదుపరచవలెను. తరువాత మలమును తీసివేయుటకై యారజ్ మాత్రలు మరియు కోకాయ మాత్రలు వుపయోగించవలెను. మరియు అంజూరపండ్లను నీళ్ళలో వేసి కషాయముకాచి తేనె, తరువాణి ఆకషాయములో కలిపి ఆనీళ్ళతో పుక్కిలించవలెను. దీనివలన మార్గమువిడి విశాలమగును. మరియు మలము అచ్చటనుండి వెడలినయెడల చుకందర్, అజానునఫార్, సదాపాకు కషాయము ముక్కులో పోయవలెను. మరియు బాబూనా, దవనము, మరువము, శిహోయీా మొదలగు వస్తువులు కషాయముకాచి ఆకషాయముతో ఆవిరి పట్టవలెను.

## (డి) నాసాపిటిక లక్షణములు.

మార్గము జన్మమునుండియు చిన్నదిగా వుత్పన్నమైన కారణము వలన కొద్దిచెమ్మ మెదడునుండి దిగివచ్చినయెడల అట్టిస్థితియందు నాసామార్గము బంధించబడును. దీనిచిన్నెములు ముక్కుయొక్క రెండురంధ్రములు చిన్నవగుట.

(డి) నాసాపిటిక చికిత్స.

మొదటనుండి మలమును స్రుభత కలిగి చవలెను. మరియు ఇత్రి ఫల్ మొదలగు ఔషధములు సేవించవలెను. వీటివలన మెదడునకు రక్షణకలుగును. తిరిగి మెదడునందు మలము చేరజాలదు. ముక్కునందు ప్రవించజాలదు.

(ఇ) నాసాపిటిక లక్షణములు.

మిస్ పాత్ అనగా ఓశల్యము ఇది ముక్కుపై నిలువబడియున్నది. దీని రంధ్రములయందు చిక్కని జిగురుగల మలము నిలిచిపోవును. గాన గాలి లోపల పోరనియ్యక ఆటంకము కలిగించును. మరియు, మిస్ పాత్ ఒకమెత్తనిశల్యము, స్పంజివలె రెండుముక్కు రంధ్రముల ముఖముపై పెట్టబడియున్నది. యిది స్థలముయొక్క అగ్రభాగమునకు సమీపముగా నున్నది. ఆరంధ్రమువలన కలుగు లాభము అనగా గాలి అచ్చట చేరుచున్నది. అస్థానమునందు జ్ఞానశక్తి యున్నది. మరియు, అచ్చటనుండి నాసామలము వెడలుచున్నది.

(లాభః) ఈరంధ్రములు జిగురుగను, స్నిగ్ధముగను, నునుపుగను స్పంజిరంధ్రములవలె రంధ్రములు కలిగియుండును. దీనివలన గాలి నాసికమునుండి ప్రవహించుచున్నది. జిగురుగానుండు కారణమువలన ఒకే సమయమునందు జ్ఞానశక్తియొక్క అంగమునందు ప్రవేశించజాలదు. అనగా సమానమై ప్రవేశించుచున్నది. ఈకారణమువలన వాయువుయొక్క బలుబు మెదడునకు కష్టమొందించజాలకుండును. మరియు, ఈ విధమగు చిన్నములు అనగా ముక్కురంధ్రములు వికశించియే యుండును. నాశికమునందు యేవిధమగు మలినముకూడా రాకుండును. ఎందుకనగా ఈస్థానముయొక్క మార్గము బంధించుటవలన మలినము మొదలగునవి క్రిందికి దిగజాలకుండును. మరియు అస్థానము నాసికముయొక్క రంధ్రముకంటె మిక్కిలి మెత్తగానుండును. ఈరోగమునందు మాటలాడుటలో భేదమేర్పడును. అనగా ముక్కుతో మాట్లాడినటుల

వినువారికి తోచుచుండును. మరియు ముక్కు, నోటియొక్క మధ్యనుండుటవలన మాట యిట్టిధ్వాతో కూడియుండును. యేవిధముగా నీచములముయొక్క ఆటంకములు రాజాలదు. యెటులననగా ఈఅధ్యాయము ఆరంభమునందు నాశిక ప్రకరణమునందు వర్ణించబడినది మరియు హకీము ఇబ్రెయూ, సరాయూన్‌గారు వ్రాసిన గ్రంధమునందు యిటుల వ్రాసిరి. అనగా వాసనచూచునట్టి జ్ఞానశక్తి నష్టమైనచో రోగి తనముక్కుతో మాటలాడుచున్నయెడల వ్యాధి నాసాద్వారము నందున్నదనియు, మెదడునందు లేదని గ్రహించవలెను. మరియు మాటలాడుట, నడుచుట మొదలగు కారణములు తనదశయందు కలిగియున్నచో విస్పాల్‌యందున్న, అథవా మెదడునందున్నదని గ్రహించవలెను.

### (ఇ) నాసా పిటిక చికిత్స

మలమును పృథుపరచవలెను తదుపరి మెదడునుండి మలమును తొలగించి పిమ్మట మలమును వెడలించునట్టియు, మెత్తపరచునట్టియు, అనగా నల్లజీలకర్ర, షాదినా, చేమపుచ్చకాయగుజ్జు, ఒంటెమూత్రము, యీమొదలగు వస్తువులు నేకముగాచేర్చిగాని లేక వేరువేరుగాగాని ముక్కులో పోయవలెను. మరియు యిటులనే మలమును పృథుత్వము నొందించునట్టి వస్తువులను నీళ్ళలో వేసికాచి తలకు కాపడము చేయవలెను. ముక్కులో మందుపోయునప్పుడు రోగికి నోటిలో నీళ్ళు పోసికొని తలవెనుకవైపుకు వంచి గట్టిగా శ్వాసపీల్చునటుల ఆజ్ఞాపించవలెను.

### (యఫ్) నాసా పిటిక లక్షణములు

ఈరోగమునందు చిక్కని వాతము శ్వాసమార్గమునందు బంధించబడును. మరియు నాసికముయొక్క రంధ్రముగల మెత్తని స్పందివలె ముక్కుపైనుండు శ్లేష్మము ఆరోగ్యముగానుండును. దీని చిహ్నములు రోగి లోపటినుండి గాలి బైటికివిడువ నారంభించినచో ఆశ్వాస కఠినముగా వెడలనారంభించును. మరియు ముక్కుయొక్క ఒకరంధ్రము మొల్లప్పుడు బంధించబడియుండును.

## (ఫ) నాసా పిటిక చికిత్స

ముందు మెదడును శుద్ధిపరుచవలెను. దీనివలన వాతము కలిగించునట్టి మలము హరించును. పిమ్మట మిరియాలు, జాపత్రి, యీరెండువస్తువులునూరి చూర్ణించి పిల్చించి తుమ్ముకలుగునట్టుల చేయవలెను. మరియు అజామోదము, ఆవాలు, జీలకర్ర, నల్లతులసి, పొదినా, మరియు యిట్టి స్వభావికముగు మలమును పక్వపరచునట్టి వస్తువులను కషాయముకాచి ఆకషాయముతో ఆవిరిపట్టించవలెను. మరియు చేదుబాదం నూనెలో ఆవాలు, తెల్లమిరియాలు చూర్ణము కొద్దిగాకలిపి నశ్యము చేయవలెను.

## సుగంధము తెలియకుండు వ్యాధిలక్షణము లు

ఈరోగము మెదడుయొక్క ప్రథమభాగమునందున్ను తత్సంబంధమగు పొరలయందున్ను కుకియెడముల యందుండువానియందు దుష్టప్రకృతి వుత్పన్నమగును. లేక నాసికముయొక్క రెండుభాగముల యందు వాసనచూచునట్టి అంగముగలదు. ఆఅంగమునందు దుష్టప్రకృతి వుత్పన్నమగును. ఇందువిషయమై హకీమురాజీగారు వచించినదేమన గా ఖస్మహకీము అనగా యిది వకరోగము, యీరోగమునందు సుగంధము తెలియకుండును ఈరోగము యిదియేమనియు యీవిధముగురోగమునందు మాటలాడుటలో భేదమేర్పడునని గ్రహించవలెను. మరియు యిప్పుడు నాలుగు విధములగు దుష్టప్రకృతి చిహ్నములు వర్ణించుచున్నాను గాన గ్రహించవగును. మరియు యీవ్యాధి ఉష్ణప్రకృతివలన కలిగినచో ముందుగా వృష్ణోపాయములు యిందు కలుగనారంభించి స్థిరమగును. మరియు రోగితలయందు భారముగా నుండును. అనగా నొనలునందు వుష్ణముగానుండునటుల తోచుచుండును. మరియు నిది మల దోషకారణమువలన కలిగినచో పక్వమైన చెమ్మ మెదడునుంచి వెడల నారంభించును.

మరియు చల్లనిదుష్టప్రకృతి అయినచో రతూబతు అనగా నీరు ముక్కునుండి స్వల్పముగా వెడలుచుండును. దీని చిహ్నములు ప్రకటన పరచును. దుష్టప్రకృతితో దీనిమూలము గురుత్వము నొందినచో రోగి మెదడుయొక్క ముందుభాగమునందు బరువుగానుండునట్టుల తోచుచుండును. ఇందువిషయములో జలుబునందు చెమ్మ బహుస్వల్పముగా నిటుల వచ్చుచుండును. అనగా మెదడు దుర్బలము నొందినకారణమువలన యీమలమునందుండు చెమ్మను నీడ్చుచున్నది. మరియు మలినమును దూరపరచునట్టిశక్తి బొత్తిగా లేకుండుట మరియు యీరోగము విశేషముగా వుత్పన్నమగుచుండును.

మరియు శుష్కత్వమువలన కలుగు దుష్టప్రకృతియందు బహుదా తేజస్సు శుష్కత్వము వుత్పన్నము చేయునట్టి నర్సాము అనగా, మెదడునందు వాపుకలుగు రోగముల తరువాత జనించుచున్నది. మరియు చెమ్మగల దుష్టప్రకృతి అయినచో చెమ్మను కలిగించునట్టి వుపాయములను ముందు అనగా నర్సాం మొదలగు జబ్బులలో ఉపయుక్తమగుచుండును. అవి ఈస్థితియందు సాక్షీభూతమగుచుండును. మరియు పరిస్థితము చెమ్మయొక్క చిన్హములు పరిత్యక్తమునందున్నవి. యివి రిక్తమలము వలన కలుగుచున్నది. అథవా మలపూరితమగు కారణము వలన కలుగగలవు. సాధారణమగు చెమ్మ బహుస్వల్పముగా వుత్పత్తియగుచున్నది.

—సుగంధము తెలియకుండు వ్యాధిచికిత్స—

సాధారణమగు దుష్టప్రకృతి అయినచో కేవలము ప్రకృతిని తన నిజదశయందు తెచ్చుటకై పరిశ్రమ చేయవలెను. మరియు మలము వెడలించి తదుపరి ప్రకృతియొక్క ఆరోగ్యముకొరకు ఆరూఢముగా నుండవలెను. మరియు కొన్నివస్తువులతో ప్రకృతిని నిజదశయందు మార్చుచున్నారు. అనగా షర్బతులు, భోజనములు, కాపడములు, లేపనలు మొదలగునవి. సుగంధితవస్తువులు ఉపయోగమునం దుంచవలెను. మరియు ఔషధములు లేపనముచేయుటలో మెదడుయొక్క ముందుభాగ

మునందు విశేషదృష్టి యుంచవలెను. అనగా యిచ్చట హేతు విపరీత వస్తువు గలదు. ఎందుకనగా రోగము వృద్ధియగు స్థానము.

మరియు, శుష్కత్వమగు రోగములలో ఈ భాగములయందు తీవ్రమగు రోగముల వెనుక కలుగుచున్నదని గ్రహించవలెను.

(లాభః) సహారాన్ ఆబాబ్ అను గ్రంథకర్త తన గ్రంథమునందు ఉష్ణశుష్కత్వమగు దుష్టప్రకృతి, తొందర, విచారము మొదలగు కారణములవలన కలుగగలదు. యిది నష్టమొందు కారణములేదు. ఇందు విషయమై ఆలోచించవలసిన అంశమైయున్నది. అనగా అనేకుల బుద్ధి కుశలతనుబట్టి యుండును.

## వాసన చూచుటయందు దుర్గతికలుగు లక్షణములు.

వాసనచూచుటయందు దుర్గతిగల వ్యాధికి వశాదశామ్ అను చున్నారు. అనగా వాసనచూచునట్టి శక్తియందు కలుగునట్టిపొరపేరు. మరియు దీనిని ప్రకృతిమార్గము చుట్టుకొనుచున్నది. ఈవుపద్రవమునకు మూడు భేదములు కలవు.

(1) వాసనచూచునట్టి శక్తి సుగంధ దుర్గంధములు మొదలగు నవి ఒకటిగానే గ్రహించుచుండును. ఇట్లు గ్రహించుటకు రెండుకార ణములు గలవు.

(1) మెదడుయొక్క ప్రథమభాగమునందు దుష్టప్రకృతి సంభ వించుట మరియు ఉష్ణమువలన కలుగునట్టి శుష్కత్వము దుష్టప్రకృతి వాసనచూచునట్టి శక్తియొక్క పనులను చెరచి నీచత్వమును కలిగించు చుండునని గ్రహించవలెను. ఈ కారణమువలన వాసనచూచునట్టి శక్తి సుగంధ దుర్గంధములను ఎల్లప్పుడు గ్రహించుచున్నది. వాస్తవములో ఏవస్తువుప్రత్యేకముగాయుండదు. అనగా చింతయొక్క కారణమువలన పీల్చునట్టిశక్తియందు నీచమైనట్టియు చెడువస్తువుల దుర్గంధమును సుగం ధముగా భావించుచుండును. మరియు సుగంధమగువస్తువులు వాసనతో సమానముగా గ్రహించుచుండును, కాబట్టి జలుబు చెమ్మగల దుష్ట

యొక్క ప్రథమభాగమునందుగాని ఆరెంటు అంగములయందుగాని వాసనచూచునట్టి అంగమునందు దుర్గంధపుగాలి నిండియుండుటు మరియు నాశికాంతిమునందు దుర్గంధగ్రిణాలు పుట్టినదై యుండును. చాలాకాలము గడచిన తరువాత వాసనచూచునట్టిశక్తి దీనిని సహించుచుండును. యిందువలన గ్రహించకుండును. మరియు దుర్గంధిత వస్తువునకు విరుద్ధముగా అనగా సుగంధముగువస్తువు గ్రహించగలను. గాని దుర్గంధవస్తువులను ఆఘ్రాణించునట్టి శక్తి గ్రహించకుండును.

వాసనచూచునట్టి శక్తి నశించుటకు (౩)వ-భేదము (1) చికిత్స ముందుగా మెదడునుండి మలమును తీసివేయవలెను. వ్రణమున్నచో, వ్రణము మానుటకు చికిత్సచేయవలెను. తరువాత సుగంధముగు తీక్ష్ణవస్తువులు అనగా లవంగములు, కస్తూరి ఇత్యాదివస్తువులను యెల్లప్పుడు వాసనచూచుచుండవలెను. మరియు నస్యకర్మయను కూడా వుపయోగించదగును.

{ (౩) వాసనచూచునట్టి శక్తినశించుటకు (౨)వ-భేద లక్షణములు. }

ఈవ్యాధియందు దుర్గంధవస్తువును గ్రహించగలశక్తి యుండును. గాని, సుగంధము గ్రహించజాలకుండును. యిందుకు కారణము అనగా మెదడుయొక్క ప్రథమభాగమునందుగాని లేక, గ్రహణశక్తి మెదడు యీరెండింటియందుగాని నిర్మలమగు రక్తమున్నా, కఫసంబంధమగు మలము నిలిచిపోవుట యీహేతువువలన వాసనచూచునట్టి శక్తి సువాసనవస్తుగంధము గ్రహించజాలక మొదలు దుర్గంధము తెలియుచుండును. యెటులననిన యీవస్తువుల గ్రహించునట్టిశక్తి నహా నశించినది. అనగా ఈవస్తువులు దీనికి విరుద్ధముగా నుండును. మరియు సుగంధము యొక్క జ్ఞానము బొత్తిగా లేకపోవును. యెటులననగా వాసనచూచునట్టి శక్తి దుర్గంధమునకు స్వాధీనమైనదని గ్రహించనగును.

## వాసనచూచునట్టి శక్తినశించుటకు (౧)-భేదకము (౨) చికిత్స

మెదడునుండి మలము తొలగించి తీవ్రతర దుర్గంధిత వస్తువులు ఉష్ణస్వభావికములగునవి. అనగా జున్ను, సుంబీంజ్, బాలింతబోలు, జావశీరు, నఖచికిని మొదలగు వస్తువులను వాసనచూచుట మరియు యీ వస్తువులను నస్యకర్మయందుపయోగించుట మొదలగునవి చేయవలెను.

(సూచనీయము) షేక్ అలీబూశేనాగారున్ను వారి అనురాగముగల శిష్యులున్ను ఈక్రిందివిషయములను వచించిరి.

యేరోగికి సుగంధవస్తువుల గంధము గ్రహించి, దుర్గంధము మాత్రము గ్రహించకుండిన జున్ను నస్యముచేయవలెను. మరియు సుగంధితవస్తువులు గ్రహించగలుగు దుర్గంధవస్తువులను గ్రహించునట్టి శక్తిగలరోగికి కస్తూరితో నస్యముచేయవలెను. అభిప్రాయమేమనగా శరాహాఅన్‌బాబ్ అను గ్రంథకర్తయొక్క వాక్యమును హాకీము షేకుఅబుఅలిశేనాగారు మొదలగువారు గ్రహించుట విరుద్ధముగాయున్నది. కాబట్టి నహారాజన్‌బాబ్ గ్రంథకర్త రెండు విపరీతవాక్యములను సమానముగా చేయుటకై ప్రకృతి తెలిసికొననిదే అంతవరకు షేక్ అబుఅలిశేనాగారి వాక్యమును గ్రహించవలసియుండును. మరియు ప్రకృతి బాగుగా మనస్సునకు తోచినచో అప్పుడు నహారాఅను గ్రంథకర్త వ్రాసిన అంశమును హాకీమురాజిగారుకూడా సమ్మతించిరని గ్రహించవలెను.

## నాశికమునందు కురుపులు గుల్లలు కలుగు లక్షణములు

ఒకప్పుడు ముక్కుయొక్క లోభాగమునందు కఫసంబంధమగు మలము వాతమలముయొక్క కారణమువలన గుల్లలు పుట్టుచున్నవి. మరియు నివి లోపలనుండు ఘ్రాణమువలన స్వభావికమగు మలము నష్టమొందుచున్నది మిగిలినది చిక్కబడి రాయివలెనగుచున్నది. యిట్టి

స్థితియందు శ్వాసరాకపోకలతో కష్టము కలుగుచున్నది. మరియు, నాశికముయొక్క మలము శీఘ్రట వలన కూడా కలుగుచున్నది.

### నాశికమునందు పుట్టు కురుపులు గల్లల చికిత్స.

మలము యేదోషసంబంధముగా నుండునో ఆమలాసారముగా చికిత్సచేసి ఆమలము తీసివేసి నుభ్రితనొందించవలెను తదుపరి గుల్లలు మెత్తబడుటకై మైనపుతైలమును ఆగుల్లలపై లేపనము చేయవలెను. మరియు, ఫ్లష్టోపకరణము నశ్యము చేయవలెను. దీనివలన మలము నశించును. మరియు, యీ ప్రహారమువలన మలము నష్టమొందనిచో శస్త్రముతో గంట్లువేయవలెను. మరియు, పుచిలమును తోదినచో మాంసమును నష్టపరచునట్టి మరహం(అంజద్ మొదలగునవి) బొత్తిగా నష్టమొందకుండునట్లుల జాగ్రత్తగా లేపనము చేయుచుండవలెను తరువాత గాయము మానుటకై సఫేదామరహం లేపనచేయవలెను. మరియు, యీ రోగముయొక్క చికిత్సయందు ఆలశ్యముచేయకూడదు యెందుకనగా యీ కురుపులవలన బహుశా నాసూరు అనగా లూటి కురుపు ఉత్పన్నముకాగలదు.

### (1) నాసావ్రణలక్షణములు.

నాసావ్రణములు మూడుభేధములు (1) చెమ్మకలిగి దీనికారణముచేత మాంసమును నశించునట్టి రతూబతు నీరు కలుగుచుండును, యిది మెదడునుండి యీ స్థలమునకు దిగి వచ్చుచున్నది.

### (1) నాసావ్రణ చికిత్స.

మొదటనుండి మలమును తీసివేయవలెను. దీనివలన యీ మలము రోగ కారణమగుచుండును గాన యీ మలము వెడలిపోయిన తదుపరి సఫేదా, మురదాసు, సింగుకాల్చిన వెండిమలినము, సీసభస్మము గుల్రోగన్ యీ మొదలగు వస్తువులతో మరహం అనగా వలాస్త్రి తయారుచేసి వేయవలెను.

(2) శుష్క నాసావ్రణలక్షణములు

శుష్కత్వమువలన నాసికయందు వ్రణములు కలుగును ఈ వ్యాధి అనేకులకు విశేషముగా కలుగుచున్నది. మరియు, నిది దోషము దగ్గఱయుండిన మలము వలన పుట్టుచున్నది.

(2) శుష్క నాసావ్రణ చికిత్స

కలుంగ పూర్వతైలము మిగుల, కోడిక్రొవ్వుగాని బాతుక్రొవ్వు గాని లేపనము చేయవలెను. మరియు మహాం అబియజ్ తేనెమైనము చిడుబాదమూనె, బప్పాతైలము, ఆవ్రముగాలగ యివి మొదలగు వస్తువులతో పలాస్త్రిచేసి బేవనా గుజ్జులో కలిపి లేపనముచేయవలెను. అనగా మైనపు అరకువేసి కాచి బేవనాలు నీళ్ళలో నానవేసి కలిపి ఆబేవానా గుజ్జు అందులో చేర్చి చక్కగాకలిపి పూయవలెను.

లిప. భేదము నాసావ్రణ లక్షణములు

నాసావ్రణము చాలాకాల మురుండియుండినదై యిందుండి దుర్గంధముగు తూబితు అనగా నీరువచ్చుటవలన కుళ్ళుచుండునుగాన నఫేదా, కర్పూస్, ఆడేలు, చక్కగానూరి ముక్కులోపూదవలెను. తదుపరి దార్తుపండ్లతో చేయుబడిన శిరకాతో ఆవ్రణమును శుభ్రపర చి పిమ్మట బాలిరబోలు, మెత్తగనూరి ముక్కులోనూదవలెను. దీని వలన వ్రణముయొక్క మలినము శుభ్రితనొందువరకు పూదుచుండ వలెను. తరువాత వ్రణమును మాన్పునట్టి ఔషధములు వేయవలెను.

నాసారక్తస్రవముయొక్క లక్షణములు

నాసారక్తస్రవమునకు నకసీరు అందురు. ఈరోగము కారణాను సారముగా మూడుభేదములుగానుండును.

(1) రోగసంధియందు కలుగు నాసారక్త లక్షణములు.

ఈరోగము బహులరా అనగా రోగ సంధియందు పుట్టుత్తి యగును. దీని చిహ్నములు వ్రణమగు వ్యాధులయందున్ను పుష్పజ్వరముల యందున్ను రోగసంధి దినములయందున్ను పుత్పన్నమగును. ఈవిధము

గు నాసాస్రవమునకు బంధించవలెను. ఎటులననిన దీనిద్వారా రోగముల ను బైలువెడలును. అనగా రక్తము విశేషముగా వెడలుటవలన శక్తి హీనమగును. శక్తి నశించుటవలన రోగికి అపాయము సంభవించును గాన వెంటనే రక్త స్రావమును ఆపివేయవలెను. ఇటుల బంధించుట్టి నుపాయములు ముందు భాగములలో విస్తారపూర్వకముగా వర్ణించబడెను.

(2) రక్తమునందు తీక్ష్ణత్వమువలన కలుగు నాసారక్త లక్షణములు.

రక్తమునందు తీక్ష్ణత్వము కలిగియుండును. ఈ కారణమువలన నాసామార్గమునందుండు సన్నని నరముల ముఖము చిట్లిపోవును. దీని చిహ్నములు అనగా పిత్తాధిక్యముగానుండునటుల తోచుట రక్తము కొద్ది కొద్దిగా వెడలుట రక్తము మిక్కిలి పలచగానుండుట యీ మొదలగు లక్షణములు కలిగియుండును.

2. వ భేదము నాసారక్తస్రవముయొక్క చికిత్స.

శక్తిహీనత్వము నొందుటవలన ముందు యేముక్కునుండి రక్తము వచ్చుచున్నదో ఆవైపు చెయ్యియొక్క సరేరు అను నరమును ఛేదించవలెను. మరియు చీల్చినగాటు సన్నగానుండునటుల చీల్చి రక్తమును అనేక పర్యాయములు తీసివేయవలెను. యెందుకనగా యీవిధమగు చికిత్సవలన క్రిందిభాగమునకు రక్తము దిగిపోవును. శక్తి కూడా తగ్గకుండును. అభిప్రాయమేమనగా రెండుచేతుల నరములను విశాలముగా ఛేదించవలెనని అబూఅలీ మతము. మరియు ఒకేపరియాయము విశేషముగా రక్తమును తీసివేయవలెను. అనగా రోగి మూర్ఛనొందువరకు తీసివేయవలెనని భావము. మరియు రక్తమునందు జలుబు చిక్కదనము వచ్చుటవలన నాసాస్రవము నిలిచిపోవును. రక్తము విశేషముగా వెడలుట మరియు అవశ్యముగా అచైతన్యుడగుట ఆసమయమునందు యోగ్యముగానుండును. అనగా యిటువంటి గుణముగల యితర చికిత్సచేయులేదు. మరియు శిరావేదన స్వల్పముగా చేయుట మారుమారు రక్తము వెడలించుటవలన ప్రయోజనముండనేరదు. అభిప్రాయమేమనగా రక్తము

రొయొక్క తీక్ష్ణత్వము తగ్గునట్లు అణచునట్టి భోజనపానాదులను యివ్వవలెను. అనగా గాడదమస్సత్తు వృక్షాబ్ మస్సత్తు రిబాన్ మస్సత్తు యీా మొదలగునవి పానముచేయవలెను. మరియు చిరిశెనగపప్పు శిరకాలో నానవేసి నదియు బియ్యపు అన్నమును రోగికి పత్యమియ్యవలెను. మరియు లేపనము చల్లని నీళ్ళతో పైవత్తుట మరియు చల్లనినీళ్ళలో మునుగుట ముక్కుతో చల్లని నీళ్లుపీల్చుట మరియు పన్నీరు, చందనము, పచ్చకర్పూరము, యీామొదలగు వస్తువులను నొసటపై లేపనముచేయుట బాధరాజ్ఞినకుగా మంచుకోపోయుట మొదలగు చికిత్సలవలన నాసారక్తప్రవర్తకృతి అనుసారముగా బాధించవలెనని గ్రహించవలెను. మరియు యిటులనే పొదీనారసముగాడిదె ద్దిగనమునందు కొద్దిగా పచ్చకర్పూరమున్ను యిటులనే మాదిఫలకాయ, ధనియాలు, తిరుగలివంటియుండు పిండి, గవ్వలుకసాంబ్రాణి, ముసాంబరము, కహారోబా, పటికి ఈవస్తువులు మెత్తగానూరి కాగితముతోగాని, బట్టతోగాని, వత్తిచేసిగాడిదలద్దిగనమునందుగాని లేక కోడిగుడ్డుతెల్లసొనయందుగాని, తడిపి తరువాత యీాచూర్ణమును ఆవత్తిపై చల్లిముక్కులోనుంచవలెను. మరియు యీాచూర్ణము గొట్టముద్వారా ముక్కులో వూదుటకూడా వుచితమగును మరియు సాలెపురుగుగూడు శిరకాలోతడిపి తిరుగలిపిండి ఆపై చల్లి ముక్కులోనుంచినచో నాసారక్తము వెంటనే ఆపివేయును. మరియు యిందువిషయమై కేవలము గాడిదెలద్దెరసము ముక్కులోపిండుట వుత్తమము. ఈచికిత్స పరీక్షింపబడినది, అనుభవమువలన చెప్పబడుచున్నది. మరియు తొడలు, దండచేతులు గట్టిగా బిగించికట్టుట యీా అంగములను మర్ధించుట యిటులనే రెండు అండకోశములు రొమ్ములనుమర్ధించుట బంధించుట మొదలగు వుపాయములు నాసారక్తమును ఆపుటలో మిక్కిలి గుణము కలిగించును అనగా నొప్పికలుగునటుల కట్టవలెనని భావము.

మరియు మచ్చనగుంటయందు కొమ్మును తగిలించి రక్తముతీయుట లాభదాయకమగును. మరియు ఎడమముక్కునుండి రక్తము స్రవించుచుండిన పిత్తాశయముయొక్క స్థలమునందు కత్తిగోకట్లువేయవలెను. మరియు కుడిముక్కునుండి రక్తము స్రవించుచుండిన ప్లీహముయొక్క స్థలమునందు కత్తిగంట్లు వేయవలెను.

(సూచనీయము) హకీము జలీనూస్ గారు ఇచ్చినరావుయొక్క మతానుసారముగా, దండలు తొడలు బంధించునట్టి విధానము అనగా చెయ్యి చంక మొదలు అరిచెయ్యివరకున్ను, కాళ్లు గజ్జలుమొదలుకొని పాదములవరకు బంధించవలెను. మరియు చంకనుండియు తొడలను గజ్జలనుండియు బంధించ నారంభించవలెను అనియు మరియు హకీమురాజీ గారు అంగముయొక్క మూలమును వృత్తమునిరి. అనగా గజ్జలయందున్ను, చెయ్యి చంకయందుమాత్రము బిగించి తక్కిన క్రిందిభాగమును మానివేయుట మంచిదనిరి యెందుకనగా రక్తము క్రిందివైపునకు దిగి వచ్చును. ఆరక్తము అచ్చటనే నిలిచియుండును. అంగము యావత్తు బిగించినచో మలము క్రిందికి చక్కగా దిగిరాజాలదు. మరియు క్రిందికి దిగివచ్చునట్టి సహాయమునకు స్థలము లేనిచో తిరిగిపోయి మిక్కిలి కష్టమును ప్రవేశింపజేయును ప్రత్యేక దశయందు శరీరమునందు నిండియుండినచో అవశ్యముగా హకీమురాజీ గారి వాఖ్యము అవలంభించుట ము.

—౦శిర-భేదము నాసాస్రవ లక్షణములు.౦

ఈనరములు హృదయసంబంధములగు నరములు మెదడు క్రింద నుండు పొరయందువున్నవి. ఆపొరను నబకియా, మునిబియా అందురు. ఆనరములు రక్తాధిక్యతవలన చిట్లిపోవును. మరియు, ముక్కునుండి రక్తము స్రవించనారంభించును. యీ విధమగు వ్యాధియందు కలుగు చిన్నములు మొదట తలనొప్పి వుచ్చున్నమగును. ముఖమునందు కండ్లలో యెఱుపురంగు కనబడుచుండును తరువాత, ముక్కునుండి రక్తము స్రవించ

నారంభించును. మరియు, నల్లగను నిర్మలముగను యెఱ్ఱగను రక్తము స్రవించుచుండి ఉష్ణమైనచో హృదయసంబంధ నరముల రక్తమని గ్రహించవలెను. నాసారక్తము తీక్ష్ణరోగముల తరువాతగాని అథవా దెబ్బతగులుట, అదురుట మొదలగు అభిఘాతముల తరువాతగాని వుత్పన్నమగును. ఇట్టి స్థితియందు నాసా రక్త స్రావము. మరియు దెబ్బ మొదలగునవి తగులుటవలన మొనమునకు తగులుటకు చిహ్నములు అనగా సక్సాం, ఉలతిప్పా, నక్సీర ను ఈవ్యాధులలో మూలమున్నది. మరియు, నుబాత్ అనగా కూర్పరనిద్ర కలుగుటకూడా నాసావ్యాధియందుకలుగుట సంభవము. మరియు ఒక్కొక్కప్పుడు పాముకాటు వలన రక్తము పొంగనారంభించి తీక్ష్ణత్వము కలిగియుండుటవలన ముక్కువెంట రక్తము స్రవించ నారంభించును.

—ద్వాదశ భేదము నాసాస్రవ చికిత్స—

మాంసమును నశింపజేసి అంగమును దహింపజేసి యెండింపగట్టి వరచునట్టి వస్తువులను అనగా పటిక, జంగాలపచ్చ, ఇటులనె యితర వస్తువులను ఈవ్యాధియందుపయోగించవలెను వీటివలన బహుదా నకసీర్ వ్యాధి నశించగలదు. మరియు, హాకీంఉష్షేక్ అబుఅలిశేనాగారు ఆవస్తువులను వుపయోగించుటయందు సావధానముగాయుండుట యోగ్యమనిరి యెటులనగా నిస్సందేహముగా యీవిధమగువస్తువులు పొక్కు కలిగించుచున్నవి. అట్టిస్థితియందు ముందు కంటె విశేషముగా చెడు రక్తము ముక్కునుండి స్రవించుచుండును. మరియు, హాకీము రాజీగారు యొక్కయు, నా విచారమునందు యీ చికిత్సవలన నాసారక్తము వచ్చుటయందు ఆరోగ్యముకలుగుచున్నది. అనగా నరముఖము చిట్లుటవలన కలుగుట, హృదయసంబంధ మందమగు నరములు చిట్లుటవలన కలుగుట ఒకప్పుడు దీని ఆరోగ్యము శిరావేదనము చేయుటవలనకూడా కలుగును విశేషరక్తము వెడలింపజేయవలసియుండును. యిందువలన అచేతనుడగును, రోగి మూర్ఛనొందువరకు రక్తము తీసివేయవలెను.

(సూచనీయము.) దెబ్బగుట మెదడోరోగము యందు ముక్కు నుండి రక్తము వెళ్ళి వేయవలసిన అవసరము కలిగిన హో నఖ కని, అడవిదాక్ష, తామరతింఘ యిగు వస్తువులనుసూరి మారేడాకు రసమువందుకలిపి వత్తిచేసి నాసామార్గమునందుంచవలెను. ప్రాచీన వైద్యవరులు యీ చికిత్సగాను శస్త్రములను కనిపెట్టిరి. ఆశస్త్రము యిందువిషయమై వుపయోగించినయెడల వుపయోగించుకొనవచ్చును.

నాశికముననుండి దుర్గంధము వచ్చు లక్షణములు

ఈరోగము మూడువిధములుగా నుండును. (ఏ) నాసికమునందు దుర్గంధిత పిటికగాని లేక పురాతనవ్రణము కుళ్లినది ముక్కులోభాగమునందుండును. దీని చికిత్స ఆశేషవర్ణాయిగులు చెప్పియున్నది.

(బి) దుర్గంధితాంకివరపరమాణువులు రొమ్ములయందు గాని అధవా ఫుప్పుసములయందు అనగా వూపిరితిత్తులయందుగాని లేక ఆమాశయము నందుగాని, చెవి,మెదడునందుచేరి మూడునందుఒకటిగాగూడియుండును. మరియు ఆరెండురంధ్రముల మార్గమునుండి ముక్కునుండి నోటిఅంతమునందు చేరుచున్నవి. ముక్కుయందు ప్రవేశించుచున్నవి.

నాశికమునుండి దుర్గంధము వచ్చు వ్యాధిచికిత్స

ఈవిషయమును నిశ్చయపరచవలెను. అనగా దుర్గంధిత దోషముగల ఆవిరిపరమాణువులు యేఅంగమునుండి బైలుదేరి మెదడునందు చేరుచున్నవో. ఆలోచించి ఆఅంగమునందుండు మలమును తీసివేయవలెను. ఇటుల అంగమునందుండు మలమును తీసినతరువాత వ్యాధి సంబంధముగు మలము శేషించియున్నచో నాసామార్గము మూర్పునొందుటకై నిల్పియుండుమలమును సరాబ్ రిహానీ ముక్కులోవేయవలెను. మరియు జటామాంసి. తుంగగడ్డలు, అగరు యీవస్తువులు ప్రత్యేకప్రత్యేకముగా చూర్ణించి ఆచూర్ణమును వకటిగా కలుపుకొని ముక్కులో వూదవలెను. మరియు యీచూర్ణములో సారాయికల్పి వత్తి చేసి నాసామార్గమునందుంచవలెను.

(సూచనీయము) శరాబ్ రి వాసి చేయు విధానము.

లవంగములు, జాజికాయ, దాల్చినచెక్క, జాపత్రి, అగరు, బార్లింగ్, లేక గౌజబాన్ గాని, బాదరంజబోయా, యీవస్తువులు యావత్తు వకసంచిలో వేసి దాని తుండ్ల రశికా అనగా పులుసులో వేసి ఆశిరకా సుగంధము కలుగువరకు యుంచవలెను.

## (2) నాసాదుర్గంధ లక్షణములు

మరియు దుర్గంధిత రతూబతు అనగా నీరు మెదడునందుపుట్టును అథవా మెదడుముందుభాగమునందు లేక నాశికము కలిసి స్థానమునందుగాని మలము ఘనీభవించి ఆమలగంధము నాశికమునకు వచ్చుచుండును.

## (2) నాసాదుర్గంధ చికిత్స.

మెదడునందుగల మలమును తీసివేయుటకై మలమునుతీసివేయునట్టి మాత్రలు యారజాత్ మాత్రలు యివ్వవలెను. తదుపరి శికింజబీన్, బిజూరి, జీలకర్ర, ఆవాలు, మొదలగువస్తువులు కషాయముకాచి ఆకషాయము పుక్కిలించవలెను దీనివలన మెదడు పరిశుభ్రతనొందును. దుర్గంధితచెమ్మను తీసివేయవలెను. తదుపరి జటామాంసి, లవంగములు, గులాబిపూలు, యీమొదలగువస్తువులు, సారాయిలో వేసికాచి పుక్కిలించవలెను. పిమ్మట సుగంధితమగు వస్తువులు యిందుచెప్పబడిన జటామాంసి, మొదలగునవి చూర్ణించి ముక్కులో నూదవలెను.

## ముక్కు అనిగిపోవు లక్షణములు.

ఈవ్యాధిలక్షణములు ముక్కుతెగిపోవునట్టి వర్ణనమునందుకూడా చూడవలెను.

## ముక్కు అనిగిపోవు చికిత్స.

ముక్కుకొద్దిగా అనిగిపోయినదో లావుగానుండు నలాకను ముక్కులో ప్రతివేళ పెట్టి ఎత్తు మొనకల వల్లములను సరిచేయవలెను. మరియు లైటి వైద్యుకూడా తన నిజదశయందువచ్చువరకు చేతితో సరిచేయుచువ

ను. తరువాత కుంసాంబరము, అడవిదానిమ్మవేరుబెరడు. దంచినది లేతతుమ్మకాయరసము, బొలి లబోలు, యీవస్తువులు మెత్తగానూరి బార్లింగ్గాజులో వేసి కొంచి కాగితమునకు లేపనముచేసి ముక్కుపై వేయవలెను. ముక్కు విశేషముగా సతికెబడి ముక్కుయొక్క ప్రాధుళల్యము విరిగిపోయినయెడల వెంటనే శిరావేధనము చేయవలెను. మరియు యిందుండు మలమును త్రిప్పివేయవలెను.

దీనివలన వాపు భయము కలుగజాలదు. మరియు, మెదడుయొక్క ప్రకృతిని రక్షించుటకై లఘువగు చల్లని లేపనలు తలపై చేయవలెను దీనివలన నొప్పి సమీపమునందుండునట్టి కారణమువలన మెదడునందు వ్రణముసంభవించును. అట్టిస్థితియందు సర్సాంవ్యాధి కూడసంభవించును. అప్పుడు మలము క్రిందికి దించవలెను మరియు, మెదడు ప్రకృతి రక్షణమువలన నిశ్చింతకలుగును. అప్పుడు ముక్కును చక్కపరచుటకై ఆయుధము దీనిని మిఫ్తావుర్ రహం అందురు. యీ ఆయుధమును ముక్కులో ప్రవేశపెట్టి నెమ్మదిగా త్రిప్పవలెను అనగా పై భాగము సతికెబడినభాగము నిజదశయందు వచ్చువరకు త్రిప్పవలెననిభావము తరువాత సన్నని కర్రముక్కలు తీసికొని ఆకర్రపై బట్టచుట్టి ముక్కురంధ్రములతో సమానముగానుండునట్టుల వత్తివలె యేర్పరచి పిమ్మట అకాకియా అడవిదానిమ్మ వేరుచెక్క నూరి ఆవత్తిపై లేపనముచేసి ముక్కులో యుంచవలెను. యిటుల వత్తియుంచి పైభాగములను చేతితోసరిచేయవలెను. యిట్లు పైభాగము సరిచేయకున్న యెడల ముక్కు సరిగాయుండదు. మరియు, ముక్కు బాగగువరకు ఆవత్తిని ముక్కులోనే యుంచవలెను. ముక్కు లఘువుగా అణగిపోవు విషయములో చెప్పియుండు లేపనలుకూడా ముక్కుపై వేయవలెను.

(ఆంభము) కదాచిత్ చాలాకాలమువరకు ముక్కు వత్తులుంచియుంచిన కారణమువలన ముక్కురంధ్రములు బిగిసియుండుటవలన వుశ్వాసనిశ్వాసములు నడుచుటకు వ్యావృతికలుగును. యీ కారణమువలన

రోగికి కష్టమనుభవించినచో రాగి గొట్టమునుగాని లేక సీసపుగొట్టమునుగాని చేసి అందుపై గుడ్డజుట్టి కర్రముక్కకు బదులుగా ముందు వెనుక చెప్పినరీతిగా శస్త్రభాగంగముల సహాకూడునట్టి లేపనలుచేసి ముక్కులోనుంచుట అన్నిటికంటె ఉత్తమమని భావించవలెను. యిట్లు గొట్టము పెట్టుటవలన ఉశ్వాసనిశ్వాసములు సుఖముగా నడుచుచుండును రోగికి యిందువలన యేమి కష్టము కలుగకుండును.

## తుమ్ములు విస్తారముగా వచ్చు వ్యాధి లక్షణములు

దగ్గు వూపిరితిత్తులకు యెటుల పైకారణమగునో అటులనే తుమ్ము మెదడునకు కారణమగునని గ్రహించవలెను. యీ కారణమువలన తుమ్ము మెదడునకు కష్టముకలిగించునట్టి వస్తువులను తీసివేసి మెదడును రక్షించుచున్నది. మరియు, దీని అధికవిశేషత్వము బహుశా విపత్తువులను కలిగించునట్టి కారణమగును. యిందువలననే శరాహ అస్ బాబ్ అను గ్రంథకర్తవచించిన దేమనగా తుమ్ము సరిగావచ్చుటవలన నాసారక్తమును విశేషముగా పొంగించుచున్నది. మిక్కిలి జ్వరములలో మరియు, యిటువంటి వ్యాధులలో తుమ్ములు విశేషముగా కలుగుచున్నవి అనగా శక్తి దుర్బలము నొందుచున్నది. ముఖ్యముగా జుకాము అనగా జలుబువ్యాధి ఆరంభమునందు తుమ్ములు విశేషముగా కలిగి రోగికిహాని కలిగించును. దీనివలన మెదడునందునీర్సము సంభవించును, మరియు, మెదడునందు ఉష్ణముగల వానికి తుమ్ములు అనారోగ్యమగును. మరియు, దీనివలన రొమ్ములోపల మలము విశేషముగా నిండియుండును. యిట్టిమనుష్యుని ముక్కులోపలనుండి రక్తము విశేషముగా యీ మొదలగు అంగములకు తుమ్ముహానికరమగును గాని తుమ్ములు మూడువిధముల రోగములకు లాభదాయకమగును.

(1) ఏమనుజుని తలయందు కొద్ది ఆవిరిపరమాణువులు లేక వాతముగాని అథవా స్వల్పముగా మలముండునో అట్టివారికి జుకాము అనగా జలుబువ్యాధిఅంతమునందు లాభదాయకమగును.

(2) ఏరోగికి మెదడునందు వర్ణమై జనములనుండైనను అట్టివారికి జుకాము అంతమునందుమున్న లాభదాయకమగును. యీ వ్యాపి మలము చిక్కగను విశేషముగానుండనో, మరియు పక్వమొందియుండినను అట్టివారికి తుమ్ములు కలిగినను మెదడు బలముగలదగుటకు చిహ్నము అగును. యీ కారణమువలన మృత్యువు సమీపించినప్పుడు కలుగనేరదు యెందుకనగా మెదడు దుర్బలముగలదై యుండును.

(3) స్త్రీలు రజస్వలగునట్టి సమయమునందు యెటులనగా తుమ్ము రజస్సు మరియు దీనితోకూడ దీనివలన రజస్సు పుట్టుకొనియుండును. గాన బైటికివచ్చుటకు సహాయమును జేయుచుండును.

### తుమ్ములు విస్తారముగా వచ్చు వ్యాధి చికిత్స

తుమ్ములు విశేషముగా రానారంభించి వ్యాధి కలుగనియ్యాకుండినయెడల యిట్టిస్థితియందు తుమ్ములను ఆపవలసివచ్చినయెడల సుగంధమగు గుల్రోగన్ మరియు బాదమూయొక్క తైలములను ముక్కు దూలముపై లేపనముచేయవలెను ఈ తైలములను నశ్యముచేయవలెను. మరియు వృష్ణారమగు యవాగులు, గంజాలు, జావలు, యిప్పించవలెను. తలగడ వెచ్చచేసి ముచ్చనగుంట క్రిందనుంచవలెను. మరియు గోరువెచ్చని మంచినీళ్ళతో తలకు కాపడము చేయవలెను. మరియు వెచ్చనినూనె చెవిలో పోయవలెను. ముక్కుపై కూడా లేపనముచేయవలెను. మరియు కాళ్ళు, చేతులు, మూడు, కండ్లు, మర్ధించవలెను. రోగికి శయ్యపై పత్తిగిలివయుండునటుల ఆజ్ఞాపించవలెను. మరియు చింత ప్రవేశించుటయందు సంతోషించునటుల చేయవలెను. సేవు, అనగా నస్పతి వాసనచూచుట యీ మొదలగునవి తుమ్ములు ఆపుటకు సహాయమగుచున్నవి. మరియు పొగ, దుమ్ము, అన్యవస్తువులు అనగా తుమ్ముకలిగించునట్టి వస్తువులతో జాగ్రతవహించుట వుచితమగును.

(సూచనీయము) చంటిబిడ్డలకు తుమ్ములువచ్చుచుండిన మేక గురదాలు అనగా కందనకాయలు నిప్పుమీద నునిచి కాల్చి నీరు న్రు

ించ నారంభించినచో తీసి పిల్లవాని ముక్కులో పోర్దించవలెను, అథవా అటిల్లిపిండి ముక్కులో పోయవలెను.

## ముక్కువాచుటకు లక్షణములు.

ముక్కువాచుటకు మూడుకారణములు గలవు. (1) మిక్కిలి ఉష్ణము, జ్వరము, మొహ్రక్రకా, అనగా పిత్తజ్వరము దీనివలన నరముల లోపలనున్న హృదయము పిత్తాశయమునకు సమీపమునందు కలుగుచున్నది. ఈవ్యాధులలో నాసావాపు వుత్పన్నమగుచున్నది.

## (2) ముక్కువాపు లక్షణములు.

విశేషముగా ముక్కుచెమ్మను శుష్కత్వము ఆర్పివేయుచున్నది. అనగా క్షయ, సంబంధమగు జ్వరముయొక్క వుష్ణము ముఖ్యఅంగములతో అనగా హృదయము, పిత్తకోశము, మెదడు మొదలగువాని సంబంధమగు అంగములను శుష్కింపజేసి అటుపిమ్మట నాశికమునందు వాపు కలిగించును.

## (3) ముక్కువాపు లక్షణములు.

జిగురు గలదోషము ముక్కులోభాగమునందు నిలిచి ఆస్థలము గాలిమార్గమగుటవలన యెండిపోయి మార్గమును బంధించివేయును కాబట్టి మార్గము మూసికొనిపోవుటవలన మెదడునుండి దిగునట్టి చెమ్మ ముక్కునందు చెమ్మ కలిగించుచున్నది. యీచెమ్మ యిటు రాజాలకపోవుటవలన వాపు కలుగుచున్నది.

## ముక్కువాపు చికిత్స

ఈరోగకారణము వుష్ణమైనచో చల్లని ఔషధములు యివ్వవలెను. మరియు చల్లనితైలములతో నశ్యముచేయవలెను. గురుకరమగు లఘువగు లేపనలు, చల్లనిసేవనలు, చల్లని చెమ్మను కలిగించునట్టి భోజనములు యిప్పించవలెను.

మరియు యీరోగకారణము శుష్కమైనచో చెమ్మను కలిగించుటకు చెమ్మగలఔషధములను వుపయోగించవలెను, మరియు చ

మ్మను కలిగించునట్టి తైలములను నశ్యముచేయవలెను. చనుబాలతో నొసలు కడుగవలెను. మరియు రోగము నాసామార్గమునందు దోషము నిలిచిపోవుటవలన కలిగినచో తైలములు రసములన్ను వుపయోగించుటవలన చెమ్మను కలిగించునట్టి షర్బతులు పానముచేయుటవలన దోషమును మృదుత్వము కలిగించును. అప్పుడు వుక్తదోషమునందు వెడలించునట్టి శక్తి కలిగినచో తిరిగి వుక్కిలింతలు గండూషములు, కావడములు, చెమ్మను కలిగించునట్టి వస్తువులను సువాసనచూపించుటవలన అనగా వెన్నతో లేక తైలము మొదలగువానితో మలమును తీసివేయవలెను.

## నాశికము దురదవేయు లక్షణములు

ముక్కు దురదవేయుటకు రెండు భేదములుగలవు (బి) చల్లనిగాలి ముక్కునందుప్రవేశించి ముక్కు మెదడునందు తీక్ష్ణత్వము మంట సంభవించును. కండ్లవెంబడి నీరు స్రవించనారంభించును, కండ్లవెంట నీరు స్రవించుటకు కారణము మంటవలన, తీక్ష్ణత్వమువలన నీరు స్రవించుటకు కారణమగును మెదడునందు ఉష్ణము సంభవించి రతూబతు అనగా నీరు ఉష్ణప్రకోపమునొంది నీళ్ళలోకలిసి వెళ్ళుచున్నది కాబట్టి చల్లనిగాలి ముక్కులో ప్రవేశించుటవలన 'ఆనమయామునందు దురద కలుగుచున్నది. అప్పుడు తీక్ష్ణదోషము మెదడుయొక్క పొరలో ఘనీభవించుచున్నది. మరియు, తీక్ష్ణమగు ఆవిరి పరమాణువులు అందుండి నాసామార్గమునుండి బైటికి వెడలుచున్నవి. తిరిగి చల్లనిగాలి ముక్కులోప్రవేశించినచో యీకారణమువలన గాలివలన కలుగు జలుబు ఆపరమాణువులను ముక్కులోనే నిలుచునటుల ఆటంకపరచుచున్నది యిందువలన విశేషముగా మంటకలుగును ఒకప్పుడు మలము మెదడునందు వుత్పన్నము కానేరదు గాని వేరుస్థానమునందు వుత్పన్నమగును అచ్చటనుండి ఆవిరి పరమాణువులు యెక్కి పైచెప్పినరీతిగా ముక్కును దురదను కలిగించుచున్నవి.

మరియు అడవిపొదినా, అక్కలకఱ్ఱ, మసాంబరము, యీమొదలగు వస్తువులు కూడా [illegible] తమయ్యెడల కలిగించవలసివచ్చి నచో వృష్ణప్రకృతిగలవారికి యీవస్తువు లుపయోగించకూడదు.

(సూచనీయములు) బహుశా సజాల, జుకాము, మొదలగువాటిని వర్ణించుట యీస్థానమునందు [illegible]గాయుండునుగాని సహారాఅజ్ జాబ్ అనుగ్రంధకర్తయొక్క సమ్మతి అనుసారముగా శిరోరోగప్రకరణమునందు ఇఖ్తిలాజ్ అనగా అంగములు అదరుట పాలిజ్ అనగా వాతము చెడుటయొక్క తెరువులు వర్ణించబడినవి.

గద్య, ఇది శ్రీనదిమూంబేగ్ సాహెబ్ పౌత్ర పచ్చాబేగ్ సాహెబ్
పుత్ర "వైద్యభూషణ" బిరుదావళీ విరాజమాన వైద్యవిద్వజ్జన
విధేయ రహంతుల్లాబేగ్ నామధేయ ప్రణీతంబైన
"తిబ్బెఅక్బర్ షాహి" అను వైద్యగ్రంధమునందు
నానారోగాధ్యాయము సర్వము
సంపూర్ణము.



యాకరీముల్ మారూఫ్.

బిస్మిల్లా హిర్రహిమా నిర్రహీం.

# తిబ్బె అక్బరి షాహి

ఆరవ అధ్యాయము.

## జిహ్వారోగ లక్షణములు.

### ముఖము—జిహ్వారోగ వివరములు.

ఇందు ప్రత్యేక ప్రత్యేకముగా వర్ణించబడును. మరియు, ముఖముయొక్క మార్గము భోజన అంగములలోనుండి ముఖ్యమగు ప్రధానఅంగము ఇది తెల్లనిమాంసము మరియు, నరాయిరాక్ అనగా హృదయసంబంధమగు నరములు. మరియు, అబుర్ వా అనగా పిత్తకోశసంబంధమగు జీవనరములు గట్టి ఝిల్లి నరములతో యేర్పడినది. మరియు, హృదయనరముల కర్తకారణములో యిందు మెరుపురంగుగలదు. మరియు, నాలుక మూలమునందు ఒకమాంసపు గంధిగలదు. ఇందుండి జిగురు సంబంధమగు నీరు వెడలుచుండును. నిది నాలుకను చెమ్మకలిగించి భోజనపదార్థములతో చేరుచున్నది. యిదాపి జిహ్వకు రెండు మార్గములుగలవు. యీ కారణమువలన ఓపొరలోపల ఒకటి ప్రత్యేకముగా కనుపించుచున్నది. నాలుకవలన మనుష్యుని మనస్సుగోని సంగతులు తెలిసికొనుట యిది ముఖ్యముగానున్నది. యీ ప్రకృపతము వలన విశదపడగలదు. నాలుకయందు పద్రుచులను గ్రహించుజ్ఞానమున్న హెచ్చుతకలించు జ్ఞానసంబంధముగుజీవనరములుగలవు గనుకనే మాట్లాడుటకు నాలుక ఆధారముగనున్నది. దీనిని వాకేంద్రియమని పిలువబడుచున్నది.

నాలుక అవయవములుచూపు చిత్రపటము.




(1) నాలుక మూలము ఇది గొంతుపీకెను ఆక్రమించి యుండును. (2) నాలుకయందు రుచిబుద్ధి నొసగు జీవనరము ఇది మెదడునుండి నాలుకయందు ప్రవేశించియుండును (3) హృదయసంబంధమగు సరాయూన్ అను జీవనరము నాలుకయొక్క పోషణార్థమై హృదయమునుండి రక్తము చేర్చుచుండును. (4) అబుర్వా అనగా పిత్తకోశమునుండి బైలువెడలిన జీవనరము (5) నాలుకను నానావిధములుగా తిరుగునటుల చేయునట్టి కండరము (6) వాక్కును స్ఫుటత్వము నొందించు జీవనరములకు స్థానము ఇది మెదడునుండి యుత్పన్నమై హృదయమువరకు అల్లుకొని యున్నది. 7_8 నాలుకకు ఆరిపోకుండునటుల తెల్లని ద్రవమును ఉత్పన్నము చేయునట్టి నరములకూటములు. ఈ నీరు ఆహారరసముతో మిళితమగును ఇది కూడా ఆహారమునకు పాచనము చేయునట్టి ద్రవమని గ్రహించవలెను

—జిహ్వావాపు లక్షణములు—

నాలుకవాపు నాలుగు భేదములుగానుండును (ఏ) యీవాపు రక్తకారణమువలన కలుగుచున్నది. దీని లక్షణములు నాలుక యెర్రగానుండుట, నీలిరంగు, నొప్పి, లావుట యీ మొదలగు లక్షణములు కలిగియుండును పుక్కిలి కొద్దికొద్దిగా వెడలుచుండును.

### (1) జిహ్వవాపు చికిత్స.

శిరావేధనముచేసి రక్తమోక్షణము చేయించవలెను. మరియు, యోగ్యమగు కషాయములు కిసాదా శరీరమును మృదువరచవలెను. మరియు, నాలుక వాపు విశేషము కలవారి కంఠమార్గము బంధించబడి యేవస్తువులోపల దిగక యుండినవో శరీరమును చక్కగా మృదుత్వము నొందించుటకై వస్తికర్మ ప్రయోగించవలెను. మరియు, శరీరమును మృదుత్వము నొందించుటకు [illegible] వెడలించుటకు కావు, కాశిని కామంచిరసము తీసికొనవలెను. ఇటువంటి ఉష్ణమును కలిగించునట్టి చల్లని ప్రకృతిగల వస్తువుల కషాయములతో పుక్కిలించవలెను మరియు యీ వస్తువుల రసము నందు బట్ట ముంచి నాలుకపై నుంచవలెను. మరియు ఆరంభసమయము వ్యాతీతమైనవో కాశినజ్ రసము, క్యాబేజి రసము, అవిసి గింజల పిండిలో కలిపి వుపయోగించవలెను. మరియు, వ్యాధి హెచ్చుచుండిన బాబూనా, అఖలీలుల్ మలిక, మరియు, బనప్షా మొదలగు కషాయములయందు రేలకాయరసము కలిపి పుక్కిలించవలెను. మరియు, భోజనములు మశ్బతులతో రక్తమును కాపాడుచుండవలెను.

### (2) నాలుకవాపు లక్షణములు.

పిత్తకారణమువలన కలుగుచున్నది. దీని చిహ్నములు నాలుక పచ్చగానుండుట మంట విశేషముగానుండుట ఒకప్పుడు నాలుక యావత్తు గుల్లలు లేచుట మొదలగు లక్షణములు కలిగియుండును.

### నాలుకవాపు చికిత్స

రక్తజదోషమునందు చెప్పబడినవస్తువులను పిత్తజరోగమునందు కూడా వుపయోగించవలెను గాని యీ రోగమునందు శిరావేదనము ప్రయోజనము కాదు. యెందుకనగా రక్తముయొక్క కారణము వలన పిత్తముయొక్క తేజస్సును అణచివేయును. మరియు, దీనిని తీసివేయుటవలన పిత్తముయొక్క తేజస్సు మంటవిశేషముగా హెచ్చిపోవును.

### (3) నాలుకవాపు లక్షణములు.

రక్తము కఫజ కారణమువలన కలిగినచో దీనిచిన్నెములు నాలుకయందు తెల్లని రంగుకలిగి యుండును.

### (3) నాలుకవాపు చికిత్స.

లఘువగు కషాయములతో వస్తికర్మచేసి శరీరమును మృదుత్వ మొందించవలెను. తరువాత మలమును వెడలించవలెను. మలము వెడలినతరువాత యూరిజ్ ఫైకర అను ఔషధమును పుక్కిలించవలెను. మరియు కేవలము తేనె శాదరాసితో యూరజ్ కలిపి నాలుకపై మర్దించవలెను మరియు మాజూ కరితూస్ మరియు సలెనా మరియు సాజీన్ని యూ మర్దించుటకూడా విశేషగుణము కలిగించును.

### (4) నాలుకవాపు లక్షణములు.

వాతకారణమువలన ఈవ్యాధి కలుగుచున్నది. దీనిచిన్నెములు జిహ్వాయందు నల్లనిరంగు కలుగుట, నాలుకయొక్క చర్మము శుష్కత్వమొందుట, నోటిరుచి బహుస్వల్పముగా, జిగురుగా నుండుట యీ మొదలగు లక్షణములు కలిగియుండును.

### (4) నాలుకవాపు చికిత్స.

మలమును వెడలించుటకై పాచితీగె కషాయమును ఉపయోగించవలెను. మలము వెడలినతరువాత అంజూరపండ్లు, మెంతులు ఈ రెండున్ను అవిశవిత్తులు నీళ్ళలో వేసి కషాయముకాచి బనఫ్షాతైలము, తేనె, రేలకాయగుజ్జు కషాయము యీ మొదలగునవి యేకముగా కలిపి పుక్కిలించవలెను. మరియు పచ్చికాహూవిత్తులు కాసిని, పచ్చిధనియాలునూరి రసముపిండి ఆరసము మొదలగునవి నోటిలోపట్టించి వుంచవలెను. దీనివలన వృష్ణకరమగు ఔషధములు లేపనము చేయుటవలన మలమయొక్క తీక్ష్ణత్వము హెచ్చజాలదు. వాపుకూడా కరిగిపోవును.

(సూచనీయము) విషసంబంధమగు ఔషధసేవనచేయుట, నల్ల మందు మొదలగు *పత్రియును నగలిపోవుట వుదితమగును. ఈదుష్ట ప్రకృతివలన వాపుసంప్రాప్తమైనచో దీనిని అటులనే సదుపాయమును చేయవలెను. దీనికారణము యెటులుండెనో అటులనే చికిత్సచేయుట వుచితమని గ్రహించవలెను. అనగా రక్తసంబంధమగు కారణమువలన కలిగినచో శిరావేదనము చేయవలెను. మరియు పచ్చిబార్లెంగ్ యొక్కరసము, శిరకా, పన్నీరులతో పుక్కిలించవలెను. మరియు, బాదం నూనె, కలువపూలతైలము, కర్పూరము ఈమొదలగునవి నోటియం దుంచవలెను. యిటులనే కారణానుసారముగా గుణకరమగు వస్తువులతో చికిత్స చేయవచ్చును.

మరియు దుష్టప్రకృతి సామాన్యముగా యుండిన ఈవ్యాధియందు మలమును వెడలించుట అనావశ్యకము గాన కేవలము ప్రకృతిని సమానముగా నుంచుట మిక్కిలి లాభదాయకమగును.

## అరుచిరోగ లక్షణములు.

ఈవ్యాధి రెండుభేదములుగా నుండును. (1) యిందు నోటిరుచి బొత్తిగా నశించిపోవును. యిది యెటులనగా రుచిబొత్తిగా తెలియకుండుట, మరియు నోటిరుచి చెడుట, యెల్లప్పుడు సమానముగానుండుట అనగా రోగి జలుబునుగాని వుష్ణమునుగాని గ్రహించలేకపోవుట అనగా వస్తువును గ్రహించునట్టి జ్ఞానశక్తియందు మార్పుకలుగుచున్నది. మరియు శీతము, వుష్ణముయొక్క సంబంధము జ్ఞానశక్తి మూట్టుకొనినవెంటనే యున్నది. మృదుజ్ఞానము గల జీవనరసము నాలుకపై పరచబడియున్నది.

---

*పిత్రి, కుంభికా, ఒకభేదముకలదు. యిది అన్నిటికంటె క్రూరమైనది. ఈవ్యాధి నాలుకపై వాపువలన వుబ్బిపోవును. మరియు దీనిచికిత్స ఈపుస్తకముయొక్క అంతమందు విషఅధ్యాయములో వర్ణించబడును. మరియు పిత్రిసమారూక్ అను యీవ్యాధులకు వైద్యులు కులాహియరాం అనుచున్నారు. దీనిని కుంభి అందురు. ఈవ్యాధి భేదములు అనేకములు గలవు. అన్నిటిలో పిత్రి, కుంభి మిక్కిలి క్రూరమైనది.

గాన యుండుమలినముగల రసూబసు అనగా నీరు ఘనీభవించినచో ఈ జీవనరసము దానిని పీల్చివేయును మలినముచే చేరుట, మరియు రుచిని గ్రహించునట్టిశక్తి ప్రవేశించునట్టి మార్గము బిగిసిపోవును. మరియు, ఈనరముయొక్క చెమ్మను పానము చేయును. మరియు పానము చేయక పోవుటవలన చెమ్మతో కూడినవాపును పుట్టించును. నాలుక బిగుతవ్వుటయందు భేదమేర్పడును.

—అరుచి చికిత్స.—

వేళ్ళకషాయమును పానము చేయవలెను. దీనివలన మలము మృదుత్వమునొంది పక్వమగును. తరువాత యారజ్ పైకరా మరియు కాకియామాత్రిలు వుపయోగించి మెదడును శుభ్రతనొందించవలెను. ఇటులనే అక్కలకర్రి, అడవిదాక్ష, ఆవాలు మొదలగునవి నీళ్ళలో వేసి కషాయముగాచి పుక్కిలించవలెను ఇంతవుష్ణకరమగు వస్తువులను వుపయోగించుట యేమనగా ప్రకృతియందు వుష్ణములేని కారణమువలన అని గ్రహించవలెను. ప్రకృతియందు వుష్ణమున్న యెడల అడవినీరుల్లి రసముతో చేయబడిన శికంజబీన్ మాదీఫలరసములో కలిపిగాని లేక రిబాస్, గులాబిపూలు రసములో వేసిగాని మాదీఫ రసము అథవా తరువాణి, కలిపి పుక్కిలించవలెను.

—(2) అరుచి లక్షణములు.—

ఈవ్యాధియందు రుచి నష్టమొందును. అనగా రుచిమారిపోవును. మరియు రుచిని గ్రహించునట్టిశక్తియొక్కదశ మారుట రెండువిధములుగానుండును. (1) యెన్నివిధముల రుచులున్నవో అట్టివస్తువులను రుచిచూడనిచే నాలుక యీవస్తువుల రుచులలోనుండి యేదో రుచిగానున్నటుల కనుపించును. (2) మరియు యేవస్తువును తినినను యీవస్తువుయొక్క రుచికి విరుద్ధముగా వేరు రుచితోచుచుండుట మరియు మొదటివిధమగు రోగమునందు బలముగల కారణముగలదని గ్రహించవలెను. మరియు రెండవవిధమగు రోగము దుర్బలముగా నున్నదని గ్రహిం

చవలెను. ఏమటులనగా శాకాదులు అలవునగుదైనచో రుచిని గ్రహిం చునట్టిశక్తియొక్క గళ ముల్లవ్యాప రుచిని తెలిసికొనును. మరియు రోగము దుర్బలమైనచో వస్తువుయొక్క రుచిని గ్రహించజాలదు. మరియు యేవస్తువునైనను రుచికొరకు వుపయోగించవలసిన కారణమువలన అనగా రుచిచూచునట్టి సమయమునందు ప్రకృతియొక్క రుచియందు రుచిని గ్రహించునట్టిశక్తి లయమగుచున్నది. ఇట్టికారణము యీదోషము యీరోగముయొక్క కారణమువలన ఆరోగి నాలుకయొక్క భాగముయందు పరిత్యక్తముగా నున్నది గాన దీనియొక్క రెండవవస్తువుయొక్క రుచి గ్రహించజాలకుండును. ఇట్టిరోగ కారణముపిత్తమై బలముగలదైనచో నోరు యెల్లప్పుడు చేదుగానుండును. మరియు దుర్బలముగలదైనచో నోరుచేదుగానుండదు ఇట్టిస్థితియందు యేవస్తువునైనను తినినను కేవలము రుచి చూచినను అసన్ను తియ్యగా నుండును. ఇటులనే రెండవభేదమునందుకూడా గ్రహించవలెను. నోటిరుచి యెటులనుండునో దీనికారణము భేదమును గ్రహించవచ్చును. అనగా చేదుగానుండుట పిత్తకారణమును చూపుచున్నది. తియ్యగానుండుట రక్తము అథవా కఫమువలన కలుగునని తెలుపుచున్నది. నోరు పుల్లగానుండుట, పుల్లని కఫమును అథవా వాతమును చూపుచున్నది. నోరుఉప్పగానుండుట ఉప్పని కఫమువలన కలుగునని గ్రహించవలెను.

## అరుచి చికిత్స

ఈరోగము మలము అధికమైనకారణమువలన కలిగినచో ఆయా దోషానుసారముగా శరీరమునుండి మలమును తీసివేయవలెను. మలము వెడలిన తదుపరి మొదడు, నాలుక, నోరు, యీమొదలగు అంగములు పరిశుభ్రతనొందించుటకై యిట్టి వస్తువులతో కషాయముకాచి పుక్కిలించుచుండుట వుచితమగును.

## నాలుకభారముగానుండు లక్షణములు.

ఈరోగమునందు మాట్లాడుటకు భేదమేర్పడుచుండును. మాట్లా

మటలో శబ్దవుచ్చారణము సరిగా తెలియకుండును. యీరోగకారణములనుబట్టి యెక్కువ దీర్ఘముగా నుండును.

(1) నాలుకపొంగియుండునప్పుడు దుష్టప్రకృతి మిక్కిలి వుష్ణముగా నుండును. యిది నాలుకయొక్క చెమ్మను ఆర్చివేయుచుండును. మలమును విశేషముగా వెడలించునట్టి కారణమువలన నాలుకయందు బిగింపు పీకు తటస్థించును ఆట్టిస్థితియందు నోటనుండునట్టి శబ్దములను స్థిరముగా వుచ్చరించజాలకుండును. మరియు నాలుక విస్తీర్ణమునందు నమానముగాయుండిన నోరు వుచ్చారణ నవ్వముగానుండును. మరియు ఈవ్యాధి చిహ్నములు నాలుక పలచనై బిసిపోవును. తీవ్రజ్వరము కలిగి యుండవలెను. ఈ మొదలగు లక్షణములు కలిగినప్పుడు శబ్దము వుచ్చరించ గలుగును.

### (1) నాలుకభారము చికిత్స.

బహుశా యీవ్యాధి కుదురుట అసంభవము. యెట్లనగా మలము వెడలుటవలన వుత్పన్నమగునట్టి బిగింపువ్యాధియందు వర్ణించి యున్నది. మరియు రోగికి విరేచనము తెచ్చిపెట్టునట్టి కారణమువలన వుచితమగును. అనగా చెమ్మకలిగించునట్టి వస్తువులను అనగా బనప్షా తైలము, సొంగింజలతైలము, తియ్యని బాదంనూనె, దూలగొండి గింజలపప్పు, బెహీదానాలు, ఇసబగోలుగింజలుగుజ్జు, కోడి లేక, బాతుక్రొవ్వు మొదలగునవి వుపయోగించవలెను. మరియు చెమ్మను కలిగించునట్టి వుక్తవస్తువులు ఉపయోగించుక్రమము, అనగా గండూషముచేయుట నోటిలో పట్టుకొని వుమ్మిలించుట, మరియు తలపై కావడముచేయవలెను. మరియు మెడకొంకులపైన చెవిమూలములయందు మర్దన చేయవలెను.

### (2) నాలుకభారము లక్షణములు.

అర్ధాంగవాతము, పక్షవాతము, నరములు పటుత్వముతప్పుట, ముఖ్యముగా నాలుకయందు కలుగగలదు. మరియు యీవిధమగు రో

గచిహ్నములు అనగా యేయే గతులయందు శ్లేష్మశక్తియొక్క గతి మెదడు నుండి వచ్చుచున్నదో వాటి ఇంద్రియముల గతిని రోగము అనగా ఆరోగ్యముగా నుండుట యెటు ననగా రోగము కేవలము నాలుకయందు మాత్రమే కలుగుచున్నది.

(2) నాలుక భారము చికిత్స

మెదడునుండి మలమును బయటికి తీసివేయవలెను పిమ్మట మిరియాలు, నవాసాగరము, ఆవాలు, అక్కలకర్ర, శౌతరాశిఆకు, బూరెకరమని, వుప్పు, యీ వస్తువులను నాలుకపై చక్కగా మర్దించవలెను. మరియు, యీ వస్తువులను కషాయముగాచి పుక్కిలించవలెను. రెండుపైవులు చెంపలపై చెవులమూలలయందు రక్తలు వేయవలెను.

(3) నాలుక భారము లక్షణములు

మెదడుయొక్క సంయోగమువలన నాలుక బిగువు తగ్గిపోవును. దీని చిహ్నములు అనగా యింద్రియములు చెడిపోవుట గతియందు ఆలశ్యము సంభవించుట నాలుక వ్రేలబడుట, చొల్లుకారుట, మరియు నాలుక మిక్కిలి బిగువు తప్పి వ్రేలబడుటవలన రోగి మాట్లాడజాలకుండుట మరియు, నాలుక వ్రేలబడుట తక్కువగానుండిన భేదా భేదములుగా మాట్లాడుట అనగా తెలియనిమాటలు మాట్లాడుట నాలుకయందు లఘుత్వమేర్పడుట మొదలగు లక్షణములు కలుగును.

(3) నాలుక భారము చికిత్స

మరియు, అర్ధాంగవాతము పక్షవాతములయందుపయోగించు ఔషధములను యీ వ్యాధియందుకూడా వుపయోగించవలెను. మరియు, గుణకరమగు ఔషధములను నాలుకపై మర్దించవలెను. మరియు, కషాయములతో పుక్కిలించవలెను.

(4) నాలుక భారము లక్షణములు

చిక్కని తడి నాలుకపై ఘనీభవించి పీకు కటస్థించును. దీని కారణము బరువగుట మరియు, అవశ్యకతానుసారముగా కఠినత్వముగా

నాలుక కదలించుచుండుట యున్నియు, నాలుక క్రిందివైపు కదలించుటకు నివృత్తియోజనముగా నుండుట లేకుండుటకనగా దీని నిజములినము, మలముయొక్క ఆధిక్యతతో హెచ్చుపోయినది కాబట్టి ప్రయోజనీయగతి వలన బంధించబడుచున్నది. మరియు, లాగుటత యొక్క నిజదశవైపు కలుగుట దీని చిహ్నములు అనగా నాలుక బాహ్యమున చిన్నదిగానుండుట మొదలగునవి. మరియు, ఉష్ణ త్రిస్థలము నందు గల్లకిందుగా కలిగినచో దీని లక్షణములు నాలుక పెద్దదై పొడవుగా పెరుగును.

## (4) నాలుక భారము చికిత్స

ముందుగా మెదడునుండి మలమును యారిజాత్ మాత్రలున్ను వుక్కిలింతలు గండూషములు యిత్యాది వుపాయముల ద్వారా మలమును వెడలింపజేసి తదుపరి సోయిగింజల తైలము బాబూనా తైలము వుక్కిలించవలెను. దీనివలన మలము వెడలిపోవును. మరియు, అంగము మృదుత్వమునొందును. యిటులనే తలవెనుక మచ్చనగుంటలో అనగా నాలుక గతికలిగించునట్టిజీవనరము బైలువెడలుచున్నదో దానిపై వృష్ణోదకముతో కావడముచేయవలెను. దీని వలన జీవనరములు మృదుత్వము నొందును. మరియు, మలము నందు చెమ్మకలిగించి మలమును తీసివేయుటకు యోగ్యముగా నుండునటుల చేయవలెను. తదుపరి ఆలుబకరా గింజల తైలము నాలుకపై గండూషముచేసి నోటిలో నుంచవలెను దీని వలన మలము ఆఅంగమునుండి వెడలిపోవును.

## (5) వ. నాలుక భారమగుటకు లక్షణములు

నాలుక మంధమగుట, మాటలో భేదముకలుగుట మొదలగు లక్షణములతోగూడి సర్సాంవ్యాధి వెనుక అనగా సర్సాందశ సంభవించినప్పుడు ఉత్పన్నమగును. మరియు మెదడునందు వాపుకలిగిన తదుపరి కలుగుటకు కారణమేమనగా మెదడునుండి బహురాన్ అనగా రోగ సంధియందు జీవనరములవైపు దిగునట్టిదగును.

(5) వ. నాలుకబరువు చికిత్స

ఈరోగము బహుదినములు గడిచినచో చికిత్సవలన ప్రయోజనము కలుగనేరదు. హకీము రాజీగారు పారశీ వైద్యగ్రంథమునందు యీక్రింది అంశములను చెప్పిరి. అనగా యీరోగము స్వల్పకాలము నుండి యున్నదై విశేషకాలము వ్యతీతముకానిచో చిక్కని మలమును తీయునట్టి వస్తువులు నాలుకపై మర్దించవలెను. అనగా చేదుపుచ్చకాయ తొక్కు, నవాసాగరము మొదలగునవి.

(6) నాలుకబరువు లక్షణములు.

నాలుక క్రిందనుండునట్టి నాలుక బంధనము చిన్నదగుటవలన నాలుక బరువగును. యీబంధనము జన్మనుండియే చిన్నదగును. లేక అచ్చట గాయమై ఆగాయము మాని చిన్నదగును. మరియు ఒకప్పుడు బంధనము నాలుకప్రక్క అంటియుండును. మరియు దీనిమొదలు నాలుక చివరవరకు అంటుకొని నాలుకచివర ఖాళీలేకుండును. ఒకప్పుడు నాలుక చివరవరకు వ్యాపించక ఖాళీకలిగియున్నను నాలుకసరిగా ఆడజాలకుండును. నాలుక ముఖమునుండి బైటికిరాజాలదు, మరియు తిరిగి అంగిలివరకు ప్రవేశించజాలదు. అంతవరకు ప్రయోజనానుసారముగా మాటలాడుట కష్టము.

(6) నాలుకబరువు చికిత్స.

వృత్తబంధనమును కొద్దిగా వెడల్పులో శస్త్రముతో కోసివేయవలెను. శస్త్రకర్మ చేయుటయందు మిక్కిలి సావధానముగా యుండవలెను. అనగా విశేషముగా తెగకూడదు. యెటులననగా విశేషముగా తెగి హృదయనరము ప్రేలినచో రక్తమును ఆపుటకు మిక్కిలి కఠినముగా నుండును. బంధనము తీసివేయుటవలన కేవలము నాలుక నోటిలోనుండి బైటికి రాగలదు. తిరిగి అంగిలివరకు ప్రవేశించగలదు. నాలుకను తీయుటకు యింతేవిశేషము. నాలుక అంటును తీసివేయవలెను. రక్తమును ఆపుటకై పటికనూరిగాని లేక రక్తమును కట్టించునట్టి ఇతర వస్తువులుగాని నూరి అందుపై చల్లవలెను.

### (7) నాలుకబరువు లక్షణములు

కఠినమగు వాయువుయొక్క కారణమువలన నాలుకయందు మంధగతి తటస్థించును. మరియు ఆరంభమునందుగాని లేక అంతమునందుగాని కఠినత్వము నొందును. ఒకానొకప్పుడు గాయము కలిగినచో ఆ స్థలమునందు బంధనమేర్పడును. యీకారణములవలన నాలుక బరువు కలుగును.

### (7) నాలుకబరువు చికిత్స.

కఠినత్వమును బంధనమును మెత్తపరచుటకై గింజలజిగుర్లు తైలములు క్రొవ్వులు లేపనము చేయవలెను.

### (8) నాలుకబరువు లక్షణములు.

నాలుకచాచుటకు కదలించుటకు శక్తికలిగించునట్టి జీవనరము తలవెనుక దెబ్బతగులుట, అదరుటవలన తెగిపోవును. ఈకారణమువలన నాలుకబరువగును. ఎందువల్లననగా ఆనరము తిరిగి అంటుకొనజాలకుండినచో యీరోగమునకు చికిత్స అసాధ్యమగును.

## నాలుక పెద్దదగుటకు కారణములు.

నాలుకనోటిలో యిముడుటకు వీలులేనంత పెద్దదగునని గ్రహించవలెను. మరియు నోటిలోనుండి నాలుక బైటికివెడలివచ్చును. ఇందువలననే దీనిపేరు అదలావుల్ లిసా అనిపెట్టబడియె. ఈరోగకారణము మలమువలన కలుగు చెమ్మవలన కలుగుచున్నది. మరియు యీచెమ్మ తలనుండి నాలుకవైపు దిగుచుండును. మరియు నాలుకభాగములుదీనిని గ్రహించుచున్నవి.

### నాలుక పెద్దదగుటకు చికిత్స.

నాలుకయందు వ్రణచిహ్నములు కలిగియున్నచో నాలుకభాగములు చెమ్మను గ్రహించివేసినను రక్తము నీలిరంగుగా నున్నచో ముందుగా శిరావేధనముచేయవలెను. తదుపరి పుల్లనిపెరుగు, నిమ్మకాయపు

లును, మరియు యితరములగు గులగును వెడలించునట్టి వస్తువులు అన గా పల్లదానిమ్మకాయ మొదలగునవి నాలుకపై మర్ధించవలెను. మరియు ప్రాణ్ణము లేనిచో నాలుకదిమ్మను గ్రహించియున్న మొదల కఫము వలచనైనచో యీజాత్ ప్రయోగించి మలమును వెడలింప జేయవలెను. తరువాత వుప్పు, శిరకా, శొంఠి, అథవా నవాసారము యీమొదలగువానిని శిరకాలోగాని అథవా రిజన్ అనగా పాలను విరి చిన నీళ్ళు కలిపిగాని నాలుకపై మర్ధించవలెను. మరియు మజ్జిగకాచి కొంచెము వుప్పుకలిపి మొదనోనుంచి మొదించిమిక్కిలి పులుపుకలిగిన చో దీనిని మసల్ అందురు మొజీక్, పాలునుండి నీళ్ళుతీయుటకుఅర్థము. దీనిని వండి చిక్కగాచేసిన నిది శమ్కత్వము చెమ్మగల స్వభావికము గలదగును.

నాలుక బిగుతగ్గుట అనగా నచ్చుచదు లక్షణములు.

నాలుకబరువగు అధ్యాయమునందు విశేషముగా బిగుతప్పుటను గురించి వర్ణించియున్నాను. గాన యేదైన లాభకారణమువలన వేరు అధ్యాయమునందు వర్ణించబడును.

నాలుక బిగు తగ్గుటకు చికిత్స

గడ్డము క్రింద జలగలు కొమ్ములను అంటించి రక్తము తీసివేయ వలెను. లేదా కత్తితో గంట్లువేయవలెను. మరియు ఆనాలు. తేనె, కషాయములుకాచి పుక్కిలించవలెను. ఒక్కొక్కప్పుడు నాలుకక్రింద తం తువులను ఛేదించిరక్తము తీయునట్టి అవసరము కలుగుచున్నది.

## నాలుకక్రింద మాంసము పెరుగు లక్షణము.

వైద్యులు దీనిపేరు కారణముబట్టి పెట్టియున్నారు. ఈగన్వరూ పము మండూకముయొక్క తలవలెనుండును. ఇందువలననే దీనిని జిఫ దాఅందురు. అనగా యీమాంసము కప్పవలె పెరిగినచో మాటలాడు టకు వీలులేకుండును. అనగా నాలుక తిరుగుటకు ఆటంకము కలిగించు

ను. ఈరోగము జిగురుగల కఫమువలనగాని లేక రక్తముల కారణము వలనగాని కలుగుచున్నది. యీవ్యాధియందు నాలుకయొక్క వుత్తమ భాగము మృదుభాగములు నష్టమగుచున్నవి. తక్కినభాగములు మాత్రము మిగిలియుండును.

## నాలుక క్రింది దుర్మాంస చికిత్స

ఈరోగము రక్తాదిఖ్యాతవలన కలిగిన యెడల కిఫాత్ అనగా మధ్యము వ్రేలునరము అనగా మోచేతికి మధ్యమందు నరమును ఛేధించి రక్తమోక్షణమును చేయించవలెను. తరువాత విరోచనమునకు ఔషధములను యివ్వవలెను. మరియు, మలమును మృదువరచి మలమును వెడలించునట్టి ఖరిలి మొదలగు చాకరాసి, జూఫా, ఉన్నా, దానిమ్మ బెరడు మాంసమును నశింపజేయునట్టి ఔషధములు అనగా నవాసాగరము, పేల్చినపటికి, జంగాలపచ్చ, సౌసన్ వేరు, బాలింతబోలు యీ వస్తువులు శిరకాలో కలిపి నాలుక క్రిందనుండు మాంసముయొక్క మూలమునందు లేపనముచేయవలెను. మరియు, యీవ్యాధి యీ మొదలగు నుపాయములవలన కుదరనిచో ఇందువిషయమై శస్త్రసాధనమువలన మాంసమును తీసివేయవలెను మరియు, యీ మాంసమును తీసివేసిన తరువాత నీళ్ళలో శిరకాకలిపి పుక్కిలించవలెను. మరియు, వ్రణమును మాన్పునట్టి మలాములను వేయవలెను. మరియు, శస్త్రఖర్మ చేయునప్పుడు నాలుక క్రింద నుండునట్టి రెండునరములను ఆయుధముతో పట్టుకొని వేరుగానుంచవలెను. యిట్లు చేయుటవలన ఆనరములు తెగజాలవు యెందుకనగా ఆరెండునరములు తెగినచో మృత్యువు సంభవించును యీ కారణమువలన అనగా రక్తము యెంతమాత్రము నిలువజాలదు రక్తము. ప్రాణాధారమగు వస్తువు కాబట్టి రక్తము వెడలుటవలన మరణము కలుగునని తాత్పర్యము.

(లాభం) ఒకప్పుడు నాలుక క్రింద ఒకవిధమగు మృదుపదార్థము వుత్పన్నమగును. ఆమాంసమునిండా చిక్కని నీరుండును గాన దానిని

శస్త్రముతో చీల్చివేసి ఆసీరును తీసివేయుదురు. యిటుల తీసివేసినను తిరిగి స్వల్పకాలములోనే చేరుకొనును కాబట్టి దీని చికిత్స ఔషధము వలన హరించగలేదు. మరియు, అన్నిటికంటె అతీతమగు నదుపాయము అనగా ముందు ఆమాంసమును శస్త్రముతో చీల్చివేసి అందుండు రతూబతు అనగా నీరుతీసివేసి అందు నీరు చేరునట్టి తిత్తిని కత్తెరతో సావధానముగా తీసివేయవలెను. యిట్లుతీసివేసిన తరువాత ఆమాంసము తిరిగి పెరుగజాలదు.

## నాలుక బ్రిద్ధలగుటకు లక్షణము

ఈరోగమునకు రెండుకారణములుగలవు. (1) మెదడునందు విశేషముగా శుష్కత్వము నిలిచి ఆశుష్కత్వముయొక్క వుష్ణప్రకృతి జీవనరములద్వారా నాలుకయందు ప్రవేశించును. మరియు ఆనరముల మార్గములు ఒకటిగాచేరుటవలన నాలుకరంధ్రములువగిలి బ్రిద్ధలగును. మెటులనగా నాలుక మృధువుగను చంచలయుక్తముగా నుండుటవలన దీనియందు చుట్టు నిలిచిపోవును. ఇట్టిరోగి భుజించుటకు అసాధ్యముగానుండును. ఇట్టిస్థితియందు ముఖ్యముగా లవణము అమ్లపదార్ధములు నాలుకకు తగిలినచో నొప్పి మంట విశేషముగా కలిగియుండును. దీని లక్షణములు ఆరంభమునుండి నిదురపట్టకుండుట మెదడునందు శుష్కత్వముయొక్క చిహ్నములు కనుపించుటవలన కలుగు లక్షణములు వెనుక చెప్పియుంటిని.

### (1) నాలుక బ్రిద్ధలగుటకు చికిత్స

ఇసప్‌గోలుంగిజ ను పంచదారలో కలిపి నోటిలో యుంచుకోవలెను యునగంజి రోగికిప్పించవలెను. మాంసముకూడా భుజించవచ్చును. దోసకాయనరుకు మైనపుఅరకు మొదలగునవి బనప్‌షాతైలముచేర్చి నాలుకపై లేపనము చేయవలెను. మరియు పులుపువుప్పుగల వస్తువులు

## నాలుకమంట చికిత్స.

ఈనాలుగు విధముల వ్యాధులలో శ్రేష్ఠమగు నదుపాయమేమనగా చల్లనిపదార్థములుఅనగా పెద్దపాయల గింజలయొక్కరసము, పచ్చిధనియాలు, ఇసప్ గోలు, బేదానాలు మొదలగునవి నోటిలో యుంచుకొని చప్పరించుచుండవలెను. అథవా దోసకాయ, పెద్దసోనవిత్తులపప్పు, బాదంపప్పు, ఖరుబూజాపప్పు, లవుకీకగింజలపప్పు యీమొదలగునవి నాలుకపై మర్దించవలెను.

మరియు ఉష్ణదోషము యీ రోగమునకు కారణమైనచో మలమును మెత్తపరచునట్టియు, పుక్కిలించుటకు వీలగునట్టి క్వాదములను యివ్వవలెను.

మరియు, అమాశయ ముఖముయొక్క మలదోషమువలన నాలుకమంట అనగా పూతకలిగినచో అట్టిస్థితియందు అమాశయముయొక్క ఉష్ణదోషము హరించుటకై చల్లనిపదార్థములు, చల్లని ఔషధములను వుపయోగించవలెను.

ఇటులనే మెదడుసంబంధమగు వుష్ణమువలన కలిగినచో దీనియందుకూడా అమాశయచికిత్సలు చేయుటమంచిది.

## నాలుక దురదకలుగుటకు కారణములు

ఈరోగకారణము మెదడునందు కాలినదోషమువలన మంట వుత్పన్నమై నాలుకయందు దురదను పుట్టించును. యీదోషము మెదడునందుండిగాని లేక, అమాశయమునుండిగాని అథవా శరీరమునుండిగాని నాలుకయందు ప్రవేశించును. దీనిలక్షణములు అనగా నాలుక ఎర్రగానుండుట, నాలుక పండ్లతో గీరుకొనుటవలనగాని వేడినీళ్లు పుక్కిలించుటవలనగాని శాంతినొందినటుల నుండుట యీమొదలగు చిన్హములు కలిగియుండును.

## నాలుకదురద చికిత్స

ముందుగా దోషమును తీసివేసి తదుపరి వేడినీళ్లు పుక్కిలించవలెను. దీనివలన మంటతగ్గి నాలుకచర్మము మృదుత్వమునొందును. మరియు మలమునందు చెమ్మప్రవేశించి వెడలనారంభించును. తరువాత పాలు పంచదారకల్పి పుక్కిలించవలెను. తదుపరి శిరకా, గుల్‌రోగను యీ మొదలగువానితో పుక్కిలించవలెను. ఇటుల చేయుటవలన చెమ్మ ప్రవేశించి మంటతగ్గిపోవును. మరియు మలములెగ్గి నష్టమగును. కరక్కాయబెరడు నమలుట, నాలుకపై మర్దించుట మొదలగువానివలన నాలుకయందుండు ప్రాణ్ణమలమును తీయుటయందు ఎక్కుడు సామర్థ్యము కలిగియుండునని గ్రహించవలెను.

## నాలుకపైచర్మమూడుటకు లక్షణములు

నాలుక అంగిలి పండ్లు చిగుళ్లు పైనుండు చర్మము వూడుటకు తీక్ష్ణయగు ఆవిరిపరమాణువులు యీ రోగకారములగుచున్నవి. యివి శరీరమునుండి లేచి మెరుపుగానుండు యీ అంగములపైనుండు పొరను దగ్గపరచి శుష్కింపచేయుచున్నది. మరియు, అంగముల భాగమునందు చేరియుండునట్టి చెమ్మను నష్టపరచుచున్నది. యిట్టి కారణమువలన నన్నని చర్మము వూడిపోవుచున్నది. దీని లక్షణములు నాలుక అంగుడి పండ్లచిగుళ్ళను బట్టతో రుద్దినచో వుల్లిపొట్టువలె నన్నని పొర వూడిపోవుచున్నది దీని వలన నొప్పి తటస్థమగుచున్నది.

## నాలుకచర్మము వూడుటకు చికిత్స

ఈరోగమునందు శిరావేదనముగావించి రక్తమోక్షణము చేయించవలెను. తరువాత కరక్కాయల కషాయమునియ్యించవలెను. మరియు ఆస్, దానిమ్మపూలు, గులాబిఆకులు, యీవస్తువులు శిరకాలోవేసి కషాయముకాచి ఆకషాయమును పుక్కిలించవలెను. యీ రోగచికిత్సయందు మృదుత్వముకలిగిన వెంటనే అజీర్ణమును చేయునట్టి వస్తువులను ఉపయోగించుట మంచి వుపాయమని గ్రహించవలెను.

నోటిలోని అవయవములను చూపునట్టి చిత్రపటము.



1_2 గొంతుద్వారమునకు యిరుప్రక్కలు 3. కొండనాలుక 4. నాలుక యీ అంగములు మాట్లాడుటకు సహాయ్యము కలిగించుచుండును. నోటి నెల్లప్పుడు ఆరిపోకుండునట్టుల చెమ్మ కలిగించును.

## ముఖరోగ లక్షణములు.

### —నోటిలో గుల్లలు లేచుటకు లక్షణములు—

నోటిలో గుల్లలు లేచుటకు తీక్ష్ణమగు రక్తదోషము కారణమగుచున్నది. దీనిలో కొద్దిగా పిత్తముకూడా మిశ్రమైయుండును. ఈరోగమునందు విశేషముగా నొప్పి కలుగుచుండును అనగా యేదైన వస్తువు

[illegible]

[illegible]

—నోటియందు లేచు గుల్లల చికిత్స—

ఈ రోగము నందు శిరావేదన చేయవలెను. మలమును వెడలించు టకై కరక్కాయకషాయముల పానము చేయవలెను. ఆరంభమునందు గులాబిపూలు, మెరక్తిమూర, కొమంచాకు, కాశినివేరు, ఆకులు, ధనియాలు, చిరుశెనగలు యీ మొదలగు వస్తువులు శిరకాలో వేసి కషాయముకాచి ఆకషాయముతో పుక్కిలించవలెను. అనగా నోటిలోపోసి కొని వుమియుట అని అర్థము.

# నోటియందు వ్రణములులేచుటకు లక్షణము

ఇది ఒక కురుపుజాతి. ఇది ముఖము నాలుకయొక్క చర్మము నందు వుత్పన్నమై నోరు యావత్తు ఆక్రమించుకొనును. ఒక్కొక్కప్పుడు నాలుక పొరయందుకూడా ప్రవేశించి గొంతు ఆమాశయమువరకు దిగుచున్నది. మరియు, యీ వ్రణముయొక్క చుట్టుభాగములు గుండ్రముగాయుండునని గ్రహించవలెను. మరియు, యీ వ్రణమునందు దుర్గంధముకూడా కలిగియుండినచో దీనిని హాకీముజాలినూస్‌గారు కలాం అని పేరు విధించిరి. గాని యితర వైద్యులు అనేకులు అకలా అని చెప్పియున్నారు. నేను దీనిని వేరుఅధ్యాయమునందు వర్ణించెదను.

కులాం అను వ్యాధి నాలుగువిధములుగానుండునని తెలిసికొనవలెను. (1) మొదటి వ్యాధియొక్క మూలము రక్తమగును. దీని చిహ్నములు వ్రణమునందు యెరుపు ఉష్ణము కలిగియుండును. ముఖము లోపల చర్మము యుబికినట్లు కనుపించును.

—కులాం అను వ్రణము మొదటిభేదచికిత్స.—

నరేరు అను నరమును శిరావేదనము గావించి అథవా గడ్డము క్రిందనరములు నాలుకరెండునరములు క్రిందిపెదవిగో రెండునరములు పైపెదవిలో రెండునరములున్నవి. ఆనరములను ఛేదించి రక్తమును తీసివేయవలెను. తరువాత కరక్కాయలు, పర్పాటకేము, కషాయముకాచి

శరీరమును మృదుత్వము నొందించవలెను. మరియు వమాగునీళ్ళతోగాని అథవా శిరకాతోగాని పుక్కిలించవలెను. ఇందులో గులాబిపూలు, ధనియాలు, శిమాక్, తవాషీరి, దానిమ్మపూలు, శిరిదినగలు, వచ్చకర్పూరము, యీమొదలగునవి మెత్తగానూరిగాయములో వేయవలెను. మరియు గాయము దుర్గంధితమైనచో గాయమును మాడ్చునట్టి వస్తువులను మెత్తగానూరి శిరకాలోగాని అథవా నీళ్ళలోగాని కలిపి పుక్కిలించవలెను. అనగా శిరకా, నవాసాగరము, పుష్పం, పటిక, మొదలగు వస్తువులుగాని లేక యీవిధమగు స్వభావికమగు వస్తువులతో నీచమగు కుళ్ళినభాగములను లేపనము చేయవలెను. మరియు చీము, నీరును ఆర్చివేయును. మరియు యీరోగిగాయమునకు శిరకాయొక్క తీక్ష్ణతవలన క్షయముకలిగినచో శిరకాకుబదులుగా కుంకుమపువ్వునుచేర్చుకోవలెను.

## కులాం అను (2) భేద లక్షణములు.

ఈవ్యాధిమలము కుళ్ళినశ్లేష్మముయొక్క కఫదమ్మకారణము వలన మరియు పుప్పని కారణమువలన గాయము ఉత్పత్తియగుచున్నది. దీని లక్షణములు వ్రణము తెల్లగానుండుట, నొప్పిస్వల్పముగా నుండుట, మరియు పొరపుబ్బుటవలన మెత్తనివాపుతో సమానముగానుండును.

## కులాం అను (2) భేద చికిత్స

ఈరోగమునందు విరోచనమును చేయించుటకై మునాంబర మాత్రలు పుచ్చుకోవలెను. మరియు అక్కలకర్ర, అడవిద్రాక్షపండ్లు యీమొదలగు వస్తువుల కషాయముతో పుక్కిలించవలెను మామిరాన్, కరక్కాయ, అక్కలకర్ర, శిరకాలో వేసి కాచి పుక్కిలించవలెను. ఎందుకనగా ఈకషాయముమలమును తీసివేసి కఫమును కరిగించును. మరియు అంగమునందు ఆజీర్ణము శుష్కత్వమును కలిగించును.

## కులాం అను (3) భేద లక్షణములు.

ఈవ్రణము దహింపబడిన తీక్ష్ణములను వలన కలుగుచున్నది. ఈరోగము తక్కినభేదములకంటె మిక్కిలి క్రూరమైనది. దీనిలక్షణము

పుట్టుచున్నది. దీని చిహ్నములు స్వల్పముగా భుజించుటవలన ఆమకోశము రక్తదశహీనమగుటవలన ప్రాణమునకు విశేషమైన చెమ్మను కలిగించును. ఈ చెమ్మవలన నోటియందు జిగురు అధికమై నిద్రించునప్పుడు నిదురలో విస్తారముగా చొల్లు కారుచుండును. మరియు మేల్కొని యుండునప్పుడు నోటియందు పుల్ల విశేషముగా ఊరుచుండును ఆమాశయము మెండియుండుటవలన మేలుకొనియుండునప్పుడు ప్రసుప్తముగ నిద్రించునప్పుడు చొల్లు కారుటయు నిలిచిపోవును.

### నోటినీరూరుటకు (1) భేదచికిత్స

వాసవిరు అను వరమును ఛేదించవలెను. మరియు, దానిమ్మకాయనూరినముద్ద, బేదాగా కాయనూరినముద్ద, పచ్చిదాక్షపండ్లనూరిన ముద్ద యీ మొదలగున యోగములు గాఢమౌషధముగ సేవింపించి యీ రసము చిక్కబడువరకు కాచి అజీర్ణము కలిగించుటకుంతు అనగా సేపు (యాపిల్) బేదానాపండు రూప్ శిరూవ (ఇంగ్లీషులో రూస్కోరి అందురు) చిరశెనగలు, గులాబిపూలు, అధరాలేత గుల్లు, మందార లేతకొమ్మలు, దానిమ్మపూలరసము యీ మొదలగు వాటిరసముతో ప్రత్యేక ప్రత్యేకముగా పుక్కిలించవలెను. మరియు కొద్దిగా పచ్చి కాశీనిగింజలు చితకగొట్టి పుక్కిలిపి తింపించవలెను. ఈ మొదలగు నదుపాయములు ఉష్ణము శాంతినొందుటకున్ను చెమ్మహరించుటకని గ్రహించవలెను.

### నోట నీరూరుటకు (2) వ భేదలక్షణములు.

జలుబు కారణమువలన కఫముయొక్క చెమ్మవలన ఈ రోగము కలుగుటకు కారణమగుచున్నది. ఈ చెమ్మ ఆమాశయమునందు విశేషముగా ఘనీభవించియుండును. దీని చిన్నెలు జీర్ణశక్తి మాంద్యము బలము నొందుట ఉమ్మి చిక్కగను జిగురుగానుండుట నోరు పుల్లగానుండుట, యీ మొదలగు లక్షణములు కలిగియుండును.

### నోటి దుర్గంధముయొక్క (2) భేద చికిత్స

సోంపు, [illegible] లోవేసి కషాయముగాచి పుచ్చుకొని వమనము చేయించవలెను. మిరియాలు, కతిఫల్ మొదలగు ఉష్ణకర ఔషధములు అనగా కస్తూరి జాపాష్ పొదినా మొదలగునవి యిప్పించవలెను. మరియు, గోధుమపిండియందు కొద్దిగా ఆవాలపిండి కలిపి రోగికి భోజనము యిప్పించవలెను. ప్రాతఃకాలమునందు నిరన్నాహారముగా మంచి సన్నని దువ్వాటి ఒకగుక్కెడు పుచ్చుకొనవలెను. మరియు, సాంబ్రాణి మస్తకి నమలించవలెను.

## నోటి దుర్గంధలక్షణములు.

ఈ దుర్గంధము ముక్కునుండియు నోటినుండియు వచ్చుచుండును. దీనిని అరబ్బీభాషయందు బఖ అందురు. ఈ బఖము దుర్గంధము యొక్క కారణానుసారముగా ఆరుభేదములుగలవు (1) పైపూర్ణము ఆమాశయమునందు ప్రవేశించి అచ్చటగల చెమ్మవలన వృద్ధిపొంది ఆమాశయమునందున్న, అంగిలియందున్న, దవడలయందున్న, దంతముల చిగుళ్ళయందున్న, దంతమూలములయందున్న స్థిరముగానుండును. మరియు, పైపూర్ణము తనపనికంటె వృక్తచెమ్మను చెరచి దుర్గంధముగా మార్చివేయును. యీ విధముగా కలిగిన వ్యాధి చిహ్నములు అనగా భుజించిన వెనుక దుర్గంధము తగ్గియుండును. యేమందుకనగా చిగుళ్లలో నుండి దుర్గంధము దంతములగుండా ప్రవేశించును. యిట్లు ప్రవేశించుట వలన దంతములు బహుశా నల్లనిరంగుగా మారుచున్నవి.

### నోటి దుర్గంధముయొక్క (1) భేద చికిత్స

పచ్చని ఆలుబకరా క్వాదమును ప్రతిదినము ప్రాతఃకాలమునందు పుచ్చుకొనవలెను. యెందుకనగా యీ కషాయము ఆమాశయము

నందు విశేషముగా జబ్బుకు వుపశమనముచేయును. మరియు, దుర్గంధముగు చెమ్మను హరించుటకు మరియు, యవలసత్తు మంచుగడ్డ నీళ్ళలో కలిపి పంచదారచేర్చి యివ్వవలెను. మరియు, పందిరిదోసకాయ, ఆలుబకరా, సప్తాళు, పచ్చికాయలు, యీమొదలగునవి రోగికిచ్చుటవలన లాభదాయకమగును. మరియు, ప్రాతఃకాలమునందు యేదైన తినుటను వుపవాసముగు అనగా ఆమాశయముయొక్క వేడి ఆకలికారణమువలన విశేషముగా కూడదని భావము.

## నోటిదుర్గంధము యొక్క (౨) వ భేదము

దుర్గంధముగు శ్లేష్మము ఆమాశయమునందు చేరి ఖనీభవించును అందుండి దుర్గంధిత ఆవిరిపరమాణువులు లేచుచుండును. దీనిచిహ్నములు భుజించుటవలన ముఖము కడుగుటవలన పుక్కిలించుటవలన నోటిదుర్గంధము తగ్గిపోవును. ఎందుకనగా ఈ వ్యాధి నోరుకడుగుటవలన పుక్కిలించుటవలన నోటిదుర్గంధము తగ్గిపోవును. యీవ్యాధి నోరు కడుగుటవలన నశించుటలేదుగాని ప్రస్తుతముశాంతినొందుచున్నది.

## నోటి దుర్గంధము (౨) భేద చికిత్స.

ఉప్పచేవనుతిని ముల్లంగివిత్తులు, అలనందలు, సోయిగింజలు, మొదలగువాని కషాయములను పుచ్చుకొని వాంతిచేయవలెను. మరియు యాంజ్పైకరా, ముసాంబరంమాత్రిలు, మొదలగుమాత్రిలు వుపయోగించి శరీరమును మృదుత్వమునొందించవలెను. ముసాంబరము కిసాదా సారాయి, అఫన్‌తీన్‌తో కూడా వుపయోగించుటలాభదాయకమగును. మరియు మలమును వెడలించినవెనుక శోంతిమురబ్బా పుచ్చుకొనవలెను మరియు ఇత్రిఫల్, చాతిరాశి, తేనెతోచేయబడిన గుల్ఖం

దు, తేనెతో చేసిన శికింజబీన్ సర్బ్బతా ప్రయోగించుచున్నారు. ఈరోగమునందు చెమ్మను కలిగించునట్టి భోజనములను ప్రయోగించవలెను. అనగా వండించిన మాంసము కలియా యీ మొదలగునవి మంచి మసాలాలుచేర్చి యిప్పించవలెను.

### నోటి దుర్గంధము (సి) భేద లక్షణములు.

నీచమగుదుర్గంధమగు చెమ్మ తీక్ష్ణదశయందు తలనుండి దంతమూలములయందు ప్రవహించి వాటిని తిని కుళ్ళబెట్టి చెరచివేయును. దీనిలక్షణములు అనగా యీరోగి పులుపు వగరుగలవస్తువులతో పుక్కిలించినచో చిగుళ్ళనుండి చెమ్మ దంతమూలములయందు దుర్గంధము నిండుకొని పుక్కిలించునట్టి వస్తువుతో వచ్చివేయును. ఇట్టిసమయము నందుకూడా నోటిదుర్గంధము పోవునుగాని కొంతకాలమువరకు అణగియుండును. యీస్థితియందు నోటివాసన బొత్తిగా నశించకుండినయిందుకు రెండు కారణములు గలవని గ్రహించవలెను. (ఏ) నీచమగు చెమ్మ పుక్కిలించుటవలన దంతమూలములనుండి దూరమగును గాని దీని బదులు చెమ్మతలలోనుండి దిగుచుండును.

(బీ) నీచములగు జీవసరములయొక్క నాలుగువైపులనుండి దంతములలో చేరుచున్నది. నిది పుక్కిలించునట్టి ఔషధసారము అంతవరకు ప్రవేశించజాలకపోవును.

### నోటి దుర్గంధము (సి) భేద చికిత్స

ముఖము మెదడునకు శుభ్రపరచుటకై దంతమూలములు బలపడుటకై అధిరా, దానిమ్మపూలు, శిరకాలో వేసికాచి అకషాయమును పుక్కిలించవలెను. దీనివలనతలనుండి దిగునట్టి మలము నిలిచిపోవును. మరియు ద్రాక్షపాకమును యీశిరకాలో కలుపుకొనుటవలన మిక్కిలి

గుణము కలిగించును. మరియు నోటిదుర్గంధము గల్గుచున్న చిగుళ్ళకు బలము కలుగుచున్న హాబ్బల్ పిన్స్ నోటిలో నుంచుకొనవలెను.

### హాబ్బల్ పిన్స్ మాత్రలుచేయు క్రియను

రాతిపువ్వు, లవంగములు, తమలపాకువేరు అక్కలకర్ర, ఇవి వస్తువుఒకటికి తి⅓ మాషములు గులాబిపూలు, మంచిగంధం, కరక్కాయలు ఇవిప్రత్యేకము 7 మాషములు, లవంగీర 1½ మాషములు కస్తూరి, పచ్చకర్పూరము, ఇవి ప్రత్యేకము 6 రతులు ఈ వస్తువులు యావత్తు చూర్ణించి వస్త్రగాలితమొనరించి బేదానవందురసముతోగాని పన్నీరుతోగాని మర్దించి మాత్రలు చేసికొనవలెను.

### నోటిదుర్గంధము (4) భేదలక్షణములు

దుష్టమగు వ్రాణవికృతి దుర్గంధముంకలిగించునట్టిది దంతమూలములయందు ప్రవేశించి వాటిచెమ్మను నీచత్వముకలిగించును. గాన ఈ వ్యాధియందు ఎల్లప్పుడు చిగుళ్లనుండి రక్తము స్రవించుచుండును.

### నోటిదుర్గంధము (4) భేదచికిత్స

నరేము అను నరమును ఛేదించి రక్తమును తీసివేయవలెను. తరువాత కరక్కాయకషాయము పానముచేయవలెను పిమ్మట తయారుచేసి యుంచిన శిరకాతో పుక్కిలించవలెను. అనగా యీఔషధములు యీవ్యాధియొక్క మూడవభేదమునందు చెప్పబడియున్నవి. ఆఔషధములను యిందునుపయోగించవలెను. మరియు, చిగుళ్ళయందు దుర్గంధవ్రణము లేచిన కారణమువలన చెడుచెమ్మ అందుప్రవేశించుచు పేరుకొని దృఢత్వము నొందినచో దుర్గంధవ్రణమునందు అనగా ఆవ్రణము బలమునందున్నదా లేక దుర్బలముగానున్నదా అని ఆలోచించి అందు

కు తగిన ఔషధములను ఉపయోగించి అనగా యీ రోగకారణమును పుష్టిగల చెమ్మవలన కలిగి కఫము విస్తారముగా యున్నచో అల్ వయూన్ ఉపయోగించవలెను. లేక శాంతిస్వభావికముగా యున్నచో మాదీకాయలు, తవాక్షీరి, గులాబిపూలు, అకాకియా (లేతతుమ్మకాయరసము యెండించినది) మొదలగునవి వుపయోగించవలెను.

౫ నోటిపుర్గుల లక్షణములు

నీచ చెమ్మ దంతములయందు ప్రవేశించి వాటిని హానింపజేసి కుళ్లించును.

నోటి దుర్గంధము (౫) భేద చికిత్స

దంతముల అంగములు పటుత్వము తప్పినచో దంతములను వూడబెరికివేయుట వుత్తమము. మరియు, కొద్దిభాగము మాత్రము చెడినచో చెడినభాగమును యింపు విషయమై ప్రధానమగు ఆయుధముతో ఛేదించవలెను. మరియు, శుభ్రపరచుటకై నసుబద్రిపుచుకుకు, వుస్సా, ఆలిదిప్పలు కాల్చినమసి యీ మొదలగునవి యేకముగాచేసి దంతధావనము చేయుచుండవలెను. రోగము యెంతవరకు నసించకుండునో అంతవరకు రోగము శాంతి నొందించుటకై అధిరా, మాచికాయలు, కొంతి మస్తకి, గులాబిపూలు, రామక్ అనగా సంయోగ ఔషధము యీ మొదలగు వానితో మంజన్ అనగా దంతధావన చూర్ణముచేసి వుపయోగించవలెను.

(రామక్) అనగా ఒక సంయోగిక ఔషధము. అనగా మాదికాయలు దానిమ్మబెరడు, కల్లవటికి, తుమ్మజిగురు, దోశాబ్, యీ మొదలగువానితో తయారుచేయు ఔషధమునకు రామక్ అనబడును.

## నోటి దుర్గంధము (6) భేద లక్షణము

ఈరోగము యొక్క దుర్గంధము పూపిరితిత్తులయందు కలిగి నోటి దుర్గంధమునకు కారణమగును. ఈరోగము సామాన్యముగా శిల్ అనగా రక్తక్షయవ్యాధి అంతమునందు కలుగుచున్నది.

## తాలూవులవాపు లక్షణములు.

ఈరోగమునకు రెండు కారణములుగలవు. (1) వుష్ణసంబంధమగు రక్తదోషముయొక్క దశయందు తీక్ష్ణస్వభావవలన లోదవడలయందు వాపు కలిగించును.

(2) కారణము చెమ్మయిందులో వుష్ణప్రకృతి తగ్గిపోవును. రక్తజవాపుయొక్క చిహ్నములలో దవడలయందు మెరుపు కలిగి నొప్పితోకూడియుండును.

## తాలూవులవాపు చికిత్స.

శిరావేధనముచేయవలెను. కరక్కాయకషాయమునన్నా పిత్తపాపడా కషాయముతో మలమును వృద్ధిపరచవలెను. మందుమును తొలగించుటకై ఆరంభమునందు అధిరా, గులాబిపూలు, దానిమ్మపూలు, కామంచినీరు శిరకాలో వేసికాచి పుక్కిలించవలెను. మరియు జహూర్ కాలిజ్ అనగా ఒక సంయోగికయోగముయొక్క పేరు మరియు తవాషీరి గులాబిపూలు, పెద్దపాయలకిత్తులు నిశస్తా అనగా గోధుమసత్తు కతిరా కర్పూరముకలిపి దవడలలోభాగమునందు చల్లవలెను. మరియు అంతమునందుబాబూనా బాప్షా దూలగొండివిత్తులు మొదలగువానికషాయమునందు కేలకాయగుజ్జు కలిపి పుక్కిలించవలెను. దీనివలన మలము శోషించియున్నచో కరిగిపోవును. మరియు చెమ్మవలన కలుగునట్టివాపుయొక్క రంగు తెల్లగానుండుట నొప్పి లేకుండుట మొదలగు లక్షణములు కలిగియుండును.

—ఇతి చికిత్స శేషం—

మలమును వెడలి చేటుకై మాజారాత్ యివ్వవలెను. మాయి అక్కలకర్ర తరువాణితో నూరి అంగిలికి లేపి పుక్కిలించవలెను. దీని వలనవిబంధమువదలి పుష్టిప్రాప్తించును మలముకూడా వెడలిపోవును.

గద్య, ఇది శ్రీమదిమాంబేగ్ సాహెబ్ పౌత్ర సాచ్చాబేగ్ సాహెబ్ పుత్ర "వైద్యభూషణ" బిరుదావళీ విరాజమాన వైద్యవిద్యావిద్వజ్జన విధేయ రహమతుల్లాబేగ్ నామధేయ ప్రణీతంబైన "తిబ్బెఅక్బర్ షాహి" అను వైద్యగ్రంథమునందు ము.ఖ, జిహ్వారోగాధ్యాయము సర్వము సంపూర్ణము.



యాకరీముల్ మారూఫ్.

బిస్మిల్లా హిర్రహిమానిర్రహీం.

# తిబ్బెఅక్బరిషాహి

ఏడవ అధ్యాయము.

## పెదవి రోగ లక్షణములు

పెదవి అనగా నరములు మాంసము మరియు హృదయనరములు పిత్తకోశము యొక్కనరములతో కలిసి యేర్పడినది. పెదవులవలన ప్రయోజనమేమనగా నోరుమూసియుంచుటయు నములదగిన వస్తువును నములునప్పుడు నోటినుండి పడిపోకుండా కాపాడుచుండును. మరియు మాటలాడుటకు సహాయ్యము కలిగించును మరియు ముఖమునకును శోభస్కారమును కలిగించుచున్నవి. మరియు గుదస్థానమునందు ఏరోగము పుట్టునో ఆరోగములు పెదవియందుకూడా కలుగుచుండును. ఏలననగా పెదవులయొక్కయు, గుదస్థానముయొక్కయు ప్రకృతిఏర్పాటు రెండును ఒకేవిధముగానుండును. రెండుపెదవులు, గొంతు ఆమాశయము గుదస్థానము పేగులకు రెండువైపులు అనగా పైభాగము క్రిందిభాగములందు అనగా రెండు భాగములు ఆరంభమునందు పెదవులున్నవి. అంతమునందు గుదస్థానమునుయున్నది. గుదస్థానము చినిగిపోవుటవలన అందుమూలశంక పుట్టునదగుచున్నది. అటులనే పెదవులుకూడా చినిగిపోవుచున్నవి ఈస్థితియందు పెదవులయందుకూడా మూలవ్యాధివలె పిటికలు పుట్టినదగుచున్నవి ఇటులనేఅన్ని విధముల రోగములు కలుగునని గ్రహించవలెను. మరియు యీరోగములు పదివిధములుగా యీఅధ్యాయమునందు చెప్పబడినవి.

## పెదవులు తెల్లబడు లక్షణములు

ఈరోగకారణమేమనగా రక్తములో అపక్వకఫసంబంధమగు రతూబత్ అనగా నీరుయొక్క కారణమువలన తల ముఖముయొక్క అంగముల పుష్టము స్వాభావ్యతయొక్క కారణమువలన పెదవులయందు తెలుపురంగు సంభవించును. ఎట్లనగా యీ కఫయందుమార్పు కలిగించునట్టి శక్తి దుర్బలమునొందును. మరియు భోజనమును అనుభవించునట్టి అంగములయొక్క సమానత్వము చేయజాలకుండును. యీ కారణమువలన పెదవిరంగు నెర్రగానుండదు. ఇందువలన మార్పునట్టిశక్తియు దుర్బలముగా భేదము లేకపోవుటవలన పెదవియందు తెలుపురంగు సంభవించును. మరియు యీ అంగము యితరఅంగములకు విరుద్ధముగా యుండును ఎంతవరకు కారణము బలముకలదిగానుండునో అంతవరకు తెలుపురంగు కనిపించకుండును. అనగా గ్రహించుటకు వీలులేకుండునని భావము.

## పెదవులు తెల్లబడుటకు చికిత్స

కఫమును వెడలించునట్టి వస్తుసేవనచేయవలెను. ఆకుకూరలు మొదలగు వస్తువులను వర్జించవలెను. ఇందుముఖ్యముగా జిగురుగానుండు వస్తువులను దూరపరచవలెను. ముఖ్యముగా తెలుపు కలిగినప్పుడు పెదవిచర్మము పూడిపోవ నారంభించును. మరియు ప్రకృతియొక్క తృష్ణను అధికపరచుటకై కఫదోషమును బాధించుటకై నార్దైన తైలము చంద్రతైలము, చంబేలీనూనె, కుంకుమపువ్వుతైలము, యీ మొదలగు తైలములను వేరువేరుగా ముక్కులో వేయుచుండవలెను.

(లాభము) లఘాదిత్ తెలుపుతో కూడా పెదవిచర్మము పూడ నారంభించినచో దీనివలన అనగా తెలుపుకారణము ప్రత్యేకముగా యుండుటవలనకూడా సాధారణశుష్కత్వము మరియు పైపూష్టము అధికమైనది గాన శుష్కించవలెయునున్నదని గ్రహించవలెను. మరియు చర్మము పూడుటకు చికిత్స వేరు ప్రకరణములలో వర్ణించబడును.

### పెదవి శుష్కత్వము వలన చర్మము ప్రాకుట పెదవులు పగులుటకు లక్షణములు.

పెదవులు పగులుట, పెదవి చర్మము ప్రాకుట, పెదవులు యెండుటకు ఇదే కారణము అనగా నాలుక పగులుట, శుష్కించుట, చర్మము ప్రాకుటయందు వర్ణించబడెను కాబట్టి నాలుకయందు చెప్పిన చికిత్సలు పెదవి రోగమునకుకూడా ఉపయోగించును. మరియు, చర్మము ప్రాకుచుండినచో బేహానా, ఖిరమి, అగసిపిత్తులు మొదలగు వాని గుజ్జును పెదవిపై మర్దించుట, అన్నిచికిత్సలకంటె యుత్తమమువాయమని భావింతురుగాని అథవా కోడిగ్రుడ్డుగాని వత్తిచేసి ఉపయోగించవలెను మరియు, మలమూనా పైనుండి క్రిందివైపునకు నీళ్ళుటకై త్రోట్లు, గుద స్థానము పీట్లపై బనప్షాతైలము మర్దించుట అన్నిఔషధములకంటె లాభదాయకమగును. మాదికాయలు, సఫేదా, గోధుమసత్తు, అధిరాయీ మొదలగునవి మెత్తగానూరి కోడిగ్రుడ్డులో కలిపి పెదవిపై మర్దించుట అన్నిఔషధములకంటె మిక్కిలి మంచిది దీనిని పరీక్షించిన యోగము. పెదవులు పగులుట, చర్మముప్రాకునట్టి స్థానమునకు గాలి తగులకుండునట్లు కాపాడవలెను. మరియు, లేపనముచేసిన పెదవిపైని కోడిగుడ్డులోపలిపొర పెదవిపై అంటించవలెను. మరియు, వెల్లుల్లి, నీరుల్లి, వుప్పు, మరియు, జింక, మేక, గుఱ్ఱము మొదలగు జంతువుల మాంసము మరియు, పిత్తకరవస్తువులను వర్జించవలెను.

### పెదవి అదురుటకు లక్షణములు.

ఈఅదురునట్టి వ్యాధి నాలుగు విధములుగానుండును.

(1) ఆమాశయముయొక్క ముఖస రోగమువలన వుత్పన్నమగును అనగా కష్టదాయకమగు మలము ఆమాశయమువైపు చేరునట్టి కారణమువలన ఆమాశయము ఒకప్పుడు దానిని దూరపరచుటకై ముడుచుకొని పోవును. మరియు, ఒకప్పుడు ఆమాశయము సుఖము నొందుటకై విశాలమగును. యెట్లుననగా ముఖముయొక్క వునర్తి

భాగము ఆమాశయముయొక్క పైభాగముతో కలిసియున్నది అప్పటి పొర యీరెంటి భాగముల మధ్యమందు కలిసియున్నది. వాస్తవములో నిది కఠినముగానున్నది. యీ కారణమువలన ఆమాశయము కదలుట వలన పెదవియందు అదురు సంభవించునని గ్రహించవలెను. యెటుల ననగా కఠినశరీరము ఒకవైపు కదలుచుండిన రెండవవైపుకూడా అవశ్య ముగాకదలును. మరియు, దీని చిహ్నములు కడుపులో కెల్లుట, ఎక్కిళ్లు ఒకప్పుడు వాంతికూడా కలుగుచుండుట యీ మొదలగు లక్షణములు కలిగియుండును.

(2) మెదడునుండి పెదవులయందు ప్రవేశించియుండునట్టి జీవన రసముయొక్క సంయోగమువలన పెదవి అదురనారంభించును. అనగా కష్టముగల మలము మెదడునందు చేరినప్పుడు కలుగునని భావించ వలెను. కాబట్టి మెదడు మూడుచుకొనుట, వికశించునట్టి గతియందు వెంటనే దీనిని దూరపరచుటకై కదలుచున్నది. గాన జీవనరసముద్వారా పెదవికూడా అదురనారంభించును. మరియు, యీ విధమగు అదురు అపస్మారము అర్ధాంగవాతమునందు ఆరంభదశయందు కనుపించును.

(3) ఈ స్థలమునందు చిక్కని మలము వుత్పన్నమైన కారణము వలన పెదవి అదురనారంభించును. యీ మూడువిధముల భేదములు సామాన్యముగా అంగములు అదురునట్టి వ్యాధియందు వర్ణించబడినవి. మరియు, వీటిని శిరోరోగములలో వ్రాయబడియున్నది.

(4) పెదవులయందు సన్నని నరములుగలవు ఆనరములు రక్త ముతో నిండియుండుటవలన ఇటులనె చల్లదనముకలిగించునట్టి శక్తి అందువుత్పన్నమగును. ఆచల్లదనముయొక్క అవిరిపరమాణువులు వా తముగా మారును. యీవాతము రక్తముతో బైలుదేరుచున్నది. మరియు రోమాంచములనుకూడా మూడిచివేయును. ఈకారణమువలన వాతము వెడలుటకు ఆటంకము సంభవించును. కాబట్టి పెదవియందు అదురు కలిగించును. యిందు రక్తజచిహ్నములు ప్రకటనమగును.

(చికిత్స) సరేను అనువరకును ఛేదించవలెను మరియు భోజనము నకు లఘువుగానివ్వవలెను. మరియు రోమకూపములను వికసింపజేయుటకై పరిశ్రమచేయువలెను.

## రెండుపెదవులు లావగుట ముడుచుకొనిపోవు లక్షణములు.

ఈరోగము మూడుభేదములుగానుండును (1) మలముయొక్క న్యూనత్వతవలన జన్మనుండియు పిల్లవాని పెదవులు బిగిసికొని ముడువబడియుండును, మరియు యీరోగము బాల్యావస్థయందు యెంతవరకనగా పిల్లవాడుయెదిగినకొలది ఆరోగ్యముయొక్క యోగ్యతనుపొందగలదు. అనగా అంగములు మృదువుగానుండును. ప్రత్యేకదశను హెచ్చరణపరుచగలవు. మరియు తమనిజదశయందు వచ్చుటకు విధిగలదు, బిగిసికొనిపోయినట్టి పెదవులు చక్కపరచి నిజదశయందుంచి అందుపై కట్టుకట్టవలెను. దీనివలన పెదవులు స్థిరముగా నుండును.

(2) శరీరమునుండి మలము విశేషముగా తీసివేయుటవలన పీకుట బిగిసికొనిపోవుట మొదలగులక్షణములు పెదవులయందు వుత్పన్నమగును. ఈవ్యాధిచికిత్స చెప్పబడియుండలేదు. కాబట్టి యీరోగము అసాధ్యమని గ్రహించవలెను.

(3) మలము నిండియుండు కారణమువలన యీవ్యాధి వుత్పన్నమగును. దీని (చికిత్స) మలమును వెడలించుట వృష్ణతైలములను మర్ధించుటవలన యీరోగము శాంతినొందును. ఇటుల రోగములను మలసంబాధమగువ్యాధులయందు వర్ణించబడినవి.

## పెదవి పిటిక రోగ లక్షణములు.

ఈరోగము రెండువిధములుగా నుండును. ఇందు (ఏ) ఇదివక విధమగు చిక్కదనము నలుపురంగుకలిగి చిన్నవిగా ద్రాక్షపండ్లతో సమానమగు పిటికలు క్రిందిపెదవిలోపల వుత్పన్నమగును. మరియు పిటికమధ్యమందు పగిలియుండును. ఇందురోగముగల పెదవిబైటికి తిరుగబడియుండును.

(బి) ఈవ్యాధియందు షాతూత్ అనగా పూతిసంతుతో సమానముగు పిటిక కలుగును. అనగా ఒకవస్తువు పెదవియందు పుష్పించును. ఇందునొప్పి కలిగియుండదు. ఎటులనగా సర్తాన్ వ్యాధివలె అంగమును శవమువలె చేయుచున్నది అనగా అంగములలోనుండు జ్ఞానశక్తిని నశింపజేయుటవలన నొప్పియుండదని భావము. మరియు ఒకప్పుడు మలముయొక్క అధికత్వము నీచత్వముండుటవలన పై పెదవియందు ప్రవేశించుచున్నది. మరియు నోటియొక్క కొన్ని భాగములను అణచివేయుచున్నది. మరియు పెదవియొక్క పిటికలు దగ్గరయుండునట్టి రక్తముయొక్క కారణమువలన పుత్పన్నమగుచున్నవని తెలియవలెను. ఈ పిటికలు నరములమూలములయందుండి బైలుదేరి పెదవియందు ఖసీభవించుచున్నవి.

పెదవి పిటికరోగ చికిత్స

నరేఖు అను శిరావేధనము చేయవలెను. నాలుగు బంధనములు అనగా రెండునరములు పై పెదవియందున్న రెండునరములు క్రిందిపెదవియందున్నవి. ఆనరములు నాలుగు ఛేదించవలెను. మరియు, మతబూఖ్ గొంతెమగోరు కషాయముతో మలమును వెడలించవలెను. మలము వెడలిన తరువాత పిటికయొక్క రంగు నల్లగానున్నదా లేక యెఱ్ఱగాయున్నదా యని గమనించవలెను నల్లగానున్నచో పెదవిపై కత్తితో గంట్లు వేయవలెను. దీనివలన ఆఅంగమునందుండి మలము వెడలిపోవును పిమ్మట శిరకా అందుపై వర్ధించవలెను. దీనివలన రక్తము వెడలిపోవును. నీక్రియ నాశనము చేయునట్టి ప్రతినిధి అనగా దీనితో సమానమైనది అనగా పిటికయొక్కరంగు యెఱ్ఱగానున్నచో కత్తితో గంట్లు వేయకూడదు. మరియు, ఆ మూధమును యిందు ప్రయోగము చేయకూడదు యెందుకనగా యీ వ్యాధి రక్తమువలన కలుగుచున్నది. మరియు హృదయనరములనుండి బైలువెడలును కాబట్టి యిట్టి సమయమునందు హృదయనరములు రక్తముతోనిండి వృద్ధిచెందును గనుక లోహా

ముసు వెడగించిన తరువాత అజీర్ణమును గలిగించునట్టి వస్తువులు పెద విపై లేపనముచేయవలెను. అనగా రసాంజనము, బాబూనా, యవపిండి, పన్నీరు, వుసారే ఆఫిన్, కాసు చాకు, మొదలగునవి లేపనము చేయవలెను. అంతమునందు బాదంనూనె మైనము యీమొదలగునవి వలాస్త్రిచేసి లేపనముచేయవలెను వ్రణోదకముతో విశేషముగా కడుగుచుండవలెను మరియు కఫమువలన గలిగినట్టి వాపునందు మలమును వెడలించునట్టి వస్తువులను అనగా సోయువితుఖ, బాబూనా, అకలీలుల్‌మలిక్, మొదలగు వస్తువులు లేపనము చేయవలెను.

మరియు వాతకారణమువలన వాపు గలిగినదో సర్తానువ్యాధియందు వర్ణించిన ఔషధములను యీవాపునందుకూడా వుపయోగించవలెను. మరియు వుష్ణస్వభావికములగల లేపనలు చేయుట లాభదాయకముకాజాలదు. యెందుకనగా యీవాపు నష్టమగుటకు కష్టమగును. తదువరి చల్లని వస్తువులను లేపనముచేయుట అవశ్యమగును. యెందుకనగా శీతలేపనాదులవలన వాపు విశేషము కాజాలదు. మరియు యీ వ్యాధియందు స్వల్పముగా భుజించవలెనుగాని రాత్రికాలమునందు భుజించకూడదు, వుదయమైనను లఘువుగా భుజించవలెను.

## పెదవుల గుల్లల లక్షణములు

పెదవులయందు గుల్లలు లేచుటకు కారణము రక్తదోషమువల్లగాని పిత్తదోషముగాని కారణమగుచున్నది గాన యిందుకు చికిత్స కీఫాల్ అనునరమును ఛేదించవలెను. మరియు కరకాయకషాయముతోగాని శేకపాదిలీగె కషాయముతోగాని శరీరమును మలమును మెత్తపరుచవలెను.

## పెదవి వ్రణముల లక్షణములు

పెదవులయందు కురుపులు లేచుటకు కారణములు అనేకవిధములుగా నుండును. అనగా గుల్లలయందు చీమునిండి పగిలి వ్రణమగుచున్నది.

(చికిత్స) సఫేదా గారము సేవనముచేయవలెను. ఇటులనే మామి కాయలు, మురుదారుశింగు మెత్తగానూరి పైనను మరియు పచ్చని ఆలూబకరాతైలముతో కిరూతిచేసి లేపనముచేయవలెను.

పెదవుల దుష్టప్రకృతి లక్షణములు.

ఉష్ణము దుష్టప్రకృతిపొందినచో పెదవులయందు మంటకలిగించును. చల్లని నీళ్ళతో శాంతిపొందించును.

శీతదుష్టప్రకృతి అయినచో చల్లనిగాలియందున్న వ్రదయకాలమందున్ను, పెదవులు నీలిరంగుకలిగియుండుట మరియు వాటి జ్ఞానశక్తి నష్టముపొందుట మొదలగు లక్షణములు కలిగియుండును.

మరియు శుష్క దుష్టప్రకృతి అయినచో సర్వదా పెదవులు పగులుట మరియు, పెదవుల చర్మము వ్రల్లిపొట్టువలె వూడనారంభించుట మొదలగు లక్షణములు కలిగియుండును.

చెమ్మ దుష్టప్రకృతినొందినచో పెదవులు వ్రేలబడి నీరసమొంది మృదువుగానుండుట మరియు, చెమ్మవలన కలుగు దుష్టప్రకృతి పెదవులను వేగరము దుర్బలము నొందించుచున్నది. ఈకారణమువలన పెరుగుటయందు నీరసత్వము కలిగించుచున్నది.

—దుష్టప్రకృతి చికిత్స—

ఉష్ణదుష్టప్రకృతియందు అవిసివిత్తులు, కాహూవిత్తులు, అథవా పెద్దపాయల, పచ్చిధనియాలు, బార్తంగ్, కాశిని, అథవా మెరిక్ కూర రసమునందుగాని, అథవా పన్నీరులో తడిపి, మంచుగడ్డలో చల్లార్చి పెదవిపై లేపనము చేయవలెను. మరియు, చందనము, పన్నీరు, పచ్చకర్పూరము యివి మొదలగు వానితో పెదవి చెమ్మపరుచుచుండవలెను.

మరియు, జలుబు అనగా శీతదుష్టప్రకృతియందు కస్తూరి అరుగదీసి వేపనూనెయందు అక్కలకర్ర అరుగదీసి చంబేలితైలము

టుల అదురునో అట్టులనే దంతములు కూడా అదురుచుండును. ఇందు తిమ్మిరికూడా కలుగుచున్నదని వచించిరి. మరియు హకీము నేబల్ కరాః యొక్క కుమారుడు జాలీనూస్ గారు చెప్పిన వాక్యమును బలపరచిరి. మరియు హకీము షేక్ బూఅలీసేనాగారున్ను వారి శిష్యకోటికూడా జాలీనూస్ గారి వాక్యమునే అంగీకరించిరి. మరియు యిటువంటి కారణములయందు విరోధ్ధముగలదు, అనగా దంతమూలములు శల్యము నరము మొదలగువానివలె వీర్యమునుండి వుత్పన్నమగుచున్నవి. అథవా భోజనము అనగా రక్తమువలన మాంసము క్రొవ్వువలె కూడుకొనుచున్నవి. మరియు యీవిరుద్ధతయొక్క ఫలము అనగా యీశరీరము తల్లిదండ్రి యొక్క వీర్యమువలన కూడినదై యున్నది. ఇందుండి ఒకముక్కనశించినచో దానిబదులు తిరిగి పూర్తికాజాలదు. మరియు యేచికిత్సవలన కూడా దాని ఆరోగ్యము కలుగజాలదు. గాన యీవాక్యము ఆఅంగమూనకు విరుద్ధముగాయున్నది. భోజనమువలన వుత్పన్నమగును. యెట్టులననగా దీనిసంబంధమగు కొంతముక్క పూసిపోయినచో తిరిగి దీని బదులుగా పూర్తియగుచున్నది.

## దంతశూలలక్షణములు.

ఉష్ణాధి తొమ్మిది భేదములుగా చెప్పబడినవి. (1) ఉష్ణదుష్టప్రకృతి మలములేనిదే ఉత్పన్నమగును. దీని చిహ్నములు దంతమూలములయందు వేడిగానుండుటయు రోగి నోటిలో చల్లనినీళ్లు పోసికొనిన శమించినట్లుండుట, చిగుళ్లు వాపులేకనే యెఱ్ఱబడుట మొదలగు లక్షణములు కలిగియుండును.

దంతశూల (1) భేదచికిత్స.

శిరకా, వన్నెడు నోటిలోపట్టుకొని వుమియుట, మరియు నొప్పి అధికమైనచో కొంచెము కర్పూరముకూడా అందుచేర్చవలెను. మరియు గుల్ రోగణ నోటిలో పట్టుకొనియుండుట వలన లాభదాయకమగును. యీరోగియొక్క దంతములయందు విశేషముగా నొప్పికలిగినచో వల్ల

వంటు జాన్ను, సౌసన్ తైలము యందు నర్గిస్ తైలము యందు కలిపి పెదవిపై లేపనము చేయవలెను.

మరియు, శుష్కగ్రస్త పరిస్థితియందు యవకషాయములో బాదంపూనె వేసి పానము చేయుచుండవలెను. మరియు, ఇసబ్గోలు గింజలయందు చక్కెరకలిపి యివ్వవలెను. మరియు, బనప్షా తైలము, కలువపూల తైలము, అల్సీ గింజల తైలముతో పెదవి మొల్లవ్వను స్నిగ్ధముగా యుంచవలెను. యీ తైలములతో మయినపు తైలమును తయారుచేసుకొని పెదవులపై లేపనము చేయవలెను. ఇతర నదుపాయములను పెదవులు చిట్లుటయందు వర్ణించబడెను.

మరియు, చెమ్మగల దుష్టపరిస్థితియందు పక్షవాతమునందు చెప్పిన చికిత్సను చేయవలెను మరియు, పక్షవాత ప్రకరణమునందు చూచుకొనవలెను. యీ రోగము పులకోపము కలుగనిదే వృత్పన్న మగును. అయినను ఫలము తీయవలసిన అవసరము కలుగుచునే యుండును.

—— సర్వ్యావనగల స్త్రారకవీన లక్షణములు ——

అనేకములు పెదవులలో కలుగుచున్నవి. దీని చికిత్స మొదలగునవి నోటి రోగముల వర్ణనముల ప్రకరణమందు చెప్పబడియున్నవి.

గద్య, ఇది శ్రీ సుదిమూంబేగ్ సాహెబ్ పౌత్ర పచ్చాబేగ్ సాహెబ్ పుత్ర «వైద్యభూషణ» బిరుదావళీ విరాజమాన వైద్యవిద్యావిద్వజ్జన విధేయ రహంతుల్లాబేగ్ నామధేయ ప్రణీతంబైన «తిబ్బెఅక్బర్ షాహి» అను వైద్యగ్రంథమునందు పెదవి రోగాధ్యాయము సర్వము సంపూర్ణము.

### (4) వాతజకంఠవాపు లక్షణములు.

వాతమువలన కంఠమునందు వాపుజనించును. దీని లక్షణములు వాపునందు కఠినత్వము, అంగిలి, నాలుక, కొండనాలుక వీటియందు నల్లనిరంగు కలిగియుండుట, నోటిరుచి వుల్లగానుండుట యీమొదలగు లక్షణములు కలిగియుండును.

### (4) వాతజకంఠవాపు చికిత్స.

వాతమును తొలగించుటకై ఆకాశవల్లి కషాయముగాని, లేక మాపుల్ జుబ్బు, లేక పాదితీగతో తయారుచేసిన శికంజబిన్ యీమొదలగు ఔషధములను ఉపయోగించవలెను. మలమును అనేకపర్యాయములు వెడలించవలెను. మలమునకు మృదుత్వము నొందించి వెడలించుటకై యష్టిమధుకము, రేలకాయగుజ్జు, పాలు, బాదంనూనె, మెంతిగుజ్జునందు కొద్దిగా వుప్పుకలిపిగాని, యీమొదలగువానితో పుక్కిలించవలెను. వాపు అల్లుకొనినయెడల చల్లని వస్తువులు అనగా పచ్చి ధనియాలరసము, పచ్చికాసాలరసము యెల్లప్పుడు నోటిలో నుంచవలెను. యీరసముతో పుక్కిలించవలెను. ఉష్ణపదార్థములతో మిక్కిలి సావధానుడై యుండవలెను. ఉష్ణపదార్థములవలన వాపు హరించజాలదు.

(సూచనీయము) ఉపజిహ్వయొక్క వాపు యెట్లుల వివృద్ధనొందుచుండునో అట్లునే వాటి పేర్లుకూడా వేరు వేరుగా విధించబడుచున్నవి. యీవిధముగువాపు కొండనాలుక యావత్తుభాగములయందు ఆక్రమించినయెడల దానిని మహామూది మరియు, ఉస్తువాలి వాపు అందురు. అనగా స్తంభమువలె క్రిందినుండి పైవరకు గుండ్రముగానుండును. వాపు కేవలము కొండనాలుక చివరయందున్నయెడల దీనిని వర్మెఇనబి అనగా ద్రాక్షపండువంటి వాపు అందురు.

# కొండనాలుక నచ్చు లక్షణములు

కొండనాలుక పెద్దదై వాపుతోకనే క్రిందికి జారిపోవును యేదో ఒక వస్తువు గొంతుకలో చిక్కుకొనియున్నట్లు రోగికి తోచుచుండును అట్టి స్థితియందు నోరువిప్పి నాలుకసాచి చూచినచో కొండనాలుక పెద్దదై నటుల కనుపించును. ఆనాలుక క్రిందికి లేవనెత్తినను రోగి గ్రాసము మ్రింగుటకు వీలులేకపోవును. మరియు నిది బిగుతవ్వటను సకూతుల్ లుహాత్ అందురు. యీరోగము రెండువిధములుగా నుండును. (1) కారణము రక్తసంబంధమగు దుష్టప్రకృతివలన వాపు కలిగియుండును దీని లక్షణములు పొడవడలు, కొండనాలుక మొదలగునవి యెర్రగానుండుట, ఉష్ణము విశేషముగానుండుట యీమొదలగు లక్షణములు కలిగియుండును.

## (1) కొండనాలుక నచ్చునకు చికిత్స

కీఫాల్ అతినరమును ఛేదించవలెను. మరియు రక్తకారణము వలన కొండనాలుకయందు వాపు కలిగినయెడల రక్తసంబంధమగు వాపునందు వర్ణించబడియున్నది. అందు చెప్పబడిన ఔషధములు యీ వ్యాధియందుకూడా ఉపయోగించవచ్చును. అజీర్ణముగా నుండినచో యోగ్యముగా నుండునట్టి వస్తువులను సేవించుటవలన అజీర్ణము హరించును.

## (2) కొండనాలుక నచ్చులక్షణములు

(2) భేదము కఫముయొక్క కారణమువలన చల్లని దుష్టప్రకృతి యేర్పడి యీవ్యాధికి కారణమగును. దీని చిహ్నములు నోటిలో మిక్కిలి అధికముగా జిగురుకలుగుట మొదవురంగు నొప్పి లేకుండుట యీమొదలగు లక్షణములు కలిగియుండును.

## (2) వ-భేదము కొండనాలుక నచ్చు చికిత్స

కఫమును తీసివేయుటకై తేనెకలిపిన నీళ్లు మరియు జూఫాకషా

యము మొగలకువానినో పుక్కిలించవలెను. మరియు ఆస్, వటికి మెత్తగానూరి పల్లనాపినప్పు, పిప్పళ్లరూపివ్వాగుజ్జు రసములో కలిపి పుక్కిలించవలెను. దీనివలన నోటి యందుగల చెప్పు లగ్గిపోవును. మరియు వటికి మెత్తగానూరి స్రుంగిభస్మము, సవాసాగరము యీమొదలగునవి మెత్తగానూరి గొట్టములోబోసి, కొండనాలుకపై వూదవలెను. లేదా చిన్నసలాకునకు దూదిపెట్టి ఆ అవుషధము నందుముంచి దానితో కొండనాలుకపై అద్దవలెను. యెందుకనగా, కొండనాలుక విషయమై కాదు. దీనిమొదలు సరము దీర్ఘవిరోపమునందుండు మాంసమునకు ఆరబ్బిభాషలో తగనగు అందురు. యీమాంసము పుపజిహ్వతో కలిసి యుండును. యిట్టునే నిది పొరతో తలపుర్రెపై యిరుప్రక్కలయందు అంటుకొని యున్నది శిరశ్చర్మముతో సంబంధము కలిగియుండినయెడల అంగమునందు అజీర్ణము పీకు కలిగించునట్టి వస్తువులను మాదుపై సుంచినయెడల దీనివలన శిరస్సుయొక్క చర్మము లాగనారంభించును. అజీర్ణముకూడా ఉత్పన్నమగును దీని సంయోగము వలన కొండనాలుక కూడా పైకి లేచిపోవును. మరియు ఆ ఔషధముల విధి ఈక్రింద వ్రాయబడు చున్నది.

వగడమూడు, తుమ్మయాకులు ఎండించిన జిగురు, పువ్వుచన్న, వీటిని అరబ్బిలో తీగముదతబానా అందురు. మరియు సరేస్, ఇస్పగోలు ఇందుండి ఇస్పగోలు గింజలుతప్ప తక్కిన వస్తువులను మెత్తగానూరి పొడుము చేసి శిరకా అథవా తాతుము ఎముథాసూలు యీమొదలగు వస్తువులు కషాయముగా కాచి వడియబోసి యోగ్యమగు వస్తువులు అనగా పైవస్తువులు ఆకషాయములో కలిపి మాదుపై నుంచవలెను. గాని ముందు మాదుపైనుండు వెంట్రుకలు గొరిగి, లేపనము చేయవలయును.

ఈ ఔషధము బాలురకు, యువ్వనులకు, వృద్ధులకు కూడా వుపయోగించవచ్చును. యిది కొండనాలుకను పైకిలాగుకొనును. మరియు

మెదడునుండి కొండనాలుకపై గురినట్టి ద్రవములనుకూడా ఆర్పివేయును. మరియు జారిన కొండనాలుక మెత్తబట్టి ఔషధములు అనగా మాది కాయ, శిరకాయ, నూరి మాడుపై లేపనము చేయవలెను. మరియు కాచ్చిన సున్నమును సెంతెన్నట్టి శిరకాలో కలిపి మాడుపై వేయుట లాభదాయకమగును. కొండనాలుక వాచుటవలన శీఘ్రముగా లావుగా పెరుగును. మొదలు సన్నముగా నుండును. అట్టి సందర్భములో ఔషధప్రయోగము వలన ప్రయోజనము కలుగనిచో జాజికాయ కస్తూరి వేడినీళ్ళలో వేసి కరిగించి ఆనీళ్ళలో వెచ్చ వెచ్చగా పుక్కిలించవలెను. దీనివలన వాపు మెత్తబడి నష్టమొందగలదు. వాపు మెత్తబడినవెనుక దోషములను నాశనముచేయునట్టి కషాయములతో అనగా పిసారెలపోతు త్రిస్నుక్, మాచికాయ మొదలగునవి ఆకషాయములనందు చేర్చి పుక్కిలించవలెను. దీనివలన మలము కొండనాలుకపై చేరజాలదు.

ఈరోగి కొండనాలుకయందు వ్రణము కలుగుటవలన ఎరుపు రంగు కలిగి వేడిగా నుండినట్లు తోచుచుండిన కాచు చాకురసము వచ్చినధనియాల రసము, పుక్కిలించవలెను మరియు నటికి సంబంధమగు ఔషధములు వాడిన కొండనాలుక మెత్తబడి విశేషప్రయోజనముగా నుండును. అనగా కొండనాలుక మూలమునుండి కొనవరకు సన్నముగను చివర పెద్దదిగానుండును. అనగా దానికొనయందు సమానముగను తెల్లగానుండును. గొంతులో అడ్డపడియుండుటవలన రోగికి వూపిరి ఆడకుండినయెడల కొండనాలుక మొత్తపెరిగినదో దానిని కత్తిరించివేయవలెను. ఇటులకొండనాలుక పెరిగి దీనిమొదలు సన్నముగను ప్రక్కలయందు చిన్నచిన్న గుల్లలుతేలియున్నచో నది బిగుసుకపోవును. ఇట్లుండిన దీనిని కత్తిరించదలచినయెడల ప్రథమమున శరీరమునుండి మలము వెడలించి తదుపరి కత్తిరించవలెనుగాని కొండనాలుక యావత్తు తీసివేయకూడదు. ఎందుకనగా తన ప్రమాణముకంటె జాస్తి పెరిగినభాగమును మాత్రము తీసివేయవలెను. ఎందుకనగా కొండనాలుక యావత్తు తెగిపోయినయెడ

పచ్చిద్రాక్షపండ్లు, రిబాన్, శామంచాకు, పుల్లబేవాహాకాయ రసము, ఇవామొదలగునవి యిందువిషయమై గొప్పలాభము గలుగ జేయును. మరియు కావిరాయి, శీతోదకముతో అరుగదీసి లేపనము చేయవలెను. ఇది ప్రత్యేకముగా రక్తమును అరుటయందు ముఖ్యమైనది.

మరియు ఔషధముతో తీసివేయు విధానము అనగా ఇంగువ, పటిక యివారెండువస్తువులు మెత్తగా నూరి కొండనాలుకపైన లేపనము చేయవలెను దీనిని కత్తిరించుట యోగ్యమని తోచినచో యిటులనే నవాసాగరము, ఇంగువ యివారెండువస్తువులను మెత్తగానూరి లేపనము చేయవలెను. ఇది కొండనాలుక మొదలు సన్నపరచుచున్నది. కొండనాలుకను తీసివేయుచున్నది. మరియు కేవలము పటిక నోటిలోయుంచుటవలన ఇందువిషయమై మిక్కిలి లాభము ప్రాప్తించును. మరియు మూడుదినముల తరువాత మాడిపోవును. ఈకోత ఔషధములను లేపనము చేయునప్పుడు రోగి ముందు దిండువుంచి కూర్చుండబెట్టి నోటిలోనుండి యుమ్మి బైటికి వెడలునటుల నోరుతెరచి యుంచవలెను. అనగా ఔషధము యేమియు నోటిలోనుండి గొంతులో దిగకూడదు మరియు నాలుక తెగినవెనుక మంటను హరించునట్టి ఔషధములను ఉపయోగించవలెను.

(సూచనీయము) కొండనాలుక తీసివేయుటలో మొదలునుండి పూర్తిగా తీసివేయకూడదు. యెందుకనగా కొండనాలుక పూర్తిగా తెగినయెడల శబ్దమును బంధించును. మరియు కొందరు రోగులు ఊపిరి ఆడక మృతినొందుదురు మరియు కొండనాలుక మొదలంటతీసివేయుట వలన అనేకవిధముల రోగముల పాలగుచున్నారు. కాబట్టి శ్వాసబంధించనిచే రోగి మృతినొందజాలడు. గాన దీనిని తీసివేయుటకు త్వరపడకూడదు. అనగా శ్వాసబంధించువరకు నాలుక తీసివేయకూడదనుట. నాలుకపెరిగి గొంతుకు అడ్డపడి తీసివేయవలసిన అగత్యము కలిగినచో

నాలుక యెంతపెరిగినదో ఆలోచించి దాని నిజదళమంతకు హెచ్చుగా నుండు భాగము మాత్రము కత్తిరించివేయవలెను. మరియు పెరిగిన భాగమును యేమియు వదలకూడదు. యెందుకనగా పెరిగిన నాలుకను వదిలినను కూడా నిమ్మళముగ కాదు కాబట్టి లోహశస్త్రముతో ఛేదించుట ఉత్తమము. యెందుకనగా ఔషధలేపనాదులతో తీసివేయవలెనని నపక్షమున కోయుట కఠినముగా నుండును.

## శ్వాస బిగపట్టు వ్యాధి లక్షణములు

ఈవ్యాధియొక్క అర్థము శ్వాసపీల్చునప్పుడున్ను, అధవా రేచకమైన విడుచు సమయమునందున్ను, యీరెండు సమయములలోనున్ను హాని సంభవించుటవలన కారణము శక్తి దుర్బలమునొందును. రోగి బలానుసారముగా బొత్తిగాపోవుచుండును. మరియు కఠినత్వము నొందుచున్నవి. వీటివర్ణనము ముందు చెప్పబడును.

అనగా శ్వాస, బిగపట్టుటకు కారణము గొంతుపీకెయందు కలుగుచున్నది. గాని సమీపమగుటవలన అన్నవాహిని నాళమునందు కూడా యుపద్రవము సంభవించును. నిది దగ్గరలేక అన్నవాహిని నాళము నందు వుత్పన్నమైనది. సమీపమునందుండునట్టి కారణమువలన శ్వాస నాళము మార్గమునందున్ను, పుప్పుసములు అనగా ఊపిరితిత్తుల ముఖ్యమునందుకూడా ఉపద్రవము కలుగుచుండును. సమీపమునందుండు కారణమువలన అట్టి సమయమునందు కూడా కష్టము సంభవించును. మరియు కారణము విశేషమైనయెడల సమీపమునందుండు అంగములను అణచివేయును. యేఅంగమునందు వ్యాధిసంబంధమగు మలము కలుగుచున్నదో ఆ అంగముల కార్యములయందు విశేషముగా హాని సంభవించును. యెటులననగా శ్వాస నాళమునందు వుపద్రవము కలిగినచో కారణము బలముగలదగుటవలన అన్నవాహిని నాళమునందు కూడా కష్టము సంభవించినయెడల యిట్టి స్థితియందు యథాపి శ్వాసపీల్చుటకు

గ్రసనము మింగుటకు కఠినముగా నుండును. కాబట్టి శ్వాసపట్టుపట్టి నట్టి అధికత్వము గ్రసనము మింగునప్పుడు అధికమగును. ఇటులనే జీవి విశుద్ధత అనగా భోజనపదార్థములు మింగుటయందు పుష్పద్రవము కలిగినగినో కారణము బలముగల దగుటవలన శ్వాస అంగములుకూడా సమీపముగా నుండుటచేత మిక్కిలి కష్టము సంభవించును. మరియు, అన్నపానాదులు వెళ్లునట్టి అంగములయందుకూడా కష్టము అధికమగును అప్పటి కారణముయొక్క విశేషత్వము సమీపమునందుండునట్టి అంగములనుకూడా నష్టపరచును. తెలుపవలెనగా యిట్టి దశయందు రెండింటియొక్క కార్యములయందు హాని సమానముగా నుండును. మరియు శ్వాస పట్టుపట్టివచ్చుట, గొంతుపట్టుకొనుట, యే యేస్థానములయందు కలుగునో అట్లు కలుగుటకు నాలుగు భేదములుగలవు.

(1) లాత్రైగ్ అనగా నాలుక మూలమునందు రెండు మాంస గ్రంథులుగలవు. గొంతుయొక్క గొప్పనరములు యిందు ప్రవేశించి యున్నవి. ఈనరములు పిక్కలు చేతుల యందుండి పుష్పన్నమగుచున్నవి. మరియు వీటియందు ముఖము, నాలుకకు సంబంధముకలిగి యుండును లవ్రుజత్రైగ్ అనగా నాలుక వెనుక ప్రక్కనుండు మాంస ఖండములయందు వాపు కలిగినయెడల దీనిని నుమీఖ్ ఖునాక్ అనగా కేవలము శ్వాసపట్టుబట్టుట అందురు దీని లక్షణములు రోగి నాలుక ముఖమునుండి బైటికి చాచినయెడల వాపు ప్రత్యేకముగా కనుపించును. మరియు 2 వ భేదముకంటె దీనిని ఖునాకప్వ అందురు. ఇది విశేష ఆరోగ్యముగలది. మరియు లవ్రుజత్రైగ్ దీనిని నాన్వత్రాగ్ కూడా నామము గలదు. నివి మాంసపు రెండుఖండములు యివి గొంతుయొక్క రెండుభాగములనుండి నాలుక మూలమునకు సమీపమునందు యేర్పడియుండును. మరియు యీమాంసముక్కలవలన కలుగుబాధ యేమనగా గాలి నాశికమునుండి పీల్చునప్పుడు ఒకేసారియును లోపలకు ప్రవేశించనియ్యక నెమ్మదిగా ప్రవేశపెట్టుచున్నది.

ఖునాక్ తలఖ ప్రథమభేదము నాలుగువిధములుగా విభజించబడెను. (1) రక్తసంబంధమగు మలమువలన వాపుకలుగును. దీనిచిహ్నములు ముఖము యెర్రగానుండుట గొంతు తలయందుండు నరములు రక్తముతోనిండి పరుగిడుచుండును. మరియు గొంతుమంటచుండుట నోరుతియ్యగానుండుట సారాయి పానముచేసినటుల తోచుచుండుట మరియు మలము సర్వశరీరమునందు ప్రవేశించినచో అంగములయందు నీరసముతప్ప యితర లక్షణములు రక్తాధిక్యమువలన కలుగులక్షణములు కలిగియుండుట మొదలగులక్షణములు కలిగియుండును.

## —కేవలము శ్వాస బిగబట్టుటకు (1) భేద చికిత్స.—

ఈవ్యాధికి ఖునాక్ దమీ అందురు. శక్తియందు దుర్బలత్వము కలిగియున్నయెడల రెండుచేతులలోనుండు సరేరు అను నరములను ఛేదించవలెను. రక్తము కొద్దికొద్దిగా అనేకపర్యాయములు వెడలించవలెను. అనగా ప్రతిగంటకు 17న్నర మాషములుగాని 35 మాషములవరకు రక్తము తీసివేయవలెను. మరియు యెటుల అవశ్యముండునో ఆఅవస్తనుబట్టి రక్తమును తీసివేయవలెను. అనేకపర్యాయములు రక్తము తీయుటవలన కలుగులాభమేమనగా రోగి అచేతనుడుకాజాలడు. అనగా గొంతువాపుగలరోగికి మూర్ఛ కేవలము అసాధ్యమగుచున్నది. అనేకపర్యాయములు శిరాభేదనము చేయుటకు మధ్యమందు నాలుకక్రిందనుండు నరములు క్రింది పై పెదవుల నరములు ఛేదించుటయందు జాగరూకుడై యీనరములను ఛేదించవలెను. ఇట్లేతరి ముఖ్యముగా నాలుకక్రింద నరములయందు మలమునిండియుండును. ఆమలము గొంతుభాగములయందుచేరి బాధించబడినయెడల సర్వశరీరమునందు రక్తము నిండియుండనిచో శిరావేదన చేయుటవసరముండదని గ్రహించవలెను. కాబట్టి యీవ్యాధియందు భోజనమొనగుట మంచిదికాదు. ఎందుకనగా యీరోగమునందు లంకనముంచుట రక్తమోక్షణముతో సమానగుణము కలిగించునని గ్రహించవలెను. మరియు గొంతువాపు శరీర

సంయోగములవలన కలుగుచున్నది. శక్తిసహాయముగు గండైన హో హావ్ తెలుందామ్ అథవా బాసలికు అనగా శిరోవేదనవరేయు అను సిరావేధనమునకు మందుచేయవలెను. ఒకవర్ణ్యాణులు రోగి అచేతనుడగువరకు రక్తము విడలించవలెను. దీనివలన గొంతువాపు తక్షణమే తగ్గించును. వీలైనంతవరకు ఇట్టిరోగియొక్క పిక్కలపై కత్తితో గాట్లు చేయుటవలన మిక్కిలి లాభదాయకమగును. మరియు సాఫిన అను శిరావేదన చేయుట మిక్కిలి ప్రయుక్తమగును, ముఖ్యముగా యారోగికి రక్తాదిక్యగ మూలవ్యాధి (అర్శరోగము) రక్తము నిలిచిపోవుట లేక స్త్రీకు రజోధర్మము లేకపోవుట యీ మొదలగు కారణములవలన గొంతువాపు కలుగుటకు హేతువగును. శిరావేదన నొందిన తదుపరి మృదువగు హుకునా అనగా వస్తికర్మచేయుట లేక అతివేగరముగా గావించుటవలన లేక ఫలజాతుల రసాదులవలన గాని లేక యిట్టి స్వభావకమగు నితర కషాయాదులవలనగాని శరీరమును మృదుత్వము నొందించవలెను.

మరియు, మలమును విడలించిన పిమ్మట శికంజబీన్ గాని, ఖుర్నాబ్ షర్బతులో చిరిశెగలు, కామానివిత్తులు, కాసిని విత్తులు, యెండుధనియాల కషాయము మొదలగునవి కషాయము కాచి గాని లేక పూతిహంను రసము తీసి చిక్కబడువరకు కాచవలెను. దీనిని రుబ్బు అందురు మరియు, అకిరోటు సిరకాలో వేసి కాచి పుక్కిలించవలెను. మరియు, వక్కి అకిరోటు శిరకాగాని పుక్కిలించవలెను.

వక్క అకిరోటుపై బెరడు శిరకాలో వేసి యుంచవలెను. యిది గొంతువాపును తీసివేయుటకు అత్యంత గుణదాయకమైనది. మలము యెంతవరకు వెడలకుండునో అంతవరకు పుక్కిలించుట యోగ్యము కాదు. దీనివలన మలము మస్తిష్కస్థానములవైపున వెళ్లించసూ... అనగా ఊపిరితిత్తులు హృదయస్థానములయందు ప్రవేశించకుండునట్లు కాపాడవలెను. రోగము హెచ్చునట్టి కారణము గతించిన యెడల మలమును

పక్వపరచి తీసివేయుటకు సాధ్యముగా నుండవలెను. యిట్టిసమయమునందు వైద్యుడు రోగిబద్ధకు ప్రవేశించి ప్రముఖముగా తోడినను శిరాచేదన చేయ కూడదు. యెందుకనగా రోగి నిస్సహాయముగా దుర్బలమును నొందును. యిట్టితరి భోజనమునకు యివ్వవలసిన అవశ్యకము కలిగిన యెడల రోగి గ్రాసము మింగుటకు కష్టముగా నున్నచో అట్టి రోగికి భుజింపజేయుట కష్టము కలుగజేయుటయని గ్రహించవలెను మరియు, వాపు బైటి వైపుకలిగియున్నచో వాపుపై కత్తితో గట్లుకోసి రక్తము వెడలింప జేయవలెను. మరియు, మలమును పక్వపరచి తీసివేయుటకు సామర్థ్యము గల ఔషధములతోను కషాయములతోను పుక్కిలించవలెను. అనగా అంజూరపండ్లు, ద్రాక్షపండ్లు, మెంతులు, అవిశివిత్తులు యీ మొదలగు నవి కషాయముకాచి అవుపాలు, రేలకాయగుజ్జు కలిపి పుక్కిలించ వలెను. మరియూ, మలమును పక్వపరచి మృదుత్వము నొందించునట్టియూ నొప్పిని తగ్గించునట్టి వస్తువులు యావత్తు యీ రోగమునందు వుపయోగించును. మూడునాలుగు దినములు గతించిన యెడల యీ రోగము నకు అంతసమయమని గ్రహించవలెను. యీ అంతదినములయందు గుల్‌రోగన్ (గులాబిపూలనూనె) లో స్వచ్ఛమగు మైనము వేసి కరిగించి పాతదూది నీళ్ళలో తడిపి అందుపై మైనమువేసి కరిగించిన నూనె వేసి గొంతు యిరుపక్కలయందుంచిన మిక్కిలి లాభదాయకమగును. మరియు, వాపునందు యెఱుపురంగు లేక పచ్చనిరంగు ప్రవేశించి నీరు మొందిన యెడల మలము పక్వమైనదనియూ, రక్తము చీముగా మారిన దని గ్రహించవలెను. సీవాపు తనంతట చితికి పోయిన సరే లేనిచో వాపును బద్దలు చేయునట్టి ఔషధములతో పుక్కిలించవలెను. యీ ఔషధముల విధానము అనగా పావసీలవణము యింగువ అబాబిల్ అనువత్తి, మలము యీ వస్తువులను మెత్తగానూరి శుభ్రమగు పాలలో గాని వేడినూనెయందుగాని కలిపి పుక్కిలించవలెను. మరియూ, మాది కాయ, దానిమ్మపూలు, పటిక, దానిమ్మబెరడు యిటులనే విబంధకర

ఔషధములను నీళ్ళలోవేసి కషాయముగాచి పుక్కిలించిన యెడల వాపు బద్దలగును. అనగా వాపుయొక్క భాగములను ఒకటిగా చేర్చును మరియు, వాపు బద్దలగుటకు ఆలస్యమైనచో యోగ్యమని తోచిన యెడల ఆవాపును వేలితో వత్తివేయవలెను. లేదా సలాకుతో సమాన ముగానుండు ఆయుధములోగాని వత్తివేయవలెను. ఈ వాపును చిరుపు నట్టి ఆయుధము సలాకువలెనుండి దీనిచివర కత్తి చివరవలె నుండును. దీని మొన సన్నముగను గుల్లగానుండును. దీనికి మోలేనియా అనగా గుప్త సలాకు అందురు. దీనిలో గొంతువాపును చీల్చివేసిన యెడల చీము వెడలిపోవును. దీనిన పూర్ణవిధానముల ఔషధములవలన తగ్గిపోయిన సరే. లేని యెడల ఆయుధము ప్రయోగించవలెను. కాబట్టి ముందుగా శస్త్ర ప్రయోగము చేయకూడదు. వాపు యొకత్తు ఒకసారి బద్దలైనచో ఆవునెయ్యిగాని బసన్‌పాత్రైలముగాని వెచ్చచేసి నీళ్ళలోకలిపి పుక్కిలించవలెను. దీనివలన గాయము కరిగి శుభ్రముగానుండును. మరియు, పరిశుభ్రమగు ఆవుపాలు తేనెతోకూడా పుక్కిలించుటవలన యిట్టి లాభమేప్రాప్తించును. పిమ్మట గాయము మలరహితమై శుభ్రముగా నుండిన యెడల కస్తూరబడ్ (మాయి) ఒక భాగము నీలిసాసన్‌వేరు అర్ధ భాగము కషాయముకాచి ఆకషాయముతో పుక్కిలించవలెను. రోగా రంభమునందు యవగంజి, పరిశెసగలుచేర్చి వండిన గంజి యిచ్చుట అన్నిటికంటె లాభదాయకమగును. మరియు, వాపుబద్ధలైన తరువాత గోధుమపొట్టుగంజి బాదంపూసె కలకండచేర్చి వండిన గంజి యివ్వ వలెను. రోగి దశను బట్టి భోజనమొసంగుట వైద్యుని కర్తవ్యమని గ్రహించవలెను.

## —రక్త పిత్తవాపు హార మాత్రలు—

గులాబిపూలు, పెద్దపాయలవిత్తులు, నిశస్తా అనగా గోధుపాలు ఇగరబెట్టిన సత్తు, తవాషీరి, సమాగ్ అనగా యింగ్లీషులో రూస్ గోరియా అందురు. కతీరా అనగా బాదంజిగురు యివిప్రత్యేకము తీ

యమునందు మలము దిగుటవలన కలుగు చిహ్నములని గ్రహించదగును. మరియు నాడి గుంజానటుల తోచినచో మలము నరములయందు ప్రవేశించినదని గ్రహించవలెను. దీనివలన లకేన్నజ్ అనగా బిగించు వాతము. పిదప మొదలగునవి పుట్టినవగును. మరియు నాలుగుదినముల తరువాత నాభి మెత్తబడినయెడల వ్యాధి నొందునట్టి చిహ్నములని గ్రహించవలెను. మరియు రొమ్మునందున్న, ముఖమందున్న, మెరుపు తగ్గిపోయినచో రెండు అంశములు గలవని తెలియవలెను.

(1) మలము వెడలిపోవును. స్వస్థమగును. రోగికి ఆరోగ్యము ప్రాప్తించును. శ్వాస సహజముగా వెడలనారంభించును.

(2) మలము లోభాగమునకు తిరిగి పోయినయెడల ఈరోగము క్రూరమైనదగును. మరియు శ్వాస బిగబట్టునట్టి రోగినోటియందు ఆవిరి వెడలనారంభించినచో బహుశా రోగి జీవించుట దుర్లభమగును. మరియు, ఆవిరి వచ్చుటయందు కూడా ఆరోగ్యము కలుగగలదు. కాబట్టి ఈసమయమునందు జఠరాగ్ని బలముగలదై నిజదశయందుండిన రోగి ఆరోగ్యము కలుగగలదు. గాని రోగి ముఖము ఆకుపచ్చనిరంగుకలిగి కనుగుంటలు నల్లగా నుండినచో యిట్టిస్థితియందు రోగి మృతినొందును. నాడి కూడా చిన్నదిగా నుండును. కాళ్లు చేతులు చల్లగానుండును. నాలుక లావుగను నల్లగానుండిన యెడల మృత్యువు సంభవించుటకు లక్షణములని గ్రహించవలెను.

మరియు శ్వాస బిగబట్టుట గొంతునొప్పితో కూడా జ్వరము సంభవించుట అసాధ్యలక్షణములని భావించవలెను. మరియు అప్పటి వృష్ణజ్వరమునందు రోగసంధియొక్క దినమునందు గొంతువాపు సంభవించినయెడల గొప్ప భయము కలుగును. యిట్టిసమయమునందు రోగి ఒక పర్యాయము పీల్చునట్టి గాలి రెండుసార్లు పీల్చుచుండినను ప్రతిశ్వాసయందు రొమ్ము, ముక్కు పుటములు కదులుచుండిన అత్యంతభయ

ము గలవు. ఈలక్షణములను గొంతువాపు యందున్న, శ్వాస బిగబట్టుటయందు గల యావత్తు భేదములయందు గుర్తించవలెను.

## పిత్తజకంఠవాపు లక్షణము

ఈవాపునందు పిత్తమైనయెడల దీనిలక్షణములు మిక్కిలి దాహము నోరెండుట, నోరుచేదుగానుండుట, నిదురనాశనము, మంట, పోటుతో కూడిన నొప్పి మొదలగు లక్షణములు కలిగియుండును.

ఇటులనే రక్తకారణమువలన నొప్పి లాగుట బిగించుట మొదలగు లక్షణములు కలిగియుండును. ఇటులనే పిత్తకారణమువలన పోటుతో కూడిన నొప్పి విశేషముగా నుండును. మరియు పిత్తకారణమువలన కలిగిన గొంతునొప్పియందు శ్వాసబిగబట్టుటకంటె రక్తసంబంధమునను మిక్కిలి తక్కువగానుండును. ఎటులనగా పిత్తముయొక్క సూక్ష్మతవలన వాపుయొక్క పొడవు వెడల్పు బహుస్వల్పముగా నుండును.

## పిత్తజకంఠవాపు చికిత్స

రక్తదోషమువలన కలిగిన వాపునందు చెప్పబడిన సుపాయములు మొదలగు వానివలె శిరావేధనము చేయవలెను. మరియు ఫలాదుల రసము లేక కషాయములయందు రేలకాయగుజ్జు శీరఖిస్తకలిపి శరీరము మృదుత్వము నొందుటకై పానముచేయవలెను మలమును తీసివేసినతరువాత ఆరంభమునందు చిరిచెనగవచ్చునట్టు పూతివంనుదబ్బ కాహూగింజలపాకము కాశ్నివిత్తులుపాకము లేక యిటువంటి అన్యౌషధములతో పుక్కిలించవలెను. అనగా యీవస్తువులను పైనవర్ణించియున్నాను. మరియు రెండవరోజు మూడవరోజు అఔషధములతో పుక్కిలించవలెను. వీటివర్ణనము రక్తమువలన వుత్పన్నమగు కంఠవాపునందు చెప్పబడియున్నది.

మరియు గొంతువాపు పిత్తకారణమువలన కలిగినచో దీనిని నష్టపరచునట్టి అవసరము మిక్కిలి స్వల్పముగానున్నది. అనగా విశేషముగా జలుబు ప్రవేశపెట్టుట యోగ్యమగును. ఇందువిషయమై [illegible]

గంజి ఇంపి గోలుగింజలగుజ్జు, వుచ్చకాయరసము, పెద్దపాయలపాకము, యీ మొదలగునవి మిక్కిలి లాభదాయకములగును. రోగము అంతము వకు ప్రవేశించినచో గోధుమపొట్టు నీళ్ళలో వేసి కాచి వడియబోసి అందులో రేలకాయగుజ్జు కలిపి పుక్కిలించవలెను. మరియు మలమును లోభాగమునుండి నీర్సువలసిన మొదల జాపత్ పాపడిలవణము ఆవాలు ఆడతులసి యీ మొదలగువానిని మెత్తగానూరి గొంతుపై లేపనము చేయవలెను. మలము బైటికి వచ్చుటకై యుత్తమమౌపాయములు అవగా గడ్డముక్రింద శస్త్రముతో గంట్లువేసి శృంగియంత్రముతో రక్తముతీసి వేయవలెను.

## (3) కఫజకంఠవాపు లక్షణములు.

వాపు కఫ కారణము వలన కలుగుచున్నది. దీనిలక్షణములు ముఖము కండ్లు బరువుగానుండుట వాపు తెల్లగానుండుట నోట జిగురు వంటి వుమ్మి విస్తారముగా వెడలుట నొప్పియొక్క న్యూనత నోటి రుచి వుప్పగానుండుట యీ మొదలగు లక్షణములు కలిగియుండును. యీరోగమునందు వాపు కఠినముగా నుండుటవలన అన్నము నీళ్ళు కఠినముగా మ్రింగగలుగుట మరియు యీకారణమువలన కఫమువలన కలుగు వాపు మెత్తగానుండిన గ్రాసము మ్రింగుటకు కష్టము బొత్తిగా కలుగకుండును. కఫసంబంధమగు మలము స్నిగ్ధముగను చిమ్మగను చల్లగానుండిన వాపు గొంతుపైకే శ్వాసవాహిని నాళమునందు కలుగుచున్నది. యీనాళముక్రిందనుండు నరములయందు జలుబు అధికముగానుండుటవలన ప్రవేశింపజాలకుండును. మరియు మలము పలచగను వుష్ణముగను చిమ్మగలదైనచో లోపటినరములయందు వాపు వుత్పన్నమగును. మరియు యీ అంగము కఠినముగానుండి వుష్ణము లేకుండిన ఈ మలమునందుకూడా వుష్ణము లేకుండును యిట్టి మలము నరములలో ప్రవేశించజాలకుండును.

## కఫజకంఠ వాపు చికిత్స

ఈరోగమునందు తీక్ష్ణ విరోచనమునకు యాలాప్ మరియు, హుబ్బో కాయా మొదలగు ఔషధములతో మలమును వెడలించ వలెను. మరియు, తరువాణిలో తేనెకలిపి గాని పచ్చిద్రాక్షపండ్లగుజ్జు అడవి నీరుల్లితో చేయబడిన శికంజబీన్ మల్లంగిరసము, ఆచాలు, అడవిద్రాక్ష అక్కలకర్రతోను లేక అంకోటుకాయల పచ్చిబెరడుతో పచ్చి సోపురసముయిూ మొదలగు వస్తువులలో లభ్యమగు వస్తువులతో పుక్కిలించవలెను. వాపు ఆరంభమునందు పూతిమ దుమబ్ ఆలగాగుజ్జు తరువాణిలోకలిపి పుక్కిలించవలెను. రోగియొక్క రోగము అంతమునకు ప్రవేశించి మలము కరిగిపోయినచో పావడిలవణముఅంజూరరసమునందు కలిపిపుక్కిలించవలెను. దీనివలనవాపువక్కవిముందిబ్రద్దలగును. మరియు, పావడిలవణము యింగువ, నవాసాగరము యింకా మొదలగునవి మెత్తగా నూరి గొట్టముతో గొంతులో నూదవలెను. నిస్సందేహముగా వాపును బద్దలుచేయును. యింకా రోగము కఠినముగానుండిన నాలుక క్రిందనుండు నరములు ఛేదించవలెను. మరియు, ముచ్చనకుంటనుండుచున్న గడ్డను క్రింద శస్త్రముతో గంట్లు చేయవలెను అవశ్యకమైనచో జీడిగింజల నూనె గొంతుపైన లేపనముచేయవలెను. దీనివలన గాయమై దుష్ట మలము చీముగామారి వెడలిపోవును. మరియు, తేనె చెంగవులునుతో పుక్కిలించుటవలన మలము వెడలించుటకు మిక్కిలి బాధ చాయక మగును. వాపు బద్దలైపోవును. మరియు, వేడిగల ఔషధములను లేపనముచేయుటవలన గొంతునందు గరి ఉత్పన్నమైన మొదల పరిశుభ్ర మగు పాలలో నూనెకలిపి పుక్కిలించవలెను. అట్లోగరి వ్యాధి అంతము నకు చేరిన మొదల తెల్లమైనము సౌసన్ తైలమునందుకలిపి గొంతుపై లేపనము చేయవలెను. దీనివలన శిరావేదనము చేయుటవలన మలమా యావత్తు వెడలిపోవును రోగ దశస్వల్పమైనచో హస్తె అందాంయొక్క శిరావేదన చేయవలెను నరేయ అను నరములకూడా ఛేదించవలెను.

ప్రసవసమయమునందు అవశ్యము కలిగియున్నది. మరియు, గొంతువాపు చిహ్నములు బహుళరోగియొక్క ముఖము తెరువబడియుండును నాలుక నోటిలోనుండి బైటికివచ్చియుండును. మరియు, శ్వాసబహు కఠినముగా వెడలుచుండును. మరియు. కారణానుసారము లక్షణములు కలిగియుండును ఇందు విషయమై వెనుక వర్ణనము చేయబడెను. మరియు, యిచ్చట కూడ పఠించియుంటిని అనగా యీవామనమునందు ఉష్ణము లేకుండినది యీశాస్త్రమునకు ప్రవేశించ జాలకుము.

——కఫ గొంతువాటివాపు చికిత్స——

మొదటిభేదమునందు శరీరమును పుష్టిపరచునట్టి ఔషధములు మొదలగువానిని చెప్పియున్నాను. యీవ్యాధియందుకూడా (1) భేదమునందు వ్రాసినప్రకారము భోజనములు ఔషధములు మొదలగునవి సేవించవలెను. మరియు జీవనములు కొమ్ములతో రక్తము తీయుట గాయముచేయుట మొదలగు వానితో మలమును బైటికి వెడలించుటకై మిక్కిలి పరిశ్రమచేయవలెను. మరియు గొంతువాపునందు మ్రింగునట్టి వస్తువులు గొంతుదిగకుండిన అట్టివస్తువులను యివ్వజనదు. అనగా వాటి వివరము ముందు జాబహా అనగా పీకెవాపునందు చెప్పబడును.

## మెడపూసలు తప్పిపోవుటవలన కలుగువాపు లక్షణములు.

(2) భేదము అనగా మెడపూసలు వాటిస్వస్థానమునుండి తప్పి లోపటిపై పుసకు దిగిపోవును, ఈకారణమువలన గొంతునందు వాపు కలుగును. మెడపూసలు తప్పిపోవుటకు ఆరు కారణములు గలవు.

(1) పడిపోవుట, దెబ్బతగులుట, మొదలగు అభిఘాత కారణమువలన పూసలు తనస్థానమునుండి తప్పిపోవును.

(2) మెడపూసల కండరములయందుగాని గొంతు పీకెయందు గాని లేక పీకె సంబంధమగు కండరములయందుగాని వీటన్ని అజల్లా

అందురు. ఇవి లోభాగమునందు కలిసి యున్నవి. పీకెయందుండు కండరములందు భోజనము రాకపోకల మార్గము పీకెమధ్య నున్నది అందు వాపు పుత్పన్నమగును. మెడపూసలు లోభాగమునకు లాగికొని పోవును. ఎందుకనగా యీ అవయవములయందున్న, మెడబంధనరములయందున్న జీవ రముల కారణమువలన యివి యావత్తు ఒకటిగా కలిసికొనియున్నవి. ఈసమయమున యీబంధనము జీవనరముల సంయోగికఅంగములవైపు లాగికొని పోయినచో మెడపూసలు వాటికి సమీపముననుండుటచేత లోభాగమునకు లాగికొనిపోవును.

(3) శుష్కత్వము చెమ్మగల కారణమువలన అసురు, పీసు మొదలగునవి చేటస్థించి మెడపూసలను తొలగించుటకు కారణమగును. ఈ కారణమువలన పూసలు లోవైపుకు లాగికొనును.

(4) చిక్క నివాతము మెడపూసల సందులయందు ప్రవేశించి వాటిని స్వస్థానమునుండి తొలగించును.

(5) తీక్ష్ణములము మెడపూసల సందులయందు చేరి వాటిపరస్పర సంయోగమును చెరచివేయును.

(6) స్నిగ్ధమగుచెమ్మ (తడి) మెడపూసలను లోపలివైపుకు త్రోసివేయును. ఇది విశేషముగా బాలురకు పుత్పన్నమగును. ఎటులనగా బాలురకు శరీరమునందుండునట్టి నరములు మృదువుగానుండును. మెడయందు రతూబతు (నీరు) నిండియుండును. మెడపూసలు జారిపోవుటవలన కలుగులక్షణములు అనగా యేపూసజారిపోయినదో అచ్చట గుంటగానుండును. గొంతుపీకె ముందుకంటె విశేషముగా వుబికియుండును. మరియు ప్రత్యేకమగు అవయవములను తాకుటవలన అందు నొప్పి అధికముగానుండును. మరియు రోగి తలయెత్తి చూడగలుగును గాని కుడి యెడమ వైపులకు చూడజాలకుండును. మరియు నోరు తెరువజాలకుండును. మొదటిపూసగాని రెండవపూసగాని జారిపోయినచో రోగి అదినమే మృతినొందును. ఎందుకనగా యీనరములనుండి శ్వాస

రాకపోకల మార్గముగలదు. అట్టిమార్గము నిలిచిపోవును. మరియు వాటిగొట్టి మెత్తని నరము ఆరెండు పూసల మధ్యనుండి వుత్పన్నమైనది. యేదైన వక పూసతప్పి పై రెండుపూసలు ఆరోగ్యముగానున్నచో తప్పిపోయినట్టి పూసను స్వస్థానమునకుచేర్చినమెడల శాశ్వత నష్టముగా నెత లుగుచును. మరియు గొంతువాపు నశించిపోవును. వెనుమెదడు తల వెనుక భాగమునుండి గడ్డమునైపునకు ప్రవేశించును అప్రవేశించు మెదడునకు చెమ్మప్రవేశించజాలకుండును.

**మెడపూసలు తప్పిపోవుటవలన కలుగు కంఠవాపు చికిత్స.**

మెడపూసలు తప్పిపోవుటకు కారణము దెబ్బతగులుట, పడిపోవుట, వాపు, పీకుట చెమ్మగల మలకారణమువలన కలిగినను అథవా తీక్ష్ణమలము యీపూసలయందుచేరి యీరోగమునకు కారణమైనచో నిమ్నం జేహముగా శిరావేదనము చేయవలెను. మరియు విరోచనము చేయించునట్టి ఔషధములు క్వాదములతో శరీరమును మృదుత్వము నొందించవలెను. మరియు గొంతువాపునందు చెప్పబడిన యుక్తకషాయాదులను పుక్కిలించవలెను. మరియు కురుపులై మలము వెడలుటకు మెదరెగమునైపులు కత్తితో గంట్లువేయవలెను.

మరియు వాతము జారిపోవునట్టి సిరి యీరోగకారణమైనమెడల విరోచన ఔషధములు లాభదాయకమగును. గాని రక్తమోక్షణము చేయునవసరముండదు.

మరియు, శుష్కత్వము యొక్క కారణమువలన మెడ కుదెబకుట లాగుట గొంతు నొప్పి మొదలగు కారణములు కలిగినచో చెమ్మ ప్రాప్తించునంతలో రోగి మృతినొందును. మరియు, ఈ రోగముతో తప్పించుకొనుటకు ఆశయుండదు. మరియు, కారణము నష్టమొందిన తరువాత వ్రేలితోగాని లేక ఆయుధముతోగాని లేక శస్త్రము చివరతోగాని లేక యీ పనివిషయమై యేర్పరచబడిన ఆయుధముతోగాని పూసలను వాటి స్వస్థానమునందు చేర్చవలెను మెద

పూస తిరిగి నిజదశయందు వచ్చుటకు మలమును ఆక్రమించునట్టి వస్తువులు అనగా మూరాన్ (అంజీరుకర్రలోని బెరడు) జాలింతబోలు కర్పూరము, మజునాంబరము, సణేస్, మోఖి యీ మొదలగు వస్తువులు మెత్తగానూరి సరేను, ఇసపగోలు విత్తులు, ఆబ్ (గుజ్జు) నందు కలిపి యీ చూర్ణమును అందు కలిపి పూసపైని లేపనము చేసినయెడల ఆపూసలు నిజదశయందుంచినటుల కాపాడును. మరియు, వ్రేలితోనున్న ఆయుధముతోనున్న కదలించకూడదు అనగా అంతకు ముందు యేస్థలమునందు పూసతప్పిపోవుటవలన గుంటకలిగిన యెడల మలమును ఆక్రమించునట్టి ఔషధమును లేపనముచేయవలెను గనుకవలన పూసపీక్కబడి నిజస్థానమునందు చేరును ఔషధమువలన సరియైన స్థితియందు రాగలిగినప్పుడు వ్రేలితో ముట్టుకొనుట ఆయుధముతో ప్రుక్కొనుట మంచిది కాదు యెందుకనగా అచ్చట వాపుయుండి ఆయుధముతో వ్రేలితో తాకుటవలన కష్టము సంభవించును.

మరియు, హాకీము తిబ్రిగారు వచించినదేమనగా ఒక పిల్లవాని మెడపూస తొలగిపోయినది. వానిదాయి ఒకసన్నని చర్మము కిర్ (ఒక తడిగల వస్తువు దీనిరంగు నలుపు కలిగిన యెరుపురంగుగా నుండును.) ఆచర్మమునకు పూసి యెండలో నునిచి అప్పుడు కిర్ మెత్తబడి కరిగిన తరువాత ఆపిల్లవాని మెడపైని వేసినది యీచర్మము యెండగనే ఆమెడపూస నిజదశయందు సహ్యముగా వచ్చినది. అస్థలమునందు కొమ్ము తగిలించి నోటితో బలపూర్వకముగా లాగుటవలనకూడా పూస సరిగా నిజదశయందు వచ్చుచున్నది. కాబట్టి చికిత్సవలనకూడా యికార్యము సాఫల్యమగుచున్నది. అనగా జుబహ (గొంతుపీక) యొక్క వాపువంను వర్ణించబడును.

మరియు, గొంతు వాపునందు ఉనికమని తోచినయెడల వాపును గుప్తనళ్లాతో చీల్చివేయవలెను. మెడపూసలు తొలగుటవలన గొంతువాపు ఉత్పన్నమైనచో నాలుగు దినములు వ్యాతిరేకమై చేతులు

కాళ్ళు తిమ్మిరికలుగకూడదు. వాని జ్ఞానశక్తి నష్టమొందకూడదు. అట్లు నష్టమొంది తిమ్మిరి మొదలగు దుర్గుణములు తటస్థించిన యెడల రోగి జీవించుట అసాధ్యమగును. గాన సావధానమగుఅంశము అనఁగా నాలుగవదినము తరువాత శిరావేదనము విరోచనచికిత్సలు చేయవలెను ఎటులననగా సునాళికలవి సమస్తగొంతు వాపులలో క్షారమైనది ఇది నాలుగు దినములలోపుగా రోగిని వైవశ్యత పట్టణమునకు పంపి వేయును.

(సూచనీయము) గొంతువాపునందు యావత్తు ఉపాయములు చికిత్సలు మొదలగునవి చెప్పబడియె. ఈ మొదలగు వానివలన ప్రయోజనము కలుగని యెడల శ్వాస ఆడనికారణమువలన బ్రతుకుటకు నిరాశకలిగినచో ఆరోగిజీవించడమే భయము కలిగినప్పుడు గొంతుచీల్చుటవలన కించిత్తు బ్రతుకగల ఆశయుండవచ్చును చీల్చునట్టి విధానము రోగి తల వెనుక వైపునకు విరిచి గొంతుపైనుండు చర్మము ఆయుధముతోయెత్తి గొంతుతో వేరుచేసి దానిని చీల్చివేయవలెను. మరియు, నూపిరి తిత్తులముఖము యొక్క రెండు ఆవర్ణముల మధ్య ఒక బంధనముకూడా యీ చర్మపుకోతతో సమానముగా వేరుచేసి చీల్చి వేయవలెను. దీనివలన రోగి శ్వాసను పీల్చగలుగును కాఁబట్టి మృతినొందునను భయము కలుగదు. మరియు, తరువరి మెడవూసలయందుగల వాపు యొక్క సమీపాయముతో నిశ్చింతకలిగినచో కొంత కోయుటలో పొర, పీకెగొట్టమునకు యెంతమాత్రము దెబ్బతగుల కూడదు. మరియు, బంధనములయందు వాపు ప్రవేశించినచో ఇట్టి రోగికి చికిత్స చేయకూడదు.

(3) దీనిని జుబహా (గొంతుపీకె) యొక్క వాపు అందురు. ఇది పీకెసంబంధమగు రెండు కండరములయందున్న అన్నవాహిని మార్గము యొక్క ముఖమునందున్న పీకెయందున్న కండరములు కంఠమునందు ఘ్రాణమగు నీచరక్తకారణమువలన వాపు పుట్టున్నమగును దీని లక్షణ

ములు అనగా రోగిమాట్లాడ జాలకుండుట కండ్లు బైటికివచ్చుచుండుట నోటివెంట సొంగకారుట యేవస్తువును మ్రింగ జాలకుండుట, జలవంత ముగా మ్రింగినను క్రిందికి దిగక ముక్కువెంట బైటికి వచ్చుట ఒకప్పుడు మిక్కిలి పరిశ్రమవలన కొంత భాగము గొంతులో దిగిన యెడల యీ రోగమునందు మలము లోవలనుండి బైటికి వెడలుచున్నదని గ్రహించవలెను గొంతు పైభాగము అర్ధచంద్రాకారముగా మెరిని వాపు కుడిచెవినుండి యెడమచెవి వరకు నుత్పన్నమైయుండును. ఇందువలననే యీ రోగమునకు జుబహా (గొంతుపీకెవాపు) అందురు యీ యెరుపురంగు కలుగుట సరియగు లక్షణమేయగును అనగా మలము లోవలనుండి బైటికి వచ్చుటమిక్కిలి సుగుణమగును గొంతుపీకె వైద్యమతమునందు ఊపిరితిత్తుల తలయని అర్థము. మరియూ, దీనితల అవర్ణమునకు గుల్సుమాఅందురు హంజరా అనగా ఊపిరితిత్తుల ముఖమందురు. ఇది మెత్తనిశల్యముతో నేర్పబడినది. మరియు, శబ్దమునుపూర్తి చేయుటకున్ను శ్వాసను ఆపుటకున్ను యేర్పడిన అవయవము. ఇది మెత్తె మూడుశల్యములతో కలిసి యేర్పరుచబడినది.




(1) గడ్డముక్రింద పీకెయందు చూపబడుచున్నది. వ్రేలితో తాకి చూచిన తెలియగలదు దీనిని వర్కీ (ఢాల్) అందురు. దీనిమూలమునాలుక మూలముతో కలిసియున్నది. ఊపిరి తిత్తుల ముఖము బంధించునట్టి సమయమునందు తలను కంఠమువైపు యుంచుచున్నది. దానిపైని అనగా కంఠముపైన పడియుండునాభుజించుపదార్థములుదానివెనుకవైపునుండి వెళ్ళిపోవుచున్నవి.

(2) నిది మెత్తనిశల్యముఇదిడాలువలె




మెడపైన యుంచబడినది. మరియు దానితో కలిసియుండును. దీనికి యేమినామమును. విధించియుండలేదు. ఇది ఊపిరితిత్తుల ముఖమును బంధించబడినచో దీనితల నాలుక మూలమునందు వద్చిచేయుచున్నది.

(౩) ఇదికూడా మృదువగు శల్యము నిది గ్రాసము మొదలగు పదార్థములు మ్రింగునప్పుడు ఘర్షణములు ఊపిరితిత్తులముఖముపై నడ్డముగా పడిపోవును. ఇటులపడుటవలన నేమియు ఊపిరితిత్తుల ముఖమునందు ప్రవేశించజాలకుండును. ఇందువలననే దీనిని వఖజ (డాల్) అనుచున్నారు. భోజనపానాదులు దీనివెనుకవైపునుండి వెళ్ళుచున్నవి. ఎంతవరకనగా పీకె గొట్టము అనగా భోజనపదార్థములు దిగునట్టి మార్గమునుండి ఆమాశయములో ప్రవేశించుచున్నవి. మరియు పానములు చేయు సమయమునందు కొంచెములేకనే లేచిపోవును. ఏదైన గతి సంభవించిన వూపిరితిత్తులు తెరువబడుచున్నది. అట్టిస్థితియందు భుజించిన పదార్థములలోనుండి కించిద్భాగము వూపిరితిత్తుల గొట్టములో ప్రవేశించుచున్నది. అట్టిస్థితియందు ఆవస్తువు వెళ్లిపోకుండిన దూరపరచునట్టి శక్తియొక్క కారణమువలన దగ్గు కలిగి హంజరా (వూపిరితిత్తిముఖము) యొక్క ముందుభాగము ముఖముందుభాగమునందు ఒకశల్యముకలదు. దీనిని వైద్యులు అజముల్లా అనివాడుదురు. ఎందుకనగా దీనిస్వరూపము యూనానిలాం అను అక్షరమువలెనుండును. ఈ శల్యమువలన ప్రయోజనము అనగా పీకెనరముల బంధనము దీనినుండియే ఆరంభించినవి మరియు పీకె గొట్టమునందు ఒకఅంగముగలదు. అది మూసికొనుట వికసించుట మొదలగు కార్యములను చేయుచుండును. వీలుకలిగించుచుండును. దీనివలననే శబ్దము నుత్పన్నమగుచుండును. మరియు పీకెలోపల స్నిగ్ధమగు జిగురుగల రతూబతు అనగా చెమ్మకలిగియున్నది. ఇది గొంతుపీకెను ఎల్లప్పుడున్ను ఆరిపోకుండునటుల చెమ్మ కలిగించుచుండును. మరియు యీచెమ్మవలననే శబ్దము వైటికి వచ్చుచుండును. రతూబతు అనగా నీరు శుష్కించినచో గొంతులో చెమ్మ కలుగునంతవరకు శబ్దము రాజాలకుండును. ఇటుల కొందరికి తపెమొహర్రికాయొక్క దశయందున్ను మిక్కిలి వూష్ణగాలి యుండును ఇట్లు తటస్థించగలదు.

## కంఠవాపుచికిత్స.

ఈవ్యాధియందు శిరావేదనము చేయవలెను. మరియు కంఠము
నందు కలుగు రక్తజవాపునందు చెప్పిన యుపాయములతో రక్తమును
తీసివేయవలెను. మరియు విరోచన ఔషధములతో శరీరమును మృదు
త్వము నొందించవలెను. ఉష్ణము కలిగించునట్టి సదుపాయములు చే
యుచు అప్పుడప్పుడు రక్తమోక్షణము గావించి రోగి శక్త్యానుసారము
గా 17½ మాషములు మొదలు 35 మాషముల వరకు రక్తమును వెడ
లించవలెను. ఎల్లప్పుడు శరీరమును మృదుత్వము కలిగించవలెను. దీని
వలన శక్తికూడా నిలిచియుండును. మరియు పథ్యయోజనముకూడా శ
ద్ధించును. ఏదైన తినవలసివచ్చినచో యవగంజి స్వల్పముగా నియ్య
వలెను. శరీరమునందుండు మలము వెడలిపోయినచో మలమును తీసి
వేయునట్టి ఔషధములు అనగా కటుకరోహిణి, పాపడిలవణము, జాక్న
గంధకము, ఈమొదలగునవి గొంతుపైన లేపనము చేయవలెను.
ఎందుకనగా మలమును బైటిపైపునకు నీడ్చుకొనివచ్చునెడల రెండవ
భేదమునందు చెప్పినయుపాయములను చూచుకొని అందుచెప్పిన సదుపా
యములవలన ఔషధములతోను వైద్యులు దశానుసారముగా నుప
యోగించగలరు ఆఔషధములును ఉపాయములును పలుమారు వర్ణిం
చియున్నవి. మరియు నీరోగి యేదైన తినగలవస్తువులను మ్రింగుటకు
కఠినమైనచో నిటువంటి యుపాయములవలన మ్రింగుటకు సహాయ
ము చేయవలెను. అనగా గుటక వేయుటకు కష్టముగానున్నచో మెడపూ
సపై శృంగియంత్రముతో రక్తమును తీసివేయవలెను. ఈయుపాయము
వలన మార్గము విశాలమగును తిరిగి కొమ్మునందు రక్తము తీసినయెడల
ద్రవపదార్థము మ్రింగుటకు యోగ్యముగా నుండును.

(సూచనీయము) హకీం రాజీగారు వచించినదేమనగా బలహీన
మై (చిక్కినశరీరము) న శరీరముగలవాని శ్వాస విశేషముగా బిగబట్టి
నచో నాళమ్నతియందు శిరావేదన చేయకూడదు, రోగిని చల్లనిగృహ

మునందుంచవలెను. అనగా గొంతు బిగువు తగ్గునట్లు ఉంచవలెనని భావము. ఈ యుపాయమువలన రోగి భుజించకుండిన ఇరువది దినముల వరకు జీవించగలుగును. మరియు గొంతుబిగించుట, శ్వాసపట్టు బట్టుట యద్యాపి అధికమైనను నిస్సందేహముగా నీకార్యము వలన విడిపోవును. మరియు మిక్కిలి చల్లని స్రావము అగ్నికర్మచేయుటకున్న ఆంలి, దాహమునకున్న అపిపేయును. మలము కూడా పచనము నొందుచున్నది. దీనిని మాన్పుటవలన శరీరరక్తమునకు బాధదాయకమగును. దీనికి విరుద్ధముగా శిరావేధ చేయవలెను. మరియు విశేషముగా రక్తమోక్షణము చేయించవలెను. ఎందుకనగా యుక్తిజ్ఞయుండు భోజనములేక మూడు దినములు జీవించుట కఠినముగా నుండును. కాబట్టి ఈ కారణము వలన ప్రాచీనవైద్యులు యీ నియమాలను వర్ణించరైరి. మరియు ఈ గొంతువాపు అథవా శ్వాస బిగబట్టుటయందు శిరావేదనము చేయుట యోగ్యముగా నుండును. దీని చికిత్స రక్తమోక్షణము చేయుట తప్ప ఇతరము లేమియు చెప్పియుండలేదు. ఈ హేతువువలన హకీంరాజిగారి అభిప్రాయము దుర్బలము నొందినది. ఎటులననగా వారి వాక్యము నిచ్చట నిలిచినది. అనగా నేను పూర్వపువైద్యుల మతమునకు విరుద్ధముగా ఖునాకు (గొంతువాపు)యొక్క చికిత్సయందు భయపడుచున్నాను. మరియు ఇచ్చట సందర్భము ప్రకటనమగుచున్నది. అనగా కష్టము కలిగించునట్టి మలము తీసివేయుట అత్యుత్తమము. యద్యపి కొద్దిగానైనను మలమును తీసివేయుటకు ఆజ్ఞ యివ్వబడినది. అనగా మలము విశేషముగా నుండిన యిచ్చట హకీంరాజిగారు శిరావేదనచేయుటవలన కలుగుహాని ఈవిధముగురోగికిదివరకు చెప్పినచో ఇచ్చట ఆసనుయము నందు నిశ్చయమైనది. ఇట్టిస్థితియందు రక్తము వెడలించుటలో విశేషముగా వెడలించవలెను. యే వైద్యుడుకూడా ఇటువంటి సందర్భమును చేయకుండును. ఇది ఉత్తమాంశము. దీనియందు ముందుగా పూర్వపు వైద్యులందరి మతము ఒకటిగా నున్నది. వెనుకటి ప్రాచీనవైద్యుల

కూడా యీఅంశమును అంగీకరించి వర్తించువారు జుబహా (పీకె) యొక్క వావునందు ఖునాక్ (గొంతువావు) ఈరెండువావులు నొకే మల దోషమువలన కలుగుచున్నవి. ఈమలము విస్తారముగా చేరుట వలన మరియు రక్తమునువృద్ధినొందించునట్టి పదార్థములు అనగా మాంసములు, మిఠాయిలు మొదలగునవి భుజించుట, మధుపానముచేయుట యీమొదలగు వానివలన నుత్పన్నమగుచున్నది. పీకెవావు కలిగించు నట్టిమలము దగ్ధమైయుండిన రక్తమైనచో శ్వాసకు విశేషముగా బిగబట్టుట ఉష్ణముతో కూడా కలుగుటయే దీని చిహ్నములగును.

గొంతు పీకెవావు చికిత్స

కీఫాల్ యొక్క శిరావేదనచేయవలెను. మరియు, రోగి బలము గలవాడైనచో రక్తము విశేషముగా తీసివేయుటవలన అపాయము కలుగనేరదు. మరియు, ఉన్నాబ్ నూరి లేపనముచేసి గులాబిపూలు బేదానాలు లవుకీకు గింజలపప్పు మొదలగునవి రాత్రి నీళ్ళలోగాని లేక కామంచాకు రసమునందుగాని నానవేసి ప్రాతఃకాలమునందు ఆనీళ్ళు వడియబోసి బనప్షాషరబతుగాని, కలువపూల షరబతుగాని, పూతి పండు షరబతుగాని కలిపి ప్రతిదినము పానముచేయించవలెను. మలము ను వెడలించవలసిన అవశ్యకమైనచో ఫలముల కషాయముతో శరీరమ లమును వెడలించవలెను. ఎండిన చిరిసెనగలు, కామంచాకు తియ్యని బేదానాకాయలు పూతిచెట్టు ఆకులు యీవస్తువులు నీళ్ళలోవేసి కషాయముకాచి పుక్కిలించవలెను. మరియు, రేల, ఎండించిన కామంచాకు వంటదేగురు, ,రసాంజనము యీవస్తువులు నీళ్ళతోనూరి గొంతుపై లేపనము చేయవలెను. ఒకరోగికి యీచికిత్సవలన ఆరోగము తగ్గినది కాబట్టి ఇది అనుభవసిద్ధమైనది గాన చదువరులు గ్రహించగలరు.

(4) ఈ అంగములవావు యొక్క వర్ణనము అనగా రెండవ కారణమువలన పూడిపోవుట తటస్థించును. ఈ కారణమువలన రోగము స్వల్పముగా నుత్పన్నమగుచున్నది. అందువలన అనేక గ్రంథముల

యందు నీరోగము యొక్క లక్షణములు వదలిపెట్టిరి గానియీరోగము ఏడు భేదములుగా చెప్పబడినది.

(1) గొంతుపీకను వికసింప జేయునట్టి నరములు బలహీనమగును కాబట్టి ఆనరములు కదలుటకు నడుచుటకు అస్వాధీనమై యుండును. గాని వాపు మాత్రము కలుగకుండును. ఇచ్చట తెలియజేయుచున్న దేమనగా ఆనరములయొక్క చలనము నశించినచో మార్గము చిన్న దగును. మరియు, ప్రయోజనాను సారముగా శ్వాసరాజాలదు

(2) పీకె లోపలినరములయందు మిక్కిలి శుష్కత్వము ఉత్పన్నమైన కారణమువలన శ్వాస పీల్చజాలకుండును. మరియు, శ్వాసను లోనిభాగమునకు లాగికొనుట దీని పనియైయున్నది. ఈకారణమువలన మనుజుని శ్వాసయందు బిగింపు సంభవించును. యద్యాపి మార్గము వికశించి యుండినను గాలిపీల్చుటకు కష్టముగానుండును.

(3) ఊపిరి తిత్తులు ఉబ్బుటవలనగాని లేక చీముపట్టుటవలనగాని అనగా వూపిరి తిత్తుల రంధ్రములయందు చీముత్పన్నమగును. కాబట్టి గొంతువూడి పోవుటకు కారణమగును.

(4) ఆమాశయమునందుగాని, ప్రేగులయందుగాని, మిక్కిలి క్రిమివుత్పన్నమైన కారణమువలన శ్వాసయందుకఠినత్వము సంభవించును

(5) ఆమాశయమునందున్న సన్నప్రేగునందున్న మరియు నిట్టి స్వాభావికముగల అంగములయందున్న రక్తము నిలిచిఆరిపోవును. గాన శ్వాసవచ్చుటయందువగ్రమము సంభవించును.

(6) గొంతుయందు వాపుకలిగించునట్టి ఔషధములు సేవించుటవలన ఆఔషధప్రకృత్యానుసారముగా గొంతువాపు ఉత్పన్నమగును. అనగా నమూరోగ్ (కుబిని) తినుటవలన యితరవిషసంబంధమగు ఔషధములు సేవించుటవలన గొంతువాపు కలుగుచున్నది.

(7) స్నానము, శ్వాసనుబంధించునట్టి కారణమగును. మరియు ప్రత్యేకభేదముగాకై ఒకలక్షణముకలదు, అనగా నరములు కదలకుండిన

మనుష్యునికి బాహ్యమునుండి గాలి పీల్చుటకు శక్తి చాలకుండును. ఇటులనే లోపలి భాగమునందుగల నరములు శుష్కించి మొదల యీనరములయొక్క శుష్కత్వకారణముకూడా ముందుజరిగియుండవలెను. మరియు వూపిరితిత్తులయొక్క వాపు, మరియు వూపిరితిత్తులయందు రొమ్ముయందు చీము ఘనీభవించుట క్రిములుత్పవించుట రక్తము నిలిచికరిపోవుట శ్వాసబిగబట్టుట మొదలగు కారణములు గొంతువాపు కలుగుటకు కారణమైనచో ప్రత్యేకమగు వర్ణనమువలన ఆయాస్థానములయందు వ్రాయబడియున్నవి. గాన తెలిసికొనవలెను. మరియు వెంటవెంట స్నానము మరియు కుల్బీ సేవన యీమొదలగునవి చిహ్నములను కలిగించునంత బలముగలవికావు. గాన చిహ్నములు చెప్పవలసిన అగత్యము కనుపించనేరదు.

## కంఠవాపు చికిత్స

రోగహేతువును దూరపరచుటకై పరిశ్రమచేయవలెను. శ్వాసబిగబట్టుట అథవా గొంతువాపు వెంటవెంట స్నానముచేయుటవలన వుత్పన్నమైనచో నిమ్మకాయపచ్చత్తు నారింజకాయపచ్చత్తు వీనితో చికిత్స చేయవలెను. మరియు గొంతుకకు బిగుతగ్గి నీరసముగానుండిన రెండవకారణమునందు వర్ణించబడును. మరియు శబ్దహీనముగు గొంతువాపునందు జబహా (పికె) వాపునందు వైద్యులు పరస్పరభేదముగా చెప్పియున్నారు. వాటియందు యేదైన యిటువంటి వాపు పీకపై నరములయందుగాని వూపిరితిత్తుల ముఖమునందుగాని లేక భోజనమార్గము లోపలగాని లేక దానిపైగాని యుత్పన్నమైనచో ఖునాకు అని చెప్పబడును. మరియు సుణ్ణవాపు నాలుకమూలమునందు రెండుమాంసఖండములలో నుత్పన్నమైనచో జబహా అందురు. మరియు కామిలుసనాహా అను గ్రంథమును వ్రాసినవారున్న దీనిని ఆచరించువారున్న పైఅంశములను అంగీకరించిరి. కొందరు వైద్యుల మతమునందు వాపు, పికె పై భాగముయొక్క నరములయందు ఉత్పన్నమైనయెడల అదియె ఖునాకు అను

కఠినభోజనపదార్థములు భుజించినచో నీగుల్లలు గొంతు పీకయం దుండినచో పీక లోపలకు వెళ్ళునప్పుడు నొప్పికనుపించనేరదు గాని మాట్లాడుటకున్ను పొగ దుమ్ము మొదలగు పదార్థములు గొంతులో ప్రవేశించుటవలన భుజించుటకున్ను నములుటకున్ను కష్టముగానుండును మరియు, శబ్దమువచ్చునప్పుడుకూడా కష్టముగానుండును. మరియు, శబ్దము వచ్చినప్పుడుకూడా భేదముగానుండును గుల్లలుమెచ్చుటలేచినచో ఆ స్థలమునందు యెల్లప్పుడు నొప్పి మంట కలిగియుండును.

## ఉష్ణగుల్లల చికిత్స

బానల్ గాని లేక అకహాల్ అనునరములను ఛేదించి రక్తమోక్షణము చేయించవలెను. మరియు, యవగంజి నిశాస్తా బనప్షా తైలముతో చేయబడిన గంజి మొదలగు వానిని ఇప్పించవలెను. దీనివలన మంట శాంతించును. మరియు, చల్లని జలపానము వర్జించవలెను. ముఖ్యముగా నీగుల్లలు చితికి వ్రణములైనచో ఫలాదుల రసము వలన శరీరమునకు మృదుత్వము నొందించవలెను. మరియు, రోగికి రాత్రి సమయమునందు ఇసప్గోలువిత్తులతో తయారు చేసిన గోరువెచ్చని గంజినివ్వవలెను. మరియు, భుజించుటకు యోగ్యమగు పదార్థములను గ్రహించి రోగికి యివ్వవలెను. మరియు, శుష్కపదార్థములు, పులుసుపదార్థములు, తీక్ష్ణపదార్థములు కేవలము వర్జించవలెను. ఈ సమయమునందు మలమును పక్వపరచ వలసిన అగత్యముకలిగినచో గొంతువాపునందు మలమును పక్వపరచునట్టి చికిత్సలను చెప్పియుంటిని ఆ చికిత్సను ప్రయోగించవలెను. మలము పక్వమునొంది కఫ్ఫైతోకూడా చీముకలిసి వెడల నారంభించినచో గొంతువాపు బద్దలైన తదుపరి ఉపయుక్తముగానుండు నుపాయములను వెనుక చెప్పియుంటిని కాబట్టి వానిని ఇందుపయోగించుకొనవలెను గుల్లలయొక్క మలము పక్వమొంది కఫముతోకూడా చీమువెడల నారంభించిన మొదల తేనె నీళ్ళలోకలిపి పుక్కిలించవలెను. మరియు, పున్నాబ్ జనప్షా, యష్టిమధు

కము యీ మొదలగునవి రాత్రివేళ గౌజబాన్ అర్కముతో నానవేసి రెండవదినమునందు వడియగట్టి బనప్షా షరబతు కలిపి ప్రతిదినము ప్రాతఃకాలమునందు రోగికి పానము చేయించవలెను. మరియు, యీ క్రిందవివరించిన ఔషధమును నోటిలోనుంచుకొని సారము మ్రింగు చుండవలెను.

నోటిలోనుంచుకొను మాత్రలుచేయు క్రమము.

అతిమధురము, తుమ్మబంక, కతీరాగోంద, (బాదంజిగురు) ఖత్మిగింజలు, దోసగింజలపప్పు, వంటిదోసగింజలపప్పు, యీవస్తువు లను చూర్ణించి వస్త్రగాలితముచేసి బిహిదానాగోలుగింజలగుజ్జుతో మాత్ర లు చేయవలెను.

పుక్కిలించునట్టిక్రమము.

జలదా యెండిన పాదినా, కామంచాకు, చివ్వన యష్టిమధుక ము, తెల్లకాసు, యీమొదలగునవి నీళ్ళలోవేసికాచి పుక్కిలించవలెను. నిది నోటి గుల్లలయందు మిక్కిలి ప్రయోజనకరముగా నుండును.

మరియు రోగాంతమునందు మలము వెడలనారంభించిన చో కొంచెము సెనగవులును గోరువెచ్చని నీళ్ళలోకలిపి కొద్దికొద్దిగా పానముచేయవలెను, దీనితో పుక్కిలించవలెను. దీనివలన ఆస్థలమునం దుండు మలినము కడుగబడి పరిశుభ్రత నొందును. మరియు సెనగవు లునువలన కష్టము కలిగినయెడల గుల్‌రోగనాగాని బనప్షాతైలముగాని అవిసిగింజలగుజ్జుగాని పానముచేయవలెను. వాటితోనే పుక్కిలించ వలెను. మరియు వ్రణము గుల్లలనొప్పి తగ్గిపోవుటకై మైనపరకుగాని మరహాంలబియజ్ (ఒకసంయోగికఔషధము) కేవలము ప్రత్యేకము కోడిగ్రుడ్డుయందుకలిపి వెచ్చచేసి కొద్దికొద్దిగా పానముచేయవలెను. నోటిలోకూడా యుంచుకోవలెను. మరియు గొంతులోలేచునట్టి గుల్లలు మిక్కిలి కఠినరోగమును కలిగించును. ఎటులననగా నిది మెత్తని శల్యము పొరలోనేర్పడియున్నది. కాబట్టి యిట్టిస్థితియందు ఆస్థలమునందు

టనుండి కదలుచుండును. మరియు అంగిలినుండి ముక్కుపైపునకు వచ్చినచో రోగికి మెడకు ముందుభాగమునందు భారముగానుండినటుల తోచుచుండుట నాసామార్గము బంధించుట మొదలగు లక్షణములు కలిగియుండును.

అంగిలియందుండు జలగను వదలించు చికిత్స.

జలగ కనుపించుచుండిన దానిని పట్టుకారుతో పట్టుకొని తీసివేయవలెను. దీనిని తీసివేయుటకు ముఖ్యముగా నుండు * ఆయుధముతో తీసివేయవలెను. దీనిని తీసివేయు క్రియను రోగి సూర్యునికెదురుగా నోరు తెరచి యుండవలెను. నాలుక క్రిందికి అణచియుంచవలెను. జలగ తల బైటికి కనుపించుటకు వీలుగా నుండునటుల నోరువిప్పి యుండవలెను. తదుపరి చికిత్సకుడు ఆ ఆయుధముతో గాని, పటుకారుతో గాని, జలగతలను పట్టుకొని అణచి కొంతవరకు యుంచవలెను. దీనివలన ఆజలగ నీరసమునొందును. కాబట్టి ఆజలగ పట్టుకొనియుండు స్థానమువదలివేయును. తరువాత నెమ్మదిగా బైటికి నీడ్చివేయవలెను. ఇట్లు తీయునప్పుడు జలగ తెగి, అచ్చటనే అణగియుండినచో గొప్పవిపత్తు సంభవించును. అనగా వాపు కలిగించును. కథాచిత్ అచ్చట కొంత ముక్క శేషించియుండి ఆమాశయమునందు ప్రవేశించి దానియొక్క నీచత్వము విషదోషముయొక్క కారణమువలన రక్తవమనము ఆమాశయమును చివ్వివేయుట (దోకుట) వుత్పన్నమగును. జలగను వదలించుటకు ముందుగా సెనగవులుసుతో సున్నకలిపి, శిరకాలో ఇంగువకలిపి పుక్కిలించవలెను. దీనివలన ఆజలగ నీరసమొంది తీసివేయుటకు మిక్కిలి ఉత్త

---

*ఇది స్త్రిమణమువలె పొడవుగను దానిరెండు పెదవులు జవగారువలె సంద్రముగను దాని అంచులు రంపమువలె పండ్లుకలిగి యుండును. ఈఆయుధము అంచులు రంపముయొక్క పండ్లవలె నుండుటవలన జలగ దానితో పట్టుకొనినచో జారిపోజాలదు. దృఢముగా పట్టుపట్టును. గాన రంపమువలె పండ్లు యుండుటవలన వుపయోగమని గ్రహించవలెను.

ఎండిపోవును. మరియు పైపైవు బిగించుకొని పోవును. ఎటులననగా పొరలు, జీవనరములు, వీటికవి తన్మూలమ వుత్పత్తి అయినవైపు బిగిసి కొనుచున్నది, మరియును యీపొరయొక్క ఉత్పత్తి పైపైవునున్నది. దీని చిహ్నములు అనగా రోగికి జ్వరము ఎల్లప్పుడు నిలిచియుండుట ఎల్లప్పుడు కిరికముగా నుండునటుల తోచుట, మరియు ముఖమునుండి నాలుక బైటికి రాజాకుండుట, మరియు కండ్లు బైటికి వెడలివచ్చుట, మరియు దగ్గలేకపోవుట, బలవంతముగా దగ్గుకలిగినచో అచేతనుడగుట మరియు, శ్వాసకంఠములో నిలిచిపోవుటమతిహీనుడగుట, స్మృతిహాలేనిమాట్లాడుట, ఎటులననగా మెదడు, పొర, రొమ్ముయొక్క పొరతో సంబంధము కలిగి యుండును. మరియు నాడి కఠినముగా నుండును.

### అప్రకృతిక శ్వాసచికిత్స

చెమ్మను కలిగించునట్టి వుపాయములను చేయవలెను. అనగా ప్రతిదినము ప్రాతఃకాలమునందు యవగంజి, నేతిబీర, మరియు పుచ్చకాయనీళ్లు చేర్చి కాచి, బనప్షామంబతు కలిపి పానము చేయవలెను. మరియు యవగంజియందు బాదంనూనెగాని, సొరగింజల తైలముగాని కలిపి చక్కెరచేర్చి పానముచేయుట అతివుత్తమముగా నుండును. మరియు పచ్చిబనప్షా, పచ్చిసొరగింజలపప్పు, ఇసబ్గోలుగింజలగుజ్జు, పుచ్చకాయనీళ్ళు, యీమొదలగువానినికలిపి రొమ్ము, ప్రక్కలపై లేపనము చేయవలెను. మరియు, బనప్షా, ఖిత్మి, కలవపూలు, మొదలగునవి కషాయముగాచి తొట్టిలోవేసి అందులో రోగిని కూర్చుండబెట్టవలెను. భుజించుటకు పుచ్చకాయ పండినసొరకాయరసము పన్నీరు చేర్చియివ్వవలెను. మరియు, తియ్యదానిమ్మరసము బాదంనూనె గలిపి గాని ఇసబ్గోలువిత్తులగుజ్జు పన్నీరు చేర్చి గాని అర్ధాంశముగ వేయించిన కోడిగ్రుడ్డు, పాలకూరరసము, నెయ్యి, పెసరపప్పుకట్టు, బాదంనూనె, చేర్చి, భోజనపానాదులయందుపయోగించవలెను. మరియు, అప్రకృతిక శ్వాసభేదములలోనుండి దేనికారణము వుష్ణాధిక్యము వలన సంభవించిన దా

నిశ్వాసముచుండు గాలిని శుష్కత్వము, చెమ్మ కలిగించుమార్గములు చేయవలెను మరియు, దీని చికిత్సకూడా యిటులనే చేయుట యోగ్యమగును.

(2) వ భేదము దీనికారణము చిక్కని చెమ్మ జలుబువలనగాని లేక వలచని దోషముయినయెడల బింబివచ్చునట్టి శ్వాసయందు చెప్పిన చికిత్సలు చేయుటుత్తమము. అనగా రోగి ప్రకృతానుసారముగా చికిత్సచేయవలెనని భావము.

మరియు చల్లని ప్రకృతి కలవానికి ఆరంభమునందు పాలతోకూడా చక్కెరచేర్చి పానము చేయించుట లాభదాయకమగును.

వాతసంబంధమగు మాందోష కారణమువలన కలిగినయెడల ఆరంభమునందు వచ్చిసోపురసములో చక్కెరచేర్చి పానము చేయవలెను.

మరియు రొమ్ముయొక్క నరములు దుర్బలము జై దుటవలన యీరోగము కలిగినచో నర్గిస్ చంబేలి తైలములను మర్ధించవలెను.

మరియు యేరోగియొక్క జీవనరములయందు మలము చేరినచో శీహా, అడపిసహావ, అఫ్సన్తీన్, (వకగడ్డిజాతి) యివి ప్రత్యేక మొకభాగము చేదుబాదంపప్పు, శర్కర ప్రత్యేకము రెండుభాగములు యీవస్తువులనునూరి మాత్రిలుచేసుకొని ప్రతిదినము ప్రాతఃకాలమునందు నాలుగు మాత్రిలు పుచ్చుకొని తదుపరి తేనెతోచేయబడిన శికంజబీన్ పుచ్చుకోవలెను.

మరియు లవుకుశ్నాబేజ ఇవి యీరోగమునందు గుణము కలిగించునవి. ఈరోగకారణము పొర ముడుతబడుటవలన కలుగుచున్నదని గ్రహించవలెను. శుష్కత్వమువలన పొర ముడుతబడినయెడల చెమ్మను కలిగించునట్టి వస్తువులను వుపయోగించుట లాభదాయకమగును. మరియు కామిల్లుస్సనాహ అనుగ్రంధమునందు వ్రాయబడిన దేమనగా యీవిధమగు రోగిని ప్రతిదినము బనప్షామర్బతుపాలలోకలిపి కలకం

డచేర్చి పానము చేయించవలెను. ఈక్రిందచెప్పబడిన లేపనలు యీరోగమునందు మిక్కిలి లాభదాయకమగును.

### లేపనక్రమము

క్రొత్తనేతిబీరచెరకుగింజలు సహితముగా దంచి ఇసబ్గోలుగుజ్జు తోనూరి అందులో తెల్లచందనము కాహూగిత్తులు మెత్తగానూరికలిపి లేపనము చేయవలెను.

### కిరాతిచేయుక్రమము

తెల్లమయినమును నేతిబీర తైలములోవేసి కరిగించి పెద్దదోసగా యరసము లౌకికరసము పెద్దపాయరసము, సమానముగా అవశ్యకతా నుసారముగాచేర్చి చక్కగాకలిపి బట్టపై లేపనముచేసి మంచుగడ్డయందు చల్లార్చివేయవలెను.

## దొమ్మ (మేఘరంజని ఉబ్బసము) అనుశ్వాసరోగ లక్షణములు:

ఈరోగము హాయిగా కూర్చుండునట్టి మనుష్యునికి అకస్మాత్తుగా వెంటవెంట శ్వాస వెడలనారంభించును. అనగా పరుగిడుటవలన శ్వాసయెటులవచ్చునో అటులవచ్చునని గ్రహించవలెను. ఈరోగము యవ్వనులకు తీవ్రముగా నుండును. వృద్ధులకు మాత్రము మిక్కిలి కఠినముగా నుండును. ఎటులననగా వృద్ధులకు యీవ్యాధికుదురుట దుర్లభము. మరియు శరాహ్ అస్బాబ్ అను గ్రంథకర్త రూబూ (మేఘరంజని) మరియు జీకుల్నఫ్స్ (శ్వాసకష్టముగా పట్టిపట్టివచ్చుట) మరియు హైహా (శ్వాసమొక్కుట వాచుట) మొదలగు విషయములందు భేదము చెప్పియుండలేదు. అనగా మూటియొక్క అర్థము వకటిగానే వర్ణించబడియె. గాని యితర వైద్యులు జీకుల్నఫ్స్ (శ్వాసబిగబట్టి వచ్చుట) మరియు రూబూ (ఉబ్బసము) నందు భేదభావము చూపుచున్నారు ఇటుల హకీంషేకుగారు చెప్పివున్నారు. అనగా రూబూ శ్వాస కఠినము

గా వెడలుటకు చెప్పుదురు. ఇటువంటి రోగులయొక్క శ్వాసకష్టపడు నట్టి అనగా కసరతుచేయునట్టి మనుష్యుని శ్వాసతో సమానముగానుం డును. మరియు, నిది వేగరము వెంట వెంట చిన్నదిగా వెడలుచుండును. అనగా దీనితో కూడ బిగువు కలుగుచుండును. ఒకవ్వాడు బిగింపు లేకుండును. మరియు, ఇంతిసాబున్ నఫ్స (శ్వాస ఉబుకుట) గట్టిగాపీల్చుట మరియు, శ్వాస బిగబట్టి వచ్చుట మరియు, రుబూశ్వాస ఉబుకుటకు నొక గొప్ప భేదముకలదు గాన దీనిని వేరు ప్రకరణము నందు వర్ణించబడును. మరికొందరు వైద్యులమతమేమనగా శ్వాస కఠిన ముగా వచ్చుటవలన ఫుప్ఫుసము (Lungs) ల నరములు మలముతో నిండియుండునట్టి కారణమగును గాని ఊపిరి తిత్తుల ముఖము లందు లేకుండిన దీనిని బైటి గాలి పీల్చుట రుబూ (Asthma) అందురు. మరియు, ఈరోగముయొక్క కారణము ఊపిరితిత్తుల ముఖము నిండుటవలన కలిగినచో దీనిని నప్సుల్ ఇత్తిసార్ (శ్వాసబిగిసివచ్చుట) అందురు. మరియు, ఊపిరితిత్తుల ముఖముల యొక్క పేరు వైద్యమతమునందు ఉరూకు ఖస్నా (ఊపిరితిత్తుల ముఖము నకె) అందురు. మరికొందరి మతము ఉరూఫ్ఖస్నా అందురు. వీకె మల ముతో నిండిపోవుటకు అర్థముగా వర్ణించుచున్నారు మరియు, బైహార్ (శ్వాస ఎక్కుట, ఊర్ధ్వశ్వాస) శ్వాసకు ఊపిరితిత్తుల నరములు మల ముతో నిండుటకు చెప్పుదురు. మరియు, శ్వాస కఠినముగా వెడలుటకు పదునాలుగు భేదములు గలవుగాని ఇందులో వైద్యులమత భేదములు గలవు కొన్నిపుస్తకములలో పదునాలుగు భేదములుగా వ్రాయబడి వున్నది. గాని పదమూడు భేదములుమాత్రము వర్ణించివున్నారు. గాని రెండవదళయందు రెండవ భేదమును రెండుపర్యాయములు చెప్పినారు మరియు, జన్మనుండి రొమ్ము చిన్నదిగానుండు శ్వాసరోగముతో కలిపి 14 సరిపుచ్చియున్నారు.

(1) భేదము అనగా జన్మమునుండి శ్వాసరోగము కలిగియుండును. ఇందు జన్మమునుండియే రొమ్ము చిన్నదిగా నుండును. గాన శ్వాస పీల్చునట్టి అంగములు వెడల్పుగానుండజాలవు. దీని వుపాయము యేమియు చెప్పబడియుండలేదు.

(2) అనగా వూపిరితిత్తియందు చిక్కని కఫముచేరియుండును. వూపిరితిత్తిముఖములకు ఉరూక్ ఖిస్నా అందురు. దీనిని నిండింపచేయును. అందు బరువుకలిగించును. మరియు కఫము వచ్చుటకు మూడువిధములు కలవు. (1) ఊపిరితిత్తి లోపటి అంగములనుండి కఫము పీల్చుకొనును. (2) కఫము తలనుండి దిగివచ్చును. (3) కఫము ఊపిరితిత్తియందు వుత్పన్నమగును. దీనిలక్షణములు రొమ్మునందు గరగరలాడుట కఫముకరిగి దగ్గు కలుగుట దగ్గినప్పుడు చిమ్మ శ్లేష్మము వెడలివచ్చుచుండును. మరియు శ్వాస కష్టముగా వెడలుచుండును. రోగి కుక్కవలె నాలుక బయటికి తీయుట ముఖ్యముగా అప్పుడప్పుడు చేసినచో ఆదశయందు శ్వాసపట్టుకొనుట నాలుక నోటినుండి బయటికి వచ్చుట దీనిని అరబ్బీ భాషలో లహస్ అందురు, ఈలక్షణములు విశేషముగనున్నచో దగ్గినప్పుడు కఫము వెడలజాలదు, మరియు యీరోగమునకు వెంటనే చికిత్సచేయకుండిన రోగి యితర వికృతులవలన దృఢముగా యుండనేరదు. అనగా (1) పరుండునట్టి సమయమునందు వూపిరాడకుండును. (2) లహమియాఇస్తిస్ఖా (మాంసముగల జలోదరము) నందు యెట్టుల కష్టపడునో అట్టుల కష్టపడునని గ్రహింపవలెను.

## ఉబ్బసము (Asthma) చికిత్స

దోషమును మృదుత్వమునొందించునట్టిన్ని మలమును కరిగించునట్టిన్ని మలమును క్రిందికి త్రోసివేయునట్టిన్ని అనగా జూఫావస్బతు శికంజబీన్ వున్నముగల రసాయనములు వుపయోగించవలెను.

### జూఫాషర్బత్తుచేయు క్రియ

సోపు అజామోదము యివి ప్రత్యేకము 17½ మాషములు యెండుజూఫా 24½ మాషములు అంజూరపండ్లు 20, గింజతీసినద్రాక్షపండ్లు 30, ఉన్నాబ్ లిహాసోడా ప్రత్యేకము 20, మెంతులు 14 మాషములు ఖితమి విత్తులు నల్లసౌసన్ విత్తులు రెండున్ను 10½ మాషములు రాజహంస 24½ మాషములు యీమొదలగునవి యీవస్తువు రెండుశేర్ల నీళ్ళలోవేసి అర్ధావశేషముగా కషాయముకాచి వడియబోసి వకశేరు శర్కర అర్ధశేరు గుల్కండు మెత్తగానూరి పైకషాయమునందు కలిపి తిరిగి పొయ్యిమీద నునిచి షర్బత్తుపాకమువండ దించుకొని అవశ్యకతానుసారముగా ప్రయోగించవలెను.

### ఉష్ణ రసాయనము చేయుక్రమము

సఫాయి అను పుస్తకమునందు వ్రాయబడినది. యిది యీరోగములందు మిక్కిలి లాభదాయకమగును. గింజతీసిన ద్రాక్ష పప్పు అంజూరు యష్టిమధుకము బొకలాకిత్తులు గసగసాలు తియ్యని సారగింజల పప్పు, రాజహంస, సోపు, యెండిన జూఫా, బాదంపప్పు, మెంతులు, ఖితిమివిత్తులు, యీవస్తువులు తేనెలో కలిపి రసాయనముచేసుకోవలెను. మరియు వృష్ణముగల వస్తువులయినను శుష్కత్వము కలుగకుండునవిగా నుండవలెను. ఎటులననగా యేవస్తువు విశేష ఉష్ణస్వభావికముగలదిగా నుండినను అది మలమును చిక్కగను శుష్కత్వమును కలిగించును. గాన మృధువుగను పలచగా నుండు దానిని మాత్రము నష్టపరచును. మిగిలిన మలము గట్టిగానుండి కాండిగ్రించినయెడల వెడలకుండును.

### లవుకు అనగా రసాయనము విధి

అంజూరపండ్లు, మెంతులు, సోపు, సౌసన్ వేరు, ఎండినజూఫా, ఈమొదలగునవి నీళ్ళలో వేశి, మూడవభాగము మిగులునటుల కషాయముకాచి దించుకొని అందులో తేనెకలిపి చిక్కబడువరకు పొయ్యిమీద

నునిచి కాచవలెను. తరువాత అడవివీరుల్లి వేయించి కొంచెము కుంకుమ పువ్వుసూరి అందులో కలిపి పుచ్చుకోవలెను.

మరియు అంజూరు, బనఫ్షా, వున్నాబ్, లిహాసోడా, గావ్‌జబాన్‌ఆకు యీమొదలగువాని కషాయములో కలకండచేర్చి పానముచేసిన మిక్కిలి లాభదాయకమగును.

మరియు విశేష సామాన్యమయిన సకల ఔషధములవలన ప్రయోజనము కలిగినచో సంయోగిక ఔషధములతో సావధానముగ యుండవలెను. మరియు అయోగికాది మొదలగు సర్వనాము యీఅధ్యాయము తరువాత చెప్పబడును. మరియు మలము మెత్తబడి పక్వమయినచో అట్టితరి వమనవిరోచనములు చేయించి తీసివేయవలెను. వమనము చేయించుటకై ముల్లంగి కషాయమునందు తేనె కలిపి పానము చేయించవలెను. మరియు తెల్లకటుకరోహిణితో వమనము చేయించుట రొమ్ము సంబంధమగురోగములయందు మిక్కిలిలాభదాయకము. ఇందు ముల్లంగి దుంప రసముకూడా చేర్చవలెను.

మరియు ముల్లంగి విత్తులు, సొసన్ వేరు, సోంపు విత్తుల కషాయము, సికంజబీన్ కలిపి పానముచేయుట లాభదాయకమగును గాన దీని వలన వమనమగును.

మరియు విరోచనమునకై యారజ్ పైకరా మరియు ఉబ్బుల్‌గారి ఖూను యివ్వవలెను.

మరియు ఉష్ణమును కలిగించునట్టి మాత్రలు సర్వదా నోటిలో యుంచుకొనవలెను మరికొందరు వైద్యులు వచించినదేమనగా నక్కయొక్క పుప్పుసము అనగా ఊపిరితిత్తి (Lung) ఎండించి ఏడుమాషముల పరిమాణము ద్రాక్షపండ్ల కషాయమునందు కలిపి పానముచేయించిన యెడల ఇందువలన రోగికి మిక్కిలిలాభము కలుగును మరియు భోజనమునందు వూరేడు పక్షిమాంసము, కోడిపిల్లలమాంసము ఇతర పక్షుల మాంసమును యిచ్చుట యోగ్యమగును ఇటులనే నక్క, చెవులపిల్లి,

మాంసము, శెనగకట్టు భోజనపదార్థములయందు, కులంజన్ (తమలపాకువేరు) దాల్చినచెక్క చేర్చుట కషాయాణి పానముచేయించుట మరియు కఫమును పెంచునట్టి, వస్తువులు అనగా పాలు, చేపలు, ఫలజాతములు యివ్వవలెను.

### గారిఖూన్ మాత్రలు చేయు క్రమము

గారిఖూన్ ముగరబిల్ 10న్నర మాషములు యష్టిమధుకము 6న్నర మాషములు తెగడ 35 మాషములు మూంజ్ ఫైకరా చేసువుచ్చకాయ గుజ్జు అంజరూద్ (ఒకజిగురు) యివన్నియు ప్రత్యేకముగా 7న్నరమాషములు ఇవియావత్తు చూర్ణించి వస్త్రగాలితమొనరించి మాత్రలు చేసుకొనవలెను. ఈ ఔషధము 4న్నరమాషములు మొదలుకొని 7 మాషములవరకు ఉపయోగించవచ్చును.

### ఇతరమాత్రలు చేయు విధానము

యష్టిమధుకము మిరియాలు చక్కెర యీమూడుసమానముగ నూరి మాత్రలు చేసుకొని నోటిలో ఉంచుకొనిన చిక్కని దోషమును దగ్గినపుడుగాని కాండ్రించినపుడు గాని వెడలును.

(సూచనీయము) దుబ్బా(Asthma) మొదలగు రోగములలో నిది విశేషకాలమువరకుండిన అపస్మారము ప్రాకినట్లుండువ్యాధి కీళ్లు నచ్చువదుట నొప్పులు ఒకేసారి వృద్ధినొందును గాన ఆరోగ్యముగా నుండు దినములయందు దీని చికిత్సచేయుటలో తాత్సారము చేయకూడదు మరియు దీనివుపాయము పథ్యమునందు త్యాగము ఎన్నడు చేయకూడదు మరియు ఎప్పుడున్ను వమనవిరేచనములు చేయించుచుండవలెను మరియు సమానత్వము కొరకు వృష్ణము చేయునట్టి మాజూన (అవలేహములు) కఫమును నశింపజేయునట్టి వానిని పుచ్చుకొనవలెను అట్టివస్తువులను సదా సేవించవలెను. మాజూన లన్నిటిలో జరావంద్ యొక్క మాజూన గ్రహించనగినది.

జరావంద్ మాజూన్ చేయుక్రియ.

జరావందమూదహ్రజ్ (గుండ్రని కచూరకు) కిరోమాన, పిప్పళ్ళు, బరానీలు, అడాలు, చేదుబాదంపప్పు, అంజీరపండ్లు ఇవి ప్రత్యేకము 17న్నర మాషములు యష్టిమధుకము రాజహంస జూఫా ఇవి ప్రత్యేకము 7 మాషములు యీమొదలగువానిని చూర్ణించి వస్త్రగాలిత మొనరించి తేనెలో కలిపి మాజూన్ చేయవలెను.

జూఫాకషాయము చేయుక్రమము.

ఉన్నాబ్, విహసౌడా, 20 కాయలు, గింజదీసినద్రాక్షపండ్లు, వచ్చివి అంజూరపండ్లు, ప్రత్యేకము 2 కాయలు యష్టిమధుకము, 24 మాషములు రాజహంస, 10 మాషములు అతమి గింజలు ఖుబ్బాజి ఎండుజూపా సౌసక్ వేరు మెంతులు ఇవిప్రత్యేకము 7 మాషములు ఈ మొదలగు యీపత్తువస్తువులు రెండుశేర్ల నీళ్ళయందువేసి నాలుగవభాగము మిగులునటుల కషాయముకాచివడియబోసి ప్రతిదినము 13కమాషములు తీసుకొని బనప్షాషరబతుకలిపి పానమొనరించవలెను. మరియు రుబూ (ఉబ్బసము) తలనుండి మలము దిగుటవలన కలిగినచో నజలాను తగ్గించుటకై పరిశ్రమజేయవలెను, ఎటులననగా నజులావ్యాధి ప్రకరణమునందు వర్ణించబడియె.

మరియు నెమ్మదిగా మలము నుండి పూపిరితిత్తులను పరిశుభ్రత నొనరించుటకై అరూఢమొందవలెను. ఈదశయందు విరోచనములు చేయించుట అతిప్రవృత్తమము. ఏరోగియొక్క రొమ్మునుండియు అథవా యితరఅంగములనుండియు మలము పూపిరితిత్తులయందుప్రవేశించుచుండిన నెమ్మదిగా ప్రకటనమగును. మరియు ఈరోగియొక్క పూపిరితిత్తులయందు శ్లేష్మము వుత్పన్నమైనచో పూపిరితిత్తుల జలుబు చెమ్మగలదగుటకులక్షణములు సంభవించును. మరియు యీరెండింటి యందు వమన విరోచనముల తదుపరి విశేషలాభదాయకమగును. మరియు వమనము అనేకపర్యాయములు చేయించుట వలన మలముయీపత్తు వకేసారి మూ

లమునుండి పెల్లగిలిపోవును. ఈసమయమునందు మలము నిలిపివేయునట్టివస్తువులు అనగా నల్లమందు యబరూబ్ (అడవిసేవువేరు) గంజాయి విత్తులు ఇసప్గోలు మొదలగు యిటువంటి వస్తువులు వర్జించుటయోగ్యమగును. అనగా నజులాయొక్క రీతియంను తలనుండిదిగివచ్చుచున్నది. అది దీనికి విరుద్ధముగానుండును ఎట్లనగా అట్టిస్థితియందునల్లమందు మొదలగువస్తువులు వుపయోగించవచ్చును. గాన ఈవస్తువులు నజులా తలనుండి దిగకుండునట్లు ఆపివేయును. గొప్పలాభముకలుగును రుబూ (వుబ్బసము) రోగముగలవానికి భుజించినవెనుక రెండుగడియలు గడవనిదే నీళ్లుత్రాగించకూడదు. ఆలస్యముగా నీళ్లుత్రాగుటలో కూడా మిక్కిలి స్వల్పముగా పానముచేయువలెను. ఇట్లుతక్కువగా జలపానము చేయుట మిక్కిలి వుత్తమము నీళ్లుఒకేవర్యాయము త్రాగకూడదు. కొద్దికొద్దిగా త్రాగవలెను. మరియు నీళ్ళకు బదులు తేనెలో నీళ్లుకలిపి పానముచేయుట అతివుత్తమము మరియు భుజించిన తదుపరి విశేషముగా నిద్రించుట మరియు ముఖ్యముగా పగలునిద్రించుటవలన మిక్కిలి హాని కలిగించును. మరియుమద్యపానము(సారాయిపానము)చేయునట్టిఅభ్యాసము గలరోగికి రీహానిషరాబ్ (సారాయి) పానముకరించుట లాభదాయకమగును. మరియు రొమ్మును ప్రక్కలను చేతితో మర్ధించుట మరియు ముతకబట్టతో గాని నూనెతోగాని మర్దించవలెను. సముద్రఫేనము పావడీలవణము కలిపి నూరి మర్దించుట వలన అధిక లాభము కలుగును.

మరియు మర్దించుటవలన ఆయాసము వుత్పన్నమైనచో కొద్దిగా చెంబేలినూనెగాని లేక చంద్రతైలముగాని దానితో సమానముగా మర్దించవలెను. మరియు రొమ్మును మర్దించుటలో బహుమృదువుగా మర్దించవలెను. మరియు నెమ్మదిగా రుద్దుచూ తదుపరి విశేషశక్తితో మర్దించవలెను. యీరోగమునందు పరిశ్రమచేయుట మిక్కిలి లాభదాయకమగును. అనగా పరిశ్రమ చేయుటలో ఆరంభమునందు

కొద్దికొద్దిగా చేయుచు క్రమేణ హెచ్చించవలెను కాని ఒకేపరియాయము విశేషముగా చేయకూడదు భోజనము పరిశ్రమచేసినపిమ్మట చేయవలెను. బహుదా ప్రకృతిని మృదుత్వము నొందిచవలెను. ముఖ్యముగా సహ్యాకోటియందు నివసించు చేపలు భోజనమునకు ముందు భుజించవలెను. మరియు ప్రకృతిని మృదుత్వము నొందించునట్టియు మూత్రవిసర్జన గావించునట్టి భోజనములను వర్జించవలెను. ఏవస్తుశేవనవలన మలము గట్టిపడునో యీకారణమువలన మూత్రమును కలిగించునట్టి వస్తువులు పచని మలమును వెడలించును. మరియు యేమనష్యుని రొమ్ములనందు వ్రణముండునో లేక జ్వరముండిన యీక్రిందచెప్పబడిన మాత్రలవలన వాని శరీరము మృదువరచవలెను.

## —మాత్రలు చేయు క్రమము—

బసప్షా యష్టిమధుకము యివిప్రత్యేకము లీన్నర మాషములు గారిఖూన్ 9 రతులు బాదంజిగురు, 3 రతులు, యీవస్తువులను చూర్ణించి మాత్రలులుచేయవలెను. శ్వాసరోగములయందు గారిఖూన్ ఆకాశవల్లి మిక్కిలి గుణముగల వస్తువులలోనివని భావించదగును. మరియు పుష్టికారకఔషధములు యీరోగమునందు కరిన సమయమునందు వాటిఅవశ్యము కలిగినచో అందూండి తాళకము రాతినజ్ యొక్క మాత్రిలుతేనెనీళ్ళలోకలిపి మాత్రలుచేసి వుపయోగించవలెను. మరియు అర్ధాంశము వేయించిన కోడిగ్రుడ్డుకలిపిసేవించవలెను. సామాన్యఔషధములయొక్క అవశ్యము కలిగినచో షహాజీర చూర్ణించి శిరకా (చెనగవులుసు)లోకలిపి యిప్పించవలెను. మరియు దమ్మా (వుబ్బసము) రోగియొక్క శ్వాసబంధించబడి గొంతు బిగించినట్లు అవస్తసంభవించిన యెడల పాషడీలవణము 14 మాషములు అడ్యాలు 7 మాషములు ఈ రెండింటిని మెత్తగానూరి 157న్నర మాషములు తేనెనీళ్ళలో కలిపి పానము చేసినచో తక్షణమే శ్వాసపట్టువిడిపోవును.

## ధూపము వేయు విధానము.

గంధకము, హరిదళము, యీ రెండు వస్తువులు కలిపి మేక గురిజా (పులవకాయలపైనుండు) కొవ్వు కలిపి నూరి బిళ్లలు చేసికొని ఆబిళ్ళను నిప్పుపై నునిచి అందుండి వచ్చు పొగను రోగి పీల్చునటుల ముఖము నుంచవలెను. మరియు కట్టువదలియుండు పొగ పీల్చుట ఉత్తమము. మరియు పులుసు పదార్థములలోనుండి చెనగపుల్సు మాత్రము యీరోగమునందు నుపయోగించవలెను. ఇటులనే సికంజబీన్ ముఖ్యముగా శరీరమునందు పుష్టము కలిగించును.

## కొవ్వులాభముయొక్క వర్ణనము

వీటివలన మలముయొక్క స్థానము నిశ్చయమగును మలము యెచ్చటయుండునో గ్రహించవలెను అనగా రొమ్మునందు భారముగా నుండుట ముఖ్యముగా ఈవిషయమును చూపుచున్నది. మరియు, మలము ఊపిరితిత్తులయందున్నచో రొమ్మునందు మంట కలుగుట గుర్రుచ్చుకొనుట మొదలగు అంశములను పూర్ణరీతిగా వర్ణించుచున్నాను అనగా మలము నరములయందుగాని పొరలయందుగాని యుండినచో దెమ్మ సహజముగా వెడలివచ్చుట ఈవిషయమై చిహ్నమగును అనగా మలము సమీపమునందున్నది. ఊపిరితిత్తుల ముఖమునందున్న యెడల రతూబతు అనగా నీరు కరినముగా వెడలుట దగ్గువెంట శ్లేష్మము వెడలుట కనిపెట్టబడుచున్నది. మలము ఊపిరితిత్తుల చుట్టుభాగమునందుగాని దానిరోమాంచములయందుగాని లేక దానిమూలన రంధ్రములయందుగాని యున్నచో కేవలము దగ్గు ఆలశ్యముగా యుండును. ఈవిషయమును వర్ణించుచున్నాను. అనగా కఫము, హిజాజ్ దయాఫగమా అను పొరయందున్నచో యీపొర హృదయము ఆమాశయమునకు మధ్యమునందున్నది దీనిరెండవపేరు హిజాజ్ ముస్త ఆరాజ్ అందురు. కొందరు యకృత్ (గుండె) ఆమాశయము మధ్యమందున్న ఒకపొర అందురు గాని వెనుక వచించినది సరిఅయినదిగాదు దాని

వర్ణనము జితుల్ జన్వ (ప్రీక్క యొక్క వాపు) నందు వర్ణించబడును. మరియు, గొంతుగా మెత్తగా నుండుట యిది చూపబడుచున్నది అనగా మలము ఊపిరి తిత్తులయందున్నదని నిర్ధారణ పరచుటకు చిహ్నములు.

మరియు, ఈవిధముగు రోగి రొమ్ముయొక్క ఛిద్రములయందు మలము ప్రవేశించినచో అట్టిస్థితియందు రోగి ఒకవైపునుండి రెండవ వైపు పత్రిగిలిన యెడల మలము ఆవైపునుండి రెండవవైపుకు దిగుచున్నది. కాబట్టి రోగికి మలము దిగునట్టి గతి తెలియుచున్నది. మరియు, దగ్గు కొద్దిగానుండును గాని అలక్ష్యముగా నివారించును. మరియు, ఉచ్ఛ్వాసము ఊపిరితిత్తుల వాపువలన మారుచున్నది ఎటులననగా ఊపిరితిత్తుల మూలనము మిక్కిలి మృధువుగానుండును అనగా ఒక వ్యాధి ఊపిరితిత్తులయొక్క ప్రకృతి ముందు యెటుల దానికి యోగ్యముగానుండునో దానితో విశేషముగా వుష్ణముగాని శీతముగాని విశేషముగా చెమ్మగలిగిగాని మిక్కిలి శుష్కత్వముగలదిగాగాని వుత్పన్నమగును. బహుశా స్వాభావిక ప్రకృతిగానుండి తరువాత ఏదో నొక కారణమువలన తన నిజదశయు మారిపోవుచు వుపరి ప్రకృతి ఉత్పన్నమగును. లేక ముందు కంటె మిక్కిలి ఉష్ణముగును లేకమిక్కిలి శీతలము గాని విశేషచెమ్మగాని విశేషశుష్కత్వముగాని కలిగియుండును. మరియు నిజప్రకృతి వుపరి ప్రకృతికిగల భేదమేమనగా నిజప్రకృతి యొక్క చిన్నములు అనగా స్వభావిక ప్రకృతివలన సర్వదా ప్రకటనమగుచున్నది వుపరిప్రకృతి దీనికి విరుద్ధముగానుండును అనగా ప్రకృతిమారిపోయిన యెడల తెలియబడును. రొమ్ము వెడల్పుగానుండుట శబ్దము బలముగా నుండుట శ్వాస పెద్దదగుట చల్లనిగాలి వలన హాయిగానుండి నటుల తోచుట ప్రకృతి వుష్ణముగానుండుట మొదలగు కారణములను చూపుచున్నదని గ్రహించవలెను.

మరియు, రొమ్ము చిన్నదగుట శబ్దము స్పష్టముగావచ్చుట శ్వాస చిన్నదగుట, మరియు, జలము ఎక్కువ చేయుట హానికలుగుట మొదలగునవి ప్రకృతి శీతలమగుట వలన కలుగు లక్షణములు చూడబడుచున్నవి.

మరియు, ఇట్టి మనుష్యుని రొమ్ము ఘనము విశేషముగా నుండును. దగ్గు, ఉబ్బసము విశేషముగా నుండును. వేడి ప్రకృతిగల వానికి శబ్దము నెమ్మదిగా అణగినటుల వెడలుచున్నది శ్వాసవిడుచుటతో గర గర శబ్దము కలుగుచున్నది. మరియు, పెద్ద ధ్వనిచేయజాలడుగాని వానిశక్తి దుర్బలము నొందజాలదు. మరియు, వాని రొమ్మునందు చెమ్మనిండియుండును కనురెప్పలు కండ్లు వాపుకలిగియుండును.

మరియు గొంతుమూలము మెత్తగను బిగువలేకయుండును.

మరియు శుష్కప్రకృతి గలవానియొక్క శబ్దము నిండి బరువుగానుండును అనగా బొంగురు గొంతుగా నుండును మరియు వానిరొమ్ములో ఏమియు చెమ్మలేకుండును శుష్కత్వము హెచ్చుటవలన శ్వాసబిగించినటుల (కష్టముగా) వెడలును వీటివర్ణనము అవశ్యముండెనుగాని గ్రంథ విస్తార భీతివలన క్లుప్త పరచితిని.

ప్రయోగిక ఔషధముల వర్ణనము

ఈ ఔషధముల వర్ణనము దమా (ఉబ్బసము) రోగమునందు దాని కారణమున్నచో సేవింపవలెను మరియు ప్రస్తుతము ఒక ఔషధము వలన కార్యము నెరవేరినచో రెండవ సుయోగిక ఔషధము సేవించకూడదు.

జరావంద్ (కచూరము) రెండు మాషములు చూర్ణించి వస్త్రగాలితమొనర్చి ప్రతిదినము ప్రాతఃకాలమునందు ౮1న్నరమాషము మధుచక్కెరాయందు కలిపి వృష్ణోదకముతో పుచ్చుకొనవలెను

మరియు గవ్వవలుకు సాంబ్రాణి 2 మాషములు మొదలు తెప్ప రమా॥ 4న్నరమాషములవరకు రోగదశనుగ్రహించి రోగి యోగ్యతను

కనిపించి సదాపాకరసముతో కలిపి పుచ్చుకొనవలెను మరియు అడవి నీరుల్లి కుసర్ది వేయించిన నూనె తేనెతో కలిపి భక్షించవలెను.

మరియు కస్తూరియూనాని నెంబరు కపామాకము కాదివ డియకోశి అందు మయూరచఖర్గార్ని తేనెగాని కలిపి పానముచేయవలెను మరియు రోగము ఎపి స్టెలో చిన్న కంటూరియూనా వ్యాధి పురాతనముగా నున్నచో ఎ. చని కంటూరియూనా ఉపయోగించవలెను మరియు ఈ రెంటిని దీనితో దంచి చూర్ణించి తేనెతో కలిపి (రసాయనము) వలెచేసికొని పుచ్చుకొనిన మిక్కిలి గుణము కలిగించును మరియు తేనెతో చేయబడిన శికంజబీన్ బిజూర లేక విసీరుల్లితో చేయబడిన శికంజబీన్ యోగ్యముగానుండును ఈ మొదలగునవి చిక్కని మలమును వక్కపరచి సహజముగా వెడలించును రోమమును పవిత్రపరచును మరియు ఈరోగియొక్క పూపిరితిత్తుల రోగమునందుగాని హృద్రోగమునందుగాని వానిమాంసరంధ్రములయందు గాని మలము చేరియుండినచో ముందుగా బాసలీక్ అనునరముగాని ఇబ్తియానువరముగాని ప్రుసైల్ అనునరముగాని ఎడమచెయ్యియందు శిరావేదనము చేయవలెను పిమ్మట రెండవపుపాయము చేయవలెను

౪) వభేదము ఉబ్బసము యొక్క లక్షణములు

పూపిరి తిత్తులు రొమ్ము హృదయము ఆవిరి పరమాణువులతో నిండి ఈ ఆవిరిపరమాణువులు ఈభాగములయందు నిలిచి ఈఆవిరిపరమాణువుల విశేషత్వమువలన గాలి మార్గములు చిన్నవగును మరియు శ్వాసయందు ఇబ్బందికలుగును దీని లక్షణములు నాడిపెద్దదిగను వెంటవెంట నడుచుచుండును మరియు దాహము అధికముగానుండుట శీతజలపానమువలన సంతృప్తిలేకపోవుట మరియు శ్వాస వెంట వెంట వచ్చుట పిచ్చిచేష్టలు రొమ్మునందు మంట గొంతు నాలుక ఎండుట నోటిరుచిఉప్పగను పుల్లగానుండుట చల్లని గాలివలన లాభము, వుష్ణగాలివలన హాని కలుగుట ఈ మొదలగు లక్షణములు కలిగియుండును

## మూడవభేదము ఉబ్బసము చికిత్స

ఎడమచేతియొక్క బాసలీక్ అనునరమును ఛేదించి రక్తమోక్షణము చేయవలెను మరియు హృదయసంబంధమగు వుష్ణమును ఆవిరివేయవలెను మరియు ఇందువిషయమై ఇసబ్ గోలుగింజ-గుజ్జు బనప్షాషరబతు కలువపూలషరబతునందు కలిపి పానము చేయవలెను

మరియు యాపగింజ సేపు(యాపిల్) షరబతు చందనముయొక్క షరబతు ఫలముల షరబతులు సంతోషదాయకమగు చల్లనివస్తువులు మరియు హృదయమునందు వేడి తగ్గించునట్టి వస్తువులనుపయోగించవలెను. అనగా హృదయముయొక్క వుష్ణప్రకృతి యందు వర్ణించబడియె అవియానత్తు యీవ్యాధియందు లాభదాయకమగును. మరియు చేతులు కాళ్ళు మర్దించుట చల్లనినీళ్ళయందుంచుట లాభదాయకమగును

దస్తూరవుల్ ఇలాజ్ అను గ్రంథమునందు వ్రాయబడినదేమనగా శిరావేదనముచేసిన వెనుక ఏదియు వర్జితముగాకుండిన కత్తితో గంట్లు వేయవలెను. మరియు వుష్ణమును శాంతింపజేయుటకై సేపుషరబతుగాని మంచిగంధపుషరబతుగాని పెద్దపాయలగింజల పాకముగాని సారకాయ రసముగాని బేదానా గుజ్జుగాని తియ్యదానిమ్మ షరబతుగాని పానము చేయవలెను. మరియు పన్నీరు చందనము కర్పూరము రొమ్ముపై మర్దించుట ఈవస్తువులను పీల్చుట లాభదాయకమగును.

## (4) భేదము ఉబ్బసముయొక్క లక్షణములు

అనగా వూపిరితిత్తులయొక్క వుష్ణదుష్టప్రకృతి అధికమై ఉబ్బసము కలుగుటకు కారణమగును.

## (4) భేదము ఉబ్బసము చికిత్స

ప్రకృతిని కాపాడుటకై చల్లని ఔషధములను పానముచేయుట తైలాహలను లేపనముచేయుట మొదలగునవి వుపయోగించవలెను

—(5) వ భేదము ఉబ్బసము యొక్క లక్షణములు—

రోమ్ము యొక్క అవయవములు బిగుతగ్గి సీర్ని ము నొందును. గాని విశ్శించుటకు శక్యములేకపోవును. ఇటులనె దానిప్రకృతి యొక్క వృష్ణమునందు దుర్బలము ప్రవేశించును గాన కారణశక్తితో గతికొరకు ప్రధానమగును. మరియు దానిచిన్నకము బ శ్వాస హెచ్చుట ఆగి ఆగి వచ్చుట నాడియందు పూర్ణముగానంమల మొదలగులక్షణముల కలిగియుండును.

(5) భేదము ఉబ్బసము చికిత్స

మెంతికషాయమునందు తేనెకలిపి ఆపి ఆపి పానముచేయవలెను మరియు సౌనక్ తైలము నర్గిస్ తైలము మహానింబతైలము రొమ్ముపై మర్దించవలెను. మరియు కంజిలో మెత్తగానూరితేనెలోగాని సోయి విత్తులనూనెలోగాని కలిపిలేవనముచేయవలెను. మరియు పక్షవాతము నందు చెప్పబడిన ఔషధములను వుపయోగించవలెను.

—(6) భేదము ఉబ్బసము యొక్క లక్షణములు.—

పుప్పుసముల యందు శుష్కత్వము ఉత్పన్నమైన కారణమువలన పూపిరితిత్తులయొక్క ప్రధానమగును చెమ్మనష్టమొం దుటవలన పూపిరితిత్తులు ముడుచుకొనును ఈరోగము బహుదా జ్వరముయొక్క వృష్ణము ప్రధాన అంగములయందు ప్రవేశించును. ఈజ్వర అంతమునందు వుత్పన్నమగుచున్నది. దీనిలక్షణములు దాహము కలుగుట శబ్దము హీనమగుట కఫము వెడలకుండుట మొదలగులక్షణములు కలిగియుండును. మరియు చెమ్మ కలిగినట్టి వస్తువులు వుపయోగించుట వలన ఉబ్బసము శాంతించును.

(6) భేదము ఉబ్బసము చికిత్స

పూపిరితిత్తులయందు చెమ్మనుకలిగించుటకై చెమ్మను కలిగిం చు వస్తుసేవన చేయవలెను. అనగా యవగంజి మేకపాలు చనుపాలు మరియు ఇతరములగు గింజలను నానవేశిన గుజ్జు చెమ్మను కలిగించున

రసాయనములు మొదలగునవి యివ్వవలెను. చెమ్మను కలిగించునట్టి వ లాస్త్రిలు రొమ్ముపై లేపనము చేయవలెను. మరియు బనప్షా దోనకాయలు అతిమి కలువపూలు ఈమొదలగునవి కషాయముకాచి విధిప్రకారముగా అందురోగిని కూర్చుండబెట్టవలెను,

(7) వ భేదము ఉబ్బసముయొక్క లక్షణములు.

చల్లనిగాలి ముక్కునుండి ప్రవేశించుటవలన చల్లని వస్తుశేవన చేయుటవలన శీతజలపాన మొనరించుటవలన వూపిరి తిత్తులు (పుప్ఫుసము) లయందు జలుబును పుట్టించును. వూపిరితిత్తులయందు జలుబు అధికమై యీరోగము కలుగుచున్నది. ఈవ్యాధి విశేషముగా వృద్ధులకు ఉత్పన్నమగును. మరియు ఆరంభమునందు స్వల్పముగా నుండి, అంతమునందు దృఢమగును.

(7) వ భేదము ఉబ్బసము చికిత్స.

ఉష్ణమును కలిగించుటకై మెంతులకషాయమును పానముచేయవలెను. మరియు ఉష్ణతైలములు మర్దించవలెను. పావురము, చకోరపక్షి మాంసమున్ను, వుడికివుడకని కోడిగ్రుడ్డు యీవ్యాధియందు పత్యము ఇయ్యవలెను.

మెంతులు కషాయము చేయువిధానము.

మెంతులు 17½ మాషములు, బనప్షా 7 మాషములు, సోపు శి ౹ మాషములు, ద్రాక్షపండ్లు 30 కాయలు, యీవస్తువులు కషాయముకాచి వడియబోసి, చక్కెరపంచదార అందులో కలిపి ప్రతిదినము 150 మాషములు పానము చేయవలెను.

(8) వ భేదము ఉబ్బసముయొక్క లక్షణములు

అనగా శ్వాస వచ్చునట్టి మార్గమునందు గాలి నిండి ముక్కునందు నిలిచిపోవును. వురూక్ఖసవా (పీకె) గాలిమార్గము యీసమయమునందు కొద్దివస్తువు బంధించబడినచో శ్వాస అవశ్యముగా బిగిసిపోవును. యీరోగము వాతకారక పదార్థశేవన చేయునట్టి కారణమువలన

కలుగుచున్నదని గ్రహించవలెను. దీని చిన్నెలు అనగా రొమ్ము బరువగుట, దగ్గినపుడు కిల్లిపడకుండుట వాతము కలిగించునట్టి వస్తువులతో ఉబ్బసము అధికమగుట మొదలగు లక్షణములు కలిగియుండును.

### (8) వ. భేదము ఉబ్బసము చికిత్స

వాతము హరించి బంధనము విడదీయుటకై కొన్ని నదుపాయములు (2)వ భేదమునందు చెప్పబడినవి. కాబట్టి ఆవుపాయములను ఇందుపయోగించుకొనవలెను. మరియు సోపు, సోయిపిత్తులు, యారజ్ పైకరా, హుబ్బురిశాద్, హాలికిగోలి యీరోగమునందు మిక్కిలి గుణదాయకములగును. మరియు తులసినూనె, హాబ్బుల్ గార్ తైలమును మర్దించవలెను. సోయిపిత్తులు, బాబూనా, దవనము, మరువము, మొదలగునవి రొమ్ము ప్రక్కలయందుకూడా లేపనము చేయవలెను. మరియు, మాజూనులలోనుండి మూదతుల్ హాయాత్ నౌసదారుగాని సంజీర్నియా మరియు, అమరశియా యీనాలుగున్న సంయోగిక అవలేహములు. మరియు నివి అతిగుణదాయకములని గ్రహించవలెను మరియు అమర్సియా యూనానిలో హవాసుల్ మవాద్ (మలమును అపునట్టి ఔషధముయొక్క పేరు) నిది ఒకరాజుకు ఆమాశయము దుర్బలము నొందు రోగముండెను. వానికొరకు హకీం బుకరాత్ గారు యీ ఔషధమును వచించిరి.

### అమరశియా మాజూను చేయుక్రమము

అడవిగాజరువిత్తులు, అజకిర్ (మంజగిడ్డి) బల్సాన్, కిరోమున అడవికరివేపాకు, యాపిల్, అజామోదము, ఇవి ప్రత్యేకము 3½ మాషములు, నల్లమిరియాలు, శ్వేతమిరియం, కటుకరోహిణి, ప్రత్యేకము అర్ధభాగము, శుద్ధిచేసిన బాలింతబోలు 10½ మాషములు, హబ్బుల్ గార్ వేపివిత్తులు రెండుగింజలు, కుంకుమపువ్వ 7 మాషములు యీ యావత్తువస్తువులు దంచి చూర్ణించి, వస్త్రగాలిత మొనరించి పొంగు

తీసిన తేనెకో కలిపి లేహ్యాకాముగా చేసుకొని రెండు మానములు గడి చిన తరువాత 7 మూడు లవరకు ఉపయోగించవలెను.

## —జావసీరు మాత్రిలు చేయుక్రియను—

జావసీరు 1½ మాసము, సోవురస ముతోనూరి 1¼ చేదుపుచ్చ కాయగుజ్జు అందుకలిపి తేనెసీళ్ళతో రోగికి యివ్వవలెను. ఈజావసీరు మాత్రిలు రెండవ ప్రకరణ వ్యాధియందున్న యీ వ్యాధియందున్న మిక్కిలి వుపయోగకారి అయినను నిది జీవనరములకు హానికలిగించును. కాబట్టి యీ సమయమునందు యీ మాత్రి వుపయోగించినచో వ్రాణ్ణమగు సుగంధ తైలములను శరీరముపై మర్ధించవలెను. దీనివలన ఆమాత్రియొక్క ఆవిరి పరమాణువులు జీవనరములయందు ప్రవేశించ జాలవు గాన జీవనరములకు హానియొక్క భయము కలుగజాలదు.

మరియు, యీ క్రింద చెప్పబడిన మాత్రిలు యోగ్యముగా నుండును. అనగా సుకవీనజ్ జావసీరుచేర్చి చేయబడును ముఖ్యముగా సుఖవీనజ్, సదాపాకు రసమునందు మాత్రిలు చేయవలెను.

## —(9) వ భేదము ఉబ్బనము యొక్క లక్షణములు—

విశేషమలము రొమ్మునందు ప్రవేశించును. దీనిలక్షణములు రెండవ భేదముయొక్క లాభమునందు వర్ణించబడినలక్షణములు యీ భేదముయొక్క లక్షణములని భావించవలెను. చికిత్స కూడా అచ్చటనే చెప్పబడియుగాని దీని చికిత్స జలోదరముయొక్క చికిత్స యని గ్రహించవలెను.

## (10) వ భేదము ఉబ్బసముయొక్క లక్షణములు.

తీక్ష్ణరోగములయందు రోగసంధి సమయమునందు ప్రకటనమగును ముఖ్యముగా దీని చికిత్స చేయకూడదు యెటులనగా రోగసంధి సంబంధమగు చికిత్సయె లాభదాయకమగును.

## (11) వ భేదము ఉబ్బసముయొక్క లక్షణములు.

ఊపిరి తిత్తియందుగాని లేక దాని సమీపమందుండునట్టి ఇతర అంగములయందుగాని వాపు వుత్పన్నమగును అనగా హిజాబ్ హాజిజ్ యందున్న హిజాబ్ మునసిప్ యందున్న, హిజాబ్ ముస్తబతన్ యందున్న, వీటితంతువులయందున్న, ప్రక్కలయందున్న, యకృత్ (లివర్) యందున్న ప్లీహ (తిల్లి) యందున్న వాపు వుత్పన్నమగును. ఇట్లు వాపుకలుగుటకు కారణము అనగా వికశించునట్టి గతిగల స్తలము బిగించబడును. మరియు, రొమ్ము బిగించబడునట్టి కారణము ఇదియెయని గ్రహించవలెను. మరియు, ఈ రోగచిహ్నములు చికిత్స మొదలగునవి వాటి వాటి స్తానములయందు వర్ణించబడియె ఐకీరా అను గ్రంథకర్త ఉబ్బసము గుండెవాపువలన ఉత్పన్నమైనచో దాని చికిత్సయందు ముందుగా బాసలిక్ గాని అకహాల్ అను నరములను ఛేదించి రక్తమోక్షణము చేయించి తరువాత బార్ తంగ్ రసము, కాకనజ్ రసము, లాకీక్ రసము పందిరిదోసకాయరసము, చిరిశెనగరసము మొదలగు రసములను శికింజబీన్ యందు కలిపి పానముచేయవలెను. మరియు, గుండెయందు బలము కలిగియున్నచో ఆఔషధములయందు రేవలచిన్ని చేర్చుకొనవలెను.

మరియు, ఉబ్బసము ప్లీహముయొక్క కారణమువలన కలిగినచో ఎడమచేతి అనామిక, కనిష్ట వ్రేళ్ళమధ్యనుండునట్టి నరము ఛేదించి రక్త

మోక్షణము చేయించవలెను. మరియు, గౌజబాఁ అరుఖులో అడవినీరు లితోతయారు చేయబడిన శికింజబీఁ కలిపి సేవించవలెను.

హిజాబ్ హాజీజ్ (ఇదిపొర హృదయమునకున్న, ఆమాశయము కున్న మధ్యనున్నది. హిజాబ్ ముఁసిప్ మరియు హిజాబ్ ముస్తబతన్ ఇజలా) నిది పొర. యీపొరవ్రీక్కు పెకుకల లో భాగమునందున్నది.

## (12) వ భే॥ ఉబ్బసముయొక్క లక్షణములు.

దీనిని తకల్లుసల్ హిజాబ్ (ఇదివకపొర) దీనిని యీఅధ్యాయము నందు మూరు మూరు శ్వాసచెడిపోవునట్టి వ్రీకరణమునందు చెప్పియుంటిని. దీనిని హాకీంతలీఖ తప్ప యితర వైద్యవరులు వ్రాసియుండలేదు.

## (13) వ భేదము ఉబ్బసముయొక్క లక్షణములు.

ఆమాశయము మలముతో నిండియుండుట వలన హృదయ కమలము వికసించుటకు ఆటంకము సంభవించును. ఈకారణము వలన వుబ్బసము వుత్పన్నమగును. మరియు దీని చిహ్నములు ప్రక టనమగును.

## (13) వ భేదము ఉబ్బసము చికిత్స.

యారజ్ మాత్రిలు దీనికి సమానగుణముగల వస్తువులతో ఆమా శయమును పవిత్రత నొందించవలెను. మరియు పక్వము నొందించునట్టి విషయమై మిక్కిలి పరిశ్రమ చేయవలెను.

## (14) వ భేదము ఉబ్బసముయొక్క లక్షణములు

గొంతు వాపు గాని శ్వాస బిగబట్టునట్టి కారణము వలన గాని వుబ్బసము వుత్పన్నమగును. ఈవుబ్బసము గొంతువాపుగాని వూపిరి పట్టుబట్టుటవలన కలిగినయెడల దాని వర్ణనము మాదుమూరు చేయబడియె. అనగా రోగి దశానుసారముగా గొంతువాపునకు చికిత్స చేయవలెను.

(లాభము) వుష్ణదేశమందు వర్షాకాలము విస్తారమై గాలి వుష్ణ శుష్కత్వముగలదై వుత్తరదిశగాలి అయినచో చలికాలమునందు వూపిరితిత్తుల రోగములు విశేషముగా వుత్పన్నమగును. ప్రత్యేక దశయందు చల్లనిగాలి వూపిరితిత్తులయందు హానికలిగించును గాన అట్టిమనుష్యులకు వుష్ణగాలియందు విశేషముగానుంచవలెను. దీని వుష్ణమువలన నష్టపడును. బహుశా వుబ్బసరోగము వూపిరితిత్తుల వాపుతో హరించును. ఒక్కొక్కప్పుడు వూపిరితిత్తుల రోగములు గుండెరోగముతోకూడా పోవుచున్నవి. ఎటులననగా వుష్ణదుష్టప్రకృతి చల్లగానుండు కలిజా (యకృత్) యందు ప్రవేశించును. మరియు జలోదరమునుకలిగించును మరియు యేవస్తువు హానికారక లాభకరములుగానున్నవో అట్టివస్తువులను రెండవ ప్రకరణమునందు మాదుమూరు చెప్పియున్నాను. గాన వాటిని చూచుకొని చికిత్సచేయవలెను.



# శ్వాసరోగ లక్షణములు.

ఈరోగములను వెనుక వర్ణించియున్నాము. ఈవుబ్బసము శ్వాస బిగించుటవలన కలుగుటకు ఒకగొప్ప కారణ భేదముకలదు. ఈరోగము గల మనుజుడు ఎక్కువసేపు పరుండజాలడు. కొంతసేపైనను తిన్నగా కూర్చుండజాలడు. నిలువబడియుండజాలడు. మెడ తిన్నగా యుంచజాలడు. శ్వాస తిన్నగా పీల్చునిచో శ్వాస నడువక కష్టమగుచుండును. దీని కారణము చిక్కని మలదోషముగాని లేక శ్వాసమార్గమునందు వాపు కలుగుటవలనగాని లేక రొమ్మునరములు బలహీనములై బిగుతగ్గిపోవుట వలనగాని కలుగుచున్నది. వుబ్బసము (శ్వాసరోగము) వుత్పన్నమగుటయు దీనిచిహ్నములు చికిత్స కారణానుసారముగా వుబ్బసరోగ ప్రకరణము నందు తెలియబడును. మరియు యీరోగము వుబ్బసరోగభేదములలో నిది గాన దీనిని వేరుగా వర్ణించితిని దీనివలన లాభమధికమగును.

(సూచనీయము) ఇందువిషయమై విరుద్ధభావము వైద్యులమతము నందు కలిగినది అనగా ఉబ్బసము మరియు జీకుల్ నఫ్ స్ (శ్వాసభారముగా కష్టముగావచ్చుట యొక్క అర్థమును చూపుచున్నారు. గాని వారిఅర్థము వేరు వేరుగానున్నది. గాన ఉబ్బసరోగము యొక్క ఆరంభమునందు దీనిపై సాంకేతము చేయబడియె. ఇప్పుడు ఈస్థానమునందు విరుద్ధభాగమును కొద్దిగా ప్రకటించెదను అనగా శబ్దము మాత్రము మారినదిగాని పరిణామమునందు ఒకేఅర్థము కాబట్టి కొందరు ఈరెంటిలో భేదము చూపుచున్నారు. వారి మతము యేమనగా శ్వాశ కఠినముగా వచ్చుటలో శ్వాసవచ్చునట్టి మార్గములు బిగిసిపోవును. నేనుదానిని జయ్యిక్ అనుచున్నాను. మరియు ఈదశయందు గాని నాశికము ప్రవేశించుచుండినమార్గము చిక్కగుండును. మరియు కొద్దిగా యోగ్యమగును

ఈవిధమగు ఉబ్బసము యొక్క ప్రశంశముపైన చెప్పియుంటిని అందు బిగింపు కలుగదు మరియు ఒకొక్కప్పుడు బిగింపు కూడా కలుగ వచ్చును.

మరియు ఉబ్బసము లేకుండును. యెటులననిన కొందరికి శ్వాస ఆగి కష్టముగా వెడలుటవలన చూడబడుచున్నది మరికొందరు ఒకే అర్థము యీవిచారమువలన తెలిసికొనుచున్నారు అనగా ఈరోగము ఫుప్పుసము (ప్రాపిరితిత్తుల)లతో ముఖ్యముగా సంబంధముకలిగియున్నచో ఈకారణమువలన పూర్ణమగు నట్టి విచారము చేయజాలరు మరియు ఈ కారణమువలన దీనిపరిణామము ఒకటిగా నుండినచో ఒకటికి రెండవ దానితో వేరుగా గ్రహించజాలరు. మరియు జియ్యాక్ పుస్తదర్ అనగా విశాలమగునట్టి అంగములు శ్వాసపీల్చుకొనుటకు ముఖ్యముగా నుండు నవి సన్యమైన గతి గలిగి యుండజాలవు. అనగా విశాలము కాజాల కుండును.

, ఇది శ్రీమదిమాంబేగ్ సాహెబ్ పౌత్ర పాచ్చాబేగ్ సాహెబ్
పుత్ర "వైద్యభూషణ" బిరుదావళీ విరాజమాన వైద్యవిద్యవిద్వజ్జన
విధేయ రహంతుల్లాబేగ్ నామధేయ ప్రణీతంబైన
"తిబ్బెఅక్బర్‌షాహి" అను వైద్యగ్రంథమునందు
శ్వాసరోగములు సర్వము
సంపూర్ణము.



యాకరీముల్ నాయూక్,

బిస్మిల్లా హిరహ్మానిరహీం.

# తిబ్బె అక్బరిషాహి

వదునొకండవ అధ్యాయము.

## కాసరోగలక్షణములు



సూఫీ (దగ్గు) ఊపిరితిత్తులు శ్వాసపీల్చుటలో వూపిరితిత్తులతో కూడా యుండునట్టి అంగముల గతియని గ్రహించవలెను. శ్వాస పీల్చుటలలో దానితోకూడా సంబంధము కలిగియుండును ఎటులనిన వూపిరితిత్తి ముఖము హిజాబ్, హాజాజ్, హిజాబ్ మున్నిప్, మరియు హిజాజ్ ముస్తబతిన్, వుజిలా, మరియు, రొమ్ముయొక్కయు, వక్కల యొక్కయు, కండరములు, తంతువులుకూడా గతికలిగియుండును. ఈగతి అప్రాకృతిగలది గాన శరీరము దాని ద్వారా చింతను యీ అంగములనుండి దూరపరచుచున్నది. మరియు దగ్గు వూపిరితిత్తులకు ఉప యోగకారి అనగా తుమ్ము మెదడునకు ఎటుల యుపయుక్తము గలదో అటులనె దగ్గుకూడా వూపిరితిత్తులకు వుపయుక్తమని గ్రహించవలెను. మరియు, దగ్గుయొక్క సంపూర్ణకారణములు నాలుగు విధములుగా నుండును.

(1) దుష్టప్రకృతి లక్షణములు

దుష్టప్రకృతి భేదములలోనుండి కలుగుచున్నది. అనగా మల రహితముగాగాని మలసహితముగాగాని వుత్పన్నమగును.

(2) వాపుయొక్క భేదము దీనికారణము ఊపిరితిత్తులయందు గుల్లలు (చిన్న చిన్న కురుపులు) వుత్పన్నమగును. ఈకారణమువలన దగ్గు సంభవించును.

(౩) ఏదైన అప్రాకృతి వస్తువు అకస్మాత్తుగా శ్వాసపీఠ్చు పట్టి అంగములయందు ప్రవేశించును. అనగా చల్లనిగాలి, పొగ, దుమ్ము, లేక ఆమ్లపదార్థములను భుజించట తీక్ష్ణపదార్థ సేవనగాని, కటువదార్థభక్షణవలనగాని అనగా అట్టివస్తువులను భక్షించునప్పుడు అసావధానత్వమువలన శ్వాసమార్గమునందు ప్రవేశించును. అనగా భోజనపానాదు లోనరించునప్పుడు ప్రకటన మగుచున్నది.

(౪) శ్వాసవాహిని అంగము ఆరోగ్యముగా నుండుటగాని సర్వ శరీర సంయోగమువలనగాని లేక ఒక అంగముయొక్క సంయోగము వలనగాని అనగా ఆమాశయము పీకెయకృతు (లివరు)ప్లీహము (స్లీన్) ఈరెంటియొక్క మాలిక్ (ఈరెంటునున్న పేగులాడునట్టిస్థానము) మరియు రెండు స్తనముల యొక్క సంయోగమువలన దగ్గుపుత్పన్నమగుచు దగ్గుయొక్క అధికత న్యూనత యొక్క వర్ణనము సాక్షేపకారణముల యందు పలుమారు వర్ణించబడును. ప్రస్తుతము ప్రత్యేక కారణమును వేరుగా వర్ణించుచున్నాను.

(1) ఈప్రథమ కారణము సాధారణ దుష్టప్రకృతి పుపిరితిత్తు రయొక్క ముఖమునందుగాని దానిమాంసమునందుగాని పుత్పన్నమైనచో యీ కారణమువలన దగ్గు కలుగుచున్నది ఇట్టి సమయమునందు సాధారణ దుష్టప్రకృతివలన ఉష్ణముగాని లేక శీతముగాని లేక శుష్కత్వము గాని ఊపిరితిత్తులయొక్క ముఖమునందుగాని దాని మాంసమునందు గాని పుత్పన్నమైన యెడల వుపిరితిత్తులయొక్క భాగములకు గాలి క్రూరముగా నుంచునటుల తోచుచుండును. అనగా హృదయకోశములము వికశించునప్పుడు గాలి లోపల ప్రవేశించుచున్నది. మరియు, ప్రకృతి రయొక్క శక్తి కష్టదాయకములను దూరపరచుచుండును. అట్టితరి దానిని శ్వాస మార్గము ఆటంకపరచుచున్నది. ఎటులననగా పొగను దుమ్మును ఆటంకపరచి తీసివేయుచున్నది. దీనిని తీసివేయుటవలన దగ్గు ఉత్పన్న మగుచున్నది. మరియు, ఊపిరితిత్తులయొక్క సాధారణ ఉష్ణలక్షణములు

అనగా యెల్లప్పుడు దాహము కలుగుట హాజరా (ఊపిరితిత్తులయొక్క తల) పీకె ఆరిపోవుట పొడిదగ్గు కలుగుట గొంతుక్కు భారము లేకుండుట, ఉష్ణోపచారములవలన అధికమగుట శీతోపచారములవలన శాంతినొందుట, ఇటులనె ప్రథమకారణము ఉష్ణగాలియందు నివసించుట, ఉష్ణపదార్థములను సేవించుట ఉష్ణాధిక్యముగు ఔషధములను పుచ్చుకొనుట ఉష్ణగంధము (అత్తరు) మొదలుగునవి విస్తారముగా ఆఘ్రాణించుట మొదలగు కారణములు దీనికి సాక్షులగును. ఈకారణములవలన సాధారణ దుష్టప్రకృతి ముఖ్యముగా శరీరమునందున్న, మెదడునందున్న, శ్వాసపీల్చునట్టి అంగములయందున్న వుత్పన్నమగుచున్నది. మరియు, ఊపిరితిత్తులయొక్క ఉష్ణదుష్టప్రకృతి ఆమాశయముయొక్క దుష్టప్రకృతియందు భేదముగలదుగాని ఊపిరితిత్తులయందు ఉష్ణము కలిగియుండినచో చల్లని నీళ్ళు పానముచేయుటకంటె చల్లని గాలివలన సౌఖ్యము పొందగలదు. ఆమాశయముయొక్క ఉష్ణము దీనికివిరుద్ధముగానుండును. అనగా చల్లని జలపానమువలన శాంతినొందును గాని చల్లని గాలివలన స్వల్పలాభము కలుగగలదు అయినను దగ్గు మాత్రము కలుగకుండును.

### సాధారణదుష్ట ప్రకృతి దగ్గు చికిత్స

ప్రకృతియొక్క ఉష్ణమును సంతుష్టినొందించుటకై ఏఔషధములు చలువను కలిగించునో అట్టి ఔషధములును భోజనములు అనగా ఇసప్గోలు గింజలగుజ్జు యవకంజి ఖమీరాబనప్షా మరియు వీటికి సమానగుణములుగల వస్తువులు ఉపయోగించవలెను. మరియు ఉచితమగు రసాయనము పుచ్చుకొనుట చందనము కర్పూరము నేతిబీరకాయపై బెరడు యీవస్తువులు పద్ఫెనియాలరసమునందున్నా కాహురసమునందున్నా నూరి పన్నీరుతో కలిపి లేపనముచేయవలెను. మరియు కిరూతి అఖబర్ (ఇదినంయోగికఔషధము) నుమర్దించవలెను.

## ఈవ్యాధియందు ఉపయోగించు రసాయనము.

ఉన్నాబ్ (ఒకవిధమగు రేగుపండ్లు) సపిస్తాా (శ్లేష్మాంతకము) ఖతిమి విత్తులు ఈవస్తువులను నీళ్లలోవేసి అర్ధాంశముగాకషాయము కాచి వడియబోసి చక్కెవంచదారకలిపి చిక్కవరచి అందు పొడుగు నేతిబీరకాయ గింజల పప్పు తియ్యనిబాదంపప్పు బహెషా కతిరా (బాదంజిగురు) ఈవస్తువులుమెత్తగాచూర్ణించి కలిపి పుచ్చుకొనవలెను. ఈరసాయనము పైన వర్ణించబడిన వ్యాధియందుఉపయోగించును.

## కిరూతిచేయు విధానము.

తెల్లమైనమైను బహెషాతైలమునందుగాని లేక అట్టి స్వభావికము గలతైలాదులయందుగాని వేశి కరిగించి కాహూరసముగాని పచ్చిధనియాలరసముగాని మరియు పచ్చివస్తువుల రసములయందు అనగా యెటులఉచితముగానుండునో అటులకలుపుకొనవచ్చును. ఈమొదలగునవి ఏకముగాచేర్చి చేతితో మర్దించి కిరూతి చేసికొనవలెను. పచ్చివస్తువులరసమునందు కడుగుట వలన దీనికి కిరూతి ఖజర్ అని పేరు విధించబడినది.

(2) భేదము అనగా పిత్తసంబంధమగు రుధిరము ఊపిరితిత్తులయందు ప్రవేశించుట వలన ఊపిరితిత్తులు నిండియుండును. దీనివలన ఆమాశయము నందు మంట పీకు, వుశ్చన్నమైనచో శరీరము దానికష్టమును దూరవరచుటకై దగ్గుకలిగించుచున్నది. దీనిలక్షణములు శ్వాస గొప్పగను ఉష్ణముగానుండుట ముఖము యెర్రగానుండుట మరియు ఇతర చిన్నములు కారణమునకు సాక్షియగుట విశేషముగా ఈరోగమునందు వుమ్మి వెడలకుండుట యెందుకనగా ఇందుమలము పలచగానుండును. ఒక్కొకప్పుడు పిత్తముగాని కరిగదగ్గుకాని వ్వొల్పదగ్గువచ్చుచుండును.

## పిత్తజశోథింగాని చికిత్స

ఈరోగమునందు బానలిక లగు శిరావేధనము చేయవలెను. మరియు క్వాదములు, శీతకషాయములు మొదలగువానిలో యేదియుచితమగునో వానిని శరీరమును పృథుక్వాథము కలిగింపవలెను. మరియు సహూనత్వము సంతుష్టముకొరకు ముఖ్యముగా లేకిన కలుగనుపట్టి దగ్గునందు వర్ణించబడిన వానిని యీరోగమునందుపయోగించవలెను. మరియు కలిజా (యకృత్) యందు ఉష్ణమున్నచో యకృత్ యొక్క ప్రకృతిని సంతోషపరుచవలెను. దీనివలన రక్తము వ్రాపిరితిత్తులయందు చేరి దగ్గును కలిగించునది శాంతినొందును. మరియు ఈక్రింద వ్రాయబడిన కషాయము యీరోగమునందు లాభదాయకమగును.

ఉన్నాబ్, విహాసోడా (శ్లేష్మాంతకము) గౌజబాన్ (సీమఎద్దునాలుక) బనప్షా, ఖితమివిత్తులు, వచ్చిఅంజూరపండ్లు, మొదలగు వస్తువులు నీళ్ళలోవేసి కషాయముకాచి వడియబోసి బనప్షాషరబతుగాని, తురంజ్‌బీన్ షరబతుగాని కలిపి పానము చేయవలెను.

## తురంజ్‌బీన్ షర్బతు చేయుక్రమము.

బనప్షా తు 1 ము, ఉన్నాబ్ 20 కాయలు, సునాముఖి 6 మాషములు, ఖితమి 9 మాషములు యీవస్తువులు నీళ్ళలోవేసి కషాయముకాచి వడియబోసి 10 మాషములు తురంజ్‌బీన్ కలిపి పానము చేయవలెను.

## దగ్గును హరించు మాత్రలు

తుమ్మజిగురు, బాదంజిగురు, గోధుమసత్తు, తియ్యబాదంపప్పు, సారకాయవిత్తులు, దోసవిత్తులపప్పు, పందిరిదోసకాయగింజలపప్పు, ఈ వస్తువులు సమభాగములు తీసికొని మెత్తగానూరి దీనికి రెట్టింపు తురంజబీన్ కలిపి జేడానాగుజ్జుతో మాత్రలు చేయవలెను.

(3) నజులా కారణముగా వచ్చు దగ్గు లక్షణము చికిత్స

అనగా పూర్ణముగా వచ్చు నజులా యెట్టిదనగా ఒక స్రావము యెల్లప్పుడు తలపైవు దిగుచుండును. ఇది తల నుండి దిగి వూపిరితిత్తుల మార్గమునందు దురద, మంట కలిగించును. ఈ కారణముచేత దగ్గు రేగుచున్నది. దీనికారణము మెదడుయందు ఉష్ణము, ఉష్ణము సోకుటవలన దుర్బలత్వము యొక్క కారణమువలన లేనియెడల పుష్టికొరకు రసమును పచనము చేయగలుగును. మరియు అచ్చట కొవ్వు దానికి గురువుగా తోచును. అట్టిస్థితియందు విశేషమైనయెడల నజులా యను వ్యాధివలె వూపిరితిత్తులపైవు దిగనారంభించును. మరియు మెదడుయొక్క ఉష్ణము వలన అందు తీక్ష్ణముగు మంట కలిగించునట్టి దశ ప్రవేశించుచున్నది. దీని చిహ్నములు పొడిదగ్గు యెల్లప్పుడు నిలిచియుండును. దగ్గినప్పుడు వుమ్మిలేకుండును. రాత్రికాలమునందు, నిద్రించునసమయమునందు దగ్గు విశేషముగా వచ్చుచుండును. మరియు మెదడుయొక్క ఉష్ణము నజులా సారము దీనికి సాక్షియగును. ఈదగ్గు మిక్కిలి కష్టసాధ్యమైనదని గ్రహించవలెను. యీరోగమునకు తరుణమందు చికిత్స చేయక దీర్ఘకాలము వ్యాధి నిలిచియుండినచో వూపిరితిత్తులు క్షీణించి అందు వ్రణము వుత్పన్నమగును.

(లాభము) దగ్గినప్పుడు కళ్లి వెడలకుండుటకు కారణమేమనగా మలము పలచగా నుండుటవలన మరియు వూపిరితిత్తుల (లంగ్స) యొక్కయు రోమమ్ములయొక్క దోషములు సమానత్వము కలుగునంత వరకు దగ్గుచుండు యేమియూ కళ్లి (శ్లేష్మము) వెడలకుండును. ఇందువలననే సరహాఅజ్‌బాబ్ అను గ్రంథకర్తగారు దోషము దగ్గుతో బైటికి వెడలకుండిన దానిని గాలితీసివేయునంత చిక్కగానుండవలెను. గాన మట్టితో సమానముగా పొడిగానుండునది నీళ్ళతో సమానముగా పలచగా నుండిన అప్పుడు గాలి దూరపరచినచో దాని భాగములు అల్లుకొనును. మరియు రాత్రివేళ దగ్గు విస్తారముగానుండిన దానికారణము తలయొక్క

రోమాంచములు పొడుచుకొనుచున్నవి. ఎందుకనగా యీదశయందు రతూబతు అనగా చెమునీరు వాగసుపడదు నిలిచి విశేషమై వూపిరి తిత్తులపై సరించుచుండును రోగి నిద్రావస్థయందు వృష్ణము లోపల ఘనీభవించి రతూబతు పెలచారటి కోసిపేయుచున్నది. కాబట్టి ఆ రతూబతు మేలుకొనియుండునప్పుడు మెదడునుండి దిగినచో వూపిరితిత్తులకు చేరకముందే దానిని రోగి గ్రహించి వుమియుచున్నాడు. కాబట్టి వూపి తిత్తులవరకు ప్రవేశించకుండును గాని స్వల్పముగా ప్రవేశించును. మరియు నిదుర దీనికి విరుద్ధముగాయుండును. అనగా నిదుర సమయమునందు రోగి దానిని వూపిరితిత్తులవరకు ప్రవేశించకుండునట్లు గ్రహించజాలకుండును.

## నజలావలన కలుగు దగ్గు చికిత్స.

నజలా అనగా తలనుండి దిగునట్టిజలుబు. అందుకొరకై గసగసాల మస్మత్తు మరియు గసగసాలకాయపెంకు (పోస్తు) గంజాయివిత్తులు బాకలాగుజ్జు అధిరాజతలు కాహువిత్తులు, గులాబిపూలు, యీవస్తువులను కషాయముకాచి ఆకషాయముతో పుక్కిలించవలెను. దీనివలన మలము లోపలనుండి బైటికి తిరిగివచ్చును. ఈకారణమువలన వూపిరితిత్తులపైవు దిగకుండిన తలకు క్షవరముచేయించి మెత్తకబట్టతో కఠినముగా తలచర్మము నెర్రబడువరకు రుద్దవలెను. ఈసదుపాయమువలన లాభము కలుగనిచో అంజీరకషాయమునందు ఆవపిండికలిపి తలపై లేపనముచేసి కొంతవరకుంచిన దీనివలన తలచర్మముపై చిన్నచిన్నగుల్లలు లేచును, ఆగుల్లలు మాననియ్యక చాలాకాలముంచవలెను. ఇందువలన మలము బైటికివెడలిపోవును. వూపిరితిత్తులపైవు తిరుగజాలదు. ఇటులమలమును గట్టిపరచుటకై దగ్గుమాత్రలు నోటిలో నుంచుకొనవలెను. దీనివలన మలము వూపిరితిత్తులపైవును దిగగలుగును.

### ॥ దగ్గును శాంతిపొందించు మాత్రలు ॥

నిశస్తా (గోధుమసత్తు) కతిరా (బావంజిగురు) తియ్యబాదంపప్పు బాకలా (బొగడ) గసగసాలు పోస్తుకాయలు (గసగసాలకాయ బెరడు) సముగె అరబి (తుమ్మజిగురు) గిలెఅర్మని (వంటజేగురు) యీవస్తువులను సమానముగా తీసికొని చూర్ణించి వస్త్రగాలితముపరిచి ఇసప్‌గోలు గింజల గుజ్జుతో మాత్రలుజేసి యెల్లప్పుడు నోటిలోనుంచుకొని సారసు మింగుచుండవలెను.

మరియు బాదంపప్పుపైనుండు నెర్రిని చర్మమును తీసివేసి వేయించవలెను. యితర సమపాయములు నజులా, జుకాం, వ్యాధుల అనుసారముగా చేయవలెను. ఎటులననగా శిరావేదనము చేయుట శరీరమును మృదువరచుట ఇవిగాక ఆదశకు యోగ్యముగానుండునట్టి నజులా (తలనుండి స్రవించుజిగురుగల ద్రవము)ను హరించునట్టి వానిలోనుండి యిందు ఒకటి చెప్పుచున్నాను.

అనగా గసగసాలు, మునల్లిస్, (అంగూర అనగా వచ్చిద్రాక్ష రసము మూడుభాగములు, నీళ్లు ఒకభాగముకలిపి ఒకభాగము మిగులు నట్లుకాచి దించుకొనవలెను) దీనితోకూడా యివ్వవలెను.

మరియు పన్నీరు వాసనచూచుట మరియు మోహానభోగమును బాదంనూనెతో తయారుచేసి భుజించుట, మరియు నాతిప్ (నిదివక మోహానభోగము) పాలూదా (యవాగు) లాభదాయకమగును. మరియు, వేదసతైలమును తలకు మర్దించుట లాభదాయకమగును, మరియు ఈతైలములో పోస్తుకాయలనుకూడా చేర్చి కాచుట అతిపుత్తమము.

### ॥ వేముతైలము చేయుక్రమము ॥

వేముఆకులు దంచి, రసముపిండి రెండుభాగములు రసములో ఒకభాగము నువ్వులనూనె చేర్చి తైలము శేషించువరకు కాచి దించుకొని యుంచకొనవలెను, దీనిని వేద్‌తైలమందురు.

## (4) శీతదుష్టప్రకృతి వలన కలుగు దగ్గులక్షణములు.

సాధారణ శీతదుష్టప్రకృతి వూపిరితిత్తులయందు వుత్పన్నమై దగ్గు కలిగించును. నిది సాధారణ వుష్ణదుష్టప్రకృతి కారణమునకు విరుద్ధముగా నుండును. దీని లక్షణములు దీని శ్లేష్మముయొక్కరంగు గాజులో నమూనమైన రంగుకలిగి యుండదు. దాహము స్వల్పముగా నుండును. ఉష్ణగాలివలన, స్నానముచేయుటవలన శాంతినొందును. మరియు శ్లేష్మము తెల్లని రంగుకలిగి అందు స్వల్పముగా ఆకుపచ్చ రంగుకలిగి యుండిన యెడల దీనిని రసాళిఅందురు.

### శీతదుష్టప్రకృతి దగ్గుచికిత్స

ఈరోగము బాహ్యకారణము అనగా చల్లనిగాలి మంచుయందు నివసించుట, చల్లని జలపానమొనరించుట, మొదలగు హేతువులు ఈ రోగమునకు కారణమైనచో ముందు కారణములను దూరపరచి తదుపరి సాధ్యమైనంతవరకు శ్వాసను బంధించవలెను. యెందుకనగా శ్వాసను ఆపుటవలన వెంటనే ఊపిరితిత్తులకు వేడికలిగించి జలుబును వెంటనే నష్టపరచును. మరియు శరీరముయొక్క కార్యము అనగా మలము మొదలగు వానిని వెడలించుట, దీనికి సమానముగు కారణమైనచో అంజూరపండ్లు గింజతీసిన ద్రాక్షపండ్లు, యష్టిమధుకము, యీవస్తువులు వలియగొట్టి కషాయముకాచి తేనెతో చేయబడిన గుల్ ఖందు, మాజూను, కఫి, ఈ కషాయమునందు కలిపి పానము చేయవలెను. మరియు ఉష్ణరసాయనములు పుచ్చుకోవలెను. చంద్రతైలము, సౌసను తైలము, రొమ్ముపై మర్దించవలెను మరియు శుద్ధిచేసిన బాలింతబోలు, మియామె సాహిలి తేనెలో కల్పి కొద్దికొద్దిగా నోటిలో నుంచవలెను.

### మాజూన్ కఫి చేయుక్రమము

గింజతీసిన ద్రాక్షపండ్లు 24 మాషములు, కుంకుమపువ్వు, జటామాంసి, తజ్ (గుద్దలవంగపట్ట) దాల్చినచెక్క, కాయఫలపుచెక్క, యీవస్తువులు ప్రత్యేకము 3½ మాషములు, కస్కవపుభరీరా పుకావా

(పుత్తులేనిసారాయి) ముంజగడ్డి, అవేకులిబతం, (ఇది వకవిధమగు జిగురు) నల్లగుగ్గిలము, యివి ప్రత్యేకము 5½ మాషములు, శుద్ధిచేసిన బాలింతబోలు, 14 మాషములు, నిర్మలమైన తేనె అవశ్యకతానుకూలముగా తీసికొని నూరవలసిన వస్తువులను చూర్ణించి భావన చేయవలసిన వస్తువులను భావనచేసి తేనెతో కల్పుకొని మాజూజా చేయవలెను. నల్లగుగ్గిలమును మాత్రము ముసలున్ (అంగూరఅనగా వచ్చిద్రాక్షరసము అర్ధాంశముగా కాచినది) అందు భావనచేసి కల్పుకొనవలెను.

### లహూక్రసాయనము చేయుక్రమము

ఈరసాయనము ఈవ్యాధి విషయమై మిక్కిలి లాభదాకమగును. ఆడ్యాలుమూరి అవిశిగింజలగుజ్జు తేనె ఈవస్తువులను సమానముగా తీసికొని వకటిగా చేర్చిన లహూక్రసాయన మనబడును. ఈరసాయనము యీవ్యాధియందు ఉపయోగకారి. సల్లిస్అనగా వచ్చిద్రాక్షరసము తీసి పొయ్యిమీదనునిచి అర్ధాంశముగాకాచినచో సల్లిస్అనబడును.

### (౫) శిరోజకాంచన కానలక్షణములు.

తలనుండి మలముదిగి వూపిరితిత్తులయందు స్నిగ్ధముగను చిక్కగను మారి వూపిరితిత్తులయందు నిలిచియుండును. దీని చిన్నెములు అనగా జుకాము (జలుబు) వ్యాధి యొక్క భేదము. ఇట్లు సంభవించుట స్నిగ్ధమగు దోషము యొక్క విశేషత్వము వలన దగ్గు కలిగియుండుట రొమ్ము బరువుగానుండుట మొదలగులక్షణములు కలిగియుండును.

### తలనుండి మలము దిగుట వలన కలుగు దగ్గు చికిత్స

మలమును మెత్తపరచి పక్వపరచుటకై జూపా అంజూరవండ్లు మెంతులు యష్టిమధుకము సౌసన్ విత్తులు ఈవస్తువులను సమానభాగముగా తీసికొని కషాయముకాచి వడియబోసి తేనెతోకలిపి పానముచేయవలెను. రొమ్మునందుఉష్ణముండినచో సౌసన్ విత్తులు శ్లేష్మాంతకము యీవలు ఈ మొదలగువస్తువుల కషాయముకాచి వడియబోసి ఇందు తురంజబిన్ బాదంనూనెకలిపి పానముచేవలెను.

### కొమ్మునకు మురహిక వరము మాజూన్.

ఎంటుబూషా, పొదినా, సొసన్ వేళ్ళు, ఆనాలు, కొండకరివేపాకు, పిప్పళ్ళు, అంజరా, (పుటంగన్) రూమిసోపు ఈవస్తువులు సమభాగము లుగా తీసికొని చూర్ణించి తేనెలో కలిపి మాజూన్గా చేయవలెను. ఈ మాజూన్ చిక్కని ములుపుని వర్ద్వాగ్రహముగను.

### శ్లేష్మమును వెడలించు మాత్రలు

యష్టిమధుకము 17½ మాసములు పిప్పళ్ళు 17½ మా॥ కరివేపాకు బాలింతబోలు చేదుబాదంపప్పు ఇవిప్రత్యేకము 7 మాసములు ఇంగువ 3½ మాసము ఈవస్తువులు చూర్ణించి వస్త్రగాలితమొనరించి తేనె నీళ్ళ తోనూరి మాత్రలుచేసి యుంచుకొనవలెను.

(2) అథవా యష్టిమధుకము మిరియాలు శర్కర ఈవస్తువులు సమానభాగములుగా గ్రహించి సోపురసముతో నూరి మాత్రలుచేసి కొని వుపయోగించుట వలన పైఔషధముతో సమానగుణము నిచ్చును.

(3) బాలింతబోలు మిరియాలు గవ్వపలుకుసాంబ్రాణి ఇవిప్ర త్యేకము సమభాగములు. నల్లమందు 9 రతులు, ఈవస్తువులు నూరి మాత్రలుచేసికొని ప్రత్యేకము 6 రతుల చొప్పున మాత్రలుచేసి రాత్రి పరుండునపుడు నోటిలో నుంచుకొనిన రాత్రి నిద్రించునపుడు దగ్గుఅధి కమై పరుండుటకువీలుకలుగ నియ్యకుండునట్టి దగ్గుశాంతినొందును.

(గమనించవలసిన అంశములు) ఒకొక్కప్పుడు స్నిగ్ధమగు చె మ్మతలనుండి సర్వదా వూపిరితిత్తులపై ప్రవేశించుచుండును. ఇట్టిరోగ మునకు శిల్ (వూపిరితిత్తులుక్షీణించి వ్రణములుకలుగునట్టిరోగము) రోగము గలవానికి సమానముగా నుండును. మరియు ఈరెంటియందు భేదముండి నచో శిల్ యొక్క వర్ణనమందు చెప్పబడును.

మరియు పక్వమగుదోషము అనగా సమానముగను వలచగను చిక్కగను అనగా మిక్కిలి పలచగాగాని మిక్కిలి చిక్కగాగాని యుం

డక పీలిరంగుగాగాని పచ్చగాగాని కరిగిన గాజువలె రంగుకలిగి నల్లగను మట్టిరంగు కలిగి యుండినచో దుర్గంధముయొక్క చిహ్నములగునుగాని పక్వచిహ్నములు గావని గ్రహించవలెను.

**(౮) రొమ్ము ఊపిరితిత్తుల చెమ్మవలన కలుగు దగ్గు లక్షణములు.**

ఊపిరితిత్తులయొక్క చెమ్మ రొమ్ముయొక్క చెమ్మ దగ్గుకలుగుటకు కారణమగును. ఇట్టిదగ్గు వృద్ధులకున్ను చెమ్మగల ప్రకృతిగలవారికిన్ని విశేషముగా పుట్టుచున్నది. దీని చిహ్నములు కఫము విశేషముగా వెడలుట కఫము గొంతులో చుట్టుకొనుట రొమ్ములో గరగరలాడుట ముఖ్యముగా నిదురలోనున్న నిద్రించిలేచినవెనుక విశేషముగా దగ్గువచ్చుట యీ మొదలగు లక్షణములు కలిగియుండును.

**రొమ్ము ఊపిరితిత్తుల చెమ్మవలన కలుగు దగ్గు చికిత్స.**

మలమును పక్వపరచుటకై సోపు, అజామోదం, యష్టిమధుకం మెండుజూఫా, రాజహంస, యీవస్తువులను కషాయముకాచి పానము చేయవలెను.

మలమును పక్వము నొందించినవెనుక కఫమును వెడలించుటకై పరిశ్రమ చేయవలెను. అనగా ముల్లంగివిత్తులు, యష్టిమధుకము, యీ రెంటిని నీళ్లలో వేసి కషాయముకాచి వడియబోసి తేనెకలిపి పానము చేసి వాంతిచేయించవలెను. మరియు విరోచనమునకై యారజ్ రూవన్ చెమ్మను నిల్పుటకై యీక్రింద వ్రాయబడిన రసాయన ముపయోగించవలెను.

యష్టిమధుకము, మెండుజూఫా, సోసన్ వేరు, బాదంపప్పు, యివిప్రత్యేకము 24 మాషములు. యింగువ, వుటంగణవిత్తులు, 3½ మాషములు యీవస్తువులను చూర్ణించి వస్త్రగాలిత మొనరించి తేనెలో కలిపి రసాయనముచేసి వుపయోగించవలెను.

మరియు యిటులనే చెమ్మను ఆర్పివేయునట్టి వస్తువులు అనగా వేయించిన మాంసము వెండించిన మాంసము భుజించుట పరిశ్రమ

చేయుట చెమ్మను కలిగించునట్టి వస్తువులను వర్జించుట మొదలగు నవి పాచనములు చేయవలెను. మరి కొన్ని ఇతర ప్రయోగములు 5వ భేదము నందు చెప్పిన వానిని చేయవలెను.

మరియు యీ రోగమునందు రోగగ్రస్తునకు విరోచనఔషధముల యొక్క అర్థమైన కఫమును వెడలించునట్టి ఔషధములు అనగా ఉన్నాబ్ 10 కాయలు, జూఫా 7 మాషములు, ఖతమి ఖుబ్బాజి 10 మాషములు, సనాముకి 10½ మాషములు, పిప్పలి అంజీరపండ్లు 5, గింజతీసిన ద్రాక్షపండ్లు 2 తులములు, యీ వస్తువులను కషాయముగా చేసి వడియబోసి 52½ మాషములు తేలగావున్న బంగుగ తురంజ్‌బీన్ 5 తులములు బాదంనూనె 3½ మాషములు కలిపి పానముచేయవలెను. మరియు దగ్గు అధికమైనయెడల యీ క్రిందచెప్పబడిన చూర్ణము లాభదాయకమగును.

## కాసహర చూర్ణము.

మిరియాలు, వాకుడువిత్తులు, సాంబర్ లవణము, యీ మొదలగునవి సమానభాగములుగాతీసి వస్త్రగాలిత మొనరించి యుంచుకొని దగ్గు అధికముగా నుండినప్పుడు కొద్దిగానోటిలోనుంచుకొనవలెను.

## (7) ఊపిరి తిత్తుల శుష్కత్వమువలన కలుగు దగ్గు లక్షణము

ఊపిరితిత్తులయొక్క శుష్కత్వము ఉష్ణమువలన దగ్గు కలుగుటకు కారణమగును. దీని లక్షణములు దాహము ఉదరయొక్క దశయందు గతి యొక్క కారణమువలన దగ్గు అధికమగును కాబట్టి చెమ్మను నష్టపరచునట్టియు, శుష్కత్వమును అధికపరచునట్టి వస్తువులను ఉపయోగించవలెను. అనగా హమ్మామ్ కుర్తిజ్ (స్నానము చేయునది యము. ఇందు చెమ్మ పుష్పన్నమగును) తో మరియు, యేవస్తువు చెమ్మను కలిగించునో అట్టి వస్తుశేవన తక్కువైపోవును. అనగా యావగంజిలో పారెడు నీటిలో నివసించు పీకలు (ఎండ్రకాయలు) చేర్చిగాని లేక ఇటువంటి అన్యపదార్థములుగాని ఉపయోగించవలెను.

మరియు, శ్వాసయందు కష్టము, దగ్గి ప్రేమ శ్లేష్మముతో వెడలకుండుట, శరీరము బిగ్గరపట్టుట, నాడి శీఘ్రగామియై వెంటవెంట నడుచుట యివి మొదలగునవి దీని చిహ్నములు. మరియు, దగ్గురోగము శ్వాస కష్టముగా వెడలుట దీనికి కారణము. బాగా ఈ రోగము అధికమైనకొలది హృదయమునందు వ్యష్టము హెచ్చి ప్రవేశించును. ఇట్లు హెచ్చుటవలన జ్వరసంబంధమగు క్షయమునందు మారును.

ఊపిరితిత్తుల శుష్కత్వమువలన కలుగు దగ్గు చికిత్స

యవగంజి, ఇసప్‌గోలు గింజలగుజ్జు, దోసకాయ రసము మొదలగునవి విరోచన ఔషధములగు అను పానముగా యివ్వవలెను. మరియు, చల్లని మాత్రలు చెమ్మను కలిగించునట్టి వస్తువులు అనగా యష్టిమధుకము, దోసగింజలపప్పు, గోధుమసత్తు, కతీరాగోందు (బాదం జిగురు) బనప్‌షా, బేదానాగుజ్జు, యివి మొదలగునవి నూరి కోడిగ్రుడ్డు తెల్లసొనతో మాత్రలు చేయవలెను. ఈ మాత్ర నోటిలో నుంచుకొనవలెను.

మరియు, కిరోతి, బనప్‌షా తైలము, సొరకాయగింజల తైలము, తెల్లమైనముతో యేర్పరచబడిన కిరోతి రొమ్ముపై మర్దించవలెను. మరియు, తుంట్లయందు, గుదస్థానమునందు, పాదములయందు, బాదంనూనె లేపనముచేయవలెను. మరియు, ఈరోగి దాహము పుచ్చుకొను జలమునందు బేదానా గుజ్జు కలిపి యివ్వవలెను. భోజనములయందు చెమ్మను కలిగించునట్టి వస్తువులు అనగా పొట్టుతో చేయబడిన గంజి, బాదంనూనె, యవలు తినునట్టి మేకపాలు, పెద్దకోడిమాంసము, మేకకాళ్ళ నేరువా, యవాగులు, పటికిబెల్లము, బాదంనూనె, గసగసాలు యివి మొదలగు వస్తువులుగాని లేక ఇటువంటి గుణముగల వస్తువులుగాని పుచ్చుకోవలెను. ఈరోగమునందు జ్వరముండిన యెడల పాలుపుచ్చుకొనకూడదు. జ్వరములేనిచో పాలుపుచ్చుకొనవచ్చును. ఈ రోగమునందు పాలుపుచ్చుకొనుట గొప్ప నదుపాయము, మరియు,

గోరువెచ్చని యీ నీళ్ళతో స్నానముచేయుట, చెమ్మను కలిగించునట్టి కషాయములయందు కూర్చుండుట లాభదాయకమగును.

### (8) భేదము దగ్గు లక్షణములు

ఊపిరి తిత్తులయందు పొగ, దుమ్ములవలన బిగ్గరగా అరచుట వలనగాని గరి ప్రవేశించి దగ్గు సంభవించును.

### (8) భేదము దగ్గు చికిత్స

రసాయనము పుచ్చుకొనుట యవాగులను పానముచేయుటవలన ఊపిరితిత్తులయొక్క గరి తగ్గిపోవును. మరియు, వాశుభ్రిత పృథుత్వము సంప్రాప్తించును. మరియు, చెమ్మను కలిగించు మాత్రలు నోటిలో నుంచవలెను. చెమ్మను కలిగించునట్టి తైలములను కొద్దికొద్దిగా పానముచేయవలెను. మరియు, ఈ తైలములను రొమ్ముపై మర్దించుచుండవలెను ఈ తైలములతో తుంట్లు, గుదస్థానమును, స్నిగ్ధపరచవలెను.

### రసాయనము చేయు క్రమము

బనప్షా, కతిరా, దోసవిత్తులపప్పు, నేతిబీరకాయగింజలపప్పు, తెల్లగసగసాలు, యీవస్తువులను చూర్ణించి ఇసప్గోలుగింజలగుజ్జు బేదానా గుజ్జునందు కలిపి పుచ్చుకొనవలెను.

బనప్షా తైలమునందు బాదముపప్పుగాని లేక యిటువంటిగుణములుగల వస్తువులు కలుపుకొనుట అతివుత్తమముగా నుండును.

### హరీరా (యవాగు) చేయు క్రియము.

పొట్టుతీసినయవలు, తెల్లగసగసాలు యీరెండు నీళ్ళలోనూరి శర్కర బాదంనూనెచేర్చి గంజిచేయవలెను. మరియు యేడవభేదమునందు చెప్పబడిన చికిత్సలు యీరోగమునందు వుపయోగించుట లాభదాయకమగును.

## (9) భేదము దగ్గు లక్షణములు

ఊపిరితిత్తుల రొమ్ము యొక్క వ్రణము వాటివాపు లేక రొమ్ముసంబంధము పొరవాపు లేక హృదయము ఊపిరితిత్తులమధ్యనుండుపొరయొక్క వాపువలనగాని లేక యకృత్ (లివరు) ప్లీహముయొక్క వాపుగాని గొంతుపీకెవాపు యీమొదలగు వానియందు వాపుగలిగి దగ్గు వుత్పన్నమగుటకు కారణమగును. యీమొదలగు వానివర్ణనము నప్ఫుద్దామ (నోటినుండిరక్తము వెడలుట) మరియు (శిల్ ఊపిరితిత్తులు శుష్కించుట వ్రణములేచుట) మరియు రొమ్మువాపు ఊపిరితిత్తులు వాపు ప్రక్కవాపు వరసాం (ఆమాశయము యకృత్ మధ్యనుండుపొర) వాపు గుండెవాపు మరియు ప్లీహముయొక్కవాపు నందు చెప్పబడును. మరియు పీకెవాపు గొంతువాపు శ్వాస బిగబట్టుట యందు వర్ణించియున్నాను.

(సూచనీయము) యకృత్ (లివరు) మొదలగు లోపలి యితర అంగముల వాపువలన దగ్గువుత్పన్నమగును. అనగా గుండెపొరయొక్క తలయందుగాని లేక దాని క్రిందిభాగమునందుగాని వాపు జనించును. మరియు గుండె వ్రేలాడునట్టి స్థలమునందు లాగుచుండును. యెటులన నగా పొరలు కలిసి యుండినచో ఊపిరితిత్తులు లాగునట్టి స్థలమునందు కూడా పీకుచుండును. మరియు కష్టము అధికమగును. దీని భాగములు లాగుచుండుటవలన శ్వాస మార్గములు చిన్నవగును. ఇట్టి స్థితియందు యకృత్ నందుగలశక్తి కష్టమును దూరపరచుటకై గాలిని నడుపుచుం డును. అట్టి స్థితియందు దగ్గుకలుగును. ఈదగ్గు శుష్కత్వము నొప్పి, పీకు మొదలగు చిన్నములతో కలుగగలదు. మరియు యేఅంగమునందు విపత్తుయున్నదో ఆ అంగముయొక్క విపత్తి చిన్నములు ప్రకటన మగును.

## 10 ఊపిరితిత్తులయందు గుల్లలు లేచుటవలన కలుగు దగ్గు లక్షణములు.

ఊపిరితిత్తులయందు గుల్లలు ఉత్పన్నమై దగ్గును కలిగించును. దీనికారణము పిత్తసంబంధమగు రక్తముయొక్క వరాకృమువలన గుల్లలు కలుగుచున్నవి. ఈరోగమునకు బునరాత్తున్ సుఅల్ (దగ్గుచు పుట్టించునట్టి గుల్లలనిభావము) అందురు. దీనిలక్షణములు నాడి శీఘ్రముగా నడుచుట, మూత్రము వేడిగా వెడలుట, జలుబువలన లాభము ప్రాప్తించుట, ఉష్ణమువలన కష్టముగానుండుట మొదలగు లక్షణములు కలిగియుండును.

### ఊపిరితిత్తులయందు గుల్లలు లేచుటవలన కలుగు దగ్గు చికిత్స

ఈరోగమునందు శిరావేదన చేయుట, రక్తము వెడలించుట, రతులువేయుట మొదలగునవి చేయవలెను. మరియు, పిత్తమును విరోచనముద్వారా వెడలించవలెను. మరియు, రెండవభేదమునందున్న గొంతుయందు గుల్లలు లేచుటవలన కలుగు వ్యాధియందు చెప్పబడిన చికిత్సలు ఈరోగమునందు వుపయోగించును.

## (11) ఆమాశయము సంయోగమువలన కలుగు దగ్గు లక్షణములు.

ఆమాశయము యొక్క సంయోగమువలన దగ్గు ఉత్పన్నమగును. దీని లక్షణములు ఆమాశయము పూర్ణముగానుండు దశయందు దగ్గు విశేషముగానుండును. ఆమాశయము రిక్తదశ పొందినప్పుడు తగ్గిపోవును. ఈ మొదలగు చిన్నెములు కలిగియుండును.

### ఆమాశయ సంయోగ దగ్గు చికిత్స.

వమన విరోచన కర్మవలన ఆమాశయమును పరిశుభ్రత నొందించవలెను. మరియు బనప్సామరబతు, జూపామరబతు వుపయోగించి దగ్గును శాంతి నొందించవలెను.

ఊపిరితిత్తుల యందు వాతము ప్రవేశించుట వలన కలుగు దగ్గు లక్షణములు.

(సూచనీయము) తీక్ష్ణమగు వస్తువుల భోజనము చేయుటవలన ఊపిరితిత్తుల ముఖము నందు భారముకలుగుటవలన దగ్గువుత్పన్నమైన చో తనకుతాను తగ్గిపోవును. అనగా హేతువు నష్టమగుటవలనతగ్గిపోవుచున్నది. ఒకొక్కపుడు ఊపిరితిత్తులయందు వాతము నిండి యుండి దగ్గును పుట్టించును. దీని లక్షణములు నలుపుగను నీలిరంగుగను బూడిదెరంగు గలశ్లేష్మము దగ్గునందు వెడలుచుండును. మరియు వాతము యొక్క యితర చిహ్నములు కూడా కలిగియుండును.

ఊపిరి తిత్తులయందు వాతముచేరుటవలన కలుగు దగ్గు చికిత్స

గోధుమపొట్టుతో చేయబడిన గంజియందు శర్కర తేనెకలిపి పానము చేయవలెను. మరియు వాతనాశకరమగు విరోచనకర్మ చేయవలెను. భోజనమునందు శెనగకట్టు, కోడిమాంసము, యౌవ్వనముగల మేకమాంసముతో తయారుచేసిన పదార్థములను భుజించవలెను. దగ్గు ఊపిరితిత్తులకు ఎటువంటిదనిన మెదడునకు తుమ్ము అనగా మెదడునకు తుమ్మువలన కష్టము దూరమగును. అటులనే ఊపిరితిత్తులకుకూడా దగ్గు వలన కష్టము దూరపరుచబడుచున్నదని గ్రహించవలెను. పరాత్పరుడు ఊపిరితిత్తులనుమాంసముతో ఏర్పరచినాడు. వీనిరంగుగులాబిపువ్వురంగువలెనుండును. దీని అంగము నల్లగను ఛిద్రములు గలిగి రెండుభాగములుగానుండును. ఒకటి కుడివైపునందున్న. రెండవది ఎడమవైపునున్నది. ఈ రెంటిమధ్యభాగము నందు హృదయమున్నది ఊపిరితిత్తులయొక్క కుడిభాగము ఎడమభాగముకంటె మిక్కిలి పెద్దదిగానుండును. మరియు హృదయకమలము ఎడమవైపునకు మిగిలి వాలియున్నది. పరమాత్ముడు ఊపిరితిత్తులను హృదయకమలము యొక్క ఆధీనపరచినాడు. అనగా చల్లనిగాలి హృదయమునందు ప్రవేశింపజేయును. లోపలి ఆవిరి గల గాలిని బైటకుతీసివేయుచున్నాడు. మరియు ఊపిరితిత్తులను హృదయ

ము యొక్క వింజామరము (వినవకరి) అనుచున్నారు. మరియు దగ్గు కలుగుటకు మూడు కారణములుగలవు.

(1) వాలము అనగా బైటినుండి మనుజునిశరీరమునందు ప్రవేశించునట్టి వస్తువు.

(2) బాసలా (ఈవస్తువు శరీరమునందు ప్రవేశించకనే గుణము కలిగించును.)

(3) సావకా ఈవస్తువు శరీరమునందు స్థిరముగానుండు వస్తువు ద్వారా గుణము కలిగించును.

## నపస్సుద్దం (నోట రక్తము వెడలుట) లక్షణము.

ఈవ్యాధి యేమవిధములుగానుండును. (1) నోటిభాగముల యందు అనగా చిగుళ్ళయందును, దంతమూలములయందుండి రక్తము వెడలుట దీని లక్షణములు. పుమియునప్పుడు రక్తము వెడలుచుండును.

దంతములనుండి రక్తము వెడలుటకు చికిత్స.

మలమును ఆక్రమించునట్టి వస్తువులు అనగా అధిరా, దానిమ్మ పూలు, మాదిఫలయు పటికి ఈవస్తువులు కషాయముకాచి పుక్కిలించవలెను. ఈస్థానములయందు వ్రణము నూతనముగా కలిగినచో కహరోబా, (దీనిని అరబ్బిభాషయందు దంమ్యల్ అఖ్వైన్ అందురు) గవ్వపలుకు సాంబ్రాణి యీ మొదలగువస్తువులు మెత్తగానూరి ఆవ్రణముపై వేసిన యెడల వ్రణముమాని పోవును రక్తము నిలిచిపోవును.

(2) నోటి వెంట రక్తము వెడలు లక్షణములు.

గొంతులోభాగమునందు జలగపట్టు బట్టియుండునట్టి కారణము వలన నోటి వెంట పుమ్మియందు కలిసి రుధిరము వెడల నారంభించును ఈ జలగ గొంతులో పట్టుకొని యుండు విషయమై వెనుక వర్ణించి యున్నాను గాన ఇందుకు చికిత్స జలగను తీసివేయుట యనియు, అట్టి సదుపాయములను వెనుక వ్రాసియున్నాననియు గ్రహించవలెను.

### (౩) తలనుండి రుధిరము వెడలు లక్షణములు

తలనుండి రక్తము దిగి అంగిలి నుండియు, కొండనాలుక వెంట వెడల నారంభించును. దీని లక్షణములు కాండ్రించిన వెంటనే రక్తము వెడల నారంభించును. మరియు, నకసీరు (ముక్కు అదురుట) యొక్క ఇతర చిహ్నములు అనగా ముఖము యెర్రగా నుండుట కండ్లు ఎదుట మెరుపువలెతోచుట పుర్మికేసిన వెనుక తల తేలికగానుండుట తత్పూర్వము తల బరువుగానుండుట మొదలగు లక్షణములు ప్రకటనమగును. మరియు, కాండ్రించుట దీని ప్రసిద్ధిగతి అందురు అనగా అంగిలినుండి ఒకవస్తువు దిగి తలనుండివచ్చు దానిని తీసివేయుటకు ముఖ్య సాధన మునుచున్నారు.

### (౩) తలనుండి రుధిరము దిగుటకు చికిత్స

కిఫాల్ అను శిరావేధన చేయవలెను మెడపూసలపైన కత్తితో గంట్లువేయవలెను. మరియు, ఝూవు, మాచికాయలు, పుసారెలహిత్తుత్రిన్, అధిరఆకులు, మొదలగు వస్తువుల కషాయముతో నస్యము, మరియు రుబూబ్ కావుజాతో అనగా రుబ్ బిహి (బేహానా కాయబెరడుతో చేసిన రుబు) పచ్చి అంగూరు, జలఆహూర్ (ఒకగడ్డి) పన్నీరు యీ మొదలగు వానితో పుక్కిలించవలెను.

మరియు, శీతదోషమును ఆక్రమించునట్టి వస్తువులు గొంతు పీకె వ్యాధులయందు చెప్పబడియున్నవి. ఆవస్తువులను శెనగపులును నందు చేర్చి నొసలుపై లేపనము చేయవలెను. రక్తమోక్షణము చేయునప్పుడు మలము నిండియుండు లక్షణములు ప్రకటనమైనను లేక రక్తాధిక్యము కలిగియుండిన యెడల పైనవర్ణించిన నదుపాయములవలన గుణము గలుగును.

### (౪) ఊపిరితిత్తులనుండి వెడలు రుధిర లక్షణములు

ఊపిరితిత్తుల ముఖమునందుగాని, లేక ఊపిరితిత్తులయందుగాని వ్రణము కలుగును. దీనికారణమువలన నోటివెంట రక్తము వు

మ్మతో కలిసి పడుచుండును. వీకెయందు ఊపిరితిత్తుల ముఖమునుండి యున్న వ్రణము కలుగుటకు కారణము దెబ్బ తగులుటచేగాని, అమరుట వలనగాని, కలుగుచున్నది. అనగా రొమ్మునపైగాని, మెడయొక్క అంగములయందుగాని దెబ్బ తగిలిన కారణము వలన కొన్ని నరములు వుబ్బిగాని, లేక కఠినమగు దగ్గుగాని, లేక విశేషభీకరముగ అరచుట, విస్తారముగ మాట్లాడుట, మొదలగు కారణములవలన వీకెయొక్కయు, ఊపిరితిత్తియొక్క ముఖసంబంధమగు నరములు ప్రేలిపోవును. అనగా వమనాధిక్యము కఠినక్రోధము, మిక్కిలి కోపము, మొదలగు కారణముల వలనకూడ నరములు ప్రేలిపోవుచున్నవి. దీనిలక్షణములు అనగా రక్తము క్రిందిపైవునుండి కాండ్రించినపుడు కొద్దిగ వెడలుచుండును. వీకెనుండి వెడలినచో నిర్మలమగు రుధిరము దగ్గులేకనే వెడలనారంభించును. ఊపిరితిత్తులయొక్క ముఖమునుండి వెడలినచో దగ్గుకలిగి కాండ్రించినపుడు స్వల్పకాంతిగల రక్తము వెడలనారంభమగును. ఈరక్తము వెడలునపుడు శూలకలిగించును. కాండ్రించుటవలన శబ్దమగును. గాని నిది ముఖ్యముగా క్షతస్థానమునందుండు వస్తువులను తీసివేయును.

—ఊపిరితిత్తుల వ్రణమువలన వెడలు రక్తముయొక్క చికిత్స—

మలమును ఆకర్షించునట్టి వస్తువుల కిషాయములతో పుక్కిలించవలెను. నోటిరక్తమును ఆపునట్టి మాత్రిలను నోటిలో నుంచుకోవలెను.

—ఈమాత్రిలు చేయు విధానము—

వరటజేగురు, కహరోబా, తుమ్మజిగురు, దమ్ముల్ఖవయిన్, (హిందీలో ఈరాదమ్ఖిగోంద్ అందురు) తవాష్కిరి, నిశస్త, (గోధుమపాలు, ఇగరబెట్టినసత్తు) కతిరా (బాదంజిగురు) అకాకియా (లేతతుమ్మకాయ రసముతీసి ఎండబెట్టినది) దానిమ్మపూలు, ఉసారెలహెతుత్రీస్, యీమొదలగు వస్తువులన్ను చూర్ణించి వస్త్రగాలితమొనర్చి బార్తంగ్

ఖుర్ఫా, (పెద్దపాయలాకు) రసముతో నూరి బిళ్ళలు (Tablets) చేసికొని యుంచి సమయానుకూలముగ నోటిలో నుంచుకోవలెను.

మరియు శిరావేదనము చేయుట కూడా యీవ్యాధి యందు వుచితమగును. వూపిరితిత్తిని ఖమయొక్క వ్రణవిశేష కఠినముగానుండును. మరియు వ్రణము కేవలము ఊపిరితిత్తియొక్క ముఖములో వటి పొరయందు కలుగుచున్నది.

5 వ-భేదము. వూపిరితిత్తులనుండి రక్తము వెడలు లక్షణములు

* అనగా ఊపిరితిత్తినుండి రక్తము వెడలనారంభించును, ఇట్లు వెడలుటకు ఎనిమిది కారణములు కలవు. (1) దెబ్బతగులుట, అదురుటవలన, (2) బలవంతముగా గట్టిగా తుమ్ముటవలన ఊపిరితిత్తియొక్క నరములు పేలిపోవును. (3) తీక్ష్ణమగు లవణసంబంధమగు క్షారపిత్తజ దోషము ఊపిరితిత్తులపై ప్రవేశించి దాని నరములను హరించును. (4) ఊపిరితిత్తులయొక్క గుల్లభాగమునందు మలదోషము నిండియుండి దీని విశేషనరముల ముఖములు శుష్కించి పోవుటగాని,

* ఈఅయిదవభేదముయొక్క వర్ణనమునందు యీగ్రంథకర్తయొక్క ఎనిమిది కారణములుగా భాగించియున్నాడు, గాని వ్రాయడములో అయిదు కారణములు వ్రాసియున్నవి కాబట్టి గ్రంథకర్తయొక్క పొరపాటువలన వ్రాయలేదని కొందరున్ను మరికొందరు లేఖరియొక్క పొరపాటని భావించుచున్నారు. మరికొందరు అనేక కారణములు వకటి కొకటి సంబంధముకలిగియున్నవి. ఎటులననగా దెబ్బయొక్క గాయముతో తీక్ష్ణదోష పిత్తముగల క్షారదోషముసమానముగానుండును. నరములముఖము చిట్లుట పేలిపోవుట యీరెంటియొక్కకారణము వకటియే గాన యీగ్రంథకర్త వీటిని వేరువేరుగా వర్ణించుట యోగ్యము గానుండునని గ్రహించలేదు. యింతియే వర్ణనముతో సమాప్తి చేసెను. నాఅభిప్రాయములో ఈగ్రంథకర్త కధాచిత్ యొక్క శబ్దమువలన మూడు కారణములు ముందుచెప్పియున్నాడు. లెక్క శబ్దము అందుపైన వ్రాయబడి వుండలేదు. కాబట్టి నిస్సందేహముగా అవి 8 కారణములకు పైగా నున్నవి, అనగా ఆ మూడు కారణములు కలిసి 8 కారణములు పూర్తిఅయినవి.

లేక విశేషములను నిండుటవలన నరములు చిట్లిపోవును. (5) అనగా శుష్కింపచేయునట్టి చల్లని దుష్టప్రకృతి ఊపిరితిత్తులయందు ఉత్పన్నమై దీనిభాగములను శుష్కింపజేసినచో ఈకారణమువలన ఊపిరితిత్తియొక్క యేదో ఒకనరము బ్రద్దలై పోవును. గాన ఊపిరితిత్తిలో నుండి రుధిరము వెడలుటకు కారణమగును.

దీనిచిహ్నములు దగ్గులేకనే రక్తము వెడలకుండును. మరియు నిర్మలముగను మెరిసిన కాంతిగల రక్తము వెడలుచుండును. రక్తము వెడలునపుడు నొప్పిలేకుండును. ఎందుకనగా ఊపిరితిత్తియొక్క అంగమునందు తిమ్మిరి కలిగియుండును. మరియు రక్తము ఊపిరితిత్తియొక్క మాంసమునుండి వెడలుచుండినయెడల పలచగను మెరుపుతక్కువగా నుండును. గాని దగ్గుమాత్రము కఠినముగా నిలిచియుండును. నొప్పిమాత్రము కలుగకుండును. మరియు రక్తము, నరములు, మాంసము, కరిగిపోవుటవలన వెడలుచుండినయెడల ఆరక్తమునందుకూడా మెరుపు రంగు తక్కువగానుండును. ప్రారంభమునందు కొద్దిగా వెడల నారంభించును. ప్రతిదినము మాంసము కరిగినకొలది రంధ్రము పెద్దదగును. ఛిద్రము పెద్దదయినకొలది రక్తముకూడా హెచ్చుచుండును.

మరియు రక్తము నరములు చిట్లుటవలన వెడలుచుండినయెడల మిక్కిలి నెర్రగానుండును. గాని యీరక్తమునందు కాంతి హీనముగా నుండి పర్యాయము విశేషముగా వెడలును.

మరియు తీక్షదోషకారణములవలన రక్తము వెడలనారంభించిన చో ప్రథమమునందు జ్వరకారణమగును ఇందువలన ఈరక్తమునందు కాంతికలుగును. ఇది ప్రత్యక్షదృష్టాంతమగును. మరియు రక్తముయొక్క తీక్ష్ణత్వమువలన ఊపిరితిత్తియందు వ్రణము కలిగినచో పచ్చని నీళ్ళు చీము, పక్కులు, చర్మపుముక్కలు, రక్తములో కలిసి వెడలనారంభించును. దీనికారణము ఊపిరితిత్తియొక్క గుల్లభాగమునందు రక్తము నిండియుంచుటవలన విశేషముగా పెరిగిపోవుచున్నది. దీనిని తీసివేయుట

వలన సౌఖ్యముగను, తేలికగను, హాయిగనుండును. మరియు గుల్లభాగము అల్లుకొనునట్టి లక్షణములు ప్రకటనమగును.

మరియు రక్తజవావ్రయొక్క కారణమువలన రుధిరము పుల్పన్నమయినచో కొంచెము కరినముగా వెడలుచుండును. మరియు వ్రాపిరితిత్తియొక్కవావు చిహ్నములు ప్రకటనమగును.

ఊపిరితిత్తులనుండి వెడలు రుధిరచికిత్స.

మలమును తగ్గించుటకై ఊపిరితిత్తినుండి రక్తమును తొలగించుటకై బాసలిక్ అను శిరావేదనము గావించి రక్తమోక్షణము చేయవలెను. మరియు సాప్పీన్, అనునరమును బాసలిక్ అను నరముకంటె ముందుగా ఛేదించుట అతివుత్తమము. మరియు కురుసనఫ్ సద్దుమా నోటినుండి రక్తము వెడలుటకు ఆపివేయునట్టి మాత్రలు రోగికి ఇవ్వవలెను. పిక్కలపైని కొమ్ములతో రక్తముతీయుట లాభదాయకమగును. మరియు, విశేషదోషముండినచో వస్తికర్మ (Inema) తోనున్నకిషాయాదులపానముతోను, ఆమలమును తీసివేయుట లాభదాయకమగును. మరియు వ్రకృతిని నిజదశయందుంచుట యోగ్యము. యిటులనే ఈరోగము ఉష్ణరోగ కారణమయి రక్తము ఆపివేయుట ఉచితమని తోచినయెడల అకాకియా, గవ్వవలుకుసాంబ్రాణి, మాచికాయలు, దానిమ్మవూలు, బాలింతబోలు, తుమ్మజిగురు, వంటజేగురు, నల్లమందు యీమొదలగునవి సమానముగా తీసికొని నూరి, రొమ్మునయి లేపనము చేయవలెను, మరియు ఈరెండింటితో బిళ్ళలుచేసి సిద్ధముగా యుంచుకొని అవశ్యకతానుసారముగా ఉపయోగించవలెను. మరియు ఇతర సహాయములు భోజనపానాదుల వస్తువులతో వ్యాధి బలమును తగ్గించవలెను. అనగా శిల్పిరితిత్తులు శుష్కించి వ్రణము కలుగువ్యాధి) యందు వర్ణించబడును. ఇట్టి రోగియొక్క రోగకారణము చిక్కపరచునట్టి జలుబుగల దుష్ణ వ్రకృతియైనచో ఉష్ణమున, చమ్మను కలిగించునట్టి వస్తువులను సేవించుట వ్రకృతిని సమానముగను నిజదశయందు మార్చుటకు వరిశ్రమ

చేయవలెను దీనివలన దుష్టప్రకృతి నష్టమగును మరియు యుక్తద్రవ్యములలో రక్తమును ఆపివేయుటకు ఆరూఢముగ నుండవలెను.

మరియు ఉష్ణముగల చమ్మను గలిగించునట్టి నదుపాయములు, కానరోగమునందు వర్ణించియున్నాను. ముందుదానియొక్క శబ్దార్థము కథాచిత్ తల్లక్రిందుగా నున్నది. దీనిని వెనుకవుటయందు సాంకేతముగ చెప్పబడెను. ఒకప్పుడు వాతము నరములయందు చేరుటవలన నరములు చిట్లి రక్తము వెడలనారంభించినయెడల దీని సదుపాయము అనగా ముందుగా చేతులు, కాళ్లు బంధించుట, మర్దించుటవలన మలము పైనుండి క్రిందికి దిగును. ఇందుశిరావేదనము చేయుంజనదు వాతమును నష్టపరచి చిట్లిన నరములను నమకూర్చునట్టి ఔషధములను వుపయోగించవలెను. అనగా ఫలూనియా, సంజర్నియా, దహమరన, యీమూమునసంయోగికమాజూనుల పేర్లు. తిరియాక్, నూతన చిన్నఆకులు ఉపయోగించుకొనవచ్చును. మరియు వాతము నష్టమొందిన వెనుక దోషమును ఆక్రమించునట్టి ఔషధములు నుపయోగించవలయును. ఒకప్పుడు నరముల ముఖములు చిట్లుచున్నవి. అనగా వలుచని రతూబతు నజులాయందు ప్రవేశించుచున్నది. రెండవ స్థలమునుండి రొమ్మునందున్న, ఊపిరితిత్తులయందున్న స్రవించుచుండును. దీనివలన నరములునిండి కొద్దిగా శక్తి ప్రవేశించిన యెడల భరించనంత మృదుత్వమునొంది, నరముల ముఖములు చిట్లిపోవుచున్నవి. దీనివుపాయమేమనగా ముందు కాళ్లు, చేతులను మర్దించుటవలన వేరువుపాయములవలన మలమును రెండవవైపునకు త్రిప్పివేయవలెను. తదుపరి విబంధనకరమగు ఔషధములు అనగా రతూబతును (చెడునీరును) తగ్గించి అంగముయొక్క ప్రకృతియందు ఉష్ణము కలిగించునట్టి ఔషధములను వుపయోగించవలయును. అనగా ఆజఖర్, (ముంజగడ్డి) వేరు, రూమిమస్తకీ, వేయించిన జీలకఱ్ఱ, అడవిపొదీనా, జుమ్నా, కల్కదిస్, కుంకుమపువ్వు, యీమొదలగునవి అతివేగరము ఆస్థానమునందు ప్రవేశించును.

మరియు, తిరియాక్, సముదీతుస్, నంజర్నియా, ఫాన్నిహూక్ ఫలూనియా కొద్దిగా ఉపయోగించుటవలన రొమ్ము ఊపిరితిత్తులయొక్క కతూబతు హరించును. ప్రకృతిని మార్చివేయును, రక్తమును ఆపివేయును. ఈరోగముయొక్క తీవనాదులయందు అజఖరు, అకేకల్బతం (ఒకజిగురు) చేయించిన జీలగర్రి, అకాకియా, ఉసారెలహితుత్తిస్, జున్ను, కలకదిన్ వుపయోగించవలెను. మరియు, చకోరపక్షి, లావుక పక్షి, కౌజు మొదలగు పక్షులమాంసము ఆహారాదులయందు వుపయోగించవలెను. ఒకప్పుడు వూపిరితిత్తులయందు వాపు జనించి అందుండి రక్తము కదలి వెడల నారంభించును. గాన ఊపిరితిత్తులయందు వాపు ఖనీభవించును. ఇందు విషయములో మలమును చేరుకుండునటుల కాపాడుచుండవలయును. ఎందుకనగా వాపు స్థిరపడి వుపద్రవము కలిగించును మరియు, అనేక విధములుగా మలమును పక్వపరచుటయు ఆమలమును అంగమునుండి వెడలించుటయందు పరిశ్రమచేయవలెను. ఆపరిశ్రమ విషయమై క్రిందవివరించెదను. మలము యొక్క భాగములను ఒకటిగా చేర్చునట్టి ఔషధములను వుపయోగించుటవలన మలము నాపివేయును. మలము నిటుల నిలిచిపోవుట హానికరముగానుండును గాన ఆస్థానము నుండి దానిని వదలించుట యోగ్యమగును.

——(6) రొమ్మునుండి రక్తము వెడలు లక్షణములు——

అనగా రొమ్మునుండి రక్తము వెడల నారంభించును. దీనికారణము అనగా దానినరములు బాహ్యకారణమువలనగాని లోపలి కారణమువలనగాని పేలిపోవును. దీనిలక్షణములు పేరుకొనియుండునట్టి రక్తము కఠినమగు దగ్గువలన కొద్ది కొద్దిగా వెడలుచుండుట గాయము గల స్థలమునందు నొప్పికలుగుట రోగి ఎల్లికలనరుగుటవలన దగ్గు నొప్పి అధికమగుట మొదలగు లక్షణములు కలిగియుండును.

## (౬) రొమ్మునుండి రక్తము వెడలుటకు చికిత్స

బాసలిక్ అను నరమును ఛేదించవలయును. మరియు, నఫసుద్ధం అను మాత్రలు వుపయోగించవలయును. రొమ్ముపై లేపనము చేయువలెను. రొమ్మురొయొక్క గాయము ఊపిరితిత్తులగాయముకంటె సాధ్యమయినది. మరియు, నిది వేగరము ఆరోగ్యము నొందగలదు.

(సూచనీయము) హకీం జాలినూన్‌గారు వంచించినదేమనగా ఒక యౌవ్వనపురుషుని యొక్క నరములు మిక్కిలి చలియొక్క కారణమువలన చిట్లినవి. నేను ప్రథమదినమునందు శిరావేదనము గావించి రక్తమోక్షణము చేసితిని విధిపూర్వకముగా ఆరోగియొక్క కాళ్ళు చేతులు మర్ధించుటకు ఆజ్ఞాపించితిని భోజనమునకు హరీరా (యవాగు) నిప్పించితిని వానిరొమ్ముపై చిమాద్, తవసియా, మూడుగంటలవరకుంచితిని దీనివలన మిక్కిలి వుష్ణము కలుగకుండును. రెండవదినము యవగంజి, బాతుమాంసరసము, ఇచ్చితిని అవ్వాను ప్రకృతి సమానత్వముగా వచ్చినది. మరియు. ఊపిరితిత్తులయొక్క వాపు భయముండకుండిన యెడల కొద్ది కొద్దిగా పురాతన తిరెయాక్, గాడిదపాలతో పానముచేయించితిని. సామాన్యముగు ఉష్ణఔషధములు మలమును బంధించకుండునవి యీ క్రింద చెప్పబడుచున్నవని వచించిరి, దాల్చినచెక్క, జటామాంసి, లేజ్ (మద్దలవంగపట్ట) తుంగముస్తలు, కటుకరోహిణి గవ్వవలుకు సాంబ్రాణి కుంకుమపువ్వు, రూమిమస్తకి కచూరములు, బాలింతబోలు, యీ వస్తువులలో శీతముగను మలము యొక్క భాగమును ఆక్రమించునట్టి వస్తువులు అనగా కావిరాయి, వంటజేగురు, తుమ్మజిగురు, కతిరాగోందు, నిశస్త (గోధుమపాలు ఎండించినసత్తు,) కహరోబా వగడచూరు, పేల్చినవటిక, గులాబిపూలు, శృంగిభస్మం యీ మొదలుగునవి 1½ వంతున చేర్చుకొని ఉష్ణవస్తువులు కషాయముకాది చల్లనివస్తువులనునూరి వస్త్రగాలితముచేర్చి

7 మాషములు షైరఖాయమాలో కలిపి పానము చేయించిన యెడల మిక్కిలి గుణము కలిగించును.

### జిమాద్ తపసియా అను లేపనము

పుల్లదానిమ్మచెక్కు, గవ్వవలుకుసాంబ్రాణి, అవస్, బలూత్ యొక్క పూవులు, యీ మొదలగునవి నూరి లేపనము చేయవలెను. యీ లేపనమువలన పురాతన గాయమున్ను పురాతన అతిసారమున్ను హరించును.

మరియు! యవపిండి, దానిమ్మపూలు, పచ్చిఖర్జూరపుకాయలు, తిరుగలినంటియుండుపిండి, ఆస్ ఆకులు, యీవస్తువులను చూర్ణించి వస్త్రగాలితముచేసి అధిరాతైలమునందుగాని గుల్ రోగన్ (గులాబిపూల నూనె) యందుకలిపి లేపనము చేయవలెను.

### (7) నోటివెంట రక్తము వెడలు వ్యాధి లక్షణములు.

కంఠనాళము ఆమాశయము గుండె ప్లీహము మొదలగువాని నుండి రక్తము వెడలుచుండును దీనిలక్షణములు వాంతియందుకూడ రక్తము వెడలుట దగ్గులేకుండుట మరియు యీఅంగములలోనుండి యేదోవక యుపద్రవము కలుగుట సంభవము. మరియు వీటిపూర్ణ వృత్తాంతము ఆమాశయముయొక్క రోగములలో వమనముతో రక్తము వెడలు విషయమునందు ప్రకటనమగును. అయినను నిచ్చటకూడ వ్రాయబడుచున్నది. అనగా యేదోవక విధముగా రక్తము పీకవైపు అంగమునుండి వచ్చుచుండును. వమనమునందుకూడా వెడలనారంభించును. అనగా గుండెనుండి వూపిరితిత్తులవైపుకు తిరిగి దగ్గినప్పుడు వూపిరితిత్తులనుండి నోటివెంట వెడలనారంభించును. ఎటులననగా వీటిరెంటి మధ్యమునందు పొరఅడ్డముగా నుండును.

(సూచనీయము) ఇప్పుడు నోటివెంట రక్తము వెడలునట్టి రోగులు యీక్రిందచెప్పబోవు పనులను వస్తువులను ఆచరించకూడదు. అనగా యెవనికి నోటినుండి రక్తము వెడలనారంభించుచుండునో అట్టి మనుజుడు

పెరుగిడుట, తిరుగుట, పరిశ్రమచేయుట, ఉచ్ఛ్వాసస్వరముతో మాట్లాడుట, క్రోధము, చింత, మిక్కిలి మదిర (సారాయి) పానము చేయుట యెర్రని వస్తువులను చూచుట, మైథునము, ఉష్ణమగు తీక్ష్ణమగు విడవ యునట్టి వస్తువులు అనగా మాంసాంబరము, అజామోదము, సాప్పులు, పురాతనపన్నీరు, తేనె, రాతిపువ్వు, అగ్నిజాతులమిరాయిలు భక్షించుట మొదలగునవి యావత్తు హానికరములని గ్రహించవలెను. ఇటులనే పచ్చిపాలుపానము చేయుటకూడా హానికరము.

(లాభము) ఈవ్యాధిగల రోగి విరేచనమైన ఉష్ణమును తగ్గించుట మిక్కిలి అవశ్యముగానుండినచో యీరోగి భోజనములయందు సిమాగ్ జరిస్క దానిమ్మగింజలు, నిమ్మకాయపులుసు, చుక్కకూర యివి మొదలగునవి మేకకాళ్ళమాంసమునందు చేర్చి వుడికించి యివ్వవలెను. జ్వరములేకుండినను బాదంపప్పు వెన్నయందుచేర్చి యివ్వవలెను. ఈ వ్యాధిగ్రస్తుడగు రోగియొక్క ప్రకృతియందు ఉష్ణమధికముగానుండిన చో నూతనమగు సగోన, పన్నీరు కాచిన నిర్మలమగుపాలు మరియు కేవలము పెరుగుగాని లేక ఆవుపెరుగునందుగాని కాచి యివ్వవలెను. హారీరా (యవాగు) గంటెలు (సజ్జలు) పొట్టులేకుండాదంచి పిండివిసరి ఆపిండితో తయారుచేసిన గంజి అర్ధాంశముగా వండిన కోడిగుడ్లు అథవా కౌజుమాంసము చకోరపక్షిమాంసము వెంటనే తీసిన చేపమాంసము మొదలగునవి పథ్యకరములు.

(సూచనీయము) మలమును ఆపివేయునట్టి ఔషధములు నోటి నుండిరక్తము పడునట్టి అన్నిరోగములయందున్ను లాభదాయకమగును. ఈఔషధము లన్నిటికంటె శుద్ధిచేసిన కాదాక 4 నర మాషములు అనరూకారాయి (మెర్రకూర) యొక్క రసములోగాని ఖుర్ఫా (పెద్దపాయల ఆకురసములోగాని తులసి ఆకురసములోగాని బార్తంగ్ రసములో గాని కలిపిపానము చేయుట మిక్కిలి గుణదాయకమగును మరియు పెద్దపాయలఆకురసములుట యిత్యాది వస్తువులను సేవించుట పరీక్షించ

బడినవి ఒకప్పుడు రక్తమును తమ్మనాళము బంధించివేయును. మరియు దోసకాయరసము మొదలగునవి వెనుక వర్ణించియున్నాము. కేవలము వకేరసములో కూడా ముఖ్యముగా గ్రీములను వకటిగా చేర్చునట్టి ఔషధములను కలిపి ఉపయోగించినయెడల మిక్కిలి లాభదాయకమగును.

మరియు శృంగిభస్మమును మలమును బంధించునట్టి ఔషధములనుచేర్చి నుపయోగించుట లాభదాయకమగును. ధనియాలపూలు, 10½ మాషములు చల్లని నీళ్ళతో సాయంప్రాతఃకాలములయందు యుపయోగించుటవలన గుణమును కలిగించును. మరియు పగడచూర్ణ, సుద్ధ కూడా లాభదాయకమగును. లాభము: రక్తము పూపిరిత్తులయందు నిలిచి గడ్డకట్టియున్నదని భయము తోచినచో ముందు చనగపులును నీళ్ళలో కలిపి పానము చేయవలెను. ఇట్టిమనుష్యునికి దగ్గువిస్తారముగా వచ్చుచుండిన శిర్కా (చనగపులుసు) పానము చేయ జనదు. మరియు రక్తము పేరుకొనియుండి దగ్గువిశేషముగానుండినయెడల శనగపులుసు పన్నీరుకలిపి పుక్కిలించవలెను. ఒకప్పుడు కొద్దిగా పానము చేయవచ్చును.

మరియు, అంజూరకఱ్ఱకాల్చి బూడిదచేసి ఆబూడి నీళ్ళలో కలిపి ఆనీళ్ళు వాసాళీ నిచ్చినచో పేరుకొనియుండునట్టి రక్తము శుభ్రపరచును. మరియు, గౌతరాసియాను తేనెతో యిచ్చుట వలన మిక్కిలి గుణదాయకమగును. ఇతర సదుపాయములు ఆమాశయము యొక్క రోగములయందు రక్తము, పాలు, పేరుకొని యుండునట్టి రోగ ప్రకరణములయందు చెప్పబడును.

నోటినుండి రక్తమువచ్చునట్టి కారణములు మూడు విధములుగానుండును. (1) వాతమువలన, (2) సాభిక్, (3) భాసల్, అస్బాబ్ బాదియా (బైటికారణమువలన అనగా గాయము తగులుట) వున్నతస్థలమునుండి పడిపోవుట (అభిగాతము) లేక తీక్ష్ణముగు ఔషధములు, ఉష్ణమగు కటుభోజనములు చేయుట, చింత, మరియు, అస్బాబ్ సాబక్ (లోపటికారణములు) జలుబు, చెమ్మ నరములలోనిలిచి ఈ

వ్యాధి కలిగించును. అట్టికారణమువలన నరములు విరిగిచిట్లి నరముల నుండి రక్తము జారిపోవనారంభించును. మరియు, అన్‌బాబ్ బానలా అనగా నరములు ముఖము విడిపోవుట, చిట్లిపోవుట, పేలుట, చినుగుట, బ్రద్దలగుట, మొదలగునవి అని భావించవలెయును.

## నోటి వెంట చీము వెడలునట్టి లక్షణములు

ఈరోగము అయిదుభేదములుగానుండును. (1) ఊపిరితిత్తులవాపు గాని వ్రిక్కలవాపు గాని, పక్వమునొంది బిద్దలలై వృద్ధితో చీముకా లసివదుమండుచు ఈరెండింటియొక్క వర్ణనము వేరు వేరుగా వ్రికటించ బడును.

ఊపిరితిత్తులపై వ్రణములను చూపించు చిత్రపటము.




1–2 ఊపిరితిత్తిపై వ్రణములు పెరిగిన కొలది నోటివెంట చీము అధికమగును. ఈవ్రణము ఉత్పన్నము కాగానే దగ్గు, నోటి వెంట చీము వెడలుట, జ్వరము అధికమగును. రోగి శరీరముపై మాంసము శుష్కించ నారంభించును దీనినే క్షయ అందురు.

(1) ఊపిరితిత్తులయందు గాయమై దగ్గినప్పుడు చీమువెడలనారంభించును వైద్యోత్తములు దీనిని శిల్ (క్షయ) అందురు దీనివర్ణనము కూడ ముందుచెప్పబడును.

(2) ఆమాశయమునందు వ్రణము ఉత్పన్నమై బద్దలై వమనములో కూడా ఇటులనేచీము వచ్చుచుండును. మరియూ విరోచనముద్వారా చీము వెడల నారంభించును ఈవ్యాధి యొక్కవర్ణనముకూడా ముందుచెప్పబడును.

(3) ప్రక్కయందుగాని గొంతుయందుగాని లేక నోటియొక్క ఇతరభాగములయందుగాని వాపుఉత్పన్నమై అందుచీము ఏర్పడి బద్దలై పుళ్ళయినపుడుగాని కాండ్రించుటవలనగాని చీము వెడలుచుండును. అనగా ఎచ్చటవాపు కలిగియున్నదో అచ్చటనుండి చీము వెడలనారంభించును దీనివర్ణనము కంఠము నోటిలోభాగములయందు కలుగు వాపునందు చెప్పియుంటిని.

(4) రొమ్మునందు వాపుకలిగిబద్దలగును దీనిలోకూడా ప్రక్కలయందు వుష్ణమధికమగును దీనిలక్షణములు చిక్కనిచీము దగ్గినపుడు ఉమ్మిలో కలసి విశేషముగా పడుచుండుట ముందు రొమ్ములో బరువగుట అందు నొప్పికలుగుట ఇందుకు సాక్షియగును.

## రొమ్మువాపువలనకలుగు చీము చికిత్స

జూఫా అంజూర్ హాస్ (ఒకవిధమగుఅడవిపొదీనాకుపేరు) యష్టిమధుకము సౌసన్ (దీనినిఇంగ్లీషులో లిల్లిఅందురు) వేరు, మెంతులు యీవస్తువులు నీళ్ళలో వేశికషాయముకాచి పానముచేయవలయును ఈకషాయముపానముచేయుటవలన చీము వలుచబడి ఊపిరితిత్తులనుండి సహజముగ వెడలుచుండును అనగా ఊపిరితిత్తులలోనుండి వెడలిపోవునని భావము.

జూఫా, గంధఫేరోజా, బత్తాసీలపిండి, మెంతులు, వుటంగన్ విత్తులు, రాజహంస యీవస్తువులను మెత్తగానూరి బాబూనాతైలము నందున్ను, రోగన్ గార్ (గార్ తైలము) మరియు కోడిక్రొవ్వు, యీమొదలగునవి తేనెలో కలిపి రొమ్ముపై లేపనము చేయవలెను.

మరియు బాలింతబోలు, కచూరములు, మిస్త్యా, ఫిరంగిసారబ్రాణి, హారిదళము, యీమొదలగువస్తువులను చూర్ణించి నివ్వాలపై వేసి ఆపొగ నోటినుండి పీల్చవలెను. ఈమొదలగు చికిత్సలవలన మలము వలచనైన వెనుక రొమ్ము మలమునుండి శుభ్రతగాంచుటకై నోటి

లో మాత్రిలు వుంచవలెను. ఆమాత్రిలు చేయుక్రియను యీక్రింద చెప్పెదను.

అవిశివిత్తులు, చల్‌గోజావప్పు, త్రవత్తిగింజలవప్పు, మెంతులు, యష్టిమధుకము, సొగసావేరు, యీవస్తువులు చూర్ణించి వస్త్రగాలిత మొనర్చి తేనెతోనూరి మాత్రలు చేయవలెను. యీమాత్రలను అవశ్యకతానుసారముగ నుపయోగించవలెను.

లాభము:—వాపు రొమ్మునందున్న, అథవా ఊపిరితిత్తులయందున్న, రొమ్ముయొక్క పొరయందున్న, కలిగి చీముచేరి బద్ధమైన యెడల దానిని శుభ్రపరచునట్టి సదుపాయములు యీక్రింద వివరించుచున్నాను. యిటువంటి ప్రత్యేకరోగములయందు వాటి వాటి స్థానములలో వర్ణించబడును. మరియు ఈరోగములయందు చికిత్స చేయుటలో అసావధానముగ యుండకూడదు. ఎందుకనగా చీము ఊపిరితిత్తులలో చేరకూడదు. రొమ్ముయొక్క రోమాంచములయందు ఖపీభవించినచో రొమ్ముయొక్క పొర కుళ్ళిపోవును. అందు కఠినమగు వాపు ఉత్పన్నమగును. ఈయువద్రవములు కలిగినయెడల రోగి మృతినొందును.

మరియు ఊపిరితిత్తులయందు వాపుకలిగి చీముకలుగును. అథవా రొమ్ముయొక్క ఇరుపార్శ్వములోనుండి ఊపిరితిత్తులవయి స్రవించి అచ్చట నిలిచి వెకలకుండిన ఊపిరితిత్తులయొక్క భాగములను విడగొట్టును. మరియు ఊపిరితిత్తులయందు వ్రణముకలిగి చీము యుత్పన్నమగుచున్నది. దీనివలన ఉత్తమమగు సుపాయములు అనగా యేస్థానమునందు వాపు బద్ధమైనదో నాలోచించి మలమును బాధించునట్టి వస్తువులతో రోగిని కాపాడుట నుచితమగును. అంగములను మృధుత్వము నొందించుటకై చీమువలుచనై శుభ్రతనొందుటకై శక్తివినియోగించి జాగ్రత వహించవలెను. దీనివలన అంగము శ్రేష్ఠము నొందిన తర్వాత వ్రణమును మాన్పునట్టి చికిత్సయందు ఆరూఢముగనుండవలెను. చీమురొమ్ము

యొక్క గుల్లభాగమునందు చేరి ఖరీభవించినచో దీని సదుపాయములు రొమ్ముయొక్క లోభాగమునందుండు చీము హరించునట్టి ప్రకరణమునందు వర్ణించబడును.

## ఊపిరితిత్తుల వాపు లక్షణములు.

ఈరోగము వుత్పన్నమగుటకు కారణము వుష్ణముగాని చల్లని నజుల (అనగా దుష్టజలము) మెదడునుండి వూపిరితిత్తులయందు దిగుచుండునుగాన గొంతువాపు హరించి దానిమలము అచ్చటనుండి మారి వూపిరితిత్తులపై స్రవించి అచ్చటనే నిలిచి వాపుపుట్టించును. మరియు ప్రక్కవాపు వూపిరితిత్తివాపుగా మారిపోవును. ఒకొక్కప్పుడు నజులావాపుతో సంబంధము లేకనే ముఖ్యముగా అచ్చటనే మలము ఖరీభవించి వాపు కలిగించునుగాని యీరోగము నజులావ్యాధివలె విశేషముకలుగుచుండును. ఇంతఖాబవుల్, [అజాయబ్, యనుగ్రంథమునందు వూపిరితిత్తులయందువాపు కలిగించునట్టి మలము ప్రత్యేకము దోషమువలన వుత్పన్నమగుచున్నది (నిది విశేషముగా కఫమువలన వుత్పన్నమగును. మరికొన్ని గ్రంథములలో చూడబడినది, అనగా వూపిరితిత్తులవాపు కుళ్ళిన కఫమువలన వుత్పన్నమగుచున్నది. గాని లవణకఫమువలన వుత్పన్నమొందుటలేదు హాకీము జహాబిర్‌వుందలూసీగారి కుమారుడు యత్‌సోర్ యను గ్రంథమునందు చెప్పిందేమనగా వూపిరితిత్తులయొక్కవాపు రుధిరముతప్ప వేరుదోషముతో కలుగజాలదు. ఎటులననగా పిత్తము యొక్క తీక్ష్ణత్వము (వూపిరితిత్తులకంటె వేగముగ నడుచుటవలన వాపు కలుగుటకు కారణము కాజాలదు. మరియు కఫము వానియొక్క భోజనముగాన వానితో స్నేహముంచుచుండినచో నిది కూడా వాపునకు కారణముకాజాలదు. విశేషముగా పిత్తమువలన వుత్పన్నమగునట్టి వూపిరితిత్తులవాపు యేడుదినములలో రోగిని చంపివేయును. ఈమలము వెడలునట్టివైపు ఆరూఢమైనచో దీనిలక్షణములు

యేడవదినమునందు ప్రకటనమగును. ఇది బహురాన్ జయద్ (రోగసంధి)యొక్క దినమని గ్రహించవలెను. మరియు రోగముయొక్క మలము ఊపిరితిత్తులవైపు చేరి ప్రవహించునట్టి యావత్తువస్తువులకంటె విశేష క్రూరమైనది. ఎటులనగా ఊపిరితిత్తులు రక్షించునట్టియు పోషించునట్టి హృదయ మలములకంటె మిక్కిలి బాధకరములైనవి మలము అందుచేరియుండినంతవరకు నష్టమై దూరముకానిమొదల అందు బాధము ప్రకటనము కాజాలదు. అట్టివ్యాధి కఠినమగును. ఇది అనేకరోగములను కలిగించుచున్నది. ఎటులనగా ముందువర్ణించబడును. ఒకప్పుడు దాని మలము పొరలయందున్న పరదాలయందున్న చేరి వాపుపుట్టించుచున్నది. ఒకప్పుడు యీరోగియొక్క భుజములు మణికట్టునందున్న లోపలి భాగములందు వ్రేళ్ళచివరలవరకు తిమ్మిరికలిగియుండును. ఒకప్పుడు నీమలము హృదయమువైపు ప్రవేశించి వున్మాదము మూర్ఛకూడా కలిగించును. ఒకప్పుడు మెదడువైపుచేరి సర్సాం (మెదడుపైనుండు పొరయొక్క వాపు) వుత్పన్నమగును. ఒకప్పుడు ఊపిరితిత్తులవాపునందు చెమ్మ ఖనీభవించుచుండును. ఇట్టిదశయందు జలంధర్ (జలోదరము) గలవానివలెనుండును. మరియు ఊపిరితిత్తియొక్క వాపు బహుదా కఫమువలనగాని రుధిరముయొక్క మలము వలన కలుగుచున్నది.

మరియు పిత్తమువలన స్వల్పముగా కలుగుచున్నది. ఎటులనగా ఊపిరితిత్తుల మాంసము కోమలముగను రోమాంచములు కలిగియుండును. కాబట్టి పిత్తసంబంధమగుమల ముందు నిలువజాలదు. ఇంక విషయమై నేక్ అబూఅలీసేనాగారు వచించినదేమనగా ఊపిరితితుల యొక్క వాపు ప్రతిదోషమువలన వుత్పన్నముకాజాలదు. బహుదా కఫమువలన రక్తమువలన కలుగుచున్నదనిరి. హకీమురాజీగారు ఫాఖిల్ అను గ్రంథమునందు వచించినదేమనగా నకప్పుడు ఊపిరితిత్తులవాపుయొక్క మలము నష్టమైవెడలిపోవును. అనగా యితర అంగములయొక్క వాపు నష్టమొందగలదని భావము. యీఅంశము పరాత్పరుని కృపవలనకలుగు

చున్నది. మరియు వకవ్పుడు మలము విశేషముగా వెడలించుటవలని కూడా స్రవమొందజాలదు. మరియు ఖనీభవించి చీముగామారి బ్రద్దలగును. ఈచీము సామాన్యముగ సరియగు తెలుపురంగుగాగాని లేక నల్లగాగాని అనగా సారాయిమడ్డివలెనుండును. వకవ్పుడు ఆమలము మెత్తగానుండిన నది వెడలిపోవును. వావ్రయగును. మిగిలినది కఫముగా మారును. వాతమువలన కలిగిన మలమునందు వదించబడును. ఒకవ్పుడు వక్షీణముగా మారుచుండును. ఒకవ్పుడు ఊపిరితిత్తియొక్క వాపు పిత్తవాపు నదృశముగా వుత్పన్నమై చికిత్సచేయుటకు మిక్కిలి స్వల్పముగానుండును. ఎందుకనగా మలము మిక్కిలి వుష్ణముగానుండి హృదయమునకు సమీపమునందుండును.

మరియు, లేవనము చేయునట్టియు, పానమొనరించునట్టియు, శీతజలౌషధముల సారము ఆస్థానమునందు విశేషముగా ప్రవహించక స్వల్పముగా చేరుచుండును. ఎందుకనగా మిక్కిలి దూరమునందుండుటవలన ప్రవేశించజాలదని గ్రహించవలెను. మరియు, మిక్కిలి అవయవముల మధ్యమందుంచబడియున్నది. ఎట్లనగా పానముచేయునట్టి వస్తువులలోనుండి ప్రతిఅంగము కొంత శక్తిని గ్రహించుచుండును. అనగా ఒకభాగమును వహించుచున్నది. మగ్బతులుకూడా ప్రతిఅంగము ఉష్ణమును కలిగించును. ఈ మలము అంగములలోనుండి అందుండి కొద్దిగా ఇందుకలిసి పోవును. తరువరి ఊపిరి తిత్తులయందు చేరుచుండిన ఎడల జలుబు శక్తి అందులో యెంతవరకు కలుగుననగా పిత్తముయొక్క వాపు ఉష్ణమువలన నమానత్వము కలిగించు నంతవరకు ప్రవేశించును.

మరియు, లేవనయొక్క జలుబుకూడా దీనివలె నమానము చేయజాలదు. ఎందుకనగా లేవనాదులు వేగరము గుణము నివ్వజాలవు. మరియు, రొమ్ము, శల్యము, కండరములు, పొరలు కలిగియున్నది. నిజముగు మార్గమనగా ఆ రోగము ప్రత్యేక దోషమువలన

ఉత్పన్నమగును. ఈ కారణమునుబట్టి యీ ప్రకరణమును మూడు భేద
ములుగా వర్ణించుచున్నాను.

(1) ఊపిరితిత్తుల వాపుయొక్క వర్ణనయందు కలవు. ఈ వాపు కలుగుటకు కారణము ఉష్ణముయొక్క వలన కలుగుచున్నది. అనగా స్వభావికమగు ఉష్ణమగును. రక్తము పిత్తస్వభావమువలన చల్లనై కుళ్ళిపోవునట్టి కారణమువలన ఉష్ణమునొందదు. ఇటుల కుళ్ళిపోవుటవలన సంబంధమగు కఫమును కలుగజేయుచున్నది. దీని లక్షణములు రోగికి జ్వరము సమానముగా విశేషముగానుండుట శ్వాసయందు కష్టము కలుగుట రోమముల యొక్క సరముల భాగములందు బరువుగను నొప్పికలిగియుండుట ముఖము నేత్రములు ఎఱ్ఱగానుండుట ముఖ్యముగా చర్మమునకు రంగు వేసినటుల ఎఱ్ఱగానుండుట అట్టి స్థితియందు జ్వరము విశేషముగానుండుట, ముఖనేత్రములు బరువుగానుండుట, నాలుక ఎండుట, దాహము విస్తారముగా నుండుట ఒకప్పుడు నాలుక యందు జిగురుగల పుమ్మి చుట్టుకొని యుండుట, నాడితరంగములు వేయుచు వేగరముగ నడువనారంభించుట, దగ్గు విశేషత్వమువలన బాధకలిగియుండుట, చల్లనిగాలి పీల్చుటకై రోగిపరితపించుట, ఈ లక్షణములయొక్క న్యూనత విశేషతయొక్క కారణము ఎటులనుండునో అటులనే కారణమునుబట్టికలుగుచున్నవి. అనగా కుళ్ళిన రక్తము, పిత్తము కఫముయొక్క ప్రకృతియందు, బహుళ వర్ణించబడినవి. దాహాధిక్యము, పోటు విశేషముగావేడి, భారము తక్కువగానుండుట, ఇటులనే అన్యసందర్భములు పిత్తమునకు తక్కువగానుండును. ఇటులనే రక్తప్రకృతికూడా ప్రకటనమగును.

మరియు కఫము ఉష్ణము నొందుటవలన తన ప్రకృతియందుండనియెడల ఉష్ణములయొక్క చిహ్నములు తోచుచున్నవి. అనగా దానియొక్క వేడి పిత్తము రక్తముల ఉష్ణముతో మిక్కిలి తక్కువగానుండును. మరియు భారము మిక్కిలి జిగురునాలుకపై విశేషముగా

చుట్టుకొనియుండును చల్లనిగాలి యొక్క అసహనము మూడు దోషము
లయందుకూడా కలుగుచున్నది. గాని పిత్తమునందు విశేషముగా నుం
డును. తక్కిన దోషములయందు తక్కువగా నుండును. ఊపిరితిత్తుల
యొక్క వాపు పిత్తముయొక్క వాపుతో సమ్మేళముగా నుండినచో శ్వాస
బిగబట్టుట విశేషమగును. బరువు తక్కువగను, ఉష్ణమతిశయముగ
నుండును.

లాక్షణము:—వూపిరితిత్తుల మధ్యమునందు వ్రణము వాపు కలిగి
యున్నయెడల వెన్నునందు నొప్పి సన్నగా పొడచుట మొదలగు
చిహ్నములు కలిగియుండును. స్వల్పముగా జ్వరము వచ్చుచుండును.
మరియు శరీరము దురదకలుగుట, శబ్దము తీక్ష్ణముగా నుండుట, ఆవాపు
వ్రణముగా మారినయెడల నోటిరుచి చెడిపోవుట, నోరు చేపగంధము
కలిగియుండుట, దగ్గునందు కొద్దిగా చీముముద్దలు వెడలుట, ఒక్కొక్క
ప్పుడు ఊపిరితిత్తులయందు గుల్లలుకలుగనారంభించుట దీనిలక్షణములు.
శ్వాస పట్టుబట్టి వేగరముగను, తీవ్రముగ వెడలనారంభించుట, రొమ్ము
బరువుగా నుండుట, శరీరములో భాగమునందు మంటకలుగుట, మిక్కిలి
వేడిగా నుండినటుల తోచుట, మరియు ఊపిరితిత్తులవాపు మలము ప
క్వమై వెడలనారంభించునట్టి లక్షణములు అనగా పక్వమయినమలము
సునాయాసముగ వెడలుచుండుట, రోగియొక్క దశ దినదినము మంచి
స్థితియందు మారుచుండుట దీని చిహ్నములు, మార్పుచెందుచుండుట
వూపిరితిత్తులు మలరహితముగా నుండునటుల యుండుట మొదలగు లక్ష
ణములు కలవు.

మరియు మలము చీముగా మారునట్టి చిహ్నములు అనగా పక్వ
మునొందిన చెమ్మ వెడలకుండుట చిహ్నములు క్రమేణా హెచ్చుచుం
డుట అనగా చీముగామారి, వూపిరితిత్తుల యొక్క మాలిక్ (వేలాడు
నట్టిస్థలము) నందు నొప్పి పీకినట్లుండుట మొదలగునవి తోచుచుండును
మాలిక్ అనగా వకవస్తువు వేలాడుచుండు స్థానము.

మరియు చీముగా మారుటకు చిహ్నములు అనగా రోగచిహ్నములు అధికతరమైయుండు కొలందిగలుగుట, నోటిరుచి తియ్యగా నుండుట, శక్తి బలముగలదైన మెడలు మున్నగు వెంటనే పక్వపరచగలుగును చీము ఉమ్మినపుడియ్యూ, మూత్రమార్గము నందుచీము తీసివేయును. మరియు చీము సమానముగనుండును. శక్తి దుర్బలముగా నుండినచో పక్వము నొందుటయందు నొప్పినుండి వెంటనే పక్వము నొందజాలకుండును. కాబట్టి కుళ్ళిపోవును. ఇట్టి రోగమునుండి తప్పించుకొనుట మిక్కిలి దుస్థిరముగును మరియు యీరోగమునందు సిల్ (ఊపిరితిత్తులయందు వ్రణము కలుగుట చీముపట్టుట) వ్యాధియందు ముఖముయొక్క రంగు కాంతిహీనముగానుండుట, వ్రేళ్లయొక్క కొనలు మొల్లవ్వాను వృత్తముగా నుండుట, మరియు ఊపిరితిత్తుల వ్రణము చిహ్నములు చీముయొక్క సమస్త చిహ్నములు ప్రకటనమగుట, ఊపిరితిత్తులయొక్క ములము ప్రక్కవాపుగా మారినచో శ్వాసవిగట్టి కొద్దిగా వెడలనారంభించుట మొదలగు లక్షణములు కలిగియుండును.

మరియు హకీంబొఖరాత్ గారు వచించినదేమనగా వూపిరితిత్తులయందు వాపుగలవాని స్తనములసమీపమునందు కురుపులు జనించును. మరియు నాసూర్ (నాసావ్రణము) కలిగినచో వూపిరితిత్తుల వాపునుండి బ్రతుకకలుగును. ఇటువనే పక్కలయందు వ్రణము లేదినచో ఆరోగ్యమునకు చిహ్నములని గ్రహించవలెను.

## ఊపిరితిత్తులవాపు చికిత్స

ఈరోగమునందు బాసలిక్ యను శిరావేదన చేయవలెను. ముఖ్యముగా వూపిరితిత్తులు వ్రేలాడునట్టి స్థలమునందు వాపుగలిగినచో ఉన్నాబ్, విహీసోడా, (శ్లేష్మాంతకము) ఖిత్మి, బనప్షా, బాబూనా, మొదలగువస్తువులు కషాయముకాచి కేలకాయగుజ్జు, తురంజబీన్, కలిపి పానముచేయించి శరీరమును మృదుత్వము కలిగించవలెను. వస్తికర్మవలన గర్భమును మెత్తపరచవలెను.

మరియు అజామెవుల్ ఇంతిఖాబ్ అను గ్రంధమునందు వ్రాయబడిన దేమనగా బనప్షా, తవాషీర్, కామంచిఆకు, ఖతిమీపూలు, యీవస్తువులు ప్రత్యేకము 4న్నర మాషములు, ఉన్నాబ్ 20 కాయలు, ఆల్బకరా, 5 కాయలు, పాచితీగె గింజలపప్పు, సలియగొట్టి 3½న్నర మాషము, మకందగుసము 5 తులములు, గులాబిపూలు 1 తులము, యీవస్తువులను నీళ్ళలోవేసి అర్ధాంశముగా కషాయముకాచి 5 తులములు మెరగ్రిచక్కెర, గులాబినూనె, ఆవునెయ్యి, కలిపి గోరువెచ్చగానుండునప్పుడువస్తి చేయవలెను. అనగాపిచ్చికారీ చేయవలెను. మరియు ఆరంభమునందు మలమును వెడలించుటకై చందనము, యవపిండి పెద్దపాయలాకురసమునందు కొద్దిగా బనప్షానూనె కలిపి రొమ్ముపై లేపనము చేయవలయును, ఆరంభసమయము వ్యాతీతమయినచో మలమును నష్టపరచునట్టి వస్తువులు లేపనము చేయవలెను. అనగా బాబూనా అకలీలుల్ మలిక్ ఖతిమి యవసత్తు మొదలగువస్తువులను బాబూనాతైలమునందుకలిపి లేపనము చేయవలెను.

మరియు వావు రక్తాధిక్యకారణమువలన కలిగినచో రోగిదశను కనిపించిఅవశ్యమని తోచినయెడల వావుయొక్క రెండవవైపునుండి సాఫీక అనునరమును ఛేదించి రక్తమోక్షణము చేయవలెను. వావు వూపిరితిత్తియొక్క కుడిభాగమునందుండినచో కుడికాలియొక్క శిరావేదనము చేయవలయును. వావు యెడమవైపు ఊపిరితిత్తియందు కలిగినచో యెడమకాలి శిరావేదనము చేయవలెను. మరియు మలము ఊపిరితిత్తియొక్క కుడివైపుయున్నదా లేక యెడమవైపు నున్నదా అని గ్రహించవలెను. అనగా యేవైపునున్నదో గమనించుటకు విధికలదు. జ్వరముండు సమయమునందు నిధానించి యేవైపుభాగము మిక్కిలి యెఱ్ఱగానున్నదో రొమ్ము బరువు యేవైపు తోచుచున్నదో ఆవైపువావు గలదు. ఇటులనే రోగివత్తిగిలి పరుండినచో ఆవెంటనే దగ్గూబడు నొట్టి

యుందు వచ్చిచేరినయెడల మలము ఆవైపు ఊపిరితిత్తియందుగలదని గ్రహించవలెను ఇటులనే వాపు కుడివైపునుండినచో కుడివైపు వత్తిగిలినచో రక్తూబతు విశేషముగా వెడలుచుండును. మరియు సాఫీనా శిరావేదనగావించినవెనుక హఫ్తెఅందామ్ యొక్క శిరావేదనమును బాసలిక్ యొక్క వేదనముకంటె ముందుగా ఛేదించుట అతివుత్తమముగా నుండును. రోగియొక్క శక్త్యానుసారముగ రక్తము వెడలించవలెను. రోగి బలముగలవాడైనచో మూడుదినములాగి రెండవశిరను ఛేదించవలెను. ఆరంభమునందు బాసలిక్ అను శిరావేదనము గావించి పిమ్మట రెండవ శిరను ఛేదించి రక్తమోక్షణముచేయవలెను. పరిణామమునందు వుదితస్థానమునందుండి రక్తమోక్షణము గావించవలెను. మరియు శిరావేదనము నుండి మలము హరించినవెనుక కథాదిత్ రొమ్మునందు తూరకర్మచేయుట అవశ్యమగుచున్నది. దీనివలన శేషించిన మలము హరించి బాహ్యభాగమునందు చేరును.

మరియు, హకీము జాలినూస్‌గారు వచించినదేమన జ్వరము మిక్కిలి వుష్ణముగానుండినచో విరోచనకర ఔషధములు యివ్వఁజనదు. మరియు, కేవలము శిరావేదనము ఎటులననగా శిరావేదనము చేయుటలో యేమియును వుపద్రవము కలుగనేరదు. విరోచనకర ఔషధములు వుపయోగించుటవలన గొప్పఅపాయముకలదు. ఒకప్పుడు విరోచనకర ఔషధములు మలమును కదలించి విరోచనముగాకుండును. ఇట్టి స్థితియందు నొప్పి అధికమగును. ఒకానొకప్పుడు విరోచనములు అధికమగుచున్నవి. ఇట్టి మనుష్యుని అంగము వ్రేలాడునట్టి స్థలమునందు ముఖ్యముగా ఊపిరితిత్తులయందు వాపు కలిగిన యెడల శిరావేదనము చేయుట లాభదాయకమగును. మరియు, వ్రేలాడునట్టి స్థలమునందుగల వాపు హరించునట్టి చిహ్నములగును. అనగా మెడయొక్క వూసల సమీపమునందు నొప్పికలిగియుండుట ఇట్టి మనుష్యుని ప్రక్కటెముకల వైపు నొప్పికలిగినచో విరోచనకరముగు ఔషధములువయోగించుట

లాభదాయకమగును. మరియు, భిషగ్వరుడు నాయనిరోఁదిన మెడల శిరావేదనకూడ చేయవచ్చును మలము చుట్టుభాగమునుండి తీసివేయు నట్టి ఔషధములు కూడా నుపయోగించవలెను. రోగిని చూచుటవలన నిశ్చయమగును. ఆవాపు నజులావలన ఉత్పన్నమైనచో కీఫాల్ అను శిరను ఛేదించవలెను. ఈమొదలగు రోగములయందు మలమును చిక్క-పరచునట్టి పర్బతులు అనగా దయాకూజాయు నుపయోగించవలెను. ఈవస్తువులతో మలము ఆటంకమగును అనగా కాశ్నిగసము మాత్రము యువ్వంజనము.

సఫాయి, అను గ్రంథకర్త చెప్పినదేమన యూనాని దేశము నందు దయాకూజా, గసగసాల షబతునకు చెప్పుదురు. అనగా గస సాలకాయ బెరడు (పోస్తుకాయ) తో చేయబడును. కొందరు వైద్యు లు కేవలము గసగసాలషరబతును దయాకూజాయొక్క అర్థమని వర్ణించిరి.

—గసగసాలషరబత్తు చేయువిధానము—

నల్లగసగసాలు, తెల్లగసగసాలుబెరడు సహితము, ప్రత్యేకము 45 మాషములు బనఫ్షా, తుమ్మజిగురు, ప్రత్యేకము 22½ మాష ములు యష్టిమధుకము 10¼ మాషములు, తియ్యదానిమ్మగింజలరసం 90 మాషములు, తెల్లశక్కెర 35మాషములు, యీవస్తువులతో దయా కుజా చేయవలయును.

మరియు యిటులనే చల్లని నీళ్ళతో కాపాడవలెను. ఊపిరితిత్తుల వాపునందు పిత్తసంబంధమగు వాపుభేదములోనుండి కలుగజేసిన సుభ్రపరచునట్టి షరబత్తులు అనగా తేనె నీళ్లు విరోచన ఔషధములు, యవగంజి, రోగిదశానుకూలముగ నుపయోగించుట యోగ్యమగును. దస్తూరుల్ యిలాజ్ అనుగ్రంథము నందు వ్రాయబడినదేమనగా వూపిరితిత్తియొక్క వాపు పిత్తసంబంధమువలన కలిగినచో నదిపిత్తసంబంధము గు వాపులోదనియు నీవాపునకు చికిత్స కఠినమనియు గ్రహించవలె

ను. ఉడికించిన వ్రాయబడిన కషాయమును నోటిలో పుక్కిలించుకొనుట లాభదాయకమగును,

## నోటిలోనుంచుకొను మాత్రలు చేయు విధి

యష్టిమధుకము నేతిబీరగింజలపప్పు దోసగింజలపప్పు నిశ్శత్తక తిరాగోందు యీవస్తువులు, మెత్తగానూరి బేదానాగుజ్జునందున్న కోడి గ్రుడ్డుతెల్లసొనయందు కలిపి మాత్రలు చేయవలయును. ఈరోగము గొప్ప భయంకరముగానుండును మరియు వ్యాపించినట్టివాపు, ప్రక్కవాపు రొమ్ముయొక్క సమస్తవాపులయందున్న రొమ్మునుండి యావత్తు రతూబతు మలము వెడలిపోవునటుల పరిశ్రమ చేయవలయును. ఇట్టిరోగికి చల్లని వస్తువులను పానముచేయింపుట అవశ్యము కలిగినచో చెమ్మను కలిగించునట్టియు పరిశుభ్రత నొందించునట్టి వస్తువులను పానము చేయవలెను. అనగా దోసకాయరసము, తర్బూజాకాయరసము, మరియు నేతిబీరకాయరసము, పులుపులేని శికంజబీన లాభదాయకమగును ఇది రొమ్మును మలరహితముగా చేయును. తృష్ణకు దాహముకు శాంతినొందించును.

యతిశేర్ యను గ్రంథమునందు వ్రాయబడిన వస్తువులను చెప్పుచున్నాను. అనగా చెమ్మను హెచ్చించునట్టియు మలమునుండి పవిత్రము నొందించునట్టి వస్తువులు అనగా పిసబ్‌గోలుగింజలగుజ్జు, తామర పూలు, పెద్దసాయులాకు, గాహులు, పుల్లదానిమ్మ, తియ్యదానిమ్మకాయల రసము, మొగలిఅర్కము, పన్నీరు, కలువపూలమ్రబ్బతు, జహర్ మోహారా (కశుచ్చరంగుగల రాయి) మరియు యీక్రిందవ్రాయబడిన లేపనములు లాభదాయకమగును.

## —లేపనవిధి.—

తెల్లచందనము, కర్పూరము, నేతిబీరగింజలపప్పు, రెండుధనియాలు, కాహులు, యీమొదలగు వస్తువులు మెత్తగానూరి పన్నీరులో కలిపి రొమ్ముపై లేపనము చేయవలెను. మరియు పొట్టయొక్క వాతము

(౨) వ-భేదము అనగా వాపు కఠినముగా నుండుట. ఈరోగము రెండువిధములు. (1) వ్రిథమున వాపు వృష్ణములకు గలుగును. ఉండుటచే వృష్ణములయొక్క నష్టమొందును, శేషమునందు కఠినత్వముగా నుండి రాయివలె నగును. ఇందు విషతుల్యమైన గొప్ప ఫలము యుండును. మరియు ఊపిరితిత్తుల వాపు కఠినత్వము నొందుటవలన గలుగు లక్షణములు యేమనగా శ్వాస మిక్కిలి కష్టముగా వెడలుట, పొడిదగ్గు వెంటవెంట వచ్చుట, వృష్ణము తక్కువగా నుండుట మొదలగు లక్షణములు కలిగియుండును.

రెండవ భేదమునందు చల్లని గాలియందు శీతల శ్లేష్మము, ఈరోగమునకు కారణమగును. దీని వలన ఈరోగము బహుకాలము గడుచుటవలన శ్వాస కష్టముగా వెడలనారంభించును. పొడిదగ్గు కలుగ నారంభించును. అనగా దగ్గుచే శ్లేష్మము వెడలకుండును. రొమ్మునందు వృష్ణము తగ్గిపోవును. గాలి పీల్చుటకు కష్టముగా నుండును. మరియు రొమ్మునందు వృష్ణము లేకపోవుటయే ఈరోగమునకు హేతువని గ్రహించవలెను. ఈరోగియొక్క రొమ్మునందు వాతముగాని, కఫసంబంధముగు మలముగాని యుండును. యీరోగికి వృష్ణవాపు మారిపోవుట వలన యిటుల లేటస్థించును. ఈకారణమువలన మెత్తని భాగములు నష్టమై, రిక్తభాగము రాయివలె శేషించియుండును.

లాభము:–ఒకొక్కప్పుడు ఊపిరితిత్తుల కఠిన వాపు నందు కఠినత్వము సంభవించును.

హకీం షికందర్ వచించినదేమన, నేనొక రోగిని చూచితిని. ఆరోగిపొడిదగ్గుతో బాధపడుచుండువాడు. ఒకొక్కప్పుడు అతని దగ్గినప్పుడు నోటివెంట ఒకరాయి వచ్చిపోయినది ఆరాయి మహాత్రాక్షరి రాయివలె నున్నది ఆరాయి పడినవెంటనే దగ్గు తగ్గిపోయినదని వచించిరి.

మరియు హకీం యూనానుగారు వచించినదేమన నేనొక రోగిని చూచితిని. వల్లెరకాయ సదృశముగా చిన్నకరిగల రాయి కఠినమయిన దగ్గునందు బయటికి వెడలినది. ఆరాయి తూచిచూడగా ప్రత్యేకము 4

లు చేయవలెను. ఇందువిషయమై లుబనీయొక్క ధూపమును వేసి ఆపొ
గను నోటితో పీల్చవలెను. రోగిని వృష్ఠతల్పమునందు కూర్చుండబెట్టి
భుజములను తీవ్రముగ కదలించుట చేవలసినగా, పానము చేయించుట
యోగాజ్పైరగా, చేదుపుచ్చకాయగుజ్జుతో, మాత్రలు చేసి రాత్రిపరుం
డునప్పుడు నోటిలో నుంచి దానిసారమును కొద్దికొద్దిగా మ్రింగుచుండ
వలెను. మరియు ఇంగువ, జావశీర్, (ఇదిన ఒకరకు గీనియందు దుర్గంధ
ముండును. దీని లోభాగము తెల్లగానుండును.) కలిసి యిచ్చుట యీ
రోగమునందు మరునుక్తముగానుండును. ఆవాలు, తేనెనీళ్ళలో నూరి పు
చ్చుకొనుట యుక్తము. కొందరు వైద్యులు భుజించిన వెనుక వమన
ము చేయింతురు. ఇట్లు వమనము చేయించుటవలన వాపు బద్ధ
లగును గాని యిందు అపాయములేదు. యెటులననగా ఒకప్పుడు వా
పు విశేషముగా విడదీసి మలమును నకేవర్యాయము వెడలించి గొం
తునందు వాపు కలిగించును.

మరియు ప్రాచీనవైద్యవరులు బద్ధలుచేయునట్టియు పక్వము
నొందించునట్టి యుపాయములను రోగము ఆరంభించి యేడుదినములు
గతించినవెనుక చేయువారు గాని బుద్ధిమంతుడగు వైద్యుడు యిట్టిమార్గ
మునందు నటించకూడదు. అనగా త్వరపడక సావధానముగా నుండ
వలెను. ఎందువలననగా వృష్ణము అధికముగానుండకూడదు, వ్యాధియం
దు ప్రతి (దుర్గుణము) కలుగకూడదు. అట్టితరి వాపువిడిపోవును. చీము
స్రవించనారంభించును. రోగికి తనశరీరమునందు లఘుత్వము తోచినచో
రొమ్మును శుభ్రపరచుటకై కళ్ళెగాదగ్గునంతన్ను శ్వాసకఠినముగా వెడ
లునట్టి ప్రకరణమునందున్ను వృమ్మయందు చీము వెడలునట్టి ప్రకరణము
నందున్ను యీ మొదలకురోగములలో చెప్పినట్టి సనుపాయములు ఈ
రోగమునందు వుపయోగించవలెను. వూపిరితిత్తులయొక్క చీము యక్రు
త్ (Lever) నరములద్వారా యకృత్ నందుచేరి అచ్చటనుండి మల

మూత్రము ద్వారా వెడలనారంభించును. అనగా రొమ్ములో చీము బంధించు విషయములో వర్ణించబడును.

## శిల్ (ఊపిరితిత్తులలో చీము కూడునట్టి క్షయ) లక్షణములు.

ఈరోగము మొదట నుండి స్నిగ్ధమగు రతూబతు (చెమనీరు) ఊపిరితిత్తులయందు స్రవించును. అట్టివానికి శిల్ రోగము వుత్పన్నమగునని గ్రహించవలెను. ఈరతూబతు శ్వాసకు బిగించి మిక్కిలి దగ్గు పుట్టించును. దీనివలన ఊపిరితిత్తులయందు వ్రణ ముత్పన్నమైనయెడల యిట్టి రోగము ఆరోగ్యము చెందుట నసాధ్యము యీరోగము చిరకాలము వరకు నిలిచియుండును. ఒకప్పుడు తరుణావస్థవరకు శేషించియుండును. ఈరోగము చల్లని వుత్తరదేశములందున్న, ఉష్ణ శీతల ఋతువులయందున్న, తూర్పుదేశములయందున్న, గ్రీష్మఋతువునందున్న, ఉత్పన్నమగును. మరియును, యీరోగము గ్రీష్మఋతువునందు వుత్పన్నమైనచో అసాధ్యము. మరియూ ఉష్ణఋతువునందు యీరోగముత్పన్నమగుట మిక్కిలి అసాధ్యము. వైద్యవరుల మతమునందు గాయముయొక్క అర్థము రోగమని భావించబడుచున్నది. నిది ఊపిరితిత్తులలో వ్యాపించియుండును. పాకీము కురసీగారు యీరోగమును మిశ్రరోగము (ద్వంద రోగము) లలో చేర్చబడినదనిరి. మరియూ జ్వరము ఎల్లప్పుడుండుటవలన దీనిని తప్పేదిఖ్ (జ్వరసంబంధమగు క్షయ) రోగము తో ఊపిరితిత్తుల గాయమనిపించును. మరియు జాలినూస్ సగా అను గ్రంథకర్త యీవ్రణము రొమ్మునందు గాని, ఊపిరితిత్తులయందు గాని నుండునని వచించిరి. మరియూ యావత్తుమంది వైద్యోత్తములు ఈశబ్దార్థమును రొమ్మునందున్న, ఊపిరితిత్తులయందున్న, ఖసీభవించి యుండునట్టి చీములకు శిల్ అని వచించియున్నారు. శిల్ అనగా కోష్ఠము శుష్కించుట శరీరము చిక్కిపోవుట, యీరోగముయొక్క ప్రభావమగును. కాబట్టి ఈ రోగముయొక్క నామము పెట్టబడినది.

శరీరములోనుండు జీవఅంగములను వెనకవైపునుండి చూపించు చిత్రపటము.




1—2 ఊపిరితిత్తులు (పుప్ఫుసములు) 3—11 ఊపిరితిత్తులమధ్యభాగము. హృదయకుహరము.

4 హృదయమునకున్న గర్భమునకు మాధ్యమందు పరదా (క్లోమరసము)

5 మూత్రపిండములనుండి మూత్రాశయమునందు మూత్రమును ప్రవేశపెట్టునట్టి నరము.

6 మూత్రాశయము.

7 మూత్రాశయము చుట్టునుండు శల్యకుహరము.

8 మూత్రాశయమునకున్న మూత్రపిండములకు మధ్యనుండు ఝిల్లిపొర

9 మూత్రపిండములనుండి మూత్రాశయమునందు మూత్రమును ప్రవేశపెట్టునట్టి నరము.

10 మూత్రపిండములు.

మరియు తహారూఖ్ ఇత్తిహాల్ ఆగాయమునకు చెప్పుదురు. ఇది మాంససంబంధమగు అంగములతో యుత్పన్నమగుచున్నది. దీనియందు చీముకూడుకొని యుండును. కొందరు దీనిని మెదడునుండి జిగురుగల రతూబతు మెల్లప్పుడు ఊపిరితిత్తులపై స్రవించుటవలన కలుగుచున్నదనిరి. మరియు శ్వాస రాకపోకల మార్గములు నిండియుండును. శ్వాస

చీము వెడలనారంభించును. చర్మమునందు మెరుపుకలిగియుండును, శరీరము ఉద్రేకపడుటవలన రాత్రింబవలు సుఖనిద్రగాని లేక యితరవ యామములందుగాని చమటవచ్చుచుండును. శరీరము శుష్కించుట అంతమునకు చేరినచో నఖములు వల్లగా యుండును.

తపేదిఖ్ (క్షయ) రోగమునందు వర్ణించబడినవి. దీనియొక్క అంతము వచ్చిన మొదల వీపుయొక్క వాపు, కాళ్ళవాపు హరించును. మరియు ఊపిరితిత్తులయొక్క సంకుచితమును మరియు, రోగముల పంక్తి ముక్కలు, తంతువులు, చీమునందు వెడలనారంభించును. మరియు దోషము వెడలుచున్నయది. నిది మిక్కిలి చిక్కగాయుండి నిలిచిపోవును. మూర్ఖవైద్యుడు ఆరోగ్యము నొందినదని సందేహించును. ఇట్టిదశయందు రోగి నాలుగుదినములకంటె అధికముగ జీవించియుండజాలడు. ఒకప్పుడు ఊపిరితిత్తుల వ్రణముయొక్క అంతమునందు దగ్గుకలిగి పరిశుభ్రముగు రక్తము వెడలనారంభించును. ఈదశయందు దగ్గును, రక్తమును ఆపుటకు ఉపాయములు చేసినచో ఊపిరితిత్తులయందు స్తంభించి రోగిని చంపివేయును. మరియు రక్తమును ఆపనిచో రక్తము విశేషముగా వెడలుటవలన రోగి చచ్చిపోవును. మరియు ఒకప్పుడు శిల్ రోగము గలవానికి (ఊపిరితిత్తులయందు వ్రణముగలవానికి) యిరుపార్శ్వములయందు బొగడగింజలవలె ఉత్పన్నంబైనచో, అట్టిరోగి 52 దినములలో మృతినొందును. మరియు బొటనవ్రేళ్ళు ఆకుపచ్చరంగు కలిగినను నొసటనందు ఎఱ్ఱని గుల్లలుకలిగి అందుండి జిగురుగల పచ్చని నీరు స్రవించుచుండిన అట్టిరోగి 4 దినములలో మృతినొందును. మరియు ఇట్టిస్థితియందు తలపై బొగడగింజలతో సమానముగు కురుపులు బైలువెడలి వానిరంగు నలుపుగానుండి నొప్పిలేకుండి మరియు క్రూరనిదుర కలిగియుండిన యీ లక్షణములు గలరోగి 40 గంటల కాలములోగాని, 40 దినములలోగాని మృతినొందును.

సూచనీయము, మొదటియొక్క పుప్ఫుశ్శాసరోగియొక్క పూపిరితిత్తులపై ఎల్లప్పుడు దిగుచుండును. ఇట్టి సిగుటవలన కొందరిదళ పూపిరితిత్తులయందు వర్ణమును కలిగించుచున్నది. ఇందువలన కొందరు వైద్యులు దీనిని సిల్ అందురు. గాని యిది భ్రాంతియే. ఎటులనవగా పైనవర్ణించబడియె. ఇందువలన యిప్పుడు నేను శ్రుతియగు సిల్ (పూపిరితిత్తులవర్ణము) యొక్క భేదమును వర్ణించుచున్నాను. ఈరెంటియందు భేదమేమనగా ఈవిధము వర్ణములందు బహుళము కలుగుచున్నది. అందులో పాపముగు కొమ్మలప్ప దగ్గుతో పాటుగా వెడలుచుండును. అనగా నిది శిల్ వ్యాధికి విరుద్ధముగా నుండును దీనితో తపెదిక్ (జ్వరముతో కూడియుండుటయు) అవశ్యముగా కలుగుచున్నది మరియు పుప్పుతో చీము కలిసివచ్చుట దీనిప్రభావముగును. అనగా అప్పుడుగు రతూబతు (నీరు) చీముతో కొద్ది, గొప్ప కలిసియుండును. ఇందువలన యీరెంటియందు భేదము పరీక్షించుట యోగ్యమైనది. దీనివలన యీరెండింటి భేదమును గ్రహించవచ్చును. అనగా చీముయొక్క లక్షణములు దుర్గంధముగా నుండుట నీళ్ళపై వేశిన కొంతసేపటికి మునిగిపోవును. మరియు ఈచీమునందు కుళ్ళు విశేషముగా నుండును, జుఖామ్ అయినచో కాల్చుటకు అవశ్యము కలుగదు. దుర్గంధముయొక్క కారణమువలన నీరట్టి సమయమునందు లనకు దుర్గంధము నాశికకు తెలియకుండిన నిప్పులో కాల్చకుండిన అంతవరకు దాని దుర్గంధము తెలియకుండును. మరియు చీముయొక్క దుర్గంధము శల్యము కాల్చుటవలన ఏవాసనగా నుండునో అట్టిగంధము కలుగును, ఒక్కొక్కప్పుడు తక్కువగా వక్వమైయుండిన కారణమువలన చీముతోకూడా నెత్తురు మిశ్రమమై వెడలనారంభించును. దగ్గునందు పొక్కులు, ముక్కలు కలసి వెడలుచుండును. ఈ కారణమువలన గాయము చెక్కినటుల రేగియుండును. మరియు కఫము దీనికి విరుద్ధముగా నుండును. కఫము నీళ్ళపై వేసినను నిలిచియుండును గాని మునగనేరదు, అగ్నిపై వేసి కాల్చినచో దుర్గంధము కలుగకుండు

ను. యిటుల చీము కాల్చుటవలన దీర్ఘంపు వ్యాపించును. కఫము అట్టి దుర్వాసన కలుగనేరదు. మరియు కఫమునందు రక్తముగాని, పరుపులుగాని కలిసియుండవు. యిటులనే చీము వ్రణమునుండి రిక్తదశ పొందజాలదు. మరియు ఎల్లప్పుడు సిల్ (ఊపిరితిత్తులగాయము) జ్వరము, రెండవజ్వరములతో కలిసియుండును. అనగా చతుర్థాహిక, త్రియాహిక, ఏకాహిక, సప్తాహికాది జ్వరములలో కలిసియుండును. ఈజ్వరములన్నిటికంటె సప్తాహికగాని, ఆహికజ్వరముగాని కూర్చియుండునని గ్రహించవలెను. ఎటులననగా యీవ్యాధిన బాధపడువారి పలుమారు వాతము వలన కలుగుచున్నది. దీనిచికిత్స యేమియు సంబంధము కలిగియుండదు. మరియు ఊపిరితిత్తుల వ్యాయామము ఆరంభమునందు కొంచెముగానుండును తదుపరి అనుభవముగా నుండునని గ్రహించవలయును. ఊపిరితిత్తుల గాయము కుదురుటయందున్న, కుదురకుండుటయందున్న, వైద్యుల యొక్క మతభేదము కనిపించుచున్నది. కొందరు ఊపిరితిత్తుల వ్రణము కుదురుట దుర్లభమందురు. ఎందుకనగా ఊపిరితిత్తులు ఎల్లప్పుడు గతి గలిగియుండును. చీము, మానుట యీయంగతియందు దుర్లభముగాయున్నది. అనగా గాయముగల అంగము నిలిచి యుండవలెను.

హకీంజాలీనూస్ గారు వచించినదేమనగా యీయంగముయొక్క గతి దాని వ్రణమును బాగుపడుటకు అటంకపరచజాలదు. మరియు వేరుకారణము గతితో సంబంధములేకుండవలెను. ఈవిషయమై ప్రమాణము కలిగించుచున్నది. అనగా హృత్తుకూడా సర్వదా గతి కలిగించుచున్నది. మరియు హృదయముయొక్క గాయము కుదురుటకు దీనియొక్క విరోధముండనేరదు. ఇచ్చటకూడా దానియొక్క వాక్యము కలదు. అనగా గాయము కుదురుటకు కారణము సరసుల ముఖము విడిపోవుటవలనగాని చీలిపోవుటవలనగాని లేటస్థించి దీనివలన వాపు కలిగి చీము చేరకుండినచో యిట్టిగాయము మానిపోవును. మరియు వాపునందు చీముకూడా పుత్పన్నమైనచో దీనికారణము వాపుగాని లేక దోషములయొక్క తీక్ష్ణ

త్వేకువలన దగ్ధమైయుండినకారణమైనచో జీర్ణమగు కుదురుట దుర్లభమగును. అనగా చీముతో రక్తముగూడు వరకు గాయము కుదురజాలదు. మరియు గాయము దగ్గుతో శుభ్రపడియుండును. అందుచే మలము దగ్గువలన వెడలిపోవును. దగ్గు వచ్చినప్పుడు విశేషముగా పెంచుచున్నది. మరియు దగ్గుయొక్క గతి నొప్పిని అధికపరచుచున్నది. నొప్పి మలమును గాయమునుండి నిర్బంధించును. ఈగాయమును మాన్పుటకై శుష్క ఔషధము లుపయోగించినయెడల దగ్గు రోగ్యమునకు అధికమగును చీమును అప్పుడప్పుడు బైటికి రానీయదు. కాబట్టి మృదువగు చమ్మగల ఔషధము లుపయోగించినచో నీఔషధములు గాయమును ఆరోపచ్చరంగు కలిగించుచున్నవి. ఇటుల గాయము పసరురంగు కలిగుటవలన కుదురజాలదు. ఇటులనే వూపిరితిత్తియొక్క నరము మిక్కిలి వెడల్పుగను కఠినముగా నుండును. మరియు నాలుగువిధములగు వ్రణములు ఇటువంటి నరములపై లేచినయెడల కుదురుట మిక్కిలి అసాధ్యమగును. ఇట్టివ్రణములయందు ఔషధసారము ప్రవేశించువరకు రోగి మిక్కిలి దుర్బలమును పొందుచున్నాడు. చల్లని వస్తువులు బొత్తిగా ప్రవేశించరాదు. వుష్ణవస్తువులు నొప్పిని కలిగించును. వ్రణము మానుటకు శుష్క ఔషధము లుపయోగించవలెను ఇట్టి శుష్క ఔషధములు జ్వరమునకు హానికలిగించును. మరియు గాయము వూపిరితిత్తి ముఖమునందు కలిగినయెడల దీనిచికిత్సకూడా దుర్లభమగును. గాని నిది కుదురుట యోగ్యమగును. గాయము వూపిరితిత్తి ముఖముయొక్క లోపలిభాగముందుండును. వూపిరితిత్తి ముఖము యొక్క మాంసమునందు చేరకుండిన నట్టి వ్రణము కుదురుటకు యోగ్యముగానుండును.

లాభము :—సిల్ (వూపిరితిత్తులు చిక్కుట వ్రణము కలుగుట) యొక్క వ్యాధి బహు స్వల్పరోగులకు కుదురుచున్నది. మంచి వుపాయము వీలుపడినయెడల సమయముకూడా విశేషముగా దొరుకును. తరుణావస్థయందు యీవ్యాపము తగ్గుపరకుండును. మరియు హాకీంసీఖివ్వల్

రయిన్‌గారు వచించుచున్నారు. నేను ఒక స్త్రీని చూచితిని. యీరోగ ముతో యిరువదిమూడు సంవత్సరములవరకు జీవించుచుండెను. మరి యు నీరోగము చల్లనిదేశమునందు చలిఋతువునందు విస్తారముగా పుత్పన్నమగుచుండును. మరియు నిదిపదునెనిమిది వత్సరములు వయస్సు మొదలు ముప్పది వత్సరముల వయస్సుగల వారికిన్ని చిన్నరొమ్ముగల వారికిన్ని పొడవుమెడ గూనిగలవారికి కంఠమునందు పీక బైటికి పొడు చుకొనియుండునటుల యుండువానికి మరియు భుజములపై మాంసము లేనివారికి వీపుపై యీకెలు తీసినకోడివలె యుండునటుల యుండు వారికి విశేషముగా యీరోగము కలుగుచుండును. మరియు చల్లని ప్రకృతిగలవారు యీవిపత్తునందు చిక్కి బాధనొందుచుందురు.

## సిల్ (క్షయరోగ) చికిత్స.

ఆరంభమునందు బాసలీక్ అను సిరను ఛేదించవలెను. యేపై పునందు నొప్పికలదో ఆపైపునందు శిరావేదనము చేయవలెను. ఇతర లక్షణము లవశ్యముగా నుండిననేతప్ప లేనిచో క్షారకర్మగాని శృంగ ములవల్లగాని శస్త్రమువల్లగాని రక్తులువేయవలెను. ఈరోగముయొక్క మలము తలనుండి వూపిరితిత్తులపైపు దిగుచుండినయెడల కీఫాల్‌యొక్క శిరావేదనము చేయవలెను. యవసత్తు పీత (రెమ్మ)కాయలతో వృశి కించినది యీరోగమునందు లాభదాయకమగును. మరియు అజాయెను ల్ ఇంతిఖాబ్ అనుగ్రంథమునందు వ్రాయబడియున్నది. అనగా పీత లు (రెమ్మ)కాయలు) యీరోగమునందు మిక్కిలి లాభదాయకమగు ను. రోగి వీటిని తినుటవలన గుణము కలిగినచో మేకపిల్లల కాళ్లు పీత లకు బదులుగా నుపయోగించుచుండవలెను. మరియు శరీరము మృధు త్వము నొందినయెడల యవగంజియందు హబ్బుల్లాస్ (వేపివిత్తులు) కలి పి పానముచేయవలెను. కురుసెద్దుకుబా, దీనిని చేయుక్రమము ఈ క్రిందచెప్పుచున్నాము.

ఖుర్సకద్దరుబా అను ఔషధము—

వంటజేగురు, నిశస్త్ర, గులాబిపూలు, ఇవి ప్రత్యేకం 14 మాషములు, కహరోబా, వేపివిత్తులు, నివి ప్రత్యేకం 21మాషము, కాల్చిన పీతలు, ఖుర్ఫావిత్తులు, తెల్లచందనము, నేతిబీరవిత్తులు, దోసవిత్తుల పప్పు, పందిరిదోసవిత్తులపప్పు ఇవి ప్రత్యేకం 35మాషములు. కావిరాయి 10½ మాషములువగడచూరు, కతిరాగోందు, తబాషీరీ, శాదనజ్ మగసూల్ ఇవి ప్రత్యేకము 15½మాషములు, తుమ్మజిగురు, యష్టిమధుకము, ఇవి ప్రత్యేకము 24½ మాషములు. కర్పూరము 6 రతులు యీ మొదలగువస్తువులను చూర్ణించి వస్త్రగాలితమొనర్చి బేదానా జిగురుతోనూరి బిళ్ళలుచేసి యుంచుకొనవలెను.

రెండవ చికిత్స

ఉష్ణమును తగ్గించుటకై తపేదిఖ్ (క్షయ) యొక్క ప్రకరణమునందు చూచుకొనవలెను. దానితోకూడా యీ అంశమునందు దృష్టి యుంచవలెను. అనగా ఏవస్తువు సేవించుటవలన గాయమును సుభ్రపరచి వచ్చునిసీరః చీము యొక్క మలమును పరిశుభ్రత నొందించునో దగ్గుకు నష్టపరచి గాయమును మాన్పునో అట్టి వస్తువులు వాడుక చేయవలయును. గాని మంటను కలిగించునట్టి వస్తువులను మాత్రము వుపయోగించకూడదు. మరియు, వూపిరితిత్తి గాయముతో కూడా హామ్మామెహాపీనా (ఇది యొక జ్వరము) ఏకో ఒక దోషము యొక్క వృష్ణమగుటవలన వుత్పన్నమగును. లేకుండినచో గాడిదపాలు, చను పాలు, పానముచేయుట అన్నివస్తువులకంటె లాభదాయకమగును. మరియు, ముందు వూపిరితిత్తుల గాయము వుబ్బి అందు చీము చేరిన యెడల నిది కుదురుట అసంభవము. మంచి చికిత్స చేసిన యెడల కుదరకలుగుచు గాని గాయము సమానముగనుండవలెను విశేషముగ పెరుగకూడదు. వూపిరితిత్తుల యితరభాగములు చెడిపోకూడదు. మంచి చికిత్సవలన ఆరోగ్యము కలుగగలదు. అనగా ప్రధాన దినమున నోటి

వెంట రక్తము వచ్చిన యెడల ఊపిరితిత్తులనుండి వచ్చిన రక్తమని సిద్ధారణ కలిగినచో అందు వాపు జనింపకుండ మునుముందుగా చికిత్స ఆరంభించవలెను. అనగా హకీం జాలినూస్ గారు వచించియున్నారు. ఒక మనుష్యుని నోటినుండి రక్తము వెడలనారంభించెను. ప్రారంభ దినమునందే చికిత్స ఆరంభించితిని ఆమనుష్యుడు ఆరోగ్యము నొందెను. ప్రథమ దినమునందు ఆరోగి దశకనిపెట్టకపోయినచో దానిదశ విరుద్ధమగును. మరియు, చికిత్స ఉపాయములు వర్ణించియున్నాను మరియు, సర్వదా రోగిని తిరుగనియ్యకూడదు. తక్షణమే శిరావేదన చేసి కొద్ది కొద్దిగా రక్తము అనేకపర్యాయములు వెడలించవలెను. దీనివలన రక్తము ఊపిరితిత్తులనుండియు వాటినరమునందుండియు వెడలివచ్చును. మరియు రక్తము ఊపిరితిత్తులయందు సహాయ్యము చేయజాలదు. ఇందువల్లనే రోగియొక్క చేతులు కాళ్లు మర్ధించుట బంధించుటకు ప్రశంసచేయుచున్నారు మిక్కిలి వృత్తపాయమే మునగామునుందువృష్ణమునకు సంతుష్టపరచుటకు పరిశ్రమచేయవలయును గాని గాయమునకు యోగ్యముగానుండు ఔషధములలోనున్న పగ్బతులలోనున్న ఉష్ణమును శాంతినొందించునట్టి వస్తువులను చేర్చుకోవలయును లేక ఎల్లప్పుడు జ్వరచికిత్స యుండారూఢముగ నుండవలెను

మరియు యెప్పుడు గాయముయొక్క చికిత్స చేయవలెను. ఒక దినము జ్వరచికిత్స చేయవలెను. ఒకదినము వ్రణమునకు చికిత్సచేయవలెను ప్రత్యేకముగా ప్రాతఃకాలమునందు వ్రణమునకు చికిత్సచేయవలెను. సాయంకాలమునందు జ్వరచికిత్సచేయవలెను. మరియురోగము కనుపించినవెంటనే వైద్యుని వద్దకువెళ్ళి చికిత్స చేయించుకోవలెను. ఇట్లు ఆరంభమునందు చికిత్సచేసినరోగియొక్క గాయముమానిపోవును. వ్రణమునందు చీము ప్రవేశించినచో యేవస్తువులు పరిశుభ్రత నొందించి మలమును తీసివేయుచున్నవో అట్టివస్తువులను లేపనము చేయుటవలన రోగికి గొప్పలాభము కలుగగలదు, రోగి శక్తిదుర్బలముగా నుండిన

వృష్టము కాని వృష్ణమైనచో యవగంజి, పీతము చేర్చి యివ్వవలయును
పాలు పానము కరించు సమయమునందు అనేక అంశముల రక్షణము చేయ
వలెనని గ్రహింపవలెను. అనగా జ్వరమునందు పాలుపయోగించకూడ
దు. చనుపాలు పానము చేయవలసివచ్చినచో రొమ్ముతోనే పీల్చవలెను.
మరియు గాడిదపాలు యిచ్చినయెడల ఆగాడిదె యువ్వనవయస్సు గలది
గా నుండవలెను. దానిపిల్ల నాలుగయిదు మాసముల వయస్సుగలదిగా
నుండవలెను. పాలు పిండునట్టిగ్లాసు, పాలుంచునట్టి పాత్రి అనేక పర్యా
యములు నీళ్ళతో కడుగవలయును. కడిగినపిమ్మట పవిత్రమగునట్టి పా
త్రిగా నుండవలెను. పాలను కాచకూడదు. పింగాణి మొదలగు గ్లాసు
గాని, సీసపుకళాయి గ్లాసుగాని వుపయోగించవలెను. పాలు పితుకద
లంచినప్పుడుగాడిదను రోగివద్దకుతీసుకొనివెళ్ళి ఒకపాత్రయందుష్ణోదకము
పోసి యుంచవలయును. పాలయొక్క పాత్రి వైద్యుని సమ్మతియందు
న్న, రోగియొక్క రుచియందు నిర్భరముగా నుండును. మొదటిదినము
52½ మాషములు పాలారంభించి పిమ్మట రోగి దశానుకూలముగా హె
చ్చించవలెను. శరీరమునకు రుచిగా నుండినచో ఒకమాషము సాంబర్
లవణము, సిరస్త 1½ మాషములు మొదలు 3½ మాషముల వరకు పాల
లో కలిపి పానము చేయవలయును. కొందరు వైద్యులు పాలు అర్ధశేరు
వరకుండవలెనని వచించిరి. గాని నిజములో దీనిప్రమాణ మవసరము
లేదు. రోగిదరకు ఆరోగ్యముగా నున్నంతవరకు పానము చేయవచ్చును.

మరియు ఫ్రస్తాద్ హాకీం మహమ్మద్ ఫరహోగారు వచించినదేమ
నగా పాలు పానము చేసినచో యేవిధమగు యితరభోజనములు యివ్వ
కూడదు. పాలవలన ప్రయోజనము కలిగినచో మూడు సప్తాహములు
(మూడువారములు) యివ్వవలెను. మేకపాలను పానము చేయుటవలన
లాభమేమనగా అందు నీళ్ళుకలిపి కాలినరాయి అందులో వేయవలెను.
దీనివలన నురుగువచ్చును. నీళ్ళు యినికిపోవును. మరియు యీపొంగిన
పాలు పొయ్యిమీద నునిచి కాచిన పాలకంటె పచనమగుటలో అతి

లేక అందుచేతనను దీనిని తీసివేయుటయే మార్గముగును. మరియు, నోటి మార్గమునుండి ఒకప్పుడు ఊపిరితిత్తుల చిక్కని చీము గుండెయొక్క నరము నందు చేరుచున్నది అచ్చటనుండి యకృత్ (Lever) యందు చేరుచున్నది. పిమ్మట పలుచనై మూత్రమార్గమునుండి వెడలుచున్నది గట్టిగానుండిన పేగువైపు తిరిగిపోవును. ఇందువలన వైద్యవరులు పుప్పుసయందు చీము వచ్చినట్టి రోగములలో మలమూత్రముల ద్వారా కూడా చీము వచ్చుచుండునని వచించియున్నారు.

మరియు మలమూత్రములలో చీము నిశ్శేషముగా వచ్చినకొలది వారు ఆరోగ్యము నొందినయెడల ఆరోగ్యమునకు చిహ్నములని భావించవలెను. మరియు ఊపిరితిత్తినుండి గుండెవైపుకు చీము వచ్చుచుండు నటుల గ్రహించుటకు మార్గముగా నుండును ఈదశయందు చీము హృదయముపైనుండి వెళ్ళనారంభించినచో కొద్దిగా పుక్కాద ముత్పన్న మగును. ఎటులనగా ఊపిరితిత్తులనుండి యేదైన యకృత్ యందు చేర వలసినచో హృదయమార్గమునుండి ప్రవేశించుచుండును. చీమువచ్చుటకుకూడా యిదేమార్గమని భావించవలెను. ఈవిషయములో నిర్ణయము చీము హృదయముపైగా వెళ్ళుచుండును. గొప్పవిపత్తును కలిగించదు. ముత్తవ్విలాత్ అను గ్రంథమునందు వర్ణించబడిన అంశమును చెప్పుచున్నాను. ఈకారణమువలన రొమ్మియొక్క ప్రకరణమునందు తెలియబడుచున్నది. రొమ్ము ఊపిరితిత్తులమధ్య ఊపిరితిత్తులు రెండుభాగములుండును. రొమ్మియొక్క చీము యెల్లప్పుడున్న ఊపిరితిత్తుల రొమ్ము మధ్య రెండువైపుల యందు నుండు దానియొక్క భాగము యారోగమునయొక్క చిహ్నములు గొప్పనొప్పుగలస్థలము నందు బరువుగను నొప్పిగానుండునటుల తోచుచుండును. పొడిదగ్గు శ్వాసకష్టముగా వెడలుచుండును. తపేదిఖ్ (జ్వరము) అవశ్యముగా కలుగగలదు. ఎటులనగా కుళ్ళినచీముయొక్క పృష్ఠము హృదయమునందు చేరుచుండును. అభిప్రాయమేమనగా యారోగముగలవానిదశ యా

పత్తుఅంగములున్న, (సిల్ రోగము పూపిరితిత్తులు శుష్కించుట ప్రణముగు రోగము) గలవాని అంగములవలెనుండును. ఇందువలన వైద్యులు దీనినికూడా పూపిరితిత్తులగాయమని గ్రహించుచున్నారు. మరియు యీఅంగములయందు వాపు చిహ్నములు కనిపించుట, యిందువిషయమై సాక్షియగును. అటగా పూష్ణము రొమ్మునందుమంటప్రేగులుకదులుట పీకటవలన చీము యుండినటుల తెలియుట యీమొదలగునవి దీని స్వాభావికములని గ్రహించవలెను. మరియు నొప్పి, మంట, పీకునట్టి స్థలమునందుండును ఇట్టిరోగి వకవైపుకు వత్తిగిలి రెండవవైపుకు వత్తిగిలుటలో బరువుగను, బిగించినటుల తోచినచో చీము అస్థలమునందే యున్నదని భావించవలెను. ఇటులనే అపిసిగింజముక్కచుతడిపి రొమ్ముపైనుంచినయెడల ఏవైపునుండినగింజయెండిపోవునో ఆయెండినస్థలమందు చీమున్నదని గ్రహించవలయును. ఇటులనే నొప్పియొక్క సంబధసందేహము తెలియబడుచున్నది. కదలునట్టిశబ్దము రోగి నొకవైపునుండి రెండవవైపునకు తిరిగినప్పుడు కలుగుచున్నది. మరియు బరువు పీకుట, మంటగానుండుట, మొదలగునవి వర్ణించబడియె.

మరియు చీము రొమ్ముయొక్క అర్ధభాగమందుండినచో అదినగము పూపిరితిత్తి రొమ్ము మధ్యభాగమునందు వుండినటుల తోచుచుండును. చీము రొమ్ముయొక్క యిరుపార్శ్వములయందుండినచో రెండుభాగములయందుకూడా చిహ్నములు కనిపించుచుండును.

రొమ్మునందు చీము నిలిచియుండుటకు చికిత్స

చీము వలచబడుటకై అంజూరపండ్లు, జూఫా, విహాసోడా, (శ్లేష్మాంతకము) యష్టిమధుకము, రాజహంస, గింజతీసిన ద్రాక్షపండ్లు, మొదలగువస్తువులను నీళ్ళలోవేసి కషాయముకాచి వడియబోసి బాదంనూనె, కతిరాగోందు, (బాదంజిగురు)వటికిబెల్లము, యీమొదలగునవి యందు కలిపి పానముచేయవలెను. చీము వలుచబడిన తరువరి సహజముగ వెడలునట్టి నదుపాయములను చెప్పబడియున్నవి వాని నువయో

గించవలెను. ఇట్టులనే మూత్రమును విసర్జింపచేయునట్టి ఔషధముల నుపయోగించవలెను. దీనివలన కదాచిత్ మూత్రమార్గమునందుగల మలము వెడలిపోవును. అట్టిస్థితియందు మూత్రాముద్వారా చీము వెడలనారంభించినచో యకృత్ (Lever) గురదా (మూత్రపిండములు) (Kidnigs) ను పరిశుభ్రపరచునట్టి ఔషధముల నుపయోగించవలెను. మరియు చీము యకృత్తునుండి ప్రేగులలో ప్రవేశించి మలముతో కలిసి వెడలనారంభించిన విరోచనకరమగు ఔషధిసహాయము చేయవలెను. దీనివలన అతివేగరము ప్రేగులలోనుండి చీము వెడలిపోవును. మరియు మూత్రములో కలిసి వెడలనారంభించినచో నిది అద్భుతముగా నుండును. ఒకవ్యాధి మూత్రమునందు మిశ్రిమమైనను మూత్రము మలమును కలిగించునట్టి వస్తువులను అనగా ప్రకృతి ఆయుర్బలము హేతువు ననుసారముగా రోగదశనుబట్టి యుపయోగించవలెను.

లాభము :- చీము పలుచనై పుపిరితిత్తులపై నశించనారంభించి పుమ్మితో సహజముగా వెడలకుండి చిహ్నములయందు న్యూనత కనుపించకుండినను పుపిరితిత్తులనుండి యకృత్ నందు ప్రవేశించకుండి మలమూత్రములు వెడలకుండిన ఇాదు రెండు విధములుగా మారుచున్నయది.

(1) గొంతుయందు వాపుకలిగి శ్వాసబిగించి రోగి మృత్యువు పాలగును. దీనిచిహ్నములు శ్వాస మిక్కిలి కష్టముగా వెడలుట వుమ్మిలో ఏమియు వెడలకుండుట.

(2) ఊపిరితిత్తులలో వాపుకలుగుట, పుపిరితిత్తుల అంగము కుళ్ళి కరిగిపోవుట, దీనిలక్షణములు. అనగా వాపు బ్రద్దలగుటకు నలుబది దినములు వ్యాతీతంబైనను చీము శుభ్రముకాజాలదు. ఇందువిషయమై శహారా అస్బాబ్ అను గ్రంథకర్త వచించియున్నారు. అనగా యీ రోగమునుండి ఒకసందర్భము ప్రకటనమగును. అనగా గొంతుయందు వాపు జనించును. లేక పుపిరితిత్తులలో చీముతో కూడిన

గాయము కలిగినమొదల వెంట వెంట నోటినుండి చీము వెడలి శుభ్రమగును. లేక మూత్రమార్గములనుండి పైనచెప్పిన విధిగా వెడలిపోవును. మరియు యుక్తవుపాయములతో ప్రయోజనము కనుపించకుండినను, చీము స్రవించకుండినను, రొమ్ములో యేస్థానమునందు చీముకలదో ఆస్థానమునందు సన్నని సలాకతో రంధ్రము చేయవలెను. దీనివలన కొద్దికొద్దిగా స్రవించునటుల వాతినుండి గొమ్మ్యగొట్ట శల్యములనుండి స్రవించుచుండును.

(సూచనీయము) యీ రోగముయొక్క మలమూత్రములతోకలిసి వెడల నారంభించినచో దీనికితగు యుపాయము సద్ద (మార్గములను బంధించునట్టి) దిక్కవరచునట్టివస్తువులనువిసర్జించవలెను. ఇందు యావత్తు యుపాయములు చీము సహజముగ వెడలుటకని తెలిసికోవలెను. ఏఅంగమునందున్నను నిలువకూడదు. రెండవ విపత్తు కలుగకూడదు.

గద్య, ఇది శ్రీమదిమాంబేగ్ సాహెబ్ పౌత్ర పాచ్చాబేగ్ సాహెబ్ పుత్ర "వైద్యభూషణ" బిరుదావళీ విరాజమాన వైద్యవిద్యావిద్వజ్జన విధేయ రహంతుల్లాబేగ్ నామధేయ ప్రణీతంబైన "తిబ్బెఅక్బర్‌షాహి" అను వైద్యగ్రంథమునందు రసరోగములు సర్వము సంపూర్ణము.



సూరకీమలో మారూఫ్.

బిస్మిల్లా హిర్రహమానిర్రహీం.

# తిబ్బెఅక్బరిషాహి

సండ్రెండవ అధ్యాయము.

## ప్రక్కవాపు లక్షణములు



ప్రక్కలయొక్క పొరలయందు రొమ్ముసంబంధమగు పొరలలో ప్రక్కయెముకల మధ్యసందులయందు వాపు కలుగుచున్నది. ఈఅంగములయందు పుత్పన్నమగు వాపునకు పేర్లు విధించుటలో వైద్యులమత భేదముగా నుండును. అనగా ముందు వర్ణించబడును. గాని యిచ్చట శరాహెఅస్బాబు అను గ్రంధమును సృజించినవారి మతానుసారముగ చెప్పబడుచున్నది. అందుండి ప్రత్యేక సవిస్తారము వేరు వేరుగా చెప్పబడును.

లాభము:—ప్రక్కవాపు రెండువిధములుగా నుండును.

(1) స్వభావికము. (2) అస్వాభావికము అని విభజింపబడియె. స్వభావికముగా యిందు వాపుకలుగును. అస్వాభావికమనగా కష్టతరమగు వాతము ప్రక్కలలో ప్రవేశించి రెండుపొరల మధ్యమునందు బంధించబడును. స్వభావికప్రక్కవాపు సమీపమునందు విశేషముగు నొప్పిని కలిగించును. దీనిభేదములు ప్రత్యేకప్రత్యేకములుగా వర్ణింపబడును. ప్రక్కయొక్క అప్రకృతి వాపుయొక్క పుపాయముపుష్ణమును కలిగించునట్టివస్తువులు సేవనము చేయవలయును మరియు కఫమునుతీయుట, శిరావేదనము చేయుటకూడా లాభదాయకమగును ఎటులనగా రక్తముతో వెడలిపోవుచున్నది. ప్రక్కవాపు నొప్పితోకూడియుండును రొమ్ము

వందు, పేరుస్థానమునందు ఉత్పన్నంబగు వాపు రొమ్ములోపటి అవయవములయందు జనించినచో దీనిని శూలవ్యాధి అందురు. మరియు ఈ వాపు క్రిమ్ముకొని అస్తర్ (అతుకవలె నుండునట్టి) రొమ్ము లోపటి పొరయందు జనించినమొదల ఆయాసము కలిగించుచున్నది. దీనిని వరసాం అందురు.

## ప్రక్క వాపు లక్షణములు

దీని అర్థము వైద్యుల సమ్మతియందు ప్రక్కటెముకల లోభాగమునందు, పొరలయందు లేక పరదా (మంధపుపొర) యందు వాపుజనించును. భుజించు పదార్థము అను ఆమాశయమునందు చేర్చునట్టి మార్గము శ్వాసనాళముయొక్క సంయోగికఅంగముయొక్క మధ్యమార్గమునందు భేదము కలిగించు పొరయొక్క కుక్షిభాగమునందు వాపు జనించును. కుడిభాగమునందు గాని, ఇరుపార్శ్వములయందు పొరయొక్క సంపూర్ణభాగములయందు వుత్పన్నంబైనచో దీనిని ఖానక్ అందురు. దీనివర్ణనము వేరుగా చెప్పబడును. గాని సులభముగా కనిపెట్టవచ్చును. ఈప్రకరణమునందు ప్రత్యేకవర్ణనమునందు విశేషలాభములు వ్రాయబడెను. మరియు హకీం కరేసీషేకుగారి మతానుసారముగ ప్రక్కవాపు శౌశా, వరసాం నందు యేమిభేదము చెప్పియుండలేదు. ఈశబ్దములను ఏకేఅర్థముగ భావించియున్నారు.

మరియు స్వభావిక ప్రక్కవాపునందు సహీ, అనికూడా వచించెదరు. దీనిచిహ్నములు జ్వరము ప్రతిసమయమునందు విడువక నిలిచియుండుట, శ్వాస కష్టముగా విడుచుట, దగ్గు, నాడి, మంసారి * మరియు ప్రక్కటెముకల క్రింద పొడచినటుల పోటు, నొప్పి కలుగుట దీనివలన రోగములము బహుదశలయందు నిర్మలమగు పిత్తమని ప్రకటనమగుచున్నది, గాని ఉష్ణపిత్తముయొక్క రుధిరముగాని ఒకప్పుడు ఉప్పని

---

*నాడి మంసారి యనగా శీఘ్రముగను అతివేగముగను మారు మారు నడచుట విశాలముగను కఠినత్వమునందు ఒకవిధముగానుండదు.




పీకె 6_2 చెడు రక్తనాళము, 3_5 గ్రైవేయిక (కంఠపులె నుండు) శల్యము, 4 వెన్నెముక, 8 కుడివైపునుండు యకృత్ మధ్య భాగము 9_14 పొర, 10 చిన్నపేగు, 11 మూత్రాశయముందు శల్యము మూత్రాశయము 12 పొర, 13 తొంటిశల్యము, ఆ: ఆమాశయము, 15 ఝల్లిపొర, 7_1 శుద్ధరక్తనాళములు.

శ్లేష్మము కుళ్ళుటవలనగాని, కలుగుచుండును. మరియు నిది ఝిల్లియం దువావు కలిగించుచున్నది. ఒకప్పుడు వాతము శరీరమునందు వృద్ధము గలదగుచున్నది. నిది వ్రిక్కయందు వావు కలిగించుచున్నది. గాన నిర్మలమగు రుధిరము, నిర్మలమగు శ్లేష్మము, నిర్మలమగు వాతము, ఈ వావునకు కారణము కాజాలవని గ్రహించవలెను.

ఎటులననగా ఝిల్లి పొరలయొక్క అంగము కఠినముగానుండును, పల్లగను దిక్కగానుండు మలము అందు ప్రవేశించజాలదు వ్రిక్కల యొక్క అస్వాభావిక వావునందు వ్రిక్కలయొక్క సూక్ష్మతంతువుల మధ్యభాగములయందు కలుగుచున్నది వ్రిక్కబొముకల మధ్యభాగము నందు వావుకలుగుట వుచితమగును. మరియు, కేవలము రుధిరము వలన వుత్పన్నమగును. ఎటులననగా బద్ధ గహ్వలలో భాగము మృదువు గను కఠినత్వమునకు విరుద్ధముగానుండును. ఈ కారణమువలన కేవలము రుధిరము కేవలము వాతసంబంధమగు రుధిరము, కఫము ప్రవేశమగు టకు యోగ్యముగానుండును. ఈ కారణమువలన దీనిని నాలుగు భేదములుగా వర్ణించియున్నాను.

## వ్రిక్కయొక్క రక్తజవావు లక్షణములు

ఈ వావుయొక్క చిహ్నములనగా పీకుట భారముగానుండినటుల వ్రిక్కబొముకల క్రింద భాగమునందు తోచుచుండుట ముఖకాంతి యెఱ్ఱగానుండుట నాడిశీఘ్రముగను వెట వెంటాడుచుట శ్వాసముక్కిలి కష్టముగా వెడలుట ఉమ్మియందు ఎరువురంగు కలిగియుండుట మొదలగు లక్షణములు రక్తజవ్రక్కవావునందు కలుగుచున్నది. మరియు హాకీం కిర్మిగారు వచించిన దేమనగా వుమ్మియొక్క రంగు మలమును మూవుచున్నది. మలముయొక్క ఎరువు రక్తకారణము వలన కలుగు చున్నది. పిత్తకారణమువలన వచ్చగానుండును. మరియు, ఎరువు వసు పురంగు రక్తదోషము ఘనీభవించుటవలన కలుగుచుండును. నలుపు

రంగు బాహ్యాది కారణములచేగా ధూమము మొదలగునవి లోభాగము
నకు ప్రవేశించుటవలన కలుగుచున్నది. ఇటుల పొగ మొదలుగాగలవి,
ప్రవేశించక నల్లగానుండిన వాతకారణము వలన కలుగుచున్నదని గ్రహిం
చవలయును. ఇటులనే జ్వరమువచ్చునట్టి వయసదినములందు జ్వరము
యొక్క విశేషత్వమువలనకనిపెట్టవచ్చును అనగా ఏదోషసంబంధముగు
నమో ఆలోచించవచ్చునని భావము.

## —వృక్కయొక్క రక్తజ వాపు చికిత్స—

రోగారంభమునందు మలమును దిగ్గించుటకై మరియు వాపు
నుండి తొలగించుటకై రెండవవైపునను బాసలిక్ అను శిరావేధనము
చేయవలెను మూడవదినమున తిరిగి శిరావేధనము చేయవలెను. ఇట్లు
చేయుటవలన ఆవైపునుండి ఆఅంగమునందు చేరియుండు మలము వెడ
లిపోవును మరికొందరు వైద్యులయొక్క సమ్మతి అనగా రెండవశిరా
వేధనమునందు యెంతరక్తమోక్షణము చేయవలెననగా రక్తమునందు
నలుపురంగు ప్రకటనమై లేక బొత్తుగా నల్లని రక్తము వెడలనారంభించి
నచో మరియు శక్తిసహాయమైనయెడల రక్తమును స్రవింపచేయవలెను
ఎటులననగా రోగముయొక్క కారణము మలముగాన యవరున్నరక్తము
విస్తారముగాతీయుటకుఅంతుయివ్వదు. అనగా రోగిదశను చూచిచికిత్సకు
సానుకూలముగా నున్నచో దీనికి ముందు రక్తమునందు నలుపురంగు
ప్రకటనమై యున్నయెడల నరమును బంధించకూడదు, అనగా నెమ్మది
గారక్తమును వెడలించవలెను. ఇటులతీయుటవలన రోగి మూర్ఛ పొం
దనేరదు. గాని రోగి శక్తిహీనముగా నుండినచో అట్టిస్థితియందునలుపు
రంగు లేకుండిన యెంతయోగ్యముగా నుండునో అంతవరకే రక్తమును
తీయవలెను. తదుపరి ఆపివేయవలెను. గాని నలుపురంగుయొక్క ప్రతి
క్షచేయకూడదు. బహుశ యిటుల కలుగగలదు, అనగామలముయొక్క
గతి ఒకదినముకంటె విశేషముగానుండదు. ఇంతవిషయమై జఖీర అను
గ్రంథకర్త వచించినదేమన ప్రథమదినమునందు రెండవవైపునుండి రక్త

మోక్షణము చేయవలెను. ఒక అహోరాత్రి గడచినవెనుక రెండవ వైపునుండి రక్తము వెడలించవలెను. అనగా మలమును ఆపినవెనుక శిరావేధనము చేయవలెను. సమస్త ప్రమాణములలో బుద్ధిమంతుడగు వైద్యవేత్తయొక్క సమ్మతియందు విస్తారముగానుండును. మలమును అంగముయొక్క ఆవర్ణమునుండి తీసివేయునట్టి ఔషధములకంటె మలమును రక్తమోక్షణముద్వారా రెండవవైపుకు మార్చుట అతిప్రుత్తమ మని తెలిసికోవలెను. ఎటు లనగా విరోచనమునకు ఔషధమిచ్చిన యెడల విరోచనము కాకుండిన మలము కదిలి రోగిమిక్కిలి కష్టపడును. ఈవిషయము రక్తమోక్షణమునకు విరుద్ధముగానుండును అనగా రక్తమోక్షణమునందు రోగమతిశయము కాజాలదు. కష్టము విశేషించనేరదు. వైద్యవరులు పిత్తసంబంధమగు మలమునందు ప్రుచితవిధిగా శిరావేదనచేయుట లాభదాయకమని వచించిరి. మరియు శిరావేదనము చేసినవెనుక ప్రుచితమని తోచినచో శరీరము ప్రున్నాబ్, విహీసోడా, (శ్లేష్మాంతకము) గింజలుతీసిన దాక్షపండ్లు, అంజూరపండ్లు, తియ్యని ఆల్‌బకరాపండ్లు, మొదలగువాని కషాయమువలన శరీరమును మృదువ రచవలెను. మరియు ఒకప్పుడు అవశ్యము కలిగినచో రేలకాయగుజ్జు, తురంజ్‌బీన్, పైకషాయములతో చేర్చి యివ్వవలయును. మరియు యవగంజి రోగికి యిప్పించవలెను. యవగంజి యిచ్చుటవలన రెండు విధములప్రుపకారములుకలవు. అనగా ఆహారముగా బలము కలిగించుటకు మలము వెడలించుటకు సహాయము చేయుట యీరెండు ప్రుపయోగములవలన యవగంజి ప్రుత్తమమని భావించవలెను. మరియు ఖమీరె బంప్షా షర్బత్తుతోకూడా చేర్చినచో అతి ప్రుత్తమము. మరియు బంప్షా, యవసత్తు, ఖిరెమి, వృష్ణోదకములోగాని బాబూనా తైలమునందు గాని కలిపి వ్రక్కలపై లేపనము చేయవలెను.

### వ్రక్కయొక్క పిత్తజ వాపులక్షణములు

ఈవాపుయొక్క లక్షణములు అనగా గ్రుచ్చుకొని నటులుండుట

నొప్పి అధికముగానుండుట తీవ్రజ్వరము ఎల్లప్పుడు నిలిచియుండుట మూత్రము దినములు విశేషముగానుండుట మంటగలుగుట పుష్కి వచ్చుగా నుండుట నాడి శీఘ్రముగా వెంట వెంట నడుచుట యీ మొదలగు లక్షణములు కలిగియుండును.

## పిత్తజప్రక్కవాపు చికిత్స

ఆరంభమునందు నొప్పికి విరుద్ధముగా నున్నవైపు (నొప్పిలేని వైపు) శిరావేదనము చేయవలెను. పిమ్మట ఇందువిషయమై రక్తజ ప్రక్కవాపునందు చెప్పబడిన చికిత్సలతో శరీరమును మృదుత్వము కలిగించవలెను. మరియు, ఉష్ణముశాంతి నొందుటకై షర్బతులను ఉపయోగించవలెను. మరియు, దగ్గు విశేషము చేయకుండునట్టి షర్బతులు నుపయోగించవలెనని భావము అనగా తామరపూల షరబతు, బనప్ షాషర్బతు, ఇసబ్గోలుగింజల గుజ్జులో కలిపి పానము చేయవలెను. పులుసు పదార్థములు దగ్గును కలిగించునట్టి వస్తువులు వర్జించవలెను.

లాభము:- ఆరంభమునందు శిరావేదనము యొక్క ఉపాయము రెండవవైపు చేయుటకు కారణమేమనగా పిత్తజ రుధిరము శరీరమునందు విశేషముగానుండును కాబట్టి వాపుగల స్థలమునుండి మలము స్వలముగా దిగివచ్చునని భయము స్వల్పముగానుండును. ఇది రక్తజవాపునకు విరుద్ధముగానుండును. ఇందు రక్తము వెడలించుట రెండవభాగము తప్ప వేరుభాగములతో తీయుట వర్జితమని చెప్పబడియె. ఎందుకనగా రక్తము శరీరమునందు విశేషముగానుండును. గాన ఇందువిషయమై మలము వెడలివచ్చుటకు గొప్పభయముకలదు గాన రెండవవైపు శిరావేదన చేయుటవలన గొప్పలాభముకలదు. ఎటులననగా అది దీనికి విరుద్ధముగానుండును. మరియు, సమీపముగానుండును. రెండవ శిరావేదనము చేయుటకు అంతరక్తజవాపునందు కేవలము రక్తము దూరముగు కారణమువలన అంత ఇవ్వబడినదిగాన బుద్ధిమంతుడగు వైద్యుడు కని

శి-చవలశిన అంశము అనగా ఇందు వెడలవేసిన మలము విశేషము గాయుండకు. వెడలినప్పటికి కూడా భయము కలుగకున్నచో రక్త దోషమునందుకూడా ఆరంభమునందు రెండవవైపుకూడా శిరావేధన ముచేయవలెను. రక్తమోక్షణమువలనగాని విరోచనము ద్వారాగాని మలదోషము వెడలించువరకు దోషము యాపత్తు బైటికి వెళ్ళువఱకు బనఫ్షాది షర్బత్తులు ఇవ్వజాలదు ఎటులనగా షర్బత్తు ఆమాశయము నందున్న ప్రేగులయందు తన సారము ప్రవేశింపజాలదు అనగా పనిచే యక నిష్ప్రయోజనముగానుండును. మరియు, రొమ్మునందున్న రొమ్ముయొక్క సమీపభాగమునందున్న ఆవిరియొక్క పరమాణువులను వుత్పన్నము చేయుచుండును. గాన యిందు వుచితమగు ఔషధములను కలిపి వుపయోగించుట మిక్కిలి వుత్తమముగా నుండును మరియు శరీరమును మృదుత్వము నొందించవలసిన అవశ్యము కలిగినచో వుచి తమని తోచినయెడల యీ క్రింద వ్రాయబడిన కషాయము పానము చేయవలెను. అనగా బనఫ్షాకు, గౌజుబాన్, ఉన్నాబ్, విహా సోడా, గింజలుతీసిన, ద్రాక్షపండ్లు, యష్టిమధుకము, ఖితిమి, ఖుబ్బాజి (చిన్నతుత్తురుబెండ విత్తులు) అంజూరపండ్లు, జూఫా, సౌసన్ (ఇంగ్లీషు లో లిల్లిఅందురు) వేరు రేలకాయగుజ్జు, శీరఖిస్త, బాదంనూనెఈమొద లగు వస్తువులను కషాయము చేయవలెను. నిది శరీరమును మెత్తపరచు టకై వస్తికర్మచేయుటకుకూడా అతివుత్తమముగానుండును.

### వస్తికర్మచేయు విధానము.

బనఫ్షా, తామరపూలు, గోధుమపొట్టు, ఖితమి, ఖుబ్బాజి (చిన్నతుత్తురుబెండవిత్తులు) ఉన్నాబ్ విహాసోడా చుకందర్ ఆకులు, రేలకాయగుజ్జు మొదీఫలము, తరువాణి గుల్ రోగన్ ఈవస్తువులు విధిపూర్వకముగా ఉపయోగించవలెను.

మరియు అన్ని విధములవాపు సంబంధమగు రోగములందు విరోచనఔషధములను పానముచేయించునట్టి ఔషధములకంటె వస్తికర్మవ

లన శరీరమును పృథుత్వము కలిగించుట అతిఉత్తమము. ఈవిషయ మును ప్రతిస్థలమునందున్న జ్ఞాపకముంచవలెను. అనగా ముందు రక్తపిత్తమువలన ఉత్పన్నమగునట్టి వాపుయొక్క చికిత్స ఒకవిధముగా నుండును ఈరెంటియందు రక్తమోక్షణము లాభదాయకము గాని రక్తజవాపునందు మాత్రము ప్రకటముగను పిత్తజవాపునందు రక్తమోక్షణముకంటె విరోచనకరఔషధములు నుపయోగించుట వలన భయము స్వల్పముగా నుండును. వైద్యవరులు దీనిప్రశంస చేయుచున్నారు ఎట్లనగా విరోచనకరఔషధములు తనుప్రభా వముచేయకుండును అనగా దోషములను కదలించితగవు ఆరాటము కలిగించును మరియు ఉత్తమవుపాయము పిత్తజవాపునందు నొప్పిగల స్థలముకనిపించి నొప్పి రొమ్ముయొక్క శల్యములవైపు మరియు కంఠశల్యములవైపు పోవుచుండిన విరోచనమునకు యిచ్చుట అతిఉత్తమము.

మరియు ప్రక్కలెముకల మూలములయందున్న ఆమాశయ మువైపు పోవుచుండిన విరోచనము చేయించుట వుత్తమము. విశే ష అవశ్యము కలుగకుండినంతవరకు దాహమును తగ్గించుటకై పెద్దపా యలరసము వుచ్ఛకాయరసము మొదలగునవి వుపయోగించకూడదు. ఎందుకనగా యీరసములు అపక్వము గలవి. మరియు కఫమును వెడ లకుండునటుల ఆటంకపరచును. కాబట్టి సహజముగా వెడలించునట్టి ఔ షధముల నుపయోగించవలెను. పక్వము నొందుటకు కారణమగును. అనగా జూఫాఅగ్నిత్తు మొదలుగాగలవి యుపయోగించవలెను. ముఖ్యాం శమేమనగా యీవస్త్రును వుపయోగించుటవలన లాభము మలము వెడలిన తదువరి విశేషముగా కనుపించును. మలము వెడలించుటకు ముందు పానముచేసినచో మిక్కిలి వక్వపరమగు. యేమియు భుజించ కూడదు. శీతజలపానము చేయకూడదు. ఇటులచేయుటవలన మిక్కిలి హాని సంభవించునని గ్రహించవలెను. సిక్కశబకులుగా పృథుపగు

విరోచనఔషధములు పానముచేయవలెను. ఇందువిషయమై యేమర్సత్తు పుదినాముగా కందనో ఆషస్సత్తు నీళ్ళలో కలిపి ఋప్పించవలెను దాహ మధికముగానుండి శాంతించకుండిన పుచ్చకాయరసము పులుపులేని శికింజబీన్ కలిపి పానము చేయవలెను. మరియు మలమును వెడలించి న తరువాత ప్రతిదినము ప్రాతఃకాలనమయమునందు ఖమీరాబెనఫ్షా బాదంనూనె విరోచనసంబంధమగు ద్రవపదార్థములయందు కలిపిపాన ము చేయవలెను. మరియు కేవలము యవగంజితో సంతుష్టపరుచవలె ను. యవగంజియందు పుర్నాబ్, సపిస్తాన్, బనఫ్షా, మొదలగు వస్తువులనుచేర్చి కాచి అందు శర్కర బాదంనూనె కలిపి పానమొనరిం చుట మిక్కిలి యుత్తమము. మరియు యీవత్తు సదుపాయములవలన మలము వక్కమై వెడలిపోవును. దీనిని పూపిరితిత్తులవాపునందు చెప్పి యుంటిని ఇందుకు సదుపాయములు అచ్చటనే చెప్పియుంటిని గనుక చదువరులు గ్రహించగలరు.

(సూచనీయము) బహుదా గుండెయందు పూణ్ణవాపు ఉత్పన్న మై నిది వ్రేలాడునట్టి స్థానమునుండి జారిపోవును దీని నొప్పిపొరయందు ప్రవేశించును. ఈకారణమువలన శ్వాస బిగించివచ్చుచుండును. రోగి వైద్యుడుకూడా సందేహించుచుందురు. అనగా ప్రక్కవాపునందు జ్వరము దగ్గు శ్వాసబిగబట్టుట మొదలగు లక్షణములు కలిగియుండును. ఇటులనె గుండెవాపునందుకూడా కలుగుచుండును ఈరెంటియందు భేదమేమనగా:—

గుండెవాపుగల రోగి ముఖము పసుపువచ్చగను వికారమైన రంగు కలిగియుండును. ఒక్కొకప్పుడు దగ్గుతోకూడా కుడిప్రక్కలో కష్టముకలుగును బరువుగనుండును గుండెయందునొప్పి గుచ్చినటుల నుండదు. ఒకప్పుడు నాలుక నల్లగను మూత్రము చిక్కగను జలోదర ముగలరోగి మూత్రమువలె నుండును వాపుపైభాగము నందుండిన చో చేతితో తాకిచూచి గుర్తించవచ్చును. మరియు, వాపు క్రిందభాగము

నందుండినచో శ్వాసపీల్చుటకు కఠినముగాను దుర్గంధముగల వస్తువు రోగి ప్రక్కలో క్రీలాడుచుండునట్లు తోచుచుండును. మరియు, ప్రక్కవాపు ఎడమభాగమునందు కలిగినచో నిది హృదయమునకు సమీపమునందుండుటవలన జ్వరము విశేషవృష్ణముగను భయంకరముగానుండును. దీని లక్షణములు మిక్కిలి కఠినముగానుండును. కాబట్టి త్వరలో పక్వమొందునని ఆశకలుగ గలదు. ఎందుకనగా హృదయము ఉష్ణస్వభావికముగలది. కాబట్టి ఈవాపు దానికి సమీపముగానుండుటవలన మలము నష్టమొందగలదు. మరియు, కుడిప్రక్కయందు వాపు కలిగినచో హృదయమునకు దూరముగానుండుటవలన దీని చిహ్నములు జ్వరము స్వల్పముగానుండును. ఈవాపు పక్వమొందుటకున్న నష్టపడుటకున్న ఆలస్యమగును. మరియు, ప్రక్కలవాపు ఊపిరితిత్తివాపునందు ఈభేదముకలదు అనగా ఊపిరితిత్తియొక్క వాపునందు నాడి వేగరముగా తరంగములువేయుచు నడువ నారంభించును. మరియు, నొప్పి బరువు శ్వాసబిగబట్టుట మొదలగునవి ప్రక్కవాపుబికింపుకంటె అధికముగానుండును. మరియు, ఇతర లక్షణములు ఊపిరితిత్తి వాపుయొక్క ప్రకరణమునందు వర్ణించియున్నాను గాన గ్రహించవలెను. వక్కవాపు యొక్క ఇతర ప్రకరణములయొక్క దశ ఇటువలెనే కలుగును. అనగా రెండవవాపుయొక్క దశలుగుచుండును. మరియు, యావత్తువాపులయొక్క దశ మూడుకారణములవలన రహితముకాజాలవు అనగా నష్టమగుట లేక చీముకలుగుట లేక కఠినముగానుండుట మొదలగు కారణముల వలన వాపు అసాధ్యమగునని గ్రహించవలెను.

మరియు, ప్రక్కవాపు అప్పుడప్పుడు కలుగుచుండును. ఇది కఠినముగానుండి బద్ధలై సమానముగానుండును. ఈవాపునందు ప్రథమ దినమునుండి అపక్వమగు నీరు వచ్చుచుండిన త్వరలో పక్వమైన ఎడల సాధ్యమగునని తెలిసికొనవలెను. ఈవాపు నాలుగవ దినమునందు పక్వమొందును, ఇటులనే మలము మెల్లమెల్లగా వెడలుచుండిన రోగము వృద్ధి

నొందుటకు చిహ్నములని తెలిసికొనవలెను. మరియు, ఇట్టి రోగియొక్క పుప్పుసమందు ప్రథమ ద్వితీయ తృతీయ దినములయందు మలము ప్రకటనమై పిమ్మట యేడవదినమునందు శాంతించును. మరియు, పదునాలుగవదినమునందు శమించకుండిన చీము విశేషమగును. ఈచీము నలుబది దినములలో పరిశుభ్రతనొందని మొదల క్షయ (ప్రాపిరితిత్తియందు వ్రణము) వ్యాధి పుట్టును. ఈరోగియొక్క ప్రక్కవాపు యొక్క మలము చీముగా మారినచో దీని దశ క్షయవ్యాధిగా మారును. యీప్రాపిరితిత్తియొక్క వ్రణమును ప్రాపిరితిత్తులవాపునందు వర్ణించి యున్నాము. మరియు ప్రక్కవాపు సుఖముగానుండిన నిది ఆరోగ్యముపొందుటకు బహుశా 14 దినములు గాని అథవా ఇరువది దినములు జరుగును. మరియు, ప్రక్కయొక్క వాపు కఠినముగానుండిన వేగరము 40 దినములు మొదలు 60 దినములకు శాంతినొందును. ఇంతవరకు శరీరశక్తి క్షీణముగానుండును. మలము విశేషముగా నుండిన జ్వరము అధికముగా నుండును వెంటనే పక్వమొందును. వెంటనే వెడలిపోవును చీము చేరుటవలన కలుగు చిహ్నములు నొప్పి విశేషముగానుండుట, శ్వాసబిగబట్టుట జ్వరమునందు మిక్కిలి ఉష్ణము శక్తియందు దుర్బలత్వము నాలుకయందు మగరి, ఆకలిలేమి, నోరెండుట, నిద్రనాశనము, రాత్రి చెమటలు, ప్రక్కలయందు బరువు మొదలగు లక్షణములు చీము ప్రవేశించుటవలన కలుగు చిహ్నములని గ్రహించవలెను.

మరియు చీము విశేషముగా ప్రవేశించిన తరువాత జ్వరమునొప్పి తగ్గిపోవును. ప్రక్కయందు మిక్కిలి బరువుగా నుండును. ఈవాపు బద్దలగు సమయమునందు నాడి విశాలముగను జ్వరము తీవ్రముగా నుండును. చలి అధికముగా నుండును. వాపు యిట్టిస్థితియందు బద్ధలగునని తెలిసికొనవలెను. పిమ్మట మందలక్షణములు తటస్థించును. అథవా కఫమునందు చిక్కదనము, మంచిరంగు, మొదలగునవి మంచి

చిహ్నములు తోమచుండిన బహుశా చీము చేరుటకు లక్షణములని భావించవలెను. ఇట్టిస్థితియందు వుపద్రవము యేమియు కలుగనేరదు. మరియు యీచిహ్నములు చీముచేరుటవలన కలుగకుండిన యీలక్షణములయందు న్యూనత కలుగకుండును రోగి త్వరలో మృతినొందును. అట్టిస్థితియందు శిరావేధనము విరోచనము చేయించుట, కఫము వెడలించుట, మొదలగు క్రియలవలన నొప్పి యితరలక్షణములు నష్టమొందదకూడదు ఇదిగాక శక్తిబలము గలదిగా నుండవలెను. ఆరోగ్యలక్షణములు ప్రకటనమైనచో వాపునందు చీముచేరినదని గ్రహించవలెను. మరియు వూపిరితిత్తులవాపుగా మారును శక్తి దుర్బలముగానుండు చిహ్నములు కలిగినచో వెంటనే అల్లుకొనును. అట్టిస్థితియందు వాపుగల ప్రక్కయందు చీముచేరుటగాని బ్రద్దలగుటగాని తటస్థించును. మరియు రొమ్ము వూపిరితిత్తుల మధ్యభాగమునందు ప్రవేశించును. రోగి అనేక దినములవరకు ఆరోగ్యమొంది తిరిగి చెడుదశయందు మారినదని ఆలోచించుచుండును. మరియు ప్రక్క యొక్క చిహ్నములు యీవిషయము తప్ప యావత్తు కఫము వెడలిపోయినచో చీము మూత్రమార్గము నుండిగాని వెడలుచుండునని గ్రహించవలెను. మరియు మలమూత్రముల మార్గము నుండి వెడలకుండిన పొట్టయొక్క జద్దరములయందు ప్రక్కటెముకలమూలములయందు బరువుగను వుష్ణముగానుండిన గజ్జలయందున్ను, పిక్కలయందున్ను, వాపు, వ్రణము, వుత్పన్నమగునని గ్రహించవలెను. ఈదశ సంప్రాప్తించిన ఆరోగ్యముందగలదని గ్రహించవచ్చును. ఇట్టిసమయమునందు వైద్యులు మలము వెడలించుటకు అజ్ఞాపించుచున్నారు మరియు ప్రక్కవాపునందు శ్వాసకష్టముగా వెడలుట తంద్ర విశేషముగా నుండుట కంఠశల్యమునందు వుష్ణముగను బరువుగా నుండిన మలము పైభాగమునకు వెళ్ళుటకు లక్షణములని భావించవలెను. మరియు చెవివెనుకవైపు వాపు వ్రణమును కలిగించును. మలము తీక్ష్ణముగానుండి యీచిహ్నములలోనుండి యేచిహ్నము ప్రకటనము

కాకుండిన మలము మొదటనుండి వెడలనారంభించి సర్సాం వ్యాధియొక్క చిహ్నములు ప్రకటనమగును. ఈవ్యాధి రోగిని చంపివేయును మరియు మొదటు బలముగలదై పైనుండి మలమును దూరపరచినచో మలము నొప్పిగల స్థలమునందు తిరిగిపోవును. మరియు మలముయొక్క విశేషత్వము శక్తియొక్క దుర్బలత్వము వలన శ్వాసమార్గమునందు నిలిచిపోవును. గొంతుకో వాపు కలిగించును. మరియు హృదయము (హార్టు) వైపుకు తిరిగినయెడల వున్మాదము అచేతనము కలిగించును మరియు ప్రక్కవాపు విడిపోయినను లేక బ్రద్దలైనయెడల నిది మూడు కారణములవలన రహితముకాజాలదు. లేక యితర అంగములయందు ప్రవేశించి వెడలిపోవును. లేదా హరించివేయును. లేదా యే అంగమునందు ప్రవేశించునో ఆఅంగమునందె యితరవ్యాధి కలిగించును. లేక పై భాగమునందున్న యితరస్థలములందున్న ప్రవేశించి వ్రణముగాని వాపుగాని కలిగించును. కాబట్టి యితరఅంగములందు ప్రవేశించి బైటికి వచ్చుచున్నది. ఇట్లు వచ్చుటకు మూడు కారణములు గలవు. అనగా శ్వాసమార్గమునందు వుత్పన్నమై వూపిరితిత్తియందు ప్రవేశించును. ఆమార్గమునుండి వెడలిపోవును మరియు వూపిరితిత్తియొక్క అజతపా అను నరములోనుండి ప్రవేశించి అజవపాయందు ప్రవేశించును. నిది మూత్రమార్గమునుండి వెడలనారంభించును. లేక ప్రేగులవైపు ప్రవేశించి విరోచన మార్గమునుండి వెడలిపోవును. బహుశా యీరోగ మలము కఠినముగను తీక్ష్ణముగను విశేషముగా నుండును. వక్కొమొందుటకు ముందు శరీరము దుర్బలకారణమువలన మలము వెడలనారంభించును. ఇటుల దూరపరచునట్టి కారణము వమనము క్రోధము మొదలగువాని తీక్ష్ణవేగమువలన కలుగుచున్నది. మరియు వక్కొమొందుటకు ముందు మలము వెడలుట మంచిదిగాదు. కింతు ఇట్టిస్థితియందు వుపద్రవము కలుగును.

విశేషద్రష్టవ్య:—లేపనాదులవలన కావడములవలన నొప్పిశాంతి నొందక నొప్పిఅధికమైనయెడల శరీరమలమునుంకి నిండియున్నదని తెలిసికొనవలెను. మలమును తొలగించుట అవశ్యముగాన అట్టిస్థితియందు ముఖ్యముగా శిరావేదనము చేయవలెను. అవశ్యకతానుసారముగా రక్త మెకలించవలెను. పిమ్మట విరోచనమునకు యివ్వవలెను.

రోగచిహ్నములు తగ్గకుండిన చీముపట్టుటకు లక్షణములని భావించి తిరిగి శిరావేదనము చేయుంజనదు. ఎందుకనగా రెండవతూరి శిరావేదనము చేయుటవలన శక్తి దుర్బలమగును. రక్తమునందుండు వుష్ణము తగ్గిపోవును. మరియు వాపు అపక్వముగానుండును. విశేషకష్టము కలిగించును. మరియు శిరావేదనము చేయకనే మలము పక్వమొందినచో మలము ధారాళముగా వెడలనారంభించును. శక్తియందు దుర్బలము కలిగియుండినయెడల శిరావేదనముచేయకూడదు. ఇట్టిరోగియొక్క మలము వెడలించవలసిన అవసరము కలిగినచో వస్తికర్మద్వారా వెడలించుట మిక్కిలి వుత్తమము.

మరియు రోగిశక్తిహీనుడుగా నుండిన శిరావేదనముచేసినవెనుక అచేతనుడగును. లేదా శ్వాస బిగబట్టినటులుండిన మలము హరించలేదని తెలిసికోవలెను. కాబట్టి యీవాపునందు వస్తికర్మ సహాయము లుచితమగును. మరియు ప్రత్యేకము ఒకపర్యాయముగాని రెండుపర్యాయములుగాని, శరీరము విడిపోవును. శిరావేదనముచేయ అవశ్యము లేకుండును. రోగినిచూచి మలము పక్వమొందినచో చీము చేరుటకు ముందు దీనిని దూరపరచునట్టి నుపాయములను చేయవలెను. మరియు వృష్ణోదకము వలచని యవపిండి శర్కర వెన్నతో లేక తేనెతోగాని భుజించుట మరియు వాపుపైవు వత్తిగిలుట మొదలగునవి కఫము నోటివెంట వెడలుటకు సహాయము చేయుచుండును. మరియు రొమ్మును ప్రక్కల మలరహితపరచును.

### మలమున వక్త్రేవరకు లేపనవిధి

బనప్షా, ఖితమి, యివివ్రిత్యేకము 1 భాగము సౌసక్ వేరు 2 భాగములు, యవపిండి, బొగడగింజలపిండి, ప్రత్యేకము 1½ భాగము బాబూనా 1 భాగము, యీవస్తువులను మైనకరకు బనప్షాతైలము నందు కలిపి లేపనము చేయవలెను.

ఉష్ణము తక్కువగానుండిన బనప్షాతైలమునకు బదులుగా సౌసక్ తైలముగాని నగిస్ తైలముగాని కలిపి లేపనము చేయవలెను. మరియు జలుబు విశేషముగానుండినచో అవిసిగిత్తులు, తామరవిత్తులు, మల్లెఆకులు, నేతిబీరఆకులు, మయువక్లేవ్, యొక్క భాగమునకు బదులుగా చేర్చవలెను. దస్తూరవుల్ ఇలాజ్, అనుగ్రంధమునందు వ్రాయబడినదేమనగా వృష్ణమును శాంతినొందించుట అన్నివ్యాధులయందు అవసరమని భావించవలెను. వృష్ణమును శాంతినొందుటకై ఇసప్గోలుగింజలజిగురు, పొడుగునేతిబీరగింజలపప్పురసములో బనప్షాషర్బతు కలిపి పానముచేయవలెను. మరియు భోజనమునందు శిరిచెనగపప్పుగాని వేయించిన పెసరపప్పు, నెయ్యి, పాలకూర, తియ్యబాదంనూనె, పాలు, బాదంపప్పు, యీమొదలగువస్తువులు పత్యకరములు.

మరియు, వ్రిక్కవాపుయొక్క కారణమువలన రొమ్మునందు మంట ఉత్పన్నమైన యెడల ఎఱ్ఱహూరసము నామాంకమైన పన్నీరు ఖుబ్బాజి (చిన్నతుత్తురుబెండ) ఆకు రసము, బార్తంగ్రసము, ఇసబ్గోలుఆకురసముఇసప్గోలుగింజల జిగురు యీమొదలగునవి వకటిగాచేర్చి ఉడికించి చల్లార్చి అందుబట్టతడిపి రొమ్ముపై వేయవలెను. ఆబట్ట వేడియెక్కగనేతీసివేసి రెండవబట్టతడిపి వేయవలెను. ఇటుల పలుమారుతడిఆరిన తరువాత బట్టతీసి నూతనముగా బట్టతడిపి వేయుచుండవలెను. ఇటుల వేయుటవలన తాపము తగ్గిపోవును. ప్రకృతిని నిజదశయందు మార్చును. శుష్కత్వమును దూరపరచును రోగమలమును విరోచనమార్గమునుండి వెడలించును.

—వ్రక్కయొక్క వాతజవాపు లక్షణములు:—

ఇందువిషయమై ఈఅధ్యాయముయొక్క ప్రారంభమునందు వర్ణించియుంటిని అనగా వాతము దగ్ధమైయుండి కళ్ళుకుండిసంతవరకు వ్రిక్కలోపటి గుల్లియుండున్న భోజనమార్గము శ్వాసమార్గమునందుండు పొరయందు వాపు కలుగజేయును దీని చిహ్నములు పొడచినట్లుండుట, పీకు విశేషముగా నుండును నోరెండుట, జ్వరము విశేషముగానుండుట నాలుక నల్లగానుండుట నాలుక ములువారి యెండియుండుట నాలుకపై గరికలుగుట కళ్ళె అలక్ష్యముగా వెడలుట కఫము వెడలునప్పుడు కష్టముగానుండుట కళ్ళెరంగు నల్లగానుండుట యీ లక్షణములు కలిగియుండును. మరియు, వాతజవాపు అలక్ష్యముగా మలము పక్వమొందిన కారణముగలవ నీచత్వము నొందును నిది రోగిని బహుళో చంపివేయును.

—వాతజ వ్రక్కవాపు చికిత్స:—

శిరావేదనముచేసి రక్తము వెడలించుట యీ రోగమునందు ప్రధాన చికిత్స యని గ్రహించవలెను. మరియు, ఉష్ణము శాంతినొందుటకై ముందు చెప్పబడిన చికిత్సలను ఉపయోగించవలెను. నొప్పిగల స్థలమునందు కర్నిబ్ (క్యాబేజి) ఆకులు, బనప్షా, బాబూనా, ఖితమి యీ మొదలగువానితో చేయబడిన లేపనము ఎల్లప్పుడు ఉపయోగించవలెను. మరియు, ఉష్ణోదకముతో కాపడము చేయుచుండవలెను. దీని వలన వాపు మెత్తబడును. మలమునందు తెమ్మకలిగించి పక్వమొందుటకు సహాయ్యము చేయును. నొప్పియందు న్యూనత కలుగును. మరియు విరోచనమునకు యిచ్చి శరీరమును మృదుత్వము నొందించవలెను, మలముయొక్క వేగము క్రిందివైపునుండి అనగా పైనచెప్పబడియున్నాను. గాన శరీరమును మృదుత్వము నొందించునట్టి లాభముకంటె శిరావేదన చేయుట మిక్కిలి ఉపయుక్తముగానుండును. ఎటులనగా దోషమలము శిరావేదనము చేయబడిన స్థలమునందు దిగివచ్చును. అటువైపునే దీని వేగము కలిగియుండును.

### పృక్కయొక్క కఫజవాపు లక్షణములు

ముందు వర్ణనమువలన తెలియబడిన దేమనగా శ్లేష్మమునందు గుళ్ళు తీక్ష్ణత్వముకలుగువరకు ఝిల్లిపొరలయందు ప్రవేశించి వాపు కలిగించజాలదు ఈకారణము,వలన ప్రక్కలయొక్క వాపు వాతము కఫముయొక్క మలదోషమువలన బహుశా స్వల్పముగా పుత్పన్నమగును. ఈవాపునందు భారముతోకూడా నొప్పి లఘుజ్వరము గ్రుచ్చుకొని నటుండుట మొదలగు చిన్నెలు కనిపించుచుండును పుమ్మి తెల్లగానుండును. మరియు, ఆరంభదశయందు స్వల్పముగా ఎఱుపు కలిగియుండును. ఎటులననగా కఫమునందు రక్తము మిళితమై వెడలనారంభించును. మరియు, కఫముయొక్క యావత్తు భేదములకంటె మంచిదని గ్రహించవలెను. కఫమునందు ఉష్ణము తీక్ష్ణత్వము మిక్కిలి స్వల్పముగానుండును. ఇది గాక కఫము వెంటనే పక్వమొందును.

### కఫజపృక్కవాపు చికిత్స

శిరావేదనముచేసిన వెనుక మొదటి భేదమునందు వర్ణించిన విధి ప్రకారము శరీరమును మృదుత్వము నొందించునట్టి లేపనములు కావడములు వ్రాష్ణమును శాంతినొందించుటకై అనగా అవసరమునుబట్టి ఉపయోగించవలెను. మరియు, ఉష్ణమును శాంతిపరుచుటలో మిక్కిలి శాంతిగల చికిత్సలు చేయకూడదు. దీనివలన మలము అపక్వమై చిక్కదనమేర్పడకూడదు. మరియు, యవనీళ్ళయందు సెనగలు సోపు చేర్చి కాచి పానము చేయవలెను. జూపాషగ్బతు పానముచేయవలెను. దీనివలన దోషము బైటికి వెడలిపోవును. శరీరమందుండు మలము మృదుత్వము నొందును.

## అస్వభావిక పృక్కవాపు లక్షణములు

దీనిని ముగాలత్ మరియు, గైర్‌సహి అని చెప్పుదురు నిది బద్ధపరములయందున్న ప్రక్క శల్యముల మధ్యభాగమునందున్న దోష

ముకలిగి వాపు సంభవించును. అచ్చటనుండునట్టి ఝిల్లి పొరయగును అనగా ప్రక్కటెముకల పైభాగమునందు కప్పుకొనియుండు ఝిల్లియందు వాపు ఉత్పన్నమగును. మరియూ, రొమ్ముయందు యావత్తు 14 ప్రక్కటెముకలుగలవు ప్రత్యేకముగా ఒక్కొక్కవైపు ఏడేసిశల్యములు గలవు. ఈ రెండింటి మధ్యమునందు ఒక బద్ధనరముండును రొమ్ము ఈబద్ధనరములతో అల్లుకొనియున్నది. వీటివలన బిగించబడియున్నది గాన ఈ దశయందు యావత్తు బద్ధనరములు బైటనున్నవి. ప్రక్కటెముకల మధ్యమునందు అనగా ఝిల్లిపొర ప్రక్కలయొక్క లోభాగమునందు ఇటులనే రెండవ ఝిల్లిపొర వాటి వెనుక భాగమునందుండును గాన వాపు ఈబద్ధనరములందుగాని పైభాగమునందుండు ఝిల్లిపొరయందుగాని కలుగుచుండును దీనిని జాతుల్ గైర్ ఖాలిస్ అందురు ఎటులననగా లోపటి ఝిల్లిపొర వాపునకు ఖాలిస్ అందురు ఖాలిస్ యొక్క కారణమిదియె. ఖాలిస్ యందు వర్ణించబడినది ముఖ్యముగా లోపటి ఝిల్లిపొర వాపునకు గైర్ ఖాలిస్ అనుచున్నారు. మరియు బద్ధనరములయొక్క వాపు దీనికి విరుద్ధముగా నుండును. ఈవాపు కేవలము రక్తదోషమువలన కూడా కలుగుచున్నది. ముందు సర్గయందుకూడా దీని సంకేతము చెప్పబడియున్నది. వాపు బద్ధనరములయందు కలిగినచో దీనిచిహ్నములు గ్రుచ్చుకొనుట, నాడి శీఘ్రముగా వెంటవెంట నడుచుట గైర్ ఖాలిస్ ప్రక్కవాపు కారణములకంటె మిక్కిలి స్వల్పముగానుండుట, కఫము వెడలకుండుట, శ్వాసబిగబట్టుట, ఒకానొకప్పుడు బద్ధనరములయొక్క వాపు బ్రద్దలై ప్రత్యక్షముగా కనుపించుట వాపుగలస్థలమునందు ముట్టినచో కష్టముగానుండుట, ఈ మొదలగు లక్షణములు కలిగియుండును. మరియు వాపు పైభాగమునందు బ్రద్దలగుచున్నది. ఇందులో నల్లనిరంగు ప్రకటనమైనయెడల నిది మిక్కిలి క్రూరమైనదని గ్రహించవలెను. ఎటులననగా నిది మలము హీనమగుకారణము చూపుచున్నది, మరియు ఝిల్లిపొరయందు వాపు

వుత్పన్నమైనదో దీని చిహ్నములు కూడా ఇటులనే యుండునని తెలిసికో
వలెను అనగా బద్ధనరములయందు చెప్పబడిన లక్షణములని గ్రహించ
వలెను. ఈ రెంటియొక్క భేదము అనగా పెరుగుట, నాడి శీఘ్రము
గను వేగముగా నడుచుట, ఝిల్లీపొరవాపునకంటె బద్ధనరములవాపుయం
దు విశేషముగా యుండును మరియు శ్వాసనిరుద్ధుట మిక్కిలి తక్కువ
గా నుండును. తక్కిన లక్షణములవలన వాపుయొక్క దశ యేవిధమైన
వాపు అయినది తెలియబడును. దీనిని సహితము విమర్శకరణము
నందు చెప్పబడునని గ్రహించవలెను.

—అన్యభాగిక పక్కవాపు చికిత్స—

పైకీశపరీకరణములయందు యేయే చికిత్సలు చెప్పబడియున్న
వో అనగా శిరావేదనముచేయుట విరోచనమునకు యిచ్చుట వ్రణము
ను శాంతినొందించుట, మొదలగు సమపాకములు కూడా యీవాపు
నం దుపయోగించవలెను. మరియు యేయే అంశములను ఖాలిస్ ప్ర
క్కవాపునందు వర్ణించియున్నవో వాటియందు లక్ష్యముంచవలెను.
మరియు యీవాపునందు ఖాలిస్‌వాపుకంటె లేపనలవలన విశేషలాభ
ము ప్రాప్తమగును. యెటులనగా ఔషధముయొక్క గుణము సమీప
ముసందు ప్రవేశించును. ఒక్కొక్కప్పుడు గైర్‌ఖాలిస్ వాపు బద్ధనరము
లయందు ప్రత్యక్షముగా కనుపించుచుండును. వాపు బద్దలుగాకుండిన
వాపుగల స్థలమునందు తూరకర్మవలన గాని శస్త్రముతో గంట్లువేసి
చీము స్రవించునటుల చేయవలెను. మరియు దస్తూరవుల్ ఇలాజ్ అను
గ్రంథమునందు చెప్పినదేమనగా వాపు ఝిల్లీపొరయందుండినచో బాస
లీక్ అను శిరావేదనముచేయవలెను. బాసలీక్ అను నరము అనగా కా
లి అనామికా వేలికి సమీపముగానుండు నరమునకు బాసలీక్ అందురు
నిది మొదనుండి క్రిందినరములకు వుపయుక్తముగా నుండును. బహుదా
రోగులకు సాఫిన్ అను శిరావేదనము చేయుట మిక్కిలి లాభదాయక
మగును. నొప్పి శాంతి నొందుటకై కొబ్బెంతబోలుగింజలు, అవిసివిత్తు

లు, బొబూనా, చదర్వుహాను, బనప్షా, యిారా మొదలగునవి నీళ్లలో వేసి కషాయము కాచి తీసుకొనవలెను. ఇట్టిస్థితియందు శరీరమును మృదుత్వము నొందించుటకు అవసరమగునట్లుండిన ఉన్నాబ్, అంజూరు పండ్లు, గౌజుబాన్, బనప్షా, లిసూడాలిబిబకోరా, ఖత్మి, ఖుబ్బాజి, స్వతంత్రపుబెహదానా) లిసోడా (శ్లేష్మాంతకము) యిారా మొదలగునవి నీళ్ళలో రాత్రిభాగమునందు నానవేసి ప్రొద్దున పిసికి వడియబోసి రేలకాయ గుజ్జు, తురంజబీన్, కలిపి పానము చేయవలెను.

## ఖూనాకా (పక్షి-లోపటి ఖుల్లి పొరవాపు) లక్షణములు.

ఖూనాకా అనగా పక్షి లోపటి ఖుల్లిపొరయందు కలుగు వాపునకు పేరు. ఈవాపు నిజమగు నాలుగుగల వాపుయొక్క భేదము యిందులో ప్రక్కటెముకల లోభాగమునందుండు ఖుల్లిపొరయావత్తు వాపుగలదై యుండును. ఇటులనే యీప్రకరణముయొక్క ఆరంభము నందుకూడా వర్ణించబడినది. దీనిచిహ్నములు శ్వాసపీల్చుటకు కఠినముగానుండుట, యెందుకనగా యీవాపుగల ఖుల్లి శ్వాసపీల్చుటలో సహాయము చేయుచుండును. కాబట్టి దానియందంతట వాపుకలిగియుండుకారణమువలన విశాలమగుటకు బదులుగా బిగిసికొనును. నిది యెంతవరకు అల్లుకొనవలెనో. అంత ప్రమాణమువరకు అల్లుకొనజాలక పోవుటవలన యేగతిచేయజాలదు యెందుకనగా గతియందు హెచ్చుగా శ్వాసపీల్చవలసిన అవసరము గలుగును. కాబట్టి కఠినకారణము ఖుల్లిపొరయందు తటస్థించుటవలన శ్వాస బిగబట్టి మృత్యువుప్రాప్తించును. ఈకారణమునందు శ్వాస బిగించుటవలన మృత్యువుదశ ప్రాప్తించును, గనుక దీనిని ఖూనఖా అని పేరు పెట్టిరి. దీనిచిహ్నములు రోగి యెటువైపుకూడా పరుండజాలడు. దగ్గువచ్చినచో కఫముయొక్క విశేషత్వమువలన అచేతనుడగును.

### ఖాన్‌ఖా అను వ్యాధి చికిత్స

ప్రథమ సర్గప్రక్క వాపునందు వర్ణించబడిన చికిత్సలను యీ వ్యాధియందు నుపయోగించవచ్చును. మరియు రెండు చేతులశిరలను ఛేదించి రక్తమోక్షణము చేయవలెను.

## సర్గ్ శుశా (ప్రక్కటెముకల లోభాగమునందుండు పొర) వాపులక్షణములు.

శుశా అనగా ప్రక్కటెముకల లోభాగమునందుండు పరదా (మందముగలపొర) యందువాపు జనించినయెడల దానిని శూశా అందురు. కొందరు శూశా అను వ్యాధికి జాతుల్‌జనబసాహి అందురు.

శూశా రోగలక్షణము రోగి యేపనిచేయజాలకుండుట, యెటువైపు పరుండజాలకుండుట శూశావ్యాధి చీము రొమ్ము వూపిరితిత్తుల యందు మిక్కిలి స్వల్పముగా ప్రవేశించునని గ్రహించవలెను. అనగా వూపిరితిత్తి యీపరదాతో మిక్కిలి ఆలక్ష్యముగా కలుసుకొనుచున్నది. వూపిరితిత్తి విశేషదోషములనుసు ఆ అంగములనుండియు ఊపిరితిత్తులకు సమీపమునందు దానితో మిశ్రితమైయుండునట్టి అంగములనుండి ఆసమయమునందు సిద్ధపబడును గాన మిక్కిలి ఆలక్ష్యముగా చేరుకొనును. దీని కారణముకూడా జాతుల్‌జనబసాహి యందు వర్ణించబడినవని గ్రహించవలెను. ఇటులనే ప్రత్యేక కారణముయొక్క చిహ్నములు వుక్తవర్ణనమువలన ప్రకటనము కాగలవు.

### సర్గ్ శూశాయొక్క చికిత్స

ఈరోగారంభమునందు విరోచనమునకు యిచ్చుట వుత్తమము అనగా ఉన్నాబ్ అంజూరపండ్లు, ఖతమి, బనప్షా లిసోడా (దీనిని సంస్కృతమునందు శ్లేష్మాంతకమందురు) రాజహంస, గింజలేనిద్రాక్ష పండ్లు, తియ్యని ఆలుబకరాపండ్లు, చుకందర్ రసము, గోధుమపొట్టు, కేలకాయగుజ్జు, ఎఱ్ఱశక్కర, గుల్‌రోగన్ (గులాబిపూలనూనె) యీ మొదలగు వానిని విధిపూర్వకముగా ఉపయోగించవలెను.

మరియు, మలమును నష్టపరచునట్టియు మలమును వెడలించునట్టియు మలమును అధికముగా పక్వపరచునట్టి వస్తువులను ఉపయోగించుటయందు సావధానుడై యుండవలెను. అనగా యీ రోగము హానికరమైనది కాబట్టి ప్రతివిషయమునందున్ను పరిశ్రమ చేయుచుండవలెను. అనగా మలమును చర్మముపై భాగమునకు వెడలివచ్చునటుల పరిశ్రమ చేయవలెను. అనగా వాపుగలస్తలమునందు కొమ్మును పట్టించి రక్తమును తీయుట తదువరి అంజూరు ఆవాలునూరి ప్రక్క-టెముకలపై లేపనము చేయుటవలన కురుపై చీము వెడలిపోవును. తక్కిన చికిత్సలు జాతుల్ జబ్ (ప్రక్క-రొయొక్క-వాపు) నందు వర్ణించబడియున్నది గాన ఆచికిత్సలను ఉపయోగించవలెను. మరియు, ఈరోగకారణము బలముగలదైనచో బాసలికు అను శిరావేదనము చేయుట అవశ్యమని గ్రహించవలెను.

మరియు, వస్తి కర్మచేయుట విరోచనము చేయుట మొదలగు మలవిసర్జన క్రియలను చేయుటవలన దోషము హెచ్చునేరదు మరియు పానముచేయునట్టి ఔషధములు దీనికంటె విరుద్ధముగానుండును. ఎటులనగా ఈదోషములను తేజత్వమునొందించి వ్యాధిని ఉన్నతస్తితియందు త్రోయుచుండును. ఇట్టి ఉపద్రవము కలుగుటకు కారణమేమనగా రోగియొక్క రోగప్రకృతిని కనిపించజాలక విరోచనకర ఔషధములు ఉపయోగించుటలో హెచ్చు తగ్గు చేయును. అనగా విరోచన ఔషధములు కొద్దిమోతాదు యిచ్చినచో మలమునకు ఉత్తేజత్వము నొందించును. అనగా వెడలించుటకు బలము చాలకుండును. కరిగిన మలము శరీరమునందుండి హృదయమువైపునకు తిరుగును. మరియు, విశేషముగా విరోచనములగుటకు ఔషధము శేవించినను విశేషమలము వెడలుటవలన రోగము కష్టసాధ్యమగును. మరియు, వస్తి (ఎనిమా) చేయుటవలన విరోచన ఔషధములవలె భయముకలుగనేరదు, అనగా మలసానమునకు సమీపమునందుండుటవలన వెంటనే గుణము కలిగిం

చును. ముఖ్యముగా అందు తీవ్రత్వము వుండకూడదు. వైద్యునికి వస్తి కర్మచేయుట యోగ్యముగాదని తోచినను లేక వాడుక లేకపోయినను వస్తి చేయుక్రమము తెలియకుండినను శరీరమును మృదుత్వము నొందించునట్టి వస్తువులను పానముచేయవలెను. శిరావేదనము చేసినను ప్రయోజనము కలుగకుండుటకు కారణమేమనగా రక్తమోక్షణము క్రింది భాగమునందుండు మలమును అతిస్వల్పముగా నీడ్చును గాధావిత్ మలము వెడలుటకు ఆలస్యము కలిగినను ఇందువలన మలము ఏమియు వెడలకుండును ఎందుకనగా శరీరమునుండి రక్తము వెడలిపోయిన యెడల మలము పక్వమొందుటకు ఆలస్యమగును.

మరియు లేపనాదులవలన ప్రయోజనముకలుగకుండుటకు కారణమేమనగా వాపుగల అంగమువరకు ఔషధసారము ప్రవేశించుటకు కఠినముగానుండును ఎందుకనగా చర్మము ఝిల్లి తంతువులు శ్లేష్మములు మొదలగునవి మధ్యభాగమునందు అడ్డముగా నుండును కాబట్టి మలము వెడలించునట్టి లేపనము చేయుటవలన వాపుగలఅంగమువరకు ప్రవేశించుటరో, శక్తిహీనముగానుండును. గానవిశేషముగా దాని దుర్బల శక్తి దానిని సమత్వముగా చేయజాలదు. గాని పలచనిభాగములను నష్టపరచి శేషించినభాగము చిక్కనై నిలిచి విశేషకష్టమును కలిగించును. మలమును వెడలించునట్టి వస్తులేపనలవలన వుక్తకారణమునుబట్టి యావత్తుమలమును నీడ్వజాలదు. కాబట్టి రోగి శరీరమునందు మలము నెచ్చటనైన అణగియుండి రెండవ వుపద్రవమును కలిగించును. మరియు మలమును పక్వపరచునట్టి లేపనాదులవలన గాధావిత్ మలము పక్వమగును. ఎటులననగా వుబ్బియందు మిక్కిలి స్వల్పముగా వెడలుచుండును. అనగా యీచెప్పిన విధముగల లక్షణములు కనుపించినయెడల గొప్పవుపద్రవము కలిగించును. మరియు యీరోగి నొప్పి అధికముగానుండినయెడల నొప్పిశాంతించుటకై శూలవ్యాధియందు చెప్పిన లేపనాదులను చేయవచ్చును.

మరియు ఇటులనే కస్నబ్ (దీనిని ఇంగ్లీషులో క్యాబేజిఅందురు) క్షారము, గోడిగొబ్బిపువ్వు, లేక మేకకొబ్బిపువ్వు, అప్ర కాలిమూలుగ మొదలగునవి నొప్పిని శాంతి నొందింపజేయునట్టి లేపనాగాంగదా చేర్చుట అతిప్రశస్తముగా నుండును.

—శూలాలేపనము చేయుక్రమము.—

ఎండుబనప్షా, గాబూరా, సోయివిత్తులు, అవిశివిత్తులు, మెంతులు, యవపిండి, యీమొదలగువానిని చూర్ణించి కొద్దినీళ్ళలో వేసి వుడికించి అందులో నువ్వులనూనెకలిపి నొప్పిగలస్థలమునందు వట్టు వేయవలెను.

## జాతుస్సదర్ - జాతుల్ అజ్లా యొక్క లక్షణములు.

రొమ్మునందు ఒక పరదా (మందపుపొర) గలదు. దీనిని అజా ఖుల్ కుం (రొమ్ముమధ్యకుల్యమునకు సమానముగా వుండుభాగమునుండి బైలువెడలినది) అందురు. దీని రెండవ అంచునకు గజరూపుహాజిరి అందురు. యిది రెండుభాగములుగా విభజించబడినది. ఒకభాగము వెనుకవైపు రెండవభాగము రొమ్మువైపునున్నది. ఈరెండును ప్రక్కటెముకలు కలిసినస్థలమునందు కలుసుకొనియున్నవి. అనగా అంతవరకు వెళ్ళి అచ్చట ఒకటికొకటి కలుసుకొనును. నిజములో యివి రెండుఝిల్లిపొరలు. యివి యీస్థలమునందు విభజించబడినవి గాన దీనిభాగము రొమ్ము యందు నుంచబడియున్నది. ఆభాగము వుబ్బినచో దానిని జాతుస్సదర్ అందురు మరియు యీపొరయొక్కభాగము వీపువైపు వెన్నుపూసల యందుంచబడిన భాగమునందు వాపు కలిగినచో జాతుల్ అజ్లా అనుచున్నారు.

జాతున్నదర్ యొక్క చిహ్నములు అనగా రోగికి రెండు ప్రక్కటె ముకలు కలుసుకొనినస్థలమునుండి ఆమాశయముయొక్క ముఖమువర కు మిక్కిలి నొప్పికలిగియుండుట రొమ్ముయొక్క బలము వడుండవియ్య కుండుట తలయెత్తిచూచుటకు రోగికి అసంభవముగానుండును. ప్రక్క నుండి మల్లికిల పడుండ కలుగుట మరియు మెడకల్లావ యొక్క రెండు వైపులయందు ఒకటొకటికలిసిన స్థలమునందు రోగితలయెత్తినప్పుడు మిక్కిలి బాధకలుగుచుండును.

మరియు జాతుల్ అజ్జా అనురోగలక్షణము రెండుభుజముల మ ధ్యమునందు నొప్పికలుగుట రోగి మల్లికిల పడుండజాలకపోవుట కుడి మొడమభాగములనుండి లేవలేకపోవుట అట్టిస్థితియందు దగ్గువచ్చినచో నొప్పి అధికమై క్రమేణ హెచ్చుచుండుట మూర్ఛ తంద్రి విశేషముగా నుండుట దీని హేతువులు లక్షణములు ప్రక్కవాపునందువర్ణించబడినవి. చికిత్సకూడా అటులనే ప్రక్కవాపునందు చెప్పబడినవి గాన రొమ్ము వాపునందు తీనవలెనౌషధములు రొమ్మునందున్ను జాతుల్ అజ్జాయందు రెండుభుజముల క్రిందిభాగములయందున్ను లేపనము చేయవలెనని గ్రహించవలెను.

# వర్ సాంయొక్క లక్షణములు

సర్ సాము అనగా తలవాపునకుఅర్థము. అనగా పార్శిభాషయం దు యూనానిభాషయందు తలవాపుకు సర్ సాం అందురు. మరియు, రొమ్మునకు వర్ అనుచున్నారు. సాం అనగా వాపుఅని అర్థము. యీ వాపు ఆమాశయము యకృత్ (లివర్) యొక్క మధ్యమునందు అడ్డ ముగా పొరయున్నది. దానిపై వాపుకలుగును. ఈపొర హిజాజ్ హా జిజ్‌తోకూడా సంబంధము కలిగియుండును. హిజాజ్ హాజిజ్ అనుపొర

అన్నవాహిని, శ్వాసవాహిని మార్గముల మధ్యను సంధిస్నది. మరియు వైద్యవరులు ఈహిజాజ్ హాజిజ్ అనుపొరను దియాఫరాగమా యనికూడా వచించుచున్నారు. సరియగు ఇహోగాలిన్‌బాబ్ అను గ్రంథకర్త ఈఅంశమునకు విరుద్ధముగా వచించియున్నారు ఎటులనగా ఈపొర ఆమాశయమును యకృత్ యొక్క మధ్యమందున్నది కావున యీపేరు పెట్టియున్నారు

ఈరోగమునకు రెండు చిహ్నములు గలవు (1) బుద్ధిసూన్యము గును. దగ్గు అధికముగా వచ్చుచుండును. దగ్గినప్పుడు కల్లియేమియు వెడలకుండును. దగ్గునందు మలము వెడలకుండుటకు మలము ఎక్కువమొం దలేదని వైద్యులు ఆలోచింతురు సరియగు హకీం సమరకందిగారు వచించిన దేమనగా అవశ్యమలము బొత్తిగా దగ్గునందు వెడలకుండును. అన గా అచ్చట ఈపొర పూపిరితిత్తుల మధ్యమందు హిజాజ్ హాజిజ్ అను పొర యుండుటవలన దగ్గుయందు మలము వెడలకుండును.

(2) జ్వరము అధికముగా నుండును. పక్కటెముకల మూల ములు మెత్తగానుండును. మరియు కుడివైపు యకృత్ (లివర్) గలదు అందులో పోటుతో నొప్పికలుగును గాని, ప్లూరిసివ్యాధి వేయుటకున్న, పమన ము చేయుటకు శక్తి లేకుండును. ఒకప్పుడు వాంతిఅయినమొదట నొప్పి అధికతవలన రోగిమూర్ఛిల్లును తాపము ఒకప్పుడు హెచ్చుగను ఒకప్పుడు అధికముగా నుండును. దాహము అధికముగా నుండును.

లాభము:—శరాహ అన్‌బాబ్ అను గ్రంథకర్త, హకీంసమరకంది గారు వచించినదేమనగా యీరోగమునందు ప్రేలావకూడా పుత్పన్న మగును. సర్సాంయొక్క ఇతరచిహ్నములు సర్సాం వ్యాధియందు కనిపించుచుండును. దీనికారణమేమనగా సమరకందిగారి అభిప్రాయము నందు ఈపొర మెదడు సంబంధమగు పొరతో సంబంధము కలిగియున్న ది. ఎటులననగా మెదడుపొర యొక్క అంచు క్రిందికివచ్చి అల్లుకొనియు న్నది. ఈపొర అందుండి పుత్పన్నమైనదని వచించుచున్నారు, గాని వై

ద్వారా నీరు ఇటుల పరిణమించుచున్నాయి. అనగా హిజాబ్ హాజిజ్ అను పొరతో సంబంధము కలిగియున్నది. అనగా మెదడు నుండి క్రిందికివచ్చిన పొరతో చేరియున్నది. దీనిపైపునకు వచ్చిన నరము నందు తీక్ష్ణమగు ఆవిరి పరమాణువులు యీ జీవనరము ద్వారా మెదడుపైపుకు వెళ్ళు చున్నవి.

మరియు సర్సాం వలెనే చిహ్నములు ఉత్పన్నమగుచున్నవి. మరియు సర్సాం, వర్సాం ఈరెంటియందు యీ చిహ్నములు కలుగుచున్నవి. మరియు యీరెంటియందు భేదమేమనగా సర్సామందు ప్రథమమున ప్రేలాపన ముత్పన్నమగును తరువాత యితర చిహ్నములు విశేషత్వమువలన ఉత్పన్నమగుచున్నవి. అనగా దాహము, తొందర, ఇత్యాది గుణములు వ్యాధి ముదిరినకొలది కనుపించును. ఇటులనే సర్సాం రోగముయొక్క ఆరంభమునందు శ్వాస నిటశ్వాసవలెనే వచ్చుచుండును. మరియు వెంట వెంట రానారంభించును మరియు ఆరంభమునందు నేత్రములు ఎర్రగానుండును మరియు దీనినరములు పూర్ణమై వుబ్బిపోవును. నేత్రముల నలుపురంగు (నల్లగుడ్డు) పైపైపునకు బిగిసి కొని పోవును.

మరియు, వర్సాం వ్యాధి లక్షణములు దీనికి విరుద్ధముగానుండును. అనగా ఈరోగమునందు ఆరంభములో జ్వరము అచేతనత్వము శ్వాసబిగబట్టుట మొదలగు లక్షణములు ఉత్పన్నమగును. మరియు నేత్రముల దశ ఆరోగ్యమువలెనుండును. తరువాత సర్సామందు కలుగు ఇతర లక్షణములు కలుగుచున్నవి, ఆలక్షణములు ఈరోగమునందు ప్రకటనమగును. కాబట్టి వర్సాం, సర్సాం, అను ఈరెండువ్యాధులయొక్క భేదములను ఆలోచించి చికిత్సచేయవలెను.

## బర్సాంగయొక్క చికిత్స

బాసలీక్ అనునరముగున్న ఇబ్రి అను నరమును ఛేదించి రక్తమోక్షణము చేయవలెను మరియు, పిక్కలపై శస్త్రముతో గంట్లుపెట్టి కొమ్ములతో రక్తము తీసివేయవలెను. మరియు, నొప్పి పోటుగల స్థలము నందుగల మలమును వ్యాపరచునట్టియు, మలమును నష్టపరచునట్టియు, వస్తువులను లేపనము చేయవలెను. అనగా బాబూనా బనప్షా, ఖిత్మి విత్తులు ఉన్నాబ్ లిహాసోడా, అగిసివిత్తులు ఈవస్తువులను చూర్ణించి వేడి నీళ్ళతో పురికించి లేపనము చేయవలెను. మరియు, మృదువగు హుకనా (ఎనిమా) వలన శరీరమునకు మృదుత్వము నొందించవలెను శరీరమును మృదుత్వము కలిగించుటకై తామరపూలు, బనప్షా, ఖితమివిత్తులు, ఉన్నాబ్, సపిస్తాన్ ఈ మొదలగునవి కషాయముకాచి అందులో తురంజబీన్ కలిపి పానము చేయుట మిక్కిలి వుత్తమము ఇరా అంగముల వాపునందు విశేషముగా ఇరా ప్రకరణమునందు వర్ణనమగుచున్నది. అనగా హుకనా (ఎనిమా) విరోచనకర ఔషధములను పానము చేయుట మిక్కిలి వుత్తమము ఇందువిషయమై అపాయము కలుగజాలదు అట్టి వుపాయములనుండి దేని అవసరముండునో దానిని గ్రహించవలెను. వీటి లాభము వర్ణనము చెప్పబడియె. కాబట్టి ప్రతి విషయమునందున్న జ్ఞాపకముంచుకొనవలెను. మరియు, అందుండి యావత్తు విషయములు ప్రథమసర్గయందు చెప్పియున్నవి గాన వాటిని జ్ఞాపకముంచుకొనుట అత్యావశ్యకము. ఇందువలన ఈరోగము కుదురుటకు యేమియు భయముండనేరదు. మరియు ఈసమయమునందు ఈరోగము యావత్తు ఒకటిగాచేరి యుండినచో రోగి ఆరోగ్యమొందుటకు ఆశ బహుస్వల్పముగాయుండునని గ్రహించవలెను.

మరియు, ప్రక్కయొక్క నొప్పు నుండియొక భేదముగలదని ప్రకటనమగుచున్నది. అందు శ్వాస కఫము వెడలుట ఈరెండును సహజముగానుండును గాని వీపువైపు కర్రతో కొట్టినట్లు గొప్ప నొప్పి కలుగును మూత్రమునందు రక్తము చీము కలిసి వెడలుచుండును ఈరోగము బహుస్వల్పముగా కుదురును. బహుశః ఈరోగి అయిదవ దినమునందుగాని ఏడవదినమునందుగాని మృతినొందును పదునాలుగవ దినమువరకు బహుశః జీవించుట దుర్లభము. మరియు, ఏడవదినమునుండి శాంతముగానుండినచో బహుశా ఆరోగ్యము పొందగలడు.

మరియొక భేదముకలదు. అనగా రెండు భుజముల మధ్యభాగమునందు యెఱ్ఱగానుండును. భుజములు వుష్ణముగానుండును. రోగికూర్చుండజాలకుండును. రోగియొక్క కడుపు యావత్తు వుష్ణముగానుండును. మలవిసర్జనమునకు అవసరముకలిగినయెడల రోగి వెంటనే మృతినొందును. మరియు యేడవదినమువరకు వ్యాతిశమై వుమ్మియందు అనేక రకముల మలము వెడలనారంభించినయెడల ఇట్టిరోగి జీవించునని ఆశకలుగుచున్నది. మరియు మూడుదినములవరకు జీవించజాలడు.

మరియు యిందు మరియొకభేదముకలదు. అందు పీకు, నొప్పి, క్షణములో మెడకొంకులలోనుండి పిక్కలవరకు పొడువనారంభించును. మరియు మూత్రము స్వచ్ఛముగా వెడలుచుండును. వుమ్మిలో మలము కలిసి వెడలుచుండును. ఈరోగము బహుక్రూరముగా నుండును. దీని లక్షణములు అనగా మలముపైభాగమునకు ఆరూఢమైనయెడల సర్పాంలక్షణములు ప్రకటనమగును. మరియు యేడవదినము గతించినచో పరాత్పరుని దయవలన ఆరోగి విపత్తునుండి తప్పించుకొనగలుగును.

(నూదనీయము) వాయువుయొక్క కారణము వాతముగాని శ్లేష్మముగాని అయియుండినయెడల అసాధ్యమగును. ఇది బిగింపు సంభవించును. లేక రక్తముతో కూడా వకటిగా చేరినచో దీని విషయమై జభరా అను గ్రంథకర్త వ్రాయునదేమనగా యిందుశిరావేదనము చేయకూడదు. నీళ్ళకు బదులుగా తేనెకలిపిన నీళ్ళుపానము చేయవలెను. మరియు కొద్దికొద్దిగా వృష్ణోదకము పానముచేయుట లాభదాయకమగును. మరియు ప్రత్యేక దినము ప్రాతఃకాలము తేనెతోచేసిన శికింజబీన్ వేడి నీళ్ళలోకలిపి పానము చేయుచుండవలెను. యిది చిక్కని దోషమును పలచగాచేయును. మరియు వెన్న, తేనెతోకలిపి వుపయోగించుటవలన మలము పక్వమొందును. మరియు శుభ్రపరచుచుండును. చుకందరు, సోయివిత్తులు, చెనగలుచేర్చి కాచినకట్టు, మరియు యవాగు, శుద్ధిచేసి న్నమెంతులు, బొగడగింజలపిండితో చేయబడిన గంజి మొదలగునవి పానము చేయుట, బాదంనూనె కాచి కొద్దికొద్దిగా పానముచేయుట లాభదాయకమగును. మరియు యీరోగమలము మిక్కిలి చిక్కగానుండును. శుష్కత్వము కలిగించునట్టి స్వభావికము గలదిగానుండును. శ్వాసబిగించుట వుబ్బులో దోషము వెడలిపోవుట, నిలిచిపోయినచో యెందుజూఫా ఆవాలు, మెత్తగానూరి 10 మాషములు తేనెచేర్చిన వేడి నీళ్ళయందు కలిపి పుచ్చుకొనవలెను. ఒకవ్వేళ శ్వాస బిగించినచో బాకలా, (బొగడ) గింజతో సమానముగా జంగాలపచ్చ తేనెలో కలిపి యివ్వవలెను. మరియు బొగడగింజతో సమానముగా యింగువ తేనెతోచేయబడిన శికింజబీన్ యీవస్తువులను వృష్ణోదకములోకలిపి పానము చేయవలెను. దీనివలన నొప్పి శాంతించును.

మరియు జంగాలపచ్చ మొదలుగాగలవి కంఠమును చివ్వినచో వుడికివుడకనికోడిగ్రుడ్డు బాదంనూనెకలిపి వెచ్చచేసి కొద్దికొద్దిగా ఆగి ఆగి పానముచేయవలెను. దీనివలన వ్రోకబడినకంఠము శాంతినొందును.

మరియు వక్కిహావురయొక్క నమస్తభేదములతో యీవిధమగు యితర రోగములయందున్న పొగ, గాలి, ఎండ, మిక్కుటముగా భుజించుట, చల్లనినీళ్ళు, స్త్రీసంగమము, మలమును బంధించునట్టి వస్తువులు మొదలగువానిని వర్జించుటవలన పరాత్పరుని కృపవలన ఆరోగ్యమును పొందగలుగును.

# జుముదున్నెదూదర్ అను వ్యాధి లక్షణములు

దీనిని బరతున్నదర్ అనికూడా వచించుచున్నారు. దీని అర్థమేమనగా రొమ్మునయొక్క తంతువులు వూపిరితిత్తియొక్క పొరలు చల్లబడి ముడుచుకొని పోవును. ఇందులో ఒకవిధముగు యీదృష్ట సంప్రాప్తమగును. యీకారణమువలన రొమ్మునందు చక్కగా విడుచుటకు, ముడువబడుటకు వీలులేకపోవును. కేవలము తిన్నగా నుండుటవలన శ్వాస వచ్చుచుండును. అనగా రొమ్మునందు జలంబు ప్రవేశించును. ఎటులనగా చల్లని గాలి మంచుగడ్డ, జలంబు. మరియు మిక్కిలి చల్లని నీళ్ళు పానము చేయుట, చల్లని నీళ్ళలో మునుగుట యీమొదలగు కారణములవలన రొమ్మునందు జలంబు సంభవించును. దీని చిన్నెములు కారణము ముందుకలుగుట రొమ్మలో జలంబు ముడువబడినటుల తోచుట ఈమొదలగు లక్షణములు కలిగియుండును.

జుముదున్నెదూదర్ చికిత్స

రొమ్మునందు వుష్ణము కలిగించుటకై సౌసన్ (లిల్లి) వేరు, చంగల్వకోష్టు తైలమునందు జున్నుకలిపి రొమ్ముపై మర్దించవలెను. మరియు నదాపాతు, శాతరాశాతు, పొదీనాకు, అఫసంతీన్, ఇంగువ, జున్ను ఈమొదలగునవి మెత్తగానూరి తేనె, అక్రోటునూనె యందు కల్పి రొమ్ముపై లేపనముచేయవలెను. మరియు పాతచుబెర (సారాయి)

లో కొద్దిగా ఇంగువకలిపి రోగి కొద్దికొద్దిగా పానము చేయువలెను. మరియు వృష్ణోదకములో కావడము చేయుట మిక్కిలి లాభదాయకమగును. మరియు యీరోగికి చికిత్సచేయుటలో ఆలశ్యము చేయకూడదు. ఎందుకనగా ఒకప్పుడు ఈరోగి అగస్మాత్తుగా మృతినొందును. అనగా యీ అంగముల జలుబు హృదయమునందు ప్రవేశించి హృదయమునందు శీతమును కలిగించును. మరియు నిజవృష్ణము నష్టపరచును. దీని కారణమువలన శ్వాసనిలిచిపోవును. ఎటులననగా ఆ అంగముల సంయోగము యావత్తు హృదయముయొక్క ఆధీనమునందున్నది.

లాభము:—ఒకప్పుడు నల్లమందు భక్షణచేయువారికి జముదుస్ సదూదర్ అనువ్యాధి పుట్టించును. యెటులననగా నల్లమందు, జలుబు, మరియు శుష్కత్వముయొక్క కారణమువలన నిజవృష్ణమును కూడ బెట్టుచున్నది. మరియు రతూబతునందు చిక్కదనముకూడి, శుష్కత్వమును కలిగించుచున్నది. యీ మొదలగు కారణమువలన నల్లమందు తినువారి చేతులు, కాళ్ళయందు జలుబు, తిమ్మిరి, మరియు గొంతు బిగింపు, నాలుకబంధించుట యీ మొదలగు లక్షణములు కలిగించును. ఒకప్పుడు రోగిని చంపివేయును.

మరియు, సీసముకరిగించు నప్పుడు లేచునట్టి ధూమమును పీల్చుటవలన జముదుస్ సదూదర్ అను వ్యాధి కలుగుచున్నది. ఎటులననగా సీసము యొక్క ధూమము హృదయమునందు శీతలమును కలిగించి వృష్ణమును అనచివేయును. మరియు, చెమ్మను ఆర్చి శ్వాసవాహిని అంగమును ముడిచివేయును. కాబట్టి శ్వాస చిన్నదిగా వెడలుచున్నది. ఒకొక్కప్పుడు గొంతుయందు వాపుకూడా కలిగించును. మరియు, నల్లమందు పీల్చుట సీసపుపొగ పీల్చుటవలన శ్వాసచిన్నదిగా వచ్చునట్టి వ్యాధి వుత్పన్నమైన యెడల దీనివుపాయము కారణమును దూరపరచవలెను. మరియు, వీటికి విరుద్ధముగానుండు వస్తువులను వుపయోగించ

వలెను. మరియు, ఉష్ణమును చెమ్మను కలిగించునట్టి మూలికల కషాయాములతో కాపడము చేయవలెను. యావత్తు కాపడములకంటె పొందు పరికరణమునందు వ్రాసిన సదుపాయములు విశేషగుణకరము అని తెలిసికొనవలెను. అనగా ముందు చెప్పబడిన రోగ ప్రకరణమునందు చెప్పిన ఔషధములు, ఉపచారములు, కాపడములు, వస్తికర్మ మొదలగు సదుపాయములు ఈ వ్యాధియందు కూడా ఉపయోగించవలెనని భావము.

గద్య, ఇది శ్రీమదిమాంబేగ్ సాహెబ్ పౌత్ర పాచ్చాబేగ్ సాహేబ్ పుత్ర "వైద్యభూషణ" బిరుదావళీ విరాజమాన వైద్యవిద్యావిద్వజ్జన విధేయ రహంతుల్లాబేగ్ నామధేయ ప్రణీతంబైన "తిబ్బెఅక్బర్ షాహి" అను వైద్యగ్రంథమునందు ప్రకృత రోగములు సర్వము సంపూర్ణము.



యూకతీముల్ మారూప్,

బిస్మిల్లా హిర్రహమానిర్రహిం.

# తిబ్బెఅక్బరిషాహి

పదమూడవ అధ్యాయము.



## హృదయ లక్షణములు

హృదయమును చూపు చిత్రపటము.




1_2_2 ఊర్ధ్వభాగమునకు రక్తము ప్రవేశపెట్టు పెద్ద దమనీయొక్క శాఖలు.

4 ఊర్ధ్వభాగమునకు రక్తము ప్రవేశపెట్టు శుద్ధరక్తనాళము.

3_3 హృదయకర్ణములు

5 చెడు రక్తము ప్రవేశించియుండు కుడిభాగము.

6 మంచిరక్తము ప్రవేశించియుండు యెడమభాగము

7 ఊపిరితిత్తులనుండి శుద్ధరక్తమును ప్రవేశపెట్టు రక్తనాళము.

9 తల, చేతులు, మొదలగు ఊర్ధ్వభాగములనుండి చెడురక్తమును చేర్చునట్టి (శిర) చెడు రక్తనాళము.

11 హృదయపు పోషణసారమును ప్రవేశపెట్టు జీవనరము.

కల్బ్, పార్సిభాషయందు దిల్ అనచున్నారు దిల్ అనగా హృదయమని అర్థము, నిదియొక అంగము, ఈఅంగము, మాంసము, జీవనరములు, ఝిల్లిపొరలు, తంతువులు, (సన్నసరములు) తోకలిసిపర్చబడినది, హృదయముయొక్క నరములు, శిరియాన్ అనునరములో నుండిబైటవెడలునవి. వీనిమాంసముకఠినముగను మందముగానుండును. దీనిశల్యము తక్కనశల్యములకంటె మిక్కిలిమృదువుగానుండును. దీనిఝిల్లిమిక్కిలి కఠినముగానుండును. ఇతరఅంగములయొక్క ఝిల్లియంత కఠినముగాయుండదు. ఇటులనేదీనియొక్కఅంగములు వేరువేరుగానుండును, గాని వాటిలో నిది చేరియుండుటలేదు. ఈమొద గు దీనిఅంగములయావత్తు ఇంతద్రుఢముగాయుండుటకు కారణమేమనగా హృదయముఅన్నిఅంగములకంటె మిక్కిలి ఉత్తమఅంగము కాబట్టి, దీనియందు విపత్తి కలుగకుండునటుల కాపాడగలందులకు ఇట్లునిర్మించబడెను, గాన హృదయమునందు విపత్తిశీఘ్రముగా ప్రవేశించజాలదు హృదయముయొక్క స్వరూపము మామిడికాయతో సమానముగా నుండును. దీనిఆధారము (మొదలు) పెద్దదిగను లావుగానుండును దీనిమూలము పైభాగమునందున్నది. ఈమూలమునుండి నరములు ఉత్పన్నమైనవి. ఈబందనమువలన దానిని నిలువుచున్నవి. మరియు మృదుశల్యముకూడా పైభాగమునందేయున్నది అనగా హృదయమూలమునందున్నదని భావము. శల్యమువలన ప్రయోజనమేమన దీని మూలము ద్రుఢముగా నుండుటకు నిర్మించబడెనని తెలియవలెను. హృదయమునకు రెండుపొరలు గలవు ఒకటి కుడివైపు రెండవది ఎడమవైపు నున్నవి. కుడిపొరయందు రక్తము అధికముగను ఆత్మ స్వల్పముగా నిండియున్నది. ఎడమవైపునుండుపొర కుడివైపుపొరకంటె పెద్దదిగా నుండును. యీపొరయందు ఆత్మ విశేషముగను రక్తము స్వల్పముగా నుండును. మరియు కుడివైపుపొర రక్తము మిక్కిలి చిక్కగానుండును. మొందుకనగా హృదయముయొక్క మాంసము కఠినముగా నుండును. గానీ

హృదయములోనుండు అవయవములను చూపు చిత్రపటము.




1. తలచేతులనుండి చెడురక్తమును తిరిగి ప్రవేశపెట్టునట్టి చెడు రక్తనాళము 7-8 ఊర్ధ్వఅంగమునకు మంచిరక్తమును ప్రవేశపెట్టు శుద్ధ రక్తనాళము 9. మంచిరక్తనాళముయొక్క శాఖలు 6. హృదయమునుండి రక్తము రక్తనాళమునందు ప్రవహించునప్పుడు నిమ్మళముగా పట్టిపట్టి పంపించుస్థానము 4 రక్తము ప్రవేశించుమార్గము 2. అదోశరీరమునుండి చెడురక్తము తిరిగి వచ్చునట్టి చెడురక్తనాళము 3. చెడురక్తము వచ్చి చేరుస్థానము. 5-5-5 మంచిరక్తమును పట్టియుంచి దమనులద్వారా పంపించుపొరలు 12. పొరలను నాశ్రయించియుండు మాంసగ్రంధి 10 హృదయకర్ణిక 11-11 మంచిరక్తముయొక్క వెనుకభాగము.

దీని భోజనము (పోషణరసము) కూడా దిక్కుగా నుండును. మరియు కుడివైపు రక్తము మిక్కిలి పలచగానుండును. ఎందుకనగా యీపొరయందు ఆత్మ కలిసిఉన్నది కుడివైపు పొరయొక్క మాంసము మిక్కిలి మెత్తగానుండును కాబట్టి దిక్కునిరక్తము ఇందుండి సహజముగా వెళ్లగలదు యెడమవైపు పొరయొక్క మాంసము మిక్కిలి కఠినముగను మందముగానుండును. అనగా దీనిరక్తము మిక్కిలి వుష్ణముగను పలచగానుండును. నిది ప్రాణవాయువునందు మిశ్రమైయుండును. కారణమేమనగా అచ్చటిపొరయొక్క కఠినత్వమువలన బైటికి వెడలజాలకుండును. కాబట్టి ఆత్మ నష్టమొందజాలదు. ఈరెండింటిమధ్యభాగమునందు ఒకగుల్లభాగముకలదు. రెండు పొరలు అందులో నిమిడియున్నవి, అనగా విశ్రమించియున్నవని భావము. అన్నికలిసి మూడు చక్రములుగలవు అందులో రెండు పెద్దవిగను ఒకటి చిన్నగానున్నది. పెద్దవి కుడి యెడమ భాగములయందుగల పొరలు రెండున్ను యీరెండుపొరలమధ్యభాగమునందు చిన్నపొర ఒకటికలదు. మరియు హకీంజాలినూస్ గారు దానిని జేహాలి (ఛిద్రము) అని వచించియున్నారు, మరియు హృదయమునందు వుష్ణముండును. దీనిద్వారా ఆహారసంబంధమగు రక్తము వూపిరితిత్తులయందు ప్రవేశించుచున్నది. ఇటులనే వూపిరితిత్తులనుండి గాలి లాగుకొని హృదయమునందు ప్రవేశించుచున్నది. హృదయముయొక్క పెద్దభాగమునకు అధారమనుచున్నారు. రాకపోకలమార్గము అందుండి కలుగుచున్నది. మాంసముయొక్క జీవనరములరెండుముక్కలు కిటికీలవలె యేర్పడినవి. ఆరెండుముక్కలు చెవులవలెనున్నవి. వీటి నితూజలుల్ కల్బ (హృదయముయొక్క రెండుచెవులు) అనుచున్నారు. హృదయకమలము ముడుచుకొనినచో నివి ఒకటిగా చేరుచున్నవి. హృదయకమలము వికసించినచో వికశించుచున్నవి. నివి ఆలశ్యముగా మూయబడియుండవు. కాబట్టి వీటిద్వారా విశేషవాయువు నిద్వబడుచున్నది. ఎటులననగా హృదయము శరీర

ముయొక్క ప్రధానఅవయవము నిజపృష్ఠమునకు స్థానము మరియు హృదయము ప్రాణవాయువు (జీవాత్మ) యొక్క గృహము కాబట్టి పరమాత్మ దీనిని రొమ్ము ప్రాపిరితిత్తులయొక్క మధ్యమునందు స్థానమేర్పరచి మనుష్యుని శరీరమునందు యావత్తుభాగములకంటె దృఢముగా నుంచియున్నాడు. నిది యెడమవైపునకు కొద్దిగావాలియుంటవలన లాభముకలదు. (1) ఆస్థానము హృదయముయొక్క పృష్ఠముతోకూడా ఖనీభవించియున్నది. అందు పృష్ఠము హెచ్చుచుండును. (2) భాగమునందు పృష్ఠము రిక్తదశనొందును. ఈకారణమువలన విశేషవిపత్తు సంభవించును. ఇటులనే జలుబు కారణమువలన ప్లీహముయొక్క వాతమునందు సమానత్వము కలుగజాలదు.

లాభము:—ఏజీవియొక్క హృదయము మిక్కిలి పెద్దదిగా నుండునో అట్టివాడు గొప్ప శౌర్యవీరుడున్న, గొప్ప బలముగలవాడగును. ఇచ్చట నియమముగలదు. ఇందు పృష్ఠముకూడా యుండవలెను. ఎటులననగా హృదయమునందు పృష్ఠము తక్కువైనచో హృదయము పెద్దదిగా నున్నను లాభము కలుగజాలదు. అనగా కుందేలు శరీరమునందు విశేష పృష్ఠముండును. గాని, హృదయము చిన్నదిగా నుండును. ఈజీవములు మిక్కిలి సూర వీరములగలవగును. ఇటుల పశువులయందు చూపబడుచున్నది. గాన బహుదా 'గొప్పహృదయముగలవాడు శూరవీరుడగును. మరియు హృద్రోగములు అనేకవిధములుగా నుండును. వాటిని వేరు వేరుగా ప్రత్యేక ప్రకరణములయందు వర్ణించబడునని గ్రహించవలెను.

## హృదయముయొక్క దుష్టప్రకృతి లక్షణములు.

ఇదినాలుగు భేదములు. (1) ఉష్ణమువలన కలుగుచున్నది. దీని లక్షణములు నాడి పెద్దదిగను, శీఘ్రముగను, వక్రముగను, వెంటవెంట నడుచుచుండును. రొమ్ము వెచ్చగానుండుట, దాహమధికముగా నుం

టుట, తొందర, మంట ఎల్లప్పుడు నుండుట, మరియు చల్లనిగాలివలన శాంతించినట్లుండుట, శరీరము శుష్కించుట అనగా హృదయముయొక్క దుష్టప్రకృతి సర్వశరీరమునందు ప్రవేశించుచున్నది. గాన శరీరము చిక్కిపోవునని భావము.

హృదయముయొక్క దుష్టప్రకృతి చికిత్స.

కర్పూరముమాత్రలు, చల్లనిమరబతులు అనగా హృదయమునకు అనుసారముగా రిబాస్షర్బతు, దానిమ్మషర్బతు, చందనపుషర్బతు మొదలగునవి పానముచేయవలెను. మరియు చందనము, కర్పూరము, పన్నీరులో కలిపి రొమ్ముపై లేపనము చేయవలెను. చల్లని గాలివీచు స్థలమునందు రోగిని పరుండబెట్టవలెను. మరియు చల్లని పరిమళద్రవ్యములను అఘ్రాణించవలెను. చల్లని భోజనపదార్థములను రోగికిప్పించవలెను. మరియు మలము నిండుటవలన యీవ్యాధి కలుగుటకు కారణమైనచో శిరావేదనము చేయుట వుచితమని గ్రహించవలెను.

లాభము:—హృదయముయొక్క దుష్టప్రకృతి భేదములయందు జ్ఞాపకముంచవలసిన అంశములు అనగా మలదోషముయొక్క కారణమువలన కలిగినయెడల ఏకార్యము వర్జితముగానిచో ప్రారంభమునందు మలమును వెడలించు ఉపాయములను చేయవలెను. మరియు శిరావేదనము చేయవలసిన అవశ్యము కలిగి ఉచితముకానిచో భుజములమధ్యభాగమునందు శస్త్రముతో గంట్లువేయవలెను. మరియు శిరావేదనమునందున్ను, విరోచనఔషధములను వుపయోగించుటవలన జ్వరముకలుగకుండునటుల కాపాడవలెను. అవసరమునుబట్టి అవస్థానుసారముగా చల్లని వస్తువులను గ్రహించవలెను. అనగా వుష్ణము విశేషముగా నుండినచో కర్పూరమాత్రలు వినియోగించవలెను. లేనియెడల ఇతరములగు చల్లని వస్తువులతో వుష్ణమును శాంతినొందించవలెను. చల్లని వస్తువులను వుపయోగించుటలో శరీరమునకు అజీర్ణము మృదుత్వమునందు ధ్యానముంచవలెను. అనగా శరీరమునందు అజీర్ణము కలిగియున్నచో

చింతపండు ఆలుబకారా యొక్క నిర్మలమగురసమును పానము చేయవలెను. మరియు శరీరము మృదువుగా నుండినచో పెద్దపాయల గింజల రసము నిమ్మకాయపర్బతు, నారింజకాయపర్బతు మొదలగునవి ఉక్త ఔషధములను పానము చేయవలెను. ఇందు లాభదాయకమగు వస్తువులను సేవించుట హానికరమగు వస్తువులను వర్జించుట అతివుత్తమము. మరియు ఆమాశయమునందు దుర్బలము కలిగినయెడల ఆమాశయమునకు బలముకలిగించుట అత్యావశ్యకము. మరియు వస్నిరు వేరముస్గో (ఇదిగొప్ప వృక్షము. దీనిఆకులు మృదువుగానుండును) అరఖు, మొదలుగాగలవి అన్నివస్తువులకంటె ఉత్తమము. మరియు తపెమూహార్రిఖా అను రోగమునందు చెప్పబడు ఔషధములు యావత్తు యీరోగమునందు లాభదాయకమగును. మరియు అన్నిఔషధములయందు ధ్యాన్నముంచవలెను. అనగా ఉష్ణాదిక్యామువలన హృదయమునందు వాపుగాని కురుపుగాని కలుగకూడదు. ఇటువంటి భయము లేకుండినచో ఉష్టమును సంతుష్టత నొందించుటకై మిక్కిలి పరిశ్రమ చేయవలెను. మరియు తిమ్మిరి కలిగించునట్టియు, మొద్దుబారునటుల చేయునట్టి వస్తువులను లేపనాములం దుపయోగించవలెను. మరియు హృదయముపై పుష్టికర వస్తువుల లేపనము చేయవలెను.

సూచనీయము:—ఇట్టిసమయమునందు చల్లని వస్తువులవలన లాభము ప్రాప్తించని యెడల వ్యాప్తమునందు రోగియు మూర్ఖవైద్యుడుకూడా భయము నొందును యీవ్యాధి శాంతించనేరదు. అనగా చల్లని వస్తువుల న్యూనతవలన లాభము నొందనేరదు. అనగా మండునట్టి అగ్నియందు కొద్దిజలము యేమిచేయగలుగును గాన అవస్తనుబట్టి అన్నిఔషధములకంటె విశేషముగా పలుమారు వుపయోగించుటకు రోగబలము నెఱింగి ఉపయోగించవలెనని గ్రహించవలెను మరియు, విశేషఅవస్థమైనచో చల్లని వస్తువులను విశేషముగా సేవించుట యోగ్యమగును ఎటులననగా మాత్రప్రమాణము విశేషముగా

120

అనేకపర్యాయములు ఉపయోగించవలెను. పరాత్పరుని కృపవలన కొంట నే లాభము ప్రాప్తమగును గాన యిటుల అధికముగా యిచ్చుటవలన యితర కష్టమునందు మార్చుగలదు గాన విశేషముగా నుపయోగించుట వలన ప్రయోజనమేమియును కలుగజాలదు. అనగా రోగి దశను కనుపెట్టి ఎంతఔషధము యిచ్చుట వుచితమో గమనించి వుపయోగించుట వలన వెంటనే ప్రయోజనము కలుగగలదు. ఈ మొదలగు సమాపాయములు బుద్ధిమంతుడగు వైద్యశ్రేష్టుడు గ్రహించగలడు అట్టిస్థితియందు అవస్యము గలిగినచో సమయమును బట్టి మార్పులను చేయగలడు. మరియు, మాత్రలు చూర్ణములు వుచితమగు షరబతులు మొదలగునవి ఖరాబాదీన్ అను వైద్యగ్రంథమునందు విస్తారపూర్వకముగా వర్ణించబడియె. మరియు, ఇందులోకూడా సంక్షిప్తముగా వర్ణించబడియున్నవి.

## కర్పూర మాత్రలు చేయు విధానము

ఈఔషధము ఖరాబాదీన్ అను గ్రంథమునందుకూడా వ్రాయబడియె.

గులాబిపూవులు 7 మాషములు, తవాషీరి, చందనము ఇవి ప్రత్యేకము మూడున్నరమాషములు, దోసకాయ, పందిరిదోసకాయ విత్తులపప్పు, నేతిబీరగింజలపప్పు ఇవి ప్రత్యేకము 17½ మాషములు, పచ్చకర్పూరము 6 రతులు. ఈ మొదలగు వానిని మెత్తగానూరి ఇసబ్గోల్ గింజల గుజ్జులో కలిపి నూరి మాత్రలు చేయవలెను. ఈమాత్రలు తియ్యదానిమ్మ షర్బతుఅనుపానముతో ఉపయోగించవలెను.

## తియ్యదానిమ్మషరబతు చేయు విధానము

తియ్యదానిమ్మ విత్తులు 1 శేరు, తెల్లపంచదార 1 శేరు, ఈ రెండు ఏకముగాకలిపి షరబతువిధానముగా పాకము చేయవలెను.

## (2) హృదయముయొక్క శీతదుష్టప్రకృతి లక్షణములు.

(2) వ భేదము అనగా హృదయముయొక్క దుష్టప్రకృతి చల్లగానుండిన దీని చిహ్నములు చెప్పుచున్నాను, అనగా నాడి చిన్నదిగను

మాధముగను విరుద్ధముగానుండును. శ్వాసనిర్మలముగా వెడలుచుండును. మరియు, శరీరశక్తి తగ్గిపోవును. ముఖము యొక్క రంగు ముఖచేష్టలు తగ్గిపోవును. భయము దుఃఖము దుర్బలత్వము నిచ్చేష్టత్వము మొదలగు లక్షణములు పుత్పన్నమగును. మరియు, వుష్ణముగల వస్తువులను భక్షించుట తాకుట ఆఘ్రాణించుటవలన లాధదాయకమగును.

## హృదయముయొక్క శీతదుష్టప్రకృతి చికిత్స

దివాల్ముస్క్ అనగా పుష్టికరమగు ముఫర్రిహ దీనిని మాలికోలియా వ్యాధియందు వర్ణించియున్నాము. మాలికోలియా అనగా (పిచ్చి, అతివాగుడు) ఈముఫర్రిహ ఉపయోగించవలెను. మరియు, హృదయమునకు బలముకలిగించునట్టి షర్బతులు అనగా బాదరంజబోయామర్బతు కుంకుమపువ్వు, కస్తూరి అంబరు జటామాంశి గులాబిపువ్వులు మొదలగు వస్తువులు చేర్చిన సాంబ్రాణి షర్బతు పానము చేయవలెను. మరియు, చకోరపక్షి, కోడి, పావురము మొదలగు పక్షిజాతుల మాంసములందు దాల్చినిచెక్క కుంకుమపువ్వు చేర్చి సాంబ్రాణితో సువాసనకలిగించి భోజనమునకు యివ్వవలెను. మరియు, జటామాంశి నాగరముస్తలు దాల్చినిచెక్క, లవంగాలు, గులాబిపూలు, దవనము, మరువము ఈమొదలగు వానికషాయమునందు తులసియాకు బాదరంజబోయ రసమునందు కలిపి రొమ్ముపై లేపనము చేయవలెను. చల్లని భోజనములు చల్లని జలపానము విసర్జించవలెను. మరియు, తేనె, నీళ్ళుకలిపి పానము చేయవలెను. అనగా తేనె 2 భాగములు వన్నీరు 1 భాగము, సారాయి ఈరెండింటికి సమానముగా కలిపి మందాగ్నియందుంచి కాచిపానముచేయుటమిక్కిలిలాభదాయకమగును. ముఖ్యముగా లవంగములు, జటామాంశి, సాంబ్రాణి అగరు, కుంకుమపువ్వు మొదలగు వస్తువులను ఎంతవుచితమగునో తీసుకొని దంచి మారి అవిసిగింజలకు పట్టించి మూటగట్టి ఈ తేనే నీళ్ళయందుంచి

పొంగువచ్చువరకు కాచి దించుకొని మిగిలిన పస్పాను నాలుగు తులములు మొదలుకొని 7 తులములవరకు పానము చేయవలెను.

### హృదయ శుష్క దుష్ట ప్రకృతి లక్షణములు.

శుష్కదుష్టప్రకృతి హృదయమునందు సంప్రాప్తమై రోగమును కలిగించును. దీని లక్షణములు నాడి చిన్నదిగనూ కఠినముగా వెంట వెంట నడువనారంభించును. దేహము చిక్కిపోవును. శరీరము కృశించును. ఇటుల శరీరము కృశించుట ఆరంభదశనుండి స్వల్పముగానుండును అట్టి స్థితియందు రోగికి భయము శుష్కత్వము, క్రోధము, చింత మొదలగు వాని గుణములు వేగరము గ్రహించకుండును. మరియు, ఈ మొదలగు వాని గుణములు గ్రహించ గలిగినను బహు దీర్ఘకాలము తరవాత గ్రహించును. మరియు, నిదురనాశనము, పొడిదగ్గు మొదలగునవి దీని లక్షణములని తెలియవలెను.

### హృదయశుష్క దుష్టప్రకృతి చికిత్స.

యవగంజియందు బాదంనూనె, శర్కర చేర్చి పానము చేయవలెను. మరియు భోజనపదార్థములతో చల్లని చెమ్మగల పదార్థములు సేవించవలెను జ్వరము లేకుండినచో పాలువిరిగిన నీళ్ళు లాభదాయకమగునని గ్రహించవలెను. యీరోగికి జ్వరముండినచో యవగంజి, బాదంనూనె అతిఉత్తమము. మరియు శుష్కత్వమును దూరపరచుటకై కిరూతి, అజఖర్ రొమ్ముపై మర్దించుట మిక్కిలి లాభదాయకమగును. అనగా తెల్లమైనమును, సౌరజాయగి-జల తైలమునందున్ను బనఫ్షా తైలమునందుపేసి కరిగించి, పచ్చిధనియాల రసమునందు కలిపి గట్టిగా చేతితో మర్దించి ఉంచుకొనవలయును. దీనిని కిరూతి, అజఖర్ అందురు. దీనిని రొమ్ముపై మర్ధించవలెను. మరియు తపేదిక్ (క్షయ) రోగములలో చెప్పబడియుండు ఔషధములుకూడా యీరోగమునందు వుపయోగించదగును.

### పొదినా చేర్చి చేయబడు మర్బతు విధి

తియ్యనిదానిమ్మగింజల రసము 9 మాషములు, పొదీనాఅరఖు 45 మాషములు, తెల్లశర్కర 27 మాషములు, యీవస్తువులను కలిపి మర్బతువిధిపూర్వకముగా పచనము చేయవలెను.

### ఖఫ్ఖాన్ (హృదయదడ) లక్షణములు.

ఈరోగస్వాభావికము హృదయమునందుదడ సంభవించును. కారణమేమనగా హృదయమునందు యేరోవిధమగు కష్టముసంభవించును. హృదయమునందు కష్టముకలిగించుటకు అనేక కారణములుగలవు. గాన ప్రత్యేకకారణములను వేరు వేరుగా వర్ణించబడును. (1) మొదటి కారణము సాదారణదుష్టప్రకృతి హృదయమునందు పుత్పన్నమై దడకలిగించును. మరియు నాలుగువిధములగు దుష్టప్రకృతుల వర్ణనము చెప్పబడియె.

### (2) రుధిరాదిక్య హృదయదడ లక్షణములు

శరీరమునందు రుధిరము అధికమై అవయవములు పెరుగ నారంభించును గాని అందు చెడునట్టి భాగము లేకుండును. కాబట్టి రక్తము పూర్ణముగా నిండియుండు కారణమువలన హృదయమునందు దడ ఉత్పన్నమగును. దీని విధానమేమనగా రక్తాదిక్యమువలన కలుగు చిన్నెములు ప్రకటనమగును. అనగా నరములు లాగుట, నరము లుబ్బుట, నాడి విశాలమగుట, మూత్రము చిక్కగానుండుట, అంగములయందు చాలి కలుగుట, ఈమొదలగు లక్షణములు కలిగియుండును.

### రక్తాదిక్యహృదయదడ చికిత్స

ఎడమచేతియందు బాసలికు అను శిరావేదనము చేయవలెను. దీనివలన అతివేగము లాభము ప్రాప్తించును. పెరుగు కర్పూరపు మాత్రలు యివ్వవలెను. భోజనాదులందు మాంసరసముల యివ్వకూడదు. శిరావేదనమునకు ముందు సందర్భముగానుండిన యెడలపిక్కలు రెండుభుజముల మధ్యభాగమునందు కురువు కొగలందులకు ప్రయో

క్షణము చేయవలెను. అనగా శస్త్రముతో గంట్లువేసి రక్తము తీసివేయ వలెను. మరియు, వీర్యమును వెడలించవచ్చునుగాని వీర్యము వెడలుట వలన ఆయాసము కలుగకూడదు. దీనివలన శాంతినొందును. మరియు, సమానత్వము కొరకు ఉష్ణముష్ణప్రకృతియందు వర్ణించియుండు నుపాయ ములు ఈరోగమునందుకూడా లాభదాయకములని గ్రహించవలెను.

ఒక మనుష్యుడు ప్రతిసంవత్సరము గుండెదడతో పరితపించు చుండువాడు అతనిని హాకీం జాలినూస్‌గారు శిరావేదనము చేయుచుం డువారు. నాలుగవ సంవత్సరమునందు దడ రాకముందు శిరావేదనము చేసి రక్తమోక్షణముచేసిరి తిరిగి హృదయ దడ కనుపించలేదు.

మరియు, ప్రకృతియందు ఉష్ణమధికముగా నుండినచో పిత్తము యొక్క గుండెదడయందు చల్లని ఉపాయములు వర్ణించబడును కాబట్టి వానిని ఉపయోగించవలెను. శక్తిదుర్బలత్వము నొందిన యెడల చల్లని భోజనములున్ను చల్లని షర్బతులున్ను నిజవుష్ణమునకు హానికలిగిం చును. కాబట్టి వానిని ఉపయోగించుటయందు సావధానుడై యుండ వలెను. మరియు, ఎండించినమాంసమును ఉపయోగించవలెను. మరియు లవంగములు ఏలకులు మెత్తగానూరి భోజనపదార్థములయందున్ను షర్బతులయందుపయోగించవలెను.

(౩) పిత్తజ హృదయదడ లక్షణములు

పిత్తము నరములయందు ప్రవేశించి హృదయదడ పుట్టించును. దీని లక్షణములు, చింత, నిదురలేమి, అధికదాహము, తొందర, మ రియు, ఇతరపిత్తరోగలక్షణములు కలిగియుండును. ఈరోగము మిక్కిలి స్వల్పముగా నుత్పన్నమగును.

పిత్తజహృదయదడ చికిత్స

పిత్తమును వెడలించుటకై కరక్కాయ కషాయము బనప్షా షర్బతు చింతపండు తేటరసము మొదలగునవి పానముచేయవలెను. ఉష్ణమును శాంతినొందించవలెను. మరియు, యోగ్యమనితోచినచో

కాసలికసు అను నరమునుండి కొద్దిగా రక్తమును వెడలించవలెను. మరియు చందనములో తడిపి ఆరవేసిన వస్త్రాలు ధరింపవలెను మరియు, పుష్టా దిఖ్యాము వలన వ్యాధమునందున నొప్పు కుపుల్లు ఉత్పన్నమగునను భయము సంభవించిన యెడల నల్లమందు 3 రతులు శేపులిత్తులు 6 రతులు కర్పూరము 2 రతులు కుంకుమపువ్వు కస్తూరి ఇవి ప్రత్యేకము ఒకరతి కలిపి రోగికియ్యవలెను మరియు, రక్తప్రకృతియందు చెప్పియుండు చికిత్సలయందుకూడా ధ్యానమ్ము చేయవలెను. అనగా ఈరెండు వ్యాధులకు ఒకేచికిత్సయని భావించవలెను. ఈరెండింటియందు భేదమేమనగా రక్తజమూత్రప్రకృతియందు భేదమేమనగా రక్తజమూత్రప్రకృతియందు రక్త మోక్షణముద్వార విశేషరక్తమును తీయవలెను పిత్తప్రకృతియందు మిక్కిలి చలువకలిగించుట ఆవశ్యకమని తెలిసికొనవలెను.

## చందనపు దునుబువిధి

తెల్లచందనము వస్త్రములో అరగదీసి అందులో కర్పూరముకలిపి అందులో బట్టతడిపి గాలిలో ఆరవేసి తొడగవలెను. మరియు యీబట్ట పై యెల్లప్పుడు వ్యాధయున్న స్థానమందున్న రొమ్ముపై గంధము చల్లుచుండవలెను.

## కర్పూరపు మాత్రలు చేయు క్రమము

గులాబిపూలు, తవాషీరు, కిలావపూలు, యీవస్తువులు ప్రత్యేకము 14 మాషములు పెద్దపాయలగింజలు, దోసగింజలపప్పు, పందిర దోసగింజలపప్పు, నేతిబీరవిత్తులపప్పు, యివిప్రత్యేకము 7 మాషములు నదీపీతలు కాల్చిన భస్మము, యష్టిమధుకము, యివిప్రత్యేకము తిన్నర మాషములు, కుంకుమపువ్వు, కర్పూరము, ప్రత్యేకము 2 రతులు, తుమ్మజిగురు, కతిరాగోందు, యివిప్రత్యేకము 5½ మాషములు, తుకంజబీజ 35 మాషములు యీవస్తువులు చూర్ణించి బేదానాగుజ్జులో కలిపి చేతితో మర్దించి మాత్రలు చేయవలెను.

### (3) కర్పూరమాత్రలవిధి.

గులాబిపూలు, కబాబ్చీని, ప్రత్యేకము తెన్నర మాషములు, కొరిండుధనియాలు, 7 మాషములు, కర్పూరము 3 రతులు, యీవస్తువులు చూర్ణించి పైవిధిగా మాత్రలు చేయవలెను. యీమాత్రలు 4½ మాషము సోపురసముతో పుచ్చుకొనిన వుష్ణప్రకృతిగల హృదయరోగము హరించును.

### చలువను కలిగించునట్టి షర్బతువిధి

పుల్లదానిమ్మగింజలరసము, పుల్లని ఆలుబకరాకాయలరసము, చింతపండురసము, నిమ్మకాయరసము, పచ్చిద్రాక్షరసము, యీరసములు సమానముగా తీసికొని కలిపి యీరసమునకు సమానముగా శర్కరకలిపి షర్బతువిధిగా చిక్కపరచి వుపయోగించినచో వుష్ణదుష్టప్రకృతిగలవానికి వుపయోగించును, దాహము వుష్ణము శాంతించును.

### పథ్యములు

ఈరోగికి జ్వరములేకుండినచో మర * లాభదాయకమగును. చెనగపులుసు చేర్చి వండిన చేపమాంసము యీరోగమునందు పథ్యకరమగును. చల్లనిగాలియందు రోగిని యుంచుట అన్నిటికంటె గొప్పనదుపాయమని గ్రహించవలెను.

లాభము:—హకీం మొహంమ్మద్ జకిరియాగారు వచించినదేమనగా వుష్ణమువలనకలిగిన గుండెదడకలరోగి మెండమొదలగు వుష్ణప్రదేశ

* మరా విషయమై రెండువాఖ్యములు గలవు. హకీం ఇన్నితలబిస్ గారు పెరుగునకు రాయవమా అని వచించిరి, జకీరాగ్రంధకర్త దోగ్ (మరా) నకు అరబ్బిలో మఖిజ్ అందురు. ఒక ఆహోరాత్రియుంచిన నిర్మలమగు పసుపునీరు పైకితేరును. ఈనీటిని (పెరుగుపై తేటఅందురు) రాయవమా అనుచున్నారు. అభిప్రాయమేమనగా వుష్ణమును శాంతింపజేయుటకు ఈపెరుగుపై తేట మిక్కిలి గుణదాయకమగునని చెప్పుచున్నారు. ఇప్పటి వైద్యులు రాయవమా పెరుగుకు చెప్పుదురు. దీని విధానమేమనగా పాలను తోడుపెట్టినచో దానిపై పసపురంగుగల నీరు తేరును. దీనిని అరబ్బిలో మావుర్ రాయి అందురు, హిందీలో పెరుగు విరిచిన నీరు అందురు.

ములయందు నివసించినవాని ఆయువు క్షీణించుచుండును. మరియు యీవృష్ణప్రకృతిగల హృదయపుదడగలరోగి యాభైఅరువై సంవత్సరములు జీవించినటుల వారుచూపుచున్నారు.

### (4) కఫజహృదయపుదడ లక్షణములు.

కఫసంబంధమగు మలమువలన హృదయమునందుదడ సంప్రాప్తమగును. అనగా రతూబతు (చెమనీరు) హృదయమునందు ప్రవేశించిన కారణమువలన యీరోగముసంభవించును. మరియు హృదయరోగములమలము హృదయసంబంధమగు నరములయందుగాని దీని ఝిల్లియందుగాని కలుగుచున్నది. గాన యీమలము హృదయమునకుఝిల్లిసమీపమునం దేర్పడుచున్నది. అచ్చట బహుదా చెమ్మకలిగియుండునని తెలియవలెను. మరియు వాతజమలము హృదయమునందుగల నరములయందు కలుగుచున్నది, దీనిని సుద్దా అనుచున్నారు. మరియు హృదయముయొక్క కర్ణములవావునందు దీనియొక్క నిధానము వర్ణనము చేయబడును.

మరియు, హృదయపుదడ కఫముయొక్క కారణమువలన కలిగినచో దీనిలక్షణములు శ్వాసయందు బిగింపుకలుగుట నాడి మృదువుగానుండుట నపుంసకత్వముకలుగుట అచేతనము మొదలగు లక్షణములు సంభవించును. మరియు, రోగి తన హృదయము నీటిలోమునిగియున్నదని భావించుచుండును.

### కఫజహృదయపుదడ చికిత్స.

ప్రారంభమునందు ఇస్తమఖుఖూన్ అను మాత్రయందు యారజ్ కలిపిగాని అథవా హబ్బెకోకాయ యీ మొదలగు వానితో మలము వెడలించవలెను. మరియు, యారజ్ఫైకరా, ఆకాశవల్లి మెత్తగానూరి లేక నూవములు తేనెతో చేయబడిన శికింజబీనాయందు కలిపి పుచ్చుకొనినచో లాభదాయకమగును. మరియు, రతూబతు అయిన యెడల యారజ్ లౌగాజియా, శాతరీతూన్ ఉపయోగించవలెను. ఈకో

గికి వమనము చేయించి మలము వెడలించినవెనుక చేయదగిన మాజూనులు, తీసిదివాల్‌షనొకు అను మాజూనులు ఉష్ణమును కలిగించునట్టివి శాంతి నొందించునట్టి వానిని ఉపయోగించవలెను శాదరితూస్ అనగా ఒక మాజూన్‌పేరు దీనిని హాకీం జాలినూస్ కంటె పూర్వమునందుండు వైద్యులు ఒకమహారాజు నిమిత్తమై చేయబడినది కాబట్టి ఆరాజు పేరు ఔషధమునకు పెట్టియున్నారు.

### శాదరితూస్ అను మాజూన్ విధి.

మాసాంబరు 52½ మాషములు, గారిఖూన్ 70 మాషములు, కుంకుమపువ్వు, దాల్చినచెక్క, వస, కస్తూరి, బల్సాన్‌నూనె, ఇవి ప్రత్యేకము 10½ మాషములు, రేవలచిన్ని 5¼ మాషములు, ఉదెబల్‌సాన్, రాజహంస, నల్లమిరియాలు, తెల్లమిరియాలు, పిప్పళ్ళు రూమిదేశపుపాషాణభేది, బల్సాన్‌మాత్రిలు, నేవు, ముంజిగడ్డి, తులసి ఇవి ప్రత్యేకము 7 మాషములు, కమాదరితూస్ చెంగల్వకోష్టు పాచితీగె, ఇవి ప్రత్యేకము 14 మాషములు గ్రంథితగరము, మద్దులవంగపట్ట, నకమోనియా ఇవి ప్రత్యేకము 21 మాషములు, జటామాంసి, 12 మాషములు, ఈయావత్తువస్తువులు చూర్ణించి వస్త్రగాలితము కావించి బల్సాన్‌నూనెయందు కలిపి స్నిగ్ధపరచి యావత్తువస్తువులకంటె మూడురెట్లు తేనెలోకలిపి మాజూన్ చేయవలెను. ఇది 19 మాషముల ప్రమాణము వరకు ఉపయోగించదగును. ఈఔషధము నాలుగు సంవత్సరముల వరకు బలము తగ్గకుండును.

ఇప్పుడు లేపనవిధానము చెప్పుచున్నాను ఈలేపనలు శీతము వలన కలుగునట్టి హృదయదడను వెంటనే శాంతినొందించును.

చెంగల్వకోష్టు, జటామాంసి, దాల్చినిచెక్క ఈవస్తువులు మెత్తగానూరి బొగడపూలరసమునందు తులసిసారాయియందు కలిపి హృదయముపై లేపనము చేయవలెను. దీనివలన బలుబువలన కలిగిన గుండెదడతోకూడా చెమ్మకలిగినను కలుగకుండినను లేపనము శరాబ్‌రిహాని

కొద్దిగా పానముచేయవలెను ఇట్లుపయోగించుటవలన యావతు ఔషధ ములకంటె మిక్కిలి లాభము ప్రాప్తించును.

శీతజహృదయ దడయందు పుపయోగించు చూర్ణము.

కహరోబా, జహన్న, ప్రత్యేకము 3న్నర మాషములు నిమ్మకా మబెరడు 1న్నర మాషములు రామతులసిగింజలు 9½ మాషములు ఈ వస్తువులు మెత్తగా చూర్ణించి వస్త్రగాలితముచేసి తేనెతో పుపయో గించినయెడల చలువవలన కలిగిన గుండెదడ లగ్గిపోవును.

రెండవవిధి.

పొదీనా, కహరోబా, కిరిబిషూ, వేల్చినపటిక, తుంగముస్తలు, యివిప్రత్యేకము 10న్నర మాషములు జరావంద్ మూదహారజ్ (గుంద్రవి కచూరము) దరూనంజ్ అకరవి (తెలుపవలెనుండు ఒకవిధమగువేరు) దీని ని యింగ్లీషులో పాన్ అందురు.) ప్రత్యేకము 1½ మాషములు కస్తూరి 6 రతులు జరామాంసి, ముత్యపుసారు, యివిప్రత్యేకము 3న్నరమా షములు శర్కర 70 మాషములు యీవస్తువులుయావత్తు చూర్ణించి సదాపాకుకషాయములో 10న్నర మాషములవరకుపుపయోగించవలెను.

చేసుదివాల్ మున్కుచేయువిధానము

అవస్నతిక్తారూమి, మూసాంబరము, పొడుగుచూరము, యివి ప్రత్యేకము 21 మాషములు వామూ, కుంకుమపువ్వు, అజామోదం, యివిప్రత్యేకము 14 మాషములు జటామాంసి, ఆకుపత్రి, ప్రత్యేకం 7 మాషములు జహన్న, కస్తూరి ప్రత్యేకము 3న్నర మాషములు యీ వస్తువులను మెత్తగానూరి చూర్ణించి వస్త్రగాలితముచేసి నిర్మలము గు తేనెతో కల్పుకొనవలెను. దీనిని గౌజబాన్ అరఖుతో 4న్నర మా షములవరకు పుపయోగించదగును.

తియ్యని దివాల్ మున్కు చేయువిధి.

కచూరము, దరూనంజ్, ప్రత్యేకము 7 మాషములు మంచి ముత్యములు, కహరోబా, పగడచూరు, పచ్చిపట్టుకాయలు, 5½ మా

వములు బహమనె సుఫేద్, బహమనె సుర్ఖ్, ఆకువత్రి, చిన్నయేలకులు, లవంగములు, జాఫ్ల, రాతిపువ్వు, యివి ప్రత్యేకము 2 మాసములు శొంఠి, పిప్పళ్ళు, ప్రత్యేకము 1 మాసము కస్తూరి 6 రతులు ఈ మొదలగువానిని మెత్తగా చూర్ణించి వస్త్రగాలితము నొనరించి పచ్చితేనలో కలుపుకొనవలెను.

ఈవ్యాధివిషయమై నానాదారా వర్తించబడినది. దీనిని మాలిఖోలియా (ఉన్మాదము అతివాగుడు) యందు వర్ణించివుంటిమి.

### (5) వాతజ హృదయదడ లక్షణములు.

వాతము హృదయసంబంధమగు నరములయందు ప్రవేశించి దడ కలిగించును. యేవస్తువు అయినను అనగా వాతము, పిత్తము, శ్లేష్మము, రక్తము, మొదలగునవి హృదయముయొక్క నరములయందు ప్రవేశించి క్షోభవింపినచో హృదయమువరకు వాయువు ప్రవేశించుట వలన ఆవిరియొక్క పరమాణువులు వెడలుటవలన హీనత్వము సంప్రాప్తించును. మరియు హృదయమునందు తందర కలిగించును. దీనిలక్షణములు ఎల్లప్పుడు హృదయమునందు ఆరాటము కలిగియుండుట నాడి కఠినముగా నుండుట, చింత, భయము, తందర, చెడుఆలోచనలు ప్రకటనమగుట, అనగా మాలికోలియా (పిచ్చి)యందు కలుగులక్షణములు యిందు సంభవించును.

### వాతజ హృదయదడ చికిత్స

రక్తజమాలికోలియా యందు వర్ణించబడిన చికిత్సలు అనగా శిరావేదనము ఇత్యాది చెప్పబడినవానిని యిందు చేయవలెను. మరియు హృదయమునకు పుష్టి కలిగించుటకై సహాయ్యముగల వస్తుసముదాయము చేర్చుకొనవలెను. మరియు వాతము, కఫమువలన నుత్పన్నమైనచో ప్రారంభమునందు ఒక విరోచనము చేయించవలెను. అనగా తెల్ల నబాత, ఆకాశవల్లి, గారిఖూన్, ఉస్తేఖద్దూస్, కాబోలుకరక్కాయలు, ఇవి ప్రత్యేకము ఒకభాగము, అయారజ్ పైకరా 1½ భాగము, అగరుత్తి

భాగము యీయేడువస్తువులు ఒకటిగాచేర్చి మెత్తగా నూరి వస్త్రగాలిత మొనరించి మాత్రలుచేసి 7 మాషములు మొదలుకొని $10\frac{1}{2}$ మాషము లువరకు ఉపయోగించదగును.

మరియు వాతము పిత్తముతో పుత్పన్నమైనచో ఈక్రింద చెప్ప బోవు మాత్రలవలన మలమును వెడలించవలెను. యీమాత్రలుచేయు విధానము.

సదాపాకు, పాదితీగె, సునాముఖిఆకు, పిత్తపావడా అనగా చేత రాశి, ఈమొదలగునవి ఒకభాగము, షాసాంబరం 2 భాగములు, రాజా వర్తము మగిసుల్ $2\frac{1}{3}$ భాగము, పొస్తకి 1 భాగము, గులాబిపూలు, $2\frac{1}{2}$ భాగము, ఈఎనిమిదివస్తువులు మెత్తగా చూర్ణించి, తియ్యని శేవు రసముతో నూరి మాత్రలు చేయవలెను. ఈమాత్రలు 14 మాషములు ఉపయోగించవచ్చును.

మరియు యీరోగముయొక్క మలము కేవలము వాతమైనచో హాబ్బుసవియార్ పుపయోగించవలెను. దీనివలన మెదడు హృదయము నందుగల విపత్తిని పవిత్రపరచును.

హాబ్బుసవియార్ చేయుక్రియము.

చిన్నకరక్కాయలు, పెద్దకరక్కాయలు యివి ప్రత్యేకము $3\frac{1}{2}$ మాషములు, పాదితీగె, లవంగములు $1\frac{1}{3}$ మాషములు, చేదుదివాల్ ముస్కు $10\frac{1}{2}$ మాషములు ఈఅయిదువస్తువులు కలిపి మూడు దినము లుంచి చక్కగా కలిపి రిహాని సారాయియందు కలిపి పానము చేయవ లెను. మరియు యే యేఔషధమునందు లవంగములు చేర్చియున్నవో లవంగములకు బదులుగా హిజరెఅరమని 3 రతులు చేర్చబడియున్నది. మరియు యీరోగమునందు గోరువెచ్చని నీళ్ళతో స్నానము చేయుట వలన లాభదాయకమగును. శేషవుపాయములు మాలికోలియా ప్రకర ణామువలన గ్రహించవలెను.

(6) దుర్బలత్వము వలన కలుగుగుండెదడ లక్షణములు.

శరీరముసంకుండి, విశేషరక్తము, విశేషవీర్యము వెడలుట, శీక

ఏదోషమైనను శరీరమునుండి విశేషముగా వెడలి పోవుట లేక భోజనపానాదులందు నీచమగు వుపాయములు ప్రకటనమగుట లేక రక్తము మిక్కిలి స్వల్పమగను, పలచగా నుత్పన్నమైనను, రక్తము చెడిపోయినను ఈమొదలగు కారణముల వలన హృదయదడ సంభవించును. అట్టిస్థితియందు శరీరమునుండి, ఏవిధమైన చెమ్మగల పదార్థములు వెడలుచుండినను హృదయమునందు దుర్బలము అతిశయమగుచుండును. హృదయము ప్రత్యేకముగా చిన్నవస్తువుయొక్క గుణము మాత్రము గ్రహించుచుండును ఎంతవరకనగా భోజనము యొక్క పరమాణువులతో కషముకలిగియుండువరకు గ్రహించుచుండునటుల మరియు ఆరాటముకలిగియుండును. హాకీంషేక్ అలీసేనాగారు వచించినదేమనగా నిస్సందేహముగా ప్రత్యేక ప్రకృతి మిక్కిలి దుర్బలముయొక్క కారణమగును. ఈదుర్బలత్వము హృదయమునం దుత్పన్నమగుచున్నది ఎంతవరకనగా అందుశక్తి నిలిచియుండినంతవరకు దడకలిగించుచుండును. ఎటులననగా తనపైనుండి కష్టమును దూరపరచుచుండును. గాన దీనిని గుండెదడ అనుచున్నారు.

## దుర్బలత్వమువలన కలుగు గుండెదడ చికిత్స.

కారణమునుబట్టి చికిత్సచెప్పబడును. గాన కారణము ననుసరించి చికిత్సచేయవలెను. రోగమునకు హానికలిగించునట్టి వస్తువులను వుపయోగించుటవలన రోగము శాంతినొందును. మరియు రోగకారణము ప్రకటనమైనచో అట్టికారణమును నష్టపరచుటకై పరిశ్రమచేయవలెను. మరియు రక్తమును వృద్ధిపొందించుటకై బలముగల భోజనములను భుజించవలెను. మరియు యిందువిషయమై లాభకరముగా నుండువస్తువులను గ్రహించవలెను. మరియు హృదయమును స్థిరపరచునట్టి ఔషధములను ప్రయత్నించవలెను.

## (7) జ్ఞానశక్తిబలమువలన కలుగు హృదయదడ లక్షణములు.

హృదయముయొక్క జ్ఞానశక్తి తీక్షముగను బలముగానుండును.

ఈకారణమువలన కొద్దికష్టమందు ప్రవేశించినను శీఘ్రముగా గ్రహించగలుగును. దీనిని తొలగించుటకై తందరపడుచుండును. అన గా హ్రూష్ణము, జలుబు, భయము, ప్రసన్నత్వము, చింత, మొదలగునవి తగ్గిపోవును. దడపుట్టించును. ఒక్కొక్కప్పుడు జ్ఞానశక్తియొక్క తీక్ష్ణ త్వము దోషము మరియు అవిరివరమాణువులతో హృదయమునందు కష్టము కలిగించునంతవరకు ప్రవేశించుచుండును. గాన దడ వుత్పన్న మగును. మరియు నేత్రశక్తి కర్ణములశక్తి మొదలగు అధ్యాయముల యందుకూడా వర్ణించియున్నాము. బహుదా జ్ఞానశక్తి బలముగలదగు ట మంచిదగునుగాని యీకారణమువలన చింతకలిగించినచో దీనినుపా యమును ఆలోచించుట అవశ్యకమగును. ఒకప్పుడు తీక్ష్ణముయొక్క కారణమువలన రోగి చల్లని జలపానముచేయుటవలన తందరపడు చున్నాడు.

## జ్ఞానశక్తి బలమువలన కలుగు హృదయదడ చికిత్స.

ఎటులననగా ప్రాణవాయువు సూక్ష్మమగుటవలన జ్ఞానశక్తి తీక్ష్ణత్వమొందిన యెడల ప్రాణవాయువును హెచ్చించుటకై కల్లా హారీరాలు మొదలగునవి ఉపయోగించవలెను. మరియు, బలము కలి గించునట్టి ఔషధములు భోజనాదులతో హృదయమునకు శక్తి కలిగించవ లెనుమరియు, ఉష్ణము జలుబుకలుగకుండునటుల కాపాడవలెను ఇచ్చట భేదమేమనగా విజ్ఞానశక్తి తీక్ష్ణతనొందుటవలన కలుగుచున్నది. లేక దుర్బలకారణమువలన కలుగగలదు దీనిని ఆరవభేదమునందు వర్ణించి యుంటిని గాన అచ్చట జ్ఞానశక్తి తీక్ష్ణత నొందుటవలన శరీరము ఆరో గ్యమొందుచున్నది. మరియు, కార్యములు శక్తి ఆరోగ్యముగను నిరో గముగను నాడి పెద్దదిగను బలముగలదిగా యుండును. మరియు, దుర్బ లము దీనికి విరుద్ధముగానుండును ఇందు దుర్బలముయొక్క కారణములు వాటిలక్షణములు ప్రకటనమగుచున్నవి.

### —విజ్ఞానశక్తి బలమువలన కలుగు దడచికిత్స.

పిస్తకి, దాల్చినచెక్క, రామతులసి, బాదరంజబోయా, ఎండు ధనియాలు, పచ్చిపట్టు, ముశ్కములు, తవాక్షీరి, గాజుబాన్, పుళిరిగెవో లువు, నిమ్మకాయబెరడు, కుంకుమపువ్వు, ఏలకులు, జాజికాయ, యీ మొదలగు వస్తువులు హృదయమునకు హితకరములు కాబట్టి దడను ఆపి వేయును. గాన ప్రకృతానుసారము నుపయోగించవలెనని ఇలాజుల్ అమ రాజ్ అను గ్రంథమునందు వ్రాయబడియున్నది.

(8) భేదము అనగా హృదయదడయొక్క భేదములోనిది. ఇతర అంగములయొక్క సంయోగమువలన కలుగుచున్నది. మరియు నిది అనేక భేదములుగా నుండును.

(1) మెదడుయొక్క సంయోగమువలన నుత్పన్నమగును.

(2) యకృత్ (లివర్) యొక్క సంయోగమువలన నుత్పన్నమగును.

(3) ఆమాశయము ప్రేగులు, గర్భస్థానము, పొరలు, పూపిరితిత్తులయొక్క సంయోగమువలన నుత్పన్నమగును.

(4) సర్వశరీరము యొక్క సంయోగమువలన ఉత్పన్నమగును.

(5) విషసంబంధమగు జంతువులు కాటునొందుట వలన ఈరోగమునకు కారణమగును. మరియు మిశ్రితదోషమువలన నుత్పన్నమగు రోగముల చికిత్స అన్నచోట్ల వ్రాయబడియే యున్నది. ఇందు హృదయమునకు బలము కలిగించుటకు మాత్రము పరిశ్రమ చేయవలెను. అనగా రోగియొక్క అంగమును నిజదశయందు మార్చుటకు పరిశ్రమ చేయవలెనని భావము.

### —హృదయమునందు పొగగ్రమ్మువ్యాధి లక్షణములు.—

ఈవ్యాధి అర్థము అనగా హృదయమునుండి పొగపైకిలేచినటుల రోగికి తోచుచుండును. ఈరోగము అధికమైనకొలది చెడుఆలోచనలు

అచేతనము వుత్పన్నమగును. యిది దోషములు దగ్ధమైయుండుటవలన కలుగుచున్నది.

హృదయమునందు పోగ గ్రిష్మ వ్యాధి చికిత్స.

లప్ తిమూక్ (పాచిటీగె) కషాయముతో దగ్ధమైనట్టి దోషములను వెడలించవలెను, మరియు ఘుంటిభోజనపదార్థములతో దోషమును స్థిరపరచవలెను. యీరోగముగలవానికి నలుపుగాగాని లేక అనేక రంగులగాగాని విరోచనములగుచుండును. లేక నకసీరు (ముక్కునుండి రక్తము స్రవించునట్టివ్యాధి) స్రవించుచుండును. భవాసిరు (మూల వ్యాధి) రక్తము స్రవించనారంభించును. ఇటుల రక్తము వెడల నారంభించినచో రోగి ఆరోగ్యము పొందగలడు.

## హృదయముయొక్క రెండుచెవులవాపు లక్షణము.

ఈవిషయమై విస్తారముగా వర్ణించబడియె. అనగా హృదయమునకు రెండు చెవులు గలవు. ఈరోగము పురాతనజ్వరములయందున్న వుష్ణరోగములయందున్ను వుత్పన్నమగును. దీనిలక్షణములు రొమ్ము వూపిరితిత్తులు, ఆమాశయముఖముయొక్క సమీపమునందు అనగా హృదయముయొక్క రెండుచెవులమార్గములయందు రోగికి భారముగా నుండునటుల తోచుచుండును. మూర్ఛకూడా సంప్రాప్తించును. ముఖము మిక్కిలి పసుపురంగుకలిగి యుండును, కండ్లుబరువుగా నుండును, మరియు హృదయగతి చక్కగా వికశించజాలకుండును. యిది పొరవరకు ప్రవేశించును. కేంద్రమువైపుకు తిరిగిపోవును. మరియు యీరోగి యొక్క నిజలక్షణములు అనగా వుక్తరోగమునందు చెప్పబడియె. అచ్చటవాపు యెటులగలుగుననగా వుష్ణరోగకారణమువలన ప్రాణము వుష్ణము, నష్టమగును. మరియు హృదయముయొక్క శక్తి దుర్బలమగు కారణమువలన భోజనమునందు అధికపరిశ్రమ చేయజాలకుండును.

మరియు శరీరానుసారముగా శరీరముయొక్క మార్గములు వికశించజాల కుండును. ఈకారణమువలన హృదయమునందు నీచమార్గములు ఖనీభవించును. ఎటులననగా హృదయము శ్లేష్మమైనది, మరియు హృదయముకంటె దీని ఝిల్లి రెండుచెవులు నికృష్టముగానుండును. శరీరము నీచముగు గుల్లభాగమును నికృష్ణమువైపునకు త్రిప్పివేయును. అట్టిస్థితియందు హృదయముయొక్క పొరలయందుగాని యీ రెండుచెవులయందుగాని వాపుపుత్పన్నమగును. అటులనే మలము ప్రవేశమగును. మరియు యీవాపు చల్లగను అనగా వృష్ణవాపు హృదయమునందు కలుగును. లేక పొరయందు లేక హృదయముయొక్క రెండుచెవులయందు సావకాశము కలుగనియ్యదు. గాన తక్షణమే చంపివేయును.

హృదయసంబంధమగు చల్లనివాపు కలిగినయెడల ముఖ్యముగా చంపివేయునని తెలిసికొనవలెను. మరియు చల్లని వాపు హృదయమునందు లేకుండినవెంటనే సదుపాయములు చేసినచో చికిత్సవలన ప్రయోజనము కలుగగలదు.

హకీంజాలీనూస్‌గారు వచించినదేమనగా నావద్ద ఒకకోతికలదు అది దినదినమునకు చిక్కిపోవుచుండెను, నేనుదానినిచంపివేసితిని. తదుపరి దానిపొట్ట చీల్చిచూడగా దానిహృదయముయొక్క పొరయందు కఠినవాపు కనుపించినదని యీవాపువలననే యీకోతి చిక్కిపోయినదని గ్రహించితినని జాలీనూస్‌గారు వచించిరి. కోతియొక్క అంగములు మనుష్యుని అంగములవలెనే యుండునని తెలిసికోవలెను. గనుకనే హకీంజాలీనూస్‌గారు అనేకకోతులను పెంచుచుండువారు, ఏదైనవరీక్షయందు కఠినసందేహము కలిగినప్పుడు కోతినిచంపి దానిపొట్టచీల్చి పరీక్షించువారు.

## హృదయసంబంధమగు రెండు చెవులవాపు చికిత్స

మలమును మెత్తపరచి ఫెడలించుటకై బాబూనా అకలీలుల్

మలిక్, రాజహంస, గోధుమపొట్టు మొదలగువాని కషాయముకాది అమాశయముఖము రొమ్ముపై తరేడా (కావడము) చేయవలెను.

మరియు, బాబూనా, అకలీలుల్ మలిక్, అవిసివిత్తులు, ఖితమి ఆకులు, కర్నబ్ (క్యాబేజి) ఆకులు ఈమొదలగు వస్తువులనూరి లేపనము చేయవలెను. మరియు, ఔషధములవలన ఆహారములవలన హృదయమునకు బలముకలిగించవలెను.

మరియు, హృదయముయొక్క రెండు చెవులయందు కలుగు వాపు హృదయసంబంధమగు పొరకంటె అధికముగానుండును ఈవాపు గల రోగి మిక్కిలి అచేతనుడైయుండును దీనివిపత్తు (కష్టము) కఠినముగానుండును. హృదయముయొక్క రెండు చెవులనుండే గాలి లోభాగమునకు వెళ్ళుటకున్న పోగబైకిటి వెళ్ళుటకు మార్గములైయున్నవి. కాబట్టి ఈమార్గములయందు వాపుసంభవించినచో హృదయము చిన్నదగును గాన హృదయమునందు కష్టముసంభవించును అనగా గాలిని చేర్చుట ఆవిరిపరమాణువులను వెడలించుట మొదలగు కార్యములను నెరవేర్చుటకు తన నిజప్రకృతియందుండజాలదు అనగా మృత్యువు సమీపించుచున్నది.

మరియు, హృదయసంబంధమగు పొరయందు కలుగు వాపు దీనికి విరుద్ధముగానుండును. అనగా పొరయొక్కవాపునందు అచేతనము అధికముగా కలుగజాలదు. గాన ఏకాలము (ఒకదినము) వరకు జీవించియుండును ఎందుకనగా హృదయమునందు గాలి ప్రవేశించునట్టి మార్గము వికసించియుండును గాని హృదయము చిన్నదికాజాలదు అయినను వెంటనే చంపివేయును. మరియు, హృదయము గాయము కురుపులను ఎన్నడుభరించజాలదని ప్రకటనమగుచున్నది. వైద్యవరులు వచించినదేమనగా హృదయమునందు కురుపులులేచి నరములనుండి నల్లరక్తము వెడలివచ్చినచో రోగి మృత్యువు పాలగుచున్నాడు. మరియు, హృదయముయొక్క గుల్లప్రదేశమునందు గాయముకలిగినమొదల అరక్షణమే

స్మృతినొందించును వ్రణము వెంటనే కలుగకుండిన రోగిని రెండవ దినమునందు చంపివేయును. ఈవ్యాధి ఆయాలక్షణములనుబట్టి కనిపెట్ట బడునుగాని పూర్వపువైద్యవరులు ఎవరున్ను దీనివర్ణనము చెప్పియుండ లేదు అనగా ఈవ్యాధియొక్క ఉపద్రవములు లనాఖ్య అని గ్రహించ వలెను.

## హృదయము అణగుటవలన కలుగు లక్షణములు

ఈరోగముగల రోగికి తన హృదయము వరచినటుల అణచబడి నటుల తోచుచుండును మరియు, అచేతనము కలుగుచుండును. యీ రోగినోట విస్తారముగా చొల్లుకారుచుండును. ఈరోగకారణ మేమనగా స్వల్పవాత దోషమలము హృదయముపై స్రవించనారంభించును. మరియు మలము తగ్గినకొలది అచేతనము తగ్గుచుండును ఈమలమునందు విష ముగాని కుళ్ళుగాని కలుగకుండును అనగా విషత్వము మలమునందు కలిగిన అచేతనము మలము తగ్గినందున వ్యాధి తగ్గజాలదు. మరియు, మలముయొక్క విశేషత్వము స్వల్పత్వము తీక్ష్ణము మొదలగువాని అనుసారముగా అచేతనముయొక్క దశ విరుద్ధమగుచున్నది.

## హృదయము అణుగుటకు చికిత్స

బహుదూరమునుండి వాతమును వెడలించునట్టి వస్తువులను ఉపయోగించవలెను మరియు, యకృత్ యొక్క ప్రకృతి సమత్వము కొరకు పరిశ్రమచేయవలెను. దీనివలన నిజరక్తము ఉత్పన్నమగును. ఇందువిషయమై లాభము కలిగించునట్టి మాజూన్‌ల వర్ణనము మాలి ఖోలియా వ్యాధియందు చెప్పబడెను గాన వాటివలన హృదయమునకు బలము కలిగించవలెను. మరియు, తిరియాక్ కబీర్ యీరోగమునకు మిక్కిలి ఉపయుక్తముగానుండునని గ్రహించవలెను. ఈగ్రంథకర్త వాతనాశకకావ్యదమును చెప్పియున్నాడు దాని విధానము ఈక్రింద చెప్పుచున్నాము.

## వాతహరకషాయము

సునాముఖి ఆకు 24½ మాషములు గులాబిపూలు 14 మాషములు పాచితీగె, కరక్కాయలు,నల్లకరక్కాయలు నల్లకరక్కాయ బెరడు ఇవి ప్రత్యేకము 17½ మాషములు బిస్పాయజ్, బెరడు తీసిన యష్టిమధుకం, సోపు మొదలగునవి ప్రత్యేకము 7 మాషములు పుస్తెఖద్దూస్ (హిందీలో ధారు అందురు) రాజహంస, చాతరాసి, గౌజుబాన్, బాదరంజబోయ, బనఫ్షా, నీలోవర్ (కలువపూలు) ఇవి ప్రత్యేకము 10½ మాషములు గింజతీసిన ద్రాక్షపండ్లు, లీహసోడా (శ్లేష్మాంతకము) ఇవి ప్రత్యేకము 30 గింజలు ఈయావత్తు వస్తువులను ౹ శేరు నీళ్ళయందు వేసి అర్ధాంశముగా కషాయముకాచి వడిబోసి ఆప్తాబిగుల్ ఖందు (ఎండలోనుంచి చేయబడినగుల్ ఖందు) 10½ మాషములు రేలకాయ జిగురు బాదంనూనె, తురంజ్బీన్ ప్రత్యేకము 17½ మాషములు, ఈ వస్తువులు ఆకషాయమునందు చేర్చి వడియపోసి పానము చేయవలెను. ఇది బలముగల వానికి ఒకమోతాదు.

## హృదయము చెక్కినట్లుండు వ్యాధి లక్షణములు

హృదయము చిప్పినట్లుండుటకు కారణము ఈవ్యాధియందు మనుష్యునికి తన హృదయము ఏదోవస్తువుతో చెక్కినటుల తోచుచుండును. మరియు, బాధఅధికమగుటవలన రోగి అచేతనుడై పడియుండును. తిరిగి వెంటనే చైతన్యుడగును. ఎందువల్లననగా కారణము దుర్బలముగానుండుటవలన వెంటనే నష్టమొందుచుండును. ఈరోగము పిత్తాతిసారమువలన అనేక దినములు పీడింపబడిన వారికి కలుగుచున్నది. అనగా చెమ్మకూడునట్టి సమీపమునందు పెడల నారంభించును. అట్టి స్థితియందు వుత్పన్నమగును. అనగా ఎవనికి మెదడునుండి వుష్ణమగు తీక్ష్ణ ఆవిరి ఆమాశయమునందుగాని హృదయమునందుగాని ప్రవేశించ నారంభించును. అనగా ఇందు రెండు అంశములు విరుద్ధముగానుండును

మెదడునుండి స్రవించు చెమ్మ ఆమాశయమునందు విశేషముగా పడుచున్నదని ప్రకటనమగుచున్నది గాని హృదయముపై పడజాలదు గాని ఊపిరితిత్తుల ద్వారా హృదయముపై పడుచుండును ఇది ఊపిరితిత్తులయందు ప్రవేశించినచో దగ్గువలన వెడలిపోవును కాబట్టి హృదయముపైకి వెడల జాలదు ఒకప్పుడు ఊపిరి తిత్తులయొక్క దుర్బలత్వమువలన దగ్గినప్పుడు వెడలక హృదయముపైకి ప్రవేశించినచో నిస్సందేహముగా రోగిని చంపివేయును. ఇందువలననే సహారా అస్ బాబ్ అను గ్రంథకర్త వచించినదేమనగా హృదయమునకు ఆమాశయమునకు ఆరూఢపరచవలెను. ఎందుకనగా పిత్తాతిసారము ఆమాశయమునందు పిత్తము స్రవించుటవలన కలుగుచున్నది. ఈఅతిసారము అధికమైనయెడల ఆమాశయమును చివ్వివేయును. (దోకబడును.) అట్టి స్థితియందు హృదయము చెక్కివేసినటుల తోచుచుండునుగాని పిత్తాతిసారమునందు హృదయము చివ్వబడుట అసంభవమగునని తెలియబడుచున్నది. ఎందుకనగా హృదయము లిన శ్లేష్మమగుకారణమువలన యిటువంటి కష్టము భరింపజాలదు. అనగా యింతకుముందె నిండిపోవును. మరియు యీరోగచిహ్నము లెవ్వియనగా రోగదశసంప్రాప్తమైనయెడల కష్టమువలన ముఖమునందు ముడతలుపడుచుండును. శక్తిపోవుటవలన ఆపుట్టిశక్తి దుర్బలత్వమువలన శరీరమునందు కొన్నిస్థలములయందు చెమటవచ్చుచుండును.

## హృదయము చివ్వబడు వ్యాధి చికిత్స

ముందు కారణమును దూరపరచవలెను. పిత్తమును తొలగించవలెను. రక్తమును కాపాడుటకై రక్తము విశేషముగా వృద్ధినొందునట్టి వస్తువులు మృదువగు పదార్థము లుపయోగించవలెను. అనగా చకోరపక్షి, పూరేడుపక్షి, పునుగు, మొదలగుహానిమాంసములు పవిత్రమైన రొట్టె మొదలగునవి భుజించవలెను. మరియు యేవిధమైన పులుసుపదార్థము లుపయోగించకూడదు. అనగా పిత్త ముత్పన్నము కాకూడదు.

పుష్టికర సుగంధిత షర్బతులపానము చేయవలెను. మరియు నకాలు కార ణమువలన యీవ్యాధి పుత్పన్నమైనచో ప్రారంభదశయందు తీక్ష్ణమగు ఆవిరి వెడలించవలెను. మరియు అవసరమైనచో గసగసాల షర్బతు నుప యోగించవలెను. దీనివలన రతూబతు స్రవించక నిలిచిపోవును.

## హృదయము బైటికివచ్చునట్టి లక్షణములు.

ఈవ్యాధియొక్క అర్థమేమనగా హృదయము రొమ్మునుండి బై టికి వెడలివచ్చుచున్నటుల రోగికి తోచుచుండును. దీని కారణము రక్తజ దుష్టప్రకృతివలన కలుగుచున్నది. లేక పిత్తజదుష్టప్రకృతి హృద యమునందు కలుగుచున్నది. కాబట్టి యిట్టి దుష్టప్రకృతిని దూరపరచు టకై హృదయము కదలనారంభించును. మరియు దూరపరచునట్టి అధి కతవలన రోగి తనహృదయము బైటికివచ్చుచున్నదని భావించును. మరియు దశ ప్రకటనమైనయెడల ముఖకాంతి మలానుసారముగా యెర్ర గాగాని, పసుపురంగుగాగాని, రక్తజమలానుసారముగాగాని పిత్తజ మలానుసారముగాగాని యేర్పడును యీరోగముయొక్క చిహ్నములని తెలియవలెను.

## హృదయము బైటికివచ్చునట్టి వ్యాధి చికిత్స

ఈవ్యాధియందు బాసలీకు అను శిరావేదనము చేయవలెను. మరియు పర్పాటకము కిరక్కాయలుకషాయముకాది శరీరమును మృదు పరచవలెను మరియు భోజనపానాదులను కాపాడుచు సంతోషకరమగు ఔషధములవలన హృదయమునకు పుష్టికలిగించవలెను. పన్నీరు బేదము స్క్ అంఖు, చందనము, మొదలగునవి యెల్లప్పు డుపయోగించుట లా భదాయకమగును. మరియు సమస్త హృదయములయం దుపయోగిం చుట మంచిది.

## హృదయముపై చెమ్మచేయునట్టి లక్షణములు

ఈరోగముగల రోగికి తన హృదయము నీళ్ళలో తేలుచున్న ట్లు తెలియబడును. అట్టి రోగి హృదయము దడకలిగియుండును యీ

వ్యాధి కారణమేమనగా హృదయముపై చెమ్మ ఘనీభవించి దాని యొక్క ఝిల్లియందు నిలిచిపోవును. ఈఝిల్లి హృదయముపై చుట్టుకొనియున్న కారణమువలన ఆచెమ్మయొక్క జలుబునందు ధ్వానము చేయుచుండును మరియు, హృదయము సమీపమునందు ప్రవేశించినచో హృదయము నీళ్ళలో తేలుచున్నటుల భావింపును. అట్టి స్థితియందు చలికనుపించుటవలన హృదయము కష్టము పొందినదో దడవలె కద అనారంభించును ఇందువలన వైద్యవరులు ఈరోగమునకు హృదయదడ యొక్క భేదమని భావించుచున్నారు.

హృదయముపై చెమ్మచేరుటకు చికిత్స

చెమ్మను నష్టపరచునట్టియు హరింపజేయునట్టియు పుష్టికరమగు యారజాత్ గాని లేక యితర ఔషదములుగాని ఉపయోగించవలెను. మరియు, గులాబిపూలు, జటామాంసి, కుంకుమపువ్వు ఈవస్తువులను బాదరంజబోయరసమునందుకలిపి రొమ్ముపై లేపనము చేయవలెను. హృదయమునందు ఉష్ణముచేర్చుటకున్ను అందుండునట్టి జలుబును తీసివేయుటకై రోగిని క్రోధమునందు మార్చుటయె అతి వుత్తమమగు సదుపాయమని గ్రహించవలెను.

లాభము:—హృదయముపై క్రొమ్మకోసియుండి తన నిజదశకంటె విశేషమై అకస్మాత్తుగా ఉష్ణమువలన శుష్కించి హృదయముపై చుట్టుకొనును. మరియు, హృదయమును అణచివేయును అనగా నిజదశయందు విశాలమైనటుల విశాలము కాజాలకుండునటుల ఆవుచుండును ఇట్టి దశయందు శ్వాసరాకపోకలకు ఇబ్బందికలిగి శ్వాసబిగబట్టుచుండును. మరియు శక్తిహీనత్వ మొందుచుండును శరీరమునందు క్రోధము సంప్రాప్తమగును ఈమొదలగు లక్షణములు తటస్థించును ఇట్టి సమయమునందు రొమ్మునకు మృదుత్వము కలిగించునట్టి వస్తువులు అనగా మైనపుతైలము లేపనము చేయవలెను. దీనివలన శుష్కత్వము నష్టమొందును పిమ్మట మలమును వెడలించుటకై వర్ణించిన

విధిపూర్వకముగా మలమును వెడలించవలెను. మరియు, హృదయమును నవు కష్టము కలిగించుటకై పరిశ్రమ చేయవలెను.

## హృదయము లాగునట్టి లక్షణములు

ఈరోగముగలరోగి తన హృదయము క్రిందికి లాగికొనిపోవుచున్నదని భావించుచుండును యీరోగకారణ మేమనగా యకృత్ త్రేలాడునట్టి స్థలమునందు వాతాదిదోషములలో నొకదోషము ప్రవేశించుచున్నది. ఈకారణమువలన త్రేలాడునట్టి ప్రధానమగుస్థానము దిగబడును. ఎటులనగా హృదయము యకృత్‌తో సంయోగము కలిగియుండును. కాబట్టి యకృత్ త్రేలాడునట్టిస్థానము దిగజారుటవలన హృదయముకూడా లాగుచుండును కధాచిత్ లాగినటుల తోచుటవలన హృదయమునందు నూత్మకష్టము అచేతనము మొదలగునవి ఉత్పన్నమగును.

## హృదయము లాగునట్టి వ్యాధి చికిత్స

రోగానుగుణ్యముగా చికిత్సచేసి దోషములను తీసివేయవలెను. మరియు, రోగియొక్కరంగు మొదలగు ఇతర చిహ్నములను బట్టి దోషములను గ్రహించవచ్చును.

# మూర్ఛరోగ లక్షణములు.

హృదయమునకు కష్టము సంభవించుటవలన జ్ఞానము తిరుగుట పరుగిడుట, నడచుట, మొదలగువానిశక్తి హీనమగుటవలన మనుజుడు అచేతనమును పొందుచున్నాడు. మరియు గుండెదడయొక్క కారణము బలముగలదైనచో అచేతనము కలిగించుచున్నది. గుండె అదురు మిక్కిలి బలముగలదైనచో రోగిమృతినొందునని గ్రహించవలెను.

మూర్ఛవ్యాధియొక్క కారణము.ఆత్మ విశేషకష్టము పొందినయెడలరోగి ఒకఘడియలో మృతినొందునని ప్రకటనమగుచున్నది. మరియు శరీరముయొక్క రంగు పచ్చగానుండుట కాళ్ళు, చేతులు, చల్లబడు

ట, నాడి, దుర్బలముగానుండుట, యీమొదలగు లక్షణములు అచేతనముయొక్క చిహ్నములని గ్రహింపదగును. మరియు అచేతనము కఠినముగానుండినయెడల రోగి నేత్రములు తెరువలేకుండును. ఇట్టిరోగిని పిలిచినచో గ్రహించగలుగునుగాని తిరిగి బదులుచెప్పజాలకుండును. కాబట్టి సక్తా (సన్యాసము) అను వ్యాధిగలరోగిని పిలిచినను వినబడదు. ఇటులనే స్పృహలేకపోవుట మరియొక దళ అనగా హృదయమువైపు ఆవిరి పరమాణువులు పోగ, నీచదోషములు, మరియు ప్రక్కయెముకల లోభాగమునందుండు ఝిల్లిమొదలగునవి దెబ్బతిని వాచుటవలన కలుగుచున్నది.

మరియు మూర్ఛ రెండువిధములుగా నుండును. (1) ఆత్మనష్టమొందుట దీనికారణమగుచున్నది. (2) ఆత్మ శుష్కించిముదుచుకొనుట, సీర్సించుట, మొదలగు కారణములవలన కలుగుచున్నది. ఈరెంటిదళ ఆత్మనష్టమగుట, చిక్కిపోవుట, హృదయము హృదయముయొక్క శక్తి దుర్బలము నొందునట్టికారణమువలన కలుగుచున్నది. ఎటులననగా రూహు (ప్రాణము, లేక ప్రాణవాయువు, లేక జీవుడు) శక్తులయొక్క గుర్తుముకాబట్టి యింద్రుపద్రవము కలిగినయెడల సర్వశక్తియందు దుర్బలము సంభవించును. గనుక యీకారణమునబట్టి ఆత్మనష్టమగుచున్నది. మరియు ఆత్మనష్టమొందుటకు మూడుకారణములు గలవు.

(1) విశేషముగా మలము వెడలుట.

(2) ఆనందము అనగా విషయానందము మొదలగునవి ఒకానొకప్పుడు అధికసంతోషము అకస్మాత్తుగా కలిగినచో హృదయము తన ప్రమాణముకంటె అధికముగా వికసించును. కాబట్టి యీకారణమువలన ఆత్మతొలగిపోవును. మరియు హృదయము తిరిగి ముకళించక నిలిచిపోవును. కాబట్టి అచేతనము వుత్పన్నమై మృతినొందును.

(౩) గొప్పకలుజర (ప్రేహుయమశూల) మొదలగు నొప్పి వలెనే మిక్కిలి కఠినమగునొప్పియుండుట ఆత్మనష్టమగుటకు కారణమగును ఇట్లు నష్టమొందుటకు కారణమేమనగా శరీరశక్తి ఆత్మయొక్క సమాన త్వమునకై నొప్పిగలస్థలమునందు పంపించబడును. ఈ కారణమువలన హృదయము చల్లబడుచున్నది. గాన ప్రాణవాయువు నష్టమగుచున్నది. ఇట్టితరి అచేతనముత్పన్నమై చంపివేయుచున్నది. మరియు ఘ్రాణమగు విషములను భుజించుటవలన హృదయమునందుండు ఆత్మను నష్టపర చుచున్నది. మరియు నష్టము కలిగించు యావత్తు కారణములువర్ణించ బడును. ఆత్మక్షీణించుటకు రెండు కారణములుగలవు

(1) మలము విశేషముగానిండియుండి శీఘ్రముగా మద్యపా నము చేయుట.

(2) మిక్కిలి భయము కలుగుట అనగా అకస్మాత్తుగా భయ ము కలుగుట ఈ మొదలగు కారణములవలన హృదయము శుష్కించి బంధించబడును ఆత్మ నిలిచిపోవును చల్లని విషములను భక్షించుట వలన అనగా బరీది, మరియు, బహాయ అను నరములయందు తిమ్మిరి కలుగుటవలనకూడా ఆత్మబాధింపబడుట ముడుచుకొనుటకు కారణము గుచున్నది కాబట్టి ఇందువిషయమై వర్ణించబడును.

మరియు, రెండవ విధమగు మూర్ఛరోగమునకు అనేక కారణ ములు గలవని గ్రహించవలెను. (1) మలముయొక్క భారము మూర్ఛ రోగమునకు కారణమగును, (౨) మలము వెడలించుటవలన ఈరోగము నకు కారణమగును. (౩) రోగయొక్క అవిరిపరిమాణువులు విషసంబధ మగు ఔషధములు హృదయమునందు ప్రవేశించుటవలన యుత్పన్నమ గును లేక లోపలికారణమువలనగాని లేక బాహ్యకారణమువలనగాని కలుగుచున్నది. (4) దుష్టప్రకృతి హృదయమునందుత్పన్నమగుటవలన ఈరోగము కలుగుచున్నది. (౫) హృదయముయొక్క వాపు అచేతనము కలిగించుటకు కారణమగును. (౬) హృదయమునకు నమీూపమునందుం

డునట్టి అంగమునందుగాని లేక ఇతరములగు ఇటువంటి అంగములయం దుగాని లేక హృదయసంబంధమగు అంగములయందుగాని వుపద్రవము సంభవించి వీటి సంయోగమువలన హృదయమునందు కష్టము ప్రవేశించును కాబట్టి అచేతనము కలిగించుటకు కారణమగుచున్నది ఇప్పుడు ప్రత్యేకవర్ణనము వేరువేరుగా చెప్పబడును.

(1) దేహము మలము నిండియుండుటవలన అచేతనమునకు కారణమగును. అనగా మలము యొక్క విశేషత్వము నిజప్రభుత్వము ఆత్మను బంధించి శవమువలె చేయుచున్నది. నరములయందు దోషము నిండిగాని లేక సారాయి మొదలగు వానివలన నిండుటవలన అచేతనము కలుగుచున్నది.

లాక్షణము:- ఈఅచేతనము జ్వరముయొక్క ఆరంభమునందు వుత్పన్నమగుచున్నది ఇది మలదోషము శరీమునందు సంపూర్ణముగా నిండియుండుటవలన కలుగుచున్నది. కాబట్టి గిబ్బర్ ఖాలిస్ (ఇదిపిత్తజ్వరము దీనిమలము నరముల బైటనుండును) యొక్క ఆరంభమునందున్న వాపువలన కలుగు జ్వరములయందున్న అచేతనత్వము వుత్పన్నమగును దీనికారణము మలము మొదలగునవి వెడలించుటయందువర్ణించబడును.

(2) మలము వెడలించునట్టి కారణమువలన మూర్ఛవుత్పన్నమగును కారణమేమనగా విశేషమలము వెడలించుటవలన ఆత్మయొక్క సూక్ష్మత్వమునునష్టపరచుచున్నది. ఎటులననగ శరీరమునుండి చెమ్మ వెడలిపోయినచో అనగా ఆచెమ్మమంచిదైనను లేక నీచమయినను దీనితో కూడాఆత్మయొక్క శక్తికూడానష్టమొందును ఇటులమలము వెడలుటవలన అచేతనమును పుట్టించుచున్నది ఇదిఅనేకవిధములుగానుండును అనగావిరోచనములు విశేషముగా అగుటవలనగాని వాంతి విశేషమగుటవలన జలోదరమునందు గర్భముయొక్క పొరను చీల్చివేయుట నీళ్ళుతీసివేయుట వ్రణమును చీల్చుట చీము తీసివేయుట చెమటఅధికముగా వెడలించుట విశేషముగా రక్తము వెడలించుట మొదలగునవి లేక విసూచి (కలరా)

మొదలగువాని వుపరాంతమునంద్దైనను కొద్దిగా చేవమాంసము మాంస రసమునందు కస్తూరి కలిపి రోగి గొంతులో పోయుచుండవలెను. మరి యు, రోగి చైతన్యుడైనచో దివాల్మమస్కు ముత్యములు మరియు, జవారిష్వూద్ వుల్లని పన్నీరునందు కలిపి వుపయోగించవలెను.

లాభము:—స్పృహ లేకపోవుట, నొప్పి, శుష్కత్వము, ఆనంద మువలన వుత్పన్నమగుచున్నది. అనగా విశేషనొప్పి శుష్కత్వము మి క్కిలి ఆనందము మొదలగునవి ఆత్మను నష్టపరచునట్టి హేతువులవలన కలుగుచున్నది. దీని వర్ణనము చెప్పియుంటిని. మరియు అచేతనము తపెగివుభాలిస్ యొక్క ప్రారంభదశయందు వుత్పన్నమగుచున్నది. మరియు ఆజ్వరముయొక్క ఆరంభమున్నందు వాపుయొక్క ఆ రంభమునందు రోగిహృదయమునందుకలిగినచో యిందుకూడా మలము వెడలించుటకు సమానముగా నుండును. అయినను నిది ఆజ్వరమునకు విరుద్ధముగా నుండును. అనగా వీటియొక్క అచేతనము మలమునిండి యుండునట్టి భేదములలోనిది యెటులననగా గివుభాలిస్ యందు స్పృహ తప్పుటకు కారణమగునట్టి తీక్ష్ణమగుమంటవలన కలుగుచున్నది. దీని వలన వృష్ణము వుత్పన్నమగును. మరియు శక్తి ఆత్మనష్టమగుచున్నది. ఈరోగియొక్క లోపలిఅంగములయందు వాపు కలిగినచో యిదే కా రణమగును. ఎటులననగా లోపలిఅంగములయందు వాపుకలిగినచో జ్వరమువచ్చునసమయమునందు మలము వాపువైపునకు ఆరూఢమగు చున్నది. ఇట్టిదశయందు నొప్పి అధికమగుచున్నది. శక్తినశించుటవల న అచేతనము వుత్పన్నమగుచున్నది. ఇతరజ్వరములయొక్క విరుద్ధత యిందులో అచేతనముయొక్క కారణము రూహు (ప్రాణము) జీర్ణిం చుచున్నది. ఈకారణమువలన మలము పొంగి విశేషమగుచున్నది. ముఖ్యముగా మలము చిక్కనైగాని లేక హృదయముయొక్క నమీపమునందుగాని యుండును.

(౩) భేదము అచేతనముయొక్క భేదములలోనిది అనగా కష్టము కలిగించునట్టి ఆవిరిపరమాణువులుగాని విషసంబంధమగు వస్తువులుగాని హృదయమునందు ప్రవేశించుటవలనగాని దీనికి కారణమగును. మరియు దీనికారణము మలము పైభాగమునందుగాని లేకశరీరమునందు అనేకవిధములుగా నుండును.

(1) ఏఅంగమునందైనను నీచమలము ప్రవేశించి ఖనీభవించి అందుండి చెడు ఆవిరిపరమాణువులు బైలువెడలి హృదయమునందు ప్రవేశించును. మరియు మిస్రితదోషములవలన వుత్పన్నమగు అచేతనముయొక్క వర్ణనము మిస్రితకారణములందు సవిస్తారముగా వర్ణించబడును.

(2) విషసంబంధమగు జంతువుల కాటు నొందుట లేక విషజంతువులు కుట్టుటవలన ముఖ్యముగా హృదయసంబంధమగు నరమునందు కుట్టినను కరచినను విషముయొక్క నీచదశ హృదయమునందు ప్రవేశించును. యీదశయొక్క కారణమువలన ఆత్మయొక్క జీవనమునకువిరుద్ధమగును గాన అచేతనము వుత్పన్నమగును.

(౩) దుర్గంధిత ఆవిరియొక్క పరమాణువులు అనగా నీచమగు గంధమువలన తడుపబడిన చర్మమునందు తడుపబడిన ఆవిరియొక్క పరమాణువులను వాసనచూచుటవలనగాని లేక యీవిధమగు వస్తువులు వాసనచూచుటవలన విశేష రౌద్రము కలిగించును. మరియు బలముగల తీక్ష్ణవస్తువులు వాసనచూచుటవలన అచేతనము వుత్పన్నమగును. కాబట్టి యీఅచేతనము యెటువంటివారికి వుత్పన్నమగుననగా హృదయముయొక్క శక్తియందు సంపూర్ణముగా దుర్బలము చేరియుండినవానికి కలుగుచున్నది. అనగా దుర్బలముయొక్క దశయందు కొద్దివస్తువైనను భారముగానుండును. ప్రతిబాహ్యఅంగములు కష్టగుణము శీఘ్రముగా గ్రహించుచుండును. ముఖ్యముగా హృదయము మెదడు శరీరముయొక్క యావత్తు అంగములకంటె శ్రేష్ఠమైనవి. అనగా ఖలీఖాన్

(దవ)యందు వర్ణించబడినది మరియు నిప్పుడుకూడా చెప్పబడినది. ఈ అచేతనముయొక్క కారణము దుర్బలముగాని లేక జ్ఞానశక్తి యొక్క తీక్ష్ణత్వముగాని అయియుండును.

## ఇందు భేదములు.

(4) ఇది అచేతనములోనిది మరియు సాధారణ దుష్టప్రకృతివలన ముందుయుండునట్టి ఆత్మచేష్టలు యుండజాలవు. ఈ కారణమువలన హృదయమునందు తొందర అధికమగును. కారణము లఘుత్వమొందినచో ఆత్మనుత్పన్నమగుటకు విశేషత్వము కలుగజాలదు. కాబట్టి తొందర వుత్పన్నమగుచున్నది. దీనివలన మిక్కిలి అచేతనము వృద్ధియగును. మరియు ప్రాణవాయువు (జీవుడు) వుత్పన్నమగుటలో గొప్ప విపత్తు సంభవించినచో రోగి మృతినొందును.

మరియొక అచేతనముకలదు. అనగా బరీది అనునరముయొక్క మార్గమునందు సుద్దా కలుగుటవలన వుత్పన్నమగుచున్నది. ఈనరము అటుఇటు నడుచునట్టియు చేర్చునట్టియు ఆవిరియొక్క పరమాణువులు వెడలించుటకై హృదయము వూపిరితిత్తుల మధ్యమునందు సంబంధము కలిగియున్నది. ఈనరముయొక్క మార్గము బాధించుటవలన అచేతనము వుత్పన్నమగును. అనగా వాయువు ప్రవేశించకపోవుట ఆవిరి పరమాణువులు వెడలకుండుట ఆత్మవృష్ణము నిలిచిపోవుట మొదలగు కారణములు కలుగుచున్నవి. ఈనరమును బరీది యొందువలన చెప్పబడునది గా అవరదా యను యకృత్ యొక్క నరమువలె పొరకలిగియున్నది. ఇది యితర నరములకంటె విరుద్ధముగానుండును. మరియు యిది రెండు పొరలు కలిగియుండును.

మరియొక విధమగు అచేతనము కలదు. నిది అబిహార్ మార్గము బంధించుటవలన వుత్పన్నమగుచున్నది. అబహార్ అనగా ఒకనరము యీనరము యకృత్ ద్వారా ఆత్మసర్వశరీరమునందు ప్రవేశించుచున్నది. దీని కారణముకూడా ప్రకటనమగును.

చెప్పబడియె ఈరోగము ఇతర అంగముల సంయోగములవలన వుత్పన్న మగును అందుండి యేదైనను మెదడుయొక్క సంయోగమువలన కలుగు చున్నది కొన్నియకృత్ యొక్క సంయోగమువలన కలుగుచున్నవి కొన్ని ఆమాశయముయొక్క సంయోగము వలన కొన్ని పేగులు గర్భ స్థానము పొరలు వూపిరిత్తులు మొదలగు అవయవముల సంయోగము వలన కలుగుచున్నవి మరికొన్ని సర్వశరీర సంయోగమువలన కలుగు చుండును.

మరియు, అచేతనము సర్వశరీరముయొక్క సంయోగమువలన వుత్పన్నమగుచున్నదని గ్రహించవలెను. సర్వశరీర సంయోగమువలన కలుగు అచేతనము తపెముహ్రకా (పిత్తజ్వరము) మొదలగు వాని యందు దడ అచేతనము కలుగుచున్నది.

మరియు, అచేతనము మెదడు యొక్క సంయోగమువలన వుత్పన్నమైనదో దీనిదశవలన మెదడు దుర్బలమగును మెదడుయొక్క దుర్బలత్వము వలన దీనియందుండు జీవనరము రొమ్ముమూలమునందు శ్వాస నడుచునట్టి సంయోగ అంగమునందు కలిసియుండును. నిది దుర్బలము నొందునుగాన శ్వాస తన నిజదశానుసారముగా రాజాలదు. మరియు పరిశుభ్రమగు వాయువు (గాలి) చక్కగా మెదమునందు ప్రవేశించ జాలదు. మరియు, లోపలి ఆవిరి హృదయమునందుండి అధికమై బైటికి వెడలజాలదు. ఈకారణమువలన హృదయముయొక్క దుష్టప్రకృతివలన దడ అచేతనము వుత్పన్నమగును.

మరియు, అచేతనము యకృత్ యొక్క సంయోగమువలన వుత్పన్నమగును నిది అయిదు విధములుగానుండును. (1) యకృత్ దుర్బల మగును గాన హృదయమునకు భోజనముయొక్క సారము విశేషముగా చేరజాలదు.

(2) గుండెయందు రక్తదోషమువలన వావుసంభవించును ఈ కారణమువలన వాతముయొక్క నీచభోజనము మెదను హృదయము

నందు ప్రవేశించినచో దడ చెడుఆలోచనలు అచేతనము మొదలగు లక్షణములు కలిగించును.

(3) జిగర్(యకృత్)యందు కఫసంబంధమగు రక్తము వుత్పన్న మగును. మరియూ, కఫము వుట్టించునట్టి భోజనము మెదడునందున్న హృదయమునందున్న నివ త్తికలిగించును.

(4) యకృత్‌నందు వుష్ణమువలె నల్లని రుధిరము ఉత్పన్నమై హృదయమునందు ప్రవేశించును ఈకారణమువలన దుష్టప్రకృతి వుత్పన్నమగును.

(5) యకృత్‌యందు ఉష్ణము జలుబువలన వాపు వుత్పన్నమగును ఈకారణమువలన లోపలిఅంగముల యొావత్తుభాగములందు అనగా ఝిల్లిపొరలు ఎచ్చటెచ్చట ఒకటికొకటి కలిసికొనియున్నవో ఆపొరలయందు వాపుకలుగును అనగా హృదయముయొక్క ఝిల్లియందు కష్టము సంభవించును.

మరియూ, అచేతనము ఆమాశయముఖమునందు వుత్పన్నమగును నిది మూడువిధములుగానుండును.

(1) ఆమాశయమునందు నీచదోషము వుత్పన్నమగును మరియు ఆమాశయము హృదయమునకు నమీాపమగుటవలన హృదయమునందు కష్టము సంభవించును గనుక దడ అచేతనము కలుగుచున్నది.

(2) ఏదైన గొప్పదోషము కదలుటవలన అనగా వమనము వెడలనారంభించినచు దడ అచేతనము వుత్పన్నమగును.

(3) ఆమాశయమునందు నొప్పికలిగి ఆమాశయము హృదయమునకు నమీాపమునందుండుటవలన హృదయమునందుకూడానొప్పి ప్రవేశించును కథాచిత్ రోగిమృతినొందును.

లాభము:—విరుద్ధ దోషములుగల భోజనపదార్థములు భుజించుటవలన ఆమాశయమునందు వాతము వుత్పన్నము చేయునట్టి దిక్కని శీతజదోషములను ఘనీభవించి ఆమాశయముయొక్క ముఖమునందు

మునగల దగుటు గాన దానిసారము మొదడు గ్రహించకుండిన వ్రవితమ గుపగాని బహుశా ఆవిరియొక్క పరమాణువులు మొదడునందు చేరుటు మరియు, హృదయమునందు చేరుటవలన దడ అచేతనము కలిగించును ఆటుపిమ్మట ఈదశయందు మొదడునందు ఏవిధమగు విపత్తి కలుగకుం డును. మరియు, హృదయదడ అచేతనములయొక్క కారణములు చెప్ప బడియున్నవి గాన తెలియవలెను.

ఇప్పుడు పైనవర్ణించిన కారణము లక్షణములు చెప్పబడుచున్నవి ఎటులననగా ఇందుండి దేనిచిహ్నములు సాధారణముగానుండు నో దేనిలక్షణములు ముఖ్యమైనవో వాటియొక్క ప్రత్యేకభేదములను వేరువేరుగా వర్ణించబడుచున్నవి వీటియొక్క సంపూర్ణచిహ్నములు సమస్తవిధములగు అచేతనముయందు ప్రకటనమగునుఅనగా అచేతనము (స్మృతిలేకపోవుట) యొక్క దశయందు శరీరము వచ్చగానుండుట కాళ్లు చేతులు చల్లగానుండుట శ్వాసకిష్టముగా వెడలుట దుర్బలత్వము నాడి చిన్నదిగను దుర్బలముగానడుచుట ఒకప్పుడు సర్వాంగములు కూడా చల్లగానుండుట మొదలగులక్షణములుకలిగియుండును. మరియు అచేతనము అధికమైనచో నేత్రములు మూసికొని యుండుట స్మృతి దప్పుట రోగి సక్తా (సన్యాసము) అను వ్యాధిగలరోగివలె నుండుట ఈ మొదలగు లక్షణములు కలిగియుండును. మరియు, మూర్ఛవలన అచే తనుడగు రోగిని పిలిచినచో గ్రహించగలుగునుగాని తిరిగి జవాబు చెప్ప జాలడు మాటగ్రహించగలడు అనగా దూరమునుండి వచ్చిన శబ్దము వలెవినబడును ఆశబ్దము సరిగా అర్థముకాకుండును. మరియు, కారణము బలమును అథవా దుర్బలములనుబట్టి గ్రహించుట శబ్దములను పరి శీలించుటయందు న్యూనత అధికమగుచుండును.

మరియు, సక్తా (సన్యాసము) గలరోగి మూర్ఛరోగికి విరుద్ధము గానుండును అనగా సక్తావ్యాధి రోగిని ఎంత పిలిచినను వానికి తెలియ కుండును మూర్ఛరోగి సుభాత్ రోగ భేదము సుబాత్ అనగా (అచేతన

నిదుర) యందు వర్ణించియుంటిమి ముఖ్యమగు చిహ్నములు వీటినుండి గ్రహించగలరు ఏకారణమువలన కలిగినదిన్ని ఇచ్చట విస్తారముగా కారణముకంటె మూంసు కలుగుటవలన తెలియబడుచున్నది. ఇచ్చట కూడా వర్ణించబడుచున్నది ఈరోగికి అచేతనముయొక్క కారణము మలము నిండుటవలన కలిగినయెడల నరములు అణగియుండును. నాడి బలముగలదైయుండును గాని మలమునిండియుండు కారణమువలన గురుత్వము చెమ్మకలుగును.

మరియు, ఈరోగికి ఆత్మవెడలి పోవుటవలన మూర్ఛవ్యాధి కలిగినచో నాడి దుర్బలముగను సూక్ష్మముగను నీరసముగానుండును.

మరియు, బరీది అథవా అబహార్ అను నరములు బంధించుట వలన మూర్ఛకలిగిన యెడల విశేష మూర్ఛకలిగించు కారణములలో నుండి ఏకారణము ప్రకటనముకాజాలదు, అనగా ఆమాశయముయొక్క దుర్బలమువలన గర్భము పతనమగుటవలన ఉత్పన్నమగుచున్నది. హాకీం బుఖరాత్ గారు వచించిన దేమనగా మనుజునికి మిక్కిలి అచేతనము ఆరంభమై ఏకారణము ప్రత్యక్షముగా కనుపించకుండినచో అగస్మాత్తుగా మృతినొందును.

మరియు ప్రత్యక్షకారణమేమనగా హృదయముయొక్క శక్తి దుర్బలమగుట స్నానసమయమునందు అధికముగానుండుట, లేక ఆమాశయముయొక్క దుర్బలగతి నిరన్నముఖ (పరగడుపు)మునందు ఆమాశయమునందు పిత్తము ప్రవేశించి కష్టమును కలిగించును. ఇట్టిదశయందు స్నానముచేసినయెడల దీనిసంయోగమువలన హృదయమునకు కష్టము సంభవించును, లేక హృదయముయొక్క జ్ఞానశక్తి బలముగలదైనచో కొద్దికష్టము సంప్రాప్తమగును. మరియు అప్పటి ప్రత్యక్షకారణములనుండి యేకారణము కలుగకుండును. మరియు మూర్ఛఅధికముగా వుత్పన్నమైనచో బరీదిగాని లేక అబహార్నరముయొక్క మార్గము మలము మొదలగువానితో బంధించబడునని గ్రహించవలెన్ను దీనినిసుద్దా

అందురు. మరియు అచేతనము పలుమార్లు కలుగుచుండినచో నిది ఆ రోగ్యమొందుట కష్టసాధ్యమగును. మరియు రోగియొక్క హృదయశక్తి బలముగా నుండి యీవ్యాధి వుత్పన్నమైనచో నిది కారణములేకనే వుత్పన్నమగుచున్నది. గాన తీక్ష్ణచికిత్సచేయకనే తగ్గిపోవును. మరియు యీవ్యాధి వెంటనే కలిగికనుపించుచు వెంటనే కనుపించకుండిన యీ వ్యాధి వెంటనే నశించును. బహుళ అచేతనము స్వల్పముగా కనుపించును. ఇట్టిరోగికి సంయోగకారణమువలన గాని లేక మరియొక కారణమువలనగాని కలిగినట్టివాని వర్ణనము విస్తారపూర్వకముగా వర్ణించబడియె. అటుల వర్ణించబడిన విధముగా కలిగినయెడల కారణము ముందు కలుగుట ఆయాచిహ్నములు ప్రత్యేకముగా చెప్పబడియె. మరియు ప్రత్యేకముగా ఆయాస్థానములయందు వర్ణించబడియె. ఆలక్షణములు సాక్షియగును. మరియు దడయొక్క అధ్యాయము వలన బహుదా ప్రయోజనము తెలియగలదు.

లాభము:—అచేతనము నొందినదశయందు యేరోగిముఖము ఆకువచ్చరంగు కలిగియుండిన తల, మెడ, ముందుకు యీడ్వబడి తల యెత్తజాలకుండునో ఆట్టిరోగి తక్షణమే మృతినొందును. అభిప్రాయమేమనగా అధిక అచేతనమునకు చికిత్సలేదు.

(సూచనీయము) విరోచనమునకు యిచ్చినపిమ్మట రక్తమోక్షణముచేయించి పిమ్మట వ్రణము, గాయము, మొదలగునవి జరిగించి తదుపరి అచేతనము కలుగుటకుముందు యేచిహ్నములైనను కనుపించినచో వెంటనే నివారించుటకు వుపాయములను చేయవలెను. మరియు అచేతనము నెమ్మదిగా వుత్పన్నమైనయెడల నిది ఆరంభించుటకు నిధానమేమనగా ప్రారంభమునందు నాడి చిన్నదగును. శరీరరంగు మారుచుండును. నేత్రములయందు దౌర్బల్యము సంభవించును. నేత్రములయెదుట నల్లని తుమ్మెదలవలె దోమలవలె యెగురుచుండునటులగాని లేకయేదో ఒకవస్తువు ఎగురుచుండునటుల కనుపించును చల్లని చెమట పట్టుచుం

డును. కాళ్ళు చేతులు చల్లనగును. తిరిగి హెచ్చుచుండిన చిహ్నము లు బలముగలవగును. అనగా అచేతనము సంభవించును. ఇట్లు కారణ ములు బలము దుర్బలముగానుండును. అటులనే అచేతనముకూడా బల ముగానుండినచో అచేతనము అధికమగును. కారణము తక్కువగానుం డిన అచేతనము తక్కువగా నుండునని భావము. మరియు రోగికి అచేతనము వకుముందు వాంతిగాని కడుపులో కెళ్ళుటగాని కనుపించిన యెడల యీరోగము ఆమాశయమునుండి కలిగినదని గ్రహించవలెను. యిది చికిత్సవలన సాధ్యమగునని తెలిసికొనవలెను.

మరియు సంయోగఅంగముల కారణములు చిహ్నములు ముం దుదశయొక్క కారణమునుండి యేమియు కలుగకుండిన యీరోగకార ణము హృదయమునుండి లేచుచున్నదని గ్రహించవలెను. ఇట్టిరోగి తక్షణమే మృతినొందును.

మరియు రక్తమోక్షణము చేయుటవలన అచేతనుడైనయెడల రక్తము విశేషముగా వెడలకుండినను శిరావేదనము అభ్యాసమైనను యె వ్వడు అచేతనుడు కాకుండినను అట్టివానిశరీరమునందు వ్యాధి గలదని గ్రహించవలెను. ఇట్టిరోగి ఆమాశయము దుర్బలముగా నుండును. మరికొందరికి శిరావేదనముచేయుటకు అభ్యాసములేకయు రక్తమోక్షణ ము చేయుటకు యిష్టముగా నుండలేనట్టివారికి శిరావేదనము చేయుటవ లన అచేతనము కలుగుచున్నది. ఇట్లు కలిగిన అచేతనమువలన భయ ము నొందనవసరములేదు. ఎందుకనగా స్వభావికములేకుండుటవలన భయమువలన అచేతనము కలుగుచున్నది.

ముఖ్యముగా గ్రహించవలసిన దేమనగా ఆమాశయము బల ముగానుండును. శరీరమునందు దోషము విస్తారముగానుండును. గాని రక్తగతివలన భ్రాంతిగలుగును. గాన అచేతనము వుత్పన్నమగును. ఇం దువలన పరీక్షింపబడినదేమనగా ఎవరికి శిరావేదనముయొక్క ఆరంభ మునందు అచేతనము కలుగుచుండినను అట్టివానికి శిరావేదనము అభ్యా

సహాయ్యము చేయువలెను ప్రకృతియొక్క అనుకూలమగు హేతువు వివి రీతమగు ఔషధములను వాసనచూడవలెను. ఇట్టి ఔషధములను గొంతులో పోయవలెను అనగా మూర్ఛరోగి ప్రకృతి వుష్ణమైనచో కర్పూరము చందనము, పన్నీరు, దోసకాయ, పందిరిదోసకాయ యీ వస్తువులను మంచుగడ్డతో చల్లార్చి అందుకొంచెము కస్తూరికలిపి రోగికి వాసన చూపవలెను దీనివలన కస్తూరి ప్రకృతి వుష్ణమునకు సహాయ్య ముచేయును కర్పూరము చందనము పన్నీరు మొదలగునవి పైవుష్ణము జ్వరమును తగ్గించును. మరియు, పన్నీరు పై విధముగా చల్లార్చి గొంతు లో పోయవలెను. మరియు, రోమ్ము ముఖముపై విశేషముగా పన్నీరు చల్లవలెను చల్లని నీళ్ళయందు పలచని సారాయి కొద్దిగాగాని మాంసరస ముగాని కలిపి గొంతులోపోయవలెను ముఖముపై చల్లని నీళ్ళు చిలకరిం చుట మిక్కిలి మంచిది బహుశా చైతన్యుడైన వెనుక చందనపు దుస్తు లను ధరించుట వుచితమగు. పదార్థములు భుజించుట పెరుగుపై తేట పానముచేయుట యీ మొదలగునవి లాభదాయకములు.

మరియు అచేతనముగల రోగి చల్లనిప్రకృతిగలవాడైనయెడల కస్తూరి, అంబరు, రేహాక, మరియు భోజనములయందు సుగంధితవస్తు వులు అనగా యేలకులు, లవంగములు, దాల్చినిచెక్క, కుంకుమపువ్వ యీవస్తువులతో సమానమగు సుగంధవస్తువులు అఘ్రాణించునటుల చేయవలెను. మరియు దివాల్ముస్కు 2 రతులు కస్తూరి సారాయియం దుకలిపి కాచి గొంతులోపోయవలెను. మరియు ఆమాశయముయొక్క ముఖముపై నార్దైన్తైలము, మస్తకితైలముచు మర్ధించవలెను. కథా చిత్ అచేతనుడైనట్టి మనుజుడు యేకారణమువలననైనను వువవాస ముండినను లేక వరగడువుగాయుండినయెడల అట్టిరోగికి సారాయియివ్వ జనదు. ఎందుకనగా రిక్తగర్భమునందు సారాయిచేరినయెడల పీకు బిగిం పు అదరు మొదలగునవి కలిగించును. కాబట్టి యిట్లు కలిగినచో దీని చికిత్స సుగంధభోజనద్రవ్యముల సుగంధమువలన గాని కొద్దిగా మాం సరసముతోగాని చేయవలెను.

మరియు విశేషముగా విరోచనములగుటవలన అచేతనమూర్ఛలు గుటకు కారణమగును. లేక మరియే రోగకారణమువలనగాని జలుబు ప్రవేశించును. అనగా శిరావేదనము చేయుటవలనగాని లేక గాయము వలన విశేషముగా రక్తము వెడలుట లేక స్త్రీదినమువో చల్లనినీళ్ళు, పన్నీరు, మొదలగు శీతలద్రవ్యములు రోగముఖముపై చల్లకూడదు. ఎండిన మాంసము వేయించినకోడిమాంసము గంధము మొదలగునవి అగ్నిపై వేసిగాని గోధుమరొట్టె గంధముగాని రోగికి వాసనచూపించవలెను. మరియు వృక్షతైలములను ఆమాశయముపై మర్దించవలెను. మాంసరసమునందు వలచని సారాయికొద్దిగా కలిపి గొంతులో పోయవలెను ఇది వేగముగా మాంసరసము శరీరము యావత్తు ప్రవహింపజేయును. ఆత్మకు సహాయమగును.

మరియు విసూచి (కలరా) అనంతరమందు అచేతనము కలిగినచో కొద్దిగా సుక్, కస్తూరి, బేదానాకాయరసమునందు కలిపి గొంతులో పోయవలెను. రోగిచైతన్యతనొందినచో మాంసరసమును కొద్దిగా యివ్వవలెను. నౌసాపురి మట్టికర్పూరమునందు చేర్చి నోటిలోనుంచుట అతివుత్తమము.

మరియు విశేషముగా చెమట వెడలుటవలన అచేతనముత్పన్నమగును. ఇట్టితరి రోగియొక్క కాళ్ళు, చేతులు, పన్నీరుతోనున్న చల్లని నీళ్ళతో మర్దించవలెను. మరియు బాగడఆకులు యెండించి చూర్ణము చేసి వస్త్రగాలిత మొనర్చి మాదికాయచూర్ణము కలిపి శరీరముపై చల్లవలెను. దీనివలన చెమటనిలిచిపోవును. మరియు బేదానాకాయరసము మాంసరసములతో శక్తికి బలము కలిగించవలెను. మరియు స్పృహ లేనప్పుడు యెక్కిళ్ళు, కళ్ళుట మొదలగునవి కనుపించినను లేక అంతకుపూర్వము యెక్కిళ్ళు మొదలగునవి కలిగినను భోజనసుగంధములనుపయోగించకూడదు. గాని వమనము చేయించుటకు ప్రయత్నము చేయవలెను అనగా కోడిఈక (వెంట్రుకను) రోగియొక్క నోటిలోనుం

—ఫలూనియా మాజూన్ చేయు విధానము.

అక్కలకర్ర తామ్రశిఖ. జటామాంశి ఈవస్తువులు 3కి మాష ములు, కుంకుమపువ్వు 17కి మాషములు గంజాయివిత్తులు తెల్లవి 70 మాషములు ఈవస్తువులు చూర్ణించి వస్త్రగాలితమొనరించి తేనె అవ శ్యకతానుకూలముగా కల్పుకొని మాజూన్ చేయవలెను. యీ ఔష ధము బలముగలవానికి ఒక రేగుకాయ ప్రమాణముగను దుర్బలులకు కుంకుడుగింజప్రమాణముగను బాలురకు శెనగగింజప్రమాణముగా వుపయోగించవలెను

లాభము :- అచేతనముయొక్క సమస్తభేదములలో చెముటవిస్తా రముగా వెడలుటవలన కలుగునట్టి అచేతనమునందు వాంతిచేయించుట వలన హాని సంభవించును. మరియు, చేతులు కాళ్ళు మర్దించుట వుష్ణ ముగానుంచుట ఆమాశయముయొక్క ముఖముపై వుష్ణతైలములను మర్దించుట గొప్పధ్వనులవలన భయపెట్టుట యీ మొదలగునవి చేయ కూడదు మరియు, అచేతనదశయందు జలుబుపదార్థములను భుజించుట చల్లనిసర్బతులు పానము చేయుట వలన లోఅంగములయందు నొప్పి తటస్థించినచో ఫలాఫలిగాని దీనికి సమానమగు ఔషధమునుగాని ఉపయోగించవలెను

—ఫలాఫలి అను ఔషధముచేయువిధి—

నల్లమిరియాలు, తెల్లమిరియాలు, పిప్పళ్లు ప్రత్యేకము 70 మాషములు ఊదెబలసాన్ 35 మాషములు, జటామాంసి, తులసి 14 మాషములు శొంఠి, అజామోదము, శీశియాలయూన్ (యింగువ యిత్తులు) ముద్దువంగవట్టి, అసారున్, రాసన్ (సౌసన్ వేరు) ప్రత్యే కము 3కి మాషములు యీవస్తువులను చూర్ణించి వస్త్రగాలిత మొన రించి దీనికి మూడింతలు తేనెయందుకలిపి మాజూన్ చేయవలెను. యీ మాజూన్ మూడున్నర మాషములు వుష్ణోదకముతో వుపయో గించవలెను.

ఆమాశయముయొక్క దుర్బలత్వమువలన గాని లేక పిత్తాదిక్ష్య ములవలనగాని శిరావేదనమునందుగాని లేక శిరావేదనమునకు పిమ్మట గాని అచేతనము కలిగినచో శిరావేదనము చేయుటకు పూర్వము ఆమాశయమునకు బలముకలిగించునట్టి షర్బతులు నిచ్చుటయు పిత్తము యొక్క తీక్ష్ణత్వము అణచునట్టి షర్బతులు వుపయోగమగును. అనగా దానిమ్మగింజల షర్బతు సోపు రుబ్బు, నిమ్మకాయరుబ్బు మొదలగు నవి యుపయోగించవచ్చును.

గర్భస్థానము దుర్బలమగుటవలన అచేతనముకలిగినచో అత్తరు సువాసన చూపించకూడదు. మరియు, దీనికి యోగ్యమగు వుపాయ ములు ప్రయోగించవలెను అనగా ఆమాశయములకు హితకరములగు వస్తువులయొక్క గంధమును వాసనచూపించవలెను అనగా వల్లేరు, వెల్లుల్లి, ఇంగువ, మరియు, దీనిని గర్భస్థానము కృశించుచున్నట్టి వర్ణన మునందు వేరు వేరుగా చెప్పబడును రోగికి లోభాగమునందు వాపుకలిగిన యెడల వాపుయొక్క భారమువలన అచేతనము వుత్పన్న మైన యెడల జ్వరముకలుగుట యోగ్యమగును అట్టి స్థితియందు కాళ్లు చేతులు దృఢముగా బంధించవలెను వుష్ణకర వస్తువులతో కావడము చేయవలెను. దీనివలన మలములోభాగమునుండి బైటికి వెడలివచ్చును రోగిని పరుండనీయకూడదు. ఎందుకనగా శరీరముయొక్క వుష్ణము లోభాగమునకు ఆరూఢమగుచుండును ఈకారణమువలన మలముకూడా లోభాగమునకు చేరుచుండును గాన వాపు నొప్పిని అధికపరచును కాబట్టి అచేతనము వుత్పన్నమగును.

మరియు, తపెముహ్రక్కా గాని మరియొక జ్వరము అచేతనము నకు కారణమైనచో చైతన్యుడు (స్ప్రిహ) గా చేయుటకు గొప్ప వాక్య ము తెలియబడుచున్నది. మరియు, జ్వరముయొక్క అధ్యాయమునందు కూడా హామ్మామియగసియా (నిది జ్వరవేగరమునందు అచేతనము కలి గించును) యొక్క వర్ణనము వేరు అధ్యాయమునందు చెప్పబడును గాన చదువరులు అచ్చట గ్రహించగలరు.

మరియు అచేతనము హృదయముయొక్క వాపువలనగాని లేక హృదయముయొక్క రెండుచెవుల వాపువలన అతిరిక్తముగా వుత్పన్నమైనచో దీనివర్ణనము వేరుప్రకరణమునందు చెప్పబడును. అభిప్రాయమేమనగా చైతన్యము కలుగునట్టి వుపాయముల వర్ణనము చెప్పబడియె కాబట్టి అచేతనసమయము తప్పిపోయినయెడల కారణమును గ్రహించి చికిత్సచేయుటకు యెటుల యోగ్యముగానుండునో అటుల చేయవలెను. ఉ. అనగా శిరావేదనమునందున్ను వాంతియందున్ను రక్తమోక్షణమును అవునట్టి వుపాయములు చేయవలెను, మరియు మలమునిండుటవలన అచేతనము కలిగినచో మలమును వెడలించునట్టి వుపాయములు చేయవలెను.

మరియు దుష్టప్రకృతియందు అచేతనము కలిగినచో ప్రకృతి నిజదశయందు మారునట్టి వుపాయములను చేయవలెను.

(సూచనీయము) ముఖముపై చల్లని నీళ్లుచల్లుటవలన వెంటనే చైతన్యుడగుటకు కారణమేమనగా చల్లదనముయొక్క కష్టమువలన శరీరము చైతన్యతనొందును. మరియు ఆత్మ రక్తముయొక్క శరీర అధీనమునుండి బైటిపైపుకు ఆరూఢమగుచున్నది. ఈకారణమువలన అచ్చట వృష్ణము ఖనీభవించుచున్నది మరియు యింద్రియములయందు శక్తి ప్రవేశించుచున్నది. గాన యీకారణములనుబట్టి వైద్యవరులు నీళ్ళను ముఖముపై పోయుటకు స్థిరపరచిరి. రొమ్ముపైని అనగా రొమ్ము వృష్ణస్థానము, హృదయము, రొమ్మునకు సమీపమునందున్నది. కాబట్టి యింద్రియములమలము అచ్చట విశేషముగా యుండును. ఎటులననగా రొమ్ము మెదడునకు సమీపమునందున్నది. గాన సూక్ష్మకార్యములు విశేషఅంగములకంటె రొమ్మునందు విశేషముగాకనుపించుచున్నది. ఇటులనే నాసికము, ముఖము, గాలి, పీల్చునట్టి మార్గములు యివి ముఖమునందున్నవి. గనుక చైతన్యముయొక్క కారణముల మార్గములగుటవలన వర్ణించబడియెనని తెలిసికొనవలెను. అట్టిస్థితియందు వృష్ణము తననిజ

దశయందు ఆరూఢమగును. మరియు యీరోగి శరీరమునందు మిక్కిలి స్వల్పముగానుండునట్టి ఉష్ణము నష్టమొందినచో అట్టిసమయమునందు చల్లనినీళ్లు శరీరముపై చల్లుట లాభదాయకమగును. అనగా ప్రకృతి నష్టమొందించునట్టి ఔషధములతో సంతుష్టమొందించవలెను. మరియు రోమాంచములను మంధముచేయునట్టి కారణమువలన ఆత్మనష్టమొందకుండునటుల కాపాడుచుండును, మరియు హృదయమునందు ప్రవేశించి ఆక్రమించి ఘనీభవించును.

లాభము:—ఈరోగప్రకరణములయందు వ్రాయబడిన లక్షణములు పూర్వరూపములు చికిత్సమొదలగునవి జాగ్రత్తతో గమనించవలెను. ఇందువిషయమై జాగరూకతతో యుండవలెనని ఆరూఢమగుచున్నది. మరియు హృదయము సమస్తఅంగములలో శ్రేష్టమైనది. కాబట్టి హృదయముయొక్క రోగచికిత్సయందు సావధానుడై యుండవలెను,

మరియు మలము వెడలించుటయందున్ను ప్రకృతినిజదశయందు మార్చుటయందున్ను సావధానుడై యుండవలెను. అనగా ప్రకృతి నిజదశయందు మార్చునట్టి ఔషధముల నుపయోగించవలెను. మలమును వెడలించునట్టి ఔషధము నుపయోగపరచవలెను. మరియు మశ్వతుల నుపయోగించవలెను. ఆత్మయొక్క శక్తి హృదయముతో సంబంధము కలిగియుండును. అట్టిస్థితియందు చలువ కలిగించవలసిన అవశ్యమైనచో గొప్పపరిశ్రమ చేయకూడదు. ఎందుకనగా హృదయము ఆత్మయొక్క స్థానము. మరియు ఆత్మఉష్ణస్వభావికము కలది. కాబట్టి శీతోపచారములు విశేషముగా చేయుటవలన గొప్పహాని సంభవించును అనగా మిక్కిలి చలువ కలిగించుటవలన ఆత్మచల్లబడును అనగా బాహ్యకష్టముయొక్క కారణమువలన హృదయమునందు ప్రవేశించును గాన ఆత్మయందు కొరంతసంభవించును. ఈకారణమువలన కర్పూరపుమాత్రలు పూర్వపు వైద్యవరులు హృదయసంబంధమగు నష్టప్రకృతియందు వ్రాసియున్నారు ఈమాత్రలయందు

కుంకుమపువ్వు చేర్చక ఉపయోగించకూడదు. మరియు, నాలమును బలపరుచుటకై నియమించు ఔషధములయందు గోరోచనము చేర్చక ఇవ్వజనదు లేక గోరోచనకు సమానమగు గుణములుగల మరియేవస్తువైనను చేర్చి వాడవలెను ఎందుకనగా పరాత్పరుడు శరీరమును శరీర ఆరోగ్యమును రక్షించుకొరకు నియమించియున్నాడు. మరియు మిక్కిలి చాతుర్యముగా నియమితకాలమునందు శరీరమునందు దీని గుణము కలిగించుటకు ఆజ్ఞాపించియున్నాడు. కుంకుమపువ్వు మాత్రలు అట్టిస్థితియందు ఉపయోగించినచో శరీరము కుంకుమపువ్వుయొక్క శక్తిని ఔషధమునుండి వేరుపరచి ఆత్మయందు ప్రవేశించును గాని దీనివలన ఆత్మయందు ప్రకాశము శక్తికలుగుచున్నది. మరియు, కర్పూరము మొదలగు ఇతర ఔషధముల శక్తిని ముఖ్యముగా హృదయమునందు ప్రవేశింపజేయుచున్నది. గాన హృదయముయొక్క ఉష్ణము ప్రకృతియందు సమానముగానుండును కాబట్టి ఈ ఉపాయములు శరీరశక్తియందు నిర్భరమగును అనగా శరీరము బలముగానుండినచో ఏ చికిత్స అయినను నిష్ప్రయోజనమగును. మరియు, ఇటులనే కుంకుమపువ్వును హృదయసంబంధమగు చల్లని ఔషధమునందు చేర్చుట మిక్కిలిలాభదాయకము అనగా కుంకుమపువ్వుయొక్క శక్తి చల్లని ఔషధముయొక్క శక్తిని హృదయమునందు ప్రవేశింపజేయుచున్నది. కాబట్టి చల్లని ఔషధము స్వయముగా ప్రవేశింపజాలదు. మరియు, హృదయమునకు మేలుచేయునట్టి ఔషధములనేకములుగలవు అందుండి ఈక్రింద వర్ణించబడిన ఔషధములు ముఖ్యమైనవి ఈ ఔషధములు ఉష్ణముగాక, శీతముగాక సమత్వముగానుండును గాన వానిని వర్ణించుచున్నాను.

కెంపులు ఫేరోజా, స్వర్ణము, రజతము, గౌజుబాన్ ఈవస్తువులు సమత్వముగలవి. దరూనంజ్ అకరబి, నిర్విషము, కస్తూరి, అంబరు, జరావంద్ (కచూరము) వట్టుకాయలు బహామనెసురఖ్, బహామనెసు పేద్ లవంగములు, వచ్చిపాంబాళ్ళి, బాదరంజబోయా, బాదరంజబోయా విత్తులు, తులసి, తులసివిత్తులు, నిమ్మఆకులు, నిమ్మకాయ బెరడు, ఏతరజ్, రాస్న, ఈ మొదలగునవి చల్లని ఓషధులు. మరియు, మెంతులు, కహారోబా, పగడచూర్ణము, కర్పూరము, చందనము, తవాషీరి, గిలెమఖ్తూం (కావిరాయి) పుల్లని శేవు (యాఫిల్) ఎండుధనియాలు, పచ్చిధనియాలు ఈవస్తువులు చలువనుకలిగించును. మరియు, సంయోగముల వలన సౌఖ్యమును కలిగించునని యాఖూత్ (కెంపు) లాభదాయకమగును. మరియు, సౌఖ్యమును కలిగించునట్టి ఔషధములు దస్తూరవుల్ ఇలాజ్ అను గ్రంధమునందు వ్రాయబడియున్నవి. వానిలోనుండి ప్రకృతినిరక్షించునట్టి వానిని సమయానుకూలముగా ఉపయోగించవలెను.

## (1) యోగము.

నీలిరంగుగల తవాషీరీ, గౌజుబాన్, కాసినివిత్తులు, మొదలగునవి ప్రత్యేకము 10న్నర మాషములు పుళిగెకాయలు, ద్రాక్షపండ్లు, 52 మాషములు తెల్లచందనము, గులాబిపూలు, రంధ్రము వేయని ముత్యములు కహారోబా, పగడభస్మము, యివి ప్రత్యేకము 14 మాషములు కుంకుమపువ్వు 1న్నర మాషము మొండివర్తి 2¼ మాషములు శేవుమరబతు పటికిబెల్లముతో చేసినది అన్నివస్తువులకంటె రెండుభాగములు ఈవస్తువులను చూర్ణించవలసిన వస్తువులను చూర్ణించి నూరవల

సిన వస్తువులను నూరుకొని ప్రసిద్ధరీతిగా మాజూన్ చేసికొని యుంచు కొనవలెను.

(2) యోగము

బహామనెసురక్, బహామనెసుఫేద్, కచూరములు ఇవి ప్రత్యేకము 70 మాషములు దరూనంజ్అకరబి, బాదరంజబోయా, వూదె కింవార్సఫేద్ (కివారి అనగా ఒకగ్రామమునకు పేరు.అచ్చటి అగరు ప్రసిద్ధముగానుండును) 35 మాషములు, జరామాంసి, కుంకుమపువ్వు ఇవి ప్రత్యేకము 17½ మాషములు సుక్ (ఇది ఒక ఔషధము.)బంగారురేకులు 2¼ మాషములు ఈమొదలగు యావత్తు వస్తువులను దంచి చూర్ణించి వస్త్రగాలిత మొనరించి రెండుభాగములు తేనె చేర్చి చేయబడిన శేవుపర్బతునందు కలిసి మాజూన్ చేయవలెను.

(3) యోగము

జహర్ మోరా (ఆకుపచ్చగనుండురాయి) ఖతాయి మొగలి అరఖునందు అరుగదీసి వుచ్చుకొనవలెను. తరువాత శేవుమురబ్బా వెండి రేకు బంగారురేకులుచుట్టి వుచ్చుకొనవలెను తరువాత గాజుబాన్ శేవ తిపువ్వులు, వచ్చిపట్టు, ఇవి ప్రత్యేకము 7 మాషములు తెల్లచందనము 35 మాషములు బాదరంజబోయ ఆకులు 5½ మాషములు, సాధారణ వేద్ అరఖుయందునానవేసి వడియబోసి మొగలిఅరఖు, వుల్లదానిమ్మ పర్బతు తియ్యదానిమ్మపర్బతుచేర్చి పానముచేయవలెను. ఈ ఔషధములు వుష్ణప్రకృతిగలవానికి లాభదాయకములు.

(సూచనయేమి) పలము నిండియుండునట్టి కారణమువలన హృదయమునందు వ్యాధులు వుత్పన్నమగును ఆవ్యాధులలో బహుదా సుద్ద అను వ్యాధిపుట్టుచుండును యిది శ్వాస మార్గమును బంధించును. ఒకానొకసమయమునందు రెండవ అంగమునందు నీచ ఆవిరివరమాణువులు ప్రవేశించుచున్నవి గాన వీటివలన మార్గము బంధించబడిన యెడల కుడివైపు చెయ్యియొక్క బాసలీక్ అను శిరావేదనము చేయవలెను. మరియూ, ఆవిరి వరమాణువులవలన రోగము కలిగినదో ఎడమ చెయ్యియొక్క శిరావేదనచేయవలెను. అనగా ఎడమ చెయ్యియొక్క శిరను ఛేదించి రక్తమోక్షణము చేయవలెనని ప్రకటనమగుచున్నది.

గద్య, ఇది శ్రీమదిమాంబేగ్ సాహెబ్ పౌత్ర పచ్చాబేగ్ సాహేబ్ పుత్ర "వైద్యభూషణ" బిరుదావళీ విరాజమాన వైద్యవిద్యావిద్వజ్జన
విధేయ రహమతుల్లాబేగ్ నామధేయ ప్రణీతంబైన
"తిబ్బెఅక్బర్ షాహి" అను వైద్యగ్రంథమునందు
హృదయరోగములు సర్వము.
సంపూర్ణము.



[illegible]

బిస్మిల్లా హిర్రహ్మా నిర్రహీం.

# తిబ్బె అక్బరీ

[illegible] అధ్యాయము.

## స్తనరోగలక్షణములు



స్తనముయొక్క చిత్రపటము.




2–3 సామాన్య బహిర్భాగ్య వాహికలు
1–4 భిన్నవృత్తములు

స్త్రీలనగా మెసుజుడు యౌవ్వనవయస్సుగల వాడైనప్పుడు వాని స్తనములయందు బంధనమేర్పడునిది గాని పురుషులకు పుష్టాదిక్యమువలన స్తనముల ప్రకృతియొక్క యోగ్యత నష్టమొందును.

మరియు, స్త్రీలకు రజోసంబంధమగు మలముయొక్క విశేషత్వమువలన ఉష్ణముయొక్క న్యూనతవలన స్తనములయొక్క స్వభావికమునుబట్టి ప్రతిదినము పెరుగుచుండును ఎంతవరకనగా పాలు త్రాగునట్టి శిశువునకు అన్నపాన సౌకర్యము కలుగువరకు వృద్ధినొందుచునే యుండును. మరియు, రొమ్ముయొక్క ఉష్ణము ఆత్మకు సంతుష్టి నొందించునట్టి దగుచున్నది.

మరియు, పాలు, వీర్యము, రుధిరము, మొదలైనవి పోని వాని దశలయందు విరుద్ధముగానుండును గాని ఈమూడును ఉత్పన్నమగు

నట్టి కారణములు మాత్రము సమానముగానుండును ఎటులననగా పాలు, వీర్యము నిజములో రుధిరమునుండి కలుగుచున్నవి అయినను స్థానములనుబట్టి ఆయాస్థానములలో ఇట్టిస్వరూపముగా మారుచుండును మరియు, పాలయొక్క ప్రకృతియందు వైద్యులమతభేదమేనగా కొందరు ఉష్ణము, చెమ్మ, రక్తముతో సమానముగుననియు మరికొందరు జలుబు వలన రక్తము మారుచున్నదనియు కొందరు సమానముగా నుండుననియు వచించుచున్నారు. ఈఅధ్యాయమునందు ఏకప్రకరణములుగలవు.

### (1) పాలుతగ్గుటకు లక్షణములు.

అనేక కారణములుగలవు (1) రక్తము తగ్గుట, (2) రక్తాధిక్యము, (3) రక్తముచెడిపోవుట మొదలగు మూడు కారణములుగలవు ప్రత్యేకముగా ఈకారణములను వేరు వేరుగా వర్ణించబడును.

(1) రుధిరము తగ్గుటవలన పాలుతగ్గుటకు కారణమగును. అనగా పాలయొక్క మూలము వాస్తవములో రుధిరము కాబట్టి ఈరుధిరము తగ్గినకొలది, పాలుకూడా తగ్గిపోవును. మరియు, రుధిరము తగ్గుటకు అనేకకారణములు గలవు. (1) సిరావేదనమువలన విశేషరక్తము వెడలిపోవుట రజస్వల రక్తముగాని లేక నిఫాస్ (ప్రసవమైనప్పుడు వెడలు రక్తము) సమయమునందు రక్తము విశేషముగా వెడలిపోవుట (2)భోజనముతగ్గుట, (3) రక్తము స్వల్పముగా వృద్ధినొందునట్టి భోజనములు భుజించుట అనగా మిక్కిలి చల్లగను శుష్కభోజనములు భుజించుట (4) రోగము క్రోధము చింత [illegible] భయము విషయప్రకృతి రుధిరమును వృద్ధినొందకుండునటుల ఆటంకపరచుచుండును. (5) దుష్టప్రకృతి రక్తము వృద్ధియగుటలో ఆపివేయును. మరియు, ఈవిధమగు చిహ్నములు ఈకారణములకు ముందు కలుగుటవలన ప్రకటనమగుచున్నవి.

(1) భేదము పాలు తగ్గిపోవుటకు చికిత్స

పారంభమునందు కారణమును దూరపరచుటకై పరిశోధన చేయవలెను మరియు, రక్తము ఉత్పన్నమగునట్టి ఉత్తమభోజనపదార్థములను సేవించవలెను. మరియు, రక్తము వృద్ధినొందువస్తువులు పానము చేయవలెను. దీనితోనప్రకృతియొక్క కారణములను పరీక్షించుచుండవలెను. భోజనపానాదులవలన ప్రయోజనము ప్రాప్తించుపరకు ఔషధములపైవు ఆధారము కాకూడదు.

(2) రక్తాధిక్యతవలన పాలుతగ్గు లక్షణములు.

రక్తాధిక్యమువలన స్తన్యముతగ్గిపోవును, అనగా రక్తముశరీరమునందు విస్తారమై అందు యేవిధమైన హీనత్వము సంభవించకుండును. కాబట్టి శరీరము రక్తాధిక్యమువలన దానిని పచనము చేయజాలకుండును అనగా రక్తమును పాలుగామార్చజాలదని భావము. ఇట్టిస్థితియందు రక్తాధిక్యచిహ్నములు ప్రకటనమగును.

రక్తాధిక్యతవలన పాలుతగ్గుటకు చికిత్స

ఈరక్తాధిక్యమువలన కలుగు క్షీణస్తన్యముగల వానికి శిరావేధనముగావించి రక్తమోక్షణము చేయవలెను. రక్తమును తగ్గించునట్టి భోజనపదార్థముల నొసగవలెను. మరియు శరీరమునకు పుష్టి కలిగించవలెను. మరియు రక్తమును పెరచునట్టి వస్తువులు దాయములను వర్జించవలెను. ఇందువలన యితరబాధ కలుగకుండునటుల కాపాడవలెను. మరియు మిక్కిలి భయము, గొప్పచింత, లేక శిశువుపై ప్రేమతగ్గిపోవుట,గాని లేక మరియితరకారణములవలనగాని పాలుతగ్గుటకు కారణమగును. మరియు పాలు వుత్పత్తిచేయునట్టి ప్రకృతికి ఆటంకపరచు కారణములు తప్ప శరీరమునందు శ్రేష్టమగు రుధిరముండియు పాలు తగ్గిపోవును. దీనిచిహ్నములు రుధిరము తక్కువగా వుత్పన్నమగుట నీచమగు చిహ్నములలోనుండి యేచిహ్నము కలుగకుండుట మరియు రక్తాధిక్యకారణములు మాత్రము కలిగియుండుట మొదలగు లక్షణములు కలిగియుండును.

## రక్తాదిక్షయక్షీరనాశనచికిత్స

కారణమును దూరపరచి పుష్టికరములగు ననేక ఔషధములనుప యోగించవలెను. ఇట్లుచేయుటవలన ప్రకృతి క్షీరమును వృద్ధిచేయుట యందు ఆరూఢమగును.

స్తనములోభాగమునందు క్షీరమునుయేర్పరచు జీవకణములను చూపుచిత్రపటము



స్తనముల లోభాగమునందు రుధిరమును పక్వపరచి క్షీరముగా మార్చును రజోసంబంధమగు ఈరుధిరము గర్భాశయమునుండి గర్భోత్పత్తికాలమునందు కొంత గర్భస్థశిశువునకు ఆహారముగను కొంత స్తనములందు ప్రవేశించి క్షీరముగా మారును కట్టిస్థితియందు దోషములు అనగా వాత,పిత్త, శ్లేష్మములను ప్రవేశించి విషపూర్ణముగా మార్చును కాబట్టి అట్టిక్షీరమును పరిశోధనకు గురిచేయవలసిన పద్ధతులు క్రిందవివరించబడును

### 3 వ భే॥ దోషమువలన క్షీరము తగ్గిపోవు లక్షణములు.

రక్తము నీచత్వమొందుటవలన స్తన్యము స్వల్పముగా వృద్ధియగును. ఇది రెండువిధములుగా నుండును. (1) త్రిదోషములలో అనగా వాత, పిత్త, కఫ దోషములలోనుండి ఒకదోషము రక్తమునందు ప్రవేశించి రక్తమును చెరచివేయును. నీచరుధిరమువలన స్తన్యము మిక్కిలి స్వల్పముగా నుత్పన్నమగునని ప్రకటనమగుచున్నది.

(2) సాధారణ దుష్టప్రకృతి శరీరమునం దుత్పన్నమై రక్తమును చెరచివేయును. కేవలము రొమ్మునందు సంయోగమగుచుండును. తిరిగి రక్తము స్తనములయందు చేరకుండునటుల ఆటంకపరచును. అటుపైని శ్రేష్టమగును. మరియు దీనిని రెండుభేదములుగా చెప్పుచున్నాము. (1) ఆచెడురక్తవర్ణనమునందు చెప్పుచున్నాను. ఇది ద్విదోషాధిక్యమువలన కలుగుచున్నది. మరియు పిత్తాధిక్యముయొక్క చిహ్నములు పాలు వచ్చగను పలచగనుండును. గంధమునందు తీక్ష్ణత్వము మంటతోగూడి యుండును. మరియు కఫాధిక్యచిహ్నము లెవ్వియనగా పాలు మిక్కిలి తెల్లగను నిర్మలముగనుండుట మరియు రుచిగను పులుసువాసనకలిగి యుండుట, వాతాధిక్యలక్షణము లెవ్వియన పాలు మిక్కిలి చిక్కగను రంగు మలినవర్ణముకలిగియుండుట పాలుమిక్కిలి స్వల్పముగానుండుట మరియు శుష్కాధిక్యమువలన పాలు చిక్కగను తీగెవలె సాగుచుండును. ఈమొదలగునవి దోషహేతు స్తన్యలక్షణములని గ్రహించవలెను.

లాభము :—ఒకదోషమునందు పాలు పుల్లగానుండునని చెప్పియున్నాము. అనగా శ్లేష్మాధిక్యమునందు జలుబు విశేషముగానుండును. లేక కఫముతోకూడా పుష్టముకలిగినచో పాలు పువ్వగానుండును. లేక పుల్లగానుండును.

### దోషమువలన కలుగు క్షీరచికిత్స

దోషములలో యేదోషము విశేషముగానున్నదో ఆదోషము

ను హరించు నుపాయములను చేయవలెను. మరియు ఔషధములు భోజనములు దీనికి విరుద్ధమైనవి వుపయోగించవలెను.

పైత్యాధిక్యమునందు యవగంజి, జింక, మేకపిల్లలమాంసరసము ఆలుబకరా, దానిమ్మకాయ నిమ్మకాయవులును వుపయోగించవలెను.

మరియు కఫదశయందు సోపు గాజరువిత్తులుచేర్చిన మాంసరసము హరీరా (యవాగు) గోధుమపిండి కొద్దిగా మెంతులు నూనె తేనె చేర్చి రొట్టెచేసి భక్షించవలెను.

మరియు వాతదోషమునందు గోధుమలు, యవలు, సెనగలు, అంజూరపండ్లు, బాదంనూనెచేర్చి వండిన మాంసరసము పెద్దకోడిమాంసము, పాలుగలగొర్రె, పాలుగల మేకపొదుగు, మొదలగునవి లాభదాయకమగును.

మరియు యేస్త్రీయొక్క పాలు తీగెలుకట్టియుండునో అట్టిస్త్రీకి బనప్షా, ఖతమి, యవపిండి, నీళ్ళతో కలిపినూరి రొమ్ముపై కుచములపై లేవనముచేయవలెను. మరియు యీావస్త్రవులకపాయములతో కావడము చేయవలెను. మరియు చెమ్మను కలిగించునట్టి భోజనములను భుజించవలెను.

## 2 వ భే॥ క్షీరముచెడిపోవు లక్షణములు

నీచరుధిరవర్ణనమునందు చెప్పబడెను. మరియు నిది దుష్టప్రకృతి వలన వుత్పన్నమగును. ప్రత్యేకము దుష్టప్రకృతి చిహ్నములు కలిగియుండును. గాన యీరోగానుగుణ్యమగు షర్బతులు భోజనములు మలముగల స్తనరోగమునందు చెప్పబడెను. వాటిని వుపయోగించి ప్రకృతిని స్థిరపరచుట మరియు మార్చుట దీనియొక్క చికిత్సయగును. మరియు స్తనములయందు దుష్టప్రకృతి ప్రవేశించినచో దానిని లేపనఔషధములవలన దూరపరచవలెను.

(సూచనీయము)పాలు వృద్ధిచేయునట్టి వస్తువులెవ్వియనగా తూదరిసుపేద్, తూదరిసురఖ్, తెల్లగసగసాలు, తాడికాయలు, మేకపొదు

గు, మరియు వృష్ణమగు చెమ్మగిల్లు కలిగించునట్టి భోజనపదార్థములు పిత్త మునందు దోషకారియు, వందిరిదోసకాయ గింజలపాలు, నేతిబీరగింజల పాకము, విరోచనఔషధములతో చేర్చి పానముచేయుట, మరియు ఆవు పాలయందు శర్కరచేర్చి పానము చేయుట యువ్వనముగల మేకమెదడు, పచ్చిచేపలు, పాలకూర యీమొదలగునవి పాలువృద్ధిచేయును.

మరియు కఫవాతమునందు పాలు, గోధుమగంజి, గుమ్మపాలు, సోపు, ఆకులకషాయము మొదలగునవి వుపయోగించవలెను. మంచిపాలు అనగా వ్వశ్చమైన రుధిరమునుండి యేర్పడిన పాలు దీనిలక్షణములు రంగు చిక్కదనమునందు సమత్వము గను గంధము రుచి సమానముగా నుండవలెను. అట్టిస్తన్యమును వృద్ధిచేయునట్టి ఔషధవిధి అనగా నువ్వుల పిండి ద్రాక్షసారాయియందు కలిపి వడియబోసి పానముచేయవలెను. మరియు యీసారాయిమడ్డి స్తనములపై లేపనముచేయవలెను.

(2) ఔషధవిధి

గొజరు, నీరుల్లి, సల్గం, సోయి, ముల్లంగి, సోపు మొదలగు ఈవస్తువులను సమానగా తీసికొని ఈవస్తువులకు సమానముగా వేయించిన శెనగలుచేర్చి ఈవస్తువులను నేకముగా చూర్ణించి వస్త్రగాలిత మొనరించి ప్రతిదినము ప్రాతఃకాలమునందు 16కి మాషములు పాలలో కలిపి పుచ్చుకొనవలెను. మరియు, కాబోలుదేశపు శెనగలు ఆవుపాలలో రాత్రి నానవేసి ప్రతిదినము ప్రాతఃకాలము ఆపాలలో నక్కువంచె దార కలిపి పానముచేసినచో పాలువృద్ధినొందును.

పాలువృద్ధిచేయునట్టి లేపనలు.

బొగడగింజలపిండి 35 మాషములు, తులసిచూర్ణము 17½ మాషములు యీరెండువస్తువులను తులసిరసములో కలిపి నూరి స్తనములపై లేపనముచేయవలెను.

(2) వ క్షీరవృద్ధి లేపనము

తులసివిత్తులు, యవపిండి, బొగడగింజలపిండి, పొదినా, పొత

సజ్, (ఒకవిధముగుహొదినా) తుతలి (సదాప) ఈమొదలగునవి మెత్తగానూరి రొమ్ముపై లేవనము చేయవలెను

**స్తన్యము అధికమై స్రవించునట్టి లక్షణములు**

స్తన్యము విశేషముగా స్రవించుటవలన అనేక హానికరములు గలవు (1) శరీరము దౌర్బల్యమగును ఎందుకనగా పాలయొక్క మూలము రక్తమగుటవలన రక్తము వృద్ధినొందినకొలది శరీరము నీరసించుచుండును.

(2) స్తన్యము విశేషముగా వెడలుటవలన రొమ్ములయందు నిలిచి అందు, బైటిజలుబు ప్రవేశించి దానిని చిక్కపరచును. ఈకారణము వలన నీచమగునని భయమునొందదగును. మరియు, విశేష పులుపు కలిగియుండును.

(3) స్తనములయందు విస్తార రుధిరమువలన నిజవుష్ణము అణగిపోవును ఈకారణమువలన వుష్ణము అందు తన కార్యములను నెరవేర్చకుండును కాబట్టి విపత్తి కలిగించును.

(4) కధాచిత్ విశేషముగా పీకుటవలన కుచములయందు వాపుగాని లేక కేవలము ఇతరరోగములు వుత్పన్నమగును అభిప్రాయ మేమనగా పాలు అధికమైనచో అందుకు వుపాయములను చేయవలెను. కాబట్టి ఈరోగముగల స్త్రీకి దుర్బలమువలన రెండవవిపత్తి కలుగకుండు నటుల కాపాడవలెను. ఎందుకనగా కొందరు స్త్రీలు విశేషముగా భుజించుటవలన వారిశరీరమునందు రక్తము విశేషముగా వుత్పన్నమగును ఈకారణమువలన పాలుకూడా అధికముగా వృద్ధినొందుచున్నవి ఇట్టి స్త్రీలకు మిక్కిలి విపత్తికలుగనేరదు కాబట్టి ఇటువంటి స్త్రీలవిషయమై పాలు హరించునట్టి వస్తువులను ఉపయోగించకూడదు ఏదైన రెండవ బాధ కలిగినచో భోజనపదార్థములను తగ్గించవలెను. అనగా రతూబతును ఆర్పునట్టి వస్తువులను ఉపయోగించవలెను. ఈకారణమువలన క్షీరము తగ్గిపోవును పాలు అధికమగు కారణములు న్యూనతయొక్క కారణములకు విరుద్ధముగానుండునని తెలిసికొనవలెను. ఒకానొకవ్యాధి

కొందరి స్త్రీలకు స్తనములయందు గర్భోత్పత్తిలేనిచే పాలుపుత్పన్నమగును మరియు, నొప్పికూడా కలిగియుండును ముఖ్యముగా రజోసంబంధమగు రుధిరము నిలిచిపోయినను పాలుకలుగునని తెలిసికొనవలెను. మరియు, యౌవనపురుషుని స్తనములయందు రతివ్యాసంగమునందు పాలుపుత్పన్నమగుచున్నవి అట్టిచో నొప్పికూడా కలిగియుండును.

### పాలుతగ్గించు చికిత్స

చెమ్మను ఆర్పివేయునట్టియు వీర్యమును తగ్గించునట్టియు రుధిరమును వెడలించునట్టి ఔషధముల నుపయోగించుట లాభదాయకమగును ఎందుకనగా రుధిరము పాలగుచున్నవి. కాబట్టి స్తనములనుండి గర్భస్థానమునకు ప్రవహించును ముఖ్యముగా రజోసంబంధమగు రుధిరము నిలిచిపోవుటవలన పాలు అధికమగుటకు కారణమగుచున్నది. పాలుతగ్గుటకు లేపనములు చెప్పుచున్నాము.

లక్కబియ్యము, జీలకర్ర ఈరెండువస్తువులు శెనగపులుసుతో నూరి కలిపి లేపనముచేయవలెను. మరియు, చల్లనివస్తువులలోనుండి ఈవిషయమై లాభదాయకమగు వస్తువులు అనగా జలమునందు రాగులు (సోళ్ళు) చిరిశెనగపప్పు, సొరకాయ, ఈమొదలగు వస్తువులను భుజించుట ఈవస్తువులను లేపనముచేయుట ఇసబ్గోలుగింజల జిగురు దీనిఆకులు మొదలగునవి లేపనముచేయుట లాభదాయకమగును.

మరియు, ఉష్ణకరవస్తువులలో అడవిసదాపాకు భక్షించుట సదాపసిత్తులు ముఖ్యముగా అడవిజీలకర్ర భక్షించుట ఈవస్తువులను శెనగపులుసునందు కలిపి లేపనముచేయవలెను. మరియు, కర్నబ్ (ఇంగ్లీషులో క్యాబేజ్ అందురు) గింజలు నూరి లేపనముచేయుట లాభదాయకమగును మెంతులు బోగడగింజలపిండి పట్టువేయుట లాభదాయకమగును ఈవస్తువులను పన్నీరు గుల్రోగనమునందు కలిపి లేపన

2 వ. లేపనవిధి

వంటచేగురు, చిరిశెనగపప్పు, పన్నీరు, శెనగపులుసుతోనూరి కలిపి లేపనముచేయవలెను. మరియు, భోజనము, వర్షజలము, వప్పి దాడిమరసము, నిమ్మకాయరసము మొదలగువానితో భుజించవలెను. మరియు, చిరిశెనగపప్పు భక్షించుటవలన పాలుస్వల్పముగా వృద్ధి నొందును.

స్తనములువాపు వీసకలుగుటకు కారణములు

ఉష్ణము చల్లనివాపు ప్రత్యేక అంగములందు కలుగునటుల స్తనములయందుకూడా వాపుపుత్పన్నమగునని గ్రహించవలెను. ప్రత్యేక వాపువర్ణనమునందు చెప్పబడును కాబట్టి ఆప్రకరణమునందు చూచు కొనవలెను గాన లేపనలుచేయునట్టి ఔషధములు మాత్రము ఇందు చెప్పబడుచున్నవి. ఈఔషధములు స్తనములవాపునందు ముఖ్యము లైనవి.

వాపు వృష్ణము వలన కలిగినచో శనగపులుసు ఉష్ణోదకముకలిపి మేక లేక ఎద్దు మూత్రకోశమునందుపోసి వాపుపై నుంచవలెను. మరియు, శికంజబీన్ అవ్వసేతియందు బొగడగింజలపిండికలిపి లేపనము చేయవలెను. మరియు, కామంచాకునూరి గుల్‌రోగన్‌తో స్నిగ్ధపరచి వాపుపై లేపనము చేయవలెను. మరియు, మూడు దినములతరువాత ఈలేపనములు చేయవలెను వీటివర్ణనము పాలు కుళ్ళుటయందు వర్ణించ బడును.

మరియు వాపు జలుబువలనకలిగినచో అజామోదమునూరి స్తన ములపైన కట్టుకట్టవలెను. మరియు, బాబూనానూరి సోపురనములో గాని అజామోదపురనములోగాని కలిపి లేపనముచేయుట లాభదాయక మగును.

మరియు స్తనములయందు పాలు గట్టిపడుటవలనగాని వలచి పడుటవలనగాని పాలుకుళ్ళుటవలనగాని స్తనములయందు ఒకవిధమగు

వాపు ఉత్పన్నమగును. మరియు ఈమూడు కారణములవలన స్తనములయందు పాలుపేరుకొని గ్రస్తిబడుచున్నవి. (1) విశేషవుష్ణవికృతివలన కలుగుచున్నది. ఇది పాలయందు చెమ్మను ఆర్పివేయును. ఈవికృతి సర్వశరీరమునందుగాని లేక, రెండు స్తనములయందుగాని వుత్పన్నమగుచున్నది.

(2) మిక్కిలి చల్లని వికృతివలన కలుగుచున్నది. ఇది సర్వశరీరమునందుగాని లేక, కుచములయందుగాని వుత్పన్నమగును. ఈకారణమువలన పాలు గట్టిపడును.

(3) శిశువు దుర్బలుడైగాని ఏకారణమువలనగాని లేక రోగమువలనగాని పాలు గ్రోలజాలకుండు కారణమువలన పాలు స్తనములయందు ఆలశ్యముగా నుండుటవలన తోడుకొని గట్టిపడును.

మరియు వుష్ణ శీతవికృతుల లక్షణములు అనేక స్థలములయందు తెలుపబడెను. మరియు ప్రకృతివుష్ణమైనచో బట్ట నీళ్ళలో సిరకాలో తడిపి స్తనముపై నుంచవలెను. దీనివలన వుష్ణము శాంతినొందును. దుర్గంధమును తగ్గించి చిక్కదనమును దూరపరచును. మరియు, సర్వదా బనప్షాతైలమును లేపనము చేయుచుండవలెను. మరియు గోరువెచ్చని నీళ్ళను రొమ్ముపై స్తనములపై పోయవలెను. యీరోగము గలస్త్రీకి ఉష్ణాధిక్యమైనచో బొగడగింజలపిండి, యవపిండి, అడవిదానిమ్మవేరు చూర్ణము, కోడిగుడ్డుసొన, వచ్చిధనియాలు మొదలగునవి పెద్దపాయిలాకు రసమునందుకలిపి లేపనము చేయవలెను. ఇట్లు జలుబుకలిగించునట్టియు, నొప్పిని శాంతినొందించునట్టియు, మలమును వెడలించకుండునట్టి ఔషధములు లాభదాకమగును. మరియు శనగపులుసు గులాబి పూలనూనె వెచ్చచేసి అందులో బట్టతడిపి స్తనములపై కాపడము చేయవలెను. మరియు కామంచాకు కాకనజ్ (రాజపురానదేశమునందు కామంచాకు) నూరి లేపనముచేయవలెను మరియు రోగము అంతమునకు ప్రవేశించి వుష్ణము శాంతించినచో నష్టమునుకలిగించునట్టి లేపన

ములు చేయవలెను. మరియు నిప్పట పట్లుదెబ్బతినుచున్నవి. అవిసివిత్తులు, బాబూనా, అకలీంఉల్ మలిక్ (త్రాయమాణము) నువ్వులు మొదలగునవి మెత్తగానూరి మగినము, గుల్ రోగన్‌తో చేయబడిన కిరూతియందు కలిపి లేపనముచేయవలెను. వాపు నష్టమొందక ఘనీభవించుచుండినయెడల మలమును వర్త్వవరమనట్టి వస్తువులు అనగా మెతిపిండి, ఖితమిపిండి, అవిసిపిండి ఈమొదలగునవి లేపనముచేయవలెను. మరియు పొస్తుకాయబెండు, మెంతులు, అవిసివిత్తులు, రాతినజ్ (ఇదిఒకజిగురు) ఈవస్తువులు అంజూరుకషాయమునందు కలిపి లేపనముచేయుట లాభదాయకమగును.

మరియు, శీతప్రకృతి అయినచో మైనము, చండ్రితైలము సౌసన్ (దీనిని ఇంగ్లీషులో లిల్లిఅందురు) తైలము చాగల్వాకోష్టుతైలము కిరూతిచేసి స్తనముపై లేపనముచేయవలెను. మరియు, ఎండినపొదినా ఆకు చూర్ణించి నీళ్ళలోవేసి లేహ్యమువలె వుడికించి మైనపుతైలముచేసి కలిపి లేపనము చేయవలెను. మరియు, మెంతులు చూర్ణించి వస్త్రగాలితమొనర్చి సెనగపులును, బాబూనా తైలమునందు కలిపి స్తనములపై లేపనము చేసినయెడల లాభదాయకమగును.

లాభము:—స్తనములయందు పాలు తోడుకొనినచో వాపుకలిగించును ఎల్లప్పుడు పిసుచుండును. ఒకప్పుడు వాపుగలుగకుండును. మరియు, ఉష్ణదుష్ట ప్రకృతి కారణమువలన పాలు తోడుకొనిన యెడల వాపుసంభవించును. మరియు, ఏస్త్రీయొక్క ప్రకృతి శీతముగను స్తన్యపానముచేయునట్టి శిశువు దుర్బలమువలన స్వల్పముగా పానముచేయుచుండిన అట్టి స్థితియందు వాపు స్వల్పముగా కలుగుచున్నది. గాని ఆస్త్రీ పాలు పిండివేయవలెను. మరియు, గోరువెచ్చని నీళ్లు స్తనములపై పోయవలెను. ఇట్లు పోయుటవలన యావత్తుపాలు వెడలిపోవును ఈరోగము విస్తారముగా స్త్రీలకు ఉత్పన్నమగును. మరియు, ఈపీకునట్టి రోగ చికిత్స వాపుకలుగకనె పాలు తోడుకొనటవలన కలుగునట్టి నలు

మునందు చుకందర్, కర్నబ్ నీళ్ళలో వేసి కషాయముకాచి ఆకషాయము స్తనములపై పోయవలెను. మరియు, అవిసిత్తులు, బాబూనా, బనఫ్షా, ఖతమి, మెంతులు ఈవస్తువులను నీళ్ళలోవేసి కషాయముకాచి ఆకషాయమునందు నూనెకలిపి స్తనములపై పోయవలెను. వెంటనే శాంతినొందును.

మరియు, అన్నివిధముల వాపులను కరిగించునట్టి కషాయములు ఈరోగమునందు లాభదాయకములు. ఒకప్పుడు స్తనములయందు పాలు నిలిచి కుళ్ళిపోవును. అట్లు కుళ్ళుటకు చికిత్స చుకందరు మెత్తగా వుడికించిఅందులో మహానింబగింజలపప్పు, బొగడగింజలపప్పుచేర్చినూరి నువ్వులనూనెకలిపి స్తనములపై లేపనముచేయవలెను. మరియు, తిలక్షారము, ఆవునెయ్యి, తేనె, బొగడగింజలపిండి వుడికించిన శెనగపిండి రొట్టెయందు పొట్టుకలిపి దంచి ఈమొదలగు వస్తువులను నేకముగాచేర్చి లేపనముచేయుట లాభదాయకమగును.

మరియు, అవిసివిత్తులు, మెంతులు, ఖతమీ, బాబూనా, ఈ యావత్తు వస్తువులు వస్తువకటికి గుప్పెడుపంతున తీసికొని నీళ్ళలోవేసి కాచి లేపనముచేయుట వుచితమగును.

మరియు, ఈలేపనములలో ఉత్తమమగు లేపనలు ప్రతిదినము మూడుపర్యాయములు చేయుటవలన వెంటనే వక్వమొందును. మరియు, ఉష్ణోదకముతో శికతాబ్ (వేడినీళ్ళలోబట్టముంచి కాచుట) చేయుట వుచితమగును. వాపుహరించినచో అవశ్యానుకూలముగా ఈప్రకరణమునందు వర్ణించియుండు వానిని వుపయోగించవలెను.

—స్తనములు కఠినమగుట బంధనమేర్పడుటకు చికిత్స—

ప్రారంభమునందు బనప్షాతైలము, కోడిగుడ్డుసొన కలిపి లేపనముచేయవలెను. మరియు, జైతూన్‌తైలమునందు మైనమువేసి కరిగించి అందులో మూరెడాకులునూరి కలిపి లేపనముచేయవలెను. ఒకప్పుడు అందునూనెకలుపవలసిన అవశ్యకముకలుగును శిరకామడ్డి లేపన

ము చేయుట లాభదాయకమగును. పిటిక (బంధనము) కరిగించుటకై చెమ్మను కలిగించునట్టి వస్తువులు. మరియు, కొవ్వు లేపనము చేయవలెను. ఈబంధనము యవ్వనమునందు విశేషముగా కలుగును.

—స్తనములు శుష్కించు లక్షణములు—

ఒకప్పుడు స్తనములను రసము దిక్కుపోవును గాన కొండదాక్షవండ్లు, పెనలు పిండిచేసి స్వాఆకురసమునందుగాని అఖిరఆకు రసమునందు గాని కలిపి లేపనముచేయవలెను. మరియు, దిక్కుపోవుటవలన వావుసంభవించినచో వావువిషయమునందు చెప్పియుండు చికిత్సలను అవశ్యమును బట్టి ఉపయోగింపవలెను. మరియు, పెనలు దాక్షవిత్తులు నూరి లేపనము జేయుట ఆరంభమునందు యోగ్యముగానుండును దీనివలన అంగము పుష్టిజెందును. మలము వెడలించకుండునటుల ఆపి వేయును. మరియు, ఆరంభముకంటె తగ్గిపోవుచుండిన సమయానుకూలముగా వుపయోగించవలెను.

—స్తనముల దబీలా (గొప్పవాపు) లక్షణములు—

అవిసివిత్తులు, నువ్వులు, సౌనఫ్, (ఇంగ్లీషుకోలిల్లి) విత్తులు మియాతిర్ (వచ్చిబనప్‌షావేదు)పావుగములను, పావడిలవణము, రాతినజ్ (గందపేరోజా) ఈవస్తువులు సమానభాగములు నూరి నువ్వులనూనె అవుశాలిమూలగ మొదలగునవి కలిపి లేపనము చేయవలెను. శేషవుపాయములు గొప్పవావుప్రకరణమునందు చూచుకొనవలెను. వావును చీల్చవలసిన అవసరము కలిగినచో లోహశస్త్రముతో చీల్చవలెను. మరియు, అచ్చట వ్రణముకలిగెనేని ముఖము జాంగములయందు కలుగు వ్రణములయందు వర్ణించబడిన చికిత్సలను చేయువలెను. ఎందుకనగా కోమలఅంగముల యొక్క వ్రణములకు సమానముగానుండును.

—స్తనములు అత్యంతదీర్ఘములగుటకు చికిత్స—

కాసాగరిసపేదా సుద్ద ఇవిప్రత్యేకము 7 మాషములు. యీ రెండింటికి సమానము గంజాయిఆకురసమునందుగాని లేక దీనిగింజలకషా

# వస్తుపర్యాయపదములు

అ

అప్తిమూగా=పాంతీగె

అసన్సతీన్=మాచిపత్రి

అకలీలుల్ మలిక్=శఖుంబిప్పాలు

అకలీమియా=వెండిబంగారముల మలినం

అనీసూన్=రూమిదేశపుసోపు (చిన్నసోపు)

అకాకియా=విత్తుకట్టని తుమ్మకాయరసము, ఎండించినది

అజఖర్=మంజగడ్డి

అకహాల్=సుర్మారాయి

అపేకల్ బలం=ఇదిప్రసిద్ధనామము (ఒకవిధముగుజిగురు)

అమర్బేల్=ఆకాశవల్లి

ఆపస్=ఖురంజియోమము

అస్కీవత్తి=వేపిచెట్టుఆకులు

అసారూన్=(సం) బాంక్ (హిం) సుగంధవాల (ఇం)ఆసన్ దోప్రిపోసన్ (తె) (గంధితగరము భేదము

అవ్రఝుడీ=సన్నచిప్పిగు

అబావక్=(హి) పీలు, (తె) వరగోగు

అసాదిహజమా=మిరాక్ బత్న, కడుపుపై చర్మము

అమ్రూత్=(సం) అమృతఫల, (ఫా) నేప్ (ఇ) యూఫిబ్సా

ఆ

అంబర్ సానహాబ్=శ్రాణ్యమైన అంబరు

అబసూస్=యష్టిమధుకము

అపేకల్ అంబాత్=ఇది ప్రసిద్ధనామము (ఇది ఒకవిధముగు జిగురు)

అశనా=(హిం) ఛరీలా (తె) రాతిపువ్వు

అశరా=నరము, సముద్రపు నురుగు

అర్జనా=మద్దిచెట్టు

అసన్సతీన్ రూమీ= శీమ మాచిపత్రి

అస్పరత్=(అ) అకలీలుల్ మలిక్ (సం) సప్తకా

అంబర్ బారీస్=(ఇ) బేరీస్

అబూఖల్సా= పెద్ద నేపాళములు (సం) బృహదంతి

అస్పక్=(సం) త్రాయామాణం

అసలుల్ వహద్=తేనె

అంజరూద్=ఒకజిగురు

అస్ ఫన్ద్=గోరంటగింజలు

అజనాబుఖైల్=ఇది ఒక మూలిక దీని ఆకులు గంధనా ఆకులవలె నుండును

ఫా, పార్సీ, అ, అరబ్బీ, హిం, హిందీ, సం, సంస్కృతము, ఇ, ఇంగ్లీషుభాషలని గ్రహించవలెను.

ఇ

ఇస్పిఘాజ్—(హిం) కొనగరిసఫేదా (తె) సఫేదా

ఉస్తెఖద్దూస్=(హిం) దారు (ఇం) లావండులా

ఊదేబల్సాన్=(తె) ఆకుపత్రిపుల్లలు (ఇ) బల్సాం వుడ్

ఊదేసాలిబ్, ఊదేసఫానియా=ఒక విధముగు సాంబ్రాణి

ఊదేకిమారిసఫేద్ = మందిగంధం

ఉసారెలహితు త్రిన్=పురిత్రపాలు

క

కాహకాయి=(తె) దుప్పెనగింజలు (ముదరబెండవిత్తులు)

కరానితూన్=(తె) రక్త జనన్నిపాతము

కంతరియూన్=(వ) కంతారి, కధారి, (లె) కేపేన్సిపివిరియా

కర్నబ్=(ఇం) క్యాబేజ్

కచువా=(తె) తాబేలు

కచేరి= స్త్రీవసువు

కడంకేబీంజ్=చేమపుత్సగింజలు

కాస్కగిరి=గాజుమట్టి

కర్నియా= కంటిసంబంధమగుపొర

క

కహారోబా సమాయి= బంగారువన్నెగలజిగురు

కిర్వియా=మహాజీరా

కమాదరీతూన్=బోడసరము

కనూస్=పాచితీగెవిత్తులు

కారగజ్=(సం) చిరపోటా (లై) ఫాయిసేలిసేమసీయా

కిరోపుణ్ణ=కఫరి

కిణవీర్=కంపిల్లము

కిరఫా=ఆముదము

కణదర్బేల్=దొండతీగె

కుందుర్గోంచు=ఫిరంగి సాంబ్రాణి

కూఫా=గంగపాయల

కోయి= (సం) కుముదా (వందిరిదోన)

కౌహా=నల్లమద్ది

కైలూస్=అన్నరసము

కనుచావిత్తులు=దూలగొండవిత్తులు

కరిణ = మాంసము శెనగపులును కూరగాయలు చేర్చివండిన పదార్థము

కోకాయా=(సం) వికంకత (లె) సిల్నూటిక్ మొకైనా

కాలాదానా=కాటుకవిత్తులు

ఫా, పార్షీ, అ, అరబ్బీ, హిం, హిందీ, సం, సంస్కృతము, (లె) లేటిన్, ఇ, ఇంగ్లీషుభాషలని గ్రహించవలెను.

